# మహాకవి
# శ్రీ దాసు శ్రీరాములు గారి కృతులు
# ఒక సమీక్ష




రచన :

**డాక్టరు వెలగపూడి వైదేహి**

ఎం.ఏ., బి.ఇడి., పి.హెచ్.డి.

ఆంధ్రోపన్యాసకులు



**మహాకవి దాసు శ్రీరాములు గారు**

(ఏప్రియల్ 8, 1846 – మే 16, 1908)



**శ్రీమతి దాసు జానకమ్మ గారు**

శ్రీ దాసు శ్రీరాములు గారి సతీమణి

(1853 – 1927)

# మహాకవి

# శ్రీదాసు శ్రీరాములుగారి కృతులు

# ఒక సమీక్ష

**(ఆంధ్ర విశ్వకళా పరిషత్తునకు సమర్పితమైన**

**పి.హెచ్.డి. సిద్ధాంత వ్యాసము – 1981)**


రచయిత్రి :

**డాక్టరు వెలగపూడి వైదేహి,**

ఎం.ఏ., బి.ఇడి., పి.హెచ్.డి.

ఆంధ్రోపన్యాసకురాలు



**మహాకవి దాసు శ్రీరాములు స్మారకసమితి**

**హైదరాబాదు**

**2013**

*Mahakavi Sri Dasu Sriramulu gari Krutulu : Oka Samiksha*

by

**Dr. Velagpudi Vaidehi**


| | | |
|---|---|---|
| ప్రథమ ముద్రణ | : | 1986 |
| ద్వితీయ ముద్రణ | : | 2013 |
| ప్రతులు | : | 500 |
| వెల | : | **రూ. 400/-** |

**ప్రతులకు :**

**1) © మహాకవి దాసు శ్రీరాములు స్మారకసమితి**

ఫ్లాట్ నెం. 201 శ్రీ సాయిరామ్ ఆదిత్యా రెసిడెన్సీ,
ఇంజనీర్స్ కాలనీ, ఎల్లారెడ్డిగూడ,
హైదరాబాద్ - 500 073.
ఫోన్ : 040-23734864
email : araodasu@gmail.com

**2) విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, నవయుగ బుక్‌డిపో మరియు అన్ని పుస్తక విక్రయ కేంద్రాలు**

డి.టి.పి.
**సమంత గ్రాఫిక్స్**
ఎస్.ఆర్.టి. 208,
జవహర్ నగర్, హైదరాబాద్ - 80.
ఫోన్ : 27670198

ముద్రణ
**ఓం సాయి గ్రాఫిక్స్**
నారాయణగూడ,
హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-27560003

# నివేదన

19వ శతాబ్దములో మహాకవి, వాగ్గేయకారులు, ప్రముఖ న్యాయవాది, సంఘసంస్కర్త, ఆంధ్రదేశంలో సంగీత, సాహిత్య, సాంస్కృతిక, సాంఘిక, రాజకీయ రంగాలను ప్రభావితం చేసిన బహుముఖ ప్రజ్ఞాశాలి దాసు శ్రీరాములు గారు (1846-1908). స్వయంకృషితోనే విద్యాభ్యాసం చేస్తూ సంస్కృతాంధ్ర భాషల్లో పండితులై ప్రబంధాలు, పురాణాలు, నాటకాలు, శతకాలు, ధర్మ శాస్త్రగ్రంథాలు, కృతులు, జావళీకు, పదములు, యక్షగానాలు మొదలైన వైవిధ్య ప్రక్రియలలో అనేక రచనలు చేశారు. గ్రామాలలో పాఠశాలలు నెలకొల్పి విద్యావ్యాప్తి చేసి ఉత్తమ ఉపాధ్యాయునిగా అందరి ఆదరాభిమానాలకు పాత్రులయ్యారు. ఆంగ్లం, ఫార్సీ భాషలలో ప్రావీణ్యం సంపాదించి ప్లీడర్ పరీక్షలలో ఉత్తీర్ణులై న్యాయవాద వృత్తిలో గొప్పపేరు ప్రతిష్టలు సంపాదించారు. సాంఘిక దురాచారాలను వ్యతిరేకిస్తూ సంస్కరణోద్యమాలలో చురుకుగా పాల్గొన్నారు. స్త్రీస్వాతంత్ర్యాన్ని, స్త్రీవిద్యనూ ప్రోత్సహించారు. బాల్య వివాహాలను నిరసించారు. సాహితీ మూర్తులు, సంఘసంస్కర్తలు వీరేశలింగం, గురజాడ, శ్రీరాములు సమకాలీనులు. ఆంధ్రరాష్ట్ర తొలి ఆస్థానకవి బ్రహ్మశ్రీచెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రి శ్రీరామ మహాకవిని ప్రశంసిస్తూ ఇలా అన్నారు. "ఈయన సాక్షాత్తూ శ్రీనాథుని అవతారమే అంటే ప్రతిచెప్పేవారుండరని నా విశ్వాసం. శ్రీనాథునికంటే కూడా యీయన జీవితం మిక్కిలి ధన్యం. కవి గృహస్తులలో నిట్టి యదృష్టాలు పట్టిన వారు మృగ్యులనికాని, అసలే లేరనికాని నిస్సంశయంగా చెప్పవచ్చు ... ఇక్కవి సహజపాండిత్య విషయముననే కాక భాగవతాంధ్రీకరణ ప్రసక్తియందుఁగూడ బోతరాజు గారే! ... యీయన సరసకవి, విద్వత్కవి, స్వతంత్రకవి, ఆశుకవి, దాత, నేత. ఇన్ని యోగాలు పట్టినవారు యేకాలంలోనూ కవులలో మృగ్యులే."

అంతటి మహాపురుషుని వంశంలో జన్మించి, వారి యశో సంపదకు వారసులమైనవారందరం కలిసి వారి రచనలను పునర్ముద్రించి సాహితీ ప్రపంచానికి అందించాలనే ఉద్దేశ్యంతో 'మహాకవి దాసు శ్రీరాములు స్మారక సమితి'ని 1973 సంవత్సరంలో స్థాపించి ఇంతవరకు, 'తెలుగునాడు', 'అభినవగద్యప్రబంధము', 'శ్రీదేవీ భాగవతము', 'సూర్యశతకము', 'కురంగ గౌరీశంకర నాటిక', 'చక్కట్లదండ', 'భృంగ రాజ మహిమ, శ్రాద్ధ సంశయవిచ్ఛేది', 'దురాచార పిశాచ భంజని', 'ఆచారనిరుక్తి, విగ్రహారాధన తారావళి', 'శ్రీరాములుగారి జయంతి సంచిక-1975' 'కృతులు - పదములు - జావళీలు' మొదైలన పుస్తకాలను ప్రచురించాము.

ఈ మహాకవి రచనలపైన సాహితీవేత్తలు వ్రాసిన అనేక విశ్లేషనాత్మక వ్యాసాలు ప్రచురించబడినాయి. అయినా ఆ మహనీయుని జీవితవిశేషాలు, వారు చేసిన వైవిధ్య కవితా ప్రక్రియల పై సమగ్ర పరిశోధన జరుపవలసిన ఆవశ్యకత గుర్తించిన శ్రీమతి వెలగపూడి వైదేహి గారు (దాసు శ్రీరాములు గారి ముని మనుమరాలు) అకుంఠిత దీక్షతో శ్రమించి విషయసేకరణ చేసి తులనాత్మక విశ్లేషణతో కూడిన 'మహాకవి దాసు శ్రీరాములు గారి కృతులు – ఒక సమీక్ష' అనే సిద్ధాంత గ్రంధాన్ని వ్రాసి, ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి 1981లో పి.హెచ్.డి. పట్టాని పొందారు. దాసు శ్రీరామ కవిపై సమగ్ర పరిశోధన గావించి తీర్చిదిద్దిన మొట్టమొదటి గ్రంధముగ దీనిని పరిగణించవచ్చును. విద్యార్థులకు, పరిశోధకులకు ఉపప్రమాణిక గ్రంథముగా ఉపయోగపడుతుంది. ఈ అవసరం దృష్టిలో పెట్టుకొని 1986లో మొదటి కూర్పు ముద్రింపబడింది. 1986 ఆగష్టు 18న హైదరాబాదులో డా. దాశరథి గారి అధ్యక్షతన జరిగిన విద్వత్సభలో డా.పి.యస్.ఆర్. అప్పారావు గారు ఆ గ్రంధాన్ని ఆవిష్కరించారు. ఈ మొదటి కూర్పులోని లోటుపాట్లు, తప్పులను సవరించి చదువరులకు సౌకర్యంగా ఉండే రీతిలో కూర్పు చేసి ద్వితీయముద్రణను అందిస్తున్నందుకు మాకు ఆనందముగా ఉన్నది. మహాకవి దాసు శ్రీరాములు గారి విశిష్ట వ్యక్తిత్వం, సంగీత సాహిత్య కవితా విన్యాస వైభవముపై పరిశోధనలు ఇంకా విస్తృతంగా జరగడానికి విశ్వవిద్యాలయాలలో విద్యార్థులకు మా ఈ మలి ప్రచురణ ఉపయోగ పడుతుందని ఆశిస్తున్నాము.

ఈ పుస్తక పునర్ముద్రణకు హృదయపూర్వక ప్రోత్సాహము ఆర్థిక ఆలంబనం అందించిన సోదర సోదరీ మణులకు, దాసు వంశ వారసులకు 'మహాకవి దాసు శ్రీరాములు స్మారక సమితి' పక్షం నుంచి కృతజ్ఞతాభినందనలు. ఎంతో ఓపికతో, డి.టి.పి. అక్షర కూర్పు చేసిన సమంత గ్రాఫిక్స్ వారికి మా అభినందనలు, ధన్యవాదములు.

**డా. దాసు అచ్యుతరావు** 05-09-2013

మహాకవి దాసు శ్రీరాములు స్మారక సమితి

హైదరాబాదు

# సమర్పణము





**శ్రీదాసు పద్మనాభరావుగారు వారి సతీమణి శ్రీమతి దాసు మీనాక్షమ్మ గారు**

పరమ మంగళగుణములు పాలవెల్లి
యాశ్రితావళి పసరితాప మడచు తల్లి
కరుణతో బ్రోచు నాతల్లి కల్పవల్లి
కవికి మీనాక్షి సాధ్వ నా కన్నతల్లి.

దాసు వంశాబ్ది సోముడుదారశీలి
వసుధ చుట్టాల సురభిగా వాసిగాంచి
నిరతమన్నదానమ్ముచే నెగడి జనుల
కరుణ బ్రోచినవాడు నా కన్నతండ్రి.

అట్టి నా తల్లిదండ్రుల కంకితంబు
జేసి యిద్దాని, నమ్రనై చేసి ప్రణతి
అక్షరాక్షతలతొ పూజ లాచరించి
వారి దీవన మనమున కోరుదెపుడు.

# కృతజ్ఞత

నా పరిశోధనకు పర్యవేక్షకులుగ నుండి తదసాధారణ సహాయసంపత్తి నొడగూర్చిన మాన్యగురువర్యులు డాక్టరు శ్రీ చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రి గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాంజలులు. నా పరిశోధన విషయమున డాక్టోరల్ కమిటీ సభ్యులును, మదాచార్యులు నునగు ఆచార్య శ్రీయస్.వి. జోగారావుగారికి నా వినయాంజలులు. ఈ పరిశోధన కనుమతించిన విద్యాధికారులకు ప్రణామములు. పరిశోధన గావించుట కవకాశ మొంసగిన ఆంధ్ర విశ్వ విద్యాలయాధి నేతలకు వినయపూర్వక కృతజ్ఞతాంభివందనములు.

ఈ సిద్ధాంతవ్యాసమును సూక్ష్మేక్షికతో చక్కగాచదివి, పి.హెచ్.డి. డిగ్రీకి అర్హమైనదిగా ప్రకటించిన పరీక్షకులు ఉస్మానియా విశ్వవిద్యాలయాంధ్ర శాఖలోని డాక్టరు (శ్రీమతి) నాయని కృష్ణకుమారిగారికిని మద్రాసు విశ్వవిద్యాలాంధ్ర శాఖలోని డాక్టరు శ్రీ ఎమ్. అప్పారావు గారికిని, గుల్బార్గా విశ్వవిద్యాలయ ఆంధ్రశాఖలోని డాక్టరు శ్రీ తంగరాల సుబ్బారావుగారికి వినమ్రతాపూర్వక ప్రణామములు. వీరి యభిప్రాయ సారాంశములుగూడ ఇందు పొందుపరుప బడినవి.

కోరిన వెంటనే తమ అమూల్యమైన అభిప్రాయములు వెలిబుచ్చిన డాక్టరు శ్రీచిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి, ఆచార్య యస్.వి. జోగారావు గారికి, డాక్టరు శ్రీ కొర్రపాటి శ్రీరామమూర్తిగారికి, డాక్టరు శ్రీ దివాకర్ల వెంకటావధాని గారికి, డాక్టరు శ్రీ జి. సుబ్రహ్మణ్యంగారికి, సారస్వత పరిషత్ అధ్యక్షులు దేవులపల్లి శ్రీ రామానుజరావుగారికి వినమ్రపూర్వక ప్రణామములు. ఈ సిద్ధాంతవ్యాస రచనకు ప్రత్యక్షముగను పరోక్షముగను ఉపకరించిన గ్రంథరచయిత లందరికిని కృతజ్ఞతాపూర్వక నమస్సులు.

ఏయే వేళలం దడిగినను విసుగక నా యా గ్రంథముల నొసంగి సహకరించిన ఆయా[1] గ్రంథాలయాధికారులకు, వారి సిబ్బందికి, ముఖ్యముగ శ్రీ సన్నిధానం నరసింహశర్మగారికి కృతజ్ఞతాపూర్వక నమస్సులు. “లక్షణావిలాస” మను అముద్రితప్రతి నొసంగిన డోకిపుర వాస్తవ్యులును, కీర్తిశేషులను అయిన శ్రీ పోలవరపు నరసింహారావుగారికి శ్రద్ధాంజలులు.

తమ స్వంత గ్రంథాలయముల నుండి గ్రంథమునొసంగిన పితృసమానులు శ్రీ దిగివల్లి శివరావుగారకి, ఏలూరు వాస్తవ్యులు శ్రీ కలువలపల్లి సత్యానందశర్మ గారికి, విజయవాడవాస్తవ్యులు శ్రీ చతుర్వేదుల ఆంజనేయశాస్త్రిగారికి, కీ.శే. శ్రీ విశ్వనాధ వెంకటేశ్వర్లుగారికి, కీ.శే. శ్రీ కుప్పా సుబ్రహ్మణ్యశాస్త్రి (రిటైర్డు డి.ఇ.ఒ.) గారికి నా హృదయపూర్వక నమస్కారములు.

గ్రంథస్థముకాని కవిజీవిత ప్రతిభావిశేషము లెన్నిటినో నాకు తెలియజెప్పి నాకాతిధ్యమిచ్చిన అల్లూరి వాస్తవ్యులకు, అందునా ముఖ్యముగా శ్రీ భట్రాజు సోమేశ్వరరావుగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు. ఈ మహాకవితో తమకుగల పరిచయమును, కవికాలమునాటి సాహిత్య గోష్టులనుగూర్చి నాకు విపులముగ వివరించిన పండితులు శ్రీ క్రొవ్విడిలింగమూర్తి గారికి నా ప్రణామములు. ఈ సిద్ధాంత వ్యాసరచనార్ధమచ్చటనున్న సమయములందు వాత్సల్యముతో ఆదరించి ఆతిధ్యమిచ్చిన రాజమండ్రి వాస్తవ్యులు శ్రీ నండూరి సోమేశ్వరరావు దంపతులకు, విశాఖపట్నం వాస్తవ్యులు శ్రీ పాలేపు రామారావు దంపతులకు నా కృతజ్ఞతాంజలులు.

నన్నడుగడుగున ప్రోత్సహించి సహకరించిన పతిదేవులకు, మాతా పితలకు ప్రణుతాంజలులు. ఈ కృషికి ప్రోత్సాహమిచ్చి సమాదరముతో తమ అమూల్య “సలహా”ల నొసంగిన పండిత ప్రవరులకు హార్ధికాభివందనములు. కవిగారి జాతకచక్రము వేసి యిచ్చిన సహోద్యోగి అయిన శ్రీ చిట్టా సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి నా కృతజ్ఞతాభివందనములు.

ఛాయాచిత్రములను తీసుకొనుట కనుమతించిన తోట్లవల్లూరి వేణుగోపాలస్వామి ఆలయాధికారులకు, డోకిపర్రు మదనగోపాలస్వామి దేవాలయాధికారులకు, అల్లూరు సోమేశ్వరస్వామి దేవాలయాధికారులకు నా కృతజ్ఞతలు. దరఖాస్తు చేసినవెంటనే దయార్ద్రహృదయముతో ఈ గ్రంథముద్రణకు ఇరువదియైదు గ్రంథములిచ్చుపద్ధతిలో – అయిదువేల రూపాయలు ఆర్థిక సహాయముచేసిన ఆంధ్రప్రదేశ్ సాంస్కృతికశాఖ అధికారులకును, ఆ సిబ్బందికిని హార్ధిక కృతజ్ఞతలు.

ఈ సిద్ధాంత వ్యాసమునకు అక్షరాలంకరణ గూర్చిన చిరంజీవి కాకరపర్తి వెంకటేశ్వరరావునకు ఆశీస్సులు, అభివందనములు. ఈ గ్రంథమును చక్కగా ముద్రించి, రూపొందించిన శ్రీ లిబర్టీ ప్రింటర్స్ – చీరాల వారికి, నా కృతజ్ఞతలు.

పరిశోధనాకాలమందు ఈ మహాకవిపై నా ఉపన్యాసమేర్పాటు చేసి కవిగారికి నాచే నివాళులర్పింపజేసి, పండితలోకమునకు నన్నుపరిచయము కావించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమివారికి నా కృతజ్ఞతాంజలులు. ఈ పరిశోధనావ్యాసమిట్లు ముద్రణదాల్చుటకు తోడ్పడిన సుహృజ్జనులెందరో మహానుభావులు కలరు. వారందరికి నా నమస్సుమాంజలులు.

**వి. వైదేహి**

---

## అధోజ్ఞాపిక

1. **నా కృషికి తోడ్పడిన గ్రంథాలయములు :** ఆంధ్ర విశ్వవిద్యాలయ డాక్టర్ వి.ఎస్. కృష్ణా మెమోరియల్ గ్రంధాలయము, విశాఖపట్నం ; గౌతమీ గ్రంథాలయము, రాజమహేంద్రవరము ; హితకారిణి సమాజము, రాజ మహేంద్రవరము ; భ్రమరాంబా మల్లేశ్వర గ్రంథాలయము, విజయవాడ ; రామమోహన గ్రంథాలయము, విజయవాడ; జిల్లా గ్రంథాలయము, విజయవాడ ; ఎస్.ఆర్.ఆర్. అండ్ సి.వి.ఆర్. ప్రభుత్వ కళాశాల గ్రంథాలయము, విజయవాడ ; పంచాయితీ కార్యాలయ గ్రంథాలయము, అంగలూరు; సారస్వతనికేతనము, వేటపాలము ; కందుకూరి వీరేశలింగ గ్రంథాలయము, కుందర వల్లి (భీమవరం తాలూకా) ; జిల్లా గ్రంథాలయము, గురజ ; జిల్లా గ్రంథాలయము, కవుతవరం ; జిల్లా గ్రంథాలయము, ఏలూరు ; జిల్లా గ్రంథాలయము, మచిలీపట్నం ; తెలుగు భాషాసమితి, హైదరాబాదు ; శ్రీకృష్ణదేవరాయాంధ్ర గ్రంథాలయము, హైదరాబాదు.

నేను కోరినవెంటనే ప్రత్యుత్తరమిచ్చిన గ్రంథాలయములు :

నూజివీడు మహారాజ కళాశాల గ్రంథాలయము, అకరిపిల్లి స్టేట్ లైబ్రరరి, హైదరాబాదు, సాహిత్య అకాడమీ, కాకినాడ, నేషనల్ లైబ్రరీ కలకత్తా, తిక్కన గ్రంథాలయము, గుంటూరు, మద్రాసు కన్నెమెర లైబ్రరీ, ఓరియంటల్ లైబ్రరి, పిఠాపురం మహారాజా కళాశాల గ్రంథాలయము.

# ఉపోద్ఘాతము

మహాకవి శ్రీ దాసు శ్రీరాములుగారు న్యాయవాదులు, ఉపాధ్యాయులు, ధర్మశాస్త్రవేత్త, జ్యోతిశ్శాస్త్రవేత్త, సంగీతనాట్యశాస్త్రజ్ఞులు, సంఘసంస్కర్త, అయినను ఈ వ్యాసమునందు వీరిని కవిగా దర్శించుటయైనది. వీరు ముప్పదియైదు ప్రత్యేక గ్రంథములు వ్రాసియున్నను కొన్ని గ్రంథములు మాత్రమే లభ్యములు. ఇందు సాహిత్యస్పర్శగల గ్రంధములు మాత్రమే సమీక్షింపబడినవి. ఈ సిద్ధాంతవ్యాసము ఎనిమిది ప్రకరణములుగ విభక్తమైనది.

కవిగారిని ఈ ప్రకరణసుమములతో నర్పించుటయైనది. మొదటి ప్రకరణము "జీవన సుమము". ఇందు కవిగారి జీవిత చరిత్ర ముచ్చటింప బడినది. రెండవ ప్రకరణము "కవితాసుమము"న దేవీభాగవత అనువాద పద్ధతి, అల్లూరి వర్ణ,, తన రచనలకు అమృతత్వము సిద్ధింపజేయగల కళాచాతుర్యముతో మలచిన ''కవితాశిల్పము'' ప్రదర్శించుటయైనది. మూడవ ప్రకరణమైన "పద్యసుమము"న పద్యరచనలైన తెలుగునాడు, చక్కట్లదండ (అచ్చతెనుగు శతకము), సూర్యశతకమును పరిశీలించుటయైనది. నాలుగవ ప్రకరణము "నాటకసుమము". ఇందు కురంగ గౌరీశంకర నాటిక, అభిజ్ఞానశాకుంతలము, మహావీరచరిత్ర, మాలతీమాధవమును దర్శించుటయైనది. అనువాద రచనలు సమకాలిక ప్రసిద్ధులైన ఇతరులు రచనలతో సరిపోల్చబడినవి. ఐదవ ప్రకరణమైన "గద్యసుమము"న అభినవ గద్యప్రబంధము సమీక్షింప బడినది. ఆరవ ప్రకరణమైన "పదసుమమున" కృష్ణప్రతిపాదములైన పదముల గూర్చి, లక్షణావిలాసములు యక్షగానమునగూర్చి వివరణ అందించుటయైనది.

ఏడవ ప్రకరణమగు "పత్రికాసుమము"న సమకాలిక కవులవలె వీరు నిర్వహించిన 'అనల్పజల్పితాకల్ప కల్పవల్లి' యను పత్రికనుగూర్చి సమీక్షించుట యైనది. ఎనిమిదవ ప్రకరణము "కదంబసుమములు". ఇందు కవి కాలము నాటి రాజకీయ సాంగిక పరిస్థితులు, కవిగారిపైగల పాశ్చాత్య సాహిత్య ప్రభావము, కవిగారి వ్యక్తిత్వము దర్శించుటయైనది. మహాసాగరమైన వీరి కవితను ఒడ్డునకూర్చుండి దర్శించుటయైందే కాని సాగరమధనము జరుగలేదు. ఇది కవితా సమీక్ష మాత్రమే?

వ్యాసమున గల అనుబంధమున నీ క్రిందివి చేర్చబడినవి.

(1) లక్షణావిలాసము (లిఖిత ప్రతి) (శిధిలములు పూరింపబడినవి). (2) అనల్పజల్పితాకల్పకల్పవల్లి. 3. Encyclopaedia of great personages of theMadras Presidency and the adjacent states అను గ్రంథములో శ్రీరాములుగారిని గూర్చి వ్రాయబడిన విషయము. (4) వినాయకతాళ వివరణము (5) విక్టోరియారాణి నిర్యాణముగూర్చి కవిగారు వ్రాసిన పద్యము. (6) కవి చమత్కారముగ, నిగూఢముగ తెలియజెప్పిన చక్కట్లదండ రచనాకాలము తన 'అడ్రసు' కల పద్యములు.

వ్యాసాంతమున ఉపయుక్త గ్రంధసూచిక చేర్చబడినది. అర్థాపగతి సౌలభ్యమునకై సంధినియమము, రేఫ శకటరేఫ తారతమ్యములు నియతముగా పాటింపబడలేదు. ముద్రణలో కొన్ని అక్షరములు సారూప్యభ్రాంతిని కలిగించును. అట్టి అసంగతములు పండితులు సహృదయుతతో సందర్భోచితముగ సరిచూడగోరెదను.

అనేక బదిలీలకు గురియై ఆయా ప్రదేశములకు వెళ్ళి ఉద్యోగవిధి నిర్వహణలో ముద్రణ విషయమై స్వయముగ పర్యవేక్షించుటకు వీలుకానందున కొద్ది దోషములు దొర్లినవి. అందులకై తప్పుఒప్పుల పట్టిక చేర్చక తప్పలేదు. పఠనాసౌకర్యమునకై పట్టిక గ్రంధాంతమునకాక గ్రంథాదిని చేర్చుటయైనది.* వీలైనంత శ్రద్ధగా ఈ గ్రంథము తన రూపుదిద్దుకొనినది. ఈనాటి సాహితీలోకము నకు ఆనాటి బహుముఖ ప్రజ్ఞాశాలి మహాకవి శ్రీదాసు శ్రీరాములు గారిని పరిచయము చేయుటయే నా ముఖ్యోద్దేశ్యము అందులకీ గ్రంథము ఏమాత్రము ఉపయోగపడినను, నా కృషి సార్థకమైనదిగా భావించెదను.

"సర్వజ్ఞత్వము సాంబమూర్తిది మనుష్యప్రజ్ఞ యల్పంబు" కావున ఎంత ప్రయత్నించినను ఎడనెడ కొన్ని ప్రమాదములు దొరలక మానవు. పండితులు 'హంస క్షీర నీర న్యాయము'న గ్రహింప ప్రార్థించుచున్నాను.

**– వెలగపూడి వైదేహి**

---

* తప్పులన్నియు ప్రస్తుత ద్వితీయముద్రణలో దిద్దబడినవి – దాసుఅచ్యుతరావు.

# అభినందన

పుణ్యశ్లోకులూ, ప్రాతఃస్మరణీయులూ అయిన శ్రీ దాసు శ్రీరాములుగారి ప్రపౌత్రి తమ తాతగారియెడ తన గౌరవాన్ని పరిశోధన కుసుమంగా భక్తితో సమర్పించాలని సంకల్పించి, తుదముట్ట నిష్ఠతో నిరంతర పరిశ్రమగావించి, కడకు గట్టెక్కిన విషయం లోకవిదితమే. “శీతాంశోరమృతార్పణమ్” అన్నట్లు, ఆ పండిత కవినుండి, పరంపరగా ప్రాప్తమైన సామర్థ్యంతో పొందిన విజయాన్ని తన తల్లిదండ్రులకే అంకితంచెయ్యడం ముదావహమైన విషయం.

పరిశోధనకు సత్యాన్వేషణ జీవం; ఆ పనిని నిజాయితీతో, అభినివేశంతో కావిస్తే, దానికి జీవం ఏర్పడుతుంది. డా॥ శ్రీమతి వెలగపూడి వైదేహిగారు భక్తితో, నియమనిష్ఠలతో, నిజాయితీతో ఈ పరిశోధన కార్యాన్ని నిర్వహించి తమ భక్తినీ, శక్తినీ ప్రదర్శించారు.

ఈ సిద్ధాంత వ్యాసం వల్ల శ్రీ దాసు శ్రీరాములుగారి సంపూర్ణ వ్యక్తిత్వం గోచరిస్తుంది; అయితే పరిశోధన కాలంపరిమితం, ఆ మహాకవి వ్యక్తిత్వం అపరిమితం; కనుక శ్రీరాములుగారు రేఖామాత్రంగా కనిపిస్తారు. రేఖాచిత్రాలు సమగ్రసుందరాలా? అవి సమగ్రసుందరతా స్ఫోరకాలు జిజ్ఞాసు విమర్శకులకు ప్రేరకాలు.

కొండంత దేవునికి కొండంత పత్రి తేలేం అన్నదినిజం! కొండంత భక్తితో – పత్రం, పుష్పం, ఫలం, తోయం – అని శ్రీమతి వైదేహి గారు తృప్తిపడాలి. శ్రీ దాసు శ్రీరాములు మహాశయుని గురించి మరిన్ని కోణాల్లో పరిశీలించి, పరిశోధించి లోకానికి అందజేయాలని ఆశిస్తూ, అందజేయగలరని భావిస్తూ, ఆ శక్తిని ఇబ్బడి ముబ్బడిగా ఆమెకు ప్రసాదించవలసినదిగా శ్రీ దాసు శ్రీరామకవిని ప్రార్థిస్తున్నాను.

విశాఖపట్నం
3-12-1986

**డాక్టరు చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రి,**
ఆంధ్రవిశ్వవిద్యాలయము

**ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి**

ఎం.ఎ.పి. హెచ్.డి., డి. లిట్. వాల్తేరు
తెలుగుశాఖ, ఆంధ్ర విశ్వకళాపరిషత్ 20-2-86

"తెలుగునాడు" ఖండ కావ్యము ద్వారా తెలుగునాడున శ్రీ దాసు శ్రీరాములు గారు తెలియని సహృదయులు ఉండరు. వారి "దేవీభాగవతము" మహాకావ్యమును దేదీప్యమానమైనదే. కవులేగాక న్యాయవాదులు, ఉపాధ్యాయులు, దర్మశాస్త్ర విధులు, జ్యోతిశ్శాస్త్ర కోవిదులు, నాట్య, సంగీత, శాస్త్రవేత్తలు అయిన దాసు శ్రీరాములుగారు, కావ్యములతో పాటు నాటకములు, శతకములు పదములు మొదలైన బహుకృతులు రచించిన సుకృతులు. పత్రికా నిర్వహణము, సంఘ సంస్కరణము కావించిన బహుముఖ ప్రజ్ఞానిధులు.

ఏ తన్మహనీయుని కృతుల సమీక్ష ఈ సిద్ధాంత గ్రంథము. సిద్ధాంత గ్రంథమును సిద్ధపఱచిన శ్రీమతి వెలగపూడి వైదేహి, దాసు శ్రీరాములు గారి ప్రపౌత్రి అయినను ప్రపితామహప్రత్తికి పాల్పడక సత్యప్రవృత్తిని సప్రమాణముగ సిద్ధాంత గ్రంథమును సిద్ధము చేయుట ఎంతైన ప్రశంసాపత్రము. ఇందు శ్రీరాములుగారి జీవితచరిత్ర సంగ్రహము, కావ్య నాటకాది గ్రంథ సమీక్షతో పాటు, నాటి సాంఘిక రాజకీయ స్థితిగతులు, పాశ్చాత్య వాఙ్మయ ప్రభావము సంతరించుట విశేషము. గ్రంథాలయములనేకములు గాంచుటయేగాక, ఎందఱో పెద్దలను సంప్రదించి, ఎన్నో విషయములు సేకరించి, దాసు శ్రీరాములుగారి వ్యక్తిత్వమును, సాహిత్యతత్త్వమును సమగ్ర సుందరముగ, సప్రమాణ నిరూపణాత్మకముగ సిద్ధాంత గ్రంథమును సంఘటించిన శ్రీమతి వైదేహి పరిశోదనా వ్యాసంగము ఫలవంతము, ప్రయోజనాత్మకమును. ఆధునిక మహాపురుషుల గుఱించి ఆంధ్ర సాహిత్య రంగమునకు ఆవశ్యకమైన అలతి సిద్ధాంత గ్రంథములలో ఇది వలతి. ఇట్టి గ్రంథమును పేటికాంతర్గతరత్నము చేయక, ఇనాలోకయోగ సంపర్గము చేయుట ఇతోధిక విశేషము.

శిష్యసదృశ శ్రీమతి వైదేహికి శుభాకాంక్షలు.

ఇట్లు,

**(సం.) కొర్లపాటి శ్రీరామమూర్తి**

**Prof. S.V. Joga Rao**
M.A., Ph.D., Litt. (Hon.)
National Professor
Dept. of. Telugu,
Andhra University, Waltair
(Formerly, Professor, U.S.S.R. 1965-67 &
Principal, A.U. Colleges of Arts Commerce & Law)

5/40 Siripuram,
Waltair,
Date : 16-2-1986

# సహృదయ భూమిక

ఆధునికాంధ్ర సారస్వతస్రష్టలలో అగ్రగణ్యులైన వారిలో శ్రీ దాసు శ్రీరాములు గారొకరు. డొక్కశుద్ధితోపాటు చిత్తశుద్ధియుగల మహారచయిత. ఉపరి అంతర్ద్రష్ట, ఉపాసకుడు. వారి సారస్వతవరివస్య బహుముఖీనము సంప్రదాయ ప్రవణము, సంస్కారసారవంతము, ఆధునికయుగోన్ముఖ వికాస విస్పృమరము.

ఆ మహాభాగుని సారస్వత వరివస్య గురించి విశ్వవిద్యాలయస్థాయిలో సక్రమమైన పరిశోధన చేసిన ధన్యసాహిత్యజీవన మా ప్రియశిష్య వైదేహి.

ఈ డాక్టరు పట్ట పరిశోధన నిబంధము అపార పరిశ్రమ క్షమా సముదీర్ణము, సమ్యక్ప్రణాళికము, సమంచిత వైమర్శిక దృక్పథ ప్రదర్శకము.

చి॥ల॥సౌ॥ వైదేహికి నా హృదయ సాధువాదము. మనఃపూర్వక మంగళా శాసనము.

(సం.) **యస్వీ జోగారావు**

**కళాప్రపూర్ణ డా॥ శ్రీ దివాకర్ల వేంకటావధాని**
ఎ.పి.పి. (ఆనర్సు) పి.హెచ్.డి.

హైదరాబాదు
12–4–1986

## అభినందన

మహాకవి శ్రీదాసు శ్రీరాములు పంతులుగారు, బహుముఖ ప్రజ్ఞాశాలులై, శతాధిక గ్రంథకర్తలై దేశము యొక్కయు ప్రజల యొక్కయు క్షేమమునకు పాటుపడి అపారమైన కీర్తినార్జించియుండిరి.

శ్రీ పంతులుగారి గ్రంథములను గూర్చిన సమగ్ర సమీక్షయే ఈ సిద్ధాంత వ్యాసము. శ్రీమతి వైదేహిగారు దానిని కొన్ని సుమములుగా విభజించి యుండిరి. ఇందు మొదటిది కవితాసుమము. ఇందు పంతులు గారి కవితాశిల్పమును, గూర్చి పెక్కు విషయములు వివరింపబడినవి. 'దేవిభాగవత అనువాద పద్ధతి' అను అధ్యాయము శ్రీమతి వైదేహిగారి పాండితీ పటిమను, పరిశోధన పాటవమును, చక్కగా వ్యక్తము చేయుచున్నవి. వారిందు పంతులుగారి అనువాద పద్ధతిని ప్రకటించుటయే కాక వారి రచనను ఇతరుల అనువాదములతో కూడ పోల్చియుండిరి. ఇది సామాన్య సంస్కారము కలవారికి సాధ్యమైన పనికాదు "తెలుగునాడు" అనుభాగము పద్యసుమములోనిది. ఇప్పటికిని ఇందలి పద్యములెన్నో ఎందరో కంఠతము చేసికొని పఠించుచుందురు. ఇందలి పద్యములలో పంతులుగారి నిశిత పరిశీలనమును, నిష్పక్షపాతబుద్ధియు, గోచరించును. బ్రాహ్మణుల యందలి అన్ని శాఖలవారిని కూర్చియు వారు చక్కని పద్యములు రచించి యుండిరి. వారొక్కొక్క శాఖయొక్క గొప్పతనమును, కట్టుబాట్లను, ఆచార వ్యవహారములను, లోపములను కూడ యథాతథముగా కొన్ని చోట్ల విశ్వగుణాదర్శమును, తలపింపు చుండును. ఇందలి పద్యముల ధారాశుద్ధి, అప్రతిమానమైనది. అచ్చటచ్చట జాలువారు హాస్యరసమే ఈ గ్రంథము పలువురి ప్రశంసలను పొందుటకు కారణము.

చక్కట్లదండ అచ్చతెనుగులో వ్రాయబడినది. ఇందలి పదప్రయోగము శ్రీ పంతులుగారి పాండితీ వైభవమునకు తార్కాణము. వారి పరిశీలనము

సర్వతోముఖమైనది. అచ్చటచ్చట వారు చూపించిన శ్లేషకా చమత్కారము పండితులకు కూడ ఆశ్చర్యము కల్గించును. యధార్థములైన నీతులతో మూఢ విశ్వాసములను ఖండించుచు, నచ్చతెనుగులో వ్రాయబడిన ఈ శతకము లాంధ్రమున నెన్నో లేవని చెప్పవచ్చును. సూర్యశతకాంధ్రీకరణము పంతులుగారి సంస్కృత పాండిత్యమునకును, సమాన సంఘటన సామర్థ్యములకును తార్కాణములు.

'నాటక సుమములు'ను అధ్యాయమున పంతులుగారి నాటకాంధ్రీకరణము లను, స్వతంత్ర నాటికయగు కురంగగౌరీశంకర నాటికయు, చక్కగా సమీక్షింప బడినవి. కురంగ గౌరీశంకర నాటిక యందలి వస్తువు పార్వతీ పరమేశ్వరుల పరిణయము. కురంగకథ ఇందు కల్పితమైనట్టిది. శివపార్వతుల ఐక్యము సూచించుటకు శ్రీమన్నారాయణుడిందు కురంగమైనట్లు కథ కల్పింపబడినది. వేదాంత ప్రబోధము నందును, ఆంధ్ర సంస్కృత లలితపద ప్రయోగము నందును సంప్రదాయ ప్రదర్శన మందును, పంతులుగారు ఈ రూపకమున చూపిన చాతుర్యమింతింతని చెప్పరానిది. కాళిదాసు, భవభూతి, మున్నగు సంస్కృత మహాకవుల పద్యముల ననువదించుటయన్న కత్తిమీది సామువంటిది. కాని పంతులుగారా మహాకవుల రచనలకు లోపమెందును కలుగకుండనట్లెంతో నేర్పుతో అనువాదము సాగించి యుండిరి. గద్యసుమములలో అభినవగద్య ప్రబంధ మెన్నదగినది. ఇందు ప్రౌఢత ఎంతో, తెలుగుతనమంత. 'నవసుధాధీశ విశిఖ్యాత' అను చిత్రరచనకు, గ్రంథాంతమున వివరణమిచ్చి శ్రీమతి వైదేహిగారు పాఠకులకెంతో సౌలభ్యము కూర్చియున్నారు. ఈ గద్య ప్రబంధము లోకోక్తులగని. శ్రీకారముతో నారంభించి శ్రీకారముతో ముగియును.

పంతులుగారు పదములు జావళీలు పెక్కువ్రాసియుండిరి. భక్తి శృంగారములు రెండును, పోషించుటయందు వారు నిష్ణాతులు. వారి పదములును జావళీలును ఆంధ్రదేశమునందేకాక, ఒరియా దేశమునందు కూడ వ్యాపించినవి. ఉపన్యాసములందు కూడ వారు కొన్ని దరువులు పదములు పాడుచుండెడివారు. అనుబంధములలో లక్షణావిలాస మొకటి. ఇందు శ్రీ పంతులుగారి పాండిత్యమే కాక, హాస్యరసపోషణ చాతుర్యమును, సంగీత కళాపరిచయమును, ద్యోత

ములగుచున్నవి. ఇందలి శిథిల పూరణము ఔచిత్య శోభితమైయున్నది. పత్రికా సుమములలో "అనల్ప జల్పితా కల్ప కల్పవల్లి" అనునది ముఖ్యమైనది. పత్రికా నిర్వహణము దాసువారియింట పారంపర్యముగా వచ్చుచున్నది. ఈ పత్రికలో వారు ప్రచురించిన యుక్తి ప్రయుక్తులు వారి న్యాయవాద పాటవమును సూచించుచున్నవి. కదంబ కుసుమములలోరాజకీయ సాంఘిక పరిస్థితులు, పాశ్చాత్యభాషా ప్రభావము, పంతులుగారి వ్యక్తిత్వము చక్కగా వర్ణింపబడినవి. అనుబంధములు పాఠకుల కెంతో ఉపయోగకరముగ నుండును. సర్వతోముఖ ప్రతిభావంతులైన శ్రీ పంతులుగారి గ్రంథములను, గూర్చియు పాండిత్య వ్యక్తిత్వములను గూర్చియు శ్రీమతి వైదేహి గారుచక్కగా విశదీకరించి యున్నారు. శ్రీ పంతులుగారి రచనలను గూర్చి యింత సమగ్రముగను, సవిమర్శముగను, సమీక్ష కావించి భావిపరిశోధకులకు మార్గదర్శకురాలైన శ్రీమతి వైదేహిగారిని హృదయ పూర్వకముగ నభినందించు చున్నాను. పంతులుగారిని గూర్చి వారే విషయమును విడిచి యుండలేదు, ఏ విషయమును గూర్చియు అసమగ్రముగ చెప్పియుండలేదు. ఆధునిక కాలములో పలువురికి తెలియని శ్రీ పంతులుగారి ప్రతిభా పాండిత్యములను గూర్చి వారు చేసిన ఈ సమీక్ష సర్వవిధముల ప్రశంసనీయమై వారి నిర్మల మైన కీర్తి కెత్తిన వైజయంతికవలె విలసిల్లుచున్నది.

**(సం.) దివాకర్ల వేంకటావధాని**

**Prof. G.V. Subrahmanyam,**
Head, Department of Telugu,
University of Hyderabad.
HYDERABAD - 500 001.

దాసు శ్రీరామ కవిగారి జీవితవిశేషములపై, కావ్యవిశేషములపై శ్రీమతి వెలగపూడి వైదేహిగారు పరిశోధనము చేసి సిద్ధాంత వ్యాసమును సమర్పించుట సమంజసముగా నున్నది. ఈ గ్రంథమునకు పి.హెచ్.డి. పట్టమువచ్చినది. ఇంతకంటె నీ కృతికి మరియేమి కావలెను?

పరిశోధనము చేయట కొక కవి నెన్నుకొనినచో ఆ కవి నిర్మించిన సాహిత్యము తగినంత యుండవలెను. దాసు శ్రీరామ కవిగారి కా కొరత లేదు. కవి రచించిన కావ్యములు లెక్కకు పెక్కు లుండవచ్చును, కాని వానిలో నుత్తమ కళా ప్రమాణములను సంతరించుకొనిన కృతులు కొన్ని యైనను ఉండవలెను. దాసు శ్రీరామ కవికీ నియమముకూడ వర్తించును. కవి సహస్రాధికమైన పద్యములను రచించెనను వార్త కంటె వానిలో నాతనిదైన యొకశైలి యొకపద్ధతి కొట్టవచ్చినట్లు కనబడు ననెడి కీర్తి ముఖ్యము. దాసుశ్రీరామ కవి కట్టి కీర్తి దండిగ నున్నది అట్లగుచే దాసు శ్రీరామ కవిగారిపై పరిశోధనము చేయుటకు పూనుకొనిన శ్రీమతి వెలగపూడి వైదేహిగారి కృషి సార్థకమైనది.

పరిశోధనమునకు ప్రణాళిక ప్రాణతుల్యము. వైదేహిగారు సిద్ధాంత వ్యాసమును వివిధాధ్యాయములక్రింద విభజించిన విధము వారి విషయ విశ్లేషణ సామర్థ్యమును స్పష్టము చేయుచున్నది. ఈ గ్రంథమున జరిగినది శ్రీరామ కవితా సమారాధన మని భావించినచో నిందలి యధ్యాయములను సుమములుగా భావింపుడని పరిశోధకురాలి సూచన. ఇందు సుమము లెనిమిది కలవు. జీవన సుమము, కవితాసుమము, పద్యసుమములు, నాటక సుమములు, గద్యసుమము, పదసుమము, పత్రికాసుమము, కదంబసుమము. వీనియందు పద్య నాటక గద్య పద పత్రికా సుమములు ఆయా ప్రక్రియలలో శ్రీరామ కవిచే రచింపబడిన కృతులను సమీక్షించుటకు నిర్దేశింపబడినవి. ఒక విధముగా నీ సిద్ధాంత వ్యాసమునకు మొండెము వంటిది అధ్యాయములు గల భాగము కాగా, శిరము కవితా సుమము, పాదభాగము కదంబసుమములు, ఇక జీనసుమమీ

వ్యాసమూర్తికి కిరీటము. జీవితచరిత్ర కవియొక్క కావ్యజీవిత చరిత్రకు భిత్తి కాప్రాయ మగుటచే దానిని మొదట రచించుట సమంజసము. ఆ వెనువెంటనే ఈ పరిశోధకురాలు కవితా శిల్పమును గురించి వ్రాయబూనుట ఔచిత్యములలో కెల్ల ఔచిత్యమని చెప్పదగినది. శ్రీరామ కవిగారి కవితావ్యక్తిత్వము మొదట తెలియక పోయినచో వారి కావ్యముల ననుసరించెడి విధానమున కొక సమన్వయ మార్గ మేర్పడదు. దానిని గుర్తించి మొదటి కవితాశిల్పాధ్యాయమును రచించిన శ్రీమతి వైదేహి గారు అభినందనీయురాలు.

శ్రీరామ కవిగారు అనువదించిన కృతులు దాదాపొక అరడజును ఉన్నను, వానినన్నింటిని కలిపి అనువాద సాహిత్యానుశీలమున పేర నొక అధ్యాయమును రచించుటకు వీలున్నను, దేవీభాగవతానువాద విధానమునకు ఒక ప్రత్యేక భాగమును కేటాయించి దాదాపు 65 పుటల విమర్శనము వెలయించిన వైదేహిగారి విశ్లేషణ వైదుష్యము ప్రసంశింపదగినది. అందును ఆమె దృష్టి గుణదోష విచారము నందు ఉభయకళా కౌశలమును ప్రటకించినది. మచ్చు కొకటి రెండంశములు. శ్రీరామ కవిగారి కవితా శిల్పము నందలి గుణ గణములను పేర్కొనుచు అనుశీలించిన అంశములలో రెండు :

1. శ్రీనాథుడు సీసపద్య రచనలో నెన్ని 'హొయలు' ప్రదర్శించెనో శ్రీరాములు గారును సందర్భ స్వభావాను కూలముగ ననేకరీతలు యొయ్యారముల నొలికించి వైచిత్రిని ప్రకటించిరి (పుట 63–64).
2. కందములు పోతనవి వలెను, సీసములు శ్రీనాథుని వలెను కరుడు బోసినట్లు ఉన్నవి. (పు. 82)

దోషము : 1. పురాణరచనమునందే కాదు ఎచటబట్టిన నచ్చట హాస్యము ఆనాటివారికి తగినట్లుగ ముదురుపాకమున బడినది. (పు. 37)

తెలుగులో వెలసిన దేవీభాగవతములలో శ్రీరామ కవిగారి దేవీభాగవత మును తులనాత్మక పరిశీలన దృక్పథముతో అనుశీలించి దాని వ్యక్తిత్వమును నిర్ధారించుటకు డా॥ శ్రీమతి వైదేహిగారు చేసిన కృషి పరిశోధకులకుండదగిన సత్యనిష్ఠను వ్యక్తీకరించుచున్నది. విశేషించి సుకన్యా వృత్తాంత చిత్రణమునందు ములుగు పాపయారాధ్యులవారి కంటెను, తిరుపతి

వేంకట కవుల కంటెను శ్రీరామకవి రచనము ఔచిత్యవంతముగా నున్నదని నిరూపించుట కామె చేసిన యత్నము పరిశోధనలలో ప్రదర్శించు వాద పాండిత్యమున కుదాహరణము. అల్లూరి వర్ణనముపై ఆంగ్ల కవితా ప్రభావ పరిశీలనము తులనాత్మకానుశీలమునకు మచ్చుతునక.

తెలుగునాడు బ్రాహ్మణ సమాజముపై రచించిన యొక అధిక్షేపణ (satire) రచన యనియు, శ్రీరామకవి రచించిన శతక సముదాయములో నచ్చ తెలుగు రచనయైన 'చకట్లదండ' లోకము నుండి 'తాజా'గా సంపాదించిన శబ్దములనే వాడిన ప్రయోగమనియు, సూర్యశతకాను వాదము రసవన్మధురమైన స్తుతి కావ్యమనియు, అపూర్వకల్పనా చమత్కార సుందరమైన రూపకము 'కురంగగౌరీ శంకర' మనియు, ఆద్యంతము తెలుగుదనముట్టిపడునట్లు లౌకిక పద ప్రయోగములతో ననుదించిన నాటకములు 'అభిజ్ఞాన శాకుంతలము', 'మహావీర చరితము', 'మాలతీ మాధవము' మొదలైనవనియు, గద్యప్రబంధమును రచించిన వారిలో శ్రీదాసు శ్రీరాములుగారేఆద్యులనియు, కవిగారి పదసాహిత్యము గాన విద్యా వినోద రసిక జనానందకరముగా నుండుననియు, 'అనల్ప జల్పితా కల్ప కల్పవల్లి' స్వధర్మ రక్షణకును, సాంఘికదురాచార ఖండమునకును, సాహిత్య పునరుద్ధరణమునకును కృషి చేసిన పత్రిక దురాచార ఖండనమునకును కృషి చేసిన పత్రికయనియు డా॥ శ్రీమతి వెలగపూడి వైదేహిగారు సోపత్తికముగా వివరించి యుండిరి. ప్రతిపాదించెడి యంశమునకు ప్రమాణములను చూపి సమర్థించు విధానము డా॥ వైదేహిగారి పరిశోధనమందలి శాస్త్రీయపద్ధతిని సమర్పించుచున్నది. లక్షణావిలాస గ్రంథపరిష్కార విమర్శనమునకు చక్కని యుదాహరణము.

'కదంబ సుమము'లను అధ్యాయమునందు శ్రీరామ కవిగారు నివసించిన కాలమునాటి రాజకీయ సాంఘిక పరిస్థితులను, వారి కావ్య రచనపై గల ఆంగ్ల భాషా సాహిత్య ప్రభావమును, కవిగారి సాహితీ వ్యక్తిత్వమును వరుసగా వివరించుటయు, చిత్రించుటయు గావించిరి. ఆంధ్రుల జీవిత విధానములోని తెలుపు నలుపులను లెస్సగా నవగాహనము చేసికొని వానిని సజీవములైన తెలుగు పలుకుబడులతో నిండిన శైలిలో ప్రతిఫలింప చేసిన కవి శ్రీరామకవి.

ఆయన "సంప్రదాయముపై వలపు బాయలేదు, పాశ్చాత్యసాహిత్యముపై మక్కువ వీడలేదు" అను నంశమును తర్కసహముగా నిరూపించినారు డా॥ వైదేహిగారు.

ఒక మహాకవి సాహిత్యమును సమీక్షించుట యొక యెత్తు. అతని సాహితీ వ్యక్తిత్వమును నిగ్గుతేల్చుట మరియొక యెత్తు. డా॥ వైదేహిగారు ఈ సిద్ధాంత గ్రంథమును కవిగారి 'వ్యక్తిత్వము'ను చిత్రించు భాగముతో ముగించినారు. మరొక 'ముగింపు అధ్యాయము' లేకుండ రచించుట ఆమె ప్రౌఢిమకు తార్కాణము. ఆమె తీర్పు ఆంధ్రరసికుల కామోద యోగ్యమైనది.

శ్రీరాములు గారి పేరు ఉచ్చరింపగ తెలుగునాడులోని "లేవరు లెండు లెండనిన" అనుపద్యము స్ఫురింపక మానదు ... దీనిని గురించి శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారిట్లనభినందించిరి – "శ్రీరాములు గారి పాకం సభ్యం ఒక్క అక్షరం కూడ నిషేధింప తగ్గదిలేదు. ఎందరు కవులు సదస్యాలు (చేయకపోయినా) చూచి వుండరు! ఒక్కరైనా యిట్టి పద్యాన్ని వ్రాయగలిగినారా? దీన్ని బట్టి ఈయన్ని అపర శ్రీనాధుడుగా భావిస్తాను."

రెండవ శ్రీనాధుడు శ్రీదాసు శ్రీరామకవి. ఆ కవిపై సమగ్ర పరిశోదనము వెలార్చిన మొదటి సిద్ధాంత వ్యాసము ఈ గ్రంధము, ఆ కవికి అభివందనములు, ఈ పరిశోధకురాలికి అభినందనములు.

హైదరాబాదు,
26-3-1986.

**జి.వి. సుబ్రహ్మణ్యం**

దేవులపల్లి రామానుజరావు
అధ్యక్షులు
ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్ రోడ్డు, హైదరాబాద్.

హైదరాబాదు
తేది : 25-3-86

# అభినందన

దాసు శ్రీరాములు గారు మహాకవి. క్రిందటి శతాబ్దంలో తెలుగు సాహిత్య రంగములో ప్రకాశించిన అనర్ఘ రత్నాలలో శ్రీరాములుగారొకరు. కవి, పండితుడు, బహుభాషావేత్త సంఘ సంస్కర్తగా ఆయన ఆనాడు ప్రముఖ పాత్ర వహించినారు. ఉపాధ్యాయుడుగా, న్యాయవాదిగా ఏ రంగంలో పని చేసినా అశేష గౌరవాల నందుకున్నారు. సాంస్కృతిక, సామాజిక రంగాలలో ఆయనకు ఒక విశిష్ట స్థానమున్నది. సాంప్రదాయం వైపు మొగ్గు చూపినా ఛాంధస భావాలను ఎల్లప్పుడూ ఖండించినారు. సమాజంలో తాను చెడు అనుకున్న దానిని విమర్శించడానికీ, ఎదుర్కోవడానికి ఎప్పుడూ వెనకాడలేదు.

సాహిత్యంలో అన్ని ప్రక్రియల్లోనూ, ఆయన ప్రతిభ చూపించినారు. సంగీత సారస్వతాలు రెండింటా సమానమైన ప్రజ్ఞ ఆయనది. ప్రౌఢకావ్యాలతో పాటు పదాలు, జావళీలూ రచించినారు. అచ్చతెనుగులో రచనలు చేసిన వారిలో ప్రాచీనులే తక్కువ. ఆధునికులలో ఈ ప్రక్రియలో రచనలు చేసిన కొద్ది మందిలో దాసు శ్రీరాములుగారు పేర్కొన్న దగినవారు.

అన్నింటికంటే ప్రధానమైనది ఆయన ప్రగతిశీలత. తెలుగునాడు, చక్కట్లదండ మొదలైన రచనల్లో స్పష్టమౌతుంది. తానొకప్పుడు నమ్మినది తప్పని తెలుసుకొన్నప్పుడు దానిని వెంటనే పరిత్యజించటం ఆయన విశిష్టత. మూఢంగా పాతనే పట్టుకొని వేలాడే మనస్తత్వం కాదాయనది. ఎందరో కవి పండితులను సన్మానించినారాయన.

అటువంటి దాసు శ్రీరాములుగారిని గూర్చి ఒక సమగ్రమైన పరిశోధనా గ్రంథం వెలువడటం ముదావహం. ఈ గ్రంథ రచనలో వైదేహి గారి పరిశ్రమ అడుగడుగునా వెల్లడౌతున్నది. దాసు శ్రీరాములుగారి జీవితాన్ని గురించి రచనలను గురించి అమూల్యాగ్రమైన పరిశీలన ఈ గ్రంథంలో ఉన్నది. శ్రీరాములుగారి

వ్యక్తిత్వాన్ని వైదేహిగారు చక్కగా ఆవిష్కరించినారు. శ్రీరాములుగారి రచనలు ఆనాటి రాజకీయ సామాజిక నేపథ్యంలో కూడా సమన్వయించి చూపినారు వైదేహిగారు.

ప్రసిద్ధమైన సంస్కృత నాటకాలను శ్రీరాములుగారు అనువదించినారు. అయితే వీటిని ఇంకా పలువురు ప్రసిద్ధకవులు కూడా అనువదించినారు. ఆయన అనువాదాలను పరిశీలించేటప్పుడు కేవలం మూలంతో పోల్చిచూడడం మాత్రమే చేయక ఇతర కవుల అనువాదాలతో కూడా తులనాత్మకంగా పరిశీలించి భేదసాదృశ్యాలను తెలుపుతూ చక్కగా అంచనా వేసినారు వైదేహిగారు. ఈ పరిశీలనలో దాసు శ్రీరాములు గారి అనువాద వైవిష్ట్యం చక్కగో ద్యోతకమయినది.

దాసు శ్రీరాములు గారి సంగీత రచనలు విశ్లేషించడంలో వైదేహి గారి సంగీత పరిజ్ఞానం తెలుస్తున్నది. శ్రీరాములు గారి పదరచనలను వైదేహిగారు చక్కగా వివరించినారు.

దాసు శ్రీరాములుగారి ప్రధాన రచన దేవీభాగవతము. దేవీభాగవితము నందలి కవితా శిల్పమూ, శ్రీరాములుగారి అనువాద పద్ధతి ఇతర అనువాదకుల అనువాదాలతో తులనాత్మకంగా పరిశీలించి ప్రత్యేకతలను ఆవిష్కరించినారు వైదేహిగారు. ఇంత చక్కటి పరిశోధనా గ్రంథం ద్వారా దాసు శ్రీరాములుగారి జీవితాన్ని, వ్యక్తిత్వాన్ని రచనల సమగ్ర విశ్లేషణను తెలుగు పాఠకలోకాని కందించిన వైదేహిగారు అభినందనీయులు.

హైదరాబాదు

25–3–86 **(సం.) దేవులపల్లి రామానుజరావు**

# విషయ సూచిక

## అనుబంధములు

# 1. జీవనసుమము

## జీవితచరిత్ర

సర్వచైతన్య రూపాన్తా మాద్యాం విద్యాఞ్చ ధీమహీ
బుద్ధిం యానః ప్రచోదయాత్

19వ శతాబ్దిలో సారస్వతచరిత్ర మొక విశిష్టమైన మలుపు తిరిగినది. సారస్వత సామ్రాజ్యమునకు పట్టము కట్టుకొన్న సంప్రదాయకవిత తన రాజదండమును, కిరీటమును ప్రక్కకుపెట్టి తాను గద్దె దిగినది. సామ్రాజ్యమంతయు నరాజకమైనది. ఎన్నో కవితలు పుట్టగొడుగులవలె తలెత్తినవి. ఆంగ్లసాహిత్య ప్రభావము ఆంధ్రసాహిత్యముపైబడి భావకవిత, వచనకవిత, గేయకవిత వంటివి యెన్నో బయల్వెడలినవి. ఆ సమయమున శ్రీదాసు శ్రీరాములుగా రావిర్భవించి సప్రదాయ కవితను మరల గద్దెపై నుంచి కొంతకాలము ప్రభవిల్లునట్టు చేసిరి.

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే

– భగవద్గీత – అ. 4, శ్లో. 8.

ఆదినారాయణుడు శిష్టరక్షణకు దుష్టశిక్షణకు యుగయుగములందు జన్మించి సాధురక్షణ గావించుచుండునని భగవద్గీతలో చెప్పబడినది. అట్లే సారస్వతాభివృద్ధికి ముప్పువాటిల్లినప్పుడు నా యుగములందు యుగపురుషులు జన్మించి సారస్వత ప్రపంచ భారమును తమ భుజస్కంధములపై పెట్టుకొనిరి. అట్టివారే తిక్కన, శ్రీనాథుడు, కృష్ణదేవరాయలు. ఈ యుగమున నట్టి భారమును వహించినవారిలో వీరొకరు.

శ్రీ దాసు శ్రీరాములుగారు ఆరువేల నియోగులు, హరితస గోత్రజులు, కృష్ణయజుశ్శాఖీయులు, ఆపస్తంభసూత్రులు, తిరుమణి తిరుచూర్ణయుతమగు నూర్ధ్వపుండ్రధారులు. వీరి పూర్వీకులు ధార్వాడ నగరవాస్తవ్యులు. రఘునాథరావు అను నతడు దళోద్యోగిగా గోలకొండ చేరెను. ఈతని కుమారుడు గంగోజి.

ఇతడు గొప్ప హరిభక్తుడు. మహారాష్ట్ర, పార్సీ, ఆంధ్రములను జదివి వరంగల్లులో వర్తకవ్యాపారుల యొద్ద నుద్యోగము చేయుచుండెను. ఈ గంగోజి హరిదాసుడై యుండుట బట్టి జనులు దాసు గారని పిలిచి యుండిరి. అందువలన ఈ వంశమువారికి "దాసు" వారని యింటిపేరు కలిగియుండెను. ఈ దాసు వంశములో శ్రీకన్నయ్య కామాక్షమ్మగార్లకు 1846 ఏప్రియల్ 8 వ తేదీన సరియగు పరాభవ నామ సంవత్సర చైత్రశుద్ధ ద్వాదశి బుధవారమునాడు సాయంకాలము వేళలో, కూరాడ గ్రామములో మాతామహుడగు కూరాడ రామచంద్రరావు గారి యింట జన్మించిరి. 1852లో వీరు అల్లూరు ప్రవేశించిరి. కొడుకు పుట్టిన వేళావిశేషమున వీరి కన్నిట కలసివచ్చినది. 1856వ సంవత్సరము నాటికి కూరాడ, గుడ్లవల్లేరు మున్నగు గ్రామములలోని వందయెకరముల ఈనాములును, అల్లూరు అగ్రహారమున నర్ధభాగమును, వీరి యాస్తియై పాడిపంటలతో తులతూగుచుండిరి. 'రఘునాయకుల' కాలమున దాసువారు సర్వాగ్రహారమైన అల్లూరును, సీతనపల్లి యను మరియొక అగ్రహారమును, కూరాడ, గుడ్లవల్లేరు, అంగలూరు, దొండపాడు,తమిదిన, కాయనపూడి గ్రామములలో సుమారు రెండువందల యెకరముల ఈనామును కమదన ప్రభువుల వలన సంపాదించిరి. తరువాత కన్నయ్యగారు జ్ఞాతుల మూలమున నవన్నియు పోగొట్టుకొని చివరకు వారి యిలవేల్పయిన సోమనాధునిపైనే వ్యాజ్యమాడవలసి వచ్చెను. అయినను కన్నయ్యగారి నాటికి అల్లూరు గాక కూరాడ, గుడ్లవల్లేరు మున్నగు గ్రామములలో నూరెకరములు గలిగి యుండిరి. కన్నయ్య కామమ్మగారలు సంపన్నులయినను బీదలయెడ దయాదాక్షిణ్యములు గలిగి, యుదారబుద్ధితో నుండిరి. కన్నయ్య గారింట కామమ్మ కాలుపెట్టినప్పటినుండి వారి కష్టములు గట్టెక్కి పట్టినదెల్ల బంగారమై పాడిపంటలతో కష్టమగునది యెఱుగక జీవించిరి. [1]ఈమె అన్నదానము విరివిగా జేసినది. దేవీభాగవతములో వీరిని గురించి యిట్లు వ్రాయబడినది.

కన్నయ్య పండింప గామమ్మ వండింప
    లేచిన విస్తళ్ళు లెక్కలేదు
కన్నయ్య తెప్పింప గామమ్మ యిప్పింప
    గొలచిన ధాన్యంబు విలువలేదు
కన్నయ్య నిలిపింప గామమ్మ గొలిపింప

వేల్పుగొల్పుల కొక్కవేళలేదు
కన్నయ్య వ్రాయింప గామమ్మ చేయింప
నుపకారములకు మారొడ్డులేదు
నన్నునుంబోలె నాదు మేనత్త కొడుకు
లైన కనకయ్య కృష్ణయ్య నరసిప్రోచి
పెంచి పెద్దల గావించి పెండ్లిచేసి
నట్టి నా తల్లిదండ్రుల నాత్మదలతు

'ఈమె పెట్టిన అన్నమునకైన బియ్యము కొలత వేసిన కొన్ని పుట్లగు'[2] నని శ్రీ విష్ణురావు గారు దాసువారి వంశచరిత్రలో వ్రాసిరి.

ఇట్లింటిలో జరుగుబాటు కలిగియుండియు, నేకైక సంతానమై యుండియు, ఆకతాయి వలె తిరుగక బుద్ధిగా నుండి తన మేనత్త కుమారులగు కన్నయ్య, కృష్ణయ్యలతో పాటు అల్లూరులోనె శ్రీరాములుగారు దినదినాభివృద్ధి జెందు చుండిరి.

వీరి కుపనయనమైన పిమ్మట నారునెలలు మాత్రము కొఱ్ఱగుంట పాలెము కాపురస్థులు శ్రీ అడవి సుబ్బారావు గారి వద్ద చదివిరి. తరువాత గుడ్లవల్లేటి పేరరాజు గారి యొద్ద కొన్నాళ్లు చదివిరి. అప్పటికి బాలరామాయణము, అమర కోశములో కొంతవరకు మాత్రము చదివిరి. తరువాత గురుముఖతః యే విద్యను నభ్యసింపలేదు. తండ్రిగారి వద్దనే లెక్కలు వేయుట,వ్రాత,భారతాది గ్రంధములు చదువుటయు నభ్యసించిరి. శ్రీదాసు శ్రీరాములుగారు 'స్వతహా తెలివిగల వారు' ను, మేధాశక్తిని కలిగిన వారును. కావుననే ఆంధ్రమును కొంతవఱకు స్వయముగానే నేర్చిరి.

అటుతరువాత కొన్నిదినములకు బందరులో నోబుల్‌దొర స్థాపించిన నోబుల్ పాఠశాలలో జేరిరి. నోబుల్‌దొర బాలుని కుశాగ్రబుద్ధిని, చూచి, మెచ్చి యాయనను తన యింటికి గొనిపోయి చిన్నచిన్న బహుమానము లిచ్చి యప్పుడప్పుడు ఫలహారములు గూడ పెట్టెడివారట. ఇది తెలిసి తన పిల్లవాడు క్రైస్తవ మతమును స్వీకరించునని చదువునకు స్వస్తి చెప్పించి అల్లూరునకు గొనిపోయిరి.

అల్లూరునకు తిరిగివచ్చి మేనత్త కుమారులు కనకయ్య, కృష్ణయ్యలతో యధేచ్ఛగా తిరుగుచు కడు గారాబముగా పెరుగుచున్నను, స్వయంకృషితో సంస్కృతాంధ్రములు నభ్యసించుచుండిరి. వీరు బాల్యావస్థ నెట్లు గడిపిరో దేవీభాగవత పీఠిక 'అల్లూరివర్ణనలో విపులముగ గలదు. 'జయజయ సోమలింగ' అను మకుటముతో తన పండ్రెండవయేట శతకమును వ్రాసిరి. పదునాలుగవ యేటనే 'సాత్రాజితీ విలాసమ' ను యక్షగానమును రసవంతముగను మిక్కిలి ప్రౌఢముగను రచించిరి. శ్రీ ముక్కామల లక్ష్మీనరసుగారు, శ్రీ గురజాడ శ్రీనివాసులుగారల 'ఉపదేశము' పై పొరుగూరి నుండి జంగము చంద్రశేఖరుడను వానిని పిలిపించి కన్నయ్య గారికి 'చేతబడి' యను భూతవైద్యము చేయింపగా సంగతి తెలిసియు నట్టి క్రియలు తననేమియు చేయవను నమ్మకముతో వారిని ప్రతిఘటింపలేదు సరికదా వారిని గౌరవముతోనే చూచిరి. లక్ష్మీనరసు గారు చివరిదినములలో అల్లూరునకు వచ్చెను. ఈయన జ్యోతిష్యాదిశాస్త్రముల బాగుగా తెలిసిన వారు. ఈయన కన్నయ్య గారి యెడల విరోధిగా వర్తించినను శ్రీరాములు గారి విద్యాబుద్ధులకు వారి యమేయ మేధాశక్తికి నలరి యెంతో ప్రేమతో నుండెడివారు. ఈయన తన యంత్యకాలమున తన జ్యోతిష్యాది గ్రంథ సంపుటములను శ్రీరాములు గారి కాళ్లుకడిగి విధిపూర్వకముగా దానము చేసిరి. ఇదే వీరి జ్యోతిశ్శాస్త్ర ప్రజ్ఞకునుపస్మారకమై యుండేనోపు !

1859లో శ్రీ శ్రీరాములుగారికి భయంకరమైన జ్వరము వచ్చి జబ్బు చేసినది. నయమైన పిమ్మట అదే సంవత్సరము మార్చి 25న తన పెద్ద మేనమామ గారగు కూరాడ లక్ష్మీనరసింహముగారి ద్వితీయపుత్రిక జానకమ్మ గారి నిచ్చి కూరాడలో వివాహము చేసిరి. 'వివాహో విద్యనాశాయ' అని అందురు. కాని ఈ వివాహము వారి విద్య కెట్టి యాటంకమును కలిగింపలేదు. 1865లో తల్లిదండ్రులకు గాని, మరెవ్వరికి గాని తెలియకుండా నర్థరాత్రమున నిల్లు వెడలి సంస్కృత వ్యాకరణాదుల నభ్యసింప ఆగిరిపల్లికి వెడలిరి.

అచ్చటి నూజివీడు ప్రభువులు వీరికి సకల సదుపాయములు చేసి వీరికి దినమునకు అర్థరూపాయ వంతున విద్యార్థి వేతనమిచ్చిరి. అచ్చట సంస్కృత వ్యాకరణమును చదువుటయే కాక యచ్చటి పండితుల సాంగత్యము వలన

నితర శాస్త్రములతోను, సాహిత్యముతోను, విస్తార పరిచయము సంపాదించిరి. ఇచ్చట శ్రీ గరికపాటి అప్పయ్యశాస్త్రులు గారు, శ్రీ లక్ష్మణశాస్త్రిగారు వీరి సహాధ్యాయులో, నుపాధ్యాయులోయై యుండిరి. ఇచ్చట పదిమాసములుండి యింటికి తిరిగి వచ్చిరి.

భార్య కాపురమునకు వచ్చెను. అయినను వీరు విద్యావ్యవసాయమును వీడలేదు. సంస్కృత విద్య నభివృద్ధి గావించుకొనుటే గాక, అష్టావధాన, శతావధాన, వ్యస్తాక్షరీకవితలో ప్రజ్ఞ నలవఱచుకొనిరి. మహాత్ముల కసాధ్యము కలదా?

నూజివీడు సంస్థానమున ఏకసంతాగ్రాహులగు శ్రీ మాడభూషి వెంకటాచార్యులవారాస్థాన పండితులు. ఒకసారి నవరాత్ర సందర్భమున జరుగు పండిత పరీక్షలో బాలురయ్యు ప్రథమతాంబూల మందిరి. 'పదిరెండేడుల యీడునం గవితఁజెప్పంబూని ...... '[3] అను పద్యమును ఆశువుగా నా సభలో వీరి నుద్దేశించి యా యాస్థానపండితులు చదివిరట. ఈ పరిచయముతో వీరింటికి వారు తఱుచు వచ్చెడివారట. విక్టోరియా గోల్డెను జూబిలీ సందర్భముగ నిరువురు ప్రశంసాపద్యములను వ్రాసిరట. శ్రీరాములుగారు విక్టోరియా రాజ్యపాలన విషయమై కొన్ని చక్కని పద్యములను, కీర్తనలను వ్రాసిరి. 'అన్నుల పాణి విక్టోరియాఖ్యసురాణి నిరుపమ కళ్యాణి సత్యవాణి' అన్న మకుటముతో 'విక్టోరియా ద్వాత్రింశతి, అను పద్యములను వ్రాసిరి. 'పండించినారమ్మ వాడలం వారిచే .. గమగమ వలచు బంగాళదుంప, తొడిగించినారమ్మ శాస్త్రుల కొమరుచే ఉక్కుటక్కుమనుం జడావుజోడు' అను రెండు సీసపాదము లందులోనివే.

1872లో గుడివాడలోని ఆంగ్లపాఠశాలలో ప్రధానోపాధ్యాయులుగా జేరిరి. ఉపాధ్యాయులుగా వీరి కీర్తి దిగంతముల వ్యాపించినది. ఇచ్చట నున్న కాలమున వారు వేదాచలమహాత్మ్యము, కృష్ణార్జున సమర మను రెండు ప్రౌఢ ప్రబంధములను వ్రాసిరి. ఇవి యిప్పుడలభ్యములు. సుప్రసిద్ధ న్యాయవాది శ్రీరెంటాల సుబ్బారావుగారు వీరి శిష్యులు. ఇచ్చట నున్న కాలమున శ్రీరాములు గారు ఇంటివద్దనే ఆంగ్లభాషాభివృద్ధి గావించు కొనిరి. తరువాత 1874లో బందరునకు పదునొకండుమైళ్ళ దూరమున నున్న కవుతరమునకు ఆ గ్రామస్థుల కోరికపై నుపాధ్యాయులుగా పోయిరి.

కవుతరము నుండి 1875 లో డోకిపఱ్ఱు గ్రామమునకు అచ్చటి గ్రామస్థుల కోరికననుసరించియే ఉపాధ్యాయులుగా పోయిరి. అచ్చట కమ్మకులీనుడు శ్రీ పోలవరపు హనుమయ్యగారు వీరి కాశ్రయమిచ్చిరి. శ్రీహనుమయ్య గారి వంశస్థులకే కాక ఆవూరి వారందరకు విద్యావ్యాప్తి చేసిన వారగుటచే శ్రీరాములు గారన్న అచ్చటివారికి అభిమానము మెండు. గంగయ్య, హనుమయ్యగారలచే కవితారచన గూడ చేయించిరి. 'లక్షణ విలాసమ'ను యక్షగానములో శ్రీగంగయ్యగారు వ్రాసిన 'మంగళహారతి' కలదు. ఈ యక్షగానమును డోకిపఱ్ఱులోనున్న దినములలో వ్రాసి యావూరి శ్రీ మదన గోపాలస్వామికి నంకిత మిచ్చిరి. ఇదియే గాక 'సంవరణోపాఖ్యానమ'ను గ్రంథమును గూడ రచించిరి.

డోకిపఱ్ఱులో వీరుండగా శ్రీ సూరి సీతారామశాస్త్రి యను వైయాకరుణుడు ధనార్థియై వీరి నాశ్రయించిరి. శ్రీ శ్రీరాములు గారు వీరికిని, వీరి తల్లికిని తమ యింట నాశ్రయమిచ్చి శ్రీ శాస్త్రిగారిని తెలుగు న్యాయవాద పరీక్షకు చదివించి కృతార్థుల గునట్లు చేసిరి. అటుపిమ్మట ఆయన కారంపూడి వెళ్ళి యచ్చట న్యాయవాద వృత్తిని కొనసాగించిరి. వీరివద్ద శ్రీరాములుగారు సిద్ధాంతకౌముది, శబ్దేందు శేఖరములను చదివిరి. వీరిచ్చట నున్న సమయముననే తెలుగు, 'ఇంగ్లీషు జనరల్ టెస్టు' లను పరీక్షలను, న్యాయవాద పరీక్షను గూడ వ్రాసి యందుత్తీర్ణులైరి.

న్యాయవాద పరీక్ష యందుత్తీర్ణులైన పిమ్మట మచిలీపట్టణమునకు న్యాయవాద వృత్తికై పోవుటకు సంసిద్ధులైరి. అప్పుడా గ్రామస్థులు చూపిన భక్తి, శ్రద్ధ లెనలేనివి. బంగారుపూలచే శిరమును, వెండిపూలచే పాదములను పూజించి పల్లకీలో గూర్చుండబెట్టి దివిటీలు పట్టి యూరేగించిరట.

అచ్చట ప్రవేశించిన కొన్ని దినములకే వారు మశూచిగ్రస్తులైరి. అంతటి అల్లూరికి పోయిరి. బహుశః ఆ సందర్భముననే కావలయును సంస్కృతమున తమ ఆరాధ్యదైవమగు కామేశ్వరిపై సంస్కృతమున శతకమును వ్రాసిరి. ఇట్లు సంస్కృతములో ఆనాడు శతకములు వ్రాసిన వారరుదు. వారు స్వస్థత పొందిన పిమ్మట మరల బందరునకు తిరిగివచ్చిరి.

బందరులో స్థిరపడిన తరువాత నిజాముపేటలో నొక మేడను కొని యందుండిరి. అప్పటికి వారికి ఐదుగురు పుత్రసంతానము కలరు. బందరునకు వచ్చిన పిమ్మట చివరి కుమారుడు మధుసూధనరావుగారు జన్మించిరి. వీరిచ్చట న్యాయవాదవృత్తిని, చాల దీక్షగా శ్రద్ధగా చేసికొని దానిని పెంపొందించుకొనిరి. డోకిపఱ్ఱు వాస్తవ్యులిచ్చిన మేనాలోనే వీరు న్యాయస్థానమునకు పోయెడివారట.

శ్రీ శ్రీరాములుగారూపిరాడని న్యాయవాద వృత్తి నిర్వహించుచున్నప్పటికిని సాహిత్యమును శాస్త్రాభ్యాసమును నభివృద్ధి గావించుకొనుట మానలేదు. సాంఘిక మత విషయములలోను కృషిచేయుచునే యుండిరి. అంతేగాక యాంగ్లమున క్రిమినలు హైయ్యరు, సివిలు హైయ్యరు పరీక్షలకు కట్టి యుత్తీర్ణులైరి. ఆంగ్లమున న్యాయవాదులు కాగలిగిరి. వీరే పరీక్షకు చదివినను సులభముగా విషయములను సాధ్యమగు వఱకు పద్యములలో నిమిడ్చి జ్ఞాపకముంచు కొనుచుండెడివారు.

ఇదే సమయములో 'అనల్పజల్పితాకల్ప కల్పవల్లి' యను నొక పుస్తక రూపమైన మాసపత్రికను సాంఘిక మత విషయములను గూర్చి కొంతకాలము అచ్చువేయించి ప్రకటించియుండిరి.

ఆ దినములలో శ్రీ పి.డి. రాఘవాచారిగారు నొకఁ 'డిప్యూటీ కలెక్టరు' గా రుండిరి. ఆయన గూడ వినోదప్రియుడే. వీరు శ్రీరాములు గారి సహాయమున కూచిపూడి భాగవత ప్రదర్శనములు జరిపించెడివారు. (స్త్రీ వేషధారియగు శ్రీ వెంపటి కోదండరామయ్యను నతడును, హాస్యగాడగు శ్రీ తాడేపల్లి విస్సయ్యయను నతడును నా భాగవతులలో సుప్రసిద్ధులు.)

శ్రీరాములుగారి ద్వితీయ కుమారులు శ్రీదాసు నారాయణరావుగారు 'నేషనల్ థియేటరు' ను నిర్వహించెడివారు. కవిత్వ విషయములోను, లలిత కళల విషయములోను, ముమ్మూర్తులా వీరు తండ్రినే పోలియుండిరి.

బందరులో వీరి సమకాలీనులు – సర్వశ్రీ అద్దేపల్లి జానకిరామయ్యగారు, శింగరాజు సుబ్బారాయుడుగారు, వడ్లమన్నాటి దామోదరయ్యగారు, మున్నంగి రామయ్యపంతులుగారు, ఓరుగంటి శివరామకృష్ణయ్యగారు మున్నగువారు.

బందరులో న్యాయవాద వృత్తి చేయుచున్నప్పుడే వీరి మిత్రులు శ్రీ మోటుపల్లి

రాఘవయ్యగారొకపరి వీరింటికి వచ్చి న్యాయవాదవృత్తిలో పడి సాహిత్యమును మరచిపోయారేమో యని మున్నెన్నడులేని కథతో వచనములో, ప్రబంధ లక్షణములతో నొక గ్రంథమును పది దినములలో వ్రాయమని కోరగా వీరట్లేయని 'అభినవ గద్యప్రబంధము'ను శుద్ధప్రతితో గూడ వారము దినములలో వ్రాసియిచ్చిరి. ఈ రచనా కాలమున వీరి ప్రాక్టీసు అమితముగా నుండెను.

తర్వాత వీరును 'ఫస్టుగ్రేడు ప్లీడరు' పరీక్షకు కట్టి నెగ్గిరి. విద్యాసము పార్జనకు వయస్సుతో నిమిత్తము లేదు గదా!

1884 జూలైలో కడలూరులో నున్న 'సబుకోర్టు' ఏలూరునకు వచ్చెను. శ్రీరాములుగారును బందరు వదిలి ఏలూరునకు వచ్చిరి. వీరు పెద్ద 'వ్యాజ్యములు' లు 'దాఖలు' చేయసాగిరి. చీమకుర్తి వెంకటస్వామిగారను నొక వైశ్య వర్తక శిఖామణి వీరి మొదటి క్లయింటు. ఏలూరు 'సబుకోర్టు'లో మొదట 'దాఖలు' అయిన పెద్ద 'వాజ్యము' లలో మొదటి 'నంబర్ల'లో కొన్ని వీరు దాఖలు చేసినవే. ఆదెప్పశెట్టి, వెంకటరంగయ్యరు, మనవాళ్ళయ్య, మద్దిరాల బుచ్చి సుందరరావు, స్వామినాధయ్య గారలు 'సబుజడ్జీలు' గా నుండిరి. శ్రీ జంధ్యాల గౌరీనాధశాస్త్రి గారు,ములుకుల్లు అచ్యుతరామయ్యగారు, గోటేటి శివరామయ్యగారు, వారణాసి లక్ష్మీనరసింహముగారు, ఉదయగిరి గోపాలరత్నముగారు, పాలంకి వెంకట రమణయ్యగారు వీరితో పాటు న్యాయవాద వృత్తి చేసిన న్యాయవాదులలో ప్రముఖులు.

ఏలూరులో గూడ పలువురు జమీందారులు వీరి యొద్దనే తమ 'కోర్టు' 'వ్యాజ్యము' ల నిచ్చుచుండిరి. వీరిలో ప్రముఖులు వల్లూరు జమీందారు గారగు శ్రీ వెంకటనరసింహనాయుడు బహద్దూరు గారు,రెండవారు నూజివీడు శోభనాద్రి అప్పారాయణింగారి మనుమడు వేంకట రామయ్యప్పా రావుగారు. వీరుగాక మరికొందరు జమీందారులు కూడ 'క్లయింటు' లుగా నుండిరి. ఈ 'కోర్టు' లో పనిచేయుచున్నప్పుడు కొన్ని దినములు 'గవర్నమెంటు కోర్టు అఫవార్డు ప్లీడరు' గా కూడ నుండిరి. బొమ్మదేవర జమీందారులు గూడ వీరి 'క్లయింటు'లే. ఈ బొమ్మదేవర వారి ఆస్థాన గ్రామమయిన తోట్లవల్లూరులోని శ్రీ వేణుగోపాలస్వామికి నంకితముగా శ్రీరాములుగా రెన్నియో కృతులు, జావళీలు, పదములు,

స్వరజతులు,కృష్ణభక్తి పురస్సరముగా వ్రాసిరి. ఈ పదములు, జావళులు, కృతులు కొన్ని సంవత్సరముల క్రిందటివఱకు ఆ ప్రాంతమందలి వేశ్యలు పాడుచుండిరి.

ఈ పదములు ఆంధ్రదేశపు సరిహద్దులు గూడ దాటినవి. ఓంఢ్రదేశపు వారు 'వాక్కినట్టి' యను నృత్యమును చేయుదురు. ఆ నృత్యమును చేసిన తరువాత ఒకసారి బరంపురంలో శ్రీరాములుగారు వ్రాసిన పదములు పాడిరట. అంతేకాదు. దానిలోని 'తత్తరపడనేల తాళు తాళు రాసామి...' యన్న పదమును ఆనాటి గాయక శ్రేష్టుడు శ్రీరామానుజయ్యగారు పాడగా, శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము గారు విని 'కాసులపేర' ను ప్రహసనములో దానిని పొందుపఱచు కొనిరట. ఇందలి జావళులను నేటికిని సంగీత సభలందు విద్వాంసులు గానము చేయుదురు. ఆకాశవాణి విజయవాడ, హైదరాబాదు కేంద్రములవారు గూడ ఈ జావళీలను ప్రసారము చేయుచుందురు. శ్రీరాములుగారి మనుమరాలు శ్రీమతి వంగల వాణిబాయిగారు(ఆకాశవాణి ఢిల్లీ కేంద్ర 'మ్యూజిక్ ప్రొడ్యూసరు'గారు) చాల సభలలోనే గాక ఢిల్లీ కేంద్రము 'ఆకాశవాణి నిలయములలో ఒకటి రెండు పర్యాయములు పాడగా నచట నుండి ప్రసారమైనవి.

1886 లో శ్రీ సోమేశ్వరస్వామి ఆలయమునకు ధ్వజమెత్తించి యేటేట వైశాఖ పూర్ణిమకు కళ్యాణము జరుపుచు వచ్చిరి. అటుపిమ్మట 1889 లో ఏలూరులో నూతన గృహనిర్మాణము గావించిరి. అదియొక తోట మధ్యలో కాలువ గట్టున విశాలప్రదేశములో గలదు. అందొక పెద్ద మంచి నీటిబావి యుండుటచే మిక్కిలి ప్రసిద్ధికెక్కినది. ఇటీవల దానిని 'గాంధీ నేషనల్ స్కూలు' వారికి విక్రయించిరి.

1891 వ సంవత్సరములో క్షత్రియులగు శ్రీ కోక్కొండ హంవీర రామచంద్రరావుగారి పక్షమున సీతారామపుర స్వాధీనమునకై పాపమ్మరావు జమీందారుగారి మీద శ్రీరాములుగారు తమ ధనముతో వ్యాజ్యము వేసిరి. పాపమ్మరావుగారు 'ప్రీవీకౌన్సిలు' కు అప్పీలు చేసిరి. కాని పాపమ్మరావుగారి 'అప్పీలు' ను ఖర్చులతో గూడ త్రోసివేసిరి. ఈ వ్యాజ్యములోనే శ్రీరాములుగారికి సీతారామపుర అర్ధభాగము వచ్చినది. ఆ విషయమునే శ్రీరాములుగారు శ్రీదేవీ భాగవత ఆశ్వాసాంతగద్యలో 'శ్రీవీర ప్రతాప కోర్కొండ హంవీర రామచంద్ర

భూమీశ్వరదత్త గోదావరి మండల స్థిత సీతారామపురార్థభాగ పరిపాలనాధీన' అని వ్రాసికొనిరి. ఈ వ్యాజ్య కారణముగా మదరాసులో తీరికగా నున్నందున 'శాకుంతలము', 'రత్నావళి', 'ముద్రారాక్షసము', 'మంజరీమధుకరీయము', 'మహావీర చరిత్ర', 'మాలతీమాధవము', 'ఉత్తరరామచరిత్ర', 'కురగగౌరీశంకర నాటిక' రచించిరి. వీనిలో చివరిది స్వతంత్రము. మిగిలినవి యనువాదములు. అందులోను 'శకుంతలము','ముద్రారాక్షసము' అచ్చతెనుగున తెనిగించిరి. మంజరీ మధుకరీ యమును శ్రీకోరాడ రామచంద్రశాస్త్రిగారి శిష్యులైన శ్రీవావిలాల వాసుదేవ శాస్త్రిగారు వ్రాసియున్నారు. దేవీభాగవత పీఠికలో శ్రీశ్రీరామకవిగారు దీనిని హేవిళంబి సంవత్సరమున రచించి యుంటిమని వ్రాసిరి. అనగా వీరి యేబదియవ యేట 1896 ప్రాంతమున రచియింపబడి యుండవచ్చును. శ్రీవాసుదేవ శాస్త్రిగారు శ్రీరాములుగారి స్నేహితులు. అందువలన వీరికి శ్రీరాములుగారు మంజరీ మధుకరీయమును ఎప్పుడు వ్రాసిరో తెలిసి యుండవచ్చును. కావున రామచంద్ర శాస్త్రిగారు రచించిన నాటకమే ముందుగా రచియింపబడి యుండవచ్చును. రామచంద్రశాస్త్రిగారిది 1908వ సంవత్సరమున కోరాడ నాగేశ్వరశాస్త్రుల వారిచే బందరులో ముద్రింపబడి ప్రకటితమైనది. శ్రీరాములుగారి రచనలలో చివర ముద్రింపబడినది దేవీభాగవతము. అది 1907లో ప్రథమ ముద్రణ పొందినది. కావున శ్రీరాములుగారిది యంతకు ముందుగానే ముద్రింపబడి యుండవచ్చునని యూహింపవచ్చును.

శ్రీరాములుగారికి విద్యార్థులపైన మిగులప్రేమ. వారెందరికో ధన సహాయమును,అన్నదానమును చేసిరి. 1906వ సంవత్సరమున వీరు కార్యాంత రముపై మద్రాసు పోయిరి. అచ్చట నుండగా "నార్తరన్ ప్రోగ్రెసివ్ యూనియన్" (Northern Progressive Union) అను సంఘమువారి వార్షికోత్సవము జరిగినది. అది సాధారణముగా విశ్వ విద్యాలయ స్నాతకోత్సవము జరిగిన వెంటనే జరిగెడిది. ఆ సంఘమువారు ఆంధ్రభాషా విషయములను వారికి హృద్యములగు పద్యము లను గూర్చి చక్కని ఉపన్యాసము నిచ్చి వారినలరించిరి. 1887లో శ్రీ విక్టోరియా 'గోల్డెన్ జూబిలీ' యుత్సవములు జరిగినవి. ఆ సందర్భమున ఏలూరులోని యువసంఘమునకు నాధ్వర్యము వహించి ఉత్సవమును జయప్రదముగా నిర్వహించిరి.

ఆ సంవత్సరముననే శ్రీరాములుగారి నాలుగవకుమారుని వివాహము జరిపించిరి. ఆ సందర్భమున నా పట్టణమునగల తెల్లదొరలకు విందొసగిరి. ఆ కాలములో నిట్లు హిందువులు తెల్లవారికి విందొసగుట కానరాదు. ఇది వీరి సర్వమతసహనమునకు తార్కాణము. స్నేహమునకు కులవర్ణ భేదములు అడ్డుగోడలుగ నిలబడవనునదియును చెప్పినది యాచరణలో పెట్టి చూపవలయు ననునదియును వీరి గుణములుగ వెల్లడి యగుచున్నవి.

వీరు 1895లో జూలై నెలలో న్యాయవాదవృత్తిని విసర్జించిరి. అనగా 17 సంవత్సరములు నిరాఘాటముగ నీవృత్తి సాగించిరి. ఈ కాలములో వారు చేసిన సన్మానములకు,పొందిన సన్మానములకు లెక్కలేదు. అనేక శాస్త్రములలో నారితేరిన పండితులు వీరి దర్శనము చేసికొని వీరి పరిచయము సంపాదించి సన్మానము పొందుచుండిరి. పండితుల వలన ననేక శాస్త్రములలోని మర్మముల గ్రహించి, వీరు జ్ఞానాభివృద్ధి జేసికొనెడి వారు. తన వృత్తికి గూడ నావశ్యకమగు టకే ధర్మశాస్త్రమును క్షుణ్ణముగా పఠించిరి. శ్రీరాములుగారు కేవలము 'లా రిపోర్టు' లమీదనే యాధారపడక పూర్వస్మృతులను గూడ చదివి వానిమీద నాధారపడి చాల కేసులను నడిపిరి. ప్రతివాద భయంకరులైన శ్రీ కోమాండూరు వారివద్ద శాస్త్రధర్మమర్మములను శ్రీరాములుగారు గ్రహించిరి. 'క్లయింటు' గాని మరియేపని కలిగి వచ్చిన వారైనను గాని వారివద్దనుండి వారి మత సాంఘిక పద్ధతులను, వారి విద్యావిశేషములను శ్రద్ధతో తెలిసికొనెడివారు. శ్రావణమాసము లోను, దసరాదినములలోను, విద్వత్సన్మానములను చేయుచుండెడివారు. వారిచే సన్మానము పొందని పండితులానాడాంధ్రదేశమున లేరని చెప్పుట అతిశయోక్తి గాదు. వారిచే సన్మానితులైన కొందరు పండితులు– శ్రీగరికపాటి రామశాస్త్రుల వారు, శ్రీపరిమి శివయ్యశాస్త్రులుగారు, శ్రీపప్పుజగన్నాధశాస్త్రులుగారు, శ్రీపన్నాల రామబ్రహ్మశాస్త్రులుగారు, శ్రీనల్లాన్ చక్రవర్తులతిరువేంకటాచార్యులువారు, శ్రీ శోభనాద్ర్యాచార్యులవారు, మదరాసు నుండి వచ్చిన రామానుజయ్యగారు, శ్రీ అళహసింగరులను గాయకులు, శ్రీఅనంతశయనమను నొక భరతశాస్త్ర ప్రవీణుడు. శ్రీతిరుపతి వేంకటకవులు, హరికథాపితామహశ్రీఆదిభట్ల నారాయణదాసుగారు.

వీరు న్యాయవాదిగా నున్నప్పుడు వారి ధైర్యసాహసముల వ్యక్తపరచు రెండు సంఘటనలు జరిగినవి. మనవాళ్ళయ్య యను నొక 'సబుజడ్జీ' కలదు.

అతను లంచగొండి. వీరిపై లంచము నేరము మోపబడి క్రోలుదొరయను నొక 'కమీషనరు' చే విచారింపబడి పనినుండి తొలగింపబడి తరువాత పదునెనిమిది నెలల కఠినశిక్ష విధింపబడెను. అట్లే స్వామి నాథయ్యరు అనునొక మళయాళ 'సబుజడ్జీ' యుండెడివాడు. అతను గూడ లంచగొండియే కాక ధూర్తుడును. అతడు చేయు అవినీతిని సహింపలేక శ్రీరాములుగారును, గోటేటి వేంకట శివరావుగారును మరికొందరు పెద్ద మనుషులు కలిసి పై అధికారులకు తెలిపిరి. వీరిలో ముఖ్యులు శ్రీరాములుగారు. అప్పుడతనిని పనినుండి తొలగించిరి. శ్రీరాములుగారు అవినీతి పనులు చేసినవారి నిట్లు ధైర్యముగా పైవారికి చెప్పి తగిన శిక్ష కలుగునట్లు చేసిరి. ఇట్లుద్దండులై మహాప్రతిభాశాలురై పదిహేడు సంవత్సరములు న్యాయవాద వృత్తిని చేసి విరమించిరి.

శ్రీరాములుగారి విద్యాభిమానమును, ఔదార్యమును వ్యక్తము చేయు సంఘటన యొకటి కలదు. 1886 లో బసవరాల రామబ్రహ్మము గారను నొక యుపాధ్యాయుడు ఏలూరు మాధ్యమిక పాఠశాలలో పనిచేయుచు అన్యాయముగా వృత్తి నుండి తీసివేయబడెను. అతడు శ్రీరాములు గారి నాశ్రయింపగా శ్రీరాములు గారు వారికి గల యాంగ్లవిద్యా ప్రావీణ్యమును,విద్యాబోధన నైపుణ్యమును గుర్తించి 'హిందూ పేట్రియాటిక్' పాఠశాలను స్థాపించి వారిని ప్రధానోపాధ్యాయులుగా నియమించిరి. సంపన్న కుటుంబీకులు కూడ వారి పిల్లలను ఈ పాఠశాలకు పంపెడివారు.

అట్లే వీరు గాయకులను ప్రోత్సహించుటకు సంగీతపాఠశాల నెలకొల్పిరి. శ్రీమాన్ నల్లాన్‌చక్రవర్తుల తిరువేంకటాచార్యుల వారిని ఉపాధ్యాయులుగా నియమించిరి. శ్రీగబ్బిట యజ్ఞనారాయణగారను ఉత్తమ గాయకులీ పాఠశాలలోనే గానవిద్య నభ్యసించిరి. దేశములోని పలువురు గాయకుల నీపాఠశాల యాజమాన్యమున సన్మానము చేసిరి.

వీరి ధర్మశాస్త్ర వైదుష్యమును వెల్లడించు నొకటి రెండు సంఘటనలు కలవు. గుంటూరు సమీపమున వేంపాడులో గుంటూరు భానుమూర్తి యను నొక బ్రాహ్మణుడు కలడు. అతడొక కన్యను వివాహము చేసికొనెను. ఆ కన్య అక్కగారు వితంతువు. పునర్వివాహము చేసికొనినది. ఈ సంగతి యీయనకు

పెండ్లికాకముందు తెలియదు. ఆమె కాపురమునకు వచ్చిన తరువాత విషయము తెలిసి వైదీకులీయనను వెలివేసిరి. ఎటులైన ప్రాయశ్చిత్తము చేసికొని పునీతుడగుటకు కొందరి నాశ్రయించెను. వారు ఈతనికి ప్రాయశ్చిత్తకర్మ చేయింతుమనిరి. కాని పరిషద్దక్షిణ విషయములో వివాదము వచ్చినది. అందుల కాతడు శ్రీరాములు గారి నాశ్రయించెను. ఆ వైదీకుల దురాశను నిరసించి తానా ప్రాయశ్చిత్త కార్యమును చేయించెదననెను. ఇది తెలిసి వైదీకులందరు ఒక కట్టుగా నిలబడి నియోగులిండ్ల సాధారణ స్మార్త కర్మలకు రా నిరాకరించిరి. అప్పుడు శ్రీరాములు గారు మహాపండితుడును, షోడశకర్మాధికారియు నగు శ్రీఅవ్వా జగన్నాధ శాస్త్రిగారిని ఏలూరునకు సకుటుంబముగా పిలిపించి నిత్యనైమిత్తికములు జరుగునట్లు చేసిరి. తరువాత చాటపఱ్ఱు కాపురస్తులను ధర్మశాస్త్ర పారంగతులును వేదాధ్యయనపరులను అగు శ్రీగుండు సుబ్రహ్మణ్యచయునులు గారిని పిలిపించిరి. శ్రీరాములుగారి యాజ్ఞీకములో కొందరు 'క్లయింట్లు' ధన సహాయమున నా కర్మకాండ శ్రీమార్కండేయ స్వామి ఆలయములో ముగింపజేసిరి. శ్రీగుంటూరు భానుమూర్తిగారు భార్యాసమేతముగా అపోసనము వడ్డింపగా వరిషన్నమస్కారము చేయగ సుమారొక మూడు వందలమంది తృప్తిగా భోజనము చేసిరట. వెలి తీరినది గాని వైదిక,నియోగ కక్షలేర్పడినవి. ధర్మశాస్త్ర సభలు ఏర్పాటైనవి. శ్రీరాములుగారొక పక్షమును, శ్రీజంధ్యాల గౌరీనాధశాస్త్రి,బి.ఏ., బి.యల్ అను 'ఫస్టుగ్రేడ్ ప్లీడరు' గారు మరియొక పక్షమును వహించి ధర్మశాస్త్ర చర్చలు జరిపిరి. ఈ సభలో నాలుగు వేదములును, పదునెనిమిది స్మృతులను, వైదిక స్మార్తాచారములును, వైదిక కర్మతో సంబంధించిన మరి యితర గ్రంధములను క్షుణ్ణముగా చర్చింపబడెను. ఈ వాదముల నన్నిటిని క్రోడీకరించి శ్రీదాసు శ్రీరాములుగారు 'పతిత సంవర్గ ప్రాయశ్చిత్త విషయకోపన్యాసమ'ను అచ్చులో సుమారు డెబ్బది పుటలకు మించిన గ్రంధమును రెండు రాత్రులలో వ్రాసి ముగించిరి. వారి కార్యదీక్ష, మేధాశక్తి యట్టిది. తలమునగ 'కోర్టు' పనులున్నను రాత్రులు కూర్చుండి యేకదీక్షగా వ్రాసి ముగించిరి. ధర్మశాస్త్ర విషయమై నప్పటికిని గ్రంధము చదువుటకింపుగా నుండునట. ప్రస్తుతమిది యలభ్యము.

ఈ సమయములోనే శ్రీరాములుగారు 'ఆచారనిరుక్తి' 'దురాచార పిశాచ భంజని' యను రెండు ధర్మశాస్త్ర విషయక వ్యాసములు వ్రాసిరి. 'దురాచార

పిశాచభంజని’ బెజవాడ కన్యకాపరమేశ్వరీ గ్రంధాలయములో నున్నది. దీనిలో ఆచారములు రెండురకములని–వైదికములు, లౌకికములు. – అందును వైదికములు నాలురకములని, లౌకికములు పలుతెరగులని, యందు పదమూడు రకములుదహరించిరి. దీనికి వ్యాఖ్య కూడ వీరే వ్రాసి ఉప్పులూరి కనకయ్యగారి పేరుపెట్టిరి. అట్లే! ఆచార నిరుక్తికి గూడ వ్యాఖ్య వీరే వ్రాసి పప్పు జగన్నాధశాస్త్రుల వారి పేరు పెట్టిరి. అటుతరువాత ‘రండా ముండన ఖండన’ మను వేరొక వ్యాస మును వ్రాసిరి. వైధవ్యము ప్రాప్తించినవారికి ముండనము ధర్మశాస్త్ర విరుద్ధమని యట్టి యాచారము క్రూరమైనదనియు నిరూపించిరి. విగ్రహారాధన నామోదించుచు ‘విగ్రహారాధన తారావళి’ యను నొక చిన్న పొత్తమును గూడ వ్రాసిరి. ఒక పర్యాయము 1893–95 ప్రాంతములో వైశ్యులకు వేదోక్త కర్మలకు అధికారము లేదని బ్రాహ్మణులాకర్మలను వారికి జరిపించకుండిరి. దీనిని వైశ్యులు ప్రతిఘటించిరి. వైశ్యులు శ్రీరాములుగారి సహాయము కోరిరి. శ్రీరాములుగారు వారి పక్షమున వాదించి గెలిచిరి. ఈ విషయమైన వాదనలను, ధర్మశాస్త్ర విషయములను హైకోర్టు తీర్పులను క్రోడీకరించి ‘వైశ్యధర్మదీపిక’ యను పెద్ద గ్రంథమును శ్రీరాములు గారు రచించిరి. వీరు రాత్రులందు తమ పనులు ముగించుకొని యెనిమిది గంటలనుండి పదునొకండు గంటలవరకు ప్రతినిత్యము వ్రాయుచు 1893 ఏప్రియల్‌నెలలో ప్రారంభించి అక్టోబరు మాసాంతమున బరిసమాప్తి గావించి 1903లో ముద్రించిరి. ఆంధ్రదేశమందలి కోమటులు వైశ్యులు కారని, వారు ద్విజుల కర్మల కనర్హులని వాదించు వారికి సమాధానముగ ‘గౌతమసంహిత’,‘పరాశరస్మృతి’ మొదలగు శాస్త్రములను పరిశీలించి ప్రధమమున నెనిమిది సూత్రములజెప్పి, యా సూత్రముల యుక్తులతోను, శాస్త్ర ప్రమాణముల తోను వివరించిరి. గ్రంథమంతయు నైదుభాగములుగ జేసిరి. గ్రంథాంతమున ‘హైకోర్టు’ తీర్పుల నుదహరించిరి.[4]

ఈ గ్రంథమును చదివి సుప్రసిద్ధ వైశ్యప్రముఖులు శ్రీ ఆత్మూరి లక్ష్మి నరసింహ సోమయాజులు గారిట్లు వ్రాసిరి – ‘వైశ్య ధర్మదీపిక’ యను గ్రంథమును రచించి వైశ్యకులమునకు అపరిమితమయిన మేలు చేకూర్చినందుకై మిమ్ము ‘ఆచార్యుల’ని పిలుచుటకు మాకు అనుజ్ఞ యివ్వవలయును ..... ఇది అల్పజ్ఞులను కుయుక్తిపరులను నోరెత్తనీయదు...’ మీరు వ్రాసిన సూత్రములు స్వర్గలోకము

నుండి యూడిపడినట్లుగా కనపడుచున్నవి. వానిని నా యింటి గోడకు అతికించి అనుదినమును చూచుకొను చుండెదను”. దీనికి పీఠిక ఆంగ్లములోను, తెలుగునను వ్రాసిరి. సాధారణముగా వారి గ్రంథములన్నిటికి పీఠిక రెండు భాషలయందును వ్రాయుదురు. పీఠికలో రెండు సీసపద్యములు వ్రాసిరి. రెండు చరణములు ఉదహరింతును –

‘కోమటుల్ ద్విజులన్న గొమ్మ లొడ్డారించు బసవన్న దువ్వుదువ్వు బాజడోలు
కోమటుల్ ద్విజులన్న గుట్టుకొట్టి పైపెచ్చు బసవన్న యిదరావు భాయిచిపిక’

ఈ గ్రంథరచన చేసినందుకు వైశ్యులందరు ఘనముగా సన్మానించిరి. ఆనాడు ప్రతి వైశ్యుని యింట యీ గ్రంథముండెడిది.

ఇదే సందర్భమున అన్నశ్రాద్ధ, ఆమశ్రాద్ధ వివాద విచ్ఛేదనకై ‘శ్రాద్ధ సంశయ విచ్ఛేది’ యను నొక వ్యాసము వ్రాసిరి. ఈ వేదోక్త పురాణోక్త గాథా ఫలితముగా మచిలీపట్టణములోను, జగ్గయ్యపేటలోను అలజడులు చెలరేగినవి. ఈ సందర్భములో ముగ్గురు వైశ్యులపై దోపిడి (డెకాయిటీ) యభియోగము కల్పించిరి. ఈ కేసు ‘హైకోర్టు’ వరకు వెళ్ళినది. వీరిద్దరిని నిర్దోషులని విడుదల చేసిరి. ఈ యభియోగమునకు ముఖ్య తాంత్రికుడు కాలూరి నారాయణస్వామి నాయడను నొక పోలీసు (ఇన్‌స్పెక్టర్) అధికారి. ఈ మిధ్యాభియోగము మోపినవాని కిని ఈ యధికారికిని శిక్ష విధింపబడినది.

1890 ప్రాంతములో బళ్ళారిలో నున్న సరసవినోదిని సభవారు ధర్మవరము కృష్ణమాచార్యులవారి నాయకత్వమున క్రొత్తఫక్కీని మదరాసులో నాటకములాడుచుండిరి. ఆ సందర్భమున శ్రీరాములుగారు ‘జానకీపరిణయము’ అను నాటకమును, ‘మనోలక్ష్మీ విలాసము’ అను నింకొక నాటకమును పద్యగీతములలో నదేపద్ధతిని వ్రాసి రంగస్థలమున ప్రదర్శించిరి. ఈ “మనోలక్ష్మీ విలాసము” ప్రబోధచంద్రోదయమువలె నుండునట. ఇందులోని పాటలకు ఆనాటి గాయకప్రముఖులు శ్రీ కొండూరి నరసింహాచార్యులుగారి వంటివారు స్వరకల్పన చేసికొని పాడుకొని ఆనందించిరి.

శ్రీశ్రీరాములుగారు కళాప్రియులు. వారు ఏలూరులో నున్నంతకాలము వారియింట విద్యాగోష్ఠులు, సంగీతసభలు,సతతము జరుగుచుండెడివి. సంగీత

శాస్త్రమునందే గాక వీరికి భరతశాస్త్రమునందు ప్రావీణ్యము కలదు. స్వయముగా అభినయము పట్టి నేర్చి యుండిరి. 'అభినయదర్పణమ'ను నొక గ్రంథమును రచించిరి. వీరి యెదుట నాట్యము ప్రదర్శించుటకు ప్రవీణులైనవారు సహితము భయపడెడివారు. వారి దోషములను సరిదిద్ది స్వయముగా అభినయము పట్టి చూపించెడి వారు. వీరికి ముందుగ నమస్కరింపక యే నాట్యము ప్రారంభించెడి వారు కాదు. భరతశాస్త్రప్రవీణులైన చదలవాడ పిచ్చాయి, పినపాలభవాని, చెదలవాడ రాజరత్నము మున్నగు ఆనాటి ప్రముఖ వేశ్యలు శ్రీరాములుగారి యెదుట నభినయించి పేరొందిరి. వీరు వేశ్యామేళములకు విముఖులైనను ఈ శాస్త్రము నభివృద్ధిచేయుటకు దీనిని ప్రోత్సహించుటకు తన పిల్లల వివాహ సందర్భములందు వీరి నాట్య ప్రదర్శనల నేర్పాటు చేసి వారికి బహుమానము లిచ్చి గౌరవించిరి.

ఆనాడు సంగీత నాట్యములు రెండును వేశ్యల యధీనములో నుండెను. అందులకై సంసారస్త్రీలు వానిని నేర్చిన వేశ్యలతో సమానముగా నెంచెడివారు. ఈ దురభిప్రాయము తొలగించుటకు వీరెన్నో యుపన్యాసములలో నొక్కి వక్కాణించుటయే కాక వారి పుత్రిక శారదాంబగారికి సంగీతము నేర్పించిరి. వీణావాద్యమున ప్రవీణురాలని గావించిరి. శ్రీ ఈమని వెంకటరత్నముగారిని, శ్రీ కొండూరు నరసింహాచార్యులవారిని తన యింట నిల్పి వారి నీమెకు సంగీతము నేర్పుటకు గాను పోషించిరి. సంగీతమే కాదు సాహిత్యము నందును తన కుమార్తెను నిష్ణాతనుగా నొనర్చిరి. లోకనింద నెంతమాత్రము లక్ష్యము చేయలేదు. శ్రీమతి శారదాంబగారు మైసూరులో నొక గొప్ప సంగీతకచ్చేరి చేసిరి. దానిని గురించి యెవరేమన్నను వారి లక్ష్యమును విడువలేదు. ఈ విదుషీమణి పదునాలు సంవత్సరములనాడే 'మాధవశతకము'ను, 'నాగ్నజితీ పరిణయమ'ను నొక ప్రౌఢ ప్రబంధమును వ్రాసిరి. 'మాధవశతకము' నందు సంఘ సంస్కార విషయములైన పద్యములు గలవు. స్త్రీల దుస్థితిని వివరించి, వారి మూఢాచారముల నుండి విముక్తులజేసి యుద్ధరింపు మని మాధవుని వేడుచు చెప్పిన శతకమిది. పదునేడేడు చిరుతప్రాయముననే వీరు స్వర్గమలంకరించుటచే వీరి సువర్ణలేఖిని నుండి వెల్వడు ప్రబంధముల జూచు నదృష్టము నాంధ్రులు నోచరైరి.

శ్రీశ్రీరాములు గారి జ్యోతిశ్శాస్త్రపాండిత్యంగాంచి యబ్బురపడనివారు కల్ల. 1901లో సంవత్సరమునకు సరియగు ప్లవంగ సంవత్సరమున వచ్చిన అధికమాసము అషాడమా? శ్రావణమా? యను సందేహము కలిగెను.[5] ఆ సభకు పలువురు జ్యోతిశ్శాస్త్రపండితులు పలుదెసలనుండి వచ్చిరి. శ్రీశ్రీరాములు గారును,మైసూరు సంస్కృతోన్నత పాఠశాల యందలి సిద్ధాంతోపన్యాసకులు శ్రీ తాండవ కృష్ణమాచార్యులవారును, రాజమహేంద్రవరపు కాలేజీలో గణిత శాస్త్రోపన్యాసకులగు శ్రీ టాగట్ వెంకటసుబ్బారావుగారును న్యాయనిర్ణేతలుగా నుండిరి. సభలో తీవ్ర వాదోపవాదాలు జరిగినవి. చివరికి శ్రీశ్రీరాములుగారి తీర్మానము ప్రకారము శ్రావణమాస మధికమాసమని తీర్మానించిరి. వీరికీ శాస్త్ర విజ్ఞానము చిన్ననాడే యలవడినది. దానిని వారు దినదినాభివృద్ధి గావించుకొనిరి.

1901 సంవత్సరములో సీతారామపురంలో నుండగా నొక చంద్రగ్రహణము వచ్చినది. అప్పుడు ఇంటిముందర మల్లెపందిరి క్రింద మంచము వేసికొని శ్రీరాములుగారు, వారి కుమారుడు శ్రీ విష్ణురావుగారును పండుకొని యుండిరి. బాలుడగు శ్రీ విష్ణురావుగారు ఆ గ్రహణమును జూచి కుతూహలము కలిగి గ్రహణవిషయముల నెఱుంగగోరి వానిని గూర్చి ప్రశ్నించిరి. బాలుని కుతూహలమును గ్రహించి వానికి తేటతెల్లముగ తెలియునట్లు గ్రహణములు వాని చారలు మున్నగు పెక్కువిషయములు క్షుణ్ణముగా నొక గంటవరకట్లే యాశక్తి కరముగా చెప్పిరి. అంతతో నూరకుండక యప్పటికప్పుడే నోటితో గుణించి ముందు పదునేను సంవత్సరములో రాగల సూర్యచంద్ర గ్రహణములను తిధి వారములతో సహా చెప్పిరి. బాలుని యాశ్చర్యమునకు మేరలేదు. వారి ప్రతిభ యట్టిది.

1902 లో మయూరిని 'సూర్యశతకము' నాంధ్రీకరించిరి. 'చిలుకలకొలికి', 'ముద్దుగుమ్మ' శతకములను వ్రాసిరి. ముద్దుగుమ్మ శతకము ముద్రింప బడినట్లు శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావుగారు రచించిన ఆంధ్ర వాఙ్మయ సూచికలో ముద్రిత గ్రంధముల పట్టికలో 143వ పుటలో సూచింపబడినది. తరువాత తిరుపతి వెంకట కవులు కూడ తెలుగున 'కామాక్షి శతకమును', వీరు సంస్కృతమున 'కామాక్షి శతకమును' వ్రాసిరి. 'చక్కట్ల దండ'యను నచ్చ తెలుగు శతకమును

సీస పద్యములతో వ్రాసిరి. వీరి శతకములనే గాక 'శాకుంతలము', 'ముద్రారాక్షసమను' నాటికలను గూడ అచ్చతెనుగున రచించిరి. 'దేవీభాగవతము' వలె విశేషకీర్తి నార్జించిపెట్టినది వీరికి బ్రాహ్మణ ప్రశంసయను 'తెలుగువాడు'. ఇది ఆరు ముద్రణలు పొందియున్నది. ఈ గ్రంథము ముద్రణకు పూర్వమే యిందలి కొన్ని పద్యము లానాటి కవులందరి రసనాగ్రముల నాడుచుండెడివి. ఈనాటికిని కవిపేరు తెలియక పోయినను వానియందలి కొన్ని పద్యములే కొన్నియైనను ధారణచేసి యానందించు కవితారసికులు శతసహస్రములుగ తెలుగునాట కలరు. ఆంధ్ర బ్రాహ్మణులలోని పలుతెఱగుల వారి వర్ణనములు, ఆచారవ్యవహారములు, వేషభాషలు మున్నగునవి వర్ణింపబడినవి. యదార్థమును సహజ సుందరముగా జెప్పుటలోనే కవి ప్రతిభ వ్యక్తమగుచున్నది.

19వ శతాబ్ది ఉత్తరార్థమున భారతదేశచరిత్ర యొక విశిష్టమైన మలుపు తిరిగినది. రాజకీయముగాను, సాంఘికముగాను గొప్ప యలజడులు ప్రారంభ మైనవి. విక్టోరియారాణి పరిపాలన గూర్చి 'డైమండు జూబిలీ'లో నంతగ ప్రశంసించిన కవులందరు పరాయిపాలన వద్దు స్వాతంత్ర్యము కావలెనని స్వాతంత్ర్యాలాపముల నొనర్చుట ప్రారంభించిరి. సంఘములోని దురాచారము లన్నిటిని దుయ్యబట్టనారంభించిరి. ఏ గద్దె చూచిన యే రచ్చ చూచిన రాజకీయో పన్యాసములతోనో, సాంఘికోపన్యాసములతోనో, కిటకిట లాడుచుండెడిది. ఆనాటి వరకు స్త్రీ విద్య యన్న చిడిముడి పడువారు, విధవా వివాహములన్న చెవులలో వ్రేళ్ళు పెట్టుకొనెడి వారు. వారే నేడు గద్దెక్కి సంఘసంస్కర్తలై ఉపన్యాసములిచ్చుట ప్రారంభించిన దినములవి.

1895లో శ్రీరాములుగారు న్యాయవాద వృత్తిని విడిచిపెట్టిన పిమ్మట రాజకీయ సాంఘిక విషయములకై పరిశ్రమించుచుండిరి.

1895-96 'నేషనల్ కాంగ్రెసు' సహకారులుగ గోదావరి జిల్లా రాజకీయ సాంఘిక సభలు రాజమండ్రిలో జరిగినప్పుడు ఆ రెండు సభలలో వీరు పాల్గొనిరి. వీరి గంభీరోపన్యాసమునకు సభవారు చకితులైరి.

1905-6 సంవత్సరములలో బంగాళదేశమున చెలరేగిన 'స్వదేశీ' యను రాజకీయోద్యమ ప్రచారకులుగా శ్రీ బిపిన్‌చంద్రపాలుగారు ఆంధ్ర దేశ పర్యటన

చేయుచు బెజవాడ వచ్చిరి. ఆ ఉద్యమమును ప్రభుత్వము వారు అణగద్రొక్క వలెనని మిక్కిలి పట్టుదల వహించియుండిరి. శ్రీబిపిన్ చంద్రపాలుగారు ఉపన్యసించుసభకు అధ్యక్షులుగా నుండుట కందరు వెనుదీయుచుండిరి. అప్పుడు సభలో శ్రీరాములుగారుండుట తటస్థించినది. వారిని జూచి కొందరు యువకులు ఉత్సాహముతో వారికడకు పోయి యధ్యక్షులుగా నుండ ప్రాధేయపడిరి. వారి యభ్యర్ధన నంగీకరించి యధ్యక్షులుగా నుండి సభను జయప్రదముగా నడిపిరి. వారి యధ్యక్షోపన్యాసమున కందరు ముగ్ధులైరి. రక్షణశాఖ వారెవరిని నిర్బందము లోనికి తీసికొనలేదు. సభ జయప్రదముగ ముగిసినది.

శ్రీరాములుగారెన్నో సాంఘికసభలలో గూడ పాల్గొనిరి. 1909లో ఆరవ కుమారుని వివాహసందర్భముగా మైసూరునకు పోయిరి. అప్పుడు పురజనుల కోరికపై రంగాచారి హాలులో గంభీరోపన్యాసమిచ్చి మెప్పువడసిరి.

జనసామాన్యమున, అందున పల్లెటూరివారు మెచ్చునట్లుపన్యసించు ప్రజ్ఞ వీరికున్నట్లు ఇతరులకు లేదు. వీరు ముఖ్యముగా స్త్రీవిద్యను గూర్చి ఉపన్యసించెడి వారు. వీరి యుపన్యాసముల ఫలితముగా గురజ, అంగలూరు మొదలగు పల్లెటూళ్ళలో బాలికా పాఠశాలలు నెలకొల్పబడినవి. గ్రామములలో 'నిశానిదారు' లుండరాదని వీరి అభిప్రాయము. త్రాగుడు, జూదము మొదలగు 'దురలవాట్ల' ను రూపుమాపుటకు ప్రజలలో కీర్తనల రూపమున, హరికథారూపమున రచించి పల్లెటూళ్ళ సభలలో వీరుపన్యసించి బోధించెడివారు. వీరి బోధించినది వారి మనములందు గాఢముగా నాటుకొనెడిది. అల్లూరులో 'అలుగులమ్మ' యను గ్రామదేవత కలదు. దానికా వూరిగొల్లలు పశుబలులొసంగెడివారు. శ్రీరాములు గారి బోధనాఫలితముగా నావూరి గొల్లవారు నేటికిని శాకాహారులుగా నుండి గ్రామదేవత కొలువులప్పుడు కొబ్బరికాయలు,వడపప్పు మాత్రమే నైవేద్యము పెట్టి ఆ చల్లనితల్లి దీవెనలంది చల్లగా నున్నారు. ఈ గ్రామపెద్దలు వారి బిడ్డలకు ఆడ మగ విచక్షణలేక అందరికి చదువులు చెప్పించుచున్నారు. ఇప్పుడా వూరి సంతతివారు పెద్ద పెద్ద చదువులు చదివి ప్రభుత్వోద్యోగములు చేయుచున్నారు. శ్రీరాములుగారి నెరిగిన యాదవప్రముఖులలో నొకరగు శ్రీభట్రాజు సోమేశ్వర రావుగారు 'శ్రీరాములుగారి తేజస్సు–అది మాకు సంక్రమించినది. ఈ వూరి

వారి కందరకు భూవసతి, గృహవసతిని కల్పించిరి. ఈ అగ్రహారమునందలి వీధులు, బాటలు ఒక పథకము ప్రకారము తీర్చి దిద్దబడినవి. ఇట్లు ఒక పద్ధతిగ (Planned) నున్న అగ్రహారమింకొకటి లేదు'అని చెప్పిరి. ఆవూరి నానుకొని ప్రవహించు కాలువ దాటుటకు బల్లకట్టులేదని యావూరివారు చెప్పగా వారి కుమారులు కేశవరావుగారిని బెజవాడకు 'సర్కారు' వారి దగ్గరకు పంపి ఆనాటి సాయంకాలమునకు బల్లకట్టు వచ్చు ఏర్పాటు చేసిరి. పితాపుత్రుల ప్రాభవ మట్టిది. ఆ వూరి గ్రామస్థులను తల్లిదండ్రులగు కనకయ్యగారు కామమ్మగారు ఆదరముగ చూచినట్లు శ్రీరాములుగారు, జానకమ్మగారట్లు వారిని స్వంత బిడ్డలట్లు ప్రేమాదరములతో జూచుకొనెడివారు.

ఆ గ్రామముననే కాదు ఆ చుట్టుప్రక్కలందరి ప్రజల సౌకర్యములకును పాటుపడిరి. ముఖ్యముగా వారి మూఢాచారములు తొలగించిరి. 1900 వ సంవత్సరములో విజయనగరమున సాంఘికవిషయములను హరికథా రూపమున నుపన్యసించిరి. ఎచ్చటి విజయనగరము: ఎచ్చటి విజయవాడ, వారి కార్యసాధనకు దూరము, కాలము గూడ నడ్డురాలేదు. వాటినధిగమించిరి.

ఆనాడు శ్రీకందుకూరి వీరేశలింగం పంతులుగారి విధవా వివాహోద్యమ మును మొదట ప్రతిఘటించుచు వచ్చిరి. తరువాత నా యుద్యమా దర్శముల నాకళింపు జేసికొని యా యుద్యమవ్యాప్తికి శ్రీ వీరేశలింగముగారికి చేయూత నొసంగిరి.

1899 మే నెలలో గోదావరీ రాజకీయ సాంఘిక సభలు ఏలూరులో జరిగినవి. శ్రీ రెంటాల వెంకట సుబ్బారావుగారు,శ్రీకందుకూరి వీరేశలింగం పంతులుగారు అధ్యక్షత వహించిరి.[6] శ్రీ శ్రీరాములుగారుపన్యసించిరి. ముఖ్యముగా శ్రీరాములుగారి ఆధ్వర్యబలము వలన ఆ సభలు జయప్రదముగా జరిగినవి. ఈ సభకు శ్రీరాములుగారి భార్య శ్రీమతి జానకమ్మగారు వచ్చిరి. ఆ కాలములో స్త్రీలు సభలకు వచ్చుట హిందువులలో లేదు. ఇందులకు శ్రీ వీరేశ లింగం పంతులుగారు శ్రీరాములుగారిని వారి పత్నిని మిక్కిలి శ్లాఘించిరి.

1898 వ సంవత్సరమున గుంటూరు జిల్లా సభలు జరిగెను. రెండు సభలకు శ్రీ రఘుపతి వెంకటరత్నం గారు అధ్యక్షులు. ఈ సభలలో శ్రీరాములు

గారొనర్చిన ఉపన్యాసముల గూర్చి శ్రీరాయసం వెంకట శివుడుగారిట్లు వ్రాసిరని శ్రీ విష్ణురావుగారు శ్రీరాములుగారి జీవితమను గ్రంథమున వ్రాసిరి. – 'ఆకాలమున గుంటూరు వాస్తవ్యులు, సంఘసంస్కరణలకు విముఖులుగా నుండుట యెరిగి సంస్కరణ సభ జయప్రదముగ జరుగుటకు శ్రీరాములుగారచ్చట నుండుట అత్యావవ్యకమని యెంచి నేను మే 20వ తేదీన వారిని గైకొని గుంటూరు బోయితిని. 21వ తేదీన జరిగిన సాంఘిక నిర్ధారణ సభలో వితంతు వివాహము కార్యప్రణాళికనుండి యెత్తి వేయటానికి గుంటూరు వాస్తవ్యులు పట్టుపట్టిరి. వీరి పంతము నెగ్గకపోవటము వలన మధ్యాహ్న ప్రధానసభలో అడ్డంకులు కల్పించుటకు నిశ్చయించుకొనిరి. ఆ మధ్యాహ్నము అతి బాల్య వివాహ నిరసన తీర్మానమున అనేక సవరణలు ప్రతిపాదించబడెను. ఎన్నో సవరణలు తెచ్చి నవ్వులాటలోనికి దింపిరి. అప్పుడు మా ప్రార్థనముమీద శ్రీరాములు పంతులుగారు వేదికమీదికెక్కిరి. యుక్తులు, శ్లోకములు,శాస్త్రములు,వచనములు వారి పెదవుల నుండి ప్రవాహ తరంగమువలె దొరలజొచ్చెను. అతి బాల్య వివాహములు కావలెననువారు మతద్రోహులు,శాస్త్రద్రోహులు,దేశద్రోహులు అని తుదకాయన గంభీరోపన్యాసము ముగించునప్పటికీ సభలోని కల్లోలములు మటుమాయము లయ్యెను. ఆయన తీవ్రవాదము నెదిరింపలేక యుబుసుపోకకై సవరణలు తెచ్చిన పండితమ్మన్యులు సభలో నుండి మెల్లమెల్లగా పలాయనము చిత్తగించిరి. మొదట ఎందరికో యసమ్మతములైన తీర్మానము లప్పుడు సభలో నేకగ్రీవముగా నామోదింపబడెను. శ్రీరాములుగారికిని, సంఘసంస్కరణపక్షము వారి కానాడు పరిపూర్ణవిజయము చేకూరెను'. ఇంకను శ్రీరాములుగారి యుపన్యాసధోరణిని గూర్చి వారిట్లు వ్రాసిరి. – 'తాము చెప్పిన యంశములు జనసామాన్యమునకు నచ్చుటకై ఒక్కొక్కప్పుడు వారు తమ యుపన్యాసములో దరువులు, కీర్తనలు చొప్పించుచుండెడివారు. ఒక మండల సభలో శ్రీరాములుగారు చేసిన ఉపన్యాస సందర్భమున గానవచ్చిన వాదనాపటిమ హాస్యరౌద్రములతో గూడిన వారి వాగ్ధోరణిని నేనెన్నడును మరువజాలను'. 1902 లో జరిగిన నాల్గవ కృష్ణామండల సంఘసంస్కరణల సభగూర్చి 1902 జూన్ 15వ తేది కృష్ణాపత్రికలో నిట్లు కలదు– 'ఈనెల ఏడవతేదీన నాల్గవ కృష్ణా మండల సంఘసంస్కరణసభ ఉయ్యూరు గ్రామమున బ్రహ్మశ్రీ పండిత దాసు శ్రీరాములు పంతులుగారి యాధిపత్యము

క్రింద జయప్రదముగా జరిగెనని వ్రాయుటకు మిక్కిలి సంతసించుచున్నాము. మ।రా।శ్రీ వల్లూరు చినజమీందారులగు శ్రీ రాజా బొమ్మదేవర శ్రీభాష్యకార్ల నాయుడు బహుద్దరు,గంజాం వెంకటరత్నం పంతులుగారు,కొండావెంకటప్పయ్య పంతులు,బి.ఏ.,బి.యల్.,దాసు మాధవరావు పంతులు,బి.ఏ.,బి.యల్.,ఊ.మల్లి ఖార్జునరావు పంతులు,బి.ఏ., .... చాలమంది రచయితలును, ఇంకననేక జనమును సభనలంకరించి యుండిరి. అగ్రాసనాధిపతిగారు కరతాళములు మ్రోవ లేచి మఠాధిపతుల దుస్థితి, శాఖాబేధములు,నౌకరియింట నౌకరు భోజనము చేయకుండుట, స్త్రీవిద్యాభివృద్ధి, అతి బాల్యవివాహములు, వృద్ధవివాహములు, కన్యాశుల్కము నిరుత్సాహపరచుట, వివాహపు ఖర్చులు తగ్గించుట, సముద్ర యానము చేయుట,నగలకు విస్తారధనము నియోగింపకుండుట, బాలవితంతు వివాహములను నిరుత్సాహపరచకుండుట,ఈవిషయములను గురించి శాస్త్రసమ్మతముగను,ఆహ్లాదకరముగను నుపన్యసించిన తరువాత నపుడు కొందరు సంస్కారద్వేషులు, వారు విద్యావివేకాదులు కలిగియున్నను అగ్రాసనాధిపతి గారి యుపన్యాసమున కడ్డమువచ్చుచు బలుమారు నాటంకములు కలుగజేయుటయే గాక మరికొందరిని ప్రోత్సాహపరిచి సభా కట్టుదిట్టములకు భిన్నముగా నడుచుటచే నీ సభను గూర్చి భయపడితిమిగాని యగ్రాసనాధిపతి గారి ధైర్యసాహస శాంతగుణాదుల వలనను,విశేషపాండిత్యము వలనను మా భయమును పోగొట్టుటయే గాక యల్లరుల నన్నిటిని నణచివేసి సంస్కారధ్వజమును స్థాపించిరి.[7] ఈరోజులలోనే కృష్ణాపత్రికలో వారు పశువులకు విత్తుకొట్టుట (Castiasm) గూర్చి, సహకార వ్యవసాయము (Co-operative Farming) గూర్చి, వ్రాసిరి.

1899 వ సంవత్సరము ఉత్తరార్థమున నైజాము రాష్ట్రములో వరంగల్లు జిల్లాలో కొన్ని మత విషయ వివాదములు వచ్చి వీరి నాహ్వానించగా పోయిరి. ఆ తరుణమున నక్కడే కొన్ని మాసములుండిరి. అచ్చట మతవిషయములను పరిష్కరించుటయే గాక సాంఘిక విషయముననే శ్రీ పింగళి వెంకటరామారెడ్డి గారు మొదలగు ఆ ప్రాంతపు నాయకుల కొందరిని దర్శించిరి. వారిచే సన్మానముల బొందిరి. వారు నైజాములో నుండగా వారి కుమార్తె శారదాంబగారు తన పందొమ్మిదవయేట ప్రసవమై 26-12-1899 న చనిపోయిరి.

కుమార్తె మరణమును ధైర్యముతో భరించినను ప్రాపంచిక విషయములందు విముఖులైరి. ఆరోగ్యము సన్నగిల్లినది. ఈ సమయముననే 'భృంగరాజ మహిమ'యను చిన్న పొత్తమును వ్రాసిరి. వీరికి పుత్రికా వియోగము ఒక మహత్కార్యప్రేరేపణకే భగవంతుడు కల్పించెనేమో! దైవప్రేరణతోను, భార్య ప్రేరణతోను ఒక పురాణగ్రంథమును రచియించి చిరకీర్తి కాంక్షించి 'శ్రీదేవీభాగవతము' నాంధ్రీకరించిరి.[8] వీరీ బృహద్గ్రంథమును అయిదు మాసములలో తెనిగించిరి. వీరి అశుకవితాధార యట్టిది. దేవీభాగవతానువాదములో ప్రప్రథమమున ప్రచురింపబడినది వీరి దేవీ భాగవతమే. వీరి దేవీభాగవతము యొక్క రెండవ ముద్రణమునకు శ్రీ చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారు రచియించిన పీఠికలో దాని ప్రాశస్త్యము నుగ్గడించిరి. 1907లో మొదటి ప్రచురణము, 1928 లో రెండవ ప్రచురణము, మూడవ ముద్రణ 1978లోను జరిగినవి. ఇది వీరి తుది రచనయైనను మేలి రచన. వీరి రచనలన్నిటిలో నిది 'కలికితురాయి' వంటిది. దీని యందు వీరి పాండిత్యము గూడ పండబారినది. వీరి యారోగ్యము సన్నగిల్లినను దీనిని పూర్తిచేసి ముద్రించి ప్రచురించి చూడవలెనను తలంపుతో చాల తొందరగా ముగించిరి. అదియునుగాక వీరు దీనిని ప్రారంభించినప్పుడు శ్రీములుగు పాపయారాధ్యులు రచించినట్లుగాని, శ్రీ తిరుపతి వేంకటకవులు తెనిగించుట కారంభించిన సంగతికాని తెలియదు. వారికి విషయము తెలిసిన తరువాత తొందలో ముగించి వారందరి రచనలకన్న ముందు ప్రచురించవలెనన్న పట్టుదలతో వ్రాసిరి. ఏలూరులోని వారి మేడ 'వరండా'లో లేఖకులైన శిష్యుల నిరువురిని చెరియొక చివరన నుంచి ఈ చివరకు వచ్చి యీశిష్యున కొకపద్యము, ఆ చివరికి వచ్చి యా లేఖకుడైన శిష్యున కింకొక పద్యము చెప్పుచూ నైదుమాసములలో ముగించిరని వ్యాసకర్త తండ్రిగారు శ్రీదాసు పద్మనాభరావు గారు తెల్పిరి. దాని ముద్రణ గూడ మూడు ముద్రణాలయములలో జరిగినదట. చివరకిది ముచ్చటగా 1907లో ముద్రింపబడినది. దానిని చూచుకొని సంతృప్తి చెందిరి. 1908 మే 16న వీరికీర్తి దిగంతములబరచి వారు దివంగుతులైరి.

వారిచే రచింపబడిన 'మహావీరచరిత్ర', 'మాలతీమాధవీయము', 'శాకుంతల', 'అభినవగద్యప్రబంధము', 'శ్రీదేవీభాగవతము','భృంగరాజ మహిమ','తెలుగునాడు', 'వైశ్యధర్మదీపిక',వీరికుమారులు శ్రీనారాయణరావుగారిచే

ప్రారంభింపబడి వారిచే పరిసమాప్తి గావింపబడిన 'సంగీత రసతరంగిణి' యను బుద్ధనాటకము 'బ్రిటీష్ మ్యూజియము లైబ్రరీ'లో గలవు.[9] ఈ బుద్ధనాటకము ఆంగ్లరచయిత శ్రీ ఎడ్విన్ ఆర్నాల్డుగారిచే రచియింపబడిన 'లైట్ ఆఫ్ ఏసియా' ననుసరించి ఏడంకముల నాటకముగ రచియింపబడినదని పైన పేర్కొనబడిన గ్రంథాలయ పట్టికలో చెప్పబడినది.[10]

మద్రాసు రాష్ట్రమును, సమీప రాష్ట్రముల విజ్ఞాన సర్వస్వము (Encyclopaedia of the Madras presidency and adjecent states) [11](1920–21) నందు శ్రీదాసు శ్రీరాములుగారిని గూర్చి గొప్పగ వ్రాయబడినది. వీరు గొప్ప వక్తలని, సమర్థరచయితలని, తర్కవేత్తలని, మిక్కిలి ప్రశంసింపబడిరి.

శ్రీరాములుగారిని తమ బాల్యమునందు కొంచెముగ నెఱింగిన రాజమహేంద్రవాస్తవ్యులు శ్రీ దామెర్ల వెంకట్రావుగారు, క్రొవ్విడి లింగరాజు గారు, బెజవాడవాస్తవ్యులు శ్రీదిగవల్లి శివరావుగారు, ఏలూరు వాస్తవ్యులైన మల్లయ్య శాస్త్రిగారు శ్రీరాములు గారిని గూర్చి మిక్కిలి ప్రశంస నీయమైన వాక్యముల బల్కిరి. శ్రీవడ్డాది సుబ్బారాయుడు గారింట పండితసమావేశములందు వీరు ప్రాముఖ్యము వహించుట, రాజమహేంద్రవరమందలి కళాశాల యందు ఉపన్యసించుటమొదలుగా గల విషయములెన్నిటినో వివరించి యవి యన్నియు నిన్న మొన్న జరిగినట్లున్నవని వర్ణించిరి. ఇట్టి బహుముఖప్రజ్ఞాశాలి కోటికొకరేని యుండుటరుదు.

## అధోజ్ఞాపికలు

1. శ్రీదేవీభాగవతము – ద్వితీయముద్రణము , 1923, పీఠిక. పు. 39.
2. దాసువారి జీవితచరిత్ర (లిఖితప్రతి), దాసు విష్ణురావుగారు, పు. 16
3. కురంగగౌరీ శంకరనాటిక, పు. 5.
4. (వైశ్యధర్మదీపిక – పీఠిక. పు. 4.)
5. 'కళావతి – సంపాదకులు శ్రీశ్రీపాదా కృష్ణశాస్త్రి గారు, సంపు.3,ఆగష్టు, 1901, నెం.8
6. స్వీయచరిత్రము–శ్రీకందుకూరి వీరేశలింగము పంతులుగారు, పు.82.

7. 1902 జూన్ 7వ తేదీన జరిగిన సభావృత్తాంతములు 'జనానా' పత్రిక సంపు.9, సంచిక.2. 1902 జూన్ 15 వ తేది యందును వివరింప బడినవి.

8. శ్రీదేవీ భాగవతము - ద్వితీయ ముద్రణము. పు.6.

9. *A catalogue of the Telugu books in the library of the British Museum-Andhra University, p.227.*

10. *Ibid.p.136.*

11. *Encyclopaedia of the Madras presidency and the adjecent states (1920-21)-Ed.by V.L.Sastri,B.A.,M.R.A.S.- Published by the Oriental Encylopeadia Publishing Company Cocanada and Madras. P. 523.*



## మహాకవి దాసు శ్రీరాములుగారి జాతకచక్రము

జననము 1846, ఏప్రియల్ 8వ తేదీ - పరాభవ నామ సంవత్సర చైత్ర శుద్ధ 12 బుధవారం - సాయంకాలం వేళలో ద్వాదశి $5^0$ పుబ్బ రెండవ పాదం - పుబ్బ పూర్తి మరునాడు 0-50 వరకు.

| ర,బు | కే,గు | కు | |
|---|---|---|---|
| శు | రాశి | | |
| శ | | | చం,ల |
| | | రా | |

# 2. కవితాసుమము

## (i) కవితాశిల్పము

### రసము :

కవి విశ్వకర్మ వంటి దేవతాశిల్పి. అపూర్వమైన సుందరశిల్పమును రూపొందించదలచిన శిల్పి ఆ శిల్పరూపమును మనసున భావించుకొని తన రససిద్ధ హృదయమున హత్తించుకొని తాను భావించిన రూపమును మలచును. అట్టి శిల్పము ఆ శిల్పి యొక్క భావనాశక్తిని వెలార్చును.

'యాదృశీ భావనాయస్యసిద్ధిర్భవతి తాదృశీ'

ఏ విధమగు భావము కలవానికి ఆ విధమగు రససిద్ధి కలుగును. కావున శిల్పికి భావనాశక్తి ప్రధానము. రససిద్ధుడగు శిల్పి మలచిన శిల్పము జగన్మోహనమై రమణీయమై యొప్పును.

అట్లే నవనవోన్మేషశాలిని యగు ప్రతిభావంతుడును, భావకుడును అగుకవి మలచిన కవితాశిల్పము భువనైకమోహనమై సాక్షాత్కరించును. ఆ కళా వికాసమున కవసరమైన రమణీయ శబ్దార్థములతోను, అనుప్రాసాది శబ్దాలంకారములతోను, రీతులు,వృత్తులు,శయ్యాపాకాది నానావిధ కావ్య సౌందర్య హేతుభూతములైన శిల్పసామాగ్రితోను కవి తన భావములను మలచి రూపసాక్షాత్కారము కలిగించును. మనోజ్ఞమైన కవితాశిల్పమునకీ సామాగ్రియంతయు పుష్కలముగ నుండవలెను. ప్రతిభావంతుడైన శ్రీదాసు శ్రీరాములుగారి కవితాశిల్పము 'జగజ్జన మోహనైకవిద్యా పరతంత్రయై లలితయై దర్శనీయమై ' యుండును. వీరు శ్రీ దేవీభాగవతము వంటి బృహద్గ్రంథము మొదలు 'తెలుగునాడు' వంటి అల్ప పరిమితిగల గ్రంథము వరకు వివిధ ప్రక్రియలు కలిగిన కావ్యముల నెన్నిటినో యుత్పన్నము చేసియున్నను అన్నిట వీరి శిల్పవైదగ్ధ్యము ఒక్క తీరుగనే దర్శనీయ మగుచున్నది.

రసెనైవ సర్వం జీవతి కావ్యమ్<br>నహి రసశూన్యం కించిదస్తి

రస ఏవ వస్తుతః ఆత్మా
వస్త్వలంకార ధ్వనీతు సర్వదారసం ప్రతిపర్యవస్యేతే

రసము చేతనే కావ్యము సర్వము జీవించును. రససూన్యమగు కావ్యము ఉండదు. రసమే కావ్యమునకు ఆత్మ. వస్తువు, అలంకారములు, ధ్వనులు సర్వదా రసపర్యవసాయిలే యగునని ఆనందవర్ధనుడు చెప్పెను.

'నహి రసాదృతి కశ్చిదవ్యర్థః ప్రవర్తతే '

రసహీనమై ఏ యర్థమును ప్రవర్తింపదని భరతముని రసప్రాధాన్యము నుగ్గడించెను. దృశ్యకావ్యములందు గాని శ్రవ్యకావ్యములందుగాని రసమునకీ ప్రాధాన్యము గలదు. వర్ణనలు రీతులు గుణములు పాకములు అలంకారములు అన్నియు రసపోషకములై యుండవలెనని యాలంకారికులు చెప్పిరి. తదను గుణముననే శ్రీరాములుగారు దేవీభాగవతమందలి బుధోత్పత్తి, ధ్రువసింధూ పాఖ్యానము,మహిషాసురవధ,వృత్రాసురచరిత్ర,నారద వృత్తాంతము,సుకన్య చరిత్ర, హరిశ్చంద్రోపాఖ్యానము,తులసీదేవి వృత్తాంతము మొదలైన ఘట్టములను ప్రబంధరీతిని రసోచితవర్ణనలతో కడు మనోజ్ఞముగ రచించిరి.

దేవి భక్తుల కోర్కెలీడేర్ప వివిధ సమయములందు వివిధరూపముల ధరించినది. జగమేకార్ణవమై యుండునెడ నందున్న వటపత్రశాయికి మధుకైటభులకు నిర్గుణసాకారయై సాక్షాత్కరించి 'సర్వం ఖలిద్వమేవాహంనాన్య దస్తి సనాతనమ్' అను పలుకులు మాత్రము వినబడినవి. 'సర్వమే నితరము లేదు సత్యమిద్ది'(1–568) యను వాక్యమును మధుకైటభులు మంత్రముగ గ్రహించి తపస్సుచేయ దేవి నిరాకారయై, ఖేచరియై యుండి వారికి స్వేచ్ఛా మరణము ప్రసాదించినది. మధుకైటభులతో యుద్ధము చేసి యలసినపుడు విష్ణువు దేవిని స్మరించి 'చదలన్ వర్తించు' నిరాకారయగు దేవిని దర్శించెను. నిరాకార క్రమక్రమముగ సాకారముగ నెట్లు పరిణితి నొందెనో చమత్కారముగ వర్ణించిరి.

ముఖము ఖము మెఱుపునిందుని
సఖము సఖము కౌనుమిగుల సన్నము చెలికిన్
సఖమెన ఖగసంతతికిన్
సుఖర ముఖర శుకరవములు సుందరిపలుకుల్. 1–315

చదలన్ వర్తించు దేవి తటిల్లత వలె భాసించినది. కావున ముఖము ఖము మెఱపు అనిరి. ఆ మెఱుపులో దేవి ముఖము స్పష్టముగ గన్పట్టి 'ఇందు నిసఖము సఖమై' యున్నదని తెలిసినది. ఉడువీధినున్న తారకలు దేవి నఖపంక్తికి దీప్తి గావించినవి. సుందరిపలుకులు సుఖర ముఖరశుకరవములవలె విన వచ్చినవి. అపుడే చంద్రుడు కూడ పైకి వచ్చెను. అపుడామె బంగారపు రుచిరాంగములు (1–315)ఇంకను స్పష్టముగ గన్పట్టినవి. నిందాస్పదుడనుచు జవితి చందురుని క్రిందుజేసినది దేవియొక్క నిటల సౌందర్యము (1–316) . ఆమె పాదముల జూచియో చందురిని జూచియో పంకటమందము మందమై నదట. మూర్ఖులైన మధుకైటభులు కామదృష్టితో జూచుటచే లేవళులు, అక్షులు, కుచములు,కన్పట్టినవి (1–318).కావుననే వారికి దేవియొక్క కుటిలదృక్పాతము కలిగినది. విష్ణువునకు 'అమృతధారాసేవనంబు' కలిగినది. శబ్దశక్తి అర్థవ్యక్తితో బాటు భావనా కౌశలము గూడ ఉప్పరము నంటినది. ఇట్లు 'శృంగారరసాధి దేవతయైన జగన్మోహిని వర్ణన శృంగార రస పరిపోషకముగ నున్నది.

తరువాత సుద్యుమ్నుడు నవాక్షరంబైన దేవీ మంత్రము అనగా చండీ మంత్రంబు జపింప దేవిచండీరూపమున నిట్లు సాక్షాత్కరించినది.

అరచెనా భయదఘోరారావమున ధరా
      ధర గుహావళులు బ్రద్దలయి కూల
తెరచెనా నోరు వార్ధినదీగిరులతోడ
      భూగోళమొక చల్దిముద్దగాఁగ
ఉరికెనా యమితశౌర్యోదీర్ణపద్ధతి
      సప్త నీరధు లొక్కచంగుగాఁగ
కొరికెనా కకుభాంత కుంభికుంభాంతర
      పిశితంబు లొక కోఱఁబెల్లగిలఁగ

దేజరిల్లెడి సింగవు తేజినెక్కి
మధుర మదిరారసాస్వాద మహిమఁజేసి
యతి మనోహరలీల మదాలసయయి
యంబ సుగుణకదంబ ప్రత్యక్షమయ్యె. 1–462

ఓజోగుణప్రధానమై యారభటీవృత్తితో వీర రౌద్రరసము లిందు వర్ణింపబడినవి. చండి తామసీశక్తి రౌద్రరూపము గలది. ఈమెకన్న నీమె వాహనంబైన సింగము మరింత రౌద్రముగ సాక్షాత్కరించుచున్నది. పాత్రోచితమైన రసవర్ణన గావింపబడినది.

సత్త్వగుణ ప్రధానయైన దేవి మహాలక్ష్మి రూపమున నిట్లు దర్శనమిచ్చినది.

ముద్దుమోముతోడ మురిపెంపు నగలతో
వన్నె చీరఁగట్టి కన్నులార్చి
నగల నిండదాఁల్చి మగువలతో మహా
లక్ష్మి చిఱుతనగవు లగ్గుసూపి. 1-571

అలతియలతి పదములతో నాటవెలదిలో ప్రసాదగుణశోభితయై శృంగార రసాత్మకముగ నున్నది. ఇట్లే దేవి సాక్షాత్కరించిన తావులెల్ల యాదేవి తాల్చిన రూపమును బట్టి పద్యరూపమును గూడ దీర్చిరి. దేవి నుండి యుద్భవించిన కాళరాత్రింబోలిన కాళిక వర్ణన యందు భయానక భీభత్స రసములు పోషింపబడినవి.

యుధాజిద్వీరసేనులు గావించిన రణరంగ వర్ణన (3-319) భీభత్స రసోచితముగ నున్నది. ఇళ, తార, శశికళ, అంబ, సుకన్య, పాత్రలను వర్ణించునపుడు ప్రబంధరీతిని శృంగార రసాత్మకముగ వర్ణించిరి.

చక్కనిచుక్కనన్ను నిది చక్కనిచుక్కని మెచ్చియాడునో
గ్రక్కున ధిక్కరించుచు నఖంబును బోలఁదటంచు దూరునో
మిక్కిలి తండ్రికీర్తి కడుమేలని చెప్పుకొనం దలంప న
మ్మక్క తదీయ వక్త్రరుచికాతడు చాలడటంచు నెంచునో. 1-442

ఈ విమలాంగి కౌనుసిరి కేసరి కేసిరియా నెలంత కె
మ్మోవి మెఱుంగు కింశుకము పూతను బూతను నేమిచెప్ప నా
హా వనజాక్షి వేణిరుచికాదనుఁగాదను నీవెలంది న
న్నే విధినేనిఁ గూర్మియిడి యేలఁగ నేలఁగ వచ్చు లోకముల్. 1-443

ఇందు బుధుడు ఇళను జూచి మోహితుడగుటకు హేతువులు పుష్కలముగ జూపుటకీవర్ణన చేయబడెను. అతని నాకట్టుకొన్న యామె సౌందర్యము ముందు తానేకాదు తన తండ్రి గూడ నామె యందములో నొక యంశకు గూడ తగడని యామె తిరస్కరించునేమో యను సంశయము వ్యక్తము చేయుచు నామె సొబగును సువ్యక్తము చేసెను.

ఉపమల యూసులేక స్వభావోక్తులతో శృంగార రసాధిదేవతయైన తార వర్ణన హృద్యముగ జేసెను -

సందడించుచుఁ గిల్కుటందెవాదోడుగా
 దొడిఁబెంపుఁజిల్క చేదోడుగాగఁ
జక్కనిమోవిపై ముక్కెర కదలగా
 గుబ్బకస్తూరితావి గుబులు కొనఁగ
నునుసిగ్గు దలవొంచి కనులఁ బ్రక్కలదిద్ద
 ముసిముసినగవు సొంపులు ఘటింప
మణిముద్రికల వ్రేళ్ళు మఱిపైఁట సవరింప
 ముసుఁగు సరిగ జడమొదల ముసర

గునిసికొనాడ గదిగుమ్మమునకు వచ్చి
తలుపు నొక కొంత యొరగా మలచినిలచి
తారముద్దులుగార విధాత కనియె
నితడు నిజముగ నమృతాంశుసుతుఁడటంచు. దే.భా. 1-423

ఈ వర్ణనలో నాతారను మన కండ్ల యెదుట నిలిపిరి. ముసిముసి నగవులు సొంపులు ఘటించుట, జడపైనుండి పైట భుజముపైకి వచ్చునట్లు వేసికొని తలుపునొకకొంత యొరగా మలచి నిలచుట, ఇది యాంధ్ర దేశపు టాడబడచులు తమ యత్తింట మెలగు విధము. పాత్రప్రవేశమునకు ముందుగనే యా మణిముద్రికల తళుకులును, కస్తూరితావులును గుబులుకొనును. దానికి వెఱగుపడుచుండగ నింతలో పాత్రసాక్షాత్కరించి చకితులను జేయును. పాత్రాను గుణమైన వర్ణన, దానికి తగిన కదలిక చక్కగ చిత్రించెను.

ఇట్టి వర్ణనలు దేవీభాగవతమున పలుచోట్ల గలవు. ఇళాదేవి వర్ణన (1-443-4), శుకుని సేవకై నియోగించిన వెలవెలందుల వర్ణన (1-652), సత్యవతీవర్ణన(2-12), శశికళవర్ణన (5-533),బదరికాశ్రమందలి రంభా, తిలోత్తమాదుల వర్ణన (1-115-117), ఊర్వశీవర్ణన (4-127),శతాక్షిదేవి వర్ణన(7- 633). ఈ ప్రబంధపాత్రల వర్ణనల వలన ఆనాడు సంపన్న గృహిణులు 'సరిగంచు చీర పసందుగా మీగాళ్ళ జీఱాడ నునుబట్టుచీరెలు గట్టి బారీ బనారసు పచ్చా కుడాలుబటేదారీలపైఠిణి ధరించి,ముక్కునబులాకీ,కొప్పున రవల చేమంతిపూవు, గుండ్లకంటె,మిరియాల గుండ్లపేరు, ముత్యాలహారము, చంద్రహారము, రవలదుద్దులు, పుష్యరాగములు జంపులు,వైడూర్యముల బాజుబందులు, పగడాల జౌకట్లు, ముఱుగులు, వ్రేళ్ళమణిముద్రికలు,కాళ్ళ రవలందియలు ధరించి మహాఠీకుగ నుండెడివారని తెలియుచున్నది.

నారదుడు స్త్రీగా పరివర్తన చెందినపుడు (6-579) సుకన్య రాజకన్య వేషము వదలి తాపసివేషము బూనినప్పటి వర్ణనలు (7-75) కడుహృద్యములు. నారాయణుడు నారదుని స్త్రీగా మార్చిన సందర్భమున పాఠకుల కన్నులు విప్పి జూచుచు చదువుచున్నను నారదుడు వనితగా మారి తిరిగి నారదరూపము పొందువరకు మాయయొక్క యింద్రజాలములో నారదునితోబాటు పాఠకులను గూడ ముంచి యాశ్చర్య నిమగ్నులను చేయువర్ణన గూడ ప్రబంధరీతి కొక యదాహరణము. ఆ వర్ణనాసందర్భము నందలి పద్యము-

కావిధోవతి చక్కగట్టనేరని నేను
  కట్టనేర్చితి సరగంచు చీరె
జుట్టు గూరిచి ముడిపెట్టనేరని నేను
  బెట్టనేర్చితి పూలుజుట్టి కొప్పు
పొలుపుమీర విభూతి బూయనేరని నేను
  పూయనేర్చితి మంచిపునుగు మేన
బెడగుగా జలిబొంత దొడుగునేరని నేను
  తొడుగనేర్చితి దీటు దొరయు రవికె

నేమి చెప్పుదు దాపసాకృతిని విడిచి
నే మును విచిత్రముగ ముద్దులేమనైన
నాటి నాయొర్పు నా నేర్పు నాకె వింత
యయ్యెదును లాతులకు వింతయన వశంబె. 6-579

ఇట్లత్యద్భుతంబుగ పాలకడలి వెడలి వచ్చు జగన్మోహినియో యన నా 'తటాకంబు వెడలి వచ్చి ..........' ఈ యుపమానము సందర్భమునకు చక్కగ నతికినది. ఇద్దరును జలము నుండి ఉద్భవించినవారే. పూర్వాకృతిలో నిద్దరును పురుషులే. ప్రస్తుత మిద్దరును జగన్మోహినులే. కావున నాయుపమానము సందర్భోచితముగ నున్నది. ఇట్లు శృంగార రసముతో నద్భుతరసము మేళవించి ప్రబంధరీతిని రచించిరి. అట్లని ప్రబంధములో వలె అంగాంగవర్ణన నంతట జేయలేదు. సుకన్య వర్ణనలలో స్నిగ్ధతను లావణ్యమును చక్కగా వర్ణించిరి.

జిగిగలదాన తమ్మలపుఁజీరలు కంఠముపైకిఁదోచు నీ
మొగమున లక్ష్మిదానాటనమున్ సలుపున్పొగడంగ మాకు శ
క్తిగలదె కోమలీ చిదిమిదీపముఁబెట్టఁగవచ్చు నమ్మ నీ
సొగసు పురాకృతంబు పరిశుద్ధముఁగావుట కేమిహేతువో. 7-100

సుకన్య జీరలు కంఠముపైనున్న చర్మము లావణ్యము గలిగి పారదర్శకముగ నుండుటచే నామె తాంబూలము సేవించునప్పుడా తమ్ములపుటెఱ్ఱని జీరలు, కంఠముపై కనబడునట,ఆమె ముఖము లక్ష్మివలె కళకళలాడుచున్నదట. ఆమె యందమంతయు నొక్కమాటలో 'చిదిమి దీపము పెట్టవచ్చు' నని కవి వర్ణించెను.

నీతిని ధర్మమును బోధించు పురాణములందు రసప్రబోధన చేయుటకు దగిన సామాగ్రి సమకూర్చుట సాధ్యమా? రసమునకు ప్రసక్తి యున్నదా? యను మీమాంసకు తావులేదు. ధర్మప్రబోధకములైన పురాణములు అనాది నుండియు ప్రజాదరణ పొందుచుండుటయే దీనికి ప్రమాణము.ఆదరభావము రసాంశలో నుండి జనించునదే. రసాంశలేనిదే మానవుడేక్రియ యందును బ్రవృత్తుడు కాడు. ఏ గ్రంథమును అది పురాణమే యైనను జదువడు. రసాంశ యుద్భూతమగుట యనగా కావ్యాది పఠనము వలన నదివరకే సంస్కృతమైన సత్వము నాశ్రయించు

కొని యున్న జీవునియం దాయారసముల యనుభూతి యుద్భుతమగుట. కవి తన రచన యందారసానుభూతి కలిగించు శబ్దార్థముల సన్నివేశముల కల్పనయో తన ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసములచేత వానిని గల్పించి శ్రోతృపాఠకుల కాయా రసములకు బ్రత్యక్షము జేయును. పురాణములందు ముఖ్యముగా ధర్మవీరమున కును, శాంతమునకును ప్రాధాన్యమును' శృంగార కరుణ హాస్యరసభావములకు అంగత్వమును సాధించుటకు సావకాశము కలదు.

ఈ కవి ఆయా పురాణకథలను ప్రత్యేకప్రబంధముల వలె సంభావించు టచే నందలి శృంగారరసము అంగీరసముగ భావింపబడుచున్నను ప్రధానకథ కది యంగరసమే యగును. శుకవ్యాసుల వృత్తాంతమందును, సత్యవ్రతోపాఖ్యా నమునందును శాంతము అంగరసము.

ఇట్లు శృంగారరసమునే గాక వీర రౌద్ర రసములను మహిషాసుర యుద్ధమునను, శుంభనిశుంభాది యసురుల యుద్ధవర్ణనము లందును, భీభత్స భయానక రసములను కాళికవర్ణన యందును, రణరంగవర్ణయందును హరి శ్చంద్రోపాఖ్యానమున స్మశాన వర్ణనము నందును జక్కగా పరివర్తించెను. కరుణ రసము శైబ్యసుకన్యల వృత్తాంతము లందు మిక్కిలిగ యభివ్యక్తమైనది. భువనేశ్వరీ దర్శన వర్ణనమున మణిద్వీప వర్ణనము అద్భుతరసమును వర్ణించిరి. హాస్యము అంతర్లీనముగ కావ్యమందంతట నిందులే దందులేదని యెచ్చటబట్టిన నచ్చటనే దర్శన మిచ్చుచున్నది.

హాసమునకు కారణభూతమైనది హాస్యము. నవ్వించేది హాస్యము. సహృదయుడు ఆరోగ్యవంతుడు సంస్కృతమతి నాగరికుడైన వాణ్ణి నవ్వించేది హాస్యము. అదే ఉత్తమమైన హాస్యము,'[1] అని మునిమాణిక్యం నరసింహారావు గారు నుడివిరి. ఇటువంటి యుత్తమమైన హాస్యము శ్రీరాములు గారిది. ఉత్తమమైన హాస్యమునకు లక్ష్యము 'తెలుగునాడు'. ఇందలి పద్యములను శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారు శ్రీ సంగమేశం గారు వారి గ్రంథములందు ఉత్తమ హాస్యమునకు లక్ష్యములుగ నొసంగిరి. 'తెలుగునాడు' అందలి యొక పద్యము–

చదివిరా ఋగ్యజుస్సామముల్ భూర్భువ
స్సువరాది లోకముల్ స్తుతులు ముట్టు

మెదపిరా పెదవి గుంఫిత మృదుస్తుతిపాఠ
సల్లాపముల నల్లరాళ్ళు గఱగు
తలచిరా క్షేత్ర యాత్రల సేతుకాళికా
గంగోత్తరాలకు మూఁడంగలీడు
నిలచిరా సత్కర్మనియతిన్మహాధ్వర
కాండంబు పౌండరీకంబు దట్టు

పఱచిరా పంచపాళి దర్భాసనముల
ముక్కుమూతల పరిపుక్తు రొక్కజాము
బళిర ! యీపాటిపరిపాటి తెలుగునాట
వైదికుని తోటి యేమేటివచ్చు సాటి ప. 2

ఈ పద్యపు టెత్తుగడ,ముగింపు మనోహరముగ నున్నది. ఆ వైదికోత్త ముని విశిష్టలక్షణము లొక్కొక్కటి యొక్కొక్క దీర్ఘసంస్కృత సమాసముతో 'తారాజువ్వ' వలె తారాపథమున కెగసి యింతలో ఈపాటి, పరిపాటి, తోటి,మేటి,సాటి యని యా విశిష్టత పటపట యంచు ప్రేలి రంగు రంగుల కాంతిపుంజములుగ జాలువారి ప్రశ్నార్థకముతో ముగిసినది. ఇదియొక చమత్కారముతో కూడిన శిల్పము. ఏ విషయము కదిలించిన అందుండి హాస్యము తొంగిచూచు చుండును. దేవీభాగవతము నందు నీ హాస్యము మనోజ్ఞమై కన్పట్టును.

మహిషుడు శాంబరీశక్తిచే కోటిదున్నలను యుద్ధరంగమున సృష్టింపగ వానిధాటి కాగలేక దిక్పాలకులు, సూర్యచంద్రులు పారిపోయిన సందర్భమున ఆరు ఆటవెలదులలో హాస్యరసమునుత్పన్నము జేసిరి. (5-139-44). అందు వరుణుడు -

వల్లెత్రాడు దూల వలువయూడగ సవ
రించుకొనుచు మిట్టిపొంచి వెనుక
దిక్కు చూచుకొనుచు నెక్కడికింబోవ
దక్కుఁబ్రాణమంచు బారెఁబాసి. 5-139

ఇందీపాత్రల చేష్టలను వర్ణించుచు హాస్యమునుత్పాదించిరి. దేవీ మహిషాసురల సంవాదమున దేవి మహిషునితో జెప్పుచున్న పలుకులు -

నిప్పు దాజొన్నచొప్పయు నీరపతియు
గడ్డి యముడు తవుడు పెద్దగాలి చిట్టు
సూర్యచంద్రులు గుగ్గిళ్ళు చూడనాకు
నమిలివేయనె గడియలో నమరవితతి. 5–73

అమూలకముగా వ్రాసి యమూల్యమైన హాస్యము నిక్షేపించిరి. మహిషునకు భక్ష్యమైన పదార్థములుగ తన శత్రువుల వర్ణించుట యౌచిత్యము. అందులకే సన్నజాజుల వంటి యీ సున్నితమైన హాస్యము మనోజ్ఞముగ పద్యమంతట గుబాళించుచున్నది.

హైహయులు భార్గవుల బాధించినపుడు వారి యంగనలిట్లు విలపించిరి.

సోమిదమ్మెగారి సొట్టముక్కున నున్న
ముక్కెరొకటి లాగ చిక్కకున్న
ముక్కుగోసి చనిన ముక్కిడియై యాపె
వెక్కివెక్కి నొక్కినొక్కి యేడ్చె. 6 – 320

అష్టావధాని కోడలు
కష్టపడుచునుండ బోయి కాళ్ళ కడియముల్
భ్రష్టములు గాగ డాచిన
నెష్టాగెష్టాగటంచు నేడ్చె నిలేశా. 6 – 321

ఏ విషయము స్పృశించినను నందుండి హాస్యము చిప్పిలుచుండును. షష్ఠ స్కంధమున నారదుడు పర్వతునితో చాతుర్మాస్యమును సంజయుని పురమున పుచ్చుటకు నుండ వారికి బరిచర్యకై నియోగింపబడిన అతని కుమార్తె దమయంతి వలపులో పడి నారదుడు –

చెంబుతో నీళ్లులందించు చెలియముద్దు
చేతి హొయలును జూచుచు ప్రీతి మీరి
కాఁగు నీళ్ళన్ని నేకాళ్ళు గడిగికొంటి
దవ్వుననె యుండి యయ్యింతి నవ్వుకొనగ. 6–528

సంధ్యవార్చెడిచో నింతి సరసజనగ
కన్నులు తదంగ సౌందర్య గణనజిక్క
జెలఁగి సూర్యశ్చ కగ్నిశ్చ సెప్పబూన
బర్వతుఁడు నవ్వునిది పట్టపగలటంచు. 6-529

నారదునకు 'వగలొడ్డులంటుకొని పారుటచే' జగమెఱుగుడు. సంధ్య నెఱగడు. కాగుడునీళ్ళు కాళ్ళు కడుగుకొని రాత్రి చెప్పవలసిన సంధ్యా వందనము పగలే చెప్పుటచే పర్వతుడు నవ్వుకొనెను.

సప్తమస్కంధమున కాలకౌశికుని వర్ణనలో నుత్తమమైన హాస్యము స్ఫురించును.

పురాణరచనయందే గాదు ఎచటబట్టిన నచ్చట హాస్యము ఆనాటి వారికి తగినట్లుగ ముదురుపాకమున బడినది. కురంగగౌరీశంకర నాటికలో అష్ట దిక్పాలకులు తారకాసురునిచే బొందిన బాధలను వర్ణించు ఘట్టము హాస్య రసపూరితమై యున్నది. కుబేరుడు :- 'బలసూదనా ! నాపని దివాలా యయిన జాడ తమకు విశదపడలేదు కాబోలును. నా నవవిధులను తారకాసుర మహారాజు గారు త్రవ్వించుకొని పోయినాడుగా. ఇంకేమున్నది? నా స్నేహితుడు పెద్ద జంగమయ్యగారి జోలె యిక్కడికి వచ్చినదిగ. పెద్ద జంగమయ్యగారు తపస్సునకు బోవుచు మాయింటి చిలకకొయ్యకు దగిలించిపోయినాడుగా ! అదే వాడు కుంటున్నాను. సాంబయ్య లింగము సమాధి విడచి వచ్చెనా? అదియును లేదుగా. కొడుకు నలకూబరుడు గాడు కుదిరి కూర్చుండడుగా. ముండల ముఠాకోరు. జక్కుల ముండాకొడుకా, యింట్లో వెచ్చాలకొట్టు మీద కూర్చుండి నౌకరీ చేయుమనగా ప్రొద్దు విడిచినది మొదలు ప్రొద్దుగ్రుంకు వఱకు అక్కడనే. ఊ! ఏమున్నది? నా దిశ యెట్లున్నదో నీకేమి తెలియును స్వామీ ? (పు॥లు 17,18)

ఇట్టిదే యింకొక సంఘటనము- గౌరితో వివాహము నిశ్చయమైన తరువాత శివునితో భృంగి యిట్లనును- 'తుదకు మన ప్రమథగణములతోను, పిశాచములతోను,వెల్లెద్దు,మన గంతా,బొంతా, వేసుకొని తరలి పోతిమా నలుగురు చూచి నవ్వుదురేమో ? వాని కేమి గాని మంగళ సూత్రము మట్టెల మట్టుకైన యేమైన చేతిలో నున్నవా? (పు. 50)' అని వచించేసరికి వేయి 'పటాసు' లొక్కసారి ప్రేలినట్లు పాఠకులు పకాలున నవ్వుదురు :

హాస్యరసనిష్యందిని యగు రచనలో వీరిది యందెవేశిన చేయి. వీరి హాస్యములో సంఘసంస్కారము సమ్మిళితమై 'తీగలో పూవు వలె' 'పూవులో తావి వలె' ఒదిగి యుండును. కాలకౌశికుని వర్ణనలో వృద్ధ వివాహముల గురించి యవహేళన జేసెను. 'కురంగగౌరీశంకర నాటిక'లో గౌరీ చెలుల సంభాషణలో బాల్యవివాహముల గూర్చి స్త్రీ విద్యగూర్చి కావ్యోపదేశము గావించిరి. 'విశ్వః శ్రేయః కావ్యమ్ ' కదా !

## వర్ణనలు :

లోకోత్తర వర్ణన చేయువాడే కవి. ఈ మహాకవి శ్రీరాములుగారు ప్రబంధరీతిని సందర్భశుద్ధిగ సమయోచితముగ 'చిట్టములొకిరింతలు' (3-209) మొదలు 'పుత్రోదయ' (1-495) వర్ణన వరకు అష్టాదశ వర్ణన[2] ల నన్నియు నిపుణముగ జేసియుండిరి.

వర్ణన లన్నియు నాపాతమధురముగ నున్నను కొన్ని మరింత మధురముగ ప్రేక్షణీయమై యొప్పుచున్నవి.

4-109 నుండి 124 వరకు వనమును వనకేళిని వర్ణించిరి. 'వనలక్ష్మి కమలాస్య యగుచు నీలాశోక కబరియై, కుందరదనయై, అరుణాశోక హస్తయై చెలువొంద' (4-123) మదనుడు-భృంగపంక్తి పరిజనులు కాగపికములు పాఠకులు కాగ కువలయాప్తుడు ధవళాతపత్రయై, వెలదుల కౌనులు విళ్లు గాగ, జలజేక్షణాపాంగములు శరంబులుగా తెమ్మెరకూనతేరు గాగ, మధురగీతాదులు మంగళధ్వనులు మధుమహారాజు సారథిగాగ, మొసలి టెక్కెము దాల్చి రంభా, తిలోత్తమాదులు వెంటరాగ రతి గూడి వచ్చెనట'. (4-114)

వింధ్యపర్వతము భానుమార్గ నిరోధనము చేయగా తూర్పుదిక్కున ప్రొద్దుబొడిచి యొకింత యెక్కి యట్లే యుండెను. అపుడు -

నెలవారము నక్షత్ర
మ్మల తిధియోగంబుకరణ మట్టెత్తివడిం
దెలుపగలేక పురోహితుఁ
డిల్లునిల్లూరకయ తిరిగి యేగిరి భూపా. 10-30

పశ్చిమ దిక్కున తెల్లవారలేదు. తెల్లవారునటంచు-

పండి మరలలేచి భామల లెమ్మన్న
కోడికూయలేదు గొల్లపడుచు
చల్లచేయలేదు చయనులేటికిఁబోవ
లేదు లేవనేల లెమ్మటన్న. 10-35

వీటన్నిటితో తెలవారును. అప్పుడు కపరకపర చీకటితో లేచిన గృహిణి యాచరించు నిత్యకృత్యములు-ఇల్లలికి ముగ్గుపెట్టుట, పోయి పరిశుద్ధి చేయుట, నీవారి గింజలు దంచి చెరగి వండి వడించుట, (7-79),వేడినీళ్లు గాచి బిందె దొళుపుట, భర్త సాపడిలేచి యున్న వక్కలు ఆకులు అందించుట (7-81). ఇట్టి వర్ణనలు కడు హృద్యములు. వీరి శైలి వ్యవహారమునకు సన్నిహితముగ నుండి రచనకెంతో సౌందర్యము గూర్చుచుండును.

అల్లూరి వర్ణన యందు ఆషాడలక్ష్మిని వర్ణించు సందర్భమున వర్ణించిన దృశ్యము-

ఎలయెండ చెట్టుసందుల నుండి గోడల
దవిలి నిలువుటద్దములు గాగ. పు. 16.

'పచ్చికపట్ల మంచుబడి ప్రాతర నేహరముండు బచ్చులను గ్రుచ్చిన పేట ముత్తెములు కూర్చిన రీతి వహించుట' యెంతయు మనోజ్ఞములు.

**పసిబాలిక వర్ణన :**

మురువారు చెక్కిళ్ళు ముద్దుబెట్టగవచ్చు
నతివల కబ్బు ముత్యాలరాశి
తీరుగా చంకకు దివిచి యెత్తగబోవు
కలికికి దొరుకు బంగారుముద్ద
చక్కని ముంగురుల్ సవరింపగాబోవు
లలనకు గల్గు నీలాలదండ
బులుపుతో చుబుకంబు పుణికి వాతెరనంటు
వెలదికి లభియించు విలువకెంపు

కాలుసేతులు మొగమును గనులు దేరి
పారగనుగొని నవ్వించు పడతులకును
తవిలివడినిండు తులలేనిరవల పిండు
కన్నవారల భాగ్యంబు లెన్నదరమె. 9-495

ఇందు కవియొక్క వర్ణనానైపుణ్యము పదప్రయోగ పాటవము వ్యక్త మగుచున్నది. శరీరము బంగారుచాయ బోలియున్నదని, ముంగురులు నీలాల వలె నున్నవని, వాతెర కెంపువలె నున్నదని సాధారణముగ కవులుపయోగించు ఉపమానములతోనే చెప్పుచు వేఱొక యర్థమును ధ్వనింపజేసిరి. ఇది లక్ష్మ్యంశ యైన వేదవతి వర్ణన. లక్ష్మీసాంగత్యమున్న వారికి ముత్యాలు బంగారు నీలాలు కెంపులు రత్నాలుండుట సహజమే. ఆమె సేవ చేసికొన్నవారికి చేసికొన్నంత భాగ్యము కలుగగ నింక కన్నవారల భాగ్యంబు లెన్నదరమె. శ్లేషోక్తి కూడ నిందు కలిసి రమణీయార్థము ధ్వనించుచున్నది. పసిబాలుని వర్ణన (6-394-5), బాలెంతవర్ణన పైవర్ణనలె దళుకు బెళుకులు లేక స్వభావోక్తితో లోకసహజముగ నున్నదియున్నట్లు చెప్పిరి.

....................................
కొత్తబాలెంత సిగ్గున నెత్తిమీఁద
ముసుఁగు నడికట్టు పురిటాలి మిసిమితోడ. 4 - 522

పొత్తులలోన బిడ్డనిడి పొంకముగాఁ దనకేలుదమ్ములన్
మెత్తగ నుంచి పాదముల మెల్లన మెల్లనమెట్టుచు
............................................ 4-523

పగడపు కోళ్ళ మంచమును రెండు మారులు వర్ణించిరి.

పచ్చలకోళ్ళు నీలములపట్టెలునుం బనడాల కంబముల్
గుచ్చుల ముత్తియంబులును గూర్చిన పందిరి యంచరెక్కచాల్
హెచ్చిన పాన్పుపట్టు బిగియించిన దోమతెరైన మంచమం
దచ్చరతో రమించు సుఖమన్య విలాసిని మందుగల్గునే. 6 - 121

ఇంద్ర రాజ్యపదవి చేబట్టి మత్తెక్కిన నహుషునకు దేవతలు ఇట్లు నచ్చజెప్పిరి. మంచము స్వర్గమందున్నను నిది సంపన్నుల పర్యంకము గనుక దోమతెరయున్నది.

కంసుడు పగడాల పట్టెమంచముపై పరుండి దుస్స్వప్నముల గాంచెనట. వెంటనే దృగ్యుగళము విప్పి మేలుకొని తత్తరంబునన్ దిగి కలత చెంది తడబడు చుండుటచే జారుచున్న మొలకట్టు,పల్మరు దిద్దుచు జుట్టును జుట్టి ముడ్చుచున్, మెల్లగా వడిదంబు గొన దుమ్మెనొక్కండు. అది లెక్క చేయక గడపదాటగనే పిల్లి యెదురై వచ్చినది. ఇంక కంసుడు దగ్రోగ్రుడగుటలో (4-520) వింతయేమి? చివరికి నాడుది పుట్టెనని తెలియగానె మరింత నాందోళన యేర్పడినది. అప్పటి వాని మనస్థితి దానికనుగుణమైన ఆ పాత్రచేష్టితములు వర్ణించి యాపాత్రలకు ప్రాణము పోసి సజీవ పాత్రల మన కనుల యెదుట చలనచిత్రము వలె కదిలింపజేసిరి.

మరియు మరియుఁజూచి మరిజూచి మరిజూచి
త్రిప్పి త్రిప్పి జూచి తేరజూచి
బూచియంచుఁదెలియ కాచలచిత్తుండు
ప్రాచినోటితోడ బల్కెనిట్లు. 4-526

ఈ పద్యమందు విశిష్టమైన కవితా పదార్థమేమియు లేనట్లు తోచును. కాని కంసుని మనస్థితిని వర్ణించుటలో సీసపద్యమెంతో విశిష్టత కలిగి యున్నది. ఈ పద్యమిచ్చట తొలగించిన కంసునిపాత్ర నిర్జీవమగును. దేవముని పలుకులు గగనవాణి పలుకులు దబ్బరలగునాయని యనుమానముతో మరి మరి త్రిప్పి జూచెను. దుస్స్వప్నము వచ్చుటచే పగడపుకోళ్ళ మంచము దిగి తిన్నగ వసుదేవుని కడకే వచ్చెను. ఇంకముఖము కడుగుకొను అవకాశము లేకపోయినది. అందులకే 'పాచినోటితోడ బల్కెనిట్లు' అనెను. ఇంకొక విశేషము పాచినోటితోడ యబద్దమాడ రాదందురు. కాని యిచ్చట యదే జరిగినది. దేవకి తన బిడ్డపై దయజూపుమని గోడుపెట్టినది. ఆ రెండు పద్యములట్లే సాభిప్రాయముగ మత్తకోకిలావృత్తములో రచించిరి. దేవకి యెలుంగట్లున్నదని స్ఫురణ.

దేవీతామ్రముల సంభాషణ, దేవీ మహిషాసురదూతల సంవాదన, తిక్కన సంజయరాయబారమును తలపించుచున్నది. సత్యవ్రతుని పట్టాభిషిక్తుని జేసి యాతని తండ్రి రాజనీతిని (7-246-48) గఱపెను. అష్టాదశ వర్ణనలో నిది యొకటి. కవి దీనిని గూడ సందర్భోచితముగా నిందు వర్ణించిరి.

సందర్భానుసారముగ ఈ కవి భోజనవర్ణన గావించి తన భోజన ప్రియత్వమును ప్రదర్శించుకొనిరి.

పనసకాయలకూర పట్టెడొడ్డించుక
తొనలు నూరొకసారి తినెడువారు
ఆవకాయలు పదియారగించియును మా
మిడిపండ్లు పెక్కులు గుడుచువారు
చిగురాకు పచ్చళ్ళు చేతినిండుగ మెక్కి
వడి చింతపండు చారడుగువారు
వరుగు దప్పళములు దరుగక భుజియించి
వంకాయ బజ్జి సాపడెడివారు

బీర సొర దొండ కాకర బెండ పొట్ల
మేడికాయల కూరలు మెక్కి మెక్కి
మునుగ దోటాకు కూరలు బుచ్చుకొనియు
కొసరి గోంగూర పచ్చళ్లు మెసపువారు. 7-637

శతాక్షీదేవి సమారాధన యొనర్చు గృహస్థు నిల్లాలివలె -

బంగారు జారి చేకొని ...........
వంగుచు లేచుచు చేతులు
బొంగిపొరలనపుడు నేతిబొట్టొడ్డించెన్. 7-639

అపుడు బాపనసాములు బ్రేవుమనుచు దెగ ద్రేపిరట. అట్లు కంఠదఘ్నముగ భుజించిన తరువాత తాంబూలమును సేవించుట మనవారి యాచారము. ఆ తాంబూలవర్ణన నిట్లు చేసిరి. శంఖచూడుని రూపము ధరించిన హృషీకేశునకు తులసి తాంబూల మిట్లిచ్చినది.

మంచి వక్కపొడి నములనిచ్చి కవటాకు
దుల్పి యీనె దివిచి దొడ్డ సున్న
మించు కంతరాచి యింత చిటెనవ్రేల
జుట్టి దంభవిభుని కట్టెదుటను. 9-706

నిలిచియిచ్చె కప్రపలుకు నేలకికాయ
జాజికాయ పత్రి యోజమీర
గా లవంగములును గపటతాంతుని నోటి
కందియిచ్చె డులసి సుందరాంగి. 9-707

శశికళా విరహవర్ణన (3-425 నుండి 432 వరకు), తులసీదేవి విరహ వర్ణన (9-265 నుండి 582 వరకు) ప్రబంధపు టచ్చులలో బోసిరి. ప్రబంధో చితములైన మన్మథోపాలంభనాదుల వర్ణనలు యధారీతిగా సాగినవి. తులసి చంద్రు నుద్దేశించి యిట్లనుచున్నది.

మానుగ నిత్యజంగమ సమాచరుణుండవు నీవు వాఁడురా
మానుజ వంశవర్ధనుడు హా కడునచ్చెరువయ్యె లింగమున్
బూనినవాని లోకమున భూతపతి ప్రతిపక్షుపొత్తు నుం
గానము వైష్ణవుంగలయ గారణమేమొకోయో నిశాచరా! 9-579

విషదిలో విషముతో నీవు వెలయుబుట్టి
విషధరునితలకెక్కితి విర సుధాక
రాఖ్యగల్గుట జూడ నత్యద్భుతంబు
కవివరుల మెప్పులెన్న నిక్కంబులగునె. 9-580

అభినవగద్య ప్రబంధమున గూడ నిట్టి దూషణమే గలదు. 'రుద్రాక్షి వైభూతి పాండుర శరీరుడవై యనవరత జంగమచారుడవైన లింగధారివి నీవు రామానుజ కులజు పొత్తు హత్తితివి నీకు నిలకడయేదది?' (పు. 49) కవి యిచట చక్కని శ్లేష ఘటించి చేమకూరకవి వలె ప్రతిపద చమత్కారము నెఱపెను. చంద్రుడు ఆకాశమున నొకచోట స్థాణువువలె నుండడు గావున జంగముడు. రామానుజుడు అనగా బలరాముని తమ్ముడు కృష్ణుడు వాని వంశస్థుదు మన్మధుడు. ఇతని పొత్తు జేరితివి. జంగములు లింగధారులైన శైవులు. వారి ప్రతిపక్షులు వైష్ణవులు. 'వైష్ణవులం గలయ కారణమేమొకో' యనగ విష్ణుసంబంధి మన్మథుడు. వాని స్నేహమునకు కారణమేమి? శివుడు చంద్రుని ధరించుటచే శైవసంబంధి యగుచున్నాడు. కనుక యతనితో స్నేహము చేయుట మిత్రద్రోహము కావుననే 'నిశాచరా' యని సంబోధించుట. నిశాచరుడనగా చంద్రుడు, రాక్షసుడు యని

రెండర్థములు గలవు. కర్కశుని రక్కసునితో బోల్చుట లోకసహజము కావున తులసి చంద్రుని రక్కసునివలె వేధించుచున్నాడని 'నిశాచరా' యని సంబోధించినది. చంద్రుని నిలువెల్ల విషమేయని నిందించుచున్నది. విషధి కాలకూట విషముతో జన్మించుటచే అభిజాత్యము గూడ విషతుల్యమే. నివసించినది విషధరుని తలమీద. కావున పుట్టినది మెట్టినది గూడ విషసంబంధములైన ప్రదేశములేయైనను సుధాకరములు కలిగియున్నాడని కవి గూడ విషమాలంకారమును సొగసుగ చేర్చి 'కవివరుల మెప్పులెన్న నిక్కంబులగునె' యని సందేహముతో నత్యద్భుతముగ ముగించిరి. మన్మథు నుద్దేశించి –

ఓరి లతాంత మార్గణనయోచిత కృత్యముమాని పాంధులన్
గారియబెట్టినన్ గనలి గాలగళుండశరీరు జేసినన్
నీరయి యెట్లుగా మరల నేర్చితి బువ్వులకోరి బట్టగన్
వారకదృష్ణరేఖ గలవారల కెందు నసాధ్యమున్నదే? 9–582

ఆంగ్లములో నొక సామెత గలదు. "Burnt child dreads the fire". చెయ్యి కాలిన బాలుడు మరల నిప్పులో చెయ్యి పెట్టునా. తెలివిమాలినవాడా పని చేయును. లతాంతమార్గణముల పట్టుటచే కాలి బూడిదయైగూడ మరల పూవుల కోరి బట్టుదునని సాహసించు చున్నావేమి యనుచు, అదృష్టవంతులను చెరచువారు లేరు, వారికి సాధ్యము కానిది లేదని యర్థాంతరన్యాసముతో ముగించిరి. తులసియు శంఖచూడుడును నితర ప్రబంధనాయికా నాయకులవలె వారును కృతకాద్రుల విహరించిరి. ఇట్లు ప్రబంధవర్ణన లన్నియు నేయొకటి కొఱవడకుండ నీపురాణమున జేర్చిరి. దేవీభాగవత గ్రంథాదిని యల్లూరి వర్ణన జేసిరి. 'గ్రామ ప్రకృతివర్ణన' ను వస్తువుగ గైకొని రచించినవారిలో ప్రథములు వీరు. ఏదో సన్నివేశమున ఈ విధమైన వర్ణన జేసినవారు పూర్వులెందరో కలరు. 'కాలయవనుని' గొడవ పడలేక మధురను వీడి ద్వారకకు బండ్ల మీద బోవు సన్నివేశమున నా యాదవుల ప్రయాణము (4–569–62) 'గ్రామ ప్రకృతి వర్ణన' వలె నున్నది.

ముసలమ్మలు ముసలయ్యలు
మెసలంగాఁ జోటులేక మెల్లన డిగుచున్

వెసనెక్కుచు నెట్టెట్టో
గుసగుసలాడుచును బండ్లగూర్చుండి రొగిన్. 4- 560

ఈ ముసలమ్మలు ముసలయ్యల ప్రయాణము సహజసుందరముగ వర్ణింపబడినది. నవమస్కంధ మందలి గోకుల కృష్ణుని రాసక్రీడ వర్ణన (91-447-52) ,దశమస్కంధ మందలి దశావతారస్తుతి (10-45-54) మనోజ్ఞముగ నున్నవి. సురథుడు చేరిన తాపసిపల్లె నన్నయ గావించిన కణ్వాశ్రమ వర్ణనను బోలియున్నది. ద్వాదశస్కంధమున మణిద్వీపవర్ణన గలదు. కోట ప్రాకారముల వర్ణన అష్టాదశ వర్ణనలలో నొకటి. అష్టాదశ ప్రాకరములు గలిగిన మణిద్వీపవర్ణన గలదు. దేవి చింతామణి ప్రాకార మధ్యమున సకలదేవతలు కొలువై యుండ, కొలువు దీర్చి జగన్మోహినియై యున్నది. ఇట్లూరు సీసపద్యములలో జగదంబ వర్ణన గలదు. శిల్పకారుడు తన శిల్పమునకు కుంచెతో రంగు లలది తుదిమెఱుగులు దిద్దునట్లు కవియును వర్ణనలతో తన కవితాశిల్పమునకు వన్నెలు కూర్చును.

ఈ వర్ణనలో దృశ్యసాక్షాత్కార మొనర్చు కొన్ని చలద్రూప చిత్రములు కలవు. ఇవి కవియొక్క నవనవోన్మేషమైన ప్రజ్ఞకుపస్కారములు.

**దృశ్యసాక్షాత్కారము : శతాక్షీదేవి వర్ణనము :**

కురువిందములబిళ్ళ కొప్పుపై సవరించి
రవల దుద్దులు చెవికవనుబూని
గోమేధికపు బులాకీ ముక్కునందిడి
పుష్యరాగములజంపులు ధరించి
వైడూర్యముల బాజుబందుల నమరించి
ముత్యాలపేరు రొమ్మున ఘటించి
పగడాల చౌకట్ల దగ చేతులను దాల్చి
నీలాల పైఠిణి నెమ్మి దొడగి

గరుడపచ్చల మొలనూలు గట్టిచేసి
చెలఁగి మేలిమి జలతారు చీరగట్టి
లెక్కలేనన్ని కనులతోఁ జక్కనైన
యంబ భూదేవతలకుఁ బ్రత్యక్షమయ్యె. 7-633

ఈ శతాక్షి వర్ణనలో ఆ నాటి సంపన్న గృహిణి సాక్షాత్కరించుచున్నది.

లోకజ్ఞుడైన కవి దృష్టి నుండి యెట్టివారైన కనుచాటగుటకు వీలు లేదు. వీరిదెంత నిశితదృష్టియో ఈ పూతన పాత్ర చూచిన తెలియును.

ముక్కున గల మంచిముత్యాల బేసరి
యెడమచేతను సవరించుకొనుచు
మీగాళ్ళ జారు నుమ్మెత విరికుచ్చెళుల్
గుడిచేతఁ గడుప్రీలకుండఁ బట్టి
.................................. 4- 539

కలహంసవలె నడచుచు పూతన నందుని యింటి కరుదెంచెనట. ఆ కుచ్చెళ్ళను క్రొత్త ఉపమానము చేర్చి చెప్పుటయే గాక ఆ కుచ్చెళ్ళు ఎంత శ్రద్ధగ ప్రీలకుండగ నలుగకుండగ బట్టినదో యెంత నాజూకుగ నున్నదో తెలియుచున్నది. మధురానగరము నుండి వచ్చినది. 'నగరవాసిని' కనుక 'నాజూకుగ' నున్నది. 'నిజదృక్పాత జాత చేతోజాత కాంతరిత సమస్తచేతన' (4–542) యగు పూతనను యశోద గాంచినది.

గౌరన తన హరిశ్చంద్రోపాఖ్యానమున కాలకౌశికుని రూపమును రూపమునకు తగిన చేష్టలను కనులకు గట్టినట్లును, హాస్యరసస్ఫోరకముగను వర్ణింప యదెయొరవడిని శ్రీరాములుగారును కాలకౌశికుని మూర్తిని మనో నేత్రముల యెదుట సాక్షాత్కరింపజేసిరి.

తొస్సులువోవు మాటలకుఁదోడు శిరంబు వడంక నిస్సిరో
యిస్సిరటంచు గన్నులొకయించుక గానఁగరామి భాను తే
జస్సున కడ్డమొక్క చెయిసాచి వెసన్ బొమదోయి నుంచి వ
ర్చస్సముపేతుడైన నృపసంయమి వచ్చెను గఱ్ఱబట్టుచున్. 7–467

పండ్లూడుటచే మాటలు తొస్సువోవుట, శిరంబు వడకుట, కన్నులగు పింపమి భానుతేజస్సున కడ్డమొక చేయిసాచుట యివన్నియు నాతడు డెబ్బది సంవత్సరముల పైవాడని చెప్పకయే చెప్పుచున్నది. ఈతడు కోట్ల కొలది సొమ్ము గలవాడగుటచే నొక పడుచును బెండ్లాడెను. ఆమె గృహమున పనుల కోర్వదు. కావున దాసి

కావలసి వచ్చినది. 'ఏరయా దాసి నమ్ముచున్నార టిందుగొందు' ననుచు కాలకౌశికుడు వచ్చినాడు. ఆ కాలకౌశికుని జంట ముచ్చట, ఆ మాటలలోని చమత్కారము ఎట్టివారినైన ఫక్కున నవ్వింపగలవు. కవి కాలము నాటికి బాల్యవివాహములు, వృద్ధవివాహములు జరుగుచుండెను. ఆ దురాచార మిందు యవహేళన చేయబడినది. ఇచట కాలకౌశికుని పడచు పెండ్లాము పాత్ర ప్రత్యక్షముగ లేకపోయినను కవి చమత్కారముగ వారిరువురను దృశ్య సాక్షాత్కారము గావించిరి.

రమ్యం జుగుప్సిత ముదారమథాపినీచ
ముగ్రం ప్రసాదిగహనం వికృతం చవస్తు
యద్వ్యాప్యవస్తు కవిభావక భావ్యమానం
తన్నాస్తి యన్నరసభావముపైతిలోకే. – ధనంజయుడు

కవి ప్రతిభావిశేషముచే రమ్యమైనది, జుగుప్సాకరమైనది,ఉదారమైనది, నీచమైనది,వికృతమైన వస్తువు గూడ రసమయముగ జేయబడును. కవి భావక భావ్యమానమగుచో రసభావము నందనిది లోకమున లేదని ధనంజయుని యభిప్రాయము. అట్లే ఈ కవి పవిత్ర దేవతామూర్తి యగు శతాక్షీదేవిని తన భావనచే పాఠకుల కెట్లు దృశ్యసాక్షాత్కార మొనర్చిరో యట్లే జుగుప్సాకరమైన కాలకౌశికుని పాత్రను గూడ బొమ్మ కట్టించెను. అదేవిధముగ మానవులనేకాదు ఒక సింహమును గూడ మన కనులయెదుట నున్నదో యన్నట్లు వెలుపుగొలుపు నట్లు తన భావక భావ్యమానముచే నీ యల్పమైన మృగజాతిని గూడ దృశ్య సాక్షాత్కారము గావించెను.

బ్రహ్మాండభాండ కర్పరము బీటికలెత్త
దారుణోగ్రనాదంబు సేసి
విలయానిలా భీలవిహృతి నద్రులబెల్లఁ
గిల సటారింఛోళి దుళిపి విసిరి
చండభానుప్రభామండలాచ్ఛాదకా
త్యుచ్చైర్గతంబుగాఁదోకయెత్తి
భయదనుంధాన సర్వంసహాధర గుహా
ఘోరంబుగాఁ బెద్దనోరుఁ దెఱచి

బొబ్బరిల్లుచు గుబ్బులాగుబ్బుకొనఁగ
మేనసారించి కోరలమీటికొనుచు
నొక్కదూకున సింగపు రక్కసుండు
సీదుచును సురసేనల మీదికుఱికె. 5–154

మహిషుడు సింహాకృతిని ధరించి ఉదగ్రనాదంబు చేసి సటలదుళిపి విసిరి తోకయెత్తి నోరుదెఱచి సురల సేనల మీద కురికిన సందర్భము నందలిదీ పద్యము. దీర్ఘ సంస్కృత సమాసములతో ఓజోగుణము కలిగి రీవిగా సాగుచు సందర్భోచితశయ్యతో సాత్వతీవృత్తితో గౌడీరీతితో నొప్పుచున్నది. అసమాపక క్రియలతో పాదములన్నియు ముగింపబడి గీతము చివఱ 'సురుసేనల మీది కుఱికె' అన్న సమాపక క్రియతో ముగియుచున్నది. తీగను లాగి యొక్కసారి విడచినట్లు సింహము దాని దేహమును సాగదీసి యొక్కసారి పైకి లంఘించెను. దీర్ఘసంస్కృత సమాసములనుక్త్వార్థకములతో బిగించి లాగి 'ఉఱికె' అన్న సమాపక క్రియతో రక్కున ముగించుట. ఇదియొక పద్యశిల్పము. ఆసందర్భముననే తార్క్ష్యుని వర్ణనలో శబ్ద చమత్కారముతో పద్యమును సొగసుగ సంతరించిరి.

గరుడంచదురు మరుద్గత పటాపట పటా
    వటితాపతిత పాదపవ్రజంబు
శరదభ్ర సమశుభ్రతరవక్త్ర చంచూద్ధ
    తేరణ క్రేంకారదారుణంబు
శరసిత స్ఫురదరోచ్చర దశిప్రరుచిమ
    న్నఖముఖ వ్యాలీఢన క్షమంబు
చరమ భూధర గభాస్వర విభానురతనూ
    కపరి విషణసుశారంగపాణికంబు.

నటదపక్షేపణోత్క్షేపణక్రియా ప్ర
సారణాకుంచన గమాగమైకరోష
భీషణంబు సుదాంధ్రసతోపణాను
పోషణంబు తార్క్ష్యవిభూషణంబు. 5–151

ఒక్కొక్క పాదము ఒక్కొక్క దీర్ఘసంస్కృత సమాసముతో నుండి ఏ పాదమున కాపాదము విడివడుచు వృత్త్యనుప్రాసాంత్యానుప్రాసలు చేయి చేయి కలిపి నడచురీతి హొయలుగొల్పుచున్నది. రూక్షబంధబంధురతర దీర్ఘ సమాసఘటనను గౌడీరీతిలో ఆరభటివృత్తితో సీసపద్య రచన సాగినది.

'రీతిరాత్మా కావ్యస్య, విశిష్టపదరచనా రీతిః'

– విశేషో గుణాత్మా (వామనుడు)

విశిష్టశబ్దముల కూర్పే రీతి. ఈ రీతి కావ్యమునకాత్మ. ఈ గుణములతో గూడి యుండుటే విశిష్టత. వీరి రచనలో నీ విశిష్టశబ్దము లన్నియు విశిష్టరీతి భావమున కనుగుణముగ నొదిగి యుండును. ఇంతటి గంభీర భావమును సుదీర్ఘ సంస్కృతసమాసములు లేకయే 'పటపట, గళగళ' వంటి శబ్దముల ధ్వన్యను కరణతో అలతియలతి పదములతో సమాసవిరహితముగ శిథిల బంధముతో నొక సీసము వ్రాసి శబ్దచమత్కార విన్యాసముతో రసపోషణ గావించిరి.

పటపట బ్రహ్మాండభాండంబు క్షోభిల్లె
గడగడ సాచలక్షమ వడంకె
గళగళ నంభోది జలములెల్లఁ గలంగె
టివ్వు టివ్వున గాలితేఁగి వీఁచె
తటతటఁబర్వతస్థల సానువులు రాలె
జలజలని మహోల్కలీలఁదొరంగె
మలమల దెసలెల్ల మాడి ఘోరములయ్యె
మకమక సూర్యుఁడు మాసిక్రుంకె

ధమ్ము ధమ్మను భయశబ్దమ్ము పుట్టె
కుండలంబులతోడ వైకుంఠుశిరము
హేల నుప్ప రమునకుఁ బెల్లెగసె యెందె
వడియె వడిసెలలో ఊయి పగిదినపుడు. 1– 131

సీసములన్ని యొకే యచ్చులో పోసి తీయక చిత్రవిచిత్రములైన పద గుచ్ఛములను గూర్చి శబ్దశిల్పమును అర్థశిల్పమును ప్రదర్శించిరి.

కస్తూరి కలయంపి గమగమల్వాకీళ్ళఁ
దమ్మగంబురపాళ్ళతావినోళ్ళ
జాజి మల్లియ మొల్ల సంపంగి పందిళ్ళ
నునుజవాజికరుళ్ళఁజెనకుగోళ్ళ
మంచిగంధపుపూఁత మించుమేలియొడళ్ళ
నెసకంపుఁబుప్పొళ్ళ విసరుఁగేళ్ళ
కొప్పుల సిరిమించుఁ గొమరైన కురువేళ్ళ
గడఁగి మర్వపుమళ్ళఁ గట్టునీళ్ళ.

వలపులు బయళ్ళకెక్కి దిక్కులకు వెళ్ళ
మాకు ముక్కోళ్ళలోనికిఁబ్రాకి త్రుళ్ళ
వింటి మచ్యుతుపేళ్ళ నవ్విభునికాళ్ళ
కెరగి స్మరియింపఁజప్పుళ్ళనెత్తుగుళ్ళ

ఇందు 'ళ' కారముపాదాంతములందే గాక సీసము నాలుగుపాదము లందు ఆరవగణాంతమందుండి పద్యపుశయ్యకొక ఘనత సమత ఘటించుచు నడక కొక తూగు గూర్చుచు లయాన్వితముగ తాళము గొట్టుచున్నట్లున్నది.

పదము లెంతయు ముందటి పదములకును
బరమమిత్రత ఘటియించి పరపదాప్ప
దములుగాకున్న నదియె యందముగ శయ్య
యనఁగ విలసిల్లుఁగృష్ణపక్షుమాకళత్ర.[3] 109

**శయ్యానైగనిగ్యము :**

చక్కని శయ్య శృతిసుభగత్వము నొసంగును. ధారాశుద్ధి గలిగి చక్కని శయ్యతో గూడిన పద్యములు అర్థము తెలియకపోయినను ఒక యాపూర్వ గానమును విని పరవశము చెందినట్లుండును.

పొంగరు బంగారు రంగారు మేనితో
నెరికొప్పు సిరికప్పునీటుతోడ
కంబు నాడెంబు తోరంబూను గళముతో
జవకొన్న రవసన్న కవునుతోడ

తెగరేకు దగజోకు చిగురాకు మోవితో
మునుదోప జనుపూనచనులతోడ
వగరువ్వు తొగపువ్వు జిగినవ్వు కనులతో
తొండంబు గ్రొండంబు దొడలతోడ.

సంపంగుల చెంపగిలు నొససౌరుతోడ
విదియనెల జదియగల నెన్నుదురుతోడ
జక్కవలు నిక్కుబలుచక్కి ప్రక్కజిక్కి
యొక్క చక్కనిచుక్క తళుక్కుమనియె. 6-418

పద్యరచన సూక్ష్మముగ పరిశీలించినచో నెన్నో భేదములతో గూడి యున్నను స్థూలముగ నుద్ధతానుద్ధత శిథిలభేదములచే మూడు విధములుగ బేర్కొనవచ్చును. రచన యెప్పుడును రసోచితముగ నుండవలెను. అపుడే రసభావాదుల కనుగుణమగును. అట్టి రచన చేయగల్గుటే మహాకవి లక్షణము. కవి యట్టివాడైనపుడే పద్యశిల్పము వివిధముఖముల శోభిల్లును. అట్టి శిల్పాభి రామములైన పద్యములే కవియొక్క ధారాశుద్ధికి నుదాహరణములగును. శ్రీదాసు శ్రీరాములుగారి కవిత యెల్లెడల ధారాశుద్ధిశోభితయై యలరారుచుండును.

నానాలోక నికాయముల్ కడుపులోనన్ నిల్పి యిచ్ఛావిధా
నానూన ప్రతిభామయుండవయి మాయామోహవిభ్రాంతి సం
ధానంబుం గలిగించి యింతపని పూనన్ వేడ్కనీకేటికిన్
గానని మూఢుని జేయనేల నను గృష్ణా భక్తకల్పద్రుమా ! 9-290

కారుమేఱుంగొ బంగరు చొకారమొ వెన్నెలసోగయో సుధా
ధారయొ కాక పూవిలుఁతుదారయొ నిద్ధపుఁబద్మరాగ శో
భారమణీయ కందళమొ భాసురదుగ్ధ సముద్రవీచియో
నారుచిరాంగియొప్పె మదనప్రభవన్నవయౌవనంబునన్. 1-360

వెన్నుని ఖిన్నుని నత్యా
పన్నునిఁగని దేవికృపనుఁ బకపకనగి గ

ర్వోన్నతులగు దనుజులపై
దిన్నఁగఁ గన్నులెట్టఁజేసి తిరమైన మతిన్. 1-313

వీరి కవిత్వముపేశలమై మనోరంజకముగ నుండును. పేశలమై యుండుటకు కారణము వీరి పద్యములేపాదమున కాపాదము విడివడును. వేమన పద్యములవలె యతిస్థానమున పదములు వేరగుచుండును. వీనికి తోడు అనుప్రాసలు చేరి పద్యపు నడకకు ఠీవి గూర్చుచు శ్రుతిసుభగత్వము చేకూర్చు చున్నవి. పోతనగారి పద్యములకు సరిజోడుగ నున్నవి.

సత్యమున భూమి నిలచెను
సత్యంబున నెండగాయు జలజాప్తుడున్
సత్యమున గాలివీచును
సత్యమున గడలిదాటఁజాలదు కట్టన్. 6–93

ఒకచోట పవ్వళింపుచు
నొకచోటనె యాడికొనుచు నొకచో జలకే
ళీకలన దేలుచు సుఖమున్
బ్రకటింపుఁడు శక్రుడీవు ప్రముదితవృత్తిన్. 6–95

పాత్రప్రవేశమున గూడ శబ్దచమత్కారము ప్రదర్శించుచు ప్రధాన పాత్రలైనవాని ప్రవేశమొక సుదీర్ఘసమాసముతోను, ముగింపు ఒక యల్పసమాసము తోను చేయును.

హరిశ్చంద్రపాత్ర ప్రవేశము : 'సాంద్రయశోలసద్రుచి విచాలిత శారద చంద్రుఁడాహరిశ్చంద్రుడు .. ' (7–288). ఈ పాత్ర నిష్క్రమణము 'స్వారాజ్యము నందింద్రుని జేరి హరిశ్చంద్ర మనుజసింహుడు..' (7–863)

రేవతుని ప్రవేశము : ఉద్యన్నిరవద్య హృద్యతనుభాకంతుండు..' (6–337). అట్టిదే సగర పాత్ర ప్రవేశము కూడ (9–280).

ఇట్లు శయ్యానైగనిగ్యముతో బాటు ప్రతిపదచమత్కారము నెఱపి కవితకు శోభ గూర్చిరి.

**మణిప్రవాళశైలి** : శ్రీరాములుగారికి గీర్వాణభాషాపాండిత్య మపారముగ నుండుటచే నప్రయత్నముగ కొన్ని పద్యములు మణిప్రవాళశైలికి లక్ష్మీభూతములై యున్నవి.

దేవి నమోస్తుతే యనుచు ధీరజనుప్రణుతాం భజేహ మా
ద్యేవరదే పరే యనుచు దేహి ముద మ్మమతే పదంతువం
దేవిభుదార్చితే యనుచు దివ్యశరీరిణి రక్షరక్ష వి
ద్యావతి యంచు విష్ణుఁడు వియద్గతశక్తికి మ్రొక్కె భక్తితోన్. 1-297

సోహమనఁడాయె విజ్ఞానశూన్యుఁడాయె
'దత్త్వమసి' యను పలుకైనఁ దలపఁడాయె
నెలమి బ్రహ్మోహమని మదినెంచఁడాయె
జెలఁగి దేవీస్మరణమేనిఁజేయఁడాయె. 3-271

ఎన్నడు శపియింపంబడె
నన్నాటికి గత్రుపుసనమి యవనీసురలా
మన్నీని గూర్చి తలఁచిరి
కిన్నువిధేయం కిలాద్యకృత్య మటంచున్. 6-264

జనవర శుభస్యశీఘ్ర
మ్మనగా నశుభస్య కాలహరణమ్మనగా
.................................... 7-54

వచ్చిన మౌనిగాంచి జనవల్లభుఁడల్లన నమస్కరించినన్
జెచ్చెర స్వస్తి తేస్తనుచు నెమ్మిని దీవనయిచ్చి యొంటిగా
................................ 7-381

గాంభీర్యము,రౌద్రము అవసరమగు పట్టులందప్ప యత్నముగ గాఢ సమాస బంధములను సంస్కృతపదజటిలముగా నరుదుగా ప్రదర్శించిరి. అయినను సంస్కృతపదములు సరసముగ మృదుమధురములైన తెలుగు పదములతో సమ్మేళనమొంది సొబగులు గుల్కును.

**శాస్త్రజ్ఞత :-** లోకజ్ఞత వలె నానా విధ శాస్త్రవేతృత్వమును ఆపాత మధురముగ రచనలో సమ్మిళితమై నిగ్గులీనుచుండును. శుకుని ముందు వేశ్యాంగనలు ఆడిరి పాడిరి (1-652). ఆ సందర్భమున కవిగారికి గల నాట్య సంగీత శాస్త్రాభి నివేశములు వెల్లడియగును. నరనారాయణుల ముందు మేనకాదులు

చేసిన గానమున (4–115) గౌళ, కేదార, హిందోళ, కాంభోజి, వరాళి రాగములను ధృవ, రూపక, వినాయక[4] ఏక, ఆట, ఝంప, ఆదితాళముల బేర్కొనిరి. మునులు విచ్చేసిన వైకుంఠమున కోయిలలు, గువ్వలు, మధువ్రతముల ఆటపాటలతో (5–170) చక్కనినాట్యరంగస్థలమును సృజించిరి. దేవి దేవగాంధారిరాగము వీణపై నాలపించెనట (5–495). యశోమతి కన్నడలో నేడ్చెనట(6–419). మృదు వీణాస్వరమున సావేరీసంగతి మంద మధురగానము గతి (9–572) తులసి యేడ్చెనట. ఈ కవి గొప్ప సంగీతశాస్త్రవేత్త యగుటచే దేవిని రాగమయముగ రూపొందించిరి.

సారంగము వరాళి శంకరాభరణంబు
        నక్షులు కొప్పు నూగారు నయ్యె
బలహంసయును శ్రీయు లలిత పున్నాగంబు
        గమన శ్రవణనాభిగతులు నయ్యె
కవితాచలయు చంద్రకళ చక్రవాకంబు
        జఘనంబు హాసంబు స్తనములయ్యె
మధుర వనాటంబు మలయమారుతమును
        చరణ యుగ్మంబునుచ్ఛ్వాసమయ్యె

అవురవుర యేమిచెప్పనయ్యబల యధర
మెత్త రాగంబులన్నియు నింపు సొంపు
గులుకు  పలుకులు వెయ్యేల కోమలాంగి
మయిదలంచెద సంగీతమయమటంచు        5–507

దంభులైన దనుజులు దేవి యీ విధముగ నున్నదని తమ యేలిక శంభునితో విన్నవించిరి. రాక్షసులైనను నౌచిత్యము నతిక్రమింపలేదు. దేవి నాద బిందు కళాస్వరూపిణి కనుకనే నాదాత్మకమైన సంగీతమయమని వర్ణించిరి. ఇందు ఎన్నోరాగములు క్రమము తప్పక సొంపునింపుకున్నవి. అస్తోకము, అమేయము అయిన పదప్రయోగపాటవముతో బాటు సంగీత శాస్త్రపరిజ్ఞానము కూడ ఆ కోమలాంగి కొప్పులో చంద్రవంకవలె తళుక్కుమనుచున్నది. అంత్యానుప్రాసలతో లయతూగు నమర్చిరి. తాళలయానుగుణమగు గీతమువలె నాలా

పన గావించిరి. ఇట వసుచరిత్ర యందలి యీ పద్యము పాఠకుల మనమునందు మెదలును -

పదమెత్తంగలహంసనీల యధరస్పందంబుసేయన్ శుభా
స్పదమౌ రాగకదంబకంబు శ్రుతిచూపన్ శ్రీవిలాసంబు కే
ల్గదలింపన్ సుకుమార పల్లవ నవైలాలక్ష్మి వీక్షింప ష
ట్పదియుంబోల్పఁ దరంబె వన్నెగొనియాడన్ గేయవాక్రొపిడిమన్. 3-59

వీరి జ్యోతిశ్శాస్త్రపాటవము ఎచ్చట బట్టిన నచ్చట దర్శనమిచ్చును.

గురుడు పంచాంగంబును జూచి సురలకనియె
శుక్రుడేకాదశంబున సూర్యకుజులు
మూలనారింట శనియును మొనయు వారు
లగ్నము శుభంబు పంచకరహితమనుచు. 5-165

'స్వాతిగంతుడై అతివృష్టి గురియు శుక్రుంబోలి' (5-608) బాణవృష్టి గురిసెనట.

కురియు నొకకాలమున మార్గశిరమునందు
వానగురియదొకప్డు శ్రావణము నందు. 5 - 664

ఏకవీరుని రాజ్యాభిషేకము పుష్యార్క యోగసంయుక్తంబగు దినంబున (6-412) జరిగెనట.

శకునములు గూడ శాస్త్రములక్రింద పరిగణించిరి. దేవతలు నారాయణుని కడకు బోవు సమయమున వారికగు శుభశకునములు -

కలకలనవ్వుతుఁ గన్యక యెదురాయెఁ
బడమటిదిక్కున బల్లిపల్కె. 5-164

యక్షగాన రచనాదక్షులగుటచే నిచట నిది యప్రయత్నముగ చోటు చేసికొనినది.

కంసుడు దేవకి అష్టమ గర్భసంజాతను సంహరింపబోవునపుడు దుశ్శకునములు గాంచెను. (4-520)

తా[మునకు స్వప్నమున నల్లనిచీరె గట్టి యొక నాతి గృహాంగణమందు నేడ్చుచు మెల్లగ వచ్చెనట. ఇండ్లపయి గుడ్లగూబలు కూయుచున్నవట. ఇత్యాదిగా గల దుశ్శకునముల గాంచెను (5-275)

వృత్రుడు అమరపురిపై దండెత్తిరాగ నచ్చట దుశ్శకున పరివ్యాప్త మయ్యెనట (6-41 నుండి 46). దానికి శాంతి జేయింప బృహస్పతిని వేడిరట.

**నీతిశాస్త్రము :** 5-326-30 వరకు గల పద్యములలో సాత్విక, రాజస, తామసులగు ముప్విధములగు మంత్రులగూర్చి తెలుపబడినది.

సత్యవ్రతుని తండ్రి యాతనికి పట్టము గట్టి గద్దెను బెట్టి యనేక రాజనీతు లను జెప్పెను (7-246-48).

**మంత్రశాస్త్రము :** దేవీభాగవతము మంత్రశాస్త్రములకు నెలవు. ఇందాయా దేవతల నాయా మంత్రములతో నర్చించుట దెలుపబడినది. విశేషించి ఈ కవి వరులు సంకర్షణ మంత్రమును (8-47) సాంగోపాంగముగ వివరించిరి. తిరుపతి కవులు 'సంకర్షణ మంత్రముల నారాధించు' అని మాత్రమే చెప్పిరి. పాపయా రాధ్యుల వారు 'ఓం నమో భగవతే మహాపురుషాయ సర్వగుణసంఖ్యానా యానంతాయ వ్యక్తాయనమః' అను మంత్రము జపించుచు (8-75) అని మంత్రమును మాత్రము ప్రస్తావించిరి. శ్రీరాములుగారు మంత్రమును విశదముగ చెప్పుటకు కారణమిది వీరి నిత్యపారాయణమున నుండి యుండును. లేకున్న కవి తాత్పర్యమే యొసగియుందురు. దీనివలన కవి హయగ్రీవోపాసకులని వ్యక్త మగు చున్నది. 9,10,11 స్కంధములు కవికి గల మంత్రశాస్త్ర పాటవమును వెల్లడిచేయును. అట్లే తర్కశాస్త్రమును ధర్మశాస్త్రమును గూడ నాయా సందర్భముల వివరించిరి.

**అలంకారములు :**

కావ్యమున కింపు నింపునవి యలంకారములు. వీరిది యాలంకారికమైన శైలి. వీరి రచనలో ధారళముగ నప్రయత్నముగ నీయలంకారములు కుదురు కున్నవే. అవి యలంకారములకై సేసినవి కావు. ఉపమ,ఉత్ప్రేక్ష,రూపకము అర్థాంతరన్యాసమునే విరివిగ కలవు. చాల వరకమూలకములుగ కల్పించిన

నీతిబోధనకు గూడ నీ యర్థాంతరన్యాసము పెక్కుచోట్ల నీకవి ప్రయోగించిరి. స్వభావోక్తిని ప్రదర్శించుటలో వీరు మిక్కిలి నేర్పును ప్రదర్శించిరి. ఉపమను అర్థాంతరన్యాసములను ప్రయోగించునట్లు మిగిలినవి యంతగ ప్రయోగింపలేదు. ఈ యలంకార కల్పన నాలుగు రకములు. 1. అట్లే యథాతథముగ సంతరించుట. 2. ఇంచుక మార్చి వ్రాయుట. 3. వానికే కొన్ని నూతనములైనవి చేర్చుట. 4. అమూలకములగు నలంకారములను జేర్చుట.

1. **యథామూలముగ నలంకారములను గ్రహించుట :**

తనయోగ్యః కుమారో నౌభర్తా భవితుమర్హతి
యోగో యం విహితో స్యాసీక్మణికాంచసయోరివ. 3–17–62

ఈ యుపమానమును కవి యట్లే యథాతథముగ గ్రహించిరి.

అతఁడా నీకేతగు నీ
వనితకిన్ తగినదాన వబ్జజుఁడును మి
మ్మతికించెనేని రత్నము
నతికించుటగాదె కనకమందు వరాంగీ. 3–422

శుకుడు వ్యాసునకు ప్రదక్షిణ చేసి –
చలితస్తరసాతీవ ధనుర్ముక్తశ్శరో యథా. 1–17–11

ఈ యుపమానమునే గ్రహించి 'చనియెన్ విలువిడిచిన సునిశిత బాణంబు వోలె శుకుఁడు మిథిలకున్ ' (1–619)

ఉపమాయంత్రసాదృశ్య లక్ష్మీరుల్లనసతిద్వయోః
హంసీవ కృష్ణతే కీర్తి స్సర్గంగా మవగాహతే – చంద్రాలోకం, 1

చంద్రాలోకకర్త శ్లోకప్రథమార్థము నందుపమలంకార లక్షణము ద్వితీయార్థమున ఉదాహరణమిచ్చెను. ఇది పూర్ణోపమ. పైన చెప్పిన యలంకారము కూడ నట్లే పూర్ణోపమయై యున్నది. ఉపమానమున కుపమేయమునకు సామ్య మెచట విలసిల్లునో యచట నుపమాలంకారము. ఇచట విలువిడిచిన సునిశిత బాణము ఉపమానము. శుకుడు మిథిలకుఁబోవుట ఉపమేయము. లక్ష్యమునకు సూటిగ చనుట సాధారణ ధర్మము పోలె ఉపమా వాచకము. బాణము సూటిగ

పోయి లక్ష్యమునకు తగులవిధముగ శుకుఁడు తిన్నగా మిథిలకుఁబోయెనని యర్థము. ఈ చక్కని యుపమానమును యథామూలముగ గ్రహించిరి.

ప్రదీపశ్చ యథాకార్యం ప్రకరోత్యర్థదర్శనం
వర్తిస్తైలం యథార్చిశ్చ విరుద్ధాశ్చ పరస్పరం. 3–9–89

విరుద్ధం హి తథాతైల మగ్నినాసహసంగతమ్
తైలం వర్తివిరోధ్యేవ పావకో పి పరస్పరం. 3–9–30

ఏకత్రస్థాః పదార్థానాం ప్రకుర్వన్తి ప్రదర్శనం. 3–9–31

వినుము నారద తెలిపెద వీనితెఱగు
వత్తి చముఋలొగి విరుద్ధవృత్తులయ్యు
వాని కలయిక దీపంబు వస్తువులను
గానఁగాజేయు దృష్టాంతగతి నెఱుఁగుము. 3–178

అట్టిదే మరియొక మనోహరమైన యుపమానము –

తస్యచేచ్ఛాస్మ్యహం దైత్యసృజామిసకలంజగత్
సమాంపశ్యతి విశ్వాత్మా తస్యాహం ప్రకృతిశ్శివా. 5–16–36

తత్సాన్ని ధ్యవశాదేవ చైతన్యం మయిశాశ్వతమ్
జడాహం తస్యసంయోగాత్ప్రభవామి సచేతనా. 5–16–37

అయాస్కాంతస్య సాన్నిధ్యా దయసశ్చేతనాయథా
నగ్రామ్యసుఖవాంఛామే కదాచిదపిజాయతే. 5–16–38.

పురుషుని సాన్నిధ్యంబున
బరగుం జైతన్యమహిమ పరమపురుషునిం
దొరగినపుడు జడనగుదున్
బొరివినుమును సూదిగంటుసోలిక నసురా. 5–395

ఇట్టి చక్కని యుపమానములను యథాతథముగ గ్రహించి సొగసుగ సంతరించిరి.

మరికొన్ని నూతనములైనవి జేర్చి చెప్పిన యలంకారములు గూడ సొగసుగ కుదురుకున్నవి.

యథాపిపీలికా మూలాచ్ఛాఖాయా మధిరోహతి
శనైః శనైః ఫలంయాతి సుఖేన పదగామినీ. 1-18-28

విహంగస్త రసాయాతి విఘ్నశంకాముదస్యవై
శ్రాన్తో భవతి విశ్రమ్య సుఖంయాతి పిపీలికా. 1-18-29

'...... కావున నింద్రియేచ్ఛా శమంబునకుంగాఁగ్రమక్రమంబుగ నాశ్రమంబు నుండి యాశ్రమంబున కెక్కవలయు, నెట్లనిన పిపీలికావృక్ష శాఖారోహణ న్యాయంబునవలంబింపందగు లేకున్న శ్రాంతివాటిల్లు. మనుజుని మనంబు దొంగగొడ్డు వంటిది .......... ' (1-674) 'సులభంబుగ వశంబు గాదు ...... '(1-674) 'ఈ దొంగగొడ్డువంటిది' అని చేర్చుటచే ఈ భావమునకు మరికొంతపుష్టి చేకూరినది. ఇది తొలగించిన దాని భావవివృతికి శక్తి చాలదు.

కఃశ్రమః కరిరాజస్య మాలతీపుష్పమర్దనే
మారణేతవ వామోరు మహిపస్య తథారణే. 5-10-21

ఒంటిదానవు చిన్నదానవయోమృదూరు పదాబ్జవా
కంటకోపముతోడ జన్యముఖంబునంబడి నిల్చె దే
పంటిక్రిందికి నప్పడంబవొ పప్పవో వడియంబవో
దంట యేనుఁగు జాజిపూవులదండ మట్టినపోల్కియౌ. 5-223

మాలతీపుష్ప మన్నదానిని జాజిపూదండగ పరివర్తింపజేసిరి. ఇచ్చట 'పంటి క్రిందికి నప్పడంబవొ పప్పవో వడియంబవో' అన్నయుత్ప్రేక్ష ఆదనముగ నుప మాలంకారమునకు జేర్చి ఆ భావమును మరింతగ వివరించిరి.

ఇంచుక మార్చి మూలమునకు మెఱుగుదిద్దిన యలంకారములు గూడ కలవు.

చన్దనం దేహలగ్నం మే విషవద్భాతి భామినీ
స్రగియం సర్పవచ్చైవ చన్ద్రపాదాశ్చ వహ్నివత్. 3 - 18-6

ఈ యుపమాలంకార మిచట విభావనాలంకారమైనది.

విరుద్ధాత్కార్యనిష్పత్తిర్దృష్టా కాచిద్విభావనా
శీతాంశుకిరణాస్త స్వీం హస్తసంతాపయంతితామ్ – చంద్రాలోకము,76.

విరుద్ధమైన దానిచే కార్యము కల్గినట్లు చెప్పుట విభావనాలంకారము. ఇచట పూలదండ ధరించుట వలన మహాసర్పము ధరించినయార్తి కలగజేయు గుణముండదు. అట్లే గంధము చల్లగా నుండుటచే ఆమె కార్తి చేకూరినది.

అయ్యో పూవులదండ యంచు నిడితే యార్తిన్ మహాసర్పమే
యయ్యో గంధమటంచలందితివి కాదమ్మా విషంబిద్దియే
నుయ్యో నాకిఁక మేడలేల కలవాణుల్వీణలేలా లస
చ్ఛయ్యా సౌఖ్యములేల నన్విడువుమీ చానా సరోజాననా. 3–431

మూలములోని యుపమాలంకారము 'చన్ద్రపాదాశ్చ వహ్నివత్' అన్నది 'చందమామ జూచి సామిమోమనుకొందు' అని భ్రాంతిమదలంకారమైనది.

మరియు బయలకేగి మండుచున్న
పెద్ద యెఱగలంచు బెగ్గిలి పయ్యెద
జాటుజేసికొందుఁ జంద్రవదన. 3– 429

ఇచట కవి మూలమును మిక్కిలిగా నీ యలంకారములతో ప్రపంచించి రచించి రసవద్ఘట్టముగ తీర్చిదిద్దిరి.

విషయ వివరణమునకును రచనా సౌష్టవమునకును అమూలకముగ నెన్నో యలంకారముల జేర్చిరి.

దుల్లిన విష్ణుమూర్తి శిరసు 'వడిసెలలో రాయిపగిదినపుడు పెల్లెగసి పడెనట' (1– 131).

చంద్రుని వద్ద నుండి బృహస్పతి కడకు వచ్చిన గర్భవతియైన తార –

పరులజేత జిక్కి పలునాళ్ళు తన సాగు
బడినిలేని పొలము బాగుసేసి
పరగ దున్ని విత్తి పండించియిచ్చిన
బంటకాపుఁబోలె బాపడలరె. 1–417

నట. ఈ ఉపమానము కవిగారి ఉపజ్ఞతకు నికషోపలము. సుదర్శనుఁడు కాశీరాజు బిడ్డను గోరుట, 'మ్రింగ మెదుకులేదు మీసాలకు సంపంగి నూనెట' (4–488) సింగం బాకటఁ గొనబోవు నెఱన్ గోకోయని కొంక నక్క కొనినట్ల యగునట' (3–503)

'శశికళ మోము లేఁతఁదమ్మి సూర్యదర్శనమునఁబోలె' వికసించినదట (3–411) 'కంసుదు మింటికి విసరిన పురిటిబిడ్డ కాటుకపిట్టవలె మింటి కెగసెనట' (4–530)

బృహస్పతి ఇంద్రుని ప్రబోధించినపుడు 'గుడ్డిదగు నెద్దుచేనంబడ్డ యటుల గాక బుద్ధిఁబరికించి సదా దొడ్డపనిఁజేయ నగునని' చెప్పెను (5–93)

ఇంద్రునకు మహిషుండు నాకముపై దండెత్తి రాదలంచుట 'పిల్లింజూచిన యెలుక చందంబుగా' నున్నదట (5–116).

దేవదానవులు 'వడివడి చెడుగుడి' లాడినట్టుల కొట్టుకొనిరట (5–149)

దేవిని శరములతో నొంచుట 'మల్లెపూ చెండుబగ్గను మంటలోనవైచుట' వంటిదట (5–399). ఈ యుపమానము కాళిదాసు యొక్క యుపమానమునకు దగ్గరగా నున్నది.

హరిహరాదులను గెలిచిన మహిషునకు దేవిని జయించుట 'మదగజేంద్రంబు కుంభమ్ము మెదడు దినెడి, సింగమెలుకను సాధింప జేరినట్లే, (5–400) అని అర్థాపత్తి యలంకారమును జేర్చిరి.

మూలములోన నిరలంకారములయినవానికి చిన్న చిన్న యుపమానముల జేర్చి రమ్యముగ జెప్పిరి.

ధూమ్రాక్షియైన కాళికమొగము 'ప్రాతమంగలపు పెంకును' (5–576) బోలి యున్నదట. ఇదెక్కడి సాదృశ్యమో కవికెట్లు తోచెనో యాశ్చర్యము కలుగును.

కాళిక రాక్షససైన్యమును 'అప్పడాలు వడియాలు గాగ దంతాలక్రింద కరకర నమిలివైచెనట' (5–609). ఈ యుపమానము లన్నియు నెచట నుండియో సంగ్రహింపక నిత్యము పరిసరములలో నుండిన సన్నిహితములగు వస్తువులతోనే

యుపమించుట మనోజ్ఞము. ఈ యుపమానములు ఈ యలంకారములె ఈ పురాణమునకు కావ్యశోభను గలిగించుచున్నవి.

మునులు సురధునిలో నాతనిని తమతోబాటు నివ్వారిబియ్యమును తినుచు 'వడ్లతో తట్ట యెండంగవలసినట్లుండుమ'ని (5–707) చెప్పిరి. ఈ సందర్భమున నీ యుపమానము భావపరిపోషకముగ నున్నది. కవియొక్క సద్యస్ఫురణ ప్రతిభ వ్యక్తమగుచున్నది. వృత్రాసురునితో ఋషులిట్లు పల్కిరి – 'మీకు సహజంబులగు వెతలయ్యె మాకు నావులావులును బోరి దూడల నణగద్రొక్కినట్లున్నదట' (6–85). దమయంతి నారదుని బెండ్లియాడుట 'కాకిముక్కునను దొండపండు వంటిది' (6–531). ఇది మాలోపము. కాకి ముక్కునకు బెట్టిన దొండపండు,తుమ్మకు బెట్టిన జాజితీగె. ఉదా ॥ 'నీచునకిచ్చు తమలపాకు పేరిమగునట'. 'కాకిముక్కు నకు దొండపండు' అన్న యుపమానమును 'జాజిపువ్వు' నుదాహరణను పలుచోట్ల పేర్కొనిరి. (7–58,1–378). తెలుగు జాతీయములలోను, లోకోక్తులలోను ఉపమకున్న ప్రాధాన్య మింతింతనరానిది. యూపస్తంబము నుండి వెలువడిన బాలుడగు శునశ్శేఫుడు 'పులినోటినుండి తటుకున వెలువడు నా దూడ మాడ్కి', (7–341) యున్నాడట. ఈ సామాన్యమైన యుదాహరణ మిక్కిలి మనోహరముగ నున్నది.

'పొల్లును విడిచియఖర్వతధాన్యంబు గొనిన కర్షకులీలన్' (7–649), సర్వ ప్రయత్నముల నాసర్వేశ్వరిని గొలువవలయునట. కేవలము కావ్యములును, శాస్త్రములును పరిశీలించుటయే గాక లోకమును గూడ నవేక్షణము గావించిన వారికి మాత్రమే అవగతములగు విషయములిందు పొడగట్టును.

వీరిభక్తి 'కండచక్కెగన్న గడుతీపి' యట. వీరు 'కృష్ణాభక్త కల్పద్రుమా' యను మకుటము గల (9–290–390) శతసంఖ్య పద్యముల నమూలకముగ రచించి రత్నపేటికలో దాచిన కనక భూషణము వలె ఈ గ్రంథమున నిక్షేపించి యున్నారు. ఈ శతకము నందలి పద్యములు వసురాయల వారి భక్త చింతామణి పద్యములను తలపించును.

> పూచిన మాధవీలతికఁబొందిన తిన్నని పొన్నగున్ననాఁ
> దోచుచుఁ బెండ్లికూతుఁ దనతోడయి యుండ. 3–595

శత్రువులు వారిని ముట్టడించిరట. ఇది చక్కని యుత్ప్రేక్ష.

సంభావనాస్యా దుత్ప్రేక్షా వస్తుహేతుఫలాత్మనా
ఉక్తానుక్తాస్పదాద్యాత్ర సిద్ధాసిద్ధాస్పదే పరే - చంద్రా - 27

అన్యధర్మ సంబంధ నిమిత్తము చేత నన్యవస్తువునకు నన్యభావ తాదాత్మ్య సంభావన యుత్ప్రేక్ష యనబడును. ఇచట పెండ్లికూతురుతో నున్న సుదర్శనునకు మాలతీలతిక పొందిన పొన్నగున్నను తాదాత్మ్యము నుడువబడినది. కావున నిది వస్తూత్ప్రేక్ష. అందునను అన్యవిషయ వస్తూత్ప్రేక్ష.

విషయ్యభేదతాద్రూప్య రంజనం విషయస్య యత్
రూపకంతత్త్రిధాధిక్య న్యూనత్వానుభయోక్తిభిః.

రూపకము అభేదరూపము,తాద్రూప్యరూపకము అని రెండువిధములు ఉపమాన ఉపమేయ అధిక్యతా న్యూనతల చేత మరల వివిధ భేదములతో నుండును. ఈ క్రింద చెప్పబడిన రూపకము అభేదరూపకము. ఇది అనుభయా భేదరూపకము. ఇచ్చట ఉపమానమైన చెట్టునకు ఉపమేయమైన పారునకు ఆ భేదము చెప్పబడినది.

పారుడు చెట్టు ధర్మములు పత్రములోమునినాధవేద వి
స్తారము శాఖికాచయము జ్ఞానము పండు సమస్త తీర్థసం
చార తపోవ్రతాదిక విచారము పుష్పగణంబు సంధ్య దా
వేరదిగాన వేరునుపవృక్షము నుండును సంధ్యయల్పమే. 11-202

నారులకు లోచనములే
బారమ్ములు బొమలె విళ్ళు భావములే మం
త్రారంభమ్ములు లక్ష్యము
పూరుషుడు మనోరథంబె పొసఁగు రథంబై. 5-672

ఇదియును రూపకాలంకారమే, ఉపమానధర్మము ఉపమేయము నందారోపించబడి తాద్రూప్యము చెప్పబడి అనుభయోక్త తాద్రూప్య రూపకమైనది.

విషమం వర్ణ్యతేయత్ర ఘటనా ననురూపయో ః
క్వేయం శిరీషమృద్వంగీక్వతాదృఙ్మదనజ్వరః

చిగురాకు వంటి నీచెయ్యేడ మొరకైన పరిఘంబు జక్కగా పట్టుటేడ?
(5-675)

ఇచట అననురూపములైనవానికి ఘటన (సంబంధము) వర్ణింపబడినది. అతి మృదువైన చిగురాకువంటి చేతికి కర్కశమైన పరిఘకు ఘటన వర్ణించెను. కావున విషమాలంకారమైనది.

భ్రాంతి చేత వేఱొక వస్తువుగా దలంచిన భ్రాంతిమదలంకారమగును–

పగటిని రాతిరంచును నృపాలుడు గాంచెను కోమలాంగి నె
మ్మొగమును జూచి చంద్రుడను మోహములోబడి దంతపంక్తి రి
క్కలగమి యంచునుం భ్రమసి కమ్మనివాతెరయే సుధారసం
బుగ గొని కన్నులం గలువ పువ్వులుగా గొనియేమిచెప్పుదున్. 9–545.

పగటిని రాతిరని, ముఖమును చంద్రుడని, దంతపంక్తి రిక్కలగమియని భ్రమసెను. కావున నిది భ్రాంతిమదలంకారము.

నింగినిండు నెలయటె ఫిరంగు గుండు. 9–565

నిండుచంద్రుని ఫిరంగుగుండుతో నుపమించుట క్రొత్తదనము (9–579) లోశ్లేష, (9–582), లో చక్కని యర్థాంతరన్యాసాలంకారములు చెప్పబడినవి.

నింగి దొలంగిన కార్మెరుంగా భూస్థలి దిగిపడ్డ చుక్కయొ (– 9–501) యని సందేహించుట సందేహాలంకారమగును.

'ఉత్తరోత్తర ముత్కర్షస్సార ఇత్యభీధీయతే', ఉత్తరోత్తరము నుత్కర్ష వర్ణింతు మేని సారాలంకారమగును.

గోదానశతంబైనన్
భూదానము పాటి యవ్వి నూరైనన్ గ
న్యాదానమున సరియవి నూ
రై దయతో సాటివచ్చునా మృదుతన్వీ. 5–367

శబ్దాలంకార ప్రయోగములో గూడ యసాధారణ ప్రజ్ఞ ప్రదర్శించిరి.

గంగ దయారసంబు సెలగంగను మమ్ముల మానుషత్వమే
గంగను సాయమొందు కలుగంగ దలచితి మీవుభూమికే
గంగని శంతనుం గలయగంగని వుట్టుదు మేము నీకు వే
గం గడుపాసఁబుచ్చి తొలగంగ జలంబుల ద్రోయుమీ మమున్. 2–72

నామస్మరణమాత్రముననే కలుషహారిణియైన గంగను అష్టోత్తరములచే నర్పింపక పోయినను అష్టపదోచ్చారణచే నోరార స్మరించి తరించిరీ కవివరేణ్యులు. అష్టవసువులు,గంగనిట్లు ప్రార్థించిరి– సాభిప్రాయమైన ఈ యమకము రమ్యముగ నున్నది. సామాన్యముగ జెప్పిన నింకొక యమకము.

రాజపుత్రి వినియె రాగంబు లెంతేని
రాగమాలకింప రాగమెచ్చె
రాజపుత్రికపుడు రానురాగడు నను
రాగమెచ్చె మందరాగధీర. 6–501

'ఈ విమలాంగి కౌను సిరి కేసరికే సరి యీ నెలంతకె' (1–443) యమకము ఛేకానుప్రాస సొగసుగ నున్నది.

అల్లూరి వర్ణన యందలి వచనములు ముక్తపదగ్రస్తముతో కూడి యున్నవి. బ్రహ్మకృత విష్ణుయోగనిద్రాస్తుతి యందలి సీసపద్యమున నొక ముక్తపదగ్రస్తము కవిగారి యశేష శేముషీప్రజ్ఞను వెలార్చుచున్నది –

భణసీయ గుణపాలిపాలిత భూచక్ర
చక్రగదాభుజాచారుదండ
దండసాధనతాతా తాతప్రియకుమార
మారసుందర గరుత్మత్తురంగ

రంగదర్ణవరాజ రాజన్మహాలయ
లయకాలకీలికీలాప్రతాప
తాపస సంతాన తానవార్తి విఫాల
ఫాలబాల సుధాగభస్తి బింబ

బింబతులితా ధరాధరాలంబమిత్ర
మిత్రమండల గతగాత్ర గాత్రధీన
ధీన మచ్ఛీసుఖనిదాన దానవారి
వారిజానన కారణ కారణాత్మ. 1–224

అంత్యానుప్రాస ఛేకానుప్రాస ఆద్యంతము తోడుగసాగినవి. 7-107 పద్యములో 'నానా' యను రెండక్షరములు పదేపదే వ్రాసిరి. ప్రతిపదాదిని 'నానా' వర్ణము లావృతముచేసి శబ్దచమత్కారమును సాధించిరి. ఇట్టి వెన్నియో గలవు. ఒక్కొక్క పరి వీరు శబ్దాలంకారప్రియులేమో యని సందేహము పొడమును. ద్విరుక్తటకారముతో ప్రాసగూర్చుట కవికి మిక్కిలి మక్కువ.

పట్టి పెక్కునాళ్ళఁబట్టి పట్టిననోము
గట్టితనముచేత గట్టుపట్టి
చెట్టఁబట్టినట్టి దిట్టవరమ్మున
బుట్టితివి వరాలపుట్టివగుచు. 1-501

ఈ 'ట' కారవృత్యనుప్రాస సాభిప్రాయముగ ప్రయోగింప బడినది. పట్టికై వ్యాసుడు యెంత గట్టి పట్టుపట్టెనో వ్యక్తము చేయుచున్నది. 'శివుడు' అనుటకు 'గట్టుపట్టి చెట్టపట్టిన దిట్ట' అని పరివర్తించిరి. మూలమున నిది నిరలంకారముగ నున్నది.

శ్రుత్వాదేవ్యాశ్చరిత్రం వైకుర్వేమఖమనుత్తమమ్
ప్రాసాద్యాత్తవ విప్రేన్ద్ర భవిష్యామిచ పావనః. 3-14-2

దీని నిట్లు శబ్దాలంకారముతో కైసేసిరి -

దేవదేవదేవ దేవిచరిత్రంబు
వినఁగ వినఁగఁబెఱుఁగు వినెడుబుద్ధి
మేలు మేలు నాకు మేలుగా మునిముఖ్య
తెలుపు తెలుపు మమృత మొలికి కులుక. 3-296

వీరి రచన యిట్లు చక్కని యలంకారముతో నిగ్గులీనుచు రమ్యముగ నుండును.

**ఛందోవైవిధ్యము :**

రసపుష్టి లేని సందర్భములందు ఛందోవైదగ్ధ్యము ప్రదర్శించియా వెలితి నింపిరి. భగవన్నుతి స్తోత్రము లందు మకుటములతో కొన్ని వృత్తములు గాని,

కందములు గాని, గీతములు గాని చెప్పుట గలదు.స్తుతి యున్నపుడు నియమిత పాదముల నతిక్రమించి వ్రాయుటయు కలదు. 5 పాదముల గీతము నొకదానిని, చంపకముల రెండింటిని, ఉత్పలమాలలు మూడింటిని వ్రాసిరి. 7 పాదముల మత్తేభమును, 6 పాదముల చంపకమును వ్రాసిరి. 8 పాదముల సీసమును, 14 పాదముల సీసములు మూటిని, 20 పాదముల సీసమును,112 పాదముల సీసమును రచించిరి. అచ్చతెనుగు గీతము నొకదానిని వ్రాసిరి. ఒక సంస్కృత శ్లోకమును రచించి కందమున నిక్షేపించిరి (3-617). చతుర్థస్కంధములో 'ఏనరుడికజ్ఞాన శీలుడీ భువిని నృపా' అన్న మకుటముతో 112 కందములను 'కృష్ణుండెవ్వండంచు నే జోహారు జేసెదన్' (9-148 నుండి 452) అన్న మకుటముతో నైదుత్సాహములును 'దక్షిణా' యన్న మకుటముతో (9-1360-62) మూడు మత్త కోకిలావృత్తములను, 'కాకోదరవేణి నిత్యకల్యాణి యికన్' అన్న మకుటముతో (9-826-29),నాలుగు కందములును, 'ధర్మరాజ' అన్న మకుటముతో (9-862-65),నాలుగు తేటగీతులను, 'ఇందు కృష్ణు డెవ్వడంచు నే జోహారు జేసెదన్' అన్న మకుటముతో ఐదుత్సాహలు(7-448-52) రచించిరి. రాధాదేవి స్తోత్ర్యమును (9-1561 నుండి 1565) ఐదు కందములలోను, రాధాదేవి ధ్యానమును (9-1546 నుండి 1518) మూడు స్రగ్విణీవృత్తములలోను, స్వధాస్తవమును (9-1324,1325) రెండు ఉత్సాహలలోను,కాలమహిమను ఎనిమిది కందములలోను, గంగస్తుతిని (9-411-14) నాలుగు ఉత్సాహలలోను, మానసస్తుతిని(9-1508 నుండి 1501) నాలుగు కందములలోను జేసిరి. ఇవిగాక ఆరు దండకములు రచించిరి. అందు రగణములతో కూడిన దొకటి. యగణములతో కూడిన దొకటియు గలవు. మిగిలినవి తగణములతో కూడి యున్నవి. నిరోష్ఠ్యచంపకమును (1-225), నిరోష్ఠ్య శార్దూలమును (8-16) ఓష్ఠ్యందకమును (8-17) రచించిరి. వీరు సామాన్య వృత్తములను జాత్యుపజాతు లనే గాక ఒక కురంగప్రయాతమును,(2-245) చతుర వృత్తమును (1-63), పదిస్రగ్విణి వృత్తములను,నాలుగుసుగంధి వృత్తములను రెండు భుజంగ ప్రయాతములను(10-111),చిత్రమానినిని(3-234),వినోదిని వృత్తమును(3-616),గమనికా వృత్తమును (4-252),రెండు స్రగ్ధరలను,రెండు ద్విపదలను, రెండు తరువోజలను,పదునారు మత్తకోకిలలను ఎనిమిది తరళములను, ఇరువది

ఉత్సాహలను,మూడు రగడలను,అందొకటి మధురగీతి రగడ (3–55),మూడు మాలినీవృత్తములను,పది వసంత తిలకములను,పది పంచచామరములను, ఒక వనమయూరమును (6–80). ఉపేంద్ర వ్రజమును,వాహినీవృత్తమును,ఒక తోటకమును (6–79) ఒక పృధ్వీవృత్తమును,ఒక కళావతీవృత్తమును రచించిరి.

నవమస్కంధమున 'కృష్ణాభక్తకల్పద్రుమా' యన్న మకుటముతో (9–290 నుండి 390 వరకు నొక శతకము కలదు. భగీరథుడు కృష్ణుని స్తుతించు సందర్భము నందలిది.

వీరి చమత్కార కవితాపాటవమును ప్రదర్శించు రచనలెన్నో కలవు. 9–936 నుండి 9–970 వరకు ముప్పదిరెండు సీసములను వరుసగ వ్రాసిరి. 9–402 నుండి 405 వరకు నాలుగుత్పలమాలలను రచించిరి. వీనియందొక విధమైన చమత్కారమును ప్రదర్శించిరి. మొదటి ఉత్పలమాలలో పాదారంభమునకు యతిస్థానమునను'గంగ' యని వచ్చునట్లును,నాలుగు పాదములందును ఆ వృత్తము చేసిరి, అట్లే రెండవదానిలో 'మేలిమి' యని మూడవదానిలో 'అంగన' యనియును. నాలుగవ యుత్పలమాలలో 'నీయను' యని పాదారంభమునను యతి స్థానమునను నాలుగుపాదములలో నావృత్తము చేసిరి. అన్నియు గలిపిన 'గంగమేలిమి యంగన నీయను' అనియైనది. ఇది గంగాస్తుతి యందలిది. ఇది యొక కవితాచమత్కారము. అసంఖ్యాకములగు పద్యరచన చేసిన వారందరు విశిష్టకవులు కారు. ఆ పద్యముల ఎత్తుగడలో ముగింపులో రచనలో ప్రదర్శించు వైవిధ్యము వైదగ్ధ్యము వైచిత్ర్యములచే నొక విశిష్టత చేకూరి తద్రచయితను నొక మహాకవిగా నభిషేకించు చున్నది.

శ్రీనాధుడు సీసపద్య రచనలో నెన్ని 'హొయలులు' ప్రదర్శించెనో శ్రీరాములు గారును సందర్భ స్వభావానుకూలముగ ననేకరీతుల యొయ్యారముల నొలికించి వైచిత్రిని బ్రదర్శించిరి. 5–154, 5–151,1–131,3–51 పద్యము లందట్టి వైచిత్రిని ప్రదర్శించిరి.

సీసములన్ని యొకే యచ్చులో పోసితీయక చిత్రవిచిత్రములైన పదగుచ్ఛములను గూర్చి శబ్దశిల్పమును అర్థశిల్పమును ప్రదర్శించిరి.

రోలంబ జాలంబ యాలంబ కచపాళి
కాకున్న నిరులసంగాతమేల
చిందంబునందంబు చందంబు కందంబు
కాకున్న శబ్దసాంగత్యమేల
..........................................
......... నహహ శృంగారలక్ష్మి
చారు పంకేరుహాస్య బంగారు మేన ..... 5-514

ఇందలి పదగుచ్ఛములన్నియు నంతమున ప్రశ్నార్థకములతో నొప్పుచు సరసనే చిన్న నుడికారపు సొంపు జేర్చి అహహ అని సహృదయుల తలలూపింప జేసి పద్యము నొక శృంగారలక్ష్మి వలె సాక్షాత్కరింపజేసిరి.

**ప్రాసలు :**

ప్రాసలు పాటించుటలో పాటవమును బ్రదర్శించిరి. ద్విప్రాస, త్రిప్రాస, చతుఃప్రాస,పంచప్రాస గల పద్యములు గలవు. పదునాలుగక్షరముల ప్రాస గల పద్యములను గూడ రచించిరి. త్రిప్రాస కుదాహరణములు-

ఒకవేళ తగునీతు లుదయింప బోధించు
నాడు వాంద్రకు దనయంతదాన
ఒకవేళ భారతాది మహాగ్రంథముల్
చదివించి విను ధర్మసమితి దెలియ
ఒకవేళ పెన్మిటియొద్దకేగి కుటుంబ
కార్యమంత్రముల జక్కట్లుదీర్చు

ఒకవేళ తన మన్మలును మన్మరాంద్రకు
గతలు సెప్పుచు మచ్చికలను దనుపు

ఒక్కవేళను ననుబిల్చి యెక్కుడైన
చిక్కువిడ ద్రొక్కబుద్దులు చెప్పిపంపు
నొక్కవేళను వేల్పుల ప్రక్కమొక్కు
నట్టి కామేశ్వరమ్మ మాయమ్మ దలతు. పీఠిక ,పు. 39.

**చతుఃప్రాసము–**

భాగవత మఘవినాశము
భాగవతము ధర్మదంబు పరమార్థదమున్
భాగవతము కామదమీ
భాగవతము మోక్షదంబు భక్తియుతులకున్. 1–61

**త్రయోదశ ప్రాసము –**

కలిత సరస్వతీ కవచంబుచేతనే
వాల్మీకి కవివంద్యుడాయె
కలిత సరస్వతీ కవచంబుచేతనే
భార్గవుండసుర సంభావ్యుడాయె
కలిత సరస్వతీ కవచంబుచేతనే
జీవుండు బుద్ధివిస్తీర్ణుడాయె
కలిత సరస్వతీ కవచంబుచేతనే
స్వాయంభువుడు కీర్తిశాలియయ్యె.

మరియు వినుము సరస్వతీమంత్రముననె
గౌతమకణాద పాణిని కణ్వ శాక
టాయనాదులు గ్రాంథికులైరి వ్యాసు
డలర వేదవిభాగంబు నాచరించె. 9–148

ఒక విషయమును పదేపదే నొక్కి చెప్పుటకిట్లు ప్రాసలు కూర్చుదురు. రసహీనములైన విషయములు త్యజించుటకు వీలుకానప్పుడు పాఠకుల కాసక్తి కుంటుపడకుండుటకును నిట్లు చమత్కారముగ పద్యము నడిపింతురు. ఇరి యక్షర రమ్యతను సంతరించి శ్రవణసుఖమును జేకూర్చును.

రెండు నాలుగు పాదములలో రెండు పదముల మాత్రమే మార్చి పద్య మంతయు భావము చెడకుండ యదే యక్షరక్రమములో జెప్పుట యింకొక గడుసు పోకడ.

దేవీ పాదాబ్జంబులు
సేవించినవారు సుఖముఁజెందుదురు ధరం
దేవీపాదాబ్జంబులు
సేవింపనివారలఘముఁ జెందుదురు నృపా ! 2-391

ప్రాసలు కేవలము శబ్దాడంబరములకేగాక భావపరిపుష్టికై కవి కుపకరించు టయే గాక పాటల యందలి దరువులవలె శ్రవణసుఖమును గూడ కలుగ జేయుచున్నవి.

సహజసంభాషణ ధోరణులతోను, లోకోక్తులతోను వ్యావహారికమైన పద్య రచన చేయుట యొక పద్ధతి.

చెల్లునా నీకుఁజిచ్చులో జీవమెడల
తండ్రి ముదుసలి సుతులఁ బ్రథముఁడవీవు
నీకు రాజ్యంబొసంగి వనికినిబోవు
ఊపు లేదాగు మెల్లుండి ఊడవగుదు. 7-242

ఈ పద్యములు వీరి వ్యావహారికశైలిని తెలుపుచున్నవి. కేవలము వ్యాకరణ విరుద్ధముగ వ్రాయుట వ్యావహారికము కాజాలదు. తెలుగు పలుకుబడితీరును ద్యోతకము చేయునదే వ్యావహారికము.

శ్రీరామకవి శైలి యట్టి వ్యావహారికశైలి. సందర్భస్వభావానుకూలముగ వీరు పద్యమును మంచి సొగసులు నిగ్గుదేలించు చుందురు.

అఖండయతి వేయవచ్చునా రేఫద్వయమైత్రి గూర్పవచ్చునా? యన్న మీమాంస పెట్టుకొనక పద్యశిల్పము శ్రుతిసుగభగత్వములమీదనే దృష్టియుంచి పద్యరచన చేయుదురు. గ్రంథాదిని రేఫద్వయమైత్రి గురించి చర్చించి పూర్వ కవులు గ్రంథముల నుండి లక్ష్యము లొసంగి యప్పట్ల వీరి యభిప్రాయము వ్యక్తపరచిరి.

వీనులచే వినంబడునవే భువి శబ్దములండ్రు వానికిన్
గానగరాదు రూపమయినం బహుభాషల భిన్నరీతులన్
మానవు లక్షరంబు నయనంబులఁజూడగ రేఖలేర్పడం

గా నలవాటుబూని రదికాదొక లక్షణమద్దిసత్యమే
యైనను భాషలన్నిటను నక్షరరేఖలు నొక్కటేయగున్ – దే.భా.పీఠిక.పు.1

రూపము చేత లక్షణము రూఢిగఁగాదిఁక రాకుబండిరా
కేపగిదిన్ విలక్షణత యేర్పడు? ...

అని పూర్వకవి ప్రయోగములజూపి వారి యడుగుజాడలలోనే వీరును నడచిరి.

ఎఱ్ఱాప్రగడ యరణ్య పర్వములో
సీ ॥ లో రేయివచ్చెదనని ఱేపువచ్చు

తిక్కన –

సీ.లో. అం పిలి బెట్టార్వసింధురాజున్ దాకెన్
భాస్కర రామాయణము :
సీ.లో. ఱేకులన్నియు విచ్చి – రేయెండ జిగినిండ

ఇవిగాక విక్రమార్క చరిత్ర, విజయవిలాసము,పాండురంగ మహాత్మ్యము, చంద్రభానుచరిత్రము, మనుచరిత్రము,సారంగధర చరిత్రము,పారిజాతాప హరణము,కవిజనాశ్రయము,హరివంశము,ఉత్తర హరివంశముల నుండి యుదాహరణము లొసగిరి.

ఈ దాడనఁ గోదాడని
వాదంబుల ఱానునిలుపవలయునె ఫలమే
మీదీన మానరాదా
కాదనినను గాకదంత గణనంబెకదా ! దే.భా., పు.24.

అని దానికిఁ బరిష్కారము నిట్లు నుడివిరి –

మృదుమధురతాదిగుణములు
పదములకును నర్థములకు ప్రాపింపగనె
య్యది సులభసాధ్యమా మత
మెదనిడి ప్రాసముల యతులనిడుడు సరసతన్ – దే.భా., పీఠిక,పు.23

అని యప్పకవి యంగీకరించని యఖండయతిని అంగీకరించి భారతము, భాస్కర రామాయణము,కవిజనాశ్రయముల నుండి లక్ష్యముల నొసంగిరి. అంతియే కాదు వారును ప్రయోగించిరి.

మాధవు హరి నచ్యుతుఁ బద్మాక్షు నగధారి ......... 3–11

మందుడు పుత్రుడై జననమందిన నేమిఫలంబు బ్రాహ్మణుం 3–201

అట్లే ర లలకు పఫ బ భ వలకు ప భ మలకు యతి చెప్పవచ్చుననిరి. పఫ బభ వలు ఓష్ఠ్యములు. గావున సమానాధికరణ్యమే గాక సజాతీయత్వము గూడ కలదు. కావున నీయతి చెల్లునని లక్ష్యము లొసంగిరి. వీరి ప్రయోగాలు–

పెంపు వహించునేనియును వేయికనేటికి నీవేఱుంగవే? 1–107

భాగఁవతముఁజేసె శుకుడు పాడె ననుచు 1–333

వగలకు సూటియైన పెనుబాటయి మాటల తేటలన్ నిజం 1–350

వనశాలి న్నిలిపె రాజ్యభరము వహింపన్ 1– 460

రాగులగు వారలాప్తు లేలాగు చెపును 4–78

రావణుఁడును గీవణుండు లక్ష్యమె చెపుమా 3–778

ఱ – ర లు ప్రాసయందు ఘటించిరి.

నరపతి భామమయ్యెను వనంబునఁ జొచ్చుటఁజేసి మంత్రులున్<br>దెఱవల యైరి గుఱ్ఱమును దీటుకొనెన్వెసనాఁడు గోడిగై. 1 – 439

నారాయణ నీకంటెను<br>వేఱుగ నింకొకడు గలడె విశ్వంబుననె. 1 – 585

శరణమొసఁగె నది మదిలో<br>నెఱుఁగుచు నుత్తంకుఁడహినిసేంద్రునిఁబిలచెన్. 2 – 359

ఇట్లు ప్రాసలందు ‘ర–ఱ’ లను ప్రయోగించిరి. ‘హా’ కు ‘కా’ కు యతిమైత్రి చెప్పిరి. రెండును కంఠ్యములే గాన యతిమైత్రి నంగీకరించిరి.

హావనజాక్షి వేణి రుచి కాదనుగాదను నీవెలంది. 1–343

ద-డ లకు మైత్రి
దిగ్గనఁబోయి చేరువను డిగ్గియు నీళులుగొంచు వచ్చి చెం. 2-300

దుష్కరప్రాస నిర్వహించిన పద్యములు గూడ గలవు.

ధర్ముని కొడుకులు వీరే
కర్మంబున నేమిఫలముఁ గాంక్షించెదరో. 4-94

త్సాంసువులందల మోచుచు
నోంసత్యమ్మనుచు నిచటనుండెదమమ్మా. 3-96

ఓం సత్యమ్మని యథాతథముగ ప్రాసస్థానమున ప్రయోగించుట దుష్కరము. ఇది మహాకవులకే జెల్లును. 9-1546 నుండి 1568 వరకు గల స్రగ్విణి వృత్తములు మూడిట నాలుగవ పాదమందు 'న్' పొల్లు గలిపి యతివేసి, యతిభంగమైనట్లు తోపింపజేయుట చమత్కారము. ఇది క్లిష్టయతి.

.............. గోమేధికన్
గల్ల సారాధికన్ రాధికన్ గొల్చెదన్. 9-1546

.............. ప్రభాసాదికన్
భావుకారాధికన్ రాధికన్ గొల్చెదన్. 9-1547

............ సమ్మేళికన్
సర్వదారాధికన్ రాధికన్ గొల్చెదన్. 9- 1548

**వ్యాకరణాంశములు :**

లాక్షణికములైన శబ్దముల సృష్టించి లోకమున వ్యాప్తిచెందించు వాడు మహాకవి. కావున తిక్కన వంటి మహాకవులు వీరు. 'నీయట్టివాడు' లో తచ్ఛబ్ద వకారమునకు లోపముఁజేసి 'నీయట్టిదు' అని తిక్కన భారతములో ప్రయోగించెను. అట్లే వీరును 'నీ పాటిదు' (3-496) అని ప్రయోగించిరి. 'హనుమానుదు' అన్నట్లు 'గరుత్మానుదు' అని ప్రయోగించిరి. 'మీమాంస' అన్న ఆకారాంతస్త్రీ సమమును సంస్కృత శబ్దమును తెనుగున 'మీమాంస' అని యుండవలెను గాని 'మీమాంసము' అని నపుంసక లింగము జేసిరి.

చప్పగ భక్షించి (1–130),వెళ్ళమాకుము (2–351),కోసరమై (3–468)

ఇవి వ్యావహారిక గ్రామ్యముగ వాడిరి. వల్న అను ప్రయోగము 'ఉ' కార మధ్యమముగ నున్నపుడే ఉ కారము లోపించును కాని ఆకారమధ్యమములకు లోపింపచేయరాదు. అదియుగాక వలనన్ ప్రత్యయము. అది లోపింపజేసి వల్న అనుట వ్యాకరణమొప్పదు (5–413). మొగమోడుల (4–314)

లోకములో రూఢిగా నున్న సరియగు రూపమునే ప్రయోగించిరి. చక్కాడు (5–214) చక్కార్చు

ఈడు ఓడు ధాతువులకు యకారము వచ్చుట –

ఈడనకాడనక – ఈడనక + యాడనక. 5 587

కోకడుగు – కోక+అడుగు–కోకయడుగు. 0–105

అని యుండవలెను. కాని ఆత్వసంధి చేసి ప్రౌఢముగ ప్రయోగించిరి. ఆకార సంది యడాగమము 'కోకడుగు' అని సంధి కలిపిరి. క్త్వార్థక యికారము నకు సంధిరాదు. కాని చేసిరి. విఖ్యాకుడు (2–47), ఖా – కీర్తి ఖ్యామీద కప్రత్యయము స్వార్థములు కలిగి ఖ్యాకుడు అయినది.

గోఁగూర యని యుండవలెను. దీర్ఘము మీద సాధ్యపూర్ణము లేదు. కాని యిది దేశీయప్రయోగము. గోంగూర యనియే ప్రయోగించిరి. అట్టిదే 'తెచ్చితి నాం దామోదరుడు' గూడా (5–731) క్రియలు మొదలగునవి మార్చుట వాడుకభాష కాదు ఉ॥ వ్రాస్తాడు. ఇతర భాషల ప్రభావము లేని పల్లెలం దిళ్ళలో మాట్లాడుకొను హార్ధికమైన భాష యేది యున్నచో యదే వాడుకభాష. ఉదా॥ ఇప్పుడిటువచ్చె, ఊపు లేదాగు యెల్లుండి (7–242). ఇది వీరి కవిత్వములో విశేషముగా వాడి భావములు ప్రస్ఫుటము జేసిరి. ఇతర భాషాప్రభావము లేక తెలుగుతనము గలిగి తెలుగునాట పలుకుబడి తెలుగుదనమును పూర్తిగ వ్యక్తము జేయుపదములే యివి. 'తటుక్కున దిగబడితి' (6–626), మాయగారడీ నేనెరుగ నైతి (6–609),సంకట బడుట యనుటకు 'తటవిట చేయుట' (6–604), చిదిమిదీపము వెట్టుట (7–99),గోరెడు పసుపు గుంకుమ(7–142),చెంపలు

వాయించెద,కొంప జెఱుపబుట్టినది(7–174), ధనమిప్పుడందదు దొరికిన యెప్పుడిత్తు (5–359), తలను పువ్వాడదు (7–450).

కొన్ని యచ్చతెనుగు ప్రయోగములు గూడ జేర్చి రచనకు వన్నె గూర్చిరి.

ఉప్పరము - 6–152, ఠీకు - 3–661, శుద్ధగొంటెవీవు - 4–550, పాడుముండాకొడుకు - 11–313, రాచనెల - 9–517, కడలిబుడత - 2–412, పూర్వదేవతలు - 1–312, నిక్కులీన్ గుఱ్ఱము –7–281, గొంతు గోయ నివ్వేళ చేయాడు – స్థితిమంతుడు - 3–450, పోరుతిండి ముని.

వీరుపయోగించు యన్యదేశీయములు - బహరిఖాతాలు గులాయించు (అరబ్బిపదము),జల్దిచెలో,సాపడు,బజారు,బేజారు,డాబు,ఇట్టివి చాల కలవు.

శ్రవస్ + కల్మష + ఉద్దులై (శ్రవకల్మష)

శ్రవస్+కల్మషోద్ధులై (1–272)

స్ కారాంత పదము అకారంత పదముగ పరిగణింపబడినది. ఇట్టి పాణినీయ విరుద్ధము కాని స్కారాంతములైన 'శిరస్' మొదలగు శబ్దములను 'అ' కారాంతములుగ వాడవచ్చునని ముగ్ధబోధ వ్యాకరణమున గలదు. అందుచే నీప్రయోగము సమర్థనీయము. ఇది జూడ కవి యెన్ని గ్రంథములను పరిశీ లించెనో దెలియుచున్నది. కాతురు (1–369) ఇది కాయుధాతువు. కాచుధాతువు నకు కాతురు కావచ్చును. దీనికి వచ్చుట చిన్నయసూరి కిష్టములేదు.

శ్రీవురు(1–466) – శ్రీవి+ఉరు యడాగమము చేయక నిత్యసంధి చేసెను. కావున నిది ప్రౌఢప్రయోగము. వేచనుము– వేగచనుము. 'గ'కారలోపము వ్యాకరణదోషము. 'నిరంకుశః కవయః' లన్న లోకోక్తి ననుసరించి వీరు నిరంకుశులైన కవులని కాదు. కవిత్వమున శబ్దార్థములు ప్రధానమనియే గాదు. ఉక్తివైచిత్ర్య వ్యంగ్యము గూడ ప్రధానమే. వ్యంగ్యమార్గ మవలబించిన వారందరు మహా కవులే. కాని యీ యనుభవముతో గూడిన కవిత్వము వ్యంగ్యమార్గమున చెప్పినదాన్ని కన్న గొప్పది. కావుననే ప్రౌఢప్రయోగము లైనప్పటికిని వ్యవహారము నకు దగ్గరలోనున్న పదముల నుపయోగించును. ఒక్కొక్క కవి ఒక్కొక్క పదమును నొక్కొక్క విషయమును ప్రయోగించుటలో మక్కువ జూపుచుండును.

సంతోషించెననుటకు చంకలు గొట్టుకొను నను. అసహ్యమనుటకు ఎడ్డెది, ఏబ్రాసి అని ప్రయోగించును. కలదె జన్మభూమికంటె సుఖము (2-726) ఇష్ట మైన విషయము. దేవిని 'కన్నతల్లి' యని సంబోధించుట (1-242). వగలొద్దు లంటుకొని పారుట (6-509). కొత్తభావముల జేర్చి మూలమునకు సొగసు గూర్చుట యిట్టిది. ఉపమలో అప్పడములు, వడియములు ఉపమానములుగ చెప్పును. అట్లే పూవులయందు జాజిపూవులన్న నిష్టముగ దోచును.

వారి కవితకు దెనుఁగుతనము కూర్చిన లోకోక్తులు,జాతీయములు, పలుకుబడులు -

దయ్యముఁదనుఁగట్టుఁద్రాఁడుఁదానిచ్చుటకూ యియ్యకొనినట్టు -1-324 కాకిముక్కున నిడు దొండపండు. 1-378 ; మ్రింగమెతుకు లేదు మీసాలకు సంపంగినూనె. 3-486 ; వడిసెలలో రాయి పగిది. 1-131 ; దొప్పులఁ దోగించువారు. 1- 253 ; బ్రతుకు గలిగినన్ భక్షింతున్ బలుసాకున్. 1-274; కండలునుఁ దీసెద గెద్దల నోట వేసెదన్. 1-276 ; దాసోహమనుచు నెత్తినంజలిడ. 1- 285 ; గోరంతయు లేదు. 1-405 ; వరాల పుట్టివగుచు. 1-501 ; రోగికి నిరోగివైద్యుండాయె. 1-512 ; అయ్యవారినిఁజేయ బోనాయెఁగోతి - 1-545; పుట్టిమునిఁగిన బిట్టేడ్చు సెట్టిఁబోలె - 1-553 ; ఎడ్డెమనిఁదెడ్డెమనినట్టు - 1-653 ; ఎండలేకున్న నీరులేదు - 1-678 ; ఇటిక పెళ్ళనుఁబైడినొక్కటఁజాచు - 1-695 ; దినదినగండమున్ దెయ్యాలతోఁబోరు - 1- 708 ; ఐన వారలకాకున గానివారలకును గంచాన - 2- 324.

గ్రుడ్డెద్దు చేనఁబడినట్లు - 2-335 ; నోరు దెఱచుకొని పడియుండ్రు - 3- 116 ; గొంతెమ్మకోర్కెలు - 3-224 ; కదనమునకు కాలుద్రువ్వుట - 3-314 ; తాళ్ళదన్నువారి తలలదన్నువాడు - 3-327 ; సపత్ని జొన్నపిండుండ్ర మునైనఁ బెట్టునె - 3-327 ; కుందేలు పులిని బడగఱచుం దోమయె గజము గూల్చు - 3-399 ; ప్రాణములు నిల్చియుండెనా బలుసుకూరఁ దినియయిన బ్రతుకగవచ్చు - 3-476 ; పిలువని పేరంటము - 3-510 ; నవ్విన నాపచేను పండును - 3-515 ; కుడువఁబోయెడి కూర సొంపడుగనేల - 3- 516 ; చెవినిల్లు గట్టుక చెప్పినాడు - 3- 543 ; నక్కనైచ్యములు - 3-546, 728.

గొంతును గోసెదవేల - 3-554 ; పెరటి కల్పకము - కొంగు పసిడి - తంగేటి జున్ను - 3-626 ; కన్నువైచినావు - 3-554 ; ఎంతపనియటంచు - 3-715 ; నూరారైన 3-721 ; మనసు చివుక్కుమను - 3- 722 ; చేతనొక కాసైనను లేదు - 3-757 ; నీడకిప్పుడు బిల్చుట - 3-759 ; గోత పూడ్చుట - 4-158 ; ఆవబద్దంత - 4-303 ; దొరసాని - 4-339 ; గవ్వైన నివ్వడాయె - 4-402 ; గుడగుడాలోచనము గుటగుటమన్పించుట - 4-484; నీళులమూట - 4-529 ; నూరు కంచుదివిటీల వెదకిన కానరాదు - 4-550; గోరు పొక్కుపై రోకటిపోటు - 4-555 ; వెంద్రుకలకు జీదరించిన నెటుల్ కడిగోంగడి మెక్కగోరినన్ - 5-7 ; గొర్రె కొండను గదియదాఁకె - 5-66 ; వేరు వెల్లంకి చూడవలె - 5-83 ; గుడ్డిదగు నెద్దు చేనంబడ్డయటులగాక - 5 -113 ; కానున్నది కాకుండునె - 5-113.

పిల్లింజూచి యెలుక జందంబుగా - 5-116 ; దూడలను నమలబోయెడి తోడేళ్ళనుబోలె - 5-146 ; దొరుకుట లేదొక మెతుకున్ - 5-181 ; రోసాలు పొడుగు, రిత్త కొంపల వాసాలెగిరింత్రు రిత్తవదరుటలోనన్ 5- 184 ; హనుమంతుని మ్రోలను గుప్పిగంతులు - 5-218 ; నీకాళ్ళు గడిగి ద్రాగి బ్రతుకదే 5-227 ; యథారాజా తథాప్రజా 1 - 230 ; తాటాకు చప్పుళ్ళిడినం గుందేళ్ళు బెదురునె - 5-332 ; మూతినిఁజెప్పెడి మూయజేయుదున్ 5-247; నిజముఁబల్కిన నిష్ఠురమగును - 5-254 ; పోరాదా మీకు ప్రొద్దుపోదా యురకన్ - 5-359 ; ముద్దుల మూటగట్టు - 5-402 ; ఉరుకు మురుకుమను సవితి యుండుగాని తోడురుకు సవితి గలదె - 5-596 ; ఆడఁబాడ మద్దెలను గొట్ట నొకతవు 5-594.

పనిలేని మంగలి పిల్లితలను గొఱుగుట - 5-601 ; నల్లేరు మీద బండిపోయినట్లు 5-601 ; పచ్చను గోరుట (మంచిని గోరుట) 5-617 ; కదనమున కున్ జేవం కాల్రుద్రువ్వుట - 5-625 ; వడ్లతో తట్ట యెండంగవలసినట్లు - 5-707 ; పిచ్చుగుంటుపయి భాగీరథి బారినయట్లే 5-751 ; గంటగొట్టు 6-178 ; చిట్టెలుక నూతఁబడినట్లు - 6-232 ; దళము శివుని మీద తలపు సానులమీద - 6-251 ; చంకబిడ్డ లూడిపడగ - 6-313 ; పెండ్లి యాయెనేని పిచ్చికుదురును పిచ్చి గుదిరెనేని పెండ్లి యగును 6-359 ; నోటికొక బొక్కెడగును

– 6–378 ; ఇంటిమీఁదికి వచ్చుట - 1–450 ; ముక్కుబట్టాడించు - 6–480; రోలుబోయి మద్దెలతోడన్ మొరబెట్టుకొన్నట్లు 6–494 ; చెట్టొక పులుగై 6–508 ; గాడ్దెకుఁబట్టు జీను – 6–530 ; తుమ్మకుఁ బెట్టిన జాజితీగె - 6–521; నేత మూతి గడిగె – 6–547 ; నడిమంత్రపు కల్మి –6– 592 ; నాలుకాడు 7–59 ; చెయ్యాడు – 7– 60.

ఎక్కడ దాపరించె –7–93 ; చిదిమి దీపము బెట్టుట 7–99 ; గంపంత కంటితో - 7–104 ; గోరెడు పసుపు గుంకుమ – 7–142 ; గడ్డిది కూడిది యటంచ గనరాదు - 7 –147 ; గోటు నీటెఱుఁగఁడు –7–155 ; చేదస్తాలకును బంటచేలే సుమ్మీ – 7–279 ; నిన్నుఁగట్ట త్రాడు నీవే గొంపోవ 7–311 ; అంబను ముందరనిడుక మేనమామఁబొగడుటే – 7–352 ; ఓడలపై బండ్లు బండ్ల నోడలుఁజనునే 7–455 ; నాల్కదెగి రెండైనన్ - 7–457 ; చవిటిలో విత్తులిడుటె - 7–534 ; కాకాలు గుణించుట - 7–537 ; గవ్వకు లోకమెల్ల గొఱగాదు - 8–152 ; ధాత్తని ధూత్తని రద్దిసేయుచున్ - 9–167 ; నారుంబోసినవాఁడు నీరొసగఁడె - 9–305 ; వరాహంబు చందనముంగోరునె పెంటగోరు క్రియ – 9–319.

ఉట్టికిన్నెగయం జేతంగాదు స్వర్గంబునుం గట్టాబెట్టెద -9 - 337 ; పులిప్రక్కం జిక్కుజోరీగ - 9–352 ; రతనంబుల్ గల చోటనే కలవుగారాళ్ళు – 9–376 ; విత్తుముందా చెట్టుముందా – 9–383 ; మంచికిపోయిన కీడు వెంటనే తరుముకవచ్చు – 9–446 ; సర్వజ్ఞునుకున్ బంచాంగముసెప్పబూను పామరునిక్రియన్ – 9–551 ; కలహంబున కెప్పు కాల్దువ్వు - 9–601 ; చిచ్చులో శలభంబు మాడ్కి – 9–603 ; ఆయాసమొక్కరిది అనుభవమొక్కరిది – 9–678 ; అచ్చుగ్రుద్దినట్లు – 9–701 ; అజాగళస్తనము విధమున 11–321; ఘృతకోశాతకి 1– 701 (నేతిబీరకాయ) ; ఆడినది యాట పాడినది పాట యగును - 11–373.

లలితములగు తెలుఁగు పలుకుబడులు నివి లక్షణముగా దగియున్నవి. వీరి కవిత్వము పూర్వకవిమార్గమున నడిచినది. శ్రీనాథపోతనాదుల యడుగు జాడలలో నడిచిన పద్యములెన్నో కలవు. ముఖ్యముగ కందములు పోతనవి వలెను, సీసములు శ్రీనాథుని వలె కరుడు బోసినట్లు ఉన్నవి –

లేమానను బెండ్లాడుము
లేమా యిలుసాఱుము నిలుపలే మాస లిఁకన్. దే.భా., 2-91

లేమాదనుజుల గెలువగ
లేమా నీవేల గడఁగి లేచితి విటురా. పోతన, భాగ., 10-175

అతఁడానీకేతగున్
వతనికినే తగినదానవబ్జజుఁడును మి
మ్మతికించెనేని రత్నము
నతికించుటకాదె కనక మందు వరాంగి. దే.భా., 3-422

ఆ యెలనాగ నీకుదగు నంగనకుం దగుదీవు మా యుపా
ధ్యాయుల యాన పెండ్లియగు దప్పదు ........... విష్ణుభాగవతం
10-1716

నమ్మితినమ్మ సర్వభువనమ్ముల యమ్మకుమారునమ్మ ప
ల్కమ్మ సిరమ్మ నీకుఁగలకాలము మ్రొక్కుదురమ్మ బమ్మనుం
గుమ్మరిఁజేసి ముజ్జగము కుండలు వానఁగఁబెట్టితీవు మా
యమ్మ భవత్కృపారసమయమ్మె జయమ్మెటులెంచిచూచినన్
దే. భాగ ., 3-630

అమ్మలగన్నయమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాల బె
ద్దమ్మ సురారులమ్మ గడుపాఱడివుచ్చిన యమ్మ దన్నులో
నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడియమ్మ దుర్గ మా
యమ్మ కృపాబ్ధి యిచ్చుత మహత్వ కవిత్వ పటుత్వ సంపదల్.
భాగ. 1-10

ఒకచోట బవ్వళింపుచు
నొకచోటనే యాడికొనుచు నొకచో జలకే. 6-95

బలుకు నొక్కచోట పరమేశు గేశవు
బ్రణయహర్ష జనిత భాష్పసలిల
మిళిత పులకుఁడై నిమీలిత నేత్రుఁడై
యొక్కచోట నిలిచి యూరకుండు. వి.భా.- 7-124

ఆశా రాక్షసి కుక్షి దొడ్డది ............. 3-325

ఆశాపాశము గాగడున్ నిడుపు .......... వి.భా., 8-579

విష్ణుభక్తుని గన్న పెండ్లామె పెండ్లాము
అనిరుద్ధు కృపగోరు జనని జనని. 9-1475

కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ . ... వి.భా. 7-169

గరుదంచదురు మరుద్గత పటాపట పటాపటితాపతితపాదపవ్రజంబు
శరదభ్రసమశుభ్రతర వక్త్రచంచూర్ధతేరణ క్రేంకారదారుణంబు - 5-151
గళకర్త క్రోడ నిర్వత్కహకహ నినదోద్గాఢహాసంబు - మనుచరిత్ర, 4-95

బ్రహ్మాండభాండకర్పరము బీటికలెత్త దారుణోదగ్రనాదంబు సేసి
విలయానిలాభీల విహృతినద్రుల బెల్లఁగిల సటారింఛోళి దుళిపి విసరి
5-154

బెటిలె బ్రహ్మాండభాండంబు చిటిలెదిక్కు
లురలె పాతాళభువనంబు లుదిలెనభము
మేటిధా టీజనిత కాలకూటవిషము
చిచ్చు విడివడి యంతంత పెచ్చు పెరుఁగ. భీ.ఖం. 4-60

ఏది సూక్ష్మంబులకెల్లన్ సూక్ష్మంబు
నేది మహత్పదంబేది ఘనము
నేది గుహాచరంబేది సన్నిహితంబు
నేది లోకంబుల కింటిపట్టు
నేది జ్ఞానవరిష్ఠ మేది కాదియుతంబు
నేది లోకహితంబు నేకమేది
యేదిపరంబు సర్వేశ్వరం బేది ని
త్యంబేది నిహితసౌఖ్యంబు నేది

యదియ యక్షరమును బ్రహ్మప్రాణమాత్మ
యమృతమును నౌపనిషదశరాసనంబు.
జ్ఞాన నిసీత శరీరంబు బూని యక్ష
రంబు లక్ష్యంబుగా గొని గ్రాలవలయు. 7–812

ఎవ్వాని వాకిట ఇభమదపంకంబు
  రాజభూషణ రజోరాజినడగు
ఎవ్వాని సుచరితమెల్ల లోకములకు
  నాజ్ఞయై వినయంబు నొరపుగరపు
ఎవ్వాని గుణలత లేడువారసుల
  కడపటి కొండపై కలయబ్రాకు
ఎవ్వాని కడగంటు నివ్వటిల్లెడిచూడ్కి
  మానిత సంపదలీనుచుండు. విరా.ద్వి., 113, తిక్కన

ఈ విధముగా దాసుగారి సీసములో 'ఏది ఏది' యని పాదములు ప్రారంభించుచు ఆ యక్షరము యొక్క విశిష్టలక్షణముల వరుసగా చెప్పి చివర తేటగీతిలో 'అదియ యక్షరము బ్రహ్మ ప్రాణమాత్మ ......... గ్రాల వలయు'నని ముగించుటయొక శిల్పరీతి. 'ఎవ్వాని' అని పాదమారంభమున గల తిక్కన పద్యమునకు సమస్కంధముగ నున్నది. అట్టిదే మఱొక సీసము –

ఎచ్చోట బ్రహ్మయు నిందిరావిభుఁడును
  మృత్యుంజయుడును మెలతలైరి 5–464

ఈ పద్యము క్రింద ఉదాహరించిన శ్రీనాథుని పద్యఛాయను బోలి యున్నది.

ఎచ్చోట దాబాఱె నిట్టిరూపము దాల్చి
  యతిసాధ్వసంబుతో నధ్వరంబు
పాటిల్లెనెచ్చోట భాషావధూటికి
  నతి జుగుప్సితమైన యంగవికృతి. భీ.ఖం., 3–37

ఓరి రాజకులాధమా తగునె నీకుర్వీశలోకంబు నా. 3–541

ఇట్లు పూర్వుల యడుగుజాడలలో నడచి, వారి పట్ల తనకు గల భక్తి ప్రపత్తుల ప్రదర్శించిరి. గ్రంథాదిని గల -

వినఁబడె ముల్గు పాపయకవి ప్రవరుండొక వందయేండ్లకున్
మున్ దెలిగించె భాగవతమున్ సరసంబుగ నంచు దీని ము
ద్రణమున నాల్గుస్కంధములు దాటిన వెన్క నతండు నాదు వం
దనముల కర్హుఁడెంతయును ధన్యుఁడతండు గదా ధరాస్థలిన్.

తిరుపతి వేంకటేశ్వర సుధీమణులన్గొనియాడి మ్రొక్కెదన్
సరసులు నాకు మిత్రులును సర్వజనస్తవనీయ పాండితీ
భరితయశుల్ తెలుంగునను భాగవతంబు రచింపఁబూని రం
చెరిగితి వారి వల్న గణియింపరు నాయపరాధపుంజమున్.

పద్యములిందు కుదాహరణము. వీరు చేపట్టిన సాహిత్యప్రక్రియ లన్నియు విశ్వతోముఖముగ విశిష్టముగ సాగినవి. వీరి కవిత్యమును గూర్చి పెద్దలిట్లు టంకించిరి.

**తిరుపతి వేంకటకవులు :-** ఈయన సరసకవి. విద్వత్కవి, స్వతంత్ర కవి, ఆశుకవి, దాత,నేత. ఇన్నియోగాలు పట్టినవారు యేకాలంబుననైనను కవులలో మృగ్యులే. వీరి కవిత్వానికి విలువ గూడ నిర్ణయించారు. వారి పూర్వనివాసమగు అల్లూరును గూర్చి వ్రాసిన సీసపద్యాలకు వెలకట్టవలసివస్తే అక్షరలక్షలకన్నా మించుతుంది.'

**విశ్వనాథ సత్యనారాయణగారు :-** ఈ కవిగారి యొక్క యాంధ్ర భాషా జ్ఞానము మిక్కిలిదొడ్డది. వీరి లోకానుభవము దానికంటె దొడ్డది. పూర్వ కథాభిమానము మఱియు మిక్కిలిగ నున్నది. మొత్తముమీదవీరి శైలి చాల సులభమైనది. ఈ మహాకావ్యము ఆంధ్రపద్యరచనాగత మాధుర్యసౌకుమార్య గుణములకు నునికిపట్టని చెప్పవచ్చును... శ్రీరాములుగారు ప్రసిద్ధులైన కవులు. వారి గ్రంథము జాగ్రత్తగ జదివినచో ననేకములైన తెలుగు పలుకుబళ్ళు తెలియును (జయంతి సంచిక, పు. 13).

**విశ్వనాథ వేంకటేశ్వర్లు గారు :-** శ్రీదాసు శ్రీరామకవిగారు బహుముఖ ప్రజ్ఞాధురందుడైన మహాకవి యనుట నిస్సంశయము. 'A Versatile genius'.

ఆయన యొక మహాసముద్రము. అందనేక రత్నములు కలవు. పరిశీలింప జాలు పరీక్షకులకే వాని యౌన్నత్యమెఱుకపడును (జయంతి సంచిక, పు. 20).

**డా॥ శ్రీపాటిబండ మాధవశర్మగారు :-** ఒక్క పొల్లుమాట లేకుండ ధార కుంటుపడకుండ శబ్ద చమత్కారం సుతారంగా ఒలికిస్తూ ఉంటాయి తెలుగునాడు లోని పద్యాలన్నీ.

**శ్రీనిడదవోలు వెంకట్రావుగారు : –** శ్రీరామకవి గారు సంస్కృతాంధ్ర భాషల రెండింటియందును సమానపాండిత్యము గలవారు. జగద్విఖ్యాత శతావధానులు చెళ్ళపిళ్ళవారే వీరని 'అభినవ శ్రీనాథుడ' ని ప్రశంసించిరి. శ్రీరాములు గారు సర్వతోముఖప్రజ్ఞ కలవారు. వీరి కవితాప్రకర్షకు వీరికి గల జ్యోతిశాస్త్రము,న్యాయశాస్త్రము,సంగీతము మున్నగువాని యందలి వైజ్ఞానిక పాటవము వన్నె గూర్చినది వీరి సాహితీసృష్టి.

**శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారు :-** సంగీతాభినయ గ్రంథములు చాల రచించిన కళాకోవిదుఁడీయన. వీరి కావ్యప్రపంచమునఁ జిరస్థాయిగ నుండునది దేవీభాగవతము, రసవిలసితముగా నున్నది తెలుఁగునాఁడు. ఇందలి పద్యములు స్వభావసిద్ధములు. ఇక్కవి కవిత జనరంజకము లోకానుభవ వ్యంజకమునై యున్నది. ఇతడు పోతనవలె సహజపాండిత్యుఁడు.

**శ్రీ జి.వి.సీతాపతిగారు :** బహుముఖప్రజ్ఞాశాలి, అద్భుత పాండితీ శోభితుడు.*

**శ్రీదివాకర్ల వేంకటావధానిగారు :** పంతులుగారి శైలి రసానుకూలమైన కొన్ని చోట్ల నలతి యలతి పలుకులతో గూడి శ్రవణసుభగమై యొప్పారుచుం డును. సంభాషణ సందర్భములందు వారి శైలి వ్యవహారమునకు సన్నిహితముగ నుండును ..... శ్రీ పంతులుగారు ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసములను కావ్య హేతువులు మూడును పుష్కలముగా గల మహాకవిపుంగవులు. దేవీభాగవతము వారికవితా కౌశలమునకు పట్టుగొమ్మయైన ప్రశస్త రచన.

ఇతనొక మహావక్త. సమర్థుఁడైన రచయిత. సునిశితవాద ప్రతివాదనా నిపుణుడు. (ఎన్‌సైక్లోపేడియ ఆఫ్ మద్రాస్ ప్రెసిడెన్సీ అండ్ ఎడ్జెసెంట్ స్టేట్స్ – ఇంపార్టెంట్ పర్సనేజస్.**)

శ్రీదాసు శ్రీరామకవి గారి కవితాశిల్పము శాస్త్రపరిచితీపాటవమును కావ్య కళారామణీయకమును ఒక్కుమ్మడి సంతరించుకొన్నది. కవిగారి లోకజ్ఞత రసజ్ఞతలు వర్ణనానిపుణ .కవి అన్న ఆభాణకమునకు కవిగారిని లక్షీభూతునిగ నొనర్చినవి. వారి బహుముఖమైన ప్రజ్ఞ నాన్యతోదర్శనీయము అనుట యతిశయోక్తి కావచ్చునేమో కాని అది యత్యంత స్పృహణీయ మనుట స్వభావోక్తి యనదగును.

## అధోజ్ఞాపికలు

1. 'మనహాస్యము' - శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారు,ఆంధ్రసారస్వత పరిషత్తు, హైదరాబాదు, 1968.

2. వనకేళి రవి శశి సంధ్యా
   తనయోదయ మంత్రగతి ర తిక్షితి పరిఖాం
   బునిధి మధుఋతు పురోద్యా
   న నగ విరహద్యూత వర్ణనాష్టాదశముల్
   
   - కుమారసంభవము, నన్నెచోడుడు.

3. శ్రీకృష్ణ భూపాలీయము-చంద్రకవి, పు. 37.

4. వినాయకతాళ మేట్టిదో సంప్రదించిన సంగీతవిద్వాంసుల నుండి తగిన వివరణ లభింపలేదు- నాట్యాచార్య శ్రీ జోస్యుల సీతారామశాస్త్రిగారీ విషయమై తెల్పిన వివరణ అనుబంధము - 4 లో కలదు.

★ A Versatile genius ; A Prodigy of learning - History of Telugu literature by G.V. Sitapati. P. 121.

★★ Encyclopaedia of Madras Presidency and Adjecent States- Important personages - "He was a fluent speaker - an able writer a good debator, and a keen controvertialist. P. 523.



# (ii) దేవీభాగవత అనువాదపద్ధతి

శ్రీదేవీభాగవతము అష్టాదశపురాణములలో నొకటి. ఇది దేవి యొక్క పరాత్పరత్వమును దెలుపు పురాణము. అష్టాదశ మహాపురాణములను ఉపపురాణములను రచించిన వ్యాసమహర్షియే దీనిని గూడ రచించెను. మహాపురాణములలో విష్ణుభాగవతమొకటి. దేవీభాగవతమా పదునెనిమిది మహాపురాణములలో జేరదని వైష్ణవులు వాదింతురు.

శ్రీ శ్రీరాములుగారు దేవీభాగవతమును ననువదించినవారిలో నొకరు. దేవీ భాగవతముయొక్క మహాపురాణత్వ విచారమను విషయమును వారాంగ్రీ కరించిన దేవీభాగవత గ్రంథాదిని వ్రాసిరి. శైవపురాణము, కాశీపురాణము, ఆదిత్య పురాణము, బ్రహ్మకైవర్తపురాణములు దేవీ భాగవతమే మహాపురాణమని ప్రశంసించినవనియు, కూర్మపురాణము, పద్మపురాణమును దేవీభాగవతమును ఉపపురాణము క్రింద పరిగణించిన వనియును, ఈ విధముగ నొక పురాణమునకు నొకదానికి బ్రాధాన్యమిచ్చి, మరియొక పురాణమునందు మరియొక పురాణమునకు ప్రాధాన్యమీయబడినట్లు గానవచ్చుచున్నదనియును వీరు పేర్కొనిరి. దేవీభాగవతమునకు విష్ణుభాగవతమునకు వలెనే సమానమైన ప్రచారము కలదు. కావున రెండింటినీ సమానప్రతిపత్తితో స్వీకరించుటయే భావ్యమగుచున్నది.

'హయగ్రీవ బ్రహ్మ విద్యాః యత్రవృత్ర వధస్తథా
గాయత్ర్యాచ సమారంభస్తద్వై భాగవతం విదుః'

అన్న శ్లోకము బ్రహ్మకైవర్తము నందు గలదు. దీనిచే దేవీభాగవతము గూడ మహాపురాణమని యెన్నదగియున్నది. గాయత్రీమంత్రము విష్ణుభాగవతము నందు బోధింపబడలేదు. ఈ ప్రమాణము వలన దేవీభాగవతమునకే మహా పురాణత్వము లభించుచున్నది. దేవీభాగవతమున గాయత్రీదేవతోపాసనకు ప్రాధాన్యమీయబడుటచే నెల్లరకు పూజాస్థానమగుచున్నది. భారతదేశమున ననాదిగ బ్రచలితమగుచున్న మంత్రతంత్ర శాస్త్రములకు మూలము గాయత్రీ మంత్రోపాసనమే. దీనినే యీ దేవీ భాగవతము ప్రతిపాదించినది.

'న గాయత్ర్యాః పరంమంత్రం న మాతుః పరదైవతమ్'. దేవీభాగవతమున ద్వాదశస్కంధమంతయు నిట్టి గాయత్రీమంత్ర మహిమ విచారణమునకు వినియోగింపబడినది. దేవీభాగవతము యొక్క మహాపురాణత్వ విచార విషయమై పి.జి.లాలే(P.G.Lale) గారిట్లనిరి- 'కొందరు దేవీభాగవతమును మహాపురాణముగా ఎందుకు అంగీకరించలేదో కారణము తెలియలేకున్నది. అందలి శైలి విషయమును బట్టి అది మహాపురాణమని పూర్తి నమ్మకము కలుగుచున్నది.'[1]

దేవీభాగవతములో 18276 శ్లోకములు గలవు. విష్ణుపురాణములో 13216 శ్లోకములు గలవు. మహాపురాణ మనుటకు కారణము శ్లోకసంఖ్య విస్తృతిగా నుండుట కూడ పేర్కొనదగును. గాయత్రీమంత్రము గలిగి యున్నది. హయగ్రీవకథ, ఉపాసన చెప్పబడియున్నవి. పురాణమనుట కచ్చటచ్చట ఫలశ్రుతి గూడ చెప్పబడియున్నది. హయగ్రీవుని కథానంతరము (1-193), శ్రీకృష్ణుని వృత్తాంతానంతరము (4-609), శంభుని కథానంతరము (5-681), సురథోపాఖ్యా నంతరము (5-769), షష్ఠస్కంధానంతరము (6-542), హరిశ్చంద్రోపాఖ్యా నంతరము (7-615), గంగాస్తోత్రమనంతరము(9-419), మంగళచండి పూజా విధానాంతరము (9-142), రాధాదేవి స్తోత్రానంతరము(9-1566), దేవీ భాగవత సమాప్తము నందు (12-200), ఫలశ్రుతి చెప్పబడినది.

విష్ణుభాగవతమునకు దేవీభాగవతమునకు నొక బోలిక యున్నది. ఉభయ భాగవతము లందును ఏకాదశ ద్వాదశస్కంధములు తత్త్వ విచారణకు, మూలమంత్ర విచారణకు వినియోగింపబడినవి. గాయత్రీ మంత్రోపాసన వలననే మోక్షము లభించునని, దేవీభాగవతము చేయునట్టి మహోపదేశము తక్కిన పురాణములన్నియు శివ విష్ణు గణపతి సూర్యాదుల ప్రాశస్త్యము నుద్ఘాటించు చుండగ దేవీభాగవత మొక్కటి మాత్రము దేవీపరాత్పరత్వమును వర్ణించుచున్నది.

దేవీభాగవతమున దేశమున ప్రచలిత మగుచున్న యుపాసన సంప్ర దాయములన్నియు ప్రాతినిధ్యము పొంది యుండలేదు. ముఖ్యముగ శ్రీ చక్రోపాసన తెలియజేయబడలేదు. శాక్త సాంప్రదాయ విశేషముల ప్రస్తావన లేదు. శ్రీ దేవి భండాసురుని వధించిన గాథ పురాణ ప్రసిద్ధి నొందియున్నది.

స్కాందపురాణాంతర్గతమైన లలితో పాఖ్యానమున నిది గలదు. కాని దేవీ భాగవతమున నిది లేదు.

దేవీ భాగవతమున నిరూపితమైన శ్రీ భువనేశ్వరియె రాజరాజేశ్వరి. దేవీ భాగవతమున రెండు సంప్రదాయములు నిరూపితములై యున్నవి. 1. రాజరాజేశ్వరీ సంప్రదాయము, 2. పంచశక్తి సంప్రదాయము. వారు దుర్గా, సావిత్రి, సరస్వతి, లక్ష్మి, రాధ. ఇందలి సావిత్రియే గాయత్రి. ద్వాదశస్కంధమున గాయత్రికే బ్రాధాన్య మొసంగబడినది. దేవీభాగవతము సమాజమున జొచ్చు కొనిపోయి వేళ్ళునాటుకొని యున్నది. ఒకవిధముగా జూచినచో బోతనగారి శైలిసౌభాగ్యము వలన గాని, శ్రీకృష్ణునికథయందలి ప్రీతివలన గాని దశావతార ములలో శ్రీకృష్ణావతారము పూర్ణావతారమై యైహికాముష్మికములు రెంటిని పూర్తిగ సమాక్రమించుట వలనగాని, శ్రీకృష్ణమహత్త్వమును భారతభాగవతములు రెండును సముద్ఘోషించు చుండుట వలనను తెలుగు కవులైన నన్నయ, తిక్కన, పోతనార్యుల యెడ జనప్రీతి వలనను శ్రీ విష్ణుభాగవతము తెలుగుదేశమున తెలుగు సమాజమున వేళ్ళు బాదుకొని పోయినది. అట్లే దేవీభాగవతము దేశమున సమాజమున జొచ్చుకొని పోయిన విధము గూడ నాశ్చర్యముగ నున్నది. ఆయా సందర్భములబట్టి శ్రీకృష్ణభగవానునితో బాటు మంగళచండి, షష్ఠి మొదలగు దేవతలందరు నిత్యార్చితులగుచున్నారు. కావుననే ఈ దేవీభాగవతము ప్రజల మనస్సులపై నెక్కువ యధికారము గలిగియుండి యభిమానాస్పద మగుచున్నది.

భారతమున –

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణులు నీతిశాస్త్రంబని కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహమని ఐతిహాసికులు ఇతిహాసమనియు
బరమ పౌరాణికుల్ బహు పురాణసముచ్చయంబని మహిగొని యాడుచుండ

వివిధ తత్త్వవేది వేదవ్యాసు
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరుగుచుండజేసె భారతంబు. 1-1-31

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని వర్ణింతురని యనేక శాస్త్రవిషయములకు యాలవాలమనియు నన్నయగా రభివర్ణించియుండిరి. ఆ పద్యార్థము దేవీ భాగవతమునకు గూడ సరిపోవునని చెప్పవచ్చును. జీవుడు పుట్టిననాటి నుండి గిట్టువరకును బ్రతికి యున్నంతకాలము ప్రొద్దుటినుండి సాయంకాలము వరకును జేయవలసిన క్రియాకలాపమును వర్ణించునవియే ధర్మశాస్త్రములు. దేవీభాగవతమున సప్తమస్కంధము నుండి చివరివరకు ధర్మశాస్త్ర విషయము లనేకములు వివరింపబడినవి. నవమస్కంధమున సుకృతి, దుష్కృతి భేదములు వర్ణింపబడినవి. ధర్మశాస్త్ర విషయములకు ఈ దేవీభాగవతమందలి యేకాదశ స్కంధము నిలయముగా నున్నది. ఇందు సదాచార విధులు, స్నానక్రమము, జపమాలానిర్ణయము,రుద్రాక్షభేదములు,భూతశుద్ధి,శిరోవ్రత విధానము,భస్మ ధారణ త్రిపుండ్రోర్ధ్వ పుండ్రవివరణము, సంధ్యాకృత్యములు,మాధ్యాహ్నిక సంధ్య, బ్రహ్మ యజ్ఞ విధానము, వైశ్వదేవము, కామ్యకర్మవీధి మొదలగు వైదిక సదాచారా క్రమమంతయు వర్ణింపబడినది.

శ్రీ దేవీభాగవతము ముఖ్యముగా భక్తి, ఉపాసన ప్రధానలక్ష్యములుగా వ్రాయబడిన గ్రంథము. సత్యవ్రత సుదర్శనుల కథ లిందులకు తార్కాణము. భారతాది గ్రంథములలో నున్న రాజనీతి యిందు గానదాదు. దేవీభాగవతము మంత్రపునశ్చరణకును, ఉపాసనకు,ప్రాధాన్యమిచ్చిన గ్రంథము. దేవీభాగవతమున వేదాంతము గలదు. ఉపనిషన్మతముననే యిందు ప్రాధాన్యమీయడినది. అది దేవీ పరముగ జెప్పబడినది. ఇంచుమించు బ్రహ్మశబ్దమునకు దేవీశబ్దము నిక్షేపించి యుపనిషన్మతముపదేశించినట్లయినది. 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ', 'సర్వం ఖల్విదం బ్రహ్మ', మొదలగు మహావాక్యము లందు వేదశాస్త్ర పురాణాదులన్నియు ఏక వాక్యతను బొందుచున్నవి. బ్రహ్మశబ్దమునకు మాఱుగా శివవిష్ణ్వాది నామములను ప్రస్థాపించినవి గాని యేకత్వము నందు మాత్రమెవ్వరికిని యే మతము వారికిని విప్రతిపత్తి లేదు. ఇట్లు దేవీభాగవతమున కేవలము దేవియే పరబ్రహ్మముగ వర్ణింపబడినది. మోక్షమనునది శక్తి భజనము. శక్త్యుపాసన యుండుట వలన నీ దేవీభాగవతము దేవీ భక్తి ప్రధానమైన గ్రంథమని చెప్ప వచ్చును. అయినప్పటికిని దేవీభాగవతమున, రామాయణ, భారత కథలే గాక

బహు పురాణాంతర్గత కథలు గూడ ఆయాసందర్భము లందు వివరించిరి. అంతేకాదు, దేవీభాగవతమొక విమర్శ గ్రంథమని చెప్పనగును. హిందూమతమున నొక విప్లవము దెచ్చిన గ్రంథము. ఒక తిరుగుబాటు దెచ్చిన గ్రంథము. ఏలయనగా మన సమాజమున నింతకుమున్ను ఆరాధ్యదైవములుగా విశ్వసింప బడుచుండిన శివ, విష్ణు, బ్రహ్మలను ముగ్గురను ద్రోసిరాజని దేవికి పట్టము గట్టినది. ఆ తిరుగుబాటులో గూడ తీవ్రమైన తిరుగుబాటు. దేవీభాగవతము తృతీయ స్కంధమున కాజేశులు (క+అజ+ఈశులు) మువ్వురకు ఆడవేషము వేసి మణిద్వీపమున దేవికి సేవలు చేయుంపబడినవి. అంతేగాక మహావిష్ణువు నకు గూడ కర్మబంధము తప్పలేదను కథాకల్పనము చేయబడినది. ఇట్టి దేవియొక్క ప్రాధాన్యమునకే గాక పరాత్పరత్వము నిరూపించుటకే నీ గ్రంథ మింత పాటుపడినది. ఇందుకూడ కాజేశులు మువ్వురిలో విష్ణునకు బ్రత్యేకత్వము గలదని దేవీముఖముననే జెప్పింపబడినది. కాని యంతవానికి గూడ కర్మఫలానుభవము తప్పలేదని నిరూపింపబడినది. ఇంద్రుడు విష్ణువు మొదలగు దేవతలందరు అధికార పురుషులు. వారి యధికారము తీరినతరువాత వారు వైదొలగి వేరొకరు వత్తురు. వీరందరు కర్మమున కధీశులని దేవీభాగవతమున నిరూపింపబడినది. జ్ఞాన భక్తి యోగములను దేవిగీతల రూపమున దేవి హిమవంతుని కుపదేశింపబడినది. (7-719 నుండి 7-754). దేవి విశ్వరూపము ప్రదర్శించెను (24-22). కోటిసూర్య ప్రతీకాశముగ నారూపము భగవద్గీతలో జూపిన విరాడ్రూపము నకును బోలియున్నది. ఇట్లు దేవి శివకేశవులకన్న నధికురాలని నిరూపింప బడినది. అఖిలవేదార్థసమ్మతంబును ఆగమోత్తమము రహస్యంబును నైనట్టి దేవీ భాగవతమును వేదవ్యాసుడు సంస్కృతమున రచించెను. దేవీభాగవత మెట్టిదనిన

భాగవత మఘ వినాశము
భాగవతము ధర్మదంబు పరమార్థదమున్
భాగవతము కామదమీ
భాగవతము మోక్షదంబు భక్తి యుతులకున్. 1-6

భాగవతం బెన్నగ స
ర్వాగముసారము ముముక్షు వరసాధనమున్.

భాగవతము విజ్ఞాన
ప్రాగల్భ్యము గలుగఁజేయు బరమౌషధమున్. 1-67

ఇట్టి దేవీభాగవతమును పలువురనువదించిరి. శ్రీ ములుగు పాపయారాధ్యులవారు,తమ్మన దొరవారు,దాసు శ్రీరాములుగారు, తిరుపతి వేంకటకవులు, శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు (3 స్కంధములు మాత్రమే), పద్యరూపమున ననువదించిరి. శ్రీ విద్వాన్ సరిపల్లె విశ్వనాథముగారు, శ్రీమతి స్థానపతి రుక్మిణమ్మగారు, శ్రీ పిలకాగణపతి శాస్త్రిగారు, శ్రీ పురిపండా అప్పలస్వామి గారు వచనమున ననువదించి ధన్యులైన కవివతంసులు. భాషాంతరీకరణ మెట్లుండవలెనో శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారిట్లు చెప్పిరి.[2] 'కావ్య నాటకాదులకు భాషాంతరీకరణ మున్నదున్నట్లు సరిగ జెప్పినచో శ్లాఘ్యముగ నుండును. భాషాంతరీకరణము స్వకపోల కల్పితమువలె నుండవలయును గాని భాషాంతరీకరణ మనిపించుకొనునట్లుండరాదు. సారవత్తరమయిన కావ్యముననె యింత పదార్థము విడిచినను జేర్చినను రసాభాసముగానే యుండును. కాని మూలాభిప్రాయమై మూలార్థమును బోషించునట్లు క్రొత్తపదము వేసి రసపోషణ చేయవచ్చును గాని యపార్థకములగు సమూలక పదములు వేయరాదు. కాన మూలాభిప్రాయము విడిచిన యపార్థము జుట్టుకొనును. పురాణేతి హాసముల భాషాంతరీకరణము మక్కికి మక్కిగ నున్నచో హృదయంగమముగ నుండబోదు. పురాణాదులలో నర్థపౌష్కల్యము గలిగింపని పదములు పెక్కులుండును. చెప్పిన యర్థమే మరల జెప్పబడుచుండును. అది సంస్కృత భాష గావున నెట్లు చెప్పినను వినువారికి గంభీరముగానే యున్నట్లుండును. అట్లే భాషాంతరీకరించిన సమంజసముగ నుండునని వేరు చెప్పవలయునా? పురాణాదులు ఛాయాను సరణముగానే యుండుట యుక్తము గాని ప్రతిబింబముగా నుండుట యుక్తము గాదు.' 'అశేషమనీషి హృదయంగమముగ శబ్దంబనుసరించియు, నభిప్రాయంబు గురించియు, భావంబుపలక్షించియు, రసంబు పోషించియు, నలంకారంబు భూషించియు, నౌచిత్యంబాదరించియు, ననౌచిత్యంబు పరిహరించియు మాతృకానుసారముగ'[3] యనువాద ముండవలెనని శ్రీనాథుడు వివరించెను.

శ్రీ దివాకర్ల వేంకటావధాని గారనువాదమిట్లుండవలెనని వ్యక్తము చేసిరి. – 'ఏదైనా నొక గ్రంథము నన్యభాషల నుండి యనువదించునపుడు ప్రధానముగ

మూడు పద్ధతుల నవలంభింపబచ్చును. క్రిందటి కథానువాద పద్ధతి. ఇందు భాషాంతరీకర్త మూలగ్రంథము నందలి కథను గ్రహించి అందలి వివిధ సన్నివేశములను విడువకుండ వివిధ పాత్రలు నిర్వహించు కార్యములనుజ్జ గింపకుండ, వర్ణనాదులను, రసపోషణమును దన యిచ్చవచ్చినట్లొనరించుచు రచన సాగించును. ఇందు మూలమునకును ననువాదమునకును కథావిధానమున మాత్రమే సన్నిహితమైన సంబంధము గానిపించును. మిగిలిన రసభావ వర్ణనాదు లందించు మూలకర్త యాత్మీయత కంటే ననువాదకర్త మాత్మీయతయె యధికముగ గోచరించు. అందుచే నిది నామమున కనువాదమయ్యును స్వభావమున స్వతంత్ర గ్రంథమువలెనే కానవచ్చును. రెండవది భావానువాదపద్ధతి. ఇందు భాషాంతరీ కర్త మూలము నందలి కథనే గాక భావములను గూడ సన్నిహితముగ ననుసరించును. ఇందు మూలకర్త వెలువరించిన భావములనుచితమైన భాషలో సుందరమైన శైలిలో స్పష్టముగ వ్యక్తము చేయుటయందే యనువాదకర్త నైపుణ్యము గోచరించును. ఈ పద్ధతి యందు కథాఘట్టములు కాక, భావములు గాక వానిని వెలువరించు వివిధ లోకాదులు ప్రమాణముగ (యూనిట్) స్వీకరింప బడును. ఇది యంత యతిస్వతంత్రమును అతివిధేయమును గాని మధ్యస్థ పద్ధతి. ఇందు మూలకర్త భావము లన్నియు సమగ్రముగా వ్యక్తము చేయబడినను యతడు వాడిన పదములన్నిటికిని బర్యాయపదములు కనబడకబోవచ్చు. మూడవది పదానువాద పద్ధతి. ఇందు మూలము నందలి కథాభావములే కాక పదములు కూడ ప్రమాణములుగా గ్రహింపబడును. మూలస్థ పదము లన్నియు నిందనువదింపబడును. ఇది మూలమున కతివిధేయమైన పద్ధతి. ఇందు మూలము నందలి పదమునకుఁ బదము వేయుట కంటె భాషాంతరీకర్త స్వతంత్రత యేమియు గోచరింపదు.'[4]

ఆంధ్రవాఙ్మయమునఁ బైమూడు పద్ధతులకును ఉదాహరణములు గోచరించుచున్నవి.కవిత్రయము వారి పద్ధతి కథానువాదమునకును, శ్రీనాథునిది భావానువాదమునకు,అధునిక నాటకానువాదకులది పదానువాదమునకు నిదర్శనములని చెప్పవచ్చును. ఈ మూడింటియందు గుణములును, దోషములును లేకపోలేదు. కాని కర్త ప్రత్యేకతను స్వాతంత్ర్యమును దృష్టియందిడికొని చూచినచో మొదటిపద్ధతి విశిష్టముగా గోచరించును. ఈ పద్ధతికి మార్గదర్శకుడు నన్నయ

బట్టు. పురాణయుగము నందలి కవులు పలువురనువాద విషయమున నాతని యడుగుజాడలనే యనుసరించిరి.

శ్రీరాములుగారును నన్నయనే చాల సందర్భముల ననుసరించిరి. కొన్ని కొన్ని తావుల పదానువాదపద్ధతి ననుసరించిరి. శాస్త్రవిషయముల ప్రస్తావించుపట్ల పదానువాదపద్ధతి ననుసరింపక తప్పదు కదా! రసవత్తరములైన యుపాఖ్యానముల ననువదించునపుడు నన్నయ వలె వీరును భావానుపద్ధతి ననుసరించిరి. రసహీనములైన పురాణగాథలను రసోద్దీపనము చేయుటకై భావానువాదపద్ధతి నంగీకరించుటయైనది.

శ్రీరాములుగారు నన్నయ యడుగుజాడలలోనే నడచి యాతని యనువాద పద్ధతినే చాలవరకు యనుసరించెనో యన్నట్లు సంస్కృత శ్లోకముతోనే ప్రారంభించిరి.

సర్వచైతన్య రూపాన్తా మాద్యాం విద్యాఞ్చ ధీమహీ
బుద్ధిం యానః ప్రచోదయాత్. 1–1

ఈ శ్లోకము యనువాదముతో నితరానువాదకులు దేవీభాగవతాంధ్రీ కరణమును బ్రారంభించిరి. వీరు మాత్రము యధాతథముగనే వ్రాసిరి కాని తెనుగు సేయలేదు. రసపుష్టిలేని సంభాషణలను ప్రశ్నోత్తరములను శ్రీరాములు గారు చాలవరకు సంక్షేపించిరి. కథాగతికి నడ్డుతగులు 'సూత ఉవాచ' , 'వ్యాస ఉవాచ' యని పదే పదే వచ్చిన పదములను వీలైనంతవరకు విడిచివేసిరి. ఇట్టి వానిని గ్రంథమున చాలవరకు తొలగించుకొనుచు వచ్చిరి.

**మూలత్యాగము :** ప్రథమ స్కంధమున షష్టాధ్యాయములో 18వ శ్లోకము తరువాత 'సూత ఉవాచ' యని కలదు. ఆ క్రిందనే 26 వ శ్లోకము తరువాతను, మరల 36వ శ్లోకము తరువాతను, 38వ శ్లోకము తరువాతను, 'సూత ఉవాచ' యనియే కలదు. ఇట్టివి పెక్కులు గలవు. ఇట్టి పునరుక్తిని తొలగించిరి. పైన చెప్పినట్లు యర్థపుష్టి గలిగింపని యిట్టి పదములు పెక్కు లుండును. సంస్కృత భాషయందు గంభీరముగ నున్నను తెనుగున నవి రాణింపవు. కావున అర్ధవివృతి చెడకుండ నంతవరకు విడచిరి. అట్లే రసపుష్టిలేని సంభాషణలను దొలగించిరి. ధ్రువసింధూపాఖ్యామున ధ్రువసింధు మరణానంతరము వీరసేనుడు యుధాజిత్తు

వారి వారి పౌత్రులకు రాజ్యము సంక్రమింపదలచి వివాదపడిన సందర్భమున మూలమున వారి సంవాదమును (3-14-40 నుండి 3-14-48) నెనిమిది శ్లోకముల వరకు వ్యాపించియున్నదానిని 'ఇరువురు వ్రాతల గూతలను మిగుల వాదించి రొగిన్' (3-308), అని యొక్క మాటలో చెప్పి ముగించిరి. దీనిని నోరి నరసింహశాస్త్రిగారు (3-890 నుండి 3-899 వరకు గల) తొమ్మిది పద్యములలో విస్తృతమొనర్చిరి. శ్రీ తిరుపతి వేంకటకవులు 3-282 నుండి 3-289 వరకు ఏడు పద్యములలో యథామూలముగ తెనిగించిరి. శ్రీ ములుగు పాపయారాధ్యుల వారు 3-380 నుండి 3-390 వరకు పద్యముల రచించుటయే గాక యించుకంత భావవిస్తృతియు గావించిరి.

మూలమున నలుబది యేబది శ్లోకముల కొకసారి యధ్యాయము మారు చుండును. మొదటి స్కంధమున నిరువది, ద్వితీయ స్కంధమున పదిరెండు, తృతీయ స్కంధమున ముప్పది, చతుర్థస్కంధములో నిరువది యైదు, పంచమ స్కంధమున ముప్పదియైదు, షష్టస్కంధములో ముప్పది యొక్కటి, సప్తమ స్కంధమున నలుబది, అష్టమ స్కంధములో నిరువది నాలుగు, నవమున నేబది, దశమ స్కంధములో పదమూడు, ఏకాదశ స్కంధములో నిరువది నాలుగు, ద్వాదశ స్కంధమున పదునాలుగధ్యాయములు గలవు. ఇట్లధ్యాయములు మారునపుడు జనమేజయుడు,నారదుడు, శుకుడు మొదలగువారేదో ప్రశ్నవేయుట 'వ్యాసఉవాచ', 'సూత ఉవాచ' అని ప్రశ్నలకు సమాధానములు చెప్పుచుండుట యును గానబడుచుండును. అనువాదకులు కథా మధ్యమున గల యిట్టి ప్రశ్నలు విడిచి రసము కుంటుపడకుండ కథను జవనాశ్వవేగముతో నడపించిరి.

రమ్యమైన గతిని కథను నడిపించుటకై యచ్చటచ్చట మూలమును కుంచించిరి. హరిరైవతాద్రి శిఖరమున కేగి దేవిని స్తుతించెను. మూలములో నున్న విషయమును వసంతతిలక, వనమయూర,తోటక,మత్తకోకిల వృత్తములలో కుదించి వ్రాసిరి. పాఠకుని యుత్సాహము సడలకుండుటకై యిట్టిచోట్ల ఛందో వైవిధ్యమును ప్రదర్శించి యావిషయమునే రమ్యముగ రంగుటద్దములో వలె దర్శింపజేయుట యొక చమత్కారముతో ఒక్కొక్క సరివిషయ విస్తృతి గావింపకయే సాభిప్రాయమైన ఛందముతో రచన సాగింతురు.

విష్ణు కృత భువనేశ్వరీస్తుతిని యగణముతో కూడిన దండకమున జేసిరి. స్తోత్రములను దండకమున గూర్చుట శ్రుతిహితము కొరకు. శివకృత దేవస్తుతిని ఎనిమిది యుత్సాహములలోను (2–81నుండి 88), తొమ్మిది కందములలోను (3–89 నుండి 97) జేసిరి.

దేవిని అష్టాక్షరీ నవాక్షరీ మంత్రములతో నర్చింతురు. దానికి ప్రతీకగా నెనిమిది ఉత్సాహలు,తొమ్మిది కందములు చెప్పబడినవి. దీనినే పాపయారాధ్యుల వారీ హరికృత శాంకరి స్తోత్రమును 'శాంకరీ' యన్న మకుటముతో నిరువది పద్యములను (3–83 నుండి 103) వ్రాసిరి. హరకృత మహేశ్వరీస్తోత్రమును 'జోహారొనర్తు మాహేశ్వరీ' యని పందొమ్మిది మత్తకోకిలలోను వ్రాసి భక్తిరసమును జాలువారించిరి. తిరుపతికవులు భువనేశ్వరీ స్తోత్రమును సుదీర్ఘముగ (3–58 నుండి 3–100) జేసిరి.

ఈ స్తోత్రములు గాని, వర్ణనలు గాని మరల మరల ఆవృత్తమగునపుడు ఆ రెండింటిని నొకచోటనే చేర్చి వానిని సంక్షేపించును. వృత్రాసుర సంహారము సందర్భమున నోటువడిన దేవతలు విష్ణు కడకేగి యాతనిచే ప్రేరేపితులై దేవిని స్తుతింప దేవి ప్రత్యక్షమగును. మూలములో నీదేవి వర్ణన(6–5–50 నుండి 56) అయిదు శ్లోకములలో గావింపబడినది. కాని శ్రీరాములుగారు 'ఇట్లు విబుధులనేక విధంబుల ప్రార్థింప దేవి ప్రసన్నయై మీరు వచ్చిన కార్యము తెలుపుడు' అని వ్రాసిరి. దేవి వర్ణన లేదు. వృత్రాసురుని మరణానంతరము శచీదేవి దేవీస్తుతి చేయగా దేవి ప్రత్యక్షమగును (6–141). అచట దేవి వర్ణన యథామూలముగ జేసిరి. కావున పై సందర్భమున నాస్తుతిని విడుచుటయే యుచితముగా నున్నది. మూలమున 'దేవి చారురూప సర్వాభరణ భూషిత, పాశంకుశ,వరాభీతి, లసద్బాహుచతుష్ట, కింకిణీజాల రశనాబద్ధసత్కటిః కలకణ్ఠీరవా, కాన్తాక్వణత్కంకణ నూపురా, చన్ద్రఖణ్డసమాబద్ధ రత్నమౌళి విరాజితా, మన్దస్మితా రవిన్దాస్యా, నేత్రత్రయ విభూషితా, పారిజాత ప్రసూనాచ్ఛనాళ వర్ణసమప్రభా, రక్తామ్బర పరాధీన రక్త చన్దన చర్చితా, ప్రసాదసుముభీదేవి, కరుణరససాగరా,సర్వశృంగార వేషాఢ్యా, సర్వద్వైతారణిఃపరా, సర్వజ్ఞ, సర్వకర్త్రీ, సర్వాధిష్ఠానరూపిణి, సర్వవేదాన్త సంసిద్ధా సచ్చిదానన్దరూపిణీ (6–4–50 నుండి 56).

శచీదేవికి బ్రత్యక్షమైన దేవి 'సామ్యరూపధరా హంసవాహినీ త్రిలోచన కోటిసూర్యప్రకాశ ..... అనన్తకోటి బ్రహ్మాణ్డ నాయికా పరమేశ్వరీ .... సర్వేశ్వరీ, సర్వజ్ఞ కూటాక్షర రూపిణీ (5-8-57 నుండి 63). ఇందు కూటస్థాక్షర రూపిణి యన్న చివర ముఖ్య విశేషమును తిరుపతి కవులు జారవిడచిరి (6-233).

శ్రీ ములుగు పాపయారాధ్యులు విష్ణుకృత దేవీస్తుతి (3-148 నుండి 159) పద్యములలో రచించిరి. ఈ స్తోత్రమున కవిత్వమునకు గాను జెప్పిన ఈ వృత్తముల పేరేదియో గోచరింపలేదు. వృత్తభేదములను శీర్షిక క్రింద వీనిని రచించిరి. దీనిని బరిష్కరించిన శ్రీ తిరుపతి వేంకటకవులీ యభిప్రాయమునే దెలిపిరి (2 భా,పు. 23). అప్పటికే సుదీర్ఘమైన దేవీస్తోత్రమును జేసిరి గాన దేవి వర్ణనము 'హంసవాహనయై వరదాభయాది హస్తసముపేతయై సుప్రసన్నముగ నున్న దేవి భువనమాత' (6-143), యని క్లుప్తీకరించిరి.

పంచమ స్కంధమున దేవికి ఆయుధప్రాప్తి సందర్భమున దేవతలు పిలిచి యిచ్చిన యాయుధములన్నిటిని యొక సీసపద్యములో సంక్షిప్తముగా నిమిడ్చిరి. ఆ సీసపద్యము ప్రతిపాదము నందును 'తివిచి దేవికి ......... దేవుడిచ్చే' (5-192) అని యాయుధమును యాదేవుని నామమును నొక పట్టికరూపమున నా సీసమున నిమిడ్చిరి. ఇది రసవత్తరమైన ఘట్టము గాదు. కావున నీ సంక్షిప్తతయే చాలును. దీనినే శ్రీ పాపయారాధ్యుల వారు 6-212 నుండి 220 వరకు గల పద్యములందు వర్ణించిరి. శ్రీ తిరుపతి వేంకటకవులు దీనినే యొక గీత పద్యము లోను నొక వచనములోను వివరించిరి.

మూలమున పంచమస్కంధము నందలి యష్టమాధ్యాయమున దేవతలు బ్రహ్మవద్దకు వచ్చి వారి కష్టముల జెప్పికొని మొరపెట్టుకొనగ బ్రహ్మ శివుని వద్దకు వారితో గూడ బోగా, శివుడు బ్రహ్మను వరములిచ్చి రాక్షసుల పాడు చేయుచున్నావనియును, మహిషుడు ఆడుదానిచేతనే సంహరింపబడును కాని తమ స్త్రీలంతటి సమర్థులు కాకపోవుటచే విష్ణునికడ కేగుదమని చెప్పినట్లున్నది. దీని తరువాత వైకుంఠ పుర వర్ణన, శకునములు చెప్పబడినవి. కాని శ్రీరాములుగారి యనువాదమున నిట్లున్నది. - వాసవపురస్కృతులైన దేవతలు బ్రహ్మవద్దకు వచ్చి యటు శివుని గూడ దోడ్కొని విష్ణుని కడకుపోయి యచ్చటచే విష్ణు ముఖమున

హరబ్రహ్మలు సంభాషించినట్లు గలదు. ఈ సంభాషణ రెండు పర్యాయముల జేయుట పునరుక్తమని బ్రహ్మ శివుని వద్ద సంభాషించినది విడిచిరి. ఇచట దానిని విడచినను మూలభావమును ప్రపంచించుచు శ్రీరాములుగారికి సహజమైన శైలిలో హాస్యమును భావింపజేయుచు నొక మనోహరమైన సీసమును రచించిరి. మిగిలిన యనువాదములలో నీ చమత్కారము లేదు.

చంద్రశేఖరు భార్య శాంకరి యున్నది
　　వరుని వామాంగంబు వదలకుండు
బ్రహ్మదేవుని భార్య భారతి యున్నది
　　విభు తలవాకిలి విడువకుండు
పాకారి పెండ్లాము పౌలోమి యున్నది
　　రమణుగాచుక యుండు రాత్రి పవలు
అంతకాదుల యాంద్రు శామాదులున్నారు
　　వారి కెక్కడిదయ్య యూరు పేరు.

పేరుగలదౌను దేవర వారి రాణి
నగల సొగసుల మొహరీల నాణెములను
బాగుగ నెఱుంగుమీరొమ్ము బాయదెన్న
దేరు మహిషాసురునితోడ బోరగలరు. 5-183

ధాత్రాతస్మై వరోదత్తో హ్యవధ్యో పి నరైః కిల
కాస్త్రీత్వేవం విథాబాలా యాహన్యాత్తం శఠంరణే. 5-8-24

ఉమామావా శచీవిద్యాకా సమార్థాస్య ఘాతనే
మహిషస్యాతి దుష్టస్య వరదా నబలాదపి. 5-8-25

అను ఈ రెండు శ్లోకములలోని భావము రమ్యముగ నాపై సీసమున జెప్పబడినది. దీనినే ములుగు పాపయారాధ్యుల వారు 'నీదు నాదు నెలంతలు నిర్జరేంద్రు నెలతయును, హంతకామలై నిలువగలరే?' (5-170) అనిరి.

అవ్వాని వధించుపాటి సామర్థ్యంబు మారమాసరస్వతీ శచ్యాదులందే యంగనకుంగల్గునయ్యది విచారింపుము (5-169) అని శ్రీ తిరుపతి కవులు

ఒక వచనముతో చెప్పి ముగించిరి. సప్తమ స్కంధములో సుకన్య గ్రొవ్విరులు గోయుచు విహరించిన వన వర్ణన మూలమున 7-2-34 నుండి 7-2-40 వరకు గల యేడు శ్లోకములలో నున్నది. దీనిని శ్రీపాపయారాధ్యులవారు విపులముగ వర్ణించి యుండిరి. ఇట్లే యింకొక ఘట్టమున మూలమును త్యజించియు కథకు పుష్టిని యౌచిత్యమును జేకూర్చిరి. చ్యవనుడు సుకన్య నిమ్మనగా శర్యాతి యిటునటు చెప్పలేక చింతించుచు 'కురూపి భర్తగా నమరినఁజెప్పశక్యమె యహల్య సురేశ్వరుతోడ గూడదే' (7-54) యని తిరుపతి కవులు యథాతథముగ దెనిగించిరి. అట్లే పాపయారాధ్యులవారును వృద్ధుండగు గౌతముం బరిణయించి సుందరి యగు నహల్యా వాసవ వంచితయై ధర్మ విపర్యయంబునఁబతిచే శపియింపఁ బడియెఁ గాన నంధుండును నంధువు బాలంబడఁ ద్రోచి యెట్లు తరింతు' (7-63) అని యథామూలముగ వ్రాసిరి.

దీనికి మూలము -

'గౌతమంతా పసంప్రాప్య రూపయౌవన సంయుతా
అహల్యా వాసవె నాశువఞ్చితా వరవర్ణినీ. 7-5-28

శ్రీరాములుగారీ భావమును విడిచిరి.

మగువ తుల్యుడైన మగనితో కూడిన
సుఖము గల్గునెందు జూచి సూచి
యెట్లు గొంతుగోయ నివ్వేళఁజేయాడు. 7-60

అని మాత్రమనిరి. తన కుమార్తెల విషయమై తానే యనుమానపడుట సమంజసము కాదని దీనిని విడచి యౌచిత్యపరిపోషణ గావించిరి. 'చూచి సూచి యెట్లు గొంతుగోయ నివ్వేళ జేయాడు' అన్న తెనుగు నుడికారము ఈ భావమునకు మరింత పుష్టిని గూర్చుచున్నది. 'చేయాడుట లేదు' అన్న ఒక్కమాట అప్పటి శర్వాతి మనస్థితి కన్నులకు గట్టుచున్నది.

తద్దైవాహం భవిష్యామి నాత్రకార్యావిచారణా
అనసూయా యథాసాధ్వీ భార్యాత్రేః ప్రథితాభువి. 7-3-60

దీనికి పాపయారాధ్యుల వారి యనువాదము - '.... దివానివంబు పరలోక

సుఖాభిలాషచే భర్తృపరిచర్య సల్పుచు వశిష్ఠునకు నరుంధతియు నత్రి కనసూయయు ధర్మపత్నులగు వడువు నమ్మునికిఁ బత్నివై యుభయ వంశంబులకుఁ బుణ్యం బార్జింతు...........' (7–85)

తిరుపతి కవుల యనువాదము –

అనసూయ యత్రికి వసి
స్ఠునకు నరుంధతియుఁబోలె సుగుణుండగు ని
మ్ముని కేను బ్రీతి గొల్పెద
ననఘా! నీవింకఁ జింతనందకు మాత్మన్. 7–69

దీనిని శ్రీరాములుగా రనువదింపలేదు. అహల్యవలె యగునేమో యని తండ్రి యనుమానించిన యాతని సంశయనివృత్తికై యరుంధతి అనసూయలవలె చరింతునని చెప్పవచ్చును కాని యీ యనుమానమే లేకున్నప్పుడు 'గుమ్మడికాయ దొంగ యనిన భుజము దడుముకొనిన యట్లు' ఆ సందేహము నివారించుటకు పూనుకొనుట యెందుల కని విడుచుటయే యీ సందర్భమున కెంతయు తగియున్నది.

వ్యసుర్యథాన జానాతి గుణాశ్శబ్దాదికానిహ
తథా హరిర్నజానాతి నిద్రామీలిత లోచనః. 1–7–19

అన్న శ్లోకము పాపయారాధ్యులవారు 'నిప్ప్రాణి చేష్టలందినట్లని' (1–32) తెలిగింపగ నోరి వారు 'గతాసువులో యనన్' యని యుత్ప్రేక్షింప 'హరిని గతాసువు' అనుట యౌచీతిరహిత మని తిరుపతివారును, దాసువారును విడిచిరి. అట్లే (3–12–29) 'ఏకపుత్రౌ నిరాశ్రయః' అన్నదియు ననువాదములోనికి రాలేదు. 'సంగరం సంపరిత్యజ్యగతే శక్రేశచీపతౌ యయోధనాధిపఃపాశీ జగ్ముస్సర్వే భయాతురాః' (5–7–18). అట్లే ఈ శ్లోకమునకు శ్రీరాములు గారు 'పోరిపోరి తుదకు... బ్రదుకు దేవుడా యటంచు' (5–160) అని ఈ లోకోక్తి చేర్చి ఈ విషయమును సంగ్రహించుటతో ననువాదమున కొక సొంపు గూర్చిరి. మిగిలిన యనువాదములో నీ సంక్షిప్తత గానరాదు.

వ్రత్రాసురోత్పత్తిలో వృత్తుని మాటలను మూలమునకన్న సంక్షేపించుచునే తెలుగు పలుకుబడులు సడలనీక చక్కని యనువాదమును రూపొందించిరి.

పిభామిసాగరం సద్యశ్చూర్ణయామి ధరాధరాన్
ఉద్యన్తం వారయామ్యద్య తరణిం తిగ్మతీజసమ్. 1–2–41

హన్మీన్ద్రం పసురం సద్యోయమం వాదేవతాన్తరమ్
క్షిపామి సాగరే సర్వాన్సముత్పాద్యచ మేదినీమ్. 6–2–42

దీనికి నిట్లుత్సాహలో జెప్పిరి –

చల్లగాను జప్పరించి సాగరంబు ద్రావనా
పెల్లగించి భూధరముల బిండి పిండి సేయనా
మెల్లగాను నోటఁబెట్టి మిహిరకరుని మ్రింగనా
నల్లులట్ల సురలబట్టి నల్పి చంపివేయనా. 6–36

దీనికి తిరుపతి కవుల యనువాదము –

సురల హరింతునో? జముని చొప్పడఁగింతునో? యింద్రుఁద్రుంతునో?
వరుణు నడంతునో? శశి దివాకరులన్ వధియింతునో? ధరా
ధరముల ముక్కముక్కలుగ దంతునొ? యీ జలారాశులన్ సము
ద్ధురగతి ద్రావనింతునొ? సుతున్ననుఁబంవుమనంగ నాతఁడున్. 6–58

పాపయారాధ్యుల వారి యనువాదము –

సాగరములుఁబీల్తు శైలముల్ నుసిసేతుఁ
బుట్టుచున్నతరణి పొలుపు మాపి
యమునితోడ నింద్రు నంభోధిఁబడవై తుఁ
బుడమిఁగడలిలోన నడఁగద్రోతు. 6–62

నల్లులట్ల సురలబట్టి నల్పివేయనా యన్న క్రొత్త యుపమానమును జేర్చుటచే పద్యమునకు దెనుగుతనము చేకూర్చటయే గాక వృత్రుని దుందుడుకుతనము ద్యోతక మగుచున్నది. ఇట్లీ రసవత్తరములైన యుపాఖ్యానము లందు ఔచిత్యమును బోషించుటకును పునరుక్తి తొలగించుటకు అప్రసక్త విషయ విస్తరణము తగ్గుటకు

ప్రధాన కథతో నంతగా సంబంధము లేని హేతువుననవసరములగు వానిని కథా వేగమున కవరోధము కల్గించువానిని విడిచిరి.

సుకన్య చరిత్రము భారతమున అరణ్యపర్వమున తృతీయాశ్వాసమున గలదు. దేవీభాగవతమున సప్తమస్కంధమున గలదు. ఆరాశ్వాసములు గల ఈ చరిత్రను శ్రీరాములుగారు 161 పద్యములలోను తిరుపతి కవులు 155 పద్యములలోను రచించిరి. కథాప్రారంభమున 'శర్యాతి నరపతికి వేయిమంది తీవియ బోంట్లందును నల్వురు రాట్పుత్రికలనుంగు గోమలులు లక్షణాంచితలు' (7–27) అనిరి. దీనికి మూలము –

వైవస్వత సుతశ్శ్రీమా ఇచ్ఛర్యాతిర్నామపార్థివః. 7–2–30

తస్యస్త్రీణాం సహస్రాణి చత్వార్యాసస్పరిగ్రహాః

రాజపుత్ర్యస్సురూపాశ్చ సర్వలక్షణ సంయుతాః. 7–2–31

పాపయారాధ్యులవారును, తిరుపతి కవులును 'శర్యాతికి నాలుగు వేల్ భార్యలు గలరందరు ననవద్యచరిత్రల్' అని మూలనుసారముగ ననువదించి యుండ శ్రీరాములుగారేలనో విభిన్నమార్గ మనుసరించిరి. శ్రీరాములు గారు చాల విషయములందు స్వతంత్ర మవలంభించిరో లేదా వారు జూచిన బ్రతిలో నట్లున్నదో కాక దీనినైదు మాసములలో వేగముగ రచించి పూర్తిచేయుటలో పొరపాటు గలిగినదో !

ఇట్లు వ్యత్యాసము లచ్చటచ్చట పొడసూపినవి. వేంకట శాస్త్రిగారు ఒకటి రెండింటిని సూచించియే యున్నారు. ప్రథమ స్కంధమునందు వ్యాసుని కడకు బుత్రోత్పాదరనకై దేవతలచే ఘృతాచి పంపబడినది.[5] పిదప నమ్ముని శపించునని భయపడి పలాయితురాలైనదియు ఘృతాచియే గాని వేరొకతె గాదు. ఇందు నిష్క్రమణ ఘట్టమును ఘృతాచి యూర్వశిగా మారినది. మనోరమ కుమారునితో రథంబెక్కి మంత్రి విదల్లుందోడ్కొని పట్టణ బహిఃప్రదేశమునకుంజని రణంబునం గూలియున్న తండ్రికి యగ్నిసంస్కారము చేసెనే గాని భర్తకు గాదు. భర్తకు సంస్కారము జేసెనని శ్రీరాములుగారు వ్రాసిరి. అట్లే ఈ వ్యత్యాసమిచట దొరలినది లేదా లేఖకుని దోషమై యుండవచ్చును. ఏలయన భారతమునను 'సంయాతి

యను రాజు తన చతుస్సహస్ర దేవీనివహంబు తోడ దత్సరోవరంబునం విహరింప నరిగిన' యని కలదు.

ద్వాదశస్కంధమున సురగర్వాపహరణము, గాయత్రీకవచము, గాయత్రీ హృదయము, గాయత్రీ స్తోత్రము గాయత్రీ సహస్రనామములు,దీక్షా విధి, కేనోపనిషదర్థ వర్ణనము, బ్రాహ్మణులకు గౌతముని శాపము,మణిద్వీప వర్ణన, పురాణఫల దర్శనము, శ్రీదేవీభాగవత మహిమయును గలవు.ఇందు పాపయా రాధ్యుల వారు మణిద్వీపవర్ణన, గౌతమవృత్తాంతమును విడిచిరి. తిరుపతి వేంకట కవులు గాయత్రీస్తోత్రము సహస్రనామములను, దీక్షావిధిని యను వాదము చేయలేదు. శ్రీరాములుగారు మాత్రము దేనిని విడువలేదు.

ఏకాదశ స్కంధముసను నీ మంత్రశాస్త్రవిషయములు భస్మధారణ మొదలగునవి వివరింపబడినవి. మూలమును కూలంకషముగ నాకళింపు జేసికొనిన గాని వీనిని ఆంధ్రీకరించుట క్లిష్టము.

శ్రీరాములుగారు యనువాద మిప్పట్టున కేవల మనువాదముగా కాక మూలమునకు వ్యాఖ్యానముగ నుండి సముచితముగ నున్నది. హయగ్రీవాది మంత్రములను సూచనాప్రాయకముగా కాక విపులముగ విశదీకరించిరి. అష్టమ స్కంధమున హయగ్రీవ మంత్రము మాత్రము గలదు. 'ఓమ్ నమో భగవతే మహాపురుషాయ సర్వగుణ సంఖ్యానాయ అనంతాయ అవ్యక్తాయ నమః ' (8–43). ఇది కవిగారి నిత్యపారాయణమున నుండి యుండును. కావుననే మంత్ర తాత్పర్యము చెప్పక మంత్ర స్వరూపము సాంగోపాంగముగ వివరించిరి. శ్రీ తిరుపతి కవులు దానిని చెప్పలేదు. అనువాదములో విడిచివేసిరి. 'సంకర్షణ మంత్రతంత్రముల నారాధించు' అని మాత్రమే వచించిరి. పాపయారాధ్యుల వారు కొంతవరకు ప్రయత్నించిరి. ఈ మంత్రోపాసనకాండ యంతయు యథా తథముగా నే మాత్రము మార్పుచేయకయే సాగవలెను. లేకున్న మూలమునకే ముప్పు వాటిల్లును. ప్రతిభావంతుడైన కవి తన ప్రజ్ఞావిశేషముచే వ్యాఖ్యానించుచు మూలమునకు సొంపు నింపును.

**యథామూలము :–** సంస్కృతము నందలి భావములను యథాతథముగ తెనుగునకు దెచ్చుటయే ప్రజ్ఞ. ఈ ప్రజ్ఞ యీ యనువాదకులందరికి గలదు.

మూలమునరసవిహీనములైన తావుల యనువాదమున కూడనట్లే యథాతథముగ నుండిన రక్తి గట్టదు. కావున నేర్పు గల యనువాదకుడు మూలభావము చెడకుండ ఛందోవైవిధ్యముతో చిట్టిపొట్టి సమాసములనో అనుప్రాసలనో యాధారముగ జేసికొని అలంకారములను ఆలంబనము జేవికొని మనోజ్ఞముగ ననువాద నైపుణ్యమును ప్రదర్శించును.

దేవతాస్తుతిని గాని వస్తు విషయముల పట్టికను గాని యీయవలసి వచ్చిన యథామూలముగ తెనిగించుచు ఛందోవైవిధ్యమును ప్రదర్శించుటో మకుటము చేర్చుటో చేయును. ముక్త పదగ్రస్తములతో సుదీర్ఘవచన రచనల చిత్రవిచిత్రములుగ చిత్రించుటలో నేర్పును జూపును.

వీరు తొమ్మిది దండకములలో వివిధ దేవతాస్తోత్రముల నాయా సందర్భముల జేసిరి (1-204). సీసమును ముక్తపద గ్రస్తముగ రచించిరి. (1-225) నిరోష్ఠ్యముగ చంపకములతో యథామూలముగ ననువదించిరి. 1-575 తేటగీతి పద్యమును సొగసుగ అచ్చతెనుగును యథామూలముగ వ్రాసిరి. దేవీభాగవత స్వరూప కథనమును జెప్పుచు ఈ క్రింది శ్లోకమును చక్కగ నెట్లు విస్పష్టముగ వివరించిరో చూడనగును -

అజ్ఞాన నాశనం దివ్యం జ్ఞానభాస్కర బోధకమ్. 16-36

సుఖదం శాన్తిదం ధన్యం దీర్ఘాయుష్యకరం శివమ్
శృణ్యతాం పఠతోఇచ్చెదం పుత్రపౌత్రవి వర్ధనమ్. 1-16-37

శిష్యో యం మమ ధర్మాత్మా లోమహర్షణ సమ్భవః
పఠిష్యతి త్వయాసార్ధం పురాణీం సహితాం శుభమ్. 1-16-38

అజ్ఞానము నడంచు నాయువు నెగడించు
ప్రజ్ఞానమును బెంచు భాగవతము
పుత్రపౌత్రులనిచ్చు భూతివర్ధిలఁజేయు
బహుశుభంబుల దెచ్చు భాగవతము
శాంతిదాంతులొసంగు సౌఖ్యదంబై మించు
పాపంబుల నడంచు భాగవతము

తేజంబు గల్గించు దివ్యకీర్తి ఘటించు
ప్రతిభను గావించు భాగవతము.

పతితపావనచరిత మీ భాగవతము
పరమవైదిక మార్గమీ భాగవతము
పాశముల నెల్ల ఖండించు భాగవతము
పఠనచే మోక్షము నొసంగు భాగవతము. 1-593

యథాతథముగ జెప్పుచునే 'భాగవతము' అను పదమును అంత్యానుప్రాసముగ ఘటించి యీ రచన కొక జిలుగుపనితనమును గూర్చిరి. మిగిలిన వారి యనువాదములలో నీ జిలుగు గానరాదు.

సావిత్రీదేవి జేయు షోడశపూజలను, రెండు సీసములలో (9-823,824) మాతృకానుసారముగ రచించుచు 'అందవమ్మ' అన్న అంత్యానుప్రాస జేర్చి పాఠకుల దృష్టి నిటు మళ్ళించుటకై చేసిన యొక చమత్కారము. అట్లే 9-826 నుండి 829 వరకు గల నాలుగు కందములను 'కాకోదర వేణి నిత్యకల్యాణి యికన్' అన్న మకుటమును, 9-1561 నుండి 1569 వరకు గల యయిదు కందములందు 'రాధాదేవీ' యన్న మకుటమును 10-45 నుండి 54 వరకు గల శార్దూల మత్తేభములకు, 'ఆకృతీ' యన్న మకుటమును, 12-126 నుండి 138 వరకు గల ఆటవెలదులను, 'విధుల యందు మీరు విముఖులౌదురు గాక పాఱులార బ్రహ్మ బంధులార' అన్న మకుటమును జేర్చిరి. ఇట్లు దేవీస్తుతి యర్చనావిధులందే గాక ఉపాఖ్యానము లందును 'కథాపద్దతి' నవలంబించినను అచ్చటచ్చట యథానువాదపు ఛాయలు గూడ బొడసూపును.

బుద్ధచరిత్రమున చంద్రుడిట్లనును -

త్వయైవోదాహృతం పూర్వం
ధర్మశాస్త్రమతం తథా
నస్త్రీదుష్యతిజారేణ
నవిప్రో వేదకర్మణా. 1-11-22

దీనికి శ్రీరాములుగారు యథాతథముగ తెనిగించిరి.

దూరులేదు సతికి జారుచే ననుచును
విప్రునకును వేదవిధుల వలన. 1-371

కాని యా భావమునకు స్పష్టత చేకూరలేదు. పాపయారాధ్యులవారు స్పష్టత చేకూర్చుటకు కొంతవరకు ప్రయత్నించిరి.

కామమందుఁ గొంత గాంచదు సంతృప్తి
వేదకర్మమందు ద్విజుడు కనఁడు
దానవిప్రుఁడును రజశ్చారవేదకృ
త్యములశుద్ధిగాంతు రలుగనేల. 1-463

తిరుపతి కవుల యనువాదమున ధర్మసూక్ష్మము వ్యాఖ్యానింపబడినది.

వనిత పరపురుషుఁ గలిసియు
ననగయగు రజఃప్రసక్తి నగ్రజుఁ డఘముం
బొనరిచి వైదికకర్మం
బున శుద్ధుండగు నటంచు మును నీవనవే? 1-227

జగద్గురు శ్రీ కల్యాణానందభారతీస్వామి శిష్యులగుటచే శ్రీ నోరి నరసింహ శాస్త్రిగారు ఈ యుపాఖ్యానమునే త్యజించిరి. అపరంజిలో జాతిరత్నము పొదిగినట్లు నొక చిన్న జాతీయమును జేర్చి సొగసు గూర్చుట యొక సొంపు.

తమువాచ హసన్సోమః కిమిదం బహుభాషసే
నతే యోగ్యా సితాపాంగీ సర్వలక్షణ సంయుతా. 1-11-30

కురూపాంచ స్వసదృశీం గృహాణాన్యాం స్త్రియంద్విజ
భిక్షుకస్య గృహే యోగ్యా నేదృశీ వరవర్ణినీ. 1-11-31

దీనికి శ్రీరాములుగారి యనువాదము -

కనుగొని నవ్వరే జనులు గౌరవహానియుఁగాదె కాకి ము
క్కున నిడు దొండపండువలెఁ గామిని నీకడ నిల్చె నేనియున్
వినుమిఁక దీనిసుందరి నవీన వయస్కనుమాని నిన్నుఁబో
లిన ముసలాపె నానన వళీముకులీకృతనేత్ర గూడుమీ. 1- 378

తిరుపతి కవుల యనువాదము

వెలఁది వెలంది యంచు బలవించెదవేల? సమస్త లక్షణం
బులుగల యీ నెలంత నినుబోలి దరిద్రుని యింటనుండ రా
వలయునె? యింతి కానలసివచ్చిన నీ కెనయైన బోటి తోఁ
గలిసి సుఖింపు మీజలజగంధినిఁగూడి సుఖింపనేర్తువే?. 1-230

మూలములో వలెనే పాపయారాధ్యుల వారు రెండు శ్లోకములను యథామూలముగ పొల్లువోకుండ నించుక ప్రౌఢముగ జెప్పిరి.

ఇటు పరుషోక్తు లాడఁగ సహింపక చంద్రుడు లేచివచ్చి వా
కిటఁజిఱునవ్వు నవ్వుచు నొకించుక నిల్చి వెలందినీను బొ
మ్మిటు బహుభాషలేల తగవి లతాంగికి దైవమిట్లు దు
ర్ఘటన మొనర్చెఁ గాకిమెడఁగట్టిన బింబఫలంబు కైవడిన్. 1-466

అఖిల లక్షణ లక్షితయైన యట్టి
యిట్టి జవరాలు నీకేల నెందునేనిఁ
దగిన బోటిని గొమ్ము సుందరి యిదెట్లు
భిక్షునకు నర్హయగు నింక వేయునేల. 1- 467

'కాకిముక్కున నిడు దొండపండువలెనే' అన్నంత తెనుగుదనము 'కాకి మెడ గట్టిన బింబఫలంబు కైవడి' యన్నదానిలో లేదు. శ్రీరాములు గారు పాపము బృహస్పతిని 'దరిద్రుడ'ని గాని 'భిక్షువు' అని గాని హీనముగా నిందింపలేదు. 'కురూపాంచస్వసదృశీం' యన్నదానిని విస్తరించి 'ముసలాపెనాననవళీ ముకుళీ కృతనేత్ర' యనిరి. ఈ సందర్భముననే యమూలకముగ శ్రీ తిరుపతి కవులొక పద్యమును జెప్పిరి.

అంగనామణిలేని యాశ్రమంబు శ్రమంబు
భార్యలేకున్న సంపత్తి మిత్తి
అర్థాంగిపెట్టని యన్నంబు సున్నంబు
సహధర్మిణికిఁగాని శయ్య కొయ్య
గృహిణి పొందికలేని కేలిక తేలిక
యిల్లాలు లేకున్న యిల్లు ముల్లు

సహచారిణికిఁగాని సంగంబు భంగంబు.
సతిచేతఁ బెరుఁగని సుతులు మృతులు

శిష్యుఁడవుగాన నీతోడఁ జెప్పికొంటి
నాతలోదరి నిప్పించి నామనోర
థమ్ము నొడఁగూర్పు, మీరీతిఁ దలఁపవేని
సన్యసించెదఁగాని సంసారమొల్ల. 1-237

ఒకని బెట్టునట్టి ............ 3 - 305

సిగ్గు చిన్ననాడె చెడిపోయె ......... 1- 271

ఈ పద్యములు తిరుపతికవుల శ్రవణానందము నందలి పద్యములకు మాతృకయై యున్నవి. ఇందలి యనుప్రాస బృహస్పతి ప్రయాసపాటును మరింతగ వ్యక్తము చేయుచున్నది. తృతీయస్కంధమున సత్యవ్రతోపాఖ్యానము గలదు. సత్యవ్రతుడు వాగ్బీజమహిమచే వాల్మీకి వలె కవియై కిటినేసిన కిరాతునితో నిట్లు చెప్పెను -

యాపశ్యతి నసాబ్రూతే యాబ్రూతే సానపశ్యతి
అహోవ్యాధ స్వకార్యార్థిన్ కింపృచ్ఛసి పునః పునః. 3-11-41

ఈ శ్లోకమును యథాతథముగ వ్రాసి దాని యనువాదము గూడ యా పద్యము క్రిందనే వ్రాసిరి-

కనినది యనదని నదీతాఁ
గన, దయయో వాంఛిత స్వకార్యధురీణా
నను నీరీతిని మఱిమఱి
యును నీవడుగంగనేల నోరీ శబరా. 3-239

తిరుపతి కవులు గూడ యథాతథముగ నీశ్లోకమును (3-210) వ్రాసి క్రింద యథస్సూచికలో దీని యనువాద పద్యమును వ్రాసిరి-

ఏది చూచునో యది చెప్పదు
విదితముగఁ బల్కునేది వీక్షింపనిద

య్యది సారె సారె నేమడి
గెద? వెవ్వరు చెప్పువారొగిన్ జనుమృగయా.

దీనికి నరసింహశాస్త్రి గారి యనువాదము –

ఏదిచూచునో యది పల్కలేదు సుంత !
యేది పలుకునో యది చూడలేదు నిక్క
మయ్యయో వ్యాధుడా! స్వకార్యార్థివగుచు
నేల మఱిమఱి ప్రశ్నింతు విట్లు మృగయ. 3–268

పాపయారాధ్యులవారి తెలుగు –

యేది వరాహంబు వీక్షించెనో యది పలుకనేర నిది చెప్పంగగలదె?
పలుక నేర్చిన యది పందిని గనలేదు చూడకతెల్పెడు జాడగలదె?
3–389

అని వివరముగ జెప్పి మరల దానినే యిట్లు చెప్పిరి.

కనుగొనినవి కన్నులు గా
వునఁబలుకవు రసనపలుకు సొలు పెఱిఁగెడిఁగా
వున నది చూడఁగనేరని
దని సత్యవ్రతుఁడు సత్యమనె నిటగనుమీ. 3–290

నాలు గనువాదములు కవితాసంపత్తికి చేరువలో నున్నను తిరుపతి కవుల దిప్పట్టున ధారాశుద్ధి కలిగి ప్రసాదగుణశోభితమై తనరారుచున్నది. ధృవసింధూ పాఖ్యానమున సింహము ధృవసింధుపై నురికి యాతని ప్రాణముల నపహరించెను. దానిని శ్రీరాములుగారు మూలవిధేయముగ రెండు పద్యములలో ముగించిరి. సింహవర్ణనమున 'జెడనార్చి గాండ్రు గాండ్రాంచు బయిబయిం దుముక' అని మాత్రము చెప్పి యూరకుండ పాపయారాధ్యులవారు, తిరుపతి కవులు ఈ సింహవర్ణనమును మిక్కిలి పౌఢ్రముగ చేసిరి. పాపయారాధ్యుల వారు,నోరి వారు ఉత్ప్రేక్షాలంకారమును జేర్చి యింకను రసవంతముగ రచించిరి.

ధ్రువసింధుకుమారుల స్వభావమును, వారి మనస్తత్వమును జక్కగ నిరూపించుటకు నోరివా రమూలకముగ చిన్న కల్పన చేసిరి –

మొగముల వ్రాలు ముంగురుల మూఁకల మాటికి నంగుళాళిఁబై
కెగయగఁద్రోయుచున్ రిపులనిట్ల యొనర్చెద రంచుఁ బల్క బం
దుగులు బ్రియంబొనర్చుచు సమానముగా ధ్రువసంధికిన్ సమా
న గరిమ నాటలాడుచు మనంబుహరించిరి పుత్రులిద్దరున్. 3-4-74

ఇది బకాసురవధ ఘట్టమున రాక్షసున కాహారముగ 'నేబోయెద నేబోయెద' నని బ్రాహ్మణకుటుంబము దుఃఖించుచున్న సమయమున నాయింటి బాలుడు పల్కిన తొక్కు పల్కులు మనోవీథిలో చటుక్కున నొక్కసారి తళుక్కుమనును.

బాలుడొక్కండు కొండొక కోలసేతఁ
బట్టుకొని యేను రక్కసుఁగిట్టి చంపి
చులకఁగావత్తు మీరేడ్వవలవదనుచుఁ
గల యనూరార్చెఁ దొక్కుఁబలుకులొప్ప. భా. 6-260

ధ్రువసింధువు వేటాడిన మృగములను మూలములలో కవి బేరుబేరున పేర్కొనెను. దాని ననుసరించియే నోరి వారును ఆ వేటాడిన పంచాస్యములను, గజములను,ఖడ్గమృగములను, కిటిసంఘములను వేర్వేర బేర్కొనెను. పాపయా రాధ్యులవారును మూలమునే యనుసరించిరి. తిరుపతివారట్లు ప్రత్యేకముగ పేర్కొనక 'అనేక మృగంబులనుక్కడగించుచున్' అనిరి. అట్లే శ్రీరాములు గారును 'దుష్టమృగపుంజములన్నిజనైపుణిన్ మోదుచు వోయి' యనిరి. విద్వాన్ సరిసెల్ల విశ్వనాథశాస్త్రిగారును 'పెనుమృగములను వేటాడెను (పు.116) అని క్లుప్తముగ ముగించిరి. వీనిని విడిచినను కథావగతికి భంగము రాదు. యుధాజిద్వీరసేనుల యుద్ధవర్ణనమును మూలానుసరణములుగ ననువాదకులందఱు మనోజ్ఞముగ జేసిరి. యుద్ధభూమి యొక్క భీభత్సముగాక యందు మరణించిన యోధవీరులు వీరస్వర్గమునకు బోవుటయు, నచట దేవకాంతల గవయుటయు, హృద్యముగ వర్ణింపబడినవి. తిరుపతి కవులు మాత్రము అచ్చట యమూలకముగ నొండు రెండు పద్యముల జేర్చి మరింత సొగసును సంతరించిరి. సీసపద్య (3-304) మందలిగీత పద్యమమూలకము -

అయినవారెందరో యిప్పుడగుచున్న
వారలెందరో కాబోవువారలెంద

ఱో యొకండంచుఁ గలడె మీరోయువిదల
కనుచు నిరసించె నప్పరోవనిత నొకఁడు.

ఒక్కనిచెట్టవట్టి మఱియొక్కనికిన్ విడెమిచ్చి ముద్దు వే
ఱొక్కనికిచ్చి చల్లని మృదూక్తుల వేఱొకనిన్ నగించి యిం
కొక్కని చెక్కుఁగొట్టి పొలుపొందె నొకచ్చరలేమ యొక్క నిం
జిక్కుట సున్నగాదె వెలచేడెలు స్వర్గము పొంతవోయినన్. 3-305

ద్రౌపది సైంధవుడు బలాత్కారము చేయబోవుటను శ్రీరాములుగారు మూలానుసరణముగ నొక యర్థాంతన్యాసముతో నిట్లు సమర్థించిరి-

మునివరులనుగ్రమూర్తులఘనులనైనఁ
జూడఁడాయెను నమ్మవచ్చునె కుజనుల. 3 -362

తిరుపతి వేంకటకవులును నా సందర్భమున యట్లె యర్థాంతన్యాసమును మూలానుసారముగ గ్రహించిరి.

పశువుగతి మంచిచెడ్డల
ప్రశంసవిడనాడి ఋషులఁబరికింపక దు
ర్వృశుఁడై హరించె నాపె వి
విశులగు దుష్టులకు వావివరుసలు గలవే? 3-345

మిగిలిన యనువాదములలో నీ యర్థాంతరన్యాసాలంకారము కానబడదు. యుద్ధమునకు సంసిద్ధుడగు సుదర్శనుని మనోరమ దీవించుట కూడ మూలాను సరణముగనే యొక వచనమున ననువదించిరి. కాని పాపయారాధ్యులవారు ఈ భావమునే విస్తరించి పదమూడు కందములలో వివరించిరి. భక్తిరస స్ఫోరకములగు ఘట్టముల పాపయారాధ్యుల వారి హృదయము పరవశించి పరవళ్ళు ద్రొక్కును. సుదర్శనుడు చేయు దుర్గాస్తవమును శ్రీరాములుగారొక ఉత్సాహవృత్తములోను, తిరుపతి వారొక శార్దూలముననను వ్రాయ జగద్గురు శ్రీ కల్యాణానందభారతీస్వామి కరకమల ప్రసాదాసాదితులును దేవ దీక్షితుడును నైన శ్రీనోరి నరసింహ శాస్త్రిగారు 'మ్రొక్కెద' నన్న మకుటముతో రెండు కంద పద్యములును,ఒక వసంతతిలక వృత్తమును, మరికొన్ని పద్యములును జేర్చి

మొత్తము పదునాలుగు పద్యములతో నీ దేవీస్తుతిని మూలప్రపంచితము చేసి మహోజ్జ్వలమైన భక్తి రసప్రవాహమును జాలువారించిరి.

దేవి మహిషాసురుల యుద్ధము పంచమస్కంధమున వర్ణింపబడినది. ఈ స్కంధమంతయు సంధి విగ్రహములతో కూడియున్నను రసవంతముగ వర్ణింప బడినది. రాయబారవచనములు మూలవిధేయకముగ నుండవలెను. అప్పట్టుల అనువాదకుడు తెలుగునుడికారపు సొంపులు గూర్చుచు జాతీయముల జేర్చుచు ననువాదమునకు దెనుగుతనముట్టివడజేయుటయే గాక తన సహజమైన శైలిలో హాస్యరసము చిప్పిలజేయుచు పాఠకుల యుత్సాహము సడలనీయక కడు సమర్ధముగ ననువదించును.

శచీపతి కడుకు మహిషుడొక సందేశహరుని బంపి స్వర్గము స్వాధీనము జేయుమన సక్రోధంబుగా నింద్రుడు దూత కిట్లనియె -

నజానే హం సుమన్దాత్మన్యతస్త్వం మదదర్పితః
చికిత్సాం సంకరిష్యామి రోగస్యాస్యప్రభోస్తవ
శిష్షైర్ధాతా నహన్త వ్యాస్త స్మాత్త్వాం విసృజామ్యహం
యుద్ధేచ్ఛాచేత్స మాగచ్ఛత్వరితో మహిషీసుత. 5-3-18

హయారేత్వద్బలంజ్ఞాతం తృణాదస్త్వం జడాకృతిః
శృంగయోస్తే కరిష్యామి సుదృఢంచ శరాసనమ్. 5-3-19

దీనికి దాసుగారి యనువాదము -

ఔర యెవ్వఁడు వీఁడు వీఁడంతవాఁడె
యెఱుఁగమే యెంతమదమెక్కె నెంతగర్వ
శాలి వీనికిఁ జికిత్స సలుపకున్న
గన్నుగానఁడుగా మోటదున్నపోతు. 5-55

నీవు దూతవుగావున నిన్నుఁజంపఁ
బాడిగాదని మానితి పదువదుమిక
గడ్డిదిను బట్టె కొడుక నీ గర్వమడఁతు
పరువసంబేల కొమ్ములదురదఁదీర్తు. 5-56

చెప్పదలచినది రెండు మాటలలో జెప్పునట్లు రెండు తేటగీతులలో తేట తెల్లముగ తెనుగుదన ముట్టిపడునట్లు మూలవిధేయముగ ననువదించిరి. తిరుపతి కవులు రెండుత్పలమాలలో జెప్పినను పై యనువాదము వలె ప్రసన్నత తెలుగుతనము చేకూరలేదు.

వానికి నిట్లుపల్కు బలువద్రుష నోరి మదాంధ యిట్లు క
న్గానక నీవిభుండనిపెఁగా నిను? మంచిది వానిరోగ మె
ట్లేని యడంతు నా యెదుట నిట్లనఁజెల్లునె నీకు దూతయౌ
వానినిఁజంపరామి విడువంబడి నీపతికిట్లు సెప్పుమా. 5-55

ఓ మహిషీకుమార నను యుద్ధమునందు జయించు నిచ్చ నీ
కీమెయిఁబుట్టెనే? తృణము లెంతయు మెక్కుట చేత మిక్కుటం
బై మదమెక్కెనే? జడుఁడవంచు నెఱుంగుదు నిన్ను నీకును
ద్దామత విచ్చు శృంగములుఁద్రవ్వి తగంబొనరింతుఁజాపమున్. 5-56

పాపయారాధ్యులవారు మూలమునతిక్రమింపకయే మూడుపద్యములలో తెనిగించిరి. తిరుపతి వారి వలెనే 'శృంగములు వంచి చాపంబు సేయువాడ, దీర్ఘశృంగ బలంబున దెలియఁడేమొ' యనిరి (5-42). శ్రీరాములుగా రనినిట్లు 'కొమ్ముల దురదదీర్తు ననుటయే' లెస్సగా నున్నది. 'కన్నుగానదన్న' మాట కూడా ఆ భావమునకు మరింత స్ఫూర్తిని కలుగ జేసినది.

దృష్ట్వాతత్రస్థితాం దేవిం దేవానాం హితకారిణిమ్
ఊచతుస్తౌ మహావీరౌతదాసమన్వితం వచః. 5-26-12

శత్రుస్సురాణాం పరమశ్శుమ్భస్సమర దుర్జయః
తస్మాత్త్వాం ప్రేరయన్త్యత్ర దేవాదైత్యేశ పీడితాః. 5-26-19

తస్మాత్తద్వచనైః స్నిగ్ధైర్వృఛ్చితాసి శుచిస్మితే
దుఃఖాయతవదేవానాం శిక్షాన్స్వర్ధస్యసాధితాః. 5-26-14

దీనికి శ్రీరాములు గారి యనువాదము -

ఆడుదేనియు నొక మగవాఁడయేని
లేడటే బుద్ధిసెప్పంగ లేడికనుల

తోడి పూబోడి వీవేడ నాఁడఁబాడ
మద్దెలనుగొట్టి నొక తవు ముద్దులాడి. 5-595

ఉరుకు మురుకు మను సతి యుండుగాని
తోడురుకు సవతి గలదె యేడనేని
నీవినాశంబునకు జూచు నిర్జరులను
హితులనుచు నమ్మితీవు చేటెఱుఁగవబల. 5-596

యథామూలముగనే యనువదించుచు నాప్రక్కనే యొక చిన్న లోకోక్తి జేర్చి యాభావమునకు మెఱుగు పెట్టును.

తిరుపతి కవుల యనువాదము -

తగుఁదగదని మతి చెప్పఁగ
దగుపురుషుండేని యొక్క యంగన యేనిన్
మగువరొ? లేరొకొ నిను దే
వ గణము పురికొల్పు దైవవశ మట్లుండెన్. 5-635

వృధా కావలులై సురల్ తనకు గర్వనివర్తకుఁడైన శంభుపై
నీవెడఁగుందనంబు గని నింబురికొల్పిరి యీసు పెంపునన్. 5-637

నీవేమియైననున్ భర
మేవారికి స్వార్థపరుల కెందునుఁబరకా
ర్యావేక్షణముండునె? .......... 5-633

పాపయారాధ్యులవారు యథామూలము నాశ్రయించుచు నొక వచనమున నుడివిరి. శ్రీరాములుగారు మూలవిధేయముగ ననువదించుచు తన సహజమైన శైలిలో హాస్యము స్ఫురింపజేయుచు నెడనెడ నొక యలంకారమును గూర్చి మూలమునకు మరింత రాణింపు చేకూర్తురు. మూలములో (5-26-38 నుండి 45 వరకు) గల కాళిక వర్ణనను మూలవిధేయముగ ననువదించిరి.

'కత్తి చేబూని నునుబుచ్చకాయలట్ల యసురసైన్యములను దునుమాడె యప్పడాలు వడియాలు గాగ దంతాలక్రింద గరగర నమలివైచె' యన్న యుపమానముల జోడించి తెనుగుదనమును జేకూర్చిరి. పాపయారాధ్యుల వారి

యుద్ధవర్ణన సుదీర్ఘముగ నున్నది. తిరుపతి కవుల యనువాదము మూలము నాశ్రయించినది. ఈ యుద్ధవర్ణన లన్నియు నీయుపాఖ్యానమున నిట్లే సాగినవి.

సుకన్యా వృత్తాంతమున చ్యవనుడు తనసేవకు 'దేహిమె పరిచర్యార్థం కన్యాం కమలలోచనాం' (7-3-19) యని వచించినపుడు శర్యాతి మనస్థితిని తెలుగు పలుకుబడులతో రమ్యముగ యథామూలముగ తెనిగించిరి (7-59-60). 'విచి న్త్యమనసా భూపకన్యా దానం సమాచర' (7-3-22) యన్నదానిని యనువాదము 'కాళ్ళు కడిగి కన్యధారపోయుము వేగమే ధారుణీంద్ర' (7-53). తిరుపతి వారి యనువాదమున నీ సొగసు గానరాదు. 'నీ పుత్రి నొసంగి పెండ్లి సేయుము మునినగు నాకిడఁగ శంక మొనయుట తగవే' (7-50) యని యామూలమునకు మక్కికిమక్కిగా నున్నది. ఉపేక్ష యొనర్పక నీ బాల నొసంగు' మని పాపయారాధ్యుల వారు అనువదించిరి. 'పతిం తప్తోదకేనాశుస్నాపయిత్వా' (7-4-31) అన్న దానికి 'వేడినీళ్ళను గాచి బిందెదొాళుపు'(7-84) యనుటలో నున్న తెనుగుదనము తిరుపతి కవులు 'ఉష్ణోదకస్నాన మొనరింపగా జేసి' (7-72) యనుటలో లేదు. అట్లే బ్రాహ్మీముహూర్తే' (7-4-17) యన్నదానికి యనువాదకు లందరు బ్రాహ్మీముహూర్త మనియే యనువదింప,దాసువారు 'తొలి కొడి గూయంగ' (7-84) యని తెనిగించుట సమంజసము. 'ఇట్టునట్టు మనసు గొట్టుకొనుట, చేయాడుట,గొంతుకోయుట మొదలైన తెలుగు పదములాసందర్భమునకు తగియుండి యనువాదమునకు బుష్టి గూర్చుచున్నవి.

హరిశ్చంద్రోపాఖ్యానమున సత్యవ్రతునికి పట్టము గట్టుచు తండ్రి బోధించిన రాజనీతి (7-246,47) యథామూలముగ విశదీకరింపబడినది. అట్లే కాలకౌశికుని వర్ణన, భార్యాపుత్రుల విక్రయము యథామూలముగ ననువదింపబడినది.

తల్లిగొడుకు నొక్క దంటగాఁ దనయంగ
వస్త్రమునను హస్త వనజయుగము
నంటబట్టి ముసలి యవనిసురుడు పదుం
దనుచు గెంటి నింటి కతిరయమున. 7-479

అని శ్రీరాములు గారిచ్చట కరుణరసపరిపోషణకై మాతృకానుసారముగ తెనిగింప తిరుపతి కవులు 'అమ్మహీనాథు నొద్ద తద్ధనంబు నిచ్చి మీరిరువురును

వెంబడి వచ్చునది యని చెప్పి యవ్విప్రుడు బయలు వెడలె' (7-579) నని యౌచిత్య పరిపోషణకై యించుక మార్పు ఘటించిరి. పాపయారాధ్యుల వారు 'విశ్వామిత్రుండు పెట్టు పెనుబాధలు సంహించె గాని హరిశ్చంద్రుండసత్యంబు వచింపడయ్యెం గావున సూర్యవంశోత్పన్నులగు మహారాజుల ప్రభావం బిట్టిది' అని యవ్వలికథ నుడిపి కథ తేల్చి వేసిరి. సంస్కృతములో నున్న సుమారు నలువది యధ్యాయములు త్యజించి ముగించిరి. ఈ హరిశ్చంద్రోపాఖ్యానమే గాక తుట్టతుదిని శతాక్షీ మహిమాదికమును గూడ 'అనుక్తమన్యతోగ్రాహ్యం' అను సూక్తి ననుసరించి చదువరులు ప్రవర్తింతురని ఆరాధ్యులవారూహించిరని తోచెడిదియని పరిష్కర్త యగు వెంకటశాస్త్రిగారు వచించిరి.[6]

'హరిశ్చంద్రుడు భర్తనగు నాకెడమై యేతీరున మను? వృక్షాపేతంబై నీడయెలయు టెందుంగలదే' యని దుఃఖించును.

ఇచట తిరుపతి కవులు అలంకారంబును పరిపోషించి మాతృకానుసారముగ నీ యర్థాంతరన్యాసాలంకారమునట్లే గ్రహింప శ్రీరాములుగారు దీనిని వారి యనువాదమున విడిచిరి. 'నిన్నెడబాసి యెటుబోవ గాల్నాడు' (7-483) నని తెలుగునుడికారపు సొంపుతో నా వెలితిని నింపిరి. ఆ సందర్భముననే కౌశికాగమన వర్ణన - 'మునిశ్రేష్ఠస్త్వా జగామ మహాతపాః సశిష్యఃకౌశికేన్ద్రో' (7-22-41,42). ఈ శ్లోకములకు శ్రీరాములుగారి యనువాదము 'బుక్కులు సెప్పుచు శిష్యులు వెనువెంట రాగా విశ్వామిత్రుడు వచ్చె' (7-484). ఆకాలమునాటి గురుశిష్యులను మన మనోనేత్రము లెదుట సాక్షాత్కరింపజేసిరి. 'తెనుగునాడు' లోని పద్యము దీనికి సదృశమైనది.

విడవకురా'ఉతోతఇషవేనమ'రా అది దుడ్డురా ముణాః
కొడకా? యటన్నమాట విని కొంకి 'ఉతోత ఇసే;నమం'చు శి
ష్యుడు దన వెంటరా వడఁకుచుంఁ గుడిచే నొక యక్షమాల చొ
ప్పడ నొకచేతదండమిడి బాటను వైదికవృద్ధుఁడేగెడిన్. తె.నా; ప.7

తిరుపతి కవులు 'నా సత్యసంధుని కడకు విశ్వామిత్రుండు సశిష్యుడై వచ్చి' (7-592) అని తేల్చివేసిరి.

వైరిభయములేని వైపుల నుందురు
బుద్ధిమంతులయిన పురుషు లెపుడు
క్షీరసాగరమున జేరెను విష్ణుండు
కొండమీఁదఁగూరుచుండె శివుడు. 4-556

యథామూలముగ రచించినను కడు మనోజ్ఞముగనున్నదనుటకీ యుపమానము చాలును.

**మూలప్రపంచితము :** సంభాషణలలో నున్నంత చమత్కారము,రమ్యత కేవలము స్తుతులలో నుండదు. పురాణము నందు విధిగ దైవస్తుతి యుండును. సమర్థుడైన కవి ఆ ఘట్టములను పేలవముగ రచింపక ఛందో వైదగ్ధ్యాది వివిధ ప్రక్రియలతో చేవగూర్చి రమ్యత నాపాదించును. బ్రహ్మకృత విష్ణుయోగనిద్రాస్తుతిని ముక్తపదగ్రస్తయుత సీసమునను నిరోష్ఠ్యచంపకము నను మూలభావమును ప్రపంచించి వ్రాసిరి.

దీననాథ హరేవిష్ణో వామనోత్తిష్ఠమాధవ
భక్తార్తి హృద్ధృషీకేశ సర్వావ్యాసజగత్పతే. 1-7-9

దుష్టారినాశనైకాగ్రచిత్త చక్రగదాధర
సర్వజ్ఞ సర్వలోకేశ సర్వశక్తి సమన్విత
ఉత్తిష్ఠోత్తిష్ట దేవేశ దుఃఖనాశన పాహిమామ్. 1-7-10

భణనీయ గుణపాలి పాలిత భూచక్ర
చక్రగదాభుజాచారుదండ
దండసాధనతాత తాతప్రియకుమార
మారసుందర గరుత్మత్తురంగ
రంగదర్ణవరాజ రాజన్మహాలయ
లయకాలకీలి కీలాప్రతిప
తాపససంతాన తానవార్త విఫాల
ఫాలబాలసుధాగ భస్తి బింబ.

బింబతులితాధరా ధరాలంబమిత్ర
మిత్రమండల గతగాత్ర గాత్రధీన
ధీనమచ్ఛిసుఖనిదాన దానవారి
వారిజాసనకారణ కారణాత్మ. 1-224

తిరుపతి వేంకటకవులు 'తండ్రి మేలుకొనుమన్న' అంత్యానుప్రాసతో నొక సీసపద్యము మూలవిధేయముగ వ్రాసిరి(1-29). నోరి నరసింహశాస్త్రిగారి యనువాదమున మూలవిధేయముగ సాగినది. పరమశివాద్వైతులైన శ్రీ ములుగు పాపయారాధ్యుల వారు హరిస్తోత్రమునే గాక యోగనిద్రాస్తుతిని గూడ మిక్కిలి విస్తరించి వ్రాసిరి. 'హరిన్ నిద్దుర మేలుకొల్పు జగదంబా శ్రీజగజ్జనని' యన్న మకుటముతో నిరువదియొక్క మత్తేభముల రచించి దేవియెడల వారికిగల భక్తి ప్రపత్తుల ప్రదర్శించిరి. శ్రీరాములు గారు శ్లోకమునేగాక యొక్కొక్కపరి యొక పదమునే గైకొని (కమ్మచ్చు దీసినట్లు) మేలిమిబంగారుతీగను సాచినట్లు ఒక జాతీయముతో నాభావమును విస్తరింపచేయుదురు. 'హరిష్యామి మదం' (1-9-13) అన్నదానిని 'తీండ్రిలనేల గండలను దీసెద గెద్దలనోట వేసెదన్' (1-278).

తిరుపతి కవులును నిదేవిధముగ తెనిగించిరి. 'క్రిందును మీదునుం గనుక ప్రేలెదరింత మదంబు హెచ్చెనే?' (1-163). పాపయారాధ్యులవారు దీనికి 'తప్పదు మీకు నావలనఁ దథ్యము మరణము' (1-381). నోరి నరసింహశాస్త్రి గారు దీనికి 'మీమదమిప్పుడే యడఁతు' (1-363) ననిరి. పై యనువాదమున కున్న స్ఫూర్తి యిందులేదు. యుద్ధవర్ణనమును నోరి నరసింహశాస్త్రి గారును పాపయారాధ్యుల వారును సమూలకములైన యుపమానముల జేర్చుచు రమ్యముగ వర్ణించిరి. పాపయారాధ్యులవారు-

కరికరి గిరిగిరి గవిసిన
కరణిని యుద్ధంబు హరియుగ్రవ్యాధుండున్
పరిపరివిధముల బోరగ
గరమలయుచు మధుఁడు వెనుక కాల్వేయంగన్. 1-382

నోరివారు –

కారెనుబోతుల ద్వంద్వము
మీటిరుషన్ వృషభరాజుమీద గవియుచున్
బేరెములు వాఱు భంగిని
బోరిరి మధుకైటభులును బురుషోత్తుముతో. 1–347

పాపయారాధ్యులవారును, నరసింహశాస్త్రి గారును పై యిరువురి కంటె 'మధుకైటభుల యుద్ధమును' మిక్కిలిగ విస్తరించి వ్రాసిరి.

**బుధోత్పత్తి :** తార నిమ్మని గురువు బృహస్పతి చంద్రుని వాకిట నిలబడి యడిగినను నాతని ప్రార్థన మన్నింపకపోవుటచే నిట్లు దూషించెను. 'సురాధమా! దేహిమె కామినిం శీఘ్రం నోచేచ్ఛాపం దదామ్యహం, కరోమి భస్మసాన్నూనం నదదాసి ప్రియాం మమ' (1–11–28). దాసువారు దీనిని రెండు కందములలో విపులీకరించి వ్రాసిరి. –

నాపాలి ముద్దులాడిని
లేపొమ్మని నాకుఁబంప లేవేనియు నో
పాపిష్ఠ నీకు నిప్పుడే
శాపంబిడఁదలఁచినాడ జటులోగ్రుఁడనై. 1–375

లేరా వైళంబె దురా
చారా నాదారఁజెనకి చలమున నాతోఁ
బోరా పోరా వార్ధికు
మారా నిను దుమ్ముఁజేసి మట్టాడెదరా. 1–376

వీరరసప్రధానమైన మధుకైటభ యుద్ధానంతరమీ యుపాఖ్యానమును శృంగారరసపరిపోషకముగ దీర్చిరి. సంవాదాత్మకమైన శైలిలో నీయుపాఖ్యానమును రచించిరి. ఇట నీ దీర్ఘాక్షరములు,గురువు యొక్క దీర్ఘక్రోధమును సూచించుచు సాభిప్రాయముగ రచించబడినది.

తిరుపతి కవులును పాపయారాధ్యులవారును మూలవిధేయముగ రచించిరి. నోరి వారి యనువాదమున శృంగారరసశోభితమైన యుపాఖ్యానమే లేదు.

మూలమున ధ్రువసింధూపాఖ్యానము 14 వ అధ్యాయము నుండి 25 వ అధ్యాయము వరకు గలిగి 675 శ్లోకములు పరిమితి గలిగి యున్నది. దీనిని శ్రీరాములుగారు 370 పద్యములలోను, పాపయారాధ్యులవారు 460 పద్యముల లోను, నోరివారు 469 పద్యములలోను విపులీకరించి వ్రాసిరి.

సంస్కృత మందలి శ్లోకముల పరిమితికిని తెలుగు నందలి గద్య పద్యముల పరిమితికి చాల వ్యత్యాసము గలదు. సీసపద్యము నందు గాని, దీర్ఘములగు గద్యము లందు గాని మూడు నాలుగు శ్లోకముల భావ మిముడుటకు నవకాశము చాలినంతగ గలదు. కావున పద్యముల సంఖ్యను ప్రమాణమున గైకొనరాదు.

యక్షగాన విశారదులైన శ్రీరాములు గారి చేతిలో బడిన శశికళా విరహవర్ణన ఎనిమిది పద్యముల వరకు ప్రపంచింపబడినది. ఇందు ఉత్పలమాలలు, ఆటవెలదులే గాక తరువోజ గూడ జేరినది.

చన్దనం దేహలగ్నం విషవద్భాతి భామినీ
స్రగియం సర్పవచ్చైవ చన్ద్రసాదాశ్చ వహ్నివత్. 3-18-6

ఈ శ్లోకామాధారముగ నీ విరహవర్ణన చేర్చబడినది. కామబాణ ప్రపీడితయును,భీతహరిణేక్షణయును అయిన శశికళ శార్దూలము గాంచినట్లు తల్లడిల్లినదేమో యన్నట్లీ వర్ణన శార్దూలమున సాభిప్రాయముగ రచింపబడినది. శార్దూలమును గాంచి హరిణముల భీతిచెందుట సహజము శశికళకు 'భీతిహరిణేక్షణ' యన్న విశేషణ మిట్లు సాభిప్రాయముగ చెప్పబడినది.

అయ్యో పూవులదండ యంచు నిడితే యార్తిన్ మహాసర్పమే
యయ్యో గంధమటంచలందితివి కాదమ్మా విషం బిద్దియే
నుయ్యో నాకిఁక మేడలేల కలవాణుల్వీణలేలా లస
చ్ఛయ్యా సౌఖ్యములేల నన్ విడువుమో చానా సరోజాననా. 3-431

దీనిని మిగిలిన యనువాదకులు సీసపద్యమున వివరించిరి.

**మహిషాసుర వధ :** మహిషుని దూత చెప్పిన మాటలను విని మహిషుడు చేసిన చెయిదములను మూలమున నైదు శ్లోకములలో గలదానిని ఆరు పద్యములలో మనోహరముగ తెలుగు పలుకుబడులతో సంవాదశైలిలో

నాయాపాత్రల మనోభావములును నాయా సన్నివేశములను రసవంతముగ దీర్చిరి.

ఆబ్బబబ్బా యేమన నీ
యబ్బకుఁజెప్పుకొనుమంచు నతఁడు కలిశముం
గొల్బునఁజేకొని లేచియు
నిబ్బరముగ నేల నొక్కొ నిలచె నిలేశా. 5–62

కంపిల్లితి నేనచ్చట
చెంపల చెంపలనె యుండి చెప్పితిపోరా
చెంపలు వాయించెద నీ
కొంపకు వేవేగ మనుచుఁ గొట్టం గదసెన్. 5–63

మిగిలిన యనువాదకులు మూలవిధేయముగ తెనిగించిరి.

'దుర్బలోపి' (5–4–8) ఈ పద్యమునకు–

పొక్కుకురుపగుఁ గురుపుదాఁబుండు జేయు
బుండు చీమగు వాతంబు బుట్టు చేటు
కారణంబగుఁగావునఁగడఁగి పొక్కు
జాడనే వేరు వెల్లంకి జూడవలయు. 5–83

'రమ్య' (5–10–54) అన్న పద్యమునకు 'కనుగొనగా కోటికనుల గల దానవలెను సుమీ' యని చెప్పుటలో తెలుగుదన ముట్టిపడుచున్నది.

అసురాన్మహిషోదృష్ట్వా విషణ్ణ మనస్తదా
త్యక్త్వా తన్మహిషం రూపం బభూవ మృగరాడసౌ. 5–7–1

ఈ సింహస్వరూపమును శ్రీరాములు గారు ఒక సీసమున సుదీర్ఘముగ ప్రౌఢముగ పరిఢవిల్లజేసిరి. ఆ యెత్తుగడ యా మలుపు యాముగింపు శ్రీనాథుని సీసమును తలపించుచున్నది.

బ్రహ్మాండభాండకర్పరము బీటికలెత్త
    దారుణోదగ్రనాదంబు సేసి

విలయానిలాభీల విహృతినద్రులబెల్లఁ
గిల సటారింఛోళి దుళిపి విసిరి
చండభానుప్రభామండలాచ్ఛాదకా
త్యుచ్చైర్గతంబుగాఁ దోకయెత్తి
భయదమంధాన సర్వంసహాధర గుహా
ఘోరంబుగాఁ బెద్దనోరుఁదెఱచి.

బొబ్బరిల్లుచు గబ్బులాగబ్బుకొనగ
మేనుసారించి కోరలమీటి కొనుచు
నొక్కదూకున సింగంపు రక్కసుండు
సీదుచును సురలసేనల మీదికుఱికె. 5-154

తిరుపతి కవులు 'అమ్మహిషు డంత సింహరూపమ్ముదాల్చి గర్జించిమించి' (5-145) యని సంక్షేపించిరి. పాపయారాధ్యులవారు 'పెన్గజవైరి ప్రబలా కృతిన్ గొని సటాఘాటంబు లల్లార్చి దేవజయోల్లాసిత సింహనాదము లొనర్చన్ బారెదేవాళుల్'(5-135) అని మాత్రము చెప్పి తరువాత యా సింహ విజృంభణము నొక వచనములో విస్తృతి జేసిరి. శ్రీరాములు గారిచ్చట నిట్లు ప్రపంచించుట యుచితముగనే యున్నది. ఇంతటి భయంకరమూర్తి కాకున్న హరిహరాదులు సహిత మెట్లు పరాభూతులగుదురు?

తథోచ్చైశ్రవసంభానోః కామధేనుం పయస్వినీం
స్వసైన్య సంవృతస్తూర్ణం స్వర్గం గన్తు మనోదధే. 5-7-20

తరసా దేవసదనం గత్వా స మహిషాసురః. 5-7-19

ఈ భావమును శ్రీరాములుగారొక సీసపద్యమున మనోహరముగ ప్రపంచించి వ్రాసిరి.

నూరేండ్లబవరాన నోటిప్రాచి దోలంగఁ
గామధేనువు పాలు గాచి త్రాగె. 5-162

ఏవంవిధముగ పాపయారాధ్యులవారును ఒక సీసమున నాభావమునే విస్తరింపజేసిరి. శ్రీరాములుగారిది ప్రసన్నమై యొప్పుచున్నది. పై సింహవర్ణన

సీసము ఎంత ప్రౌఢముగ నున్నదో యిది యంత ప్రసన్నముగ నున్నది. తిరుపతి వారు మూలము నాశ్రయించిరి. వైకుంఠమున కేగుట కాయత్తమగుచున్న దేవతలకు శుభశకునములు గన్పట్టు పట్టున శ్రీరాములుగారా శకునములను యక్షగానసరణిం జేసి యాప్రక్కనే జ్యోతిశ్శాస్త్రపాండిత్యప్రకర్షను ప్రదర్శించిరి.

కలకల నవ్వుచుఁ గన్యక యెదురాయె
బడమటిదిక్కున బల్లిపల్కెఁ
గుడినుండి యెడమకుఁ గొంక నక్క చరించె
వీలుగా దీర్చెను బాలపిట్ట
వెనవెన్కఁజల్లగా విసరెఁగమ్మని గాలి
సరసంబుగాఁ గూసె గరుడపక్షి
తొడిబడనొక రెండు తుమ్ములు దుమ్మిరి
పూర్ణకుంభద్వయము గనుపట్టెఁ.

గోవెలయుఁగూసె జయగంటఁగొట్టి రాత్మ
లందును గలంకములులేక యలరునట్లు
దోచెఁ దూర్పునఁగ్రమ్మెను ధూళియహహ
శకుఉనములు మంచివాయె నాసమయమందు. 5-164

గురుఁడు పంచాంగమును జూచి సురుల కనియె
శుక్రుఁడేకాదశంబున సూర్యకుజులు
మూటనారింట శనియును మొనయువారు
లగ్నము శుభంబు పంచకరహితమనుచు. 5-175

వైకుంఠపురవర్ణన బ్రబంధములందలి పులివర్ణనకు దీటుగా నున్నది. ఈ వర్ణనను ఆరు సీసములతో నొక చంపకమును జేర్చి హృద్యముగ జెప్పరి. మూలమున శివుడు బ్రహ్మతో మహిషుడు స్త్రీచేత గాని చంపబడదని,మన యాడువారందులకు సమర్థులు కారని యిట్లు చెప్పును -

కాసమర్థాపరా నారీ తంహస్తుం మదరర్పితం
నమే భార్యా నతే భార్యా సంగ్రామం గన్తుమర్హతి. 5-7-51

గత్వైవతే మహాభాగే యుముధాతే కథం పునః
ఇన్ద్రాణీచ మహాభాగ న యుద్ధకుశలాస్తిహి. 5-7-52

అంతట బ్రహ్మ మహేశులు కలసి విష్ణువు వద్దకు జని యచట మరల నిట్లు చెప్పుదురు.

ఉమామావా శచీవిద్యా కాసమర్థాస్య ఘాతనే
మహిషస్యాతి దుష్టస్య వరదాన బలాదపి. 5-8-25

తిరుపతికవులు, పాపయారాధ్యుల వారును యథామూలముగ నను వదించిరి. శ్రీరాములుగారీ పునరుక్తిని విడచి బ్రహ్మ హంసారూఢుడై దేవతల దోడ్కొకని శంకరుని యొద్దకుం జని యతని బురస్కరించుకొని నారాయణుని యొద్దకు బోయి యట నీ విషయమును నొక సీసములో చమత్కారముగ చెప్పును (5-183). ఆప్రక్కనే -

రోసాలు పొడుగ కొంపల
వాసాలెగిరింత్రు రిత్త వదరులతోనన్
మీసాలు ద్రువ్వఁదురు మగ
వేసాలుండంగ నగరె వెలఁదుల నంపన్. 5-184

ఆ భావమున కొక లోకోక్తిని జేర్చి యచ్చట సంభాషణను రక్తి గట్టించిరి. యుద్ధవర్ణనల విసుగుజనించునప్పు డిట్టి రసవత్తరములైన సంభాషణలతో మూల భావమును గొంత విస్తరించి యా సన్నివేశమున కొక నూత్నశోభ గూర్చుదురు.

దేవీ తామ్రదూతల సంవాదము సంజయ రాయబారమును స్ఫురింప జేయును.

పుష్పైరపి నయోద్ధన్యం కింపునర్నిశితైశ్శరైః
భవాదృశీనాం దేహేమ ధునోతి మాలతీదళమ్. 5-14-16

ధిగ్జన్మ మానుషేలోకే క్షేత్రధర్మానుజీవినాం
లాలితోయం ప్రియోదేహహః కృన్తనీయశ్శితైశ్శరై. 5-14-17

ఈ రెండు శ్లోకముల నొక సీసములో వివరించిరి. మాలతీదళము అన్నది జాజిపూదండగ పరివర్తితమైనది. మాలతీదళముకన్నను నామె శరీరము సుకుమారమైనదని మూలమున చెప్పబడుటచె నాంధ్రీకరణమున జాజిపూదండతో బోల్చుట ఔచిత్యశోభితము. మాలతి కంటె జాజి సుకుమారసుమము గదా! అంతేగాదు కవిగారికి జాజిపూలపై గల ప్రీతి కూడ తెలియజేయుచున్నది.

విలసితంబైన భ్రూవిక్షేపమేకాని
 విలుబట్టి వంతురే వెలదులెందు
కమనీయ వరకటాక్షప్రేక్షణమె కాని
 యమ్ము సంధింతురే యబ్జముఖులు
శృంగార మృదుహావ చిహ్నమ్ములే కాని
 కన్నెఱ్ఱసేతురే కాంతిమతులు
అందమ్ముగా ఱెప్పలల్లార్తురే కాని
 బొమముడి వైతురే పూవుబోండ్లు

కామశాస్త్రంబులేకాని కదనశాస్త్ర
విహితకర్మంబులే నీలవేణులకును
జాజిపూదండవంటి నీ చక్కనైన
యొడలు సితశరముల నొంపగడగిఁ తకట! 5-349

పై సీసపద్యమున ఒక్కొక్క పాదమున రెండువాక్యములు గలవు. అవి 'కాని' అన్న పదముతో కలియుచున్నవి. మొదటి వాక్యములో పూవుబోండ్లాచరింప వలసినది చెప్పిరి. రెండవ వాక్యములో చేయుచున్న విషయము చెప్పుచుండిరి. ఇట్లే నాలుగుపాదములు తరువాత తేటగీతిలో రెండు పాదములు నడచినవి. చివరి రెండు పాదములు ముగింపు వాక్యములుగ నున్నవి. పై వాని తాత్పర్య మంతయు చివరి రెండు పాదములలో ఉక్తమైనది. ఇది యొక రచనావిధానము. విశిష్టమైన శిల్పరీతి. అట్లే -

మానుషం దేహమాస్థాయ సంగ్రామే గన్తుముద్యతః. 5-16-5

శృంగిణం మహిషం నూనం విమనాసా భవిష్యతి
నారీణాంచ ప్రియంరూపం తథాచాతుర్య మిత్యపి. 5-16-6

అన్నదానిని సీసపద్యమున విపులీకరించి వారికి గల హాస్యప్రవృత్తిని గూడ జోడించి పాఠకుల యుత్సాహము నినుమడింపజేసి వీరరసోన్ముఖులుగ జేయుచున్నారు.

ఈ సీసమందును పైదానవలె ప్రతిపాదన పూర్వార్ధమున అప్పుడున్న రూపము ఉత్తరార్ధమున ఆస్థానమున చేసిన మార్పు చెప్పుచు మధ్యమధ్య హాస్యరసపు జిలుగుపోగులు జేర్చి పాదాంతముల క్త్వార్థకము జేర్చి చివరి గీత పద్యపాదంబున పోతురూపు కడబెట్టి వన్నెకాడయ్యెనని యా భావవిచిత్రమునకు వన్నె బెట్టి జెప్పుట హృద్యము.

బెడగైన వంగవాల్మిడుద కొమ్ములు మాని
రహిమించు గలికితురాయి పెట్టి
కడుజల్లికుంచియు కలమతోకను మాని
డాబైన పట్టుదట్టి బిగించి
దంపముంపెసలారు రొంపిత్రోలునుమాని
సరిగంచు గింటెంబు జారకట్టి
యడ్డసాపున నిడ్డ యడ్డకాళుమాని
హోయలుగా రెండుకాళ్ళూని నిలిచి.

చిప్పపెంకులసరి గొరిసెలను మాని
పంచనఖమైన పాదయుగ్మంబు దాల్చి
పోతరించిన పోతురూపు కడ బెట్టి
వన్నెకాడయ్యె మహిషదేవద్విషండు. 5-393

తిరుపతి కవులు క్లుప్తముగ ముగించిరి. శ్రీ పాపయారాధ్యుల వారు మూలవిధేయముగ రచించిరి. మిగిలిన యనువాదకులు దానికి ప్రాధాన్యము నీయలేదు. ఇదియును వీరి వర్ణనాశిల్పవైఖరిని వ్యక్తము చేయుచున్నది.

షష్ఠస్కంధమున నహుషుడు ఇంద్రపదవిని పొంది శచిని రాణిగ జేయుడని శాసింప వారు 'వారముఖ్యాశ్చశతశోవర్తనేత్ర శచీసమాః' (6-8-7) యని దేవ వారకాంతలను పొందుడని దేవతలు నచ్చచెప్ప ప్రయత్నింతురు. ఆ సందర్భమున వారకాంతల శృంగారచేష్టలను దేవలోకమున గల యొక పడకమంచమును

మిక్కిలిగ ప్రపంచించి వ్రాసిరి. ముఖ్యముగ అందు వర్ణించిన పందిరిమంచము మనోజ్ఞముగ నున్నది. (6–121). ఈ సన్నివేశమును సాభిప్రాయముగ ఉత్పలములు, చంపకములతోనే చెప్పుట విశేషము. దాని తరువాత పద్యమున బ్రహ్మర్షుల నోటి నుండి రాదగినమాటలా, ఇది యుచితమా యను సందేహము పొడమును. కాని యిది యధికార దర్పమున దురాచారుడై ధర్మభ్రష్టుడైన నహుషునకు జేయుబోధ. అట్టి వాని కిట్లు చెప్పినగాని తలకెక్కదు. రుచించదు. మిగిలిన నీ యతివేలమైన శృంగారవర్ణన కథకు వన్నెదెచ్చునే గాని నిగ్గు తగ్గనీయదు. మిగిలిన యనువాదములలో నీ శృంగార ప్రసంగము లేదు.

హైహయులు భార్గవుల ధనము నర్థింప ధనలోభంబుచే 'నాస్తినాస్తి' యను వచనంబులాడిన భార్గవులను హైహయులు బాధించిన విషయమును వీరు మూలాపేక్ష యొక్కింత యోసరిలగజేసి వారికి సహజమైన హాస్యప్రవృత్తిని జోడించి మహోత్కృష్టమైన రచనావిన్యాసముతో భావవివృతిని గావించిరి. ఆనాటి బ్రాహ్మణ సమాజమును మన కనుల యెదుట సాక్షాత్కరింపజేసిరి. గ్రామీణ జీవితమును ప్రతిబింబింపజేసిన ప్రజాకవి శ్రీరామకవి.

మనసు నొవ్వకుండ మంచిమాటలు మెచ్చ
నాడి చంకబిడ్డలూడి పడఁగ
పతుల యెరుకలేక యతివల బతులను
నతివ యెరుకలేక నడిగికొనరె. 6–313

పౌరోహిత్యము మాదని
వేరొక్కరిఁజేరనీః వివిధగతుల సం
భారంబులనుచు నర్థము
చూరగొనరె మీరుయిద్ధి చోద్యంబగునే. 6– 314

ఈ పద్యమును కవిగారు స్వానుభవముతో వ్రాసియుందురు. 1890లో గుంటూరు భానుమూర్తి గారి వెలి విషయకముగ స్మార్తుల యిండ్ల నిత్యనైమిత్తికములకు వైదికులు రానిరాకరించిన విషయము ప్రస్తావించినట్లు గోచరించును.

సప్తమస్కంధమున గల సుకన్యావృత్తాంతము మూలమున ఆరు అధ్యాయములలో గలదు. ఈ చరిత్రమును శ్రీరాములుగారు 161 పద్యములలోను,తిరుపతి

వెంకటకవులు 159 పద్యములలోను, పాపయారాధ్యుల వారు 155 పద్యములలోను ప్రపంచించి వ్రాసిరి.

సుకన్య పూలుచిదుముచు చిదుముచు బోయి పోయి పుట్టను ఆ నడుమ రెండు బొరియలు, ఆ బొరియలో మెఱుగులను జూచినట్లు శ్రీరాములుగారు, తిరుపతి కవులును రచించిరి. ఆమె ఆభరణముల ప్రస్తావన చేయలేదు.

మూలమున నిట్లు కలదు -

సర్వాభరణసంసక్తా రణచ్చరణ నూపురా
చంక్రమమాణా వాల్మీకం చ వనస్యసమాసదత్. 7-2-48

పాపయారాధ్యుల వారు దీనిని మిక్కిలిగ ప్రపంచించిరి.

మహనీయ మంజీర మంజులా రసములు
ఘల్లుఘల్లునుచు నంభ్రమముల జెలంగ
రత్నకీలిత భవ్యనూత్నాభరణ పాళి
జిలిబిలి బల్కుల దేనె గూడి
దశదిక్కులను దళత్తళయనంగ దశన
కాంతిచ్ఛటలును నిగన్నిగ యనంగ
రవల యొడ్డాణంబు రమణీయ ఘంటికా
గణవికాసము ఝణం ఝణ యనంగ. 7-42

అని యొక సీసపద్యమున నా ఘలఘలారావముల వివరించిరి. ఈ వర్ణన కథకు భావస్ఫూర్తిని మరింత పుష్టిని జేకూర్చుచున్నది. వనమందలి కోకిలారవములు,కేకినీస్వనములు,చ్యవనునికి సుపరిచితములే. ఇవి యాతని తపమునకు భంగము కలుగజేయవు. ఈ క్రొత్తధ్వనులు చెవిసోకగనే సమాధి భంగమయ్యెను. ఎన్నడులేని యీ యందెలరవళికి ఆ తాపసి యయాచితముగా కనులు దెరుచుట, సుకన్య యటకు వచ్చుట, జ్యోతిరింగణము కైవడి కననగుట యామె కంటకమును బూని బొరియ పగులగొట్ట నందు ముని కనులు పగులుట యివన్నియును జరిగినవి. వనవాసక్లేశమునక్షీణంచిన చ్యవనుడు క్షీణస్వరమున

వారికి దూరమేగుడని మందలించెను. చెలులతో క్రీడించుచు ఆనందకోలాహలమున నున్న సుకన్య చెవులకీ ధ్వని సోకియుండదు. కావున నామె 'ఎఱుగక సరగనేగి క్రీడసలుపుచుండె' (7–37). అనువాదములలో శ్రీరాములుగారి యనువాదమె కొంతవరకు పైవిధముగ ఔచిత్యమును బోషించుచున్నది.

'అనౌచిత్యా దృతేనాన్యద్రసభంగస్య కారణమ్
ప్రసిద్ధౌచిత్యబంధస్తు రసస్యోవనిషత్పరా'

అని ఆనందవర్ధనుడు వచించి యుండెను. కావున నుత్తములు అనౌచిత్యమును పరిహరింతురు.

తిరుపతి వెంకటకవులు మునికనులు భగ్నములు కాగ నెంత పనిచేసితినని సుకన్య కొండొక వగచియు, క్రీడాసక్తి నెప్పటియట్ల గ్రుమ్మరుచుండెనని(7–36) యనుటలో ఆమె చేసిన తప్పామెకి తెలిసినదని విదితమగుచున్నది. అట్లే పాపయారాధ్యులవారును సుకన్య 'రాజసోన్మాదంబున గంటకంబుల నప్పుట్ట గడుబెకల్చి తపసిగా నెంచి యచ్చోటు దరలినది' (7–45) యని వచించిరి. ఈ సుకన్య తపసి చేసిన 'ఆహా' నినాదము తన చెవులకు సోకి 'తాపసి' యని తెలిసికొనగలిగినది. తండ్రి పిలిపించి యడుగువఱకామె చెప్పలేదు.

ఈ సుకన్యావృత్తాంతము భారతమునం దరణ్యపర్వమున గలదు. సుకన్య యవ్వల్మీకము నందు భార్గవునుద్యున్నయనములు మెఱయుచున్నను 'ఖద్యోత ద్యుతులొకో' యని సద్యస్సంజాత బుద్ధిసంభ్రమ యగుచును బొడిచెను,(అర.–3–1–177). కావున నామె చేసిన తప్పిదమామెకు తెలియలేదు. కావుననే తండ్రికడకు వచ్చి –

అన్నమిడుగుఱులై రెండు మెఱచుచున్న
మెఱుగులొక పుట్టలోనున్న నెఱుగకేను
బుట్టగొఁప్పించి యా రెంటి పొడవుగాన
కుడిగివచ్చితి విస్మయపడి మనమున. అర – 3–119

అని చెప్పియుండెను.

మూలమున -

మయాటన్త్యేహ వల్మీకే దుష్టం సత్వమభిజ్వలన్
ఖద్యోత వదభిజ్ఞాతం తన్మయౌ విద్ధమంతికాత్
ఏతచ్ఛ్రుత్వాతు శర్యాతి ర్వల్మీకం తూర్ణమాద్రవత్
తత్రావశ్యత్త పోవృద్ధం వయోవృద్ధం చ భార్గవమ్. 3-123-20

అని సుకన్య పుట్టగ్రొప్పించిన మాటయే లేదు. కుమార్తె పలుకులు విని దానిని గ్రొప్పించెను. వనవిహారము చేయుచున్న వారి సవ్వడికి చ్యవనుడు కనులు దెరచుటచే ఖద్యోతులవలె యున్నవి. ఆ భ్రమతోనే సుకన్య బొరియును గ్రొప్పించెను. ఆ కంటకము తగిలి వేదనచే తాపసి కనులు మూసికొనుటచే ఆమె కేమియు కానరాలేదు. కావున నిచట నన్నయ యామె తెలిసి తప్పుచేయలేదని యౌచిత్యమును బోషించెను.

ఇది శ్రీరాములు గారును ఔచిత్యమును బోషించుటయే గాక వారి కడుపులుబ్బి గుబ్బుగబ్బున మొబ్బో యని బాధపడుటను మిక్కిలిగ వివరించిరి. అంత బాధయుండినగాని జరిగినవిషయము ప్రస్తావనకు రాలేదు. మునిని చూచువఱకు ఈమె చేసిన తప్పిదము తెలియలేదు.

ఇట్లు కవి యతి శీఘ్రకాలములో అనువదించినను నెచట విస్తరించవలెనో యచట కుంచించవలెనో యెఱింగియే యౌచిత్యపరిపోషకముగా తెనిగించెను. తిరుపతి కవులు 'సుకన్య పుట్ట కొంతవరకు త్రవ్వెను కావుననే యామెకు భగ్న నేత్రుడైన ముని యగుపడెను'. ఎంతపని జరిగినది యని భయపడియు మునిని క్షమింప వేడక క్రీడాసక్తి నెప్పటి యట్ల గ్రమ్మఱెను. కాని యిటు సుకన్య పాత్రపోషణ గూడ భగ్నమయ్యెను. శకృన్మూత్రములకు ఒంటిప్రేలు,రెండుప్రేళ్ళు అని ప్రయోగించుట కావ్యములలో నిదియే ప్రథమమనవచ్చును. గజోష్ట్రంబులు తురంగములు, గిలగిలమని కూలి పెద్ద గీపులు పెట్టెననియు, జంతువుల బాధను గూడ వర్ణించిరి. మిగిలిన వారింత విస్తృతమైన వర్ణన జేయలేదు. శర్వాతి చ్యవనున కెవ్వడేని యెద్దియేని యపకృతంబు చేసియుండ దాని కిమ్ముని తమ కిట్టి శాస్తి చేసియుండునని పరిజనమును బిలిచి నయమ్మున భయంబున నడిగినను వారు మేమెఱుంగమని చెప్పిరి. అందులకు శ్వరాతి వారిని దండించుచుండగ

సుకన్య వచ్చి యావల్మీకంబు నందు ఖద్యోతరీతి రెండు జ్యోతులగుపడ పొడిచి చూచితిననియు అయ్యది జలదిగ్ధమయ్యె నదియు గాక హాహా నినాద మొక్కండును వెడలెను. అది విని విస్మయమ్ము మొనయగ తానంతం దరలి వచ్చితినని తిరుపతి వేంకటకవుల సుకన్య చెప్పెను. సైన్యముల నన్యాయముగ దండించుటచే ఆమె తానుగ వచ్చి జరిగిన విషయము చెప్పుట యుచితమే. కాని హాహా నినాద మొనరించినది ముని యని తెలిసి యాతని పేర్కొనకుండుట యామె సత్యమును సంపూర్ణముగ బల్కినట్లు లేదు.

అట్లే పాపయారాధ్యుల వారి సుకన్య తాను కంటకముచే బొడిచినది, బాధించినది తపసినని తెలిసియు ఖద్యోత విభ్రాంతితో నత్తేజము గలంగ బొడిచితి నంతలోన కంటకంబార్ద్రమై కనుపట్ట దానిని వెఱువక బొడిచితిని, అంత వల్మీక మధ్యంబున హాహా నినాదంబు పొడమె, నంతట విస్మయంబంది దూరంబేగితి నని చెప్పెనే కాని తపసిని గాంచితినని చెప్పలేదు. తిరుపతి వారి సుకన్య వలె తనంత తానుగ వచ్చిచెప్పలేదు. శర్యాతియే కుమార్తె జేర బిల్చి యడుగగా చెప్పెను.

శ్రీరాములు గారి సుకన్య తండ్రికడ కామెయే వెడలి రెండు కల్గులున్నవి, అందులో ముంటితోడ రెండు మూడు పోట్లు పొడిచి చూచితిని. దంటయెఱుగ మెఱగటంచు దలచినతినని చెప్పెను. శర్యాతి కామెపై సందేహము కలగలేదు. సైన్యమును నిజ సుహృద్వర్గంబును నడిగెను. పీడ్యమానుండైన తండ్రిని జూచి యామెయే జరిగిన విషయము వివరించెను. మౌని కనులు పగులుట మానిని యెఱుగలేదని ముందే వచించి యామె కన్యతదోష మంటగట్టలేదు. మీదు మిక్కిలి శర్యాతి కామెపై గల యభిమానము గూడ నిచట వ్యక్తమగుచున్నది.

భారతమున నిది ప్రధానకథ కాదు గావున శర్యాతి సైన్యాపరాధంబు నయ్యెగా వగచి వాడెల్ల వారినడిగి తత్కారణంబెఱుంగనేరక చింతాపరుండై యున్న తండ్రి కడకు సుకన్య వచ్చెనని మాత్రమే చెప్పబడి యున్నది. భారత చ్యవనుడతి క్రోధనుడుగ గానబడుచున్నాడు. 'అతిశయ రూపయౌవనగర్వితమైన యా కన్యం బరిగ్రహించి గాని క్షమింప'ననెను. దేవీభాగవత మందలి చ్యవనుడు మిక్కిలి గడుసరి. మెత్తని పులి. అతడు తాను శాపమీయలేదని శ్రీదేవీభక్తునకు నపకారం బొనరించి సుఖపడుట చొప్పడునె? హరుడు కనలి యట్లోర్చెనని చెప్ప వృద్ధదశను

తనకు పరిచర్య చేయగలవారెవ్వరు? అంధత్వము గూడ సంప్రాప్తించె నేమి సేయుదునని వాపోయెను. శర్యాతి యాతని పరిచర్యకై తన సైన్యము నియోగింతునని 'వారేగతిన్ బనుపడు నిష్ఠయే మొనరుపందగు వారగుదురు. నీ యాత్మజ మదీయ సేవకై యొసంగుము. పుత్రి నొసంగి పెండ్లి చేయుమని చెప్పెను. తప్పు చేసినవానికే శిక్ష విధించనట్లయ్యెను. తేనె బూసిన కత్తి వంటి పలుకులతో నాపె రాజదర్పమంతయు ద్రుంచి వేసెను.

మూలమున -

> వల్కలం పరిధానాయ ప్రయచ్ఛాజిన ముత్తమమ్
> వేషం తు మునిపత్నీనాం కృత్వా తపసి సేవనమ్. 7-3-56

అని యున్న శ్లోకమును శ్రీరాములు గారిట్లు విస్తృతముగ వివరించిరి -

> సన్న బుటేదారు సరిగచీరెను మాని
> కొనలు దీరిన నారఁకోక గట్టె
> గరుడపచ్చల తళ్కు గాజుదోయిని మాని
> గురువింజ పూసల కుచ్చుదాల్చె
> కొమరైన మేలిమి కుత్తుగంటును మాని
> జిగి నల్లపూసల బేరుదాల్చె
> రతనాల బిళ్ళతోరంపు కీల్జడ మాని
> మడచి ముచ్చటగుంట ముడినివైచె.
>
> నడవిలోఁ బర్ణశాలలో నధివసించి
> నట్టి ఋషికన్య వేషంబ యుట్టిపడగ
> నట్టి నృపుకడ కేతెంచి యమృతధార
> లొలుక నిట్లనిపలికె నక్కలికిమిన్న. 7-75

ఇట్లీ మునిపత్నుల వేషమును హృద్యముగ వర్ణించిరి. ఆనాటి సంపన్న గృహిణుల వేషభూషలు,పేదయింటి యిల్లాలి నిరాడంబరత యిందు ప్రతిబింబిత మగుచున్నది. మిగిలినవారి యనువాదములు మూలవిధేయమగ సాగినవి.

సుకన్య భర్తకు జేయు సపర్యలు చాలవరకు అందరు మూలానుసరణముగనే చేసిరి. దాసు వారి యనువాదమున విశేషించి తెలుగు పలుకుబళ్ళతో తేటతెనుగు తన మొకపాలెక్కువగ నున్నది. ఉదా :– వేడినీళ్ళుదొళుపుట, సాపడి లేచియున్న పతి సన్నిధికిం జని వక్కలాకులున్ దీపితమైన భక్తినియతిన్ దగనిచ్చును'. (7–81)

'భుక్తవన్తం పతిం తృప్తం దత్వాచ మనమాదరాత్'. 7–4–7

అన్నదానిని ననువాదమున పాపయారాధ్యుల వారు – 'భుజియించు పిమ్మటఁ బూతుడౌ భర్తను లేవంగదీసి సంభావమున ముఖవాస మర్పించి' ఆచమనము నకు ముఖవాసర మనిరి. 'భుజియింపబెట్టి తగుతృప్తి జెందగ జేసి పై గావించున్ గరపాద శుద్ధిఁ బిదపన్ గైకొమ్ము తాంబూల మోదేవా' యంచు నొసగు నాసనము అని తిరుపతి కవులనువదించిరి. శ్రీరాములు గారును నిట్లే యనువదించిరి.

పాదసంవాహనాం కృత్వా నిశిభక్తి పరాయణా
నిద్రితంచ మునిం జ్ఞాత్వా సుష్వాప చరణాన్తికే. 7–4–14

శుచౌ ప్రతిష్ఠితం వీక్ష్య తాలవృంతేన భామినీ
కుర్వాణ శీతలం వాయుం సివేనే స్వపతింతదా. 7–4–15

హేమన్తే కాష్ఠ సమ్భారమ్ కృత్వాగ్నిజ్వాలనం పరిః
స్థాపయిత్వా తథా పృచ్ఛత్సుఖం తే స్త్రీతి చాసకృత్. 7–4–16

సుకన్య భర్తను సేవించువిధమును వర్ణించుచు చెప్పిన పై మూడు శ్లోకములకు దాసు వారు రెండుపద్యములలో వివరించిరి.

సుప్తి సుఖముకొరకు సురటిని చేఁబట్టి
వీచుచుం బతివ్రతాచరణము
లతని వలన నెఱుఁగ నడిగికొంచు బదాంతి
కమున నిదురఁబోవుఁ గలికి యధిప. 7–83

ఒడయఁడు చలికాలంబున
గడగడ వడకంగ జూచి కాష్ఠంబులఁదా

నడవికిఁజని తెచ్చి పదం
పడి రవులంజేసి యుష్ణభావముఁజూపున్. 7-84

ఇట మూలానుసరణముగ ననువదించినను 'గడగడ వణఁకు' వంటి తెనుగు పలుకుబడి జారిపోకుండ గ్రహించిరి. చలిమంట వైచి సుఖముగా నున్నదా యని ముని యడుగకుండనె కాష్ఠంబుల రవులంజేసి యుష్టభావంబు చూపునని మూలములో నున్నదాని నిట్లు పరివర్తించిరి.

దీనినే పాపయారాధ్యులవారిట్లు తెనిగించిరి.

.......... భర్త చెంతఁ బాద
సేవఁజేయుచు స్త్రీధర్మ సిద్ధులడిగి
భర్తని ద్రాణుడైన యప్పట్టు నందు
వ్యజనసేవయొనర్చి యయ్యధిపుచరణ
సన్నిధిని దాను గూర్కునా చంచలాక్షి. 7-89

హేమంతవాసరంబులందు సతితానిచ్ఛారతిన్ గట్టియల్
స్తోమంబొప్పఁగఁజేసి వహ్నియిడి సంస్యూతజ్వలజ్వాలలన్
సేమంబొప్పఁ దహింపఁజేయుచు సుఖస్థేమాభిరామాదృతిన్
స్వామీ మేను సుఖించెనే? యనుచు సంభావించి లాలించుచున్. 7-90

తిరుపతి కవుల యనువాదము - '......... పాదసంవానంబు సలుపుచుఁ గులస్త్రీధర్మముల నడిగి తెలిసికొనుచు నతఁడు నిద్రించిన తెఱంగెఱింగి తచ్చరణ నికటమ్మున నల్ల నొరగి నిద్రించుచు నప్పుడప్పుడు మేల్కాంచి తగు నుపచారమ్ము లొనర్చుచుఁ బ్రేమ యుక్తమ్ముగ భక్తి పరాయణయై సేవించు

తన్వి వేసవికాలవృంతమ్ము విసరి
నిదురపట్టెడిరీతి ననిలము గొల్పు
మగున హేమంతమునఁ జలిమంటవైచి
యడుగు 'సుఖమగునె' యని యమ్మునీంద్రు. 7-78

ఇచట 'అపుడప్పుడు మేల్కాంచి తగు నుపచారమ్ము లొనర్చుట' యమూలకమైనను భావ వివృతికి మిక్కిలిగ దోడ్పడుచున్నది. 'నిదురపట్టెడి రీతి

ననిలము గొల్పు' నన్నభావమే 'సుప్తి సుఖముకొఱకు సురటిని జేబట్టుట' కన్న మనోహరముగ నున్నది.

శ్రీశిష్టా లక్ష్మీకాంతశాస్త్రిగారు తమ గ్రంథములో నిట్లు వ్రాసిరి.[7] (పు. 16) 'తిరుపతి కవుల పద్యము పద్యభావ మొకదానితో నొకటి బొందుకలిసి స్వభావ సిద్ధముగాను, రసవంతముగా నున్నది. దాసుశ్రీరాములుగారు ఈ భావమును మూలానుసారముగా గీతము కందపద్యములలో నమర్చిరి. తిరుపతికవుల రచనకు దాసుశ్రీరాములుగారి రచనకు గల తారతమ్యమును చదువరులూహిం చుకొనగలరు' అని మాత్రమే చెప్పి వదలివేసిరి. ఆ తారతమ్యములేవో వక్కాణింప లేదు. పాపయారాధ్యులవారు రెండవ పద్యభావము నొక శార్దూలవృత్తమందు వ్రాసిరి. చాలవరకు నిరర్థక పదములతో నింపిరని విమర్శించిరి. ఇంకను వారిట్లు విమర్శించిరి : – 'పాపయారాధ్యులవారి తెనిగింపు కొంత బిగింపు కలదై నది తిరుపతికవులు తిక్కనాదుల దారి ననుసరించి యొక్కొక్కచో పెంచియు నొక్కొక్క చోట కుంచించియు ననౌచిత్యములను పరిహరించి రసవంతముగా కృతిని రమణీయాకృతి కలదానినిగా చేసిరి. ఆశ్వినులు సుకన్యను కలిసికొనిరి. ఆమె యందచందముల కబ్బుర పడిరి.

ఒక్కింత నిలువు యో జల
ముక్కచ! యశ్వినుల మేము మోదమ్మున ని
న్నొక్కటి యడిగెద మిక్కడ
కెక్కతమున వచ్చితేడ కేగెదు చెపుమా. 7–83

అని గూఢప్రణయమున ప్రశ్నించిరి. సుకన్య–

నను నాయనుమతిఁగొని మ
జ్జనకుండమ్మునికి నిచ్చె సద్వర్తనుఁడా
యనఘుని యాశ్రమమల్లది
చనుదేఁదగుమీర లెవరొ సచ్చారిత్రుల్. 7–91

అని సమాధానము చెప్పినది. ఈ రెండు పద్యములు రెండు రత్నముల వలె గంభీర భావమరీచిమాలికలను వెలారించుచున్నవి. సుకన్య మహారాజసము కలది. మొదట 'నేను శర్యాతి కూతురును' అని నుడివినది. శర్యాతి లోకప్రసిద్ధ

డగు మహారాజు. ఆయన కూతురు ననుటచేత తాను ఆగర్భశ్రీమంతురాలనని తెలుపుకొనినది. తరువాత తన వల్కలాజినములకు కారణము 'మానవీయ చ్యవన మునీంద్రులకు భార్య నన్నది'. మాననీయుడనుటచేత చ్యవనుని కీర్తి ప్రతిష్టలు లోకమునకు విదితములు. అతడందరిచే గౌరవింపబడువాడని తేలుచున్నది. అతడు మునులందింద్రుని వంటివాడని తన భర్త గొప్పతనము,తనకు భర్తయందు గల యభిమానము వ్యక్తపరిచినది. అట్టి చ్యవనునకే 'నసుగు భార్య' నన్నది. సుకన్య అందువలన చ్యవనునికి సుకన్య యందు గల ప్రేమను గూడ విశదపరచినది. ఆకారణము చేత తాను రాచకూతురైనను భోగభాగ్యములను బరిత్యజించి ప్రియుడగు తన భర్తను సేవించుచుంటినని ఫలితార్ధము. తన భర్త ముదిమి,యంధత్వము బాపుదురేమో యని తలంపు. అంధుడు ముదుసలి యగునట్టి భర్త కెల్లపుడు సేవచేయుచు నిచట నుంటి అన్నది. వారికి తనయందు దురూహ కలుగకుండ వలయునని తాను చ్యవనుని స్వయముగా వరించితి ననుచు నను నాయనుమతి గొని మజ్జనకుండమ్మని కిచ్చెనని తెలిపినది. పైపెచ్చు చ్యవనుని వలన తనకే కష్టములు కలుగ నేరవని సద్వర్తనుడా యనఘుడని విశదపరిచినది. ఇట్టి మిక్కుటములగు గంభీరభావములతో సుకన్య సమాధానము చెప్పినది. ఇట్టి పద్యములుభారతము నందు తప్ప మరే పురాణము నందు కనిపించవు. ఇవి తిరుపతి కవుల పద్యములు. పాపయారాధ్యులు –

శర్యాతి యనునట్టి జననాధునిపుత్రిని
  జ్యవనమహర్షికి సతిని నేను
అవనీశుఁడిమ్మని యంధుఁడంచని యెంచ
  కర్పించె మీరు మాకతిథులైరిఁ.

అని సుకన్యచేత ననిపించిరి. 'అంధుడని యెంచకర్పించె' అనుట వలన సుకన్యకు భర్తయం దనిష్టత వినిపించవచ్చును. అశ్వినుల దురూహకు మరింత సావకాశము కలిగించుచున్నది. పూర్వకథాసందర్భమునకు విరుద్ధముగ నున్నది. దానిమూలమున నసత్యదోషము సుకన్యయందు నాపాదింపబడినది. సుకన్య పాత్రపోషణ భావగాంభీర్యము జతపరచి రసవంతముగ నొక చిన్నకావ్యము వలె నాటకరచనను బోలు సంభాషణలతో కథ చివరి వరకు మనోరంజకముగ నుండునటుల వ్రాసిరి. పైన చెప్పిన మెఱమెచ్చులన్నియు మూలరచయితకు

చెందును. తిరుపతికవుల మూలవిషయములు దుసికలపోకుండ అనువాదము లోనికి తెచ్చిరి. వారి విశిష్టత నింతవరకే. ఇచ్చట శ్రీరాములవారి యనువాదము నుదాహరింప లేదు.

తస్య సేవామహోరాత్రం కరోమి ప్రీతిమానసా. 7-4-41

రేయి బగలు నోర్పున నతనిం గనిపెట్టుకొని వసించెద
వనిలో సకలోపచార వర్తిని నగుచున్. 7-89

అని శ్రీరాములుగారామె సేవానిరతికి నెక్కువ ప్రాధాన్యమిచ్చిరి. అశ్విని దేవతల మాటలకు భయపడిన సుకన్యను 'భీతహరిణేక్షణ' యని సంబోధించుట యచ్చటి సందర్భమున కెంతయు నొప్పుచున్నది. తిరుపతి వారి 'జలముక్కచ'అన్న యుపమానముకన్న నీయుపమానము సాభిప్రాయముగ సందర్భశుద్ధిగ ప్రయోగింపబడినది. సుకన్యను ప్రలోభపఱుచుటకై యశ్వినులు పలికిన పల్కులును మిక్కిలిగ మూలభావమును ప్రపంచించుచు మూలమున లేని యుపమానములను గూర్చి మనోహరముగ నుడివిరి.

తెలుగు పలుకుబళ్ళతో నీ యుపాఖ్యానమును రసవత్తరముగ రూపొం దించిరి. ఈ యనువాదమున తెలుగు నానుడులు,జాతీయములు పెక్కు గలవు. 'ఎట్లు గొంతుగోయ నివ్వేళ జేయాడునే?' (7-60),కాకిముక్కుకున్ దొండపండు (7-58), ఇట్టిడు,గవ్వంతకన్ను,ఉట్టిపడు,వేనీళ్ళను గాచి,బిందదొఱుపు (7-70) సాపడుట(అన్యదేశము)7-81, ఇది తమిళపదము. ఎక్కడ దాపురించె,గోరెడు పసుపుకుంకుమ,తటవిట పడుట,గోలుగోలున,చిడిముడిపడుట,లబోలబోమని కూయుట,ఒక విధముగ సంస్కృత దేవీభాగవతమందలి కథనే యనుసరించినా రచ్చటచ్చట సందర్భానుసారముగ నూతన కల్పనలు గావించియు,ననుచితము లైనవానిని సంహరించియు సందేహము పొడము కొన్ని విభయములు ప్రచురించియును,కొన్ని కుంచించియు తన ప్రతిభ భాసింపచేయుచు నాంధ్ర శ్రీదేవీభాగవతమును సర్వాంగసుందరముగ తీర్చిదిద్దిరి.

**అమూలకము :** భావపరిపుష్టిగల భావములను జేర్చి శ్రవణ పేయముగ అర్థస్ఫూర్తి,అభిప్రాయపు తూగు చేవదేరునట్లుగ తెనిగించిరి. రసమునకుప్రకర్షను గూర్చుచు,అమూలకములైన యలంకారములను జేర్చుచు మనోహరములైన

వర్ణనలు అందునా ప్రబంధవర్ణనల చేర్చుచు సమాసబలము చెడకుండ, జాతీయములను గ్రుచ్చి తెనుగు నుడికారపు సొంపునింపు గూర్చుచు అమూలకము లైన అనువాద రచన నెడనెడ జేసిరి. దేవీ జగన్మోహనావతార వర్ణన,చండిరూప వర్ణన(1-305-8, 1-452), అంబిక వర్ణన (5-507-519), యుద్ధభూమి యందు శంభుడు గావించిన దేవివర్ణన(5-669), శతాక్షీదేవి వర్ణన(7-633), శక్తి మధుకైటభులను వంచించుటకు నిరాకారయై,ఖేచరియైన పరాశక్తి సాకారమై జగన్మోహినియై, రుద్రవిరోధి కరాగ్రఖడ్గమై యెట్లు దర్శనమిచ్చినదో కవి మనోజ్ఞముగ (1-35-318) పద్యములందు వర్ణించెను.

కవులు దేవతల వర్ణనను పాదములతో ప్రారంభించి శిరస్సు వరకు వర్ణింతురు. మానవులను వర్ణించునపుడు శిరస్సుతో ప్రారంభింతురు. ఈ క్రమము తప్పుటకు కారణము కలదు. దేవి నిరాకారయై ఖేచరమున సంచరించుచున్నది. ఆమె ముఖము,తళుక్కుమని ఆకాశమున మెఱిసినది. ఆ ప్రక్కనున్న చంద్రుని తలపించుచున్నది. ఆమె నఖములు అక్కడనేయున్న నక్షత్రములవలె నున్నవి. తరువాత యాసుందరి శుకరవముల వంటి పలుకులు విననయ్యెను. అపుడు తేరిచూడ యామె వంపుసొంపులన్ని స్పష్టముగ గన్పట్టును. కృతకచేష్ట,ముద్దుమోవి, బంగారు రుచిరాంగము,వళులు మొదలైనవన్నియు కాంచి వానికి సాటివచ్చు వానితో 'బేరీజు'వేసి చూచుచున్న రాక్షసులు నిందాస్పందుడైన చవితి చందురు కన్న నామె నెన్నుదురు సౌందర్యమెయెక్కువ, పంకజము యొక్క యందము గూడ యామె పదయుగళి యందము మందముగా నున్నది. లేడికన్నులు ఓడిపోయినవి, అక్షులు కలువలను పరిహసించినవి అనిరి. ఇట్లు ఆమె సొగసును వారు సావకాశముగ అంగాంగము తిలకించి మోహితులై మైమరచి కర్తవ్య విమూఢులైరి. దేవికి కావలసినది యిది.

దేవగాంధారి వాయించు పద్యమందలి దేవి వర్ణన కూడ యమూలకము (5-57). గానము విషయమే ప్రస్తావించిరి. ఆ తరువాతి పద్యములు చేమకూర వెంకటకవి పద్యములవలె చేవదేరి అర్థగౌరవము గలిగి రసవంతముగ నున్నవి.

కలువలు కన్నులన్న సరిగాదు సుమా కుముదాఖ్య వానికిం
గలుగుట,సారసంబులన గాదు సుమా యవి నీరజంబులై

యలరుట, మీలు నాగదగదప్పులలో ముగ్గి తేలుటం
బలుకునికేమినాన నుపమానములే యనవచ్చు గట్టిగన్.     5–524

ఇందు కవి పసందైన శ్లేష గూర్చెను. అందునను మూడవ పాదము మిక్కిలి రసవంతముగ నున్నది. అప్పు అనగా నీళ్ళు అని అర్థము. ఋణగ్రస్తమగుట వేరొక యర్థము కలదు. ఎక్కువ అప్పులు చేసిన వానిని 'వాడు అప్పులలో మునిగి తేలుచున్నాడని' అందుము. మీనములు నీళ్ళలో మునిగితేలుచుండుట యథార్థమే. కవి చమత్కారముగ ఈ పలుకుబడి యర్థముతో విశేషార్థము గూడ అమర్చి ఆమె కన్నులకు సమానములు లేవు. వాని కవేసాటి యని హృదయ రంజకముగా చెప్పిరి.

రోలంబ జాలంబ యాలంబ కచపాళి
కాకున్న విరుల సంగాతమేల
చిందంబు నందంబు చందంబు కందంబు
కాకున్న శబ్దసాంగత్యమేల
బాకాల లోకాల తూకాల జంఘలు
కాకున్న మంగళక్రమములేల
ముకురాల నికరాల నికరాల చెక్కిళ్ళు
కాకున్న సొగసందు గననేల.

నడుమొకటి మాయ ముష్టిలోబడియెగాని
యింతి యవయవ సౌభాగ్యమేమిచెప్ప
కాపురంబుండు నహహ శృంగారలక్ష్మి
చారుపంకేరుహాస్య బంగారు మేన.     5–525

పై సీసపద్యమున మొదటి అర్థపాదమును ఆ యింతి యవయవ యుపమానములును, రెండవ యర్థమున దానికి గల కారణములు కవి చక్కగ చమత్కరించెను. సౌభాగ్యము మంగళములున్నవి కావుననే లక్ష్మి కాపురమున్నదని చమత్కారము. అంతేగాక అ శబ్దసాంగత్యము మంగళతూర్యనినదమువలె భావ సౌందర్యము విరుల నెత్తావి వలె ఇంద్రియ తోషణముగ నున్నది.

కలికి మొగమ్ము చంద్రుఁడని గట్టిగ చెప్పుదు రది నిక్కమే
వెలయగ నవ్వుపేరిటను వెన్నెలయున్ దిలకచ్ఛలంబునన్
గలిత కళంకమున్ బెదవి నామముతో సుధయున్ బొసంగు గ
న్నులనెడి కల్వక్రొవ్విరులనున్ వికసింపఁగజేయు నెంతయున్. 5-526

ఆమె ముఖము చంద్రుడని చెప్పుటకు గట్టికారణములు,నవ్వుపేరిట వెన్నెల, చంద్రుని మచ్చ యామె ముఖమందలి కుంకుమతిలకము, చంద్రుని లోని సుధకు సాటి యామె యధరసుధ. అన్నిటికి మించి చంద్రునికి గల గుణము కలువలను వికసింపజేయుట. అది గూడ నీ ముఖచంద్రుడు చేయుచున్నాడు. కన్నులనెడి కలువలను వికసింప జేయుచున్నాడనుట చమత్కారము. చక్కని కావ్య లింగాలంకార మిచ్చుట చెప్పబడినది.

పరగనవూ ర్వమైన విధివాసము దా స్వవశంబు జేసి శం
కరు సిగబట్టి దిట్టయగు గాంతను మనుంగవునుం జయింపగా
హరికవతారమయ్యె నటులయ్యును బేదరికాన ముష్టికిన్
మరలక లోనుగావలసె మాయగదా యది వేయునేటికిన్. 5-527

కౌను పిడికిలి యంత యుండుట యందము. కావున ముష్టికి లోబడెనని శ్లేషతో మనోజ్ఞముగా చెప్పెను.

మాపులు రేపులంచు దమ మంజులభావము సూపలేక నీ
ర్మాపులుగా దలిర్చి కలకాలము పంకముబట్టి గంధసం
ప్రాపకతన్ మధువ్రత సమష్టిని బ్రోచెడి యుత్పలాబ్జముల్
చూపుల దాపులన్నిలువజొప్పడునే హరిణాక్షికింతయున్. 5-528

కులుకును దళ్కు సూపకొక గోతను గొన్నిదినంబు లాదటన్
వెలవెలయంచు వచ్చి నడువీధి దుకాణములోన గొన్ని నా
ళులు తరువాత చెక్కడములోబడి నీరసవృత్తి నున్న కెం
పుల పస సొంపులాడి నునుమోవికి నీడన నవ్వురాదొకో. 5-529

కెంపుయొక్క స్వీయచరిత్రను ఇచట కవి చెప్పుచున్నాడు. వెలవెల యంచు వచ్చుట అనగా ధరకట్టుట, కాంతివిహీనమైనది. అని రెండర్థములు స్ఫురించును.

అట్టిదానిని నింతియొక్క మోవికి సరివచ్చు ననుట నవ్వులాట కాక మరేమి యని తెలుగు పలుకుబడితో శ్లేషార్థమును జోడించి చమత్కరించెను.

దాని పసందుసూచితిమి తక్కినవారికి నేమిగాని యా
సూనశరాసనుం డతివ సోయగమున్ గని కూర్మి వేడ నిం
పూనకనంగహీనుడవు పొమ్మన నస్త్రమయంబు జేసినన్
మానిని మేను దానతని మార్గణముల్గొని యేయుదృష్టనల్. 5-530

ఆమె యొక్క మేను మన్మథుని 'అంగహీనుడవు నాకు సాటియేమి యని' తిరస్కరించగ తన యస్త్రముల నామె మేనుపై గుప్పించెను. ఆమె మేను మన్మథుడు వేసిన బాణములనే తీసికొని కన్నులనెడి యరవిందములు, నీలోత్పలములనే మరలజేసి జయించెనని చమత్కారముగ చేమకూరకవి వలె రసోవగుంఫిత పదాలతో ప్రసన్నత సౌకుమార్యము గనంబడ సహృదయులు మెచ్చునట్లు ఈ దేవి వర్ణన చేసిరి. మిగిలిన యనువాదకులు దానికి ప్రాముఖ్యత మీయలేదు.

**తిరుపతి కవులు -**

ఎక్కడనుండియో యొక మృగేక్షణ సింగమునెక్కి వచ్చెన
మ్మక్క యనన్వశంబగునె యచ్చెలువంబు వచింపనట్టెబల్
చక్కెరబొమ్మ ముజ్జగములన్ గనగా వినగా నెఱుంగమా
టక్కరిగానవిద్యనొకటందగుఁ దక్కినవట్టెయుండగన్. 5-536

వీరు జగదంబస్తుతిని విపులముగ జేసిరి. అనువాదము లన్నిట దండకములు గలవు. పాపయారాధ్యులవారును ఈ వర్ణనకు ప్రాధాన్యమీయలేదు.

ఇంతియగాదు దేవపురికేగియు నిట్టి నెలంతగాన మా
వంతయు దద్వధూమణికి నన్యపురాంతరభామలెల్ల నా
ద్యంతము సాటిగారు వినగాగనగా నటువంటి చెటి లే
దెంతయు బ్రహ్మసృష్టి యెడనింత విచిత్రముగాదె యెన్నడున్. 5-627

మూలమున గూడ -

నేదృశీదేవలోకేస్తి నగన్ధర్వపురేతథా
నదృష్టానశ్రుతాక్వాపి పృథివ్యాప్రమదోత్తమా. 5-23-16

అని మాత్రమే గలదు. ఇట్లే తులసివర్ణన కూడ అమూలకముగ ప్రబంధవర్ణన ననుసరించి చేసినట్లున్నది. శంభుడు గాంచిన దేవీవర్ణనలు నాటి సంపన్నగృహిణిని తలపింపజేయును. వేణిపై కురువిందముల రాగిడిబిళ్ళ,రవలదుద్దులు,ముక్కు బులాకి,పుష్యరాగములజంపులు,వైఢూర్యముల బాజుబందులు,పగడాలచౌకట్లు, కంఠమున ముత్యాలపేర్లు,గరుడపచ్చల మొలనూలు ధరించి జలతారుచీర ధరించి నట్లు వర్ణింపఁబడినది.

**అంబవర్ణన :**

తలరాగిడిబిళ్ళ తళుకు క్రేవలఁగ్రమ్మ
వింతగా శిరము నొక్కింత వాంచి
రవలదుద్దుల మితారములు చెక్కుల దాట
నెడనెడ నొక్కింత మెడ గదల్చి
చిరునవ్వు వెన్నెలల్ సెలపులెక్కుచు గ్రాల
ననవంటి వాతెర నమలి నమలి
ముద్రికామణిఘృణుల్ మురిసి చిందులు ద్రొక్క
వెసవ్రేళ్ళ బైటకొంగు సవరించి.

దేవనది ముద్దుబిడ్డని క్రేవ నిలచి
సిగ్గునం గన్నులరమోడ్చి చీరె దుడిచి
యాచి తలయూచి యొక్కొక్క యక్షరముగ
మాటలాడెఁ బ్రథమ కన్య తేటమీరి. 1-745

ఉన్నది యున్నయటుల అలంకారనిరపేక్షముగ స్వభావోక్తులతో పాత్రను పాఠకుల కనులయెదుట కదలించును. మనోజ్ఞముగ అంబవర్ణన చేసి బొమ్మ కట్టించిరి. శిరము నొక్కింత వాంచి,నొక్కింత మెడగదల్చి, వ్రేళ్ళ బైటకొంగు సవరించుచు సిగ్గునం గన్ను లరయోడ్చి భీష్మునితో నొక్కక్క యక్షరముగ మాటలాడెను.

పురాణశ్రవణమున విసుగుజనింపకుండ చటుక్కున నిట్టి రసవత్తరము లైన ప్రబంధరచనల సమూలకముగ గూర్తురు. ఇది 'ఎడారిలో నూటబావి వలె' నుండును.

వసంతకాలవర్ణన (4–109–117), స్వయంవర రాజకుమారుల వర్ణన (3–528),సుగంధవర్ణన(2–123), యౌవనవంతుడైన శంఖచూడుని వర్ణన (9–584),పసిబాలిక వర్ణన(4–523), పసిబాలునివర్ణన(6–394) కడు రమ్యములు. స్వభావోక్తులతో యీ పసిబాలుని వర్ణన మురిపెము గూర్చుచున్నది.

కాలి బొటిమనవ్రేలు నోటను గట్టిగా నిడి కుడ్చుచున్
బాలులేవని డీలనొందక పాణిపాదము లార్చుచున్
లీల గూర్కుచు నోలినవ్వుచు లేచి చూచుచు బొరలుచున్
బాలుఁడాడగఁజూచె నజ్జనపాలుఁడర్మిలి దేలుచున్. 6–410

మరియు బాలెంత వర్ణన (4–523), పుత్రోత్సవ వర్ణన (4–537), ప్రాతః కాల వర్ణన (10–35),పాపయారాధ్యులవారు శశికళా స్వయంవర సందర్భమున సాయంకాల ప్రాతఃకాల వర్ణనలు అమూలకముగ మనోజ్ఞముగ చేసిరి. ఇట్లమూలకముగ నష్టాదశ వర్ణనలు జేపి పురాణమును ప్రబంధముగ మలచిరి. శ్రీరాములుగారి రచనలలో నెచ్చట బట్టిన నచ్చట హాస్యము చిప్పిలు చుండును. ముఖ్యముగ హైహయులు,భార్గవుల ధనమిమ్మని బాధించిన వర్ణన అమూలకమై (6–297–316) హాస్యపరిశోభితమై యొప్పుచున్నది. ఆనాటి బ్రాహ్మణ సమాజము వారి జీవన విధానము కళ్ళకు కట్టినట్లు వర్ణించిరి. వీరు–

పాదుద్రవ్వి యందు ధనము బ్రాతిరి ధనముల
మీదు మీదు బీరపాదు లిడిరి. 6–331

సోమిదెమ్మగారి సొట్టముక్కున నున్న
ముక్కెరొకటి లాగి చిక్కకున్న
ముక్కుగోసి చనిన ముక్కిడియై యాపె
వెక్కి వెక్కి నొక్కి నొక్కి యేడ్చె. 6–320

సాంఖ్యశాస్త్రి గారి సవతి చెల్లెలు పండి
కూర్చుచుండ కొప్పు కుప్పెలాగ
లేచి మొత్తుకొనఁగ దోచికొనిరి దాని
జూచి వగచె మగడు ప్రాచినోట. 6–324

బుడిచెంబులు ముడసవెదురు
గడకఱ్ఱలు తలలజుట్టు గావంచాలున్
మడి సంచి దర్భచాపలు
మెడల నిడుకచనిరి చాటుమెట్టల కధిపా. 6-302

పంచమ స్కంధమున దేవతలోడిపోయిన సందర్భముగ యష్ట దిక్పాలకుల యక్కటికముల నిట్లు వర్ణించిరి.

ఇంటియొద్ద సంచులేమాయెనో బ్రతు
కేడ నింక దున్న లిన్ని వచ్చి
చుట్టుముట్టెఁదూరచోటేది నా కంచు
బిరికితనముతోఁ గుబేరుఁడడలె. 5-139

ఇట్లే మిగిలిన యష్టదిక్పాలకులును అష్టకష్టములు బడిరి. దేవి మహిషాసుర దూతల సంవాదము యుక్తి ప్రయుక్తులతో లోకోక్తుల నుడికారపు పలుకుబళ్ళతో సంభాషణ రక్తి గట్టించిరి. కన్నుగానవురా (5-217),కనుము చోద్యము(5-217),నిప్పులలోన మాడ్చెద(8-319),హనుమంతుని మ్రోలను గుప్పిగంతులా (5-218), పొందున లాభమొందుదురు పోరున నాశము వచ్చు నందురు (5-221), వెఱ్ఱికూతలు(5-221),నీకాళ్ళు కడిగి త్రాగి బ్రతుకడే(5-221), ఆటనట ఈ కవి ఆమూలకములైన ఆవ్యక్త మనోహరములైన భావనల జేర్చిరి.

సంజాయపురాధీశుని కుమార్తె దమయంతికి నారదునిపై ప్రేమ వగలొడ్డుకొని పారినదట(6-509),అప్పుడతడు జగమెఱుగ సంధ్య నెఱుగ స్నానమెఱుంగడట(6-509), శక్తి కోపింప చలిచీమ పులియగునట (10-95), పండుటాకులన్ దవిలిన జాజిపూవులవలె(7-98), మునివేషమున నున్న సుకన్య యుండెనట. జన్యముఖంబునబడి నిలిచిన దేవి మహిషునకు పంటిక్రిందికి నప్పడమో పప్పువడియమో యగునట. అంతేకాదు 'దంట యేనుగు జాజిపూవుల దండ మట్టిన పోల్కి' యగునట (5-223). ఆమె 'బంగారుమేను నుత్తలంపడ జేయుట, మల్లెపూచెండు భగ్గనుమంటలోన వైచుట యట' (5-399).

అక్కడక్కడ మూలమున లేని శాస్త్రప్రసంగములు గూడ కలవు. చండుడు సైనికబలంబు పయిన్బడి స్వాతీగతుండై యతివృష్టి గురియు శుక్రుంబోలె నిశి

తాశుగ నివహంబతిదారుణంబుగ గురిపించెనట(5-607). 'లగ్నము శుభంబు పంచక రహిత మగుచు' (5-135), తులసీ జననము శుభదినమున శుభ నక్షత్రంబున శుభవాసరంబున శుభయోగంబున శుభకరణంబున శుభలగ్న హోరాద్రేక్కాణ నవాంశద్వాదశాంశ త్రిశాంశంబుల శుభగ్రహదృష్టి యోగాదులు గలవేళ గార్తిక పూర్ణిమ శుక్రవారంబు (9-547). ఇట్టివి జ్యోతిశాస్త్రమును దెల్పు పద్యము లనేకములు గలవు. ఈ అమూలక పద్యములు కవిగారి జ్యోతిశాస్త్ర ప్రావీణ్యమును వ్యక్తపరచును.

1-652,5-505,5-465,4-115 ఇవి కవిగారి గానవైదుష్యమును వెలార్చుచు 'గానము వినువారికి మాగాణము లేల' యని దాని యందలి ప్రీతిని వ్యక్తము జేసిరి.

సురథుడు చొచ్చిన తపసి పల్లె వర్ణన (5-690,98) నన్నయ గావించిన కణ్వాశ్రమ వర్ణన వలె నున్నది.

సింగంబు జెడబట్టి సెలగాడు లేడులు
నేస్గు దుండమునాకు మృగవరములు
నెలుకకు మేతనందిచ్చు మార్జాలముల్
బిల్లి మూపున మ్రోచు వేపిగములు
నావుదూడలగాచునట్టి వ్యాఘ్రంబులు
చెలగి మేకకు మేలుజెప్పు వృకము
బర్హిబర్హము నీడ బన్నుండు భుజగముల్
హరిజేటి జెడద్రువ్వు శరభమృగము.

కోరి సంపంగి తేనియగ్రోలు తేటి
వేడుకలరంగ జిలుక ముద్దాడు పునుగు
సంతతాన్యోన్య మైత్రిచే జాతివైర
మెన్నడును లేదు మునిపల్లె నెన్నదరమె. 5-697

బలరామకృష్ణులు మధురను వీడి ద్వారకకు చేసిన ప్రయాణము ఆమూలక వర్ణనము. కవి గ్రంథాదిని అల్లూరి వర్ణన గ్రామీణ కవిత్వమునకు నాంది బల్కెను. సమర్థుడైన కవి యానాటి ప్రజాజీవనమును,సంఘమును,తన కావ్యమున అద్దము

పట్టి చూపును. ఇచ్చట ఆనాటి పల్లెప్రజలు గావించు ప్రయాణమును చక్కగ వర్ణించెను. ఇందు గ్రామీణ కవిత్వము ప్రతిఫలించుచున్నది. -

మధురలోనె స్వస్వమందిరద్వారముల్
మూసివైచి బీగములు ఘటించి
బండ్లమీద నిడరి పాత్ర భూషాధన
వస్త్రపేటికలను వరుసదీర్చి

4-590, 4-591, 4-572 పద్యములలో వర్ణించిరి.

పాపయారాధ్యులవారు-

రామకృష్ణులతో మధురాపురంబు
వెడలి సవరిచ్ఛదంబుగా వేగనేగి
ద్వారకాపురి జేరిరి ధనదుపురము
బోలి ద్వారక చెలగ నభ్యుదయ మెసగ. 4-598

ఈ పద్యమింతకు పూర్వమే యుటకించబడినది.

తిరుపతి వేంకటకవులు – 'సకుటుంబమ్ముగ దరలి రామకృష్ణ పురస్సరులై కతిపయదినమ్ములకు ద్వారవతి కరిగి యప్పురమున గల జీర్ణగృహమ్ముల బునరుద్ధరణం బొనర్చి సుఖంబుండిరి' అనిరి. అంతేగాని ఆ ప్రయాణవర్ణన వారెవ్వరు జేయలేదు. అట్టిదే యింకొకటి వింధ్యాద్రి సూర్యగమనము నడ్డగించినపుడు-

నెలవారము నక్షత్ర
మ్మల తిథియోగంబు కరణ మట్టెత్తి వడిం
దెలుఁపగలేక పురోహితుఁ
డిలు నిల్లారకయు తిరిగి యేగిరి భూపా. 10-30

ఈ వర్ణన పై జెప్పిన 10-35 పద్యము వలె మనోజ్ఞముగ నున్నది. అమూలక పదములతో భావస్ఫూర్తి దోపింపజేయుటయును గలదు. 'విశ్వా - మిత్రుడు సొమ్ము జవురుక చనియున్'(7-511). 'జవురుక' అనుటలో విశ్వామిత్రుని వేగిరపాటు,ధనతృష్ణ వ్యక్తమగుచున్నది. సర్పదష్టుండైన పుత్రునకు మందు ద్రాకులిచ్చి వత్తుననగా 'ఇచ్చట నిలిచియున్న బొలతి నిన్నును నూకెదను, జబుకుతో

నికఁ గాకాలు గుణింపకిట్టి కార్యము గనుమా'(7-53) కాకాలు గుణించుటయన ఆలస్యము చేయవద్దని,పనిమానుట కింకొక నెపమాలోచింపవలదనియు నర్థము వచ్చును. ఏది యేమైన 'అతని పడుచుగుఱ్ఱ పనికి' నోవదు కదా!' ప్రాతః కాలమనుటకు కవర కవర చీకటి యనును.

అంబ(1-742),శశికళ(3-530),పూతన(4-540),వర్ణనలు స్వభావోక్తులతో మనోహరముగ గావింపబడినవి. ఇల(1-443,445),ఊర్వశి(4-127), యశోమతి(6-418) వర్ణనలు కవి సమయోచిత యుపమానములతో జెప్పెను. తులసీవిరహ వర్ణన గూడ సమూలకముగ ప్రబంధపు టొరవడితో,మన్మథో పాలంభన,చంద్రోపాలంభనల జేర్చి యావృత్తాంతమొక ప్రబంధము వలె మనోజ్ఞముగ చిత్రించిరి.

శ్రీరాములు గారికి శ్రీనాథునిసీసములపై వాట మెట్లు వచ్చెనో యట్లే కొన్ని విశేషములు వచ్చెను. పుష్పములపట్టికను గాని వృక్షముల పట్టికను గాని సందర్భము వచ్చినపుడెల్ల నిచ్చుట వీరి యనువాదములో గాననగును.

శశికళ పుష్పావచయ సందర్భమున మూలమున 'చమ్పకై రుపశోభితం' (3-17-54) అని యుండ శ్రీరాములుగారు చేర్చిన యమూలకములైన పుష్పములు-

మొల్లలు జాజులు పొగడలు
మల్లెలు సంపంగి పూలు మరి విరజాజుల్. 3-416

భోజన వర్ణన కూడ శ్రీనాథుని కడనే యభ్యసించిరి. శతాక్షిదేవి చేసిన బ్రాహ్మణ సమారాధనమున గోంగూర,అవకాయలు గూడ జేర్చి వారితో గూడ వీరును సంతృప్తిగా నారగించి త్రేన్చిరి.

విశిష్టమైన యనువాదము మూలమునకు అనువాదమే గాక మూలమునకు వ్యాఖ్యానముగాను నుండవలెను. కావున ననువాదకుడు సమర్థుడై యుండవలెను. మూలము నాకళించుకొని ఆపోశన పట్టుదిట్టయై యుండ వలెను. అపుడే అనువాదకుడు మూలకర్త హృదయకవాటము దెఱచి యాతని సందేశమును వెలువరించగలుగును. ప్రతిభ,వ్యుత్పత్తి అభ్యాసము ఈ మూడును బుష్కలముగ

నుండవలెను. ఇంతటి సమర్ధత యున్నదన్న గుండెదిటవు గలిగిననేగాని దేవీభాగవతము వంటి ఉద్గ్రంధము ననువదించుటకు సాహసింపడు.

నన్నయ భారతానువాదము నాటికి అవిరళ జపహోమతత్పరుడు విపుల శబ్దశాసనుడు,సంహితాభ్యాసుడు,బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాననిరతుడు, ఉభయభాషాకావ్యరచనాశోభితుడు,సత్రప్రతిభాభియోగ్యుడు ఈ విశేషణములు నన్నయకు ప్రతిభ,వ్యుత్పత్తి,అభ్యాసమును కావ్య హేతువులు మూడును పుష్కలముగ నున్నవని విశదము చేయుచున్నవి. కావుననే పంచమవేదమైన ఆ మహాభారత కావ్యరచనకు కడంగెను. వీరును శ్రీమదిష్టకామేశ్వరీపాదార్చితులు,త్రింశత్ప్రత్యేక గ్రంథమతిసార విబుధజన కరుణాసంపాదితోభయ,భాషాపరిచిత ప్రచారనిత్యులు చతుశ్శాస్త్రవేత్తలు. అంతేగాక న్యాయసభావాదక నియోగభారవ్యవహారులు, లోకజ్ఞులు,సంగీతసాహిత్యవేత్తలు. కావుననే శ్రీదేవీ భాగవతాంధ్రీకరుణమునకు నడుముకట్టిరి.మహాపురాణములలో దేవీభాగవత మొకటి. దీనిని అయిదు మాసములలో ననువదించిరన్న నెంతటి యాశుకవితాసంపన్నులులో తెలియనగును. వారి కవిత భూర్భువసువరాది లోకములు ముట్టి జాజ్వల్యమై సురుచిత శోభతో ప్రకాశించుచున్నదో చెప్పకచెప్పుచున్నది.

'తదదోషా శబ్దార్థా స గుణావనలంకృతిపునః క్యాపి' – మమ్మటుడు

ఆదోషములు,సుగుణములును,సాలంకారములును అగు శబ్దార్ధములు కావ్యము.

గుణాలంకార సహితౌ శబ్ధార్ధౌ దోషవర్జితా ...
కావ్యం కావ్యవిదోవిదుః – విశ్వనాథుడు

గుణలంకారములతో కూడిన దోషవర్జితములైన శబ్దార్ధములు కావ్యమని పండితులు చెప్పుదురు. ఇట్లు అలంకారికులు కవి ప్రతిభను వెలార్చు అలంకారము లకును ప్రాధాన్యమొసంగిరి. శ్రీరాములు గారును భావావేశముతో నొక విశిష్టమైన అలంకార వైచిత్ర్యమును ప్రదర్శించిరి.*

ఆపారే కావ్యసంసా కవిరేవరే ప్రజాపతిః
యథాస్మై రోచతేవిశ్వం తధేదం పరివర్తతే
శృంగారీచేత్ కవిః కావ్యే జాతం రసమయం జగత్.

శ్రీరామకవి సృజించిన కావ్యజగత్తు శృంగారరసమయము. ఆ రసమయ జగత్తున దేవిని ప్రతిష్ఠించి తళత్త ళత్త ళిత కావ్యముక్తాఫల సౌవర్ణకంఠహారముతో కైసేసెను. అందలి నాయకమణియై దేదీప్యమానమై తేజరిల్లునట్టిది దేవీభాగవతము.

## అధోజ్ఞాపికలు

1. We fail to understand as a Mahapurana D.B. is not recognised as a Mahapurana by some' From point of view of style and contents, it is a full fledged Mahapurana - 3 (P.26).
2. శ్రీమహాభారతాంధ్రీకరణ విమర్శనము – ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, ప్రమాది సంవత్సరము, చైత్రము, సంచిక 1, సంపుటి 2, పు॥ లు 19,20.
3. శృంగారనైషధము – శ్రీనాథుడు, 8–202
4. నన్నయ భారతము – ఆంధ్రవాఙ్మయారంభదశ (ద్వితీయ సంపుటము) డా॥ దివాకర్ల వెంకటావధానిగారు, పు॥లు 522–23.
5. శ్రీ దేవీ భాగవతము, పీఠిక, పు. 7
6. శ్రీదేవీభాగవతము – శ్రీ ములుగు పాపయారాధ్యులవారు ద్వి.భా., పు. 170.
7. 'తిరుపతి కవుల సాహిత్య సమీక్ష', శ్రీ శిష్టా లక్ష్మీకాంత శాస్త్రిగారు. పుట. 16.

★ కవితారీతులు అన్న ప్రకరణములో అలంకారముల గూర్చిన వివరణ కలదు.



## (iii) అల్లూరి వర్ణన

మహాకవి శ్రీ శ్రీరామకవి దేవీభాగవతమున కృత్యాది దేవతాస్మరణాదికమైన పిమ్మట 'నా బాల్యంబున నాకు నానావిధ సౌఖ్యంబులకును నాటపట్టై నన్నులరించిన యల్లూరగ్రహారంబు నభివర్ణించెద'[1] నని దాసువారి అగ్రహారమైన అల్లూరు నభివర్ణించి దేవీభాగవతసౌధప్రాంగణమునకు మంగళతోరణముగ కూర్చిరి.

ఈ యల్లూరి వర్ణన ఒక ఖండకావ్యమని చెప్పవచ్చును. దీనియందు గ్రామప్రకృతి వర్ణన కలదు. ఇట్టి గ్రామప్రకృతి వర్ణనలు పూర్వకావ్యము లందచ్చట చ్చట కలదు కాని గ్రామప్రకృతి వర్ణనయే వస్తువుగ జేసికొని రచించుట యనునది లేదు. దీనికి శ్రీకారము చుట్టినది వీరే.

కవి యనగా మానసతైర్థికుడు. అతడు కవిత నాలంబనముగ చేసి కొని తన చుట్టుపట్టుల నున్న దృశ్యముల వర్ణించుకొనుచు గ్రమముగా అంతరంగిక తీర్థయాత్ర జేయుచు తత్త్వమును జేరబోవును. సౌందర్య పిపాసియైన కవి తన పరిసరముల సౌందర్యము ననుభవములోనికి తెచ్చుకొనుచు నభివర్ణించుటయే గ్రామప్రకృతి వర్ణన (Pastoral Poetry) అనబడును. ఇది మన దేశమునకు క్రొత్తగాదు. భారవి తన కిరాతార్జునీయములో నీ ప్రకృతి వర్ణనమును విశేషించి చేసియున్నాడు. హరి వంశమున నెఱ్ఱన్న గోకులబృందావనాభివర్ణన కావించెను. అట్లే పోతన భాగవతమున దశమస్కంధమున శ్రీబలరామకృష్ణులు గోప బాలురతో సల్పిన బృందావన గ్రామ వన విహారాభి వర్ణనమున నీ ప్రకృతి వర్ణన గలదు. భారతీయ కవులందరు ప్రకృతి వర్ణనమున బద్ధానురాగులయి తమ కావ్యకన్యకల నలంకరించి యుండిరి. ఆ పద్ధతినే శ్రీదాసు శ్రీరాములుగారును అనుసరించిరి. కాని అదియే ప్రధాన వస్తువుగ స్వీకరించి కవిత చెప్పిన వారిలో ప్రథములు శ్రీరాములుగారు. వీరు సహజ పాండితీ పరిశోభితులు.నవనవోన్మేష శాలియైన వీరి దృష్టి 'పాస్టొరల్ పొయిట్రీ' పై ప్రసరించినది. వెంటనే యా కావ్య ప్రక్రియను తమ కవితా సామ్రాజ్యమున చేర్చికొనిరి. కవితాప్రస్థానమున నింకొక మెట్టుపైకెగసిరి.

19వ శతాబ్దము నాటికి ఆంగ్లేయ సాహిత్య ప్రభావము మన ఆంధ్ర సాహిత్యముపై పూర్తిగ నెలకొన్నది. దాని ననుసరించి వెలువడినవే ఖండ

కావ్యములు,భావగీతములు మొదలైనవి. పరివర్తన (రినైజాన్స్) ఫలితముగ ఆంగ్ల సాహిత్యములో గూడ వివిధములైన సాహిత్యప్రక్రియ లుద్భవించినవి. ఓడ్(ode), ఎలిజి(Elegy), బ్యాలాడ్(Ballad), సొనెట్ (Sonnet) మొదలైనవి. 'పాస్టొరల్ పొయిట్రీ' లక్షణముల గూర్చి 'ది న్యూ యూనివర్సెల్ ఎన్సైక్లోపిడియా(The New Universal Encyclopaodia, vo.1. 8.p.6263) లో నిట్లు కలదు.– 'సంప్రదాయ పద్ధతిలో గాని, ఆదర్శపద్ధతిలో గాని రూపొందించిన ఆలకాపరుల జీవితమిందు వర్ణింపబడును. కాల్పనిక వాతావరణమున గాని, రూపకప్రక్రియలో గాని యిట్టి రచన కొనసాగినచో అట్టి కవిత్వమును గ్రామీణ సాహిత్యముగ పేర్కొనవచ్చును.[2]

'ఎ బేక్ గ్రౌండ్ టు ది స్టడి ఆఫ్ ఇంగ్లీషు లిటరేచర్' (A back ground to the study of English literature) అన్న గ్రంథములో బి.ప్రసాద్గారు ఇట్లు చెప్పిరి. – 'పునరుజ్జీవన కాలమున ఆంగ్ల సాహిత్యములో కరుణ రసాత్మకమైన ఒక నూతన ప్రక్రియ ప్రవేశపెట్టబడినది. కవియే పసులకాపరిగ భావించుకొని ఆత్మాశ్రయ పద్ధతిని రచించును. గ్రామీణ జీవితమును వస్తువుగా తీసికొని చిత్రించును. కవి యేమి చెప్పదలచినను వర్ణింప దలచినను తదనుగుణమైన పదప్రయోగము ఉండవలెను.'[3]

దీనిని పుట్టుక గ్రీకుదేశము. తరువాత లాటిన్ కవి వర్జిల్ దీనిని అనువదించెను. ఈ వర్ణన ఈ కవి వ్రాసిన 'ఈక్లోగ్సు' (Eclogues) జార్జిక్స్ గ్రంథములో గలదు. తరువాత చాలకాలము వఱకు సాహిత్య ములో నిది మఱుగు పడిపోయినది. ఇది ఇటలీలో 15,16 శతాబ్దములలో పునరుద్భవించినది. యూరపుదేశమంతటట దీనినే యనుకరించిరి. స్పెన్సర్ యొక్క 'షెపర్డ్స్ కాలెన్డర్' (Shepherd's Calender), తో నాంగ్లదేశమున నిది వేరూనినది. మిల్టను కవియొక్క లిసిడాస్(Lycidas)లోను, స్పెన్సరు కవియొక్క ఏపిథాలెమిన్ (Epethalamin), ఎస్ట్రోఫిల్ (Astrophel), ప్రొథాలెమిన్ (Prothalamin) లలోను సర్ ఫిలిప్ సిడ్నీ నైట్ మరణము గూర్చి ఆస్ట్రోఫిల్ అనే శోకకావ్యములోను (A pastoral eclogue on the death of Sir Philip Sydney Knight)లోను, మేత్యూ ఆర్నాల్డు (Mathew Arnold) యొక్క 'దిస్కాలర్ జిప్సీ' (The Scholar Gypsy), థిరసిస్ (Thyrsis) లోను గ్రామీణ ప్రకృతి వర్ణన కలదు.

శ్రీ శ్రీరామకవికి ఆంగ్లభాషతో విశేషమగు పరిచయముండుటచే వారవి చదివి యుండవచ్చును.ఆకాలమున నాంగ్లదేశమున నిది మిక్కిలి ప్రచారములో గలదు. క్రొత్తదనముపై 'మోజు' స్వగ్రామముపై మమకారముండుటచే ఈ కావ్యారంభమున నిది ఇచ్చట వ్రాసిరి. ఈ యల్లూరి వర్ణన యొక ఖండకావ్యమని చెప్పవచ్చును. దీనిని దేవీభాగవతము నుండి వేర్పరచినను సందర్భము పోదు. ఈ యల్లూరి వర్ణన యందు గ్రామదేవత యలుగులుమ్మ వర్ణన, ఆషాఢ మార్గశీర్ష శిశిరముల వర్ణన,గొల్ల గొర్రెతల వర్ణన, కర్షకుల వర్ణన,పశు పక్ష్యాదుల వర్ణన,క్షేత్రవర్ణన, పునాస వ్యవధి గడిచిపోయినదని కాపుల నడ్డగించి కలహంబు పెట్టుకొను కోమటుల వర్ణన,స్మార్తవితంతు వర్ణన, గృహమేధుల వర్ణన,వైదిక శిఖామణుల వర్ణనలు గలవు. కోతికొమ్మచ్చుల వంటి ఆటలను గూడ వర్ణించిరి. అడవిమల్లెలు, కలువలు,మొదలగు పెక్కు పూవులను పేర్కొనిరి. ఈ వర్ణనలలో కప్పలు, పందులు మొదలగునవి కూడ చోటు చేసుకొనినవి. ఇందు గ్రామము నందు గల అన్నివర్ణముల వారిని కన్నులకు గట్టినట్లు వర్ణించిరి. తెలుగుభాషలో నీ గ్రామవర్ణనకు (pastoral poetry) వీరు తొలిపల్కు పలికిరనవచ్చును. ఈ ఒరవడి ననుసరించి వెలువడినవి కృషీవలుడు, గుడిగంటలు మొదలైనవి.

'వరిధాన్యంబుల నూర్చి రాసిచేసి కొల్పించి సంచుల బోసి కట్టి..... పాంథ వైదికశిఖామణులునుం గల్గి యత్యంత సౌఖ్యాస్పదంబయిన నా బాల్యదశ ననేక విధంబు లనుభవించిన పల్లెటూరగు అల్లూరగ్రహారంబు స్మరింపక నామనంబ న్యంబు గ్రహింపనేరదు'. ఇచట నొక పెద్ద వచనము కలదు. దీనిని ముక్త పద గ్రస్తములో వ్రాయుట యొక చమత్కారము. పల్లెపట్టులందలి యొక గొల్లవాని నెంత సహజసుందరముగ స్వభావోక్తిగ వర్ణించిరో యీ పద్యమున కాననగును.

ప్రాఁత గొంగడి వీపుపై గప్పి బుజమున
గొంకికర్రను మోచి కొంకినడచు
నుచ్చుఁబ్రాతల పిండుగ్రుచ్చి మున్నొలగట్టి
మఱ్ఱాకు పొత్తి వేమారు మడచు
కదలిపారెడి గొఱ్ఱె గమి చేలఁబడకుండ
తాసె తాసేయటంచు దగిలివఱచు

తోడేలు బొఁడగాంచి జాడనె చేయెత్తి
నిక్కిట్రుహోయని కుక్క బిలచు

ఆలు తలనిడికొని వచ్చు నట్టియటిక
నున్న చల్లయుఁ దమిద కూడుప్పుగల్లు
మెల్లగా మ్రింగు గొల్లని పెంచుతల్లి
పగిది దనరారు నల్లూరు పల్లెటూరు

స్పెన్సరు యొక్క షెఫర్డ్సు కాలెండర్ (Shepherd's Calender) లోని కొన్ని ఛాయలు లీలగా దీనియందు కనబడుచున్నవి.

రవికాంతులు తేజరిల్లెడి యొక వేసవివేళ గొర్రెలకాపరి తన గొర్రెల మందను తోలుకొని పోవుచున్నాడు. ఆ గొర్రెలు ఆ పశుశాలయందే చాలకాలముగ నుండుటచే బలహీనములై పోయినవి. వానికి కాళ్లు కుదిపడి నిలువలేకున్నవి. ఆ గొల్లవాడు గూడ పాలిపోయి బలహీనముగ, ఆ గొర్రెలకు ప్రతిరూపముగ నున్నాడు. ఏదియో కష్టములోనో, ప్రేమలోనో పడినట్లున్నాడు. పిల్లనగ్రోవిని ఊదు కొనుచు,రాగమును పాడుకొనుచు సొమ్మసిల్లిపోవుచున్న మందలను కొండదరికి తోలుకొని పోవుచున్నాడు. అవి మేయుచుండ తనచే రచయితములైన భావగీతములను మురళిపై మ్రోగించుచు తన బాధను వెళ్ళబోసికొనుచున్నాడు'.[4]

శ్రీ శ్రీరాములు గారి తరువాత ఈగ్రామీణ ప్రకృతి వర్ణనను చక్కగ రచించిన వారు శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారు, శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు గారు,పింగళి లక్ష్మీకాంతం గారలు. పై భావన కనుగుణముగ వ్రాయబడినది దువ్వూరి రామిరెడ్డి గారి ఖండకావ్యమందలి 112వ పద్యము.

గోసరధూళిధూసరిత గోపకుమారులుఁ గాపు పిల్లలున్
మూఁపునఁగట్టలుం జలిదిబోనపుదుత్తలు చంకలోనఁ బె
న్మోపెడుదూడ వల్పు లిడి మోహనవేణురచనంబు సేయుచున్
మాపటి వేళగాఁ బసుల మందలు దోడ్కొని వచ్చి రిండ్లకున్.

పచ్చని పైరుతో కళకళలాడు పల్లెపట్టులను కర్షకవైభవమును ఈ 'పాస్టోరల్ పొయట్సు' ఎంతరమ్యముగా అద్దములో వలె చూపెట్టిరో ఈ క్రింద ఉదహరించిన మేత్యూ ఆర్నాల్డు వ్రాసిన స్కాలర్ జిప్సిలోని పద్యములలో కాననగును.

ఏపుగా నెదిగిన పొలములో నొక మారుమూల చలిదిబోనపుదుత్తలను అంగరభాను గంపను నిడి ప్రొద్దంతయు కోయుచు, కోసినది కట్టలు కట్టుచు, పనిచేసి తిరిగి మధ్యాహ్నమునకు దాచుకొన్న చల్దియన్నమును తినుటకు వచ్చును. అచ్చట కూర్చుండి నిరీక్షించుచుండ దూరముగ గాలివాటముగ గొఱ్ఱెల అరుపులు, కోతకోయువారి పాటలు వినవచ్చుచున్నవి. తాను కూర్చుండియున్న స్థలము చాటుగనున్నను సగముకోసిన వరిపొలము నుండి యా కోత కోయు రైతుల కోలాహలము వినవచ్చుచునే యున్నది. ప్రొద్దుపోవువరకు తానచ్చటనే యుందునని యనుకొనెను.[5]

పొలమునకేగి నాటుపువుబోడులు గొంతుక లెత్తి తుమ్మెదా
కలకల నవ్వుతాయనుచుఁ గామమపుట్టగ గర్వువచ్చెనం
చలరఁగ బాడఁగా వినుచు ........... .... – దేవీ.భా., పు 20.

పొలములో గొంతెత్తి పొలిపొలియోయంచు
వరికుప్ప నూర్పు పాలెరులు గల్గి – దేవీ భా., పు.16

కలకల నవ్వుచుం గలుపుగంటల దీయుచుఁ బాటపాడుచుం
బొలములఁజుక్కగంపటులఁబోడిమిఁజూపెడి పల్లెటూరి తొ
య్యలుల నిసర్గరమ్య దరహాసవిలోక విచేష్టలందు ని
ష్కలుషపు గ్రామ్య జీవనపు గమ్మదనంబులు లేగుబుల్కొనున్.
– ఖండకావ్యము – వానాకాలపు పల్లె జీవితము –
దువ్వూరి రామిరెడ్డి , పు. 87.

ఇట్లు వీరందరు నిసర్గరమ్యదరహాసములీను కర్షకుని నిష్కలుష గ్రామ్య జీవనమును వర్ణించిరి. అల్లూరులోని తన యనుభవములను శ్రీరాములుగారు ఏవిధముగ వ్రాసిరో దాదాపు అదేవిధముగ 'స్పెన్సరు షెపర్డ్సు కేలండర్ – డిసెంబరు' (Shepherds Calender - Decenber) లో తన యనుభవములను చిత్రించెను. 'నా యౌవనమున నేనొక విహంగమువలె కలకలనవ్వుచు నిక్కడ నక్కడ ననక యంతట కలయ గ్రుమ్మరితిని. బాధ్యతావిరహితుడ నగుటచే అంతులేని వాంఛలతో అలమటించిపోయి ప్రమాదములను భయములను

ఎఱుగక స్వేచ్ఛగ విహరించితిని. తోడేళ్ళ వలన కలుగు ఆపదలకు గూడ భీతికలుగలేదు. దారికానని చిట్టడవి పుంతల కలయ గ్రుమ్మరితిని. క్రిష్టమసు పండుగ నాటి వేడుక కొఱకు కాయలు,పళ్ళు ఏరుకొని వచ్చెడివాడను. భీతహరిణపోతములను పట్టుకొని గంతులిడెడివాడను. అమాయకపు కుందేళ్ళను బట్టి యలమువరకు వెంటాడెడివాడను. వార్ధక్యపు నీడ పై బడనంతవరకు నా యౌవనము శాశ్వతమనియె దలంచితిని'.

శ్రీరాములుగా రెట్లు తన నెయ్యుర గూడి యాడిరో చెప్పుచున్నారు-

ప్రొద్దుటిపూట చిట్టడవిపుంతల నెయ్యురగూడి క్రమ్మరన్
గ్రద్దరి సుద్దులుం జిలిపిగంతులు గొంతుకయెత్తి యెద్దియో
పద్దెము బాడుచున్ నగుట బాపటసాకులు నూటి కజ్జులున్
బొద్ది చివుళ్ళనుం దునుము పోడిమి నేడును వీడదాత్మలో. - పు. 20

పచ్చలబోలు పర్ణములపై పయినిండుగ గాచి గొల్గు పం
డ్లొచ్చెములేక చిట్టడవి నొక్క మొగిన్ బగడాలు నిండుగా
గ్రుచ్చినయట్ల తోప నదిగో యని యెచ్చటలేని సంతసం
బచ్చుపడంగ గోసిన సుఖాతిశయంబు గణింపశక్యమే. పు. 19

అల్లూరి వర్ణన యందలి పద్యములన్నియు మనోజ్ఞములు. 'పగిది నలరారు నల్లూరు పల్లెటూరు' అన్న శీర్షికతో వారు సీసపద్యములు కలవు. వర్షఋతు వర్ణన యొక కొలికి పూసవంటిది.

ఎలయెండ చెట్లసందులనుండి గోడల
దవిలి తానిలువుటద్దములు గాఁగ
గొనగొన జను నింద్రగోప సంఘాతంబు
పందిళ్ళలో జిన్ని పగడములుగ
చూరుపట్టియలఁ బిచ్చుకదంపతుల చాలు
చెక్కితేర్చిన యట్టి చిత్రములుగ
దూలాల గూళ్ళసందుల నుండి వెడలి మ్రో
గెడి తుమ్మెదల మ్రోఁత గీతములుగ.

కెరలి వాకిళ్ళ తూనీగతెరలు మూగి
నెర బుటేదారు గెంబట్టుపొరపసందు
సన్న యుల్లడగాగ నాషాడలక్ష్మి
పగిది దనరారు నల్లూరు పల్లెటూరు. పు. 16

ఇట్లె కప్పలు, ఈలకోడుల రొదతో బడబడమ్రోయు నుర్ములతో ఫెళ్ళునపడు పిడుగులతో కూడిన తొలకరివానలను, మల్లెవాసనలతో గుమాయించు వసంత మును డెందమున కానందంబొసంగునట్లు వర్ణించిరి.

పచ్చికపట్ల మంచుబడి ప్రాతరనేహర మందు బచ్చలన్
గ్రుచ్చిన పేట ముత్తెములు కూర్చిన రీతి వహింపనెంతయున్
మచ్చిత సాలెపుర్వు లిది మాదని నిక్కుచు జిల్గువల్వలన్
హెచ్చుగ నచ్చటం బఱచిరే యని యెంచగ నొప్పుచోటులన్
రచ్చలు సేసితిన్ సుఖతరంబుగ చిన్నలగూడి వేడుకన్. 20

ఈ పై పద్యము ధూర్జటి కాళహస్తీశ్వర మాహాత్మ్యమందలి ఈ క్రింది పద్యమును దలపింపజేయును–

ప్రాతఃకాల తుషారసీకరచయప్రాప్తిన్ లసన్మౌక్తి కో
పేతాగారములట్లు చెల్వొసగు దద్బిందుచ్ఛటాజాత ఖ
ద్యోతచ్ఛాయలఁ గొంతసేపు బహురత్నో దీర్ఘ గేహంబులై
లూతాకల్పిత తంతుసద్మములు దాల్చుంజెప్పఁజిత్రంబులై.
ఆ. 2, ప. 961.

ప్రాతరనేహరముల పచ్చికపట్ల మంచుబడి వానిపై సూర్యకిరణములు ప్రసరింప తన్మూలముగ నేర్పడిన యందము నొక కవి సద్మములుగను, నింకొకరు జిల్గు వల్వలుగను చిత్రముగ చిత్రించిరి. కనుకనే యిందలి పద్యముల కక్షరలక్ష లీయవచ్చునని శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారనిరి.

అల్లూరగ్రహారము నందలి తీర్చిదిద్దిన వీధులవలె నిందలి సుదీర్ఘమైన వచన మొక చక్కని ముక్తపదగ్రస్తముతో తీర్చిదిద్దబడినది. ఈ యగ్రహారము

నందలి యగ్రవర్ణముల వారి నుండి అన్ని వర్ణముల వారి దినచర్య ఒక వేట వర్ణన, ఒక చిన్న రైతు కుటుంబవర్ణన,పాంథవైదిక శిఖామణి వర్ణన గూడ కలవు.

'మా యింట భోజనంబు సేకూరదని యెన్ని విధంబుల జెప్పిన వినక నానా ప్రకారంబులం బ్రార్థింప నెట్టకేని గృహమేధి యంగీకరించినతోడనే దమ కత్తెసరని మెలమెల్లగా జారవిడిచి చెప్పి స్నానంబుచేసిఁ మడిగట్టు కొని సంధ్యా వందనాది కృత్యంబులు నిర్వర్తించి దేవతార్చన చేసి పోయి మీద నున్న తప్పెల ద్రింపుకొని పచ్చడి మజ్జిగలతో గడుపునిండ సాపడియెద్దే నరుగుమీదం బండుకొని గుఱ్ఱువెట్టు పాంథవైదిక శిఖామణులా యగ్రహారమునం దింకను నచ్చుటచ్చుట గోచరింతురు. ఇట్లు మధురప్రేక్షణీయమైన దృశ్యముల సాక్షాత్కారములతో స్వభావోక్తితో నీ వర్ణన నిండి గ్రామప్రకృతి వర్ణన (pastoral poetry) వలె భాసించుచున్నది.

ఇట్లు క్రొత్త సాహిత్య ప్రక్రియల కాంక్షించు నర్వాచీన యువకులకు మార్గ దర్శకులై యుండిరి. ఇందలి పద్యములు ఒక్కొక్కటి ఒక్కొక్క సానదీర్చిన అనర్ఘ మణి. ఈ మణిహారముతో కవి తన జన్మభూమికి కాన్క వెట్టి తన హృదయము నందలి దేశభక్తి నంతయు మనోజ్ఞముగ వెలువరించిరి.

## అధోజ్ఞాపికలు

1. దేవీభాగవతము, పీఠిక – ద్వితీయ ముద్రణము. పు. 15.

2. (Pastoral - Literary term denoting poery. Romance or Drama setting forth the Shepherd's life in a more or less conventionalised and idealised fashion.

3. During the Rennaissance a new kind of Elegy was introduced in English poetry. It followed conventionally which the poet represented himself as a Shepherd, The setting was borrowed from rustic life and what evar the poet had to say or describe was to be phrased accordingly, P. 91.

4. All the sun shine day, as did he fall, led forth his flock, that had been long pent. So faynt they wosce, and fuble in the folde. That now vennethes their fute could then uphold. All as the shupe, such was the shepherds work. For pale and wanne he was (alas the while)...

* * * May some he loved or else some care he tooke, well cowth he tune his pipe and frame his stile. The to a hill his faynting flocks he ledde. And thus him playnd, the while his shepe there feolde - Spencer's Calender - 9.12

5 Here, where the rapper was at work late. In this high feild's dark corner, where he leaves His coat, his basket, and his earthen cruise and in the Sun all morning binds and sheeves. Then here, at noon, comes back, his stores to use. Here will I mit and wait-

while to my ear from uplands far away
The bleating of the folded flocks is borne
With distant cries of reapers in the corn
All the live murmur of Summer's day
Scrund's is this nook o'er the high, half reap'd filed
And here till Sun down shepherd : will I be

- Mathew Arnold's Scholar Gipsy. p. 230

whilomien youth, when flowed my joyful spring,
Like swallow swift I wandered here and there
For heat of heedisse bust me so did sting
That I of doubted danger had no feare
I went the wastefull woodes and forest wyde
I wont to raunge amydde the mazie thickette
And gather nuttes to make my Christmas game
And joyed oft to chace the trembling pricket
Or hunt the herlesse hare, till shee were tane
What wreaked I of wintrye ages waste
Tho deemed I my spring would ever laste - P. 464



శ్రీపార్వతీ సమేత సోమేశ్వర ఆలయం, అల్లూరు

# 3. పద్యసుమములు

## (i) తెలుగునాడు

శ్రీదాసు శ్రీరామకవి గారి దేవీభాగవతము నకు తెలుగునాటనెంత ప్రశస్తి కలదో 'తెలుగునాడు' నకును అంతటి ప్రశస్తి కలదు. తెలుగుసాహిత్యముతో పరిచయమున్న ప్రతియొక్కరికి కవి పేరు తెలియకపోయినను తెనుగునాడు లోని పద్యములలో నేయొకటి రెండైన తెలియకయుండదు. ఒక అర్ధశతాబ్దము వెనుక తెనుగునాట ప్రతి యింట నలుగురు కూర్చొని యున్నప్పుడును, రచ్చ బండల గోష్ఠులలోను నిందలి పద్యములు చెప్పుకొని యందలి హాస్యమును విని యానందించెడివారు.

శ్రీరామకవి రచనలలో హాస్యము అంతర్లీనమై యా రచనకు స్వారస్యము చేకూర్చుచున్నది. ఈ తెనుగువాడు పూర్తిగ హాస్యరస ప్రధానమైన ఖండిక. పాశ్చాత్య సాహిత్యముతో పోల్చిన హాస్యరసప్రధానములైన కావ్యములు మన భారతీయ సాహిత్యములో తక్కువేయని చెప్పవచ్చును.

ఆనాటి బ్రాహ్మణసమాజములోని వివిధ శాఖలలో గల స్త్రీ పురుషులను సహజసుందరముగ స్వభావోక్తులతో నిందు వర్ణించిరి. ఆ వర్ణనలో హాస్యము, సున్నితమైన మందలింపు గూడ అంతర్లీనముగ నున్నవి. సుప్రసిద్ధ ఆంగ్లరచయితలు 'ఎడిసన్' 'స్టీవ్'ల 'స్పెక్టేటర్' 'టాట్లర్' పత్రికలలో వలె దీనియందును అధిక్షేపణ (satire) కలదు. 'ఎ బేక్ గ్రౌండ్ టు ది స్టడీ ఆఫ్ ఇంగ్లీషు లిటరేచర్' అన్న గ్రంథములో శ్రీ బి.ప్రసాదుగారు 'సైటెర్' ను ఇట్లు నిర్వచించిరి – 'ఇది ఒక వ్యక్తిని గాని లేక సమూహమును గాని సాంఘికదురాచారములను గాని, లోపములను గాని ప్రతిఘటించును. ఇది హేళన చేయుటకే గాని నిందించుటకు గాని దూషించుటకు గాని యుద్దేశింపబడినది గాదు. ఇది దోషమును ఏవగించునే గాని దోషిని కాదు. కొంచెము వేళాకోళము పట్టించును గాని బాధించదు. ఈ అమోఘమైన అవహేళన ఒక బాణమువలె దూసికొనిపోయి ఠపీమని లక్ష్యమునకు తగులును.[1] కాబట్టి ఇది బ్రాహ్మణసమా జముపై ఒక అధిక్షేపణ (satire) అని చెప్పవచ్చును. మనదేశములో బ్రాహ్మణ జాతిలోఁగల వివిధ శాఖలవారు

అనవసరముగఁ గల్పించుకొను వివాదాలు తగ్గింప వలెనని నాయుద్దేశము' అని కవి తన యొక్క ఉద్దేశమును ప్రారంభముననె స్పష్టముగ చెప్పి యుండిరి. అయినను నాటికి నేటికిని ఆయా శాఖలను అవహేళన చేసియున్నారని చాలమంది దురూహ చెందుచున్నారు. 1899 ఆక్టోబరు సత్యసంవర్ధిని యను పత్రిక ఈ గ్రంథము నిట్లు తీవ్రముగ విమర్శించినది – 'ఇటీవల మేము విజయవాడలోని వాణిప్రెస్ వారిచే ప్రచురింపబడుచున్న తెనుగునాడు ప్రతిని చూచుట తటస్థించినది. ఆ పుస్తకమునందు కొన్ని చోట్ల కొందరు బ్రాహ్మణశాఖల వారి లోపములను అదొక పద్ధతిలో చిత్రించిరి. వాని నుదహరించుటకు స్థలము చాలదు. అది ఆయా శాఖాభేదముల నింకను పెంచును. ఇంకను లోతుగ పరిశీలించిన నిందు కొన్ని శాఖలవారిని కించపఱచినట్లును కాననగును. ఇకముందు ఇట్టి పుస్తకములకు ప్రోత్సాహము లభించదని సత్యసంవర్ధని ఆశించు చున్నది'.[2] ఇట్లపోహపడు దురనియే కవి విస్పష్టముగ నిట్లు చెప్పిరి. 'ఇందొక తెగను గురించి వ్రాసిన వర్ణనలు మఱొక తెగవారికి సంబంధించు ననియు నియ్యది నిష్పక్షపాతబుద్ధితో వ్రాయబడి యుండలేదనియుఁ గొందఱందురేమో కవిత్వపువస చెడకుండ సాధ్యమైనంత నిష్పక్షపాతబుద్ధితో నా శక్తి కొలఁది వర్ణించి యుంటినే గాని వేరొండు గాదని చెప్పగలను'. ఆ బాధాకరమగు చమత్కృతితో స్వాభావికవర్ణనలతో ఈ బ్రాహ్మణప్రశంస ద్వార ఆంధ్ర బ్రాహ్మణులకు తమ లక్ష్యమును గుర్తింపజేసిరి.

"శ్రీనాథుని 'వీథినాటకము' ననుసరించి కొంతవరకు వ్రాయబడి నప్పటికి దానికిని తెనుగువాడునకును అనేక విషయములలో భేదములున్నటుల చదువరుల కందరకు విశదముకాఁగలదు" అని వారు పీఠికలో చెప్పిరి. శ్రీనాథుని క్రీడాభి రామములో సూత్రధారుని ప్రవేశము కలదు. ఇందులో సూత్రధారుని ప్రసక్తియే లేదు. వీథి యందు కల్పితకథ యుండును. ధూర్తవిటుడు నాయకుడు. శృంగారము ప్రధానరసము. ఇది ఏకాంకము. ముఖ నిర్వహణసంధు లుండును. దయ, హాస్యము వర్ణింపబడును శ్రీనాథుని 'క్రీడాభిరామము'న మంచనశర్మ, కామమంజరి కలియుట, అనునది యితివృత్తము. కాని 'తెనుగువాడు' లో కథ యనునది లేదు. కావుననే 'ఇది నవవీథి. దీనికి ననేక రసంబులనేకనాయకుల్' అని కవిగారు వాక్రుచ్చిరి. ఇందులో క్రీడాభిరామ మందలి అసభ్యమైన శృంగారము వంటిది లేదు. ఇది కేవలము హాస్యరస ప్రధానమైనది.

వైదికులు, నియోగులు, స్మార్తులు,మాధ్వులు,వైష్ణవులు,వైశ్యులు,కరణకమ్మలు, యాజ్ఞవల్క్యులు, గోలకొండ వ్యాపారులు,ద్రావిడులు ఇందు వర్ణింపబడి యున్నారు. చివర సంక్రాంతి,అట్లతద్దె,దీపావళి,వినాయకచవితి,సంవత్సరాది యనుకొన్ని పండుగలు,అత్తాకోడండ్రు,వివాహములు,ముక్కుపొడుము,పెండ్లాము మీద నింటి పెత్తన ముంచినవాని సౌఖ్యము మొదలగు విషయముల గూర్చి యారుపద్యములు గలవు. బహుశః యివి కవిగారు అవధానములందో మఱి యేయితర సందర్భముల లోనో చెప్పి యుందురు. అవి జారిపోకుండ యిందు పొందు పఱచియుందురు.

ఈ బ్రాహ్మణ ప్రశంసలో బ్రాహ్మణశాఖలను వర్ణించుటలో వీరొక విశిష్ట క్రమపద్ధతి నవలంభించిరి. మొదట ఆశాఖ యొక్క గొప్పతనము చెప్పుట,తరువాత వారి కట్టుబాట్ల గూర్చి, పిమ్మట వారి హావభావములు 'మాటామంతి' ఆచార వ్యవహారములు చిత్రించుట అటుపిమ్మట వారి గృహిణుల వర్ణించుట గలవు. వైదికుల వర్ణనలో –

వచనములందు మార్దవము వస్త్రములన్మడి వంటకంబులన్
బచనముసేయు చేతిపరిపాటి శ్రుతిస్మృతిచోదితక్రియా
నిచయమునందు భక్తి గృహిణిన్ సుఖపెట్టుట వాసవాటికా
శుచితము వైదికోత్తముల సొమ్మనవచ్చున సంశయంబుగన్.

చదివిరా! ఋగ్యజుస్సామముల్ భూర్భువ
స్సువరాది లోకముల్ స్తుతులు ముట్టు
మెదపిరా! పెదవిగుంఫిత మృదుస్తుతి పాఠ
సల్లాపముల నల్లరాళ్ళు గఱఁగు
తలచిరా ! క్షేత్రయాత్రలు సేతు కాశికా
గంగోత్తరలకు మూఁడంగ లీడు
నిలిచిరా ! సత్కర్మనియతిన్మహాధ్వర
కాండంబు పౌండరీకంబు దట్టు.

పఱచిరా ! పంచపాళి దర్భాసనములు
ముక్కు మూఁతల సరిపుత్తు రొక్కజాము
భళిర! యీపాటి పరిపాటి దెలుఁగునాఁటి
వైదికుని తోటి యేమేటి వచ్చుసాటి

శమము దమంబు శౌచమును సత్యము శ్రౌతము స్మార్తమున్ మృదు
త్వము సరసత్వ మార్యజనవందనతృప్తి విగర్హితక్రియా
విముఖత యప్రమాదము వివేకము నీశ్వరభక్తి నిశ్చల
త్వము నిరపాయజీవనము వైదికవృత్తిని మించనున్నదే. ప. 3

ఈ మొదటి మూడు పద్యములతో వారికి సాటివచ్చు మేటిలేదని పొగడి అందలమెక్కించి -

తాతలనాఁటి సాలువలు దాపటివంక బుజాలపైఁ గడుం
బ్రాఁతదనానఁ జిన్గులగు చాటగునంచొక యింత వింతగా
మూఁత మడంచివైచి మొగముల్తె గఁ బూసిన బూదిజాఁఱగాఁ
జేతుల ఝూరులొప్పధనిఁ జేరఁగ వత్తురు వైదికోత్తముల్. ప. 5.

మోకాళ్ళుదాఁటని మొరటు గావంచాల
నందియందని గోఁచి యంటదోసి
పిల్లగాలికిఁ దూఁగి యల్లాడు చిన్న నే
రేడుగాయవలె జుట్టు ముడియవైచి
నడునెత్తి పెడచెంప లెడనెడఁ గాన్పింపఁ
దలనొక్క యంగవస్త్రంబుఁజుట్టి
గీరు గంధపురేఖ దీరైన నొసటిపై
పసపక్షతలచుక్క మెసఁగ నునిచి.

బెదరిచూచుచుఁ బెఱవారి కొదిగికొనుచు
జందెపోగులు చిక్కువఁజమిరికొనుచు
నోట నొక బుక్కుముమ్మాఱు నొక్కియనుచు
శ్రోత్రియక్షితిదేవతాసుతుడు వెడలు. ప. 9.

మొదలగు పద్యములతో దభీమని నేలకూలవేసి యొక సున్నితమైన చమత్కారమును సృజించిరి. మొదటి మూడుపాదములు ఓదొంతి వరుసపెట్టి కూర్చిన మాటలతో వారిని పైకెత్తి గభాలున నాలుగవ పాదములో ఒక చిన్నమాటతో ఆ దొంతిని తలక్రిందులు చేయుట వీరి పద్యములలో కాననగు హాస్యము.

నీళ్ళకు నిట్టితోళ్ళకును నేతికరుళ్ళకు దొడ్డయుత్తరేణి
వేళ్ళకు దర్భముళ్ళకును వేదపునోళ్ళకు సన్నకుట్టు వి
స్తళ్ళకు రాగిబిళ్ల కనిశంబును మళ్లకు పప్పుఁగూర ప
చ్ఛళ్లకు రాగిబిళ్లకును సంతసమందుదు రాంధ్రవైదికుల్. ప. 4

ఇందులో 'రాగిబిళ్లకును సంతసమందుదురు' అన్న పదము వారి 'దర్జా' ను కూలద్రోయుచున్నది. వీరి హాస్యవర్ణనలో మరియొక విశేషము పాత్రాను గుణమైన ఒక వాతావరణము సృష్టించి యందాపాత్ర యొక్క హావభావచేష్టలను వర్ణించుట.

లేవరు లెండులెండనిన లేచినవారయినం దటాలునం
బోవరు పోవుచున్ నిలిచిపోదుము పోదుము త్రోయకుండటం
చీవరుసందు గేస్తు నలయింతురు పెండిలిలో సదస్య సం
భావననాఁడు చూడవలె బాపనసాముల సాములన్నియున్. ప. 10

దీనిని గూర్చి శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగా రిట్లనిరి.[3] కుమాళ్లపెళ్లిళ్ల సదస్యంలో అనుభూతమైన విషయాన్ని ఈ పద్యంలో చక్కగా చిత్రించారు కవిగారు. ఎందరు కవులు సదస్యాలు (చేయకపోయినా) చూసి వుండరు? ఒక్కరేనా యిట్టి పద్యాన్ని వ్రాయగలిగినారా? దీన్ని బట్టే నేను ఈయన్ని అపర శ్రీనాధుడుగా భావిస్తాను'.

అస్సే చూస్సివషే వొషే చెవుడషే అష్లాగషే యేమిషే
విస్సావఝులవారి బుట్టినష యా విస్సాయకిస్సారుషే
విస్సం డెంతటివాఁడె యేళ్లుపదిషే వెయ్యేళ్లకీడేషుమా
ఓస్సె బుట్టికి యీడషే వొయిషుకేముంచుందిలే మంచి వొ
ర్చెస్సే యందురు శ్రోత్రియోత్తమపదస్త్రీలాంధ్రదేశంబునన్. ప. 16

ఈ పద్యములో శ్రోత్రియోత్తమ పదస్త్రీలు 'ష' కార యాసతో సంభాషించు విధానము తెలుపుటయే గాక బాల్యవివాహముల పట్ల అవహేళన గూడ వ్యక్తము చేయుచున్నారు.

వసుధ నియోగిబాలికను వైదికబాలున కిచ్చి చేయగా
బసనది యిట్టునట్టనిన బాగషు 'నిష్షను' మంచు నత్త య

బ్బెసమొనరింప నొక్కతఱి పీషష? పెష్పష? మామగారికిన్
మసలక 'పెష్ను పెష్ను' మనుమాషలె పల్కెనషంద్రుగష్షిగన్. ప. 18.

అని వారి చాదస్తమును వెక్కిరించిరి.

ఉదయించుచున్న సూర్యునివంటి గుండ్రని
ముతక కుంకుమబొట్టు మొగమునిండ
కొయ్యకరాటానఁగాని వ్రేలమెదపిరా
చిన నూనె కాటుక కనులనిండ
లట్టిట్టు గదలాడునట్టి మేల్ముత్యాల
ముక్కుపోగొకప్రక్క మూతినిండ
గోటంచుతో బొద్దుకుట్టు గుట్టిన గట్టి
పైఠిణీ మోచేతిపట్ల నిండ.

మాలనూలును చీరెల సాలినేఁత
మూరగలిగినదళముగాఁ బుంజమిడిన
మేలికమ్మె సొగసుచీరె మేనునిండఁ
బ్రియుఁ గదియుఁ దెల్గునాఁటి శ్రోత్రియవధూటి. ప. 15.

కోడికూయఁగ మేలుకొని తలవాకిలి
పై పాచిజిమ్మికలాపిఁజల్లి
దడదడగా దంతధావనం బొనరించి
యిల్లల్కి ముగ్గిడి యెనుముఁబిదికి
పొరుగింటికేగి నిప్పును దెచ్చి రాజేసి
మడివలువల నుత్కి పిడిచిమడఁచి
బుజముపై నిడి దండెములనాఱవైచి కూ
రలు దర్గికొనియు దండులములోడ్చి
పసుపురాచుక నీళ్ళుపైఁబోసికొని బట్ట
తడిది గట్టుకొని తీర్థంబు దెచ్చి
నాలుగుసేర్ల తప్పేల దబ్రాగిన్నె
రాచిప్పయొకటి పొయ్రాళ్ళఁబెట్టి.

కళపిళ నెసళ్ళుగ్రాఁగించి కమ్మనైన
వంటకాల్చేసి విస్తళ్లవడ్డనములు
పొసఁగఁగావించి భయభక్తి పూర్వకముగ
నుపచరించును వైదిక యువతి పతిని.

పై వానిలో మొదటి పద్యములో శ్రోత్రియ వధూటి వర్ణన. రెండవ దానిలో ఆమె నిత్యకృత్యములను వర్ణించిరి. లింగధారయ్యావారి నారి 'ప్రొయ్ పిడకల నిడి రాఁజేయు' నట. ఇంత బాధపడలేక పిడకలను కొననవసరము లేకుండ శ్రోత్రియ వధూటి పొరుగింటికేగి నిప్పును దెచ్చి రాజేయునట. ఎవరెవరు ఎట్లు ప్రొయ్యి రాజేయుదురో, ఏయేవిధముల వంటకముల వండుదురో విపులముగ వర్ణించిన ఈ కవిగారి నిశితపరిశీలనకు 'జోహారి' డక తప్పదు.

పై వానిలో 'అస్సే చూస్సివషే', 'తాతలనాటి సాలువలు' , 'లేవరు లెండు లెండునిన' పద్యములు నాడు నోటబట్టని తెలుగువాడు లేదని చెప్పవచ్చును.

ఆనాడు నియోగి బ్రాహ్మణులు వకీళ్ళుగ, కరణములుగ నుండెడివారు.

మెలిఁబెట్టి విడిచిన మీసాలపై గొప్ప
  నిమ్మకాయలు రెండు నిలుపవచ్చు
తేటగాఁ దెల్లగా తెగఁగాలు లంకాకు
  పొగచుట్ట జుంజురుఁ బోల్పవచ్చు
నడువీథి రెడ్డిగాలిడి రచ్చదీర్చుచో
  సివిలుజడ్జీలని చెప్పవచ్చు
అసదుగాఁ బొసఁగించి నొసటఁబెట్టిన బొట్టు
  లొక్కమా 'ఉుప్పని యూ' ద వచ్చు
వడివడిగఁ జిన్ననాఁడైన వడుగునాఁడు
తడఁబడుచుఁజెప్పుకొన్నట్టి తప్పు సంధ్య
ముక్క నాలుగునిమిషాల ముగియవచ్చు
బళిర ! యనవచ్చు లౌకికబ్రాహ్మణులను.    ప. 21

ముచ్చిలిగుంట జుట్టుముడివ్రే యఁగనెత్తిఁ గుళాయి యిస్త్రీ
యిచ్చిన కోటు మేనధరియించి బుజాన రుమాలువైచి లోఁ
గచ్చనుజీరుగోఁచి యిడికట్టినమల్మలుచెంగు జాఱఁగా
నిల్చి చెడావులందొడిగి యేగు నియోగిసుతుండు నిచ్చలున్. ప. 2.

ఈ పై పద్యములలో నియోగుల రూపురేఖలను తీర్చిదిద్ది మనముందుంచిరి.

ఓరీ ! చాకలి కాళ్ళు గ్రుద్దుమని యెన్నోసార్లు నేఁబిల్వలే
దా ! రావేమిర? తిమ్మిరెక్కినదొ లేదాబుద్ధి నీ చాకిరం
చేరెవో యిఁకజూఁడు నీమదము నాకెవ్వార లడ్డంబురా?
తేరా దస్త్రమటంద్రు గ్రామ కరణాల్తీ వ్ర ప్రభావంతులై. ప. 29

దీనిలో వీరి యధికారదర్పమంతయు ప్రదర్శించిరి.

ముదికరణాలు రాముగుడి మోసల రచ్చలుదీర్చి భారతాల్
చదువుచు లోకవార్తల బ్రశంసలనంద్రు తెలుంగు భాష మం
చిది మన పిల్లకాయలు వచించెడి యింగిలిపీసు పుస్పుసన్
బెదవులు దాఁటదెంతటి యెఫేయు, బియే యెమియే వచించినన్.
ప. 31.

ఈ దృశ్యము ఈనాటికిని మన తెలుగు పల్లెసీమలలో కాననగును.

అడిగినది యిచ్చుత్యాగి సత్యమున సేగి
అన్ని గల్గిన భోగి భార్యగల యోగి
చిలుమిడ నిరాగి ....... ...... ...........

అని చెప్పి చివరకు కుండబ్రద్దలు గొట్టినట్లు

'వండనేర్చిన నియోగి కంచు దివిటీలతోన జగాన గాన'. ప. 34.

అనెను. 'నమ్మిన నమ్మకున్న నది నావశమా?' అని తనపై నిందవేసి కొనకుండ చివరకు–

............... .......... జనులాడుకొన్న వా
క్యమ్ములు నేనుజెప్పెద భయంపడియో పడకో ! నియోగిలో

కమ్మనివార్య కార్యఘటకమ్మవుఁగాని పరోపకార శూ
న్యమ్మును స్వప్రయోజనపరాయణమున్ దలపోయనిద్దరన్. ప. 30

అని చల్లగా అంటించెను. 'నియోగి తన పచ్చయే గాని సహింపఁ దన్యపచ్చ' యని నిందించి మరల ఆ ప్రక్కనే 'దానికేమి విరజాజులు, రాజులు సైతమట్లనే' యని యొక వేళాకోళపు సమర్ధనతో హాస్యము స్ఫురింపజేసిరి.

కొమరుంబాపటకడ్డమై మొగలిరేకుం దమ్మలంపాకు నం
దముమీదన్ జడచుట్టపైనిడిన సాదాబిళ్ళపైఁ బచ్చఉా
లు మురాళింపగ గూబకుట్టులునుఁదాలూకాలఁజిల్లాల మ
చ్చెములం దుద్దుల బుష్యరాగములఁదాల్చిఁకట్లు పోమొత్తనె
య్యమునన్భర్తల బ్రీతిగొల్పుదురు లౌక్యబ్రాహ్మణప్రేయసుల్. ప. 39.

ఈ పద్యములో నాడున్నత కుటుంబినులు ధరించు నాభరణముల బేర్కొనిరి.

నడవడి మంచివ్రాఁత కరణం బతఁడెప్పుడు వ్రాయుచుండగఁన్
దడదడమ్రోఁగుఁగూతకరణంబతఁ డన్నిట నున్న యిందటిన్
దడఁబడఁజేసిఁమె తకరణంబు గులుక్కున మ్రింగు నెల్ల రా
బడులును .................. ............ ప. 23.

ఇట్టి కరణములు నాడేకాదు నేడును గలరు.

కమ్మని కందిపప్పు నురుగారఁగఁగాచిన నేతిబొట్టు దూ
రమ్మున దావిగ్రుమ్ముకొని రాఁబొగుపెత్తిన యాకుఁగూరలుం
గుమ్మడి పొట్ల కాఁకర మునుగయు వంగయు దొండ బెండ శా
కమ్ములు దప్పళంబులును గల్పి భుజింతురు శాలితండులా
న్నమ్ములు భ్రేవు మంచను దినం బరటాకులోనే బ్రాహ్మణుల్. ప. 44

ఈ స్మార్త బ్రాహ్మణుల భోజనపుపస శ్రీనాథుని తలపింపజేయుచున్నది.

ఈయిసుకోలుబళ్లకడ నింగిలిపీసులు పీసుపాసుగా
గూయఁగజొచ్చి యామయిలగుడ్డలు వంకెదగిల్చిరండు మొ
ఱ్ఱోయన నాలకింపరిసిరో ! కలికాలముగాలె రామరా
మాయను వృద్ధురాలయిన స్మార్తవితంతువు మాటిమాటికిన్. ప. 43

ఈమె చాదస్తమును -

అచ్చమ్మా యిదియేమిటే; రెయిలటే అసీ యిదేనా సరే
బుచ్చమ్మాఁ వినలేదటే గడియలోఁబోవచ్చునే కాశికిన్
అబ్బో దేహము గ్రుద్దుకోదటే అయో ఆసౌఖ్య మేమందునే
యిచ్చారాజ్యమటంట్రు ట్రైనుగని యెంతెవింత విప్రాంగనల్. ప. 16

ఈ బుచ్చమ్మ అమాయకత్వమును జూచి నవ్వనివారెవ్వరు?
స్మార్తులలో విస్తరి పొత్తె వియ్యముల పొత్తుల్లేవు వింతయ్యెడిన్. ప. 17

అనుట వీరిలో వియ్యపుపొత్తులున్న బాగుగ నుండునని కవిభావన. మాధ్వులలో చాలమంది రాజకీయోద్యోగులు. వీరు కన్నడబాస లోఁగిట నిఁ కందెలుఁగందటి తోడ 'మాటలాడుదురు వీరిది మేకపోతు గాంభీర్యము. కొల్వున్నయెడ నవాబు, పని యూడిన నాఁడు పకీరు. అంతేకాదు సనత్కుమారుడు వగల్, నిశిగాముడు (ప. 59) అని జారత్వము గూడ నారోపించిరి. వీరి మగవారి వేషధారణ యిట్లుండును.

కడుఁజెల్వమగు బెండకాయబొట్టు మొగాన
దతగ్రంథముద్రాంకితములు మేన
మడచి తీర్చిన జరీమధిర యోణి బుజాన
వెలగల యుంగరాల్వేళ్లపైన
అపరంజి విడికడియము మణిబంధాన
పగడాలసరముచొప్పడు గళాన
పట్టంచు దట్టంపు బలురీకు పుట్టాన
మేలుముత్యాల తమ్మెట్లతోన. ప. 58

వీరి యాడవారి వర్ణన -

ఒఱపైన వలిపెంపుచెఱఁగు గోచికట్టు
తాటిముచ్చికవంటి తాలిబొట్టు
చేతుల నపరంజి చిన్నారి పోచీలు
మేలైన మెడఁచిరికీలసజ్జు

కడుతీవి నడుమున గంటలమొలఁనూలు
నెఱిగుల్కు దమ్మెలఁగరణివూలు
పదయుగంబున వెండిపాంజేలు లందెలు
........ ......... ............... ప. 64

ఈ కవిగారు వారి తాళిబొట్లను సహితము ఎప్పుడు పరీక్షించిరో యాశ్చర్యమగును. కవి లోకజ్ఞత కిది మచ్చుతునక –

మాతుగళిల్లెనమ్మ గురురాయర మహా
మధ్వరాయస్తోత్రమాడుబేకు
మంత్రగహేళీ నామగళు స్మరిసి హను
మద్దేవతార్చన మాడుబేకు
........... .......... .............. ప. 54

ఈ పద్యములో వారి భావనాతీరును చూపిరి.

మాధ్వ గురువులు ఎంత యిచ్చినను సాకనడింకను 'బేకు బేకు బేకు' ధ్వని సేయు దురట. వారి కాంచన కాంక్షను 'మోక్షమునకు గరణంబు హిరణ్యమే సుమీ' యని యొక విధమైన వ్యంగ్యముతో సమర్థించిరి. ఇంతకు ముందు నియోగులు వంటరానివారని వెక్కిరించి యిచ్చట బాగుగఁ జేయనేర్చినట్టి వ్యాపారమాధ్వుని గూర్చి నిట్లు చమత్కారముగ ఉపమానముల దొంతరలు కూర్చి చెప్పిరి.

బేరములేని బేరి, శరవేగముఁబెట్టని నారి, దంధణల్
బొఱసి భేరి, ధర్మపరిపాలనలేని కచేరి స్వచ్ఛమై
పాణని వారి వంటకము బాగుగఁజేయఁగ నేరనట్టి వ్యా
పారి యవాహకంబగు సవారిలపోలుదు రాంధ్రభూస్థలిన్. ప. 52

నియోగులు కుక్కగుంపు,వైదికులు రాబందులు,మాధ్యులు కాకులనె లోకులమాట ఆనోట యానోట విని యది 'నిజమో కల్లయొ నేనెరుంగ' ననుచు నిచ్చట చల్లగా జారవిడిచిరి. ఇట్లనుటకు ఏదో కారణంబుండెడిన్ (ప. 69) అని వైష్ణవుల వర్ణన కుపక్రమించిరి. ప. 61.

గండభేరుండంచుగల ధోవతీకట్టు
　　కొమరైన పట్టెనామములబొట్టు
కడుఁబెద్దముడికిఁ జొప్పడెడి సందెడుజుట్టు
　　నితరుర కెఱుకగా నీనిగుట్టు
సామాన్యులకును దుస్సాధ్యంబయిన బెట్టు. 70 ప.

............ .............. .........

ఇట్లు ప్రారంభించి క్రమముగా వారి గుట్టు రట్టు చేసిరి. వారి తెఱచాటు భోజనమును, పులిహోర, దధ్యోధనంబు, తైరువడ మొదలగు వానిని శిష్య సంచారమును తిరువీధి వేంచేపు చేసికొనుచు వచ్చు జియ్యలవారిని వర్ణించిరి. పొంగళి బుట్ట నెత్తికొని వీధివెంబడి యిండ్లకు బోవు వైష్ణవులు గూడ కవిగారి దృష్టినుండి తప్పించుకోలేదు.

తిన్నని సన్నని తిరుచూర్ణ రేఖ
　　తీరుగా సౌరుగా దిద్దిన మోము
మిన్నఁగా నున్నఁగా మెఱుఁగార దువ్వి
　　మేలుఁగా వీలుగా మెలచిన కొప్పు
చిన్నారి పొన్నారి చెమరెత్తుచున్న
　　సిరుగుల్కు నెఱిఁదల్కు చెక్కుటద్దములు
వన్నెతో చిన్నెతో వరుని మెప్పించు
　　వాసిగా దాసిగా వైష్ణవ యువతి. (ప. 95)

యని వైష్ణవ సుందరులను వైష్ణవులవారి చిన్నది సన్నని గొంతు లెత్తి పెరుమాళ్ళ సన్నిధి హారతులిచ్చుచు మధురగానము చేయుటగూడ వర్ణించిరి. 'రచ్చలలోన తన్నుఁబలు రవ్వలబెట్టినను వారికి నచ్చక యున్నను నిజము చెప్పెదనని' వైష్ణవుఁ డెంతకాంచనం బిచ్చినంత మోక్షమనునీయక యుండిన ముక్తిలేదనున్' (ప. 83) అనెను. శైవుల భస్మధారణ గూర్చి -

భస్మత్రిపుండ్రముల్ ఫాలదేశంబున
నడునెత్తి మెడమీఁదఁగడతలందు

యని యిట్లు చెప్పుట ప్రారంభించగనె వారి శివభక్తి మనమున స్ఫురించును. కాని 'నిచ్చటచ్చట ననరాక నెల్లయెడలఁ దనువునిండగ దెగబూసి తమ్ముజూచి యదిరిపడి బ్రహ్మరాక్షసుల్ బెదరిపాఱు' (ప.31) అన్నది వినగానే యెట్టివారి కైన నవ్వాగదు. ఈ క్రింది శైవ వర్ణన గల పద్యములో నొక చమత్కారమైన హాస్యమును రూపొందించిరి. మొదటి మూడు పంక్తులు ఉపమానములు చెప్పి నాలుగవదానిలో ఒక సునిశితమైన, తీవ్రమైన సరసోక్తితో మలుపుత్రిప్పి హాస్యము మత్పాదించిరి.

తల్లికి భారమా ? శిశువు తామరతూటికి పువ్వు భారమా?
విల్లొక భారమా ? కడిఁదివీరున, కొంటెకు గూనుభారమా?
వల్లికి భారమా ? ఫలము, బట్టెకుఁ గొమ్ములు భారమా, నుతుల్
చెల్లును లింగధారులకు లింగఁపు గాయలు భారమా? మహిన్.
–ప. 109

లింగధారుల గూర్చిన ఒక చిన్న కథ ప్రస్తావన వశముగ చెప్పిరి.

అడవి నెడారి దారిఁజనునప్పుడు శైవ మహానుభావుఁజో
రుఁడొకడు వెంబడించినఁబరుంగిడఁ గాలికొలందిఁజొచ్చి యీ
మిడిమిడి దొంగపోటులకు మిక్కిలి యయ్యెను లింగపోట టం
చడుగిడ నేఱకీశ్వర హరా ! శివ ! శంకర ? యంచుఁ గూయిడెన్
– ప. 115

కరణకమ్మలలో గల కన్యాశుల్క దురాచారమును హేళన చేసిరి.

యాజ్ఞవల్క్యులు 'ఏ ఎండకా గొడుగుంబుట్టదు' రని యొక పద్యము మాత్రమే చెప్పిరి, ద్రావిడుల గూర్చియు నొక్కటే పద్యము చెప్పిరి. చెప్పినది ఒకటే యైనను అందులో వారు కుడిపైట ధరించిరనియు, వారిలో వివాహ శుల్క మెక్కువనియు వారి వేషధారణను వారి దురాచారములను వేలెత్తి చూపిరి. గోలుకొండ వ్యాపారుల గూర్చి ముచ్చటగా మూడు పద్యములు చెప్పిరి. వారి 'రసవల ఱాళ్లతమ్మెటను' బంగారు మొలత్రాళ్ళను వర్ణించుచు –

ఎలమిఁ జీపురుపట్టి యిల్లూడ్చునపుడైన
పోనీరు తలజుట్టు పూలమెఱుఁగు. ప. 134

యని వారి నీటును గూర్చి వచించిరి.

ఇట్లు వీరందరి యలవాట్లనే గాక 'పోయి రాజేయుట' మొదలు వారి వారి పచన పదార్థములను వారికి ప్రీతియైన శాకపాకములను విపులముగ వర్ణించిరి. ఇవి యన్నియు నీ కవిగారి నిశిత పరిశీలనను, లోకజ్ఞతను వెలార్చును. మాటల కూర్చు నేర్పుచే నాపాత్రల చిత్రించుట యందు వీరి ప్రజ్ఞ యద్భుత మైనది.

'వివాహములు' (43) అన్న శీర్షిక క్రింద కన్యాశుల్కము, వృద్ధ వివాహములు, అతి బాల్య వివాహములు, సరసమగు వియ్యపురాండ్ర తగువును వర్ణించిరి. అత్తా కోడండ్ర గూర్చి మనము నిత్యము చెప్పుకొనునవే పద్యరూపమున పొందించిరి. 'ఇతర విషయములన్న' దానిలో పెండ్లాము మీద నింటిపయిఁ బెత్తనముంచిన వాని సౌఖ్యమును (48) గూర్చి చెప్పిన పద్యము ఆహ్లాదముగ నున్నది. పొడుము ఎట్లు చేయవలెనో చెప్పి -

వెండి పొన్నూతఁ గొలుసు బొబ్బిలి పసందు
సోగమారెడు బుఱ్ఱఁ బోసుకొని రొండి
నిడి తలఁచినప్డు కించిత్తు పొడి గ్రహించి
బుఱ్ఱు నఁబీల్చు బాపని ముక్కెముక్కు. ప. 150

అని తీర్మానించిరి. కవిగారి కవిత్వమున నింత పట్టు ఈ పొడుము పట్టు పట్టుట వలెనె కలిగెనేమో !

'ఊరిమీఁద నొక యూరయినం బడుఁగాక యెన్నడుం
గరణముమీఁద నొక్క యఱకాసయినం బడదు - 25
నీనొసటనా ? యుదయించిచెను ప్రొద్దు (28). తెలియక యొకటన్న
నలుదిక్కులనన్ బదియండ్రు (47) తాతాచార్యులవారి ముద్ర
భుజముల్ తప్పిన వీఁపుదప్పదు (78) చేసిన పాపమెన్నడునుఁ
జెప్పినఁ బోవు (82) అందిన జుట్టుఁబట్టుకొను నందకయుండినఁ
గాళ్లుపట్టు (114) ఏ యెండకాగొడుగుంపట్టు (131)

ఇట్టి సరసోక్తులతో, మధురోక్తులతో శ్రీశ్రీరాములుగారు మేల్తరమైన హాస్యము నందించిరి. 'చెరువున కేగెడున్ ....' "తలయు గడ్డము మీసముల్ (100) వంటి యొకటి రెండు జుగుప్సాకరములైన వర్ణనలలో చౌకరకపు హాస్యమున్నను గ్రంథమంతట ఆమూలాగ్రము ప్రధాన శ్రేణికి చెందిన హాస్యము కలదు. ఇందలి పాత్రలన్నియు చైతన్యవంతములై పాఠకుల మనోవీధిని బొడగట్టి హృదయాహ్లాదము కలిగించును. ఆంగ్ల కవి చాసరు మహాశయుడు 14 వ శతాబ్ది నాటి ఆంగ్ల సమాజమును తన గ్రంథమైన 'కాంటర్‌బరీ టేల్సు' యొక్క ప్రవేశికలో చిత్రించినట్లు ఈ కవి తన నాటి బ్రాహ్మణసమాజమును చిత్రించెను. 'వీటీ మోదివిటీ నటీకుచతటీ ....' యను పద్యము సమాసభూయిష్టమై వారి ప్రౌఢతా ప్రీతిని జాటుచున్నది. మిగిలినవన్నియు ధారాశుద్ధి శోభితములై యలతి యలతి పదములతో కడు హృద్యములుగా నున్నవి. ఈ తెనుఁగునాడు ఆరు ముద్రణల నందుటయే కావ్యము ప్రజాహృదయమును జూరగొన్నదని దెల్పుచున్నవి.

కొన్ని చోట్ల కవిగా రుద్దేశ పూర్వకముగనే స్వతంత్ర ప్రయోగములు గావించిరి. అట్టివి కొన్ని – మూతురు, మమంచును. ఇవి సాధువులేనా యన్న రంధ్రాన్వేషకులకు శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు 'సరస్వతీ సామ్రాజ్యము'ను పత్రికలో చక్కని సమాధానమిచ్చిరి.

మూతురు – 'చేతును' సాధువని 'భారతీశతకకర్త' పూర్వకవి ప్రయోగములు దృష్టాంతములుగ జూపి నిరూపించెను. అట్లే మూతురు గూడ సాధువే.

పూవులఁగోతు, జేతు హరిపూజ లటంచు వచింపఁజెల్లదే ?
శైవ పురాణమందు శుకస్తపతి నైషధ శేషధర్మ లం
కావిజయంబులందు కవికర్ణ రసాయనమందు నింకనీ
లా వివరింపఁ బెక్కు కృతులందు ప్రయోగములుండు భారతీ !
భా. శ. 89

1899 సం॥ ఆక్టోబరు నెల తెలుగు 'జనానా' పత్రిక సంచిక నాలుగులోని గ్రంథ విమర్శన యను శీర్షిక క్రింద తెనుగునాడును విమర్శించి సమిష్టి దోషములు గొన్నిటిని నిరూపింతునని కొన్నిటిని పేర్కొనిరి. 1. తోటి – గ్రామ్యము 2. ఈవరు – చ్యుత సంస్కారము, 3. 'లేకను' అను భారత ప్రయోగము వంటిది.

'ఉండకను' (ప. 92), 'ఓడకను' (ప. 152) అని అనుట కేవలము భ్రమ, 4. 'మా ప్రభో ' - గ్రామ్యము 5. కించిత్తు - ఈ సాంస్కృతికావ్యయము గాని సుబంతముగా ప్రయోగింపదగదు, 6. 'ఉతోతఇసెనమంచు' - తవైనమమంచు అనుకృతిలో అచ్చునకు సంధిలేదు. 7. 'మొగముల్తెగఁ బూసిన బూదిజారగ' - సప్త మ్యర్థమును ఈ ప్రథమా బహువచన మీయజాలదు, 8. 'వియ్యపొమ్మ' - అను -సమాస మసాదువు, 9. 'గోంగూర' అసాధువు.

దోషములుగ చూపబడిన వీనిలో నెక్కువ భాగము లాక్షణిక పద్ధతిలో సమర్థనీయములే. మిగిలినవి కూడ శిష్ట వ్యవహారమును బట్టి, దేశ వ్యవహారమును బట్టి సమర్థనీయములు కాదగియున్న వనుటలో సంశయింపబని లేదు.

వ్యవహార భాష కవితలో గూర్చుట తప్పదువారికి శ్రీ గిడుగు వెంకట సీతాపతిగారు వారి భారతీశతకములో చక్కగ ప్రత్యుత్తరమిచ్చిరి.

వ్యవహారంబున లేకపోయినసరే ప్రాఁబల్కులేయెప్పుగ
ద్వ్యవహారంబునఁ బుట్టి వర్థిల్లిన నర్వాచీన శబ్దంబులన్
గవితన్ గూర్చుట తప్పునన్దగునె? వృక్షంబందు నెక్కొన్న ప
ల్లవముల్ ద్రుంచుచు జీర్ణపత్రముల నిల్పన్ జూతురె, భారతీ !

భా. శ. ప. 20

వ్యవహారికములని నిరాకరించిన పదము లెన్నిటినో సాధువులని పూర్వకవి ప్రయోగముల ఆదారముగ నిరూపించిరి. ఒక లాక్షణికుని దృష్టిలో తప్పైనది యింకొక లాక్షణికుని దృష్టిలో నొప్పుగా నుండి ప్రామాణ్యము బడయుచున్నది.

యదార్థమునకు తెలుగుశబ్దం సాధుత్వాసాధుత్వములకు కవుల ప్రయోగ ములే ప్రమాణములగును. 'ప్రయోగశరణం వ్యాకరణ' మ్మని పెద్దలసూక్తి. లక్ష్య లక్షణములలో లక్ష్యములకే ఎక్కువ విలువనీయవలయును. కవి ప్రయుక్త శబ్దములు శిష్టవ్యవహార సిద్ధములు'. 'సిద్ధిర్లోకాదర్ధ ృశ్యా' అనిరి. కనుక కావ్య భాష నుండి స్వీకరింపవలయును. వ్యవహార భాష పరిణామ స్వభావము గలదగుటచే దానిననుసరించి కావ్యభాష కూడ పరిణామముచెందు ననుటలో విప్రతిపత్తి లేదు. కావుననే లోకోక్తులందలి దేశ్యశబ్దములను ప్రమాణములుగా

స్వీకరించియు కవులు గౌరవనీయులగు చున్నారు. దీనిని భారతీశతకకర్త యిట్లు చెప్పుచున్నారు.

కనవిభాషకు శబ్దసిద్ధి యెటు 'లోకాద్దృశ్య' యంచెంచి ల
క్షణశాస్త్రజ్ఞులు శబ్దశాసనములో స్పష్టంబుగా వ్రాసిరో
కనవే కావ్యములన్ గవీంద్రులెటులో కంటే ప్రమాణంబుగాఁ
గాని లోకోక్తుల దేశ్యశబ్దములఁ గైకోనెంచిరో భారతీ ! ప. 22

ఇట్టి వానిని విమర్శకులు దొసగులుగ గ్రహించినను కవిగారి గౌరవమునకు లోటు రాబోదు. సాహిత్య విభాగమున వివిధ ప్రక్రియల చేపట్టిన వీరి కవితా ప్రతిభలు కవిపండితుల ప్రశంసల నందుకొన్నవి. వారి సమకాలికులును సుప్రసిద్ధులును నగు తిరుపతి వెంకటకవులే వారిని ప్రశంసించిరనగా వారి కవితా 'సత్తా' యెట్టిదో వేరుగా చెప్పనవసరం లేదు.

'ఈవరు' సాధువని సోపపత్తికముగ నిరూపించిరి. 'ఈవరుసందు'[4] అనే ప్రయోగం సాధువేనా అని రంధ్రాన్వేషకులు ప్రశ్నిస్తారనుకుంటాను' వాదమెందుకు అసాధువె కానివ్వండి. అంత మాత్రం చేత పోయేదేమిటి? ఈ తెలుగుభాషకు వొకతోవ, తెన్నూలేదు. ఎవరికి తోచినట్లు వారు ప్రయోగిస్తూ వచ్చారు. తప్పన్నది తప్పు కాకపోవచ్చు. తప్పుకాదన్నది తప్పుకావచ్చు. పండిత కవివతంసుఁడైన దాసు మహాకవికి యింతమాత్రము తెలియదా! తెలిసి వుండఁబట్టే దేవీ భాగవత పీఠికలో ఈ క్రింది విధముగా వ్రాసియున్నారు.

'ఇప్పటి కవులలోఁ గొందఱు ఏకైక మతావలంబులును, బహుగ్రంథ ద్రష్టలు కానివారును……… తమ ప్రావీణ్యంబు పలువురు కొనియాడుదురో యని యడియాసంజిక్కి యాక్షేపింప దొరంకొనువారు కలరు. కావున వారల కిందు నా మార్గంబిట్టిది యని చెప్పి నాజోలికి వచ్చుట క్షేమము కాదని తొలగించుకొనుట యుక్తంబని యెంచితిని.'

శ్రీరామ కవిగారు పైవిధంగా పండితమన్యుల బారినుండి తప్పించుకో దలచిరి గాని అంతమాత్రము చేత కుశ్శంకలబాద తప్పుతుందనుకోడానికి అవకాశం లేదు. ఆయీ ప్రకరణంలో లాక్షణిక సమయాలు శ్రీరామకవి బోలెఁ

డు వ్రాసి యున్నారు. వాటివలన ఆయన పాండిత్యమెట్టిదో విజ్ఞులు తెలిసికొందురు. (అని దేవీభాగవతంలో మొట్టమొదట ఉదహరించి వున్నారు). చక్కని పాండిత్య మంటూ వొకటి వుంటే వెఱ్ఱి వెఱ్ఱి ఆక్షేపణలకు దిగరనిన్నీ, అట్టి శంకలకు దిగడమే పాండిత్య దారిద్ర్యానికి కారణమనిన్నీ కవిగారి తాత్పర్యం ...... .......... ఎవరుగాని ప్రాచీనులలో ప్రసిద్ధులు అంగీకరించినట్టయితే అది మనకు నుపాధేయమే అని శ్రీరామకవి మార్గం స్ఫుటపరచున్నది. 'ఇచ్చు' ధాతువునకు యకారం చేరడానిక్కారణం 'బలిమినీయని' యనే నన్నయ్యగారి ప్రయోగం. కొందరు 'ఇయ్యని' అని ప్రయోగించారు ప్రాసస్థానంలో. కొందఱు 'ఇవ్వని' అని వాడిన వారున్నూ వున్నారు. దాన్ని బట్టి 'ఈవరు ' సాధువు .... కవికి స్వాతంత్ర్యం వుండాలి. అది లేనిదే రచన శోభించదు. సహృదయరంజకత్వం చూచుకోవాలి గాని ఆ యీ తన మార్గం ప్రాచీనులు వెళ్ళినదా? కాదా? అనుకోకూడదు.

'వైదికుని తోటి యేమేటి వచ్చుసాటి ' ........ తె.నా. - ప.2.

లోకవ్యవహారములో 'తోడివాడు' అనుటకు 'తోటివాడ'నియే ప్రయోగింతురు. 'తోడివాడ'నరు. దీనికి పూర్వకవి ప్రయోగము కూడ కలదు.

'మాటిమాటికి నునుగులతోటి సూటివా
టిలనాడు మాటలతేటతోడ'

అని 'కౌసల్యా పరిణయం' అనే ప్రబంధములో శ్రీపాద వెంకటాచలకవి ప్రయోగించెను.

'మాప్రభో' (ప.14), 'మహా' కు బదులు 'మా' వాడకూడదని, 'మా' వాడినా 'ప్రభో' తో కలిపి వాడకూడదని యాక్షేపణ. 'జాపరమేశ్వర' యని 'మా నెఱజాణ' అని పూర్వకవి ప్రయోగములున్నవి.

'జాపరమేశ్వర' యని వరాహపురాణము నందు మల్లసింగనలు వ్రాసిరి. 'మా' యని నైషధంబునను 'మా నెఱజాణవు' అని - హంసవింశతిన్ కలవు. (భా.శ. - ప. 64)

మహాభారతము నందలి 'సంతానము లేకను' అనుచో నద్ది ద్రుతప కృతికమని భ్రాంతి తగదని చెప్పిరి. అచ్చట సముచ్ఛయార్థక 'మ'కారమే యని

పండితులవారు సముచ్చయార్ధమందో, అవధారణార్ధ మందో కళలపై నకారము కవుల ప్రయోగములలో (భా.శ. – ప. 68) కనిపించుచునే యున్నది.

'ఇదేను', 'కనుకనే' అనుచోట్ల కళలపై ద్రుతము వ్యవహార ప్రసిద్ధము.

'కించిత్తు' ఇది సాంస్కృతికావ్యయము గాన సుబంతముగా ప్రయోగింప దగదనిరి.

కించిత్తు నల్లి కఱచిన
మంచమునకు చేటు గలుగు మహిలో సుమతీ.

అని సుమతీశతక ప్రయోగము కలదు. తెలుగుబాషకు వెలుగును గూర్చినవి శతకములు కావున శతకములు ప్రమాణము కాదనవీలులేదు. 'ఉతోత ఇసెనమంచు' (ప.7), 'తవైవనుమంచు' (ప.107) అను కృతిలో అచ్చునకు సంధి లేదనుచు 'అధర్వణుని కంగీతరమేకాని చిన్నయ ప్రభృతులు గ్రహింప లేదని' విమర్శించిరి. చిన్నయ యంగీకరించినదితరులంగీకరించిరి కదా! ఇది లోగడ ఉదాహరించిన 'ఏకైక మతావలంబులు' అనే పదము మనసు నందిడి 'ఎవరుగాని ప్రాచీనులలో ప్రసిద్ధాలు అంగీకరించి నట్టయితే అది మనకు ఉపాధేయమే' యన్నది కవిగారి మార్గము అని మరియొకసారి స్ఫుటపరచుచున్నది.

కారకములలో 'మొగముల్తెగఁబూసిన బూదిజారగ' (ప.5) ననుచో 'మొగముల్' అను ప్రథమా బహువచనము సప్తమ్యర్థము నీయజాలదను సందేహము ప్రౌఢవ్యాకరణ సూత్రముతో విచ్ఛేదమగును. 'ఒక్కొకచో జడంబు సప్తమికిం బ్రథమయి నగు' (కా.ప.– సూ.20) ఉ॥ పారిఁబారి మోము భాష్ప జలపూరము గ్రమ్మఁగ నూర్ధ్వబాహుడై (భార.శల్య. అ. 7)

'వచ్చుజియ్యరు శ్రీవైష్ణవులను (ప.16). ఇచ్చట ద్వితీయ సప్తమీ బహు వచనార్ధ మీయజాలదని సందేహము. కాని సప్తమ్యర్థము వచ్చుట కభ్యంతరము లేదు. కొన్ని యెడల నజడంబు తృతీయా సప్తములకును బహుత్వంబున ద్వితీయ చూపట్టెడి (ప్రౌ.వ్యా.కా.స.18.). ఉదా ॥ మనుజుల విప్రుండు (భా.శాం., ఆ.1, వ.71). ఇచట ద్వితీయమే మనుజులం దనియే యర్థము సమాసములలో 'వియ్య పొత్తు' (పు.47) అన్నది ద్వంద్వమా, తత్పురుషమా, యిందలి 'ము'

వర్ణమునకు లోపమెట్లు కలిగినదని ప్రశ్నించిరి. 'కప్పురవీడము' వలె నిందలి 'ము' వర్ణము నకు లోపము కలిగి యిది తత్పురుషయే యైనది.

'గోంగూర' (ప. 86) అసాధువని 'గోఁగుఁగూర' యని 'గోంగూర' రుచి మరగిన ఆంధ్రుడ్వెడును అనడు. 'గోంగూర' అనియే యనును.

'అచ్చికసమాములం దఱచుగ వర్ణలోపాగమాదేశవికారంబులు నిత్యవై కల్పికములుగాఁ టెక్కులు గొనంబడి యెడి' అను ప్రౌఢవ్యాకరణసమాస పరిచ్ఛేద మందలి 36వ సూత్రము ప్రకారము ఇవియన్నియు సాధ్యములు కాకపోవు. ఇచ్చట శ్రీరామకవి దేవీభాగవతాదిని చెప్పినది అందరికి ఉపాదేయమగును.

మృదుమధురతాదిగుణములు
పదములకును నర్ధములకు ప్రాపింపగ నె
య్యది సులభసాధ్య మామత
మెదనిడి ప్రాసముల యతుల నిడుడు సరసతన్

ఒక్క ప్రాసలు,యతులే కాదు సమాసములు, కారకప్రయోగములు మొదలగునవి గూడ అట్లే గ్రహింపనగుననియే యుద్ధేశపూర్వకముగనే పై ప్రయోగముల జేసిరనినను అతిశయోక్తి కానేరదు.

ఈ తెనుగునాడు చక్కని రచనాసౌష్టవముతో ప్రథమశ్రేణికి చెందిన హాస్యముతో సహృదయరంజకముగ నున్నది. 'ఏరకమైన రచనలోనైనా హాస్యాన్ని ధ్వనింపజేయవచ్చుననే సంగతి నేటి రచయితలలో ఏ కొందరో తప్ప మిగిలిన వారు గమనించినట్లు తోచదు. నీరసమైన శాస్త్రీయవిషయాలకు సంబంధించిన వ్యాసాలలో కూడ అక్కడక్కడ హాస్యాన్ని ప్రయోగించి సరసంగా వ్రాయవచ్చును'[5] అని ముట్నూరి సంగమేశంగారు చెప్పిన ఒకరిద్దరు రచయితలలో శ్రీరాములు గారొకరు.

## అధోజ్ఞాపికలు

1. It is an attack on a person or group of persons or on a social eveil or folly. It is intended to ridicule not to abuse though it may be often be bitter. In general it hates the sin and not the sinner and

is more playful than hurtful. It is forceful and out spoken. The satire, like an arrow, has to take the shortest route to its target'.

2. We recently came across a copy of Telugu satirical work, in the Telugu Nadu, published by the Vani Press, Vijayawada. The book in some places typifies some of the Telugu Brahmin sects as moral non-entitites. Our space does not permit us to quote any lines. As it looks like these are calculated to widen the gulf between particular Brahmin sects and if believed seriously wreck the moral pride of some that 'Satyasamvarthini' hopes that the publication of such books will hereafter be discouraged. P-63

3. మహాకవి దాసు శ్రీరాములు జయంతి సంచిక,1975, మహాకవి దాసు శ్రీరాములు స్మారకసమితి ప్రచురణ. పు. 8.

4. మహాకవి దాసు శ్రీరాములు జయంతి సంచిక, 1975, పు॥లు. 4,5.

5. తెలుగు హాస్యం – శ్రీముట్నూరి సంగమేశంగారు – ఆంధ్రసారస్వత పరిషత్, హైదరాబాదు. పుట 26, 27.



## (ii) చక్కట్లదండ

శ్రీ శ్రీరామకవిగా రనేక శతకముల రచించిరి. తమ పంద్రెండవ యేటనే గంటమును జేతనిడి 'సోమలింగశతకము'ను రచించిరి. ఇరువదవ యేట 'గొల్లపల్లి రఘునాథ శతకమును', నలుబది యెనిమిదవ యేట సంస్కృతంబున 'కామాక్షీ శతకంబును', అచ్చతెనుగున నీచక్కట్లదండ యును నేబది యారవయేట సూర్యశత కానువాదంబును, నటుపిమ్మట 'ముద్దులగుమ్మ శతకంబును', 'చిలకలకొలికి శతకంబును' రచించిరి.

ఈ 'చక్కట్లదండ' అచ్చతెనుగు శతకము. ఈ శతకము నామము సహితము అచ్చ తెనుగు మాటలతో గూర్చబడినది. 'తత్సమంబు దక్కఁ దక్కిన నాలుగు నచ్చ తెలుఁగు లందు రఖిలజనులు'[1] (ప.27), అని కేతన తన ఆంధ్రభాషా భూషణంబున జెప్పెను. 'సంస్కృతసమేతరంబైన భాష యచ్చయనంబడు'[2] నని చిన్నయసూరి చెప్పిన సూత్రప్రకారమీ గ్రంథము సంస్కృతసమముల జేర్చకుండ వ్రాయబడినది. 'చక్కట్లు' అనగ లౌకికనీతులు. 'దండ' యన మాలిక. కావున లౌకికనీతిమాలిక[3] యని కవిగారి యభిప్రాయము.

సంస్కృతపదములు తీసివేసిన మిగిలినదేదియో యదే యచ్చతెనుగని తెలియుచున్నది. 'దేశ్యము' 'అచ్చతెనుగు' నొక్కటియే యని యారూఢిగ గొంద రందురని[4] సర్వలక్షణసారసంగ్రహకర్త కూచిమంచి తిమ్మకవి చెప్పెను. దీనిని బట్టి యచ్చతెనుగనగా సంస్కృతసమేతరంబైన భాష యనియు నిది దేశ్యము కన్న విస్తృతమైన దనియు ననుట సుస్పష్టము.

శబ్దరత్నాకరమున గల 35,055 పదములలోను 14,814 పదములు సంస్కృతశబ్దములు, తెలుగు విభక్తి ప్రత్యయములు మాత్రము చేరి యవి నిఘంటువున కెక్కినవి. అంతటి విశాలమైన తెలుగుభాషలో నిన్ని తత్సమ పదములేల చేరినవి యనగ తెనుగుదేశమున వైజ్ఞానిక వ్యవహార మంతయు సంస్కృతముననే జరుగుచుండెను. దైనిక వ్యవహారమునకు నున్నత భావస్ఫోర కములైన పదములన్నియు విజ్ఞాననిధియైన సంస్కృతము నుండియె రావలయును.[5] ఇట్లు పరిమిత పదజాలముతో నియమితమైన అచ్చతెనుగులో

కావ్యము వ్రాయుట యంత సుకరము కాదు, కావుననే క్రీ.శ. 1500 1750 మధ్య, నేడును 1800 – 1950 వరకు సుమారు పదునెనిమిదియును నచ్చతెనుగు కావ్యములు గలవు.[6] యయాతిచరిత్ర రచన తరువాత శ్రీ మరింగంటి సింగరాచార్యులు 'చిలువపడగబేసికత' యును, శ్రీ ఆడిదము భాస్కరకవి 'శుద్ధాంధ్ర రామాయణము'ను శ్రీ కూచి మంచి తిమ్మకవి 'రామాయణము'ను, 'శ్రీ నీలాసుందరీ పరిణయము'ను వ్రాసియుండిరి. తరువాత యచ్చతెనుగున వ్రాసిన యాధునిక కవులలో శ్రీదాసు శ్రీరాములుగారును, శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులు గారును సుప్రసిద్ధులు. 'శుద్ధాంధ్రభారత సంగ్రహమును', రామాయణమును శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారును, శాకుంతల నాటకమును, చక్కట్ల దండను శ్రీదాసు శ్రీరాములుగారు రచించిరి. మచ్చ వెంకటకవి శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన 'కుశచరిత్రమును', శ్రీ ములుగు పాపయారాధ్యులు సర్వమధురమును వ్రాసిరి. ఇట్టివి యింకను కొలదిగ నుండవచ్చును, అయినప్పటికి అచ్చతెనుగు నాశ్రయించిన కవులలో శ్రీదాసు శ్రీరామకవి తరువాత నాధునికులలో ఆదిభట్ల నారాయణదాసుగారు అచ్చతెనుగు రచన చేసిన వారిలో సుప్రసిద్ధులు. వీరిది 'రెంటత్రాగుడు గొంగ పుట్టింటి వేల్పు శతకము'. (సింహాద్రి నారసింహ శతకము).

పైన చెప్పబడిన క్రీ.శ. 1550 – 1580 వాడగు శ్రీ పొన్నెగంటి తెలగన్నచే విరచింపబడిన మొట్టమొదటి యచ్చతెనుగు కావ్యము అమీరుఖానునకు అంకితము చేయబడెను. అందులో నిట్లు చెప్పెను –

అచ్చతెనుంగు బద్దెమొకటైనను గబ్బములోన నుండినన్
హెచ్చనియాడుచుందురని యెన్నుచు నేర్పున బొత్తమెల్లని
ట్లచ్చతెనుంగున న్నుడువ నందుల చందమెఱుంగు వారునిన్
మెచ్చరా? యబ్బురంబనరా? మేలనరో? కొనియాడరో నినున్.
– యయాతిచరిత్ర, 1–120

తత్సమశబ్దముల జోలికి బోక కేవలమచ్చతెనుగున గ్రంథము వ్రాయుట యలతియైన పనిగాదని పై పద్యమును బట్టి తెలియుచున్నది. ఇట్లు వ్రాసినను సులభముగ గ్రాహ్యము కాదనుట యెల్లఱెఱింగినదే !

'చక్కట్లదండ' నచ్చతెనుగులో వ్రాయుదునని కవి ప్రతిజ్ఞ. అచ్చ తెనుగు కావ్యమనగా తెనుగుసేయబడిన సంస్కృత భాషాకావ్యము కాదు. 'ఉగ్రశ్రవ సుడనక' వెట్టచెవులరాయ డనుట కృత్రిమశబ్దకల్పనము. అది యచ్చతెనుగనుటకు వీలులేదు. ఆ శబ్దము తెలుగు లోకమున లేదు. దాసువారి యచ్చతెనుగట్టి కృత్రిమమైనది కాదు. లోకములో సహజముగా నున్న తెనుగువారి నుండి యూడిపడి తెలుగుతనమును బూర్తిగ పుణికి పుచ్చుకున్న భాష యిది. అచ్చతెనుగున నిదియే ! తెలుగు పలుకుబడి తేటతెల్లముగ విదితమగునట్లు రచియించిరి. వక్రగతులు, ప్రకమ భంగములు, సాధ్యమైన కట్టుబాటులు లేకుండునట్లు వ్రాయబడినదనిరి.[7] ఎచ్చటను మచ్చునకైన కృత్రిమమైన శబ్దము కానరాదు. అంతగా జానుతెనుగున వ్రాయుదనని ప్రతిజ్ఞ చేసి, భావకవుల మీద తిరుగుబాటు జెండాను లేపనెత్తిన శ్రీ పాల్కురికి సోమన నూటి కేబదిపాళ్ళు సంస్కృతభాషా శబ్దముల గాలక్షేపము చేసెను. శ్రీ పొన్నెగంటి తెలగనార్యుడు, శ్రీకూచిమంచి తిమ్మకవి మున్నగు అచ్చతెనుగు కావ్యకర్తల యందు నిట్టి కృత్రిమమైన శబ్దజాలమును కోకొల్లలుగా జూపవచ్చును. ఆయా యంశములను బట్టి చూచిన నీవిషయమున శ్రీదాసు శ్రీరాములుగారే మిన్న యని ప్రశంసింపక తప్పదు.

శ్రీరాములుగారి కవిత్వములో, అనగా శబ్దప్రయోగములో మఱియొక లక్షణము కలదు. వారు అన్యదేశ్యములను విరివిగా వాడుదురు. విరివిగాననగా నన్యదేశ్యమును తప్ప మరియొక శబ్దమును వాడినచో నక్కడి భావమునకు సరిగా నతుకదని తోచినచోట వీరు నిరభ్యంతరముగా నన్యదేశ్యమును వాడి తీరుదురు. 'అన్యదేశీయములు రసానుకూలముగాఁ బ్రయోగింపబడుచున్నవను నర్థము వచ్చునట్లుగ 'అహేయ మన్యదేశీయం యత్తదేవ ప్రయుజ్యతే'[8] అను వికృతి వివేకకారిక యొకటి (సంజ్ఞా) కలదు.[9] కాబట్టి యీ యన్యదేశ్యముల గూడ వ్యాకరణ భాషాభేదముగా బరిగణించిరి. 'ఏషాతయోర్వికృతిః' అని ఆంధ్ర శబ్ద చింతామణిలో నొక సూత్రము కలదు.[10] దీనివలనను శబ్దరత్నాకర పీఠిక వలనను 19 తద్భవ భేదములున్నవని తెలియుచున్నది.[11] సంస్కృత భవము ప్రాకృతభవము షడ్విధ ప్రాకృత్వము లగుటచే 6×3=18 సంస్కృత భవము కూడినచో 19, దేశ్యము అన్యదేశ్యములతో గూడి 19+2=21 యగును. ఇట్లన్యదేశ్యమును గూడ వ్యాకరణము భాషాభేదముగా బరిగణించినది.

శ్రీ శ్రీరాములుగారి కాలమున 'ఉర్దూ' అనగా మహమ్మదీయుల భాష వ్యవహారములో నుండెను. ఆ మాటకు వచ్చినచో నది యిప్పటికిని 'దస్తావేజు' భాషగా మిగిలియే యున్నది. దానికి శ్రీరాములుగారు 'దకినీ' భాష యని తొలిపేరునే వాడిరి. ఇది వారు పెట్టిన పేరు గాదు. నాటి వాడుకలో నున్నదియె దక్కిన భాష. (Deccan Language) దక్షిణదేశమున వాడబడు ఉర్దూ భాషా వికారము. ఇది అరబ్బీ, పర్షియను భాషల కలగలపు. బహమనీ రాజ్యముల స్థాపనము నాటి నుండి దేశమున వాడుకలోనికి వచ్చినది.

ఆనాడు మన ప్రాంతమంతయు గోల్కొండ నవాబుల యేల్బడిలో నుండెను. ఇది యానాటి రాజకీయభాష. శ్రీరాములుగారు న్యాయవాదులు. వారు మొదట తెలుగులో 'ప్లీడరీ' చదివి, తరువాత 'ఇంగ్లీషు' లో గూడ నా పరీక్షలో నుత్తీర్ణులైరి. ఇట్లు దకినీభాష తోడను, ఆంగ్లభాషతోను సన్నిహిత సంబంధము కుదిరెను. ఆ భాషా శబ్దములు వారికి వ్యావహారికములే.

ముత్యాల సరిఫణీ ముసలమ్మ తలకేల (7)
చండిపోతొక హరుసాలు చేసిన పని (17)
దాటక దాటక దాటినా దరిమీరి
పెరిగిన మున్నీరు ఫీరుఫారు (22)

ఈ సరిఫణీ, హరుసాలు, ఫీరుఫారు ధకినీ భాషలోనివి. శ్రీరాములు గారి గ్రంథ సముదాయములో నిట్టి దకినీ భాషా శబ్దములు కోకొల్లలుగా నున్నవి. వారి దేవీభాగవతము నందు నీ శబ్దములకు స్థానము లభించినది. పాల్కురికి సోమన 'జాను తెనుగు' అను మాటకే యర్థమును భావించెనో తెలియదు గాని యీ కవి గారచ్చతెనుగనగా నచ్చముగా దేశములో వాడుకలో నున్న శబ్దకోటి (సంస్కృతేతరములు) యంతయునని భావించెననుట మాత్రము స్పష్టము. కావుననే –

పలుకు వెలదినోటఁబట్టి ముచ్చటలాడు
బెమ్మదాఁదెరగంటి పెద్దదయిన. 1

ఈ పద్యములో బ్రహ్మదేవునకు 'బెమ్మ' యని పలుకబడినది.[12] గ్రాంధికమగు తద్భవము 'బమ్మ' యయినను 'బెమ్మ' యని వాడుట గ్రామ్యముల

యందు బ్రసిద్ధమై యున్నందునను తద్భవములకు లోక ప్రసిద్ధి ముఖ్య ప్రమాణ మయినందునను తద్విరుద్ధమగు శబ్దజ్ఞసమయము లేదు, కావునను సందర్భమునందు శ్రావ్యముగా జూపట్టినందున నట్లు ప్రయోగింపబడియె అని కవిగారు వ్రాసిరి.

ఈ చక్కట్లదండ యందు నూరు సీసపద్యములు గలవు. సీసము శీర్షిక శబ్దభవము. సీసపద్యమున నాలుగు పాదము లుండును. ప్రతి పాదమునను ఆరింద్ర గణములు, రెండు సూర్యగణము లుండునట్లు చెప్పి సీసమునకు క్రింద ఆటవెలది గాని, తేటగీతి గాని చెప్పవలెను. పూర్వము సీస పద్యమును, ఆఱు పాదములుగ వ్రాసెడివారు. సీస పాదములు నాలుగు. ఆట వెలది గాని, తేటగీతి గాని రెండు పాదములు మొత్తము ఆరు పాదములు వ్రాసెడివారు. కావ్యాలంకార సంగ్రహకర్త విన్నకోట పెద్దన గూడ సీసమాఱడుగులు = ఆఱు పాదములని చెప్పియుండెను. కాని సీసమున కాఱుపాదములె యని తెలియుచున్నది.[13] సీసము శీర్షకభనము కదా ! ఆరు శీర్షములు కలవాడు - కుమారస్వామి. కాబట్టి సీసపద్యము నందు గల ఆరుపాదములు కుమారస్వామిని స్ఫురింపజేయును. ఆరుముఖముల వేల్పు కుమారస్వామిని స్తుతించినట్లగును.

సీసపద్యములతో శతకములు చాల యల్ప సంఖ్యలో రచియింపబడినవి. వీనిలో పాల్కురికి సోమనాధుని 'బసవలింగ శతకము' ఏకామ్రనాధుని 'బసవ లింగ శతకము', తాళ్ళపాక అన్నమాచార్యుల వారి 'వెంకటేశ్వర శతకము', రావిపాటి త్రిపురాంతకుని 'అంబికా శతకము', గోపీనాథము వెంకటకవి 'బ్రహ్మా నంద శతకము', గోగులపాటి కూర్మకవి 'సింహాద్రి నారసింహ శతకము', కాసుల పురుషోత్తమకవి 'ఆంధ్రనాయక శతకము' తాళ్ళపాక శ్రీనివాసకవి - 'లక్ష్మీవెంకటేశ్వర శతకము', గంగాధరకవి 'కీరవాణి శతకము', శేషప్పకవి 'నరసంహశతకము', రెంటచింత 'లక్ష్మీనరసింహ శతకమును', పరశురామ నృసింహదాసు 'శ్రీ భద్రాద్రి రామ శతకము', రావూరి సంజీవకవి 'వీరనారాయణ శతకము', శాకుఱ్ఱాజు వెంకట శివకవి 'నేపాలరాజు లింగశతకము', ముడంబై వెంకటరామ నృసింహాచార్యులు 'శ్రీరంగేశ శతకము', అమలాపురపు సన్యాసికవి 'విశ్వనాధ శతకము, కార్యముపూడి రాజమన్నారు 'మాధవస్వామి శతకమును', టేకుమళ్ళ రామచంద్రరావుగారి శ్రీ నాగేశ్వర శతకము, 1600 ప్రాంతమున

రచియింపబడిన శ్రీరామతారక శతకము, 600 ప్రాంతమున రచియింపబడిన శ్రీరంగశాయి శతకమును కర్తృత్వము తెలియకపోయినను పై వానితో శ్రీ వంగూరి సుబ్బారావు గారు తమ యాంధ్ర వాఙ్మయ చరిత్రయం దుదాహరించిరి.

ఇవన్నియు భక్తి శృంగారశతకములే ! సీసపద్యములలో రచియింపబడిన నీతిశతకములు చాలకొద్ది. అందు శ్రీరాములుగారి 'చక్కట్లదండ', తాళ్ళపాక తిమ్మనార్యుని నీతిశతకము,[14] కస్తూరి రామారావుగారి కోటిలింగ శతకమును ముఖ్యములు. పైవానిలో పాల్కురికి సోమనాథుని 'బసవలింగశతకము'ను సీసపద్యములకును, ఏకామ్రనాథుని 'అన్యవాద కోలాహలము' అను నామాంతరము గల 'సోమనాథలింగశతకము'న సీసపద్యములకును అటవెలదులే వ్రాయబడియున్నవి. నన్నయకృత భారత భాగమున నున్న సీసపద్యములకు ఆటవెలదులే ప్రాయికముగా వ్రాయుట గలదు. తరువాత వెలువడిన 'ఆంధ్ర నాయకశతకము', 'రామలింగశతకము', కుక్కుటేశ్వరశతకము, మొదలగువాని యందలి సీసములకు తేటగీతులే యున్నవనియు గ్రహింపనగును. కాలమును బట్టి శ్రీరామకవి గారు గూడ సీసములకు తేటగీతులే చెప్పిరి.

నన్నయ రచించిన ఆదిపర్వమున ఉదంకుడు నాగులను స్తుతియించు సందర్భమున 'మాకు ప్రసన్నుడయ్యెడున్' అన్న ప్రార్ధనతో గూడిన నాలుగు పద్యములున్నవి. ఈ ప్రార్థన పద్యములు శతకము లందలి మకుటమును పోలి యున్నవి. అట్లే నన్నెచోడుని 'కుమార సంభవము' న రెండుచోట్ల స్తుతి పూర్వకము లైన శతకపద్యములను తలపించు సీసపద్యములు సుప్రసిద్ధములైనవి. 'అజారు ద్రాశివా' అన్న మకుటముతో నాలుగైదు వందల కందపద్యములు శివతత్వసార మనుపేర మల్లికార్జునపండితుడు వ్రాసెను.[15] తెనుగున పండితారాధ్యుడే ప్రథమ శతకకర్త యని చెప్పుకొనవచ్చును. అయినప్పటికి ఆంధ్రశతక వాఙ్మయ మున సంఖ్యానియమము, మకుటనియమము గలిగిన శతకములలో మొదటిది- పాలకురికి సోమనాథుని 'వృషాధిప శతకము'. ఇట్లు మకుటనియమ మేర్పడినది. చక్కట్లదండ యందు -

అని పలుకు దాసు రాముడిట్లచ్చ తెనుగు
కబ్బమందము నిండ చక్కట్లదండ

ఇది తేటగీతి చివరి రెండు పాదములు. ఇది తేటగీతిలో దప్ప నిమడదు. కావున శతకమంతయు తేటగీతి యగును. తెలుగున ప్రత్యేకముగా కొన్ని ఆటవెలదులు, సీసపద్యమలకు నియతముగా గూర్చబడుటచేత శతకమంతయు సీసపద్యములతోనే రచియింపబడినది. ఈ మకుటముతోనే నూఱు సీస పద్యములతో సమాప్తి చేసిరి. శతక కర్తలెల్లరు నూటయెనిమిది పద్యములు వ్రాయుట యలవాటుగా గనపడుచున్నది. దేవతా పూజలయం దష్టోత్తరశతనామ పూజచేయుదురు గదా! అట్లే దేవతల శష్టోత్తరశత పద్యములను సమర్పించి భక్తి శతకములను వ్రాసి మన పూర్వకవులెల్లరు సంతృప్తి నందుచుండిరి. ఆ కోవలోనే శృంగార శతకములు,నీతి శతకములు,రాజకీయశతకములు, హాస్య శతకములు వేదాంత శతకములు. భాషోత్పత్తి వికాశము నిరూపించు శతకములు (ఉదా :- భారతీ శతకము) గూడ వచ్చినవి. అంతేగాదు తిట్టు శతకములు గూడ వెలువడినవి. ఈ శతక రచన సంస్కృత భాష యందును గలదు. మయూరుని 'సూర్యశతకము', భర్తృహరి 'శతకత్రయము', 'మూకపంచశతి' మున్నగునవి యిట్టివి. శ్రీరామకవి సంస్కృతమున కామాక్షి శతకమును వ్రాసిరి. మయూరుని 'సూర్య శతకమున' కనువాదము వ్రాసిరి. అందును నూఱు పద్యములే కలవు. కావున నిట్లు నూఱు పద్యములే వ్రాసి వదలుట సంస్కృత మర్యాద పాటించుటకని లేదా యిది లౌకిక రచన యాముష్మిక రచనకాదని తెలియజేయుటకేయని తెలియుచున్నది.

మకుటము నిష్టదేవతా పరముగానో, ఆత్మసంబోధనాపరముగానో, గురువు మున్నగువారి పరముగానో యుండును. ఇది ఆత్మసంబోధనా పరముగ నున్నది.

చతుర్విధ పురుషార్థములలో ధర్మమాద్యమైనది. పురాణములు,వేద వేదాంగములు, మున్నగు ప్రక్రియ లన్నింటియందును ప్రత్యక్షముగను, పరోక్షము గను, ధర్మస్వరూపము వివిధ నీతులు ఉపదేశింపబడినవి. నీతులలోని సారాంశమును శతక పద్యముల రూపమున ఘటించి శతకకర్తలు తెలుగులో స్వతంత్ర నీతిశాస్త్రములు లేని లోటు తీర్చిరి. భక్తిశతకముల తరువాత అసంఖ్యాముగ వెలువడియనవియు, బహుళ ప్రచారము నొందినవియును నీతి శతకములే.[16]

ఇవి రాజనీతి ప్రధానము లనియు, లౌకిక నీతి ప్రధానములనియు రెండు వర్గములుగ పరిశీలించవచ్చును. రాజనీతి శతకములలో బద్దెన 'నీతి శాస్త్రముక్తావళి' ఆద్యమైనది. తెలుగునాట బహుళప్రచారము నందిన లౌకిక నీతి శతకములు – సుమతీ, కుమారీ, గువ్వలచెన్న, వేమన శతకములు. ఈ చక్కట్లదండ నీతిబోధకముగ వ్రాయబడిన శతకకావ్యము. శతకములన్నియు సలక్షణమైన కావ్యభాషలోనే యుండును. కావుననే లాక్షణికులు శతకముల నుండి ప్రయోగములు ప్రాయికముగా గ్రహించిరి. దీని కపవాదమయినట్టివి యొకటి రెండు కలవు. తెనుగున చంద్రశేఖర శతకమనునది కలదు. ఇది 'చంద్ర శేఖర' యను మకుటముతో చంపకోత్పలమాలికలతో రచింపబడినది. ఇందలి భాష యంతయు గ్రామ్యమే. నీతిశతకములందు కవిత్వము కలదా లేదా యను మీమాంసకు తావులేదు. రసము శృంగారాదులచే నవవిధములుగ విభజింప బడియున్నది. అనగా మనుజుని యనుభవము తొమ్మిది విధములని యాలంకారికుల విశ్వాసము. మానవుని హృదయములో (జీవునిలో) నున్న సత్త్వము, అనుభూతి,శక్తి తొమ్మిది పద్ధతులుగా దర్శింపబడినవి. మానవుని యింద్రియానుభూతికి రసానుభూతికి కొంత భేదము కలదు. ఇంద్రియానుభూతి క్షుద్రమైనది. ఉపాధికి మాత్రమే అనగా దేహమునకే సంబంధించినది. రసానుభూతి యట్టిదికాదు. కొంత మార్దవము చేర్చుకొన్న, కొంత సంస్కార విశేషము నార్జించుకొన్న హృదయము నందె రసానుభూతి శక్యమగును. ఇంద్రియానుభూతి కామక్రోధాదులుగా విభక్తము చేయబడినది. రసానుభూతి శృంగారాది రసములుగా విభాగము నొందినది. పాశవికమైన మనోభూమికను దాటి సంస్కృతమైన అనగా కొన్ని ఆత్మగుణములను సంపాదించుకున్న మనస్సు ననే రసానుభూతి కలుగుచుండును. ఆత్మగుణము అనగా కరుణ, మైత్రి మొదలగునవి. యాగములో హవిష్యముగా కాల్పబడబోవుచున్న మేకపిల్లను జూడగానే బుద్ధుని యందు కరుణోదయమయ్యెను. హరిజనుల యగచాట్లు చూచిన గాంధీజీ మనస్సు నందు అహింస కరుణ మైత్రి రసోదయమయ్యెను.

ధర్మ హాస్యాదులకు ఈ శతకమందు కొంత ప్రవేశమున్నను పరిపుష్టి నొందుట కవకాశము నీతి శతకముల యందు లేదు. కనుక రసభావముల చర్చకన్న నీకవి రచనాసామర్థ్యము బరిశీలించుట ముఖ్యము. శ్రీ శ్రీరామకవి

మహాకవి. మహాకవికి రెండు లక్షణములు ముఖ్యముగా నుండును. ఒకటి లోకోత్తరమై సృష్టివ్యంజకమైన మహాకథను కల్పించుట రెండవది వ్యక్తవ్యమైన యంశమును వ్యంజనామార్గమున వ్యక్తీకరించుట. జాతీయమైన పలుకుబడిని సంగ్రహించుట, లోకరంజకమైన రీతిని సాధించుట మొదలైన యానుషంగిక లక్షణములు గూడ మహాకవిత్వ హేతువులై యుండును.

నీతిశతక మగుటచే లౌకోత్తరమైన కథాకల్పనకు ఇందు తావు లేదు. అందు దక్కిన మహాకవి లక్షణములన్నియు సంపూర్ణముగ బ్రసన్నములై యున్నవి.

మొలకపాటున నడ్డిమలఁచి కట్టినఁగాని
తడబొంగు పల్లకీ దండెగాదు
లేఁతపాటునఁజివ్విపాత్రఁ గట్టినఁగాని
మండ చక్కని యంటుమావిగాదు
దూడపాటున ద్రిప్పి యాడనేర్చినఁగాని
ఎద్దుపన్నిన గంగిరెద్దుకాదు
నాఱుపాటున దీసినాటి పెంచినఁగాని
దుక్కిమూసిన వరిదుబ్బుగాదు.

పాటుపడి నేర్వవలెఁ జిన్ననాఁటనుండి
కానియెడ నెందునను జాణగాఁడుసుమ్మి । అని పలుకు । 66

ఇందలి యెత్తుగీతిలో నీపద్యము గుణీభూతమై వాచ్యకోటిలోనికి జేరినది. ఇది లేనిచో దక్కిన పెద్దపాదములు నాల్గును వ్యంగ్యకోటినున్నవే. ఇవి మహాకవిత్వమున కుదాహరణముగా జెప్పదగిన పద్యము. ఇందు మొలకపాటున, లేతపాటున, దూడపాటున, నాఱుపాటున అను శబ్దములు తెలుగుపలుకుబడి జాతిని గ్రహించుచున్నది. పాటు అనుదానికి కాలము, అవస్థయను రెండర్థములు గలవు. ఆ అర్థములకు దగిన యనువు తెలుగు భాషకే కలదు. ఇది మఱియే భాషలోనికి ననువదించుట కనువైనది కాదు. ఇట్టిదియే జాతీయమనబడును. 'పన్నిన గంగిరెద్దు' అనునది కూడ నిట్టిదియే. పన్నుట-ఆటకు సిద్ధము చేయుట యని ప్రస్తుతార్థము నాగలి పన్నుట, వ్యూహము పన్నుట మొదలగు ప్రయోగములు కలవు. 'దుక్కి మూసిన' యను ప్రయోగము నీజాతిలో జేరునదియే. దుబ్బు

పెరిగిన కొలదియు దుక్కిని మూసివేయుచుండును. ఇట్టి ప్రయోగముల వలననే శ్రీరాములు గారిని మహాకవి యని రూఢిగా జెప్పవచ్చును.

ఇందలి ధర్మప్రబోధమునకు మఱియొక గొప్ప యుదాహరణ చూపవచ్చును.

పొరుఁగువారికి మేలు పొందరాదంటివా
ఇఱుగుఁవారికి నీవ పొరుగువాఁడు
ఇరుఁగువారికి మేలు హెచ్చరాదంటివా
పొఱుఁగువారికి నీవ యిరుఁగువాడు
ఇరుఁగుబొరుఁగు నీవు నెనయరాదంటివా
ఇంకనెవ్వఱికి మేలెనయవచ్చు.

ఎల్లఱకు మేలుగోరుట చెల్లుఁగాని
తనకు మేల్పెరలకుఁగీఁడు దలపఁరాదు ।అని పలుకు। 59

ఈ పద్యము నందలి తాత్పర్యము నవధరించినచో ప్రస్తుతకాలమున నమిత ప్రచారమందున్న సర్వసమత్వభావము కొట్టవచ్చినట్లు కనబడుచున్నది. ఇది నాటికి నేటికి నిత్యమైన సత్యము. ప్రజలయందే మనఃప్రవృత్తి ప్రబలినపుడు గాని యేజాతికైనను శాంతి చేకూరదు. ఏ సమాజమునకైనను స్వస్థత చేకూరదు. ఇది ప్రపంచపరివ్యాప్తమైన ధర్మము. శ్రీకారముతో గ్రంథారంభము చేయుట నన్నయ నాటి నుండి తెలుగునాట పాదుకొని పోయినది. 'శ్రీకారము' తత్సమపదము. ఇది యచ్చతెనుగు కావ్యమగుటచే 'శ్రీ' కి వికృతియైన 'సిరి' శబ్దమును స్వీకరించిరి.

సిరికి ఔమ్మిచ్చి మచ్చిక సేయునిచ్చలు
వెన్నుండుఁదా వేల్పు వేలుపయిన ! 1

ఇట్లు 'సిరి' తో ప్రారంభించి సంప్రదాయమును పాటించిరి.

ప్రపంచము నంతటిని సునిశితముగ పరిశీలించి యందలి వివిధ విషయములను కూలంకషముగ నాత్మవలోకనము గావించుకొని యిది రచించిరి. 'లోకానుభవము' వలన మనకు దెలియుచున్న వస్తువులు వాని గుణములు క్రియలు మాత్రమే దృష్టాంతముగా గయికొనబడినవే కాని దేవతలు,పిశాచములు, రాక్షసులు, స్వభావవిరుద్ధములైన గ్రాంధికము లయి కన్పట్టినవి, దృష్టాంతములుగ

జేకొనబడలేదు. కాని మొదటి పద్యము నందు దేవతాస్మరణము నుద్దేశించియు, పదునొకండవ పద్యము యొక్క 2,3,4 పాదములయందు హిందూదేశవాసులు సుప్రసిద్ధముగా నెఱిగియున్నట్టియు, దేవతలు పేర్కొనబడిరి అని కవి పీఠికలో వ్రాసిరి.[17] యమునకు పెతరుల వేలుపని, విష్ణువునకు తమ్మికంటి యనియు, గంగకు మిన్నేటికన్నె యనియు తెలుగుసేసిరి.

శ్రీ శ్రీరాములు గారి రచనాపాటవము సామాన్యమైనది కాదు. వారు ప్రయోగించు శబ్దజాలమంతయు లోకము నుండి 'తాజా' గా సంపాదించి తెచ్చినది గాని పరులనుండి పురాతన గ్రంథముల నుండి సంగ్రహించిన యెంగిలి శబ్దమొక్కటియైన గానరాదు. వ్యాకరణకారులు 'సిద్ధిర్లోకాదృశ్యా' అని నిష్కర్ష[18] శబ్దము లోకమునకు, లోకములోని వాడుకకు బ్రతీక. దాని నున్నదున్నట్లుగా గ్రహించుటతోనే మహాకవి ప్రయోగ చమత్కారము నిండియుండెను. వారి కవిత యందెక్కడబట్టిన నక్కడ యీ 'తాజాతనము' గోచరించుచుండును.

క్రొవ్విన జెల్లనిక్కుచు నీళ్లమిడిసిన
 గట్టుపైఁ బడుఁ బెద్దగ్రద్దనోట
పోతరించిన పాము పుట్టెక్కి తలయెత్త
 గ్రక్కునఁగడతేరు గరుడినోట
పొగఱుకొన్న పొటేలు తెగి మందఁబాసిన
 వీలుగాఁజిక్కుఁ దోడేలు బారి
గుంజఁబట్టిన నల్లి కోడెక్కి నిలిచిన
 గాసిఁ జెందును సొంతగానిచేత

కన్నుఁగానక నెళవులు గదలిమిట్టి
పడినవారికి నిక్కంబు గొడవవచ్చు ।అనిపలుకు । 53

ఇందలి క్రొవ్విన జెల్ల, మిడిసిన, పోతరించిన, పొగరుకొన్న, తెగిమందఁ బాసిన, తోడేలుదారి గుంజబట్టిన నల్లి సొంతగాని నెళవులు గదల, నిక్కంబు గొడవ యను శబ్దము లితరభాషల ప్రభావము లేక తెలుఁగునోట పలుకబడు తెనుఁగుతనమును పూర్తిగ ప్రస్ఫుటము చేయునట్టివి. వాడుకభాషయన నిదియే. నీతిశతకమిట్టి వాడుకభాషతో సులభశైలిలో రచియింపబడినది. ధారాశుద్ధి కలిగి యనర్గళమైన గంగాస్రవంతి వలె సాగిపోవుచున్నది.

ఈ శతకము నందంతటఁ కవికి గల లోకవ్యవహారదక్షత, కళాభిలాష, నానాశాస్త్ర పరిచయము, ఆనాటి సమాజస్వరూపము, సంఘసంస్కారాభిలాషయు విదితమగును.

ఈ లౌకికనీతిమాలికలోని నీతులు వెలలేని యనర్ఘమణులు.

ఎల్లఱకు మేలుగోరుట చెల్లుగాని
తనకె కావలెననుకొన్నఁ దరమెపడయ. 63

మంచి గోరినవాఁడెప్డు మంచిదైన
పనియొనర్పక యూరకేర్పడదు మంచి. 62

ఎట్టివానికైననుఁ జెట్టచెలిమిచూడ
చెట్టబుట్టించుఁగాని మేల్చేయదెన్న. 8

'ఎఱుకమాలిన వారలకెంత మేలు
గూరిచినదానిఁ దెలియంగలేరు సుమ్ము'. 30

తనకులేనట్టి యందంబు దాల్చుకున్న
దానఁగలిగెడి కర్జమింతయును లేదు' 44

(Shining in borrowed feathers), అన్న ఆంగ్లములోని యా భాణకమునకు భావానువాదమే యీ నీతివాక్యము)

'తినుచునున్నది విడిచి యింక నొక పెద్ద
తిండికాసించుపోవు నతండు చెడును. 56

'కానరానట్టి మేలొండు కలదటంచు
కానిపని సేయఁగా సమకట్టఁదగదు'. 67

'మంచికైచేయు పనిని మన్నించవలయు' 69

'మంచి చెడ్డల కానవాళ్లెంచిచూడ
కలిమిపేదఱికంబులు గావు సుమ్ము' 70

అబ్బెసములేని పనులు సేయంగరాదు
చేసెనేనియుఁ దప్పులు సేయకున్నె'. 82

'నలుగుఱేగినదారినే నడువుమంద్రు
మంచిదోకాదో యది యేరు నెంచలేరు'. 84

'చెడిపె పొందేరికి! జెఱుపేతెచ్చునుగాని ' 85

'చెడుగుతోఁబొత్తు తప్పక చెరుపెతెచ్చు
మంచితనమునఁ దామెంత మించియున్న'. 86

చెడుగు చేసిన పనిఁజేయఁ జెఱుపుపోదు
చేయవలసిన పనిఁజేయఁ జెందుమేలు'. 78

ఈ కవి నుడివిన నీతులు దేనెపెఱవాకలు. ఇట్టివి పరశ్శతములు. వీరి యుపమానములు విషయమునెంతో సులభముగా నర్థము చేసికొనుట కుపకరించును. ఆ యుపమానములు నిత్యము మనము చూచుచున్న వస్తువుల నుండియే గ్రహింపబడినవి కాని కృతకములు గావు.

బంగారుబొమ్మకు రంగుబూయగనేల
    పేడబొమ్మకుఁబూయఁ గూడుఁగాక
పాసెంబునకు నూఱుఁ బద్దనంజఁగనేల
    చోడంబలిని నంజఁగూడుఁగాక
వెండిగిన్నెకుఁ జింతపండు పుల్కాపేల
    వాడనిత్తడి కిడఁగూడుఁగాక. 2

బంగారుపుల్లతో బండుల్లదోము నెవండు
    వేఁపపుల్లనుఁదోమి విడుచుఁగాక
కమ్మనినేతితోఁగాళ్ళు గడ్గ నెవండు
    కడవలో నీటితోఁ గడుగుఁగాక. 20

గంతఁదీసిననైన గంగిరెద్దు పొలాన
    మెడద్రిప్పు డోలు చవ్వడులు విన్న. 24

అల్లారుముద్దుగా నాడించు పసిబిడ్డ
    మెడమీదఁ గూర్చుండి యొడలు చెఱుచు. 30

'వేదురెత్తినకుక్క వేటకై కొనిపోవ, కట్టి పెంచిన వాని కాలుగఱచు '
'కుళ్ళు గుమ్మడికాయఁగూరవండుక తిన నింటివాని కడుపుమంటబుట్టు'
'తిట్టుఁబోతగునాలిఁ దీర్థంబు గొనిపోవ కట్టుకున్నా తని బెట్టుఁజెఱుచు'
31

'పెద్దలందఱుగూడి పెండ్లిసేయగఁబూన
జోగిసన్యాసికి జుట్టె మెఱువు
మున్నీటఁదోరణమ్ములుగట్ట సమకట్ట
నెదుఱుగుంజలుఁబాతఁ గుదురె కఱవు
మినపగారెలు వండగనుఁ బెట్టజిల్లికి
కేలు లేనమ్మకు వ్రేలె కొదువ'. 34

"అంకులాడికినిఁ బేఱంటంబు సెప్పిన
నోరచూపల మగవారిఁదనుపు' – 38

"తేలుకుట్టిన వాని మేలై నపల్లకీ
మీదనెక్కించిన బాదలేదె" –42

'వరివెన్ను విడిచి కొబ్బరికాయ కాసించు
చిలుకేమి దిను ముక్కు చెడుటగాక' –56

"కాళ్ళుబోయినవాడు కాళ్ళకై తిరుపతి
గట్టెక్కఁబోయిన ఁగదలుటెట్లు
కనుబోయినవాఁడు కనులకై తాగండ
జోతిఁజూడగబోవఁజూచుటెట్లు'
చెవులుబోయినవాఁడు చెవులకై సుద్దులు
వినఁగఁబోయినఁజేరి వినుటయెట్లు
మాటబోయినవాడు మాటకై మంతరాల్
చదువ ఁబోయినఁ బట్టి చదువుటెట్లు' – 67

కొమ్ము ఁకోతిని నెఱుంగుదు నన్న వాఁడు రెం
డన్న నేమవి పదారన్ననేమి' –79

'నల్లి కోసరము మంచంబుదెబ్బలఁబడు
కరుపు కోసము త్రోలుగోయఁబడును'
పగవానికయి కోటఁబగులఁగొట్టఁగఁబడు
బలుమీలకయి చెర్వు కలచఁబడును' - 86

తాడిక్రిందనుఁబాలుద్రావినప్పటికేని
కల్లుద్రావిన వానిగా ఁదలంత్రు' -94

నిండియున్న పసంటి నిలచి తాలిమి యుండ
వెలితికుండ తొళుక్కు తొళుకుమనదె' -97

మనచుట్టునున్న వాతావరణము నుండి చక్కని యుపమానములను, సుతిమెత్తని హాస్యముతో జోడించి చూపిరి.

ఆనాటి సంఘము నందలి ప్రతియొక్కరిని చక్కగ విమర్శించిరి. ముఖ్యముగ పై యుద్యోగస్థులను, వారి దుర్నయములను, లంచగొండి తనమును, అవినీతిని, పలుచోట్ల ప్రస్తావించిరి.

"లొజ్జునౌకర్లఁగాల్చుకతిన్న పయివాఁడు
సరదారు చేతిలోఁ జచ్చువాడె" -23

తగవులో నాయంబు దప్పకున్నే చాటు
లంచాల కాసించు లత్తు కోరు' -27

'కొంటె బాతాఖాని గొప్పకొల్వున నుంప
ఏలినవానిసొమ్మింటఁజేర్చు' -38

'తెలివినిండిఁ వారు థీష్టులై (Thiest) యొప్పంగ
మిడిమిడి చదువరుల్సుడి యెథీష్టులు (Atheist)
'గవరనర్ జనరలు కరుచిచ్చి పనిగొన్న
విల్లేజి మునసపు వెట్టిగొనును' - 97

హోదాలోనున్న యుద్యోగస్థుని నోటి దురుసుతన మిట్లు వర్ణించిరి -
నోటనాల్గింగిలీష్ ముక్కలు నేర్చి ఫూల్

గూసు నాన్సెన్సు యూగోవె యనును
అలతి యైదాఋాళ్ల కమలు దారీచేసి
ఖబరుదార్ బాత్‌నకొ కాన్‌పకడను
మొద్ధొక పల్లెకు మున్సఫీసేయుచు
గాడ్డెకొడుక పన్ను కట్టుమనును –91

లంచగొండితనముతో కడుపునిండించుకొనువారి నిట్లు పేర్కొనిరి –

'వ్రాతకరణమెప్డువ్రాయుచుఁగూర్చుండ
మేతకర్ణము దిను రై తుసొమ్ము
మంతరాల్చెప్పుచు మల్లుబొట్లుండంగ
నేగాని దిగమ్రింగు నెల్లుబొట్లు, – 93

అలతివానికి గొప్ప ఉద్యోగమొకటి వచ్చెనేని వాని యదరిపాటు ఎట్లుండునో చూపెను –

"కొంచెగానికి లచ్చికూడివచ్చినదేని గొడుగుఁదేతెమ్మను నడిమిరేయి"
"కొంటెముక్కళి గొప్ప కొలువులో బెట్టిన అందలంబున మేనుఁగందు నను"
–89

కల్లుసారా మస్తుగాఁ ద్రావునట్టి పుం
డాకోరు దొరయె బడాకచేరి
తెన్ను ఁగానక గడ్డిఁదిని పాడిదప్పు జ
టాకోరు సర్కారు నౌకరగునె" –32

ఈ పద్యము నందానాటి సర్కారు నౌకరుల దుశ్చేష్టితములు, మనకనులకు కట్టినట్లు స్పష్టముగా కన్పట్టుచున్నది.

1890 ప్రాంతమున ఏలూరులో 'పోలీసు షరికు'లో దొంగతనములు మెండు కాగ శ్రీరాములుగారు పై 'యాఫీసర్లకు' జెప్పి వారి నందరిని 'బదిలీ' చేయించిరి. ఇట్లే యింకొక పర్యాయము లంచగొండి యగు న్యాయాధికారిని గూడ 'బదిలీ' చేయించిరి. ఈ యనుభవము పైపద్యము లందు వ్యక్త మగుచున్నది. ఇది కవిగారి స్వీయానుభవములు.

1882-'74 లో గుడివాడలోని ఆంగ్లపాఠశాలలో నాంధ్రోపాధ్యాయులుగ నుండి తరువాత కైకలూరులోను నటుపిమ్మట డోకిపఱ్ఱు గ్రామముననుపనిచేసిరి. వీరికి విద్యార్థులపై మిక్కిలి ప్రేమ. బడిపెద్దల దురాగతముల గూర్చి యిట్లనిరి -

'పనికిమాలిన కూళ బడి పెద్ద ఁజేసిన
బసివాంద్రఁ దనకాళ్ళ బిసుకు మనును' - 89

ఉపాధ్యాయుడు కొట్టినాడని 'ఫిర్యాదు' తెచ్చిన పిల్లవాని తండ్రికి సమాధానమిది -

"చదివెడివానికిఁ జబుకుదెబ్బలు బుద్ధి
వచ్చుటకే కాని నొచ్చఁగాదు" -69

ఉపాధ్యాయులుగ దాను గమనించిన విషయములివి -

'బడి పంతులెదుట గుఱ్ఱడు కాల్గదపఁడు
పంతులుచాటై న బంతులాడు' - 51

"బుద్ధిలేకాఁటలఁ బ్రొద్దుఁబుచ్చెడు కుఱ్ఱ
బడవాకు వఱవడి వ్రాఁతకోఁత" - 25

శ్రీ వీరేశలింగము పంతులు గారివలె వీరును గొప్ప సంఘసంస్కర్తలు. తన నలుబదితొమ్మిదవ యేటనే ప్లీడరువృత్తిని విసర్జించి తాను సంఘములోని లోపములను గుర్తెరిగి వానిని బాపుటకు సంఘసంస్కర్తగా రాజకీయవేత్తగా, గొంతకాలము గడిపిరి. సంఘములో నుండిన దురాచారములను ఖండించిరి. తానుపదేశించు సంస్కారముల తన యింట నాచరింపజేసి యితరుల నట్లాచరించుడని ప్రబోధించెను. స్త్రీవిద్య, స్త్రీస్వాతంత్ర్యము, వీనిని కూడ తనవలెనే సంగీతసాహిత్యనిష్ణాతగా తీర్చిదిద్దిరి. స్త్రీలను బయటికి రానిచ్చుట పెద్దల యిళ్ళలో మర్యాదకాదు. సభలకు, ఉపన్యాసములకు బోవుట తప్పుగా భావించెడివారు. వీరి సతీమణియైన జానికమ్మ గారొక సభకు విచ్చేసిరి. అట్లు సభకు వేంచేసిన మొట్టమొదటి గృహిణి వీరే. అందుపై వీరిని పలువు రవహేళన చేసిరి. వారికిది

సమాధానము –

ఆలి లోఁపలియింట నడచి పెట్టంగానె
కూళ గండఁడు రాచకొమరుఁడగునె' – 11

సంప్రదాయమునకై ప్రాకులాడు 'చాదస్తుల' చేతల నిట్లు చెప్పిరి –

"చేదస్త మున నేళ్ళు చెల్లిన బాపండు
పెద్దచెఱ్వనఁజల్లుఁ బేడనీళ్ళు" – 71

కాటికి కాలుసాచు ముదుసలులు బాలికల వివాహమాడు చుండెడివారు, అట్టివారిని గూడ యవహేళన జేసిరి.

"ముసలాతనికి నొక్క ముద్దరాల్దొరికిన
కూడనేరదు పొత్తు వీడలేఁడు" – 57

గయ్యాళులగు నత్తాకోడళ్ళ గూర్చి యిట్లు చెప్పిరి –

"అత్త గారినిఁ గాఱులాడి కొట్టిన రాఁగ
గొంతుబిట్టి పిసుకుఁ గొడుకునాలు" – 23

'కనికరానకు నత్త గారె బూరెలు బెట్ట
కొంటె కోడలు పుట్టినింటికంపు"
పఱవుకై కోడలు పడియూడిగముసేయ
గట్టువాయత్త కాళ్లడుగు మనుచు' – 81

ఆనాటి పురుషుల దుర్వ్యసనముల గూర్చి ప్రస్తావించి ముఖ్యముగా కల్లుత్రాగుట, వేశ్యాగృహములకేగుట, కడు నీచమని ఖండించెను. మధ్యపాన నిషేధమును గూర్చి ప్రబోధించుదినములవి. ఈ ప్రభావము కవిగారిపై గూడ పడి వానిచే ప్రభావితులై యివిచెప్పిరి –

"కల్లు సారా మస్తుగాఁ ద్రావునట్టి పుం
డాకోరు దొరయె బడా కచేరి" –32

"కలుద్రావి పాలన్న కల్ల రీని బడాయి
కట్టలేమే యొక్క గడియలోన" – 36

'తగునంచు గంజాయి దమ్ముఁగొట్టుపిసాసి
కల్లుద్రావెడి దోసకారిఁ దెగడు' - 47

శ్రీ దాసు శ్రీరాములు గారు చిన్నతనమున బందరులో చదువుచున్నప్పుడు నోబుల్‌దొర గారువీరి యసాధారణ శక్తి కలరి తమయింటికి గొనిపోవుచుండెడి వారు. తల్లిదండ్రులు కుమారుడు కులభ్రష్టుడై క్రైస్తవ మతము స్వీకరించునేమో యని యల్లూరునకు బిలపించుకొనిరి. స్థిరచిత్తము గలవారెచ్చటనున్నను వారి పెంపు తగ్గదనియు స్వీయానుభవమునిట్లు చెప్పిరి -

మల్లె పూవులు మాలవల్లె లోఁ బూసిన
తీవితగ్గదు కమ్మతావి బోదు

....... .......... .......

వాసిగల వంగసముగలవాని కెపుడు
చోఁటుమాఱిన మాఱునే సొంపుబెంపు ।అని।- 75

బ్రాహ్మణులు భ్రష్టులై పోవుచున్నారని వాపోవుచు నింకొకవంక జందెపు పోగులు రెండువేసికొన్న సాయిబు బ్రాహ్మణుడు కాడు, జందెము లేనంత మాత్రమున బ్రాహ్మణుడు బ్రాహ్మణుడు కాకపోడని వాదించిరి. అయినను బ్రాహ్మణులు చేయు నపచారములను చెప్పుచు వారు విద్యా స్వరూపులు కాన దండించిన నింకొకవిధముగ వారే దండింపబడుదురని చెప్పిరి,

'బాపనయ్యల జుట్టుబట్టి యీడ్చిన కాపు
వెన్ను మీదనుఁ దన్ను వెట్టిమాల' - 23

వేమన వలె వీరును చక్కని హాస్యమును పోషించిరి. వీరి హాస్యము గూడ 'గాయపు మందు కత్తి కి పూసి కొట్టినట్లుండును'.

'ముక్కుఁగత్తి నిఁగోసి ముద్దరాల్చెక్కిళ్ల
మీద ముద్దిడుచున్న బాదలేదె' - 42

'జలుబు చేసినఁ జీదఁజాలనటంచును
ముక్కుగోసికొనెడి మొప్పెయెవఁడు' - 61

అన్నెంబు పున్నెంబు నరయఁజాలక పెంచు
మేనుకంటెను ద్రోలు జీనుమేలు' – 77

"కోడూరు బురదని మేడూరు బోయిన
మేడూరిలో జాస్తి మెట్టశిస్తు" – 76

'నెఱసిన ముసలమ్మ నెఱులు జవ్వనమునఁ
దుమ్మెద ఱెక్కల తోటిసాటి" – 74

కఱచిన వేపి కాల్గఱచు వాడుండునే
కాకఱాకును డబ్బు గట్టుగాక
దోచిన దొంగ యిల్దోచు వాడుండునే
అచ్చులో ఫిర్యాదు దెచ్చుగాక
కుట్టిన తేల్గొండి కుట్టువాఁడుండునే
గచ్ఛగంధమురాచి కాచుగాక – 78

'ఇచ్ఛలేనల్లున కెంత యొడ్డించిన
నీలకూరకు నుప్పుచాలదనును' – 35

వేమన వలె వీరును లోభులను దెగనాడిరి

"కడుపుగట్టుక మూటఁగట్టు పిసినిగొట్టు
గవ్వబోయిన పూట బువ్వమాను" – 71

"తనివిదీరని గూళతల యెత్తు ఁబోసిన
జుట్టుమిగిలెనేని కొట్టుకొనును" 35

పిసినిగొట్టుతనంబు, బేరజంబు, అతిశయంబు సోమరితనంబు తగవని చెప్పిరి.

ఈ శతకమందంతట మనోజ్ఞమైన గ్రామీణ వర్ణన కలదు. అల్లూర గ్రహారములో వారు పరిశీలించిన దంతయు తన నీతుల కుపమానముగ నిచ్చిరి. ఇందు కొన్ని గ్రామీణులకు మాత్రమే సువ్యక్తమగును.

పిఱుజు కాల్బందంబుబెట్ట నేర్చునెవండు
కఱుజు కాళ్ళకు బెట్టఁగలుగుఁగాక
నత్త చే గుగ్గిళ్లు నమలించు నెవ్వాఁడు
గిత్త చే నమలింప నేర్పుగాక" - 29

"కమ్మని గుగ్గిళ్లు గంపనిండఁగఁబెట్టి
గట్ల మేపెడి యెద్దు కర్రఁగొఱుకు" - 30

గొఱ్ఱెకాపరి గొల్ల గొడ్డుకాపరిఁజేయ
పాలుపిండుచుఁ గాలుపట్టి యెత్తు - 38

వరినాటినంతను వడ్లు రాలవు పంట
కళ్ళాల దనుకనుఁ గాయవలయు' - 52

నాఱుపాటున దీసి నాటి పెంచినఁగాని
దుక్కి మూసిన వరిదుబ్బుగాదు' - 66

"నారుబోసినవాఁడు నీరు దా జల్లడే
బఱ్ఱె దెచ్చినవాఁడు పలుపుఁదేడే
చెలమఁద్రవ్వినవాఁడు చేదద్రాడుంచఁడే
యెడ్లనుఁగొన్న వాఁడేరు కొనడె - 72

చినుకు గాఱని మబ్బు చెఱగులన్ని యుఁగ్రమ్ము
పూతబూయని మావి పొలము నిండు
దార బిండని బఱ్ఱె తవుడు తట్టెడు మేయు
కొంగ్రదున్నని దున్న కొమ్ము పొడుగు' - 87

'పొట్లకాయకు ఱాయిగట్టుట తిన్న గాఁ
బెఱఁగుట కేకాని విఱుఁగఁగాదు' - 69

'సాగుఁజేయనినేల చవుడెక్కి చెడిపోవు
పెడగట్ట దున్నిన మడియపండు' - 15

ఇట్లు చక్కట్లదండలో వారి లోకజ్ఞతయంతయు ద్రవ్విపోయబడిన దని చెప్పవచ్చును. చివరకు "క్రొత్త చీరెలలో గేదఁగులు పేర్చుట" (6), "కట్ట జాలక

మూలcబెట్టెలో దాచిన చీరెలు" (77), గూడ వీరి దృక్పథమునుంచి జారిపోలేదు. "గాదెలో సరుకులంగడిని బెట్టిన గాని మనవారు కొన రెంత మంచిదయిన" అన్న నిజమును గూడ గుర్తించిరి.

ఆగ్రహారీకులు భోగములకు, తిండికిని లోటులేదు. నిత్యము షడ్రసోపేతముగా భోజనముచేసి గఱ్ఱున త్రేన్చెడివారికి రుచుల సంగతి తెలియదా! ఈ విషయమున వీరు శ్రీనాథునికి సరిజోడు.

"కాటిరెడ్లకు హోళిగలు బెట్ట జిట్టారి
కలయట్లతో సరిగావటంద్రు" – 26
"తేలcబండిన పండు తియ్యగానేయుండు
వగరెక్క దే కోయcబచ్చికాయ" – 49
"పాలు మంచివియైనc బాసెంబు మంచిది
పట్టజాలము నీళ్ళు పాలలోcగలసిన
తెలియమే పెఱుగునో గలసినపుడు" – 68
మెదిగిన బియ్యము మెదుకు గమ్మదనమ్ము
చేబియ్యపోరెమ్ము సేగిసుమ్ము" – 49

శ్రీ శ్రీరాములు వారి లోకజ్ఞత యనన్య సామాన్యమైనది. ఈ నూఱు పద్యములు వీరి లోకజ్ఞత కుదాహరణములుగనే చెప్పవచ్చును. లోకజ్ఞానప్రదర్శన మూలకముగ నీతిబోధ చేయుటయే యీ గ్రంథారంభ మునకు మూలమైనది.

శ్రీరామకవీంద్రులు బహుశాస్త్ర కోవిదు లగుటచే వారి గ్రంథములలో సర్వ శాస్త్రవిషయములు నాపాతముగా దొర్లుచుండును. వారికి సంగీత శాస్త్రమున గాఢమైన ప్రవేశము కలదనుట కిది ప్రమాణముగా గైకొనవచ్చును.

"ఎఱుగలేము 'కనాడ దరబారు'గలసిన
చీలదే 'పూరి'తోcజేరినపుడు" – 68

కన్నడ దర్బారు రాగము లొక్కటే మేళకర్తలో జేరినవి. కాని పూరి, (కల్యాణి) యట్టిదికాదు. దాని సాంకర్యము కలిగినచో వెంటనే పట్టి వేయవచ్చునని తాత్పర్యము. కొందఱకు సహజమైత్రి యొదవును, మఱి కొందఱ కట్లు కుదరదని చెప్పుటకీ యుదాహరణ మీయబడినది.

అలిగె జాండరు (95) అను పద్యమున కవియొక్క చరిత్రజ్ఞాన మును, 'తెలియునే యీనేల తిరుగువం చై రోపి యనుల౦ గొబర్నికసునకు మున్ను' (96) అనుపద్యమున విజ్ఞానశాస్త్రజ్ఞానమును వెల్లడియగు చున్నది. 'పడమరదెస నుండి బల్లి పల్కంగానె దొరజూడనిదె కొల్వు దొరకబోదు' (64) అను పద్యమునను, 'గెలుపు సాలిది' (98) యను పద్యమునకు కవియొక్క జ్యోతిశ్శాస్త్ర పాండిత్యము విశదమగుచున్నది. "గచ్చాకు పుచ్చాకు కలిపిన" (74) అను పద్యమునను 'కఱచిన వేపి కాల్గఱుచు వాడుండునె' (78) అను పద్యమునను కవి గారి వైద్యశాస్త్రాను భవము గోచరించుచున్నది. "విక్టోరియా రాణి వెలసి యేలుట౦ బట్టి యిండియా పొగడిక యెక్కువాయె" (99) అను పద్యమునను కవి నివాసగ్రామము మొదలుగా గల చిఱునామ ఒసంగబడినది. ఇండియాలో 'మద్రాసు రాష్ట్రములోని గోదావరి డిస్ట్రిక్టులోని ఏలూరు' అని చమత్కారముగ (చూ॥ అనుబంధము – 6) నీతిని బోధించుచునే విషయ విశ్లేషణము గాకుండ చెప్పిరి 'గెలుపు సాలిది, మంచి గెలుపు నిచ్చుచునుండ' (98) అను పద్యము శ్లేషగర్భితముగ నున్నది. మొదటి యర్థమున నీతియు, రెండవ యర్థమున కవి గ్రంథసమాప్తి నొందించిన కాలము దెలియును. చివరి పద్యము విక్టోరియా మహారాణి యేలుబడిలో రాజ్యమెంత సుభిక్షముగ నున్నదో చెప్పిరి. ఆంగ్లేయులు చేసిన సంస్కరణలను చివరకు కాంగ్రేసును గూడ బేర్కొని యన్నిటికి మంగళమనిరి. 'విక్టోరియా రాణి గెలుపు గెలుపు' (Victory for Victoria) అని ముగించిరి.

ఈ చక్కట్లదండ కవిగారి నలుబది యెనిమిదవ యేట వ్రాయబడినది. "పదియేడేడుల యీడునం గవిత౦ జెప్పంబూని" సోమలింగశతకమును పసిప్రాయముననే ప్రౌఢముగ రచించిన కవిగారి కిట్టి శ్లేష గర్భితముగ నుండు నచ్చ తెనుగున వ్రాయుట నల్లేరుపై బండి సాగినట్లుండును.

ఇది వ్రాయుటలో యెచట మారుమూల పదములు లేకుండ అతి సహజముగా నుండు భాషలో తెలుగు పలుకుబడి జారిపోకుండ వ్రాయుట సామాన్యమైన పనికాదు. కవిగా రెంతటి యసాధారణ ప్రజ్ఞావంతులో తెలియుచున్నది.

వేమన శతకము, సుమతీశతకముల వలె విశేష ప్రచార మందవలసిన నీ శతక మింతటి ప్రచారమునకు రాకపోవుటకు కారణము ఆటవెలది, కందపద్యములతో రచింపబడక సీసములలో రచియింపబడి ధారణకు సుకరముగా లేకపోవుటయో, యచ్చతెనుగున రచియింపబడుటయోకావచ్చును. బాలబాలికలకు బాల్యము నందే చలిదిమూటలుగ నుపకరించు నీతిబోధక మావశ్యకమని నీతిశతకములు చదివింతురు కదా! అట్టియెడ యిందలి కొన్ని పద్యములం దశ్లీలము లుండుట వలననేమో మరి వ్యాప్తికి రాలేదు.

మొత్తముమీద నీ కవి యున్నదున్నట్లు గైకొని లేనిపోని యారోపిత భ్రాంతిని గాని, మూఢవిశ్వాసములను గాని పెట్టుకొనక యదార్థము జేపట్టి నీతులలో చక్కని సీసపద్యములతో తేనెచవులూరు తెనుగుభాషలో, నందును నచ్చతెనుగున రచించిరి. ఇంతటి జీవయుతముగ విరచింప బడిన నీత్యుపదేశ శతకము మఱియొకటి లేదని నొక్కి వక్కాణింపనగును.

## అధోజ్ఞాపికలు

1. ఆంధ్రభాషాభూషణము – కేతన., ప. 27

   తత్సమంబుదక్కఁ దక్కిన నాలుగు, నచ్చతెలుగులందు రఖిలజనులు నందులోన గ్రామ్యమనఁగ నెవ్వరు నొప్పి, దొరులఁదెగడుచోట నొప్పుదనియు

2. బాలవ్యాకరణము – అచ్ఛికపరిచ్ఛేదము, సూ : 1
3. చక్కట్లదండ – పీఠిక , పు. 1.
4. సర్వలక్షణసారసంగ్రహము – కూచిమంచి తిమ్మకవి, 1–69, పు. 15.
5. ఆంధ్రభాషావికాసము – శ్రీ గంటిజోగిసోమయాజిగారు, పు. 593.
6. ఆంధ్రవాఙ్మయచరిత్రము, పు. 1.
7. చక్కట్లదండ – పీఠిక
8. వికృతి వివేకము – సంజ్ఞ, పు. 9
9. తెనుఁగు వ్యాకరణ వికాసము – శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తంగారు, పు. 339.
10. ఆంధ్రశబ్ద చింతామణి – సంజ్ఞా పరిచ్ఛేదము, 3వ కారికలు
11. శబ్దరత్నాకరము – భాషా ప్రశంస, పు॥లు 9,10.

12. చక్కట్ల దండ – పీఠిక, పు. 2.

13. శతక సంపుటము – శ్రీ నిడదవోలు వెంకట్రావుగారు, పు॥లు. vii, viii. ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఆకాడమీ, హైదరాబాద్.

14. 'కోటిలింగశతకము' మానవసేవ పత్రికలో ప్రచురింపబడినవి. శ్రీగురుమూర్తి గారి సంపాదకత్వమున వెలువడినది. 'కుటిల జనభంగ సత్సంగ కోటిలింగ' అన్న మకుటముతో నున్నది.

15. సంగ్రహ ఆంధ్రవిజ్ఞాన కోశము, 8. – పు. 468.

16. ఆంధ్ర శతక వాఙ్మయము – శ్రీ గోపాలకృష్ణారావు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ, పు. 3.

17. చక్కట్లదండ – పీఠిక, పు. 1

18. ఆంధ్రశబ్దచింతామణి – సంజ్ఞాపరిచ్ఛేదము





శ్రీ మదనగోపాలస్వామి ఆలయము, డోకిపర్రు

## (iii) సూర్యశతకము

సంస్కృతమున 'సూర్యశతకము' బాణుని సమకాలికుడగు మయూర కవిచే ప్రౌఢముగ స్రగ్ధరావృత్తముల రచియింపబడినది. ఈతడు క్రీ.శ. 620 ప్రాంతమువాడు. భోజరాజు ఆస్థానకవి. అతి భయంకరమగు కుష్టురోగముచే బాధపడుచున్న సమయమున ననూనమగు భక్తి శ్రద్ధలతో సూర్యుని స్తుతించి తన రోగమును రూపుమాపుకొనెను.

దీనికి వల్లభదేవుడు, మధుసూదనుడు, త్రిభువన పాలుడు అనువారు మూవురును ప్రఖ్యాత వ్యాఖ్యాతలు,[1] శ్రీ యజ్ఞేశ్వరశాస్త్రి యను నతడును వ్యాఖ్య రచించియుండెను. ఇవిగాక యింకను బది వ్యాఖ్యలు గలవు. ఆనంద వర్ధనుని వంటి లాక్షణికులు దీనినుండి యుదాహరించిరన్న దీని విశిష్టత తెల్లమగును. శాకుంతలమువలె నిదియు పాశ్చాత్యభాషల లోనికను వదింపబడినది. "ఈ సూర్యశతకము అల్పగ్రంథమయ్యు మహాకావ్యమునకుదీటై మేఘసందేశమువలె ఖండకావ్య శ్రేణికి జెంది స్తుతికావ్యమగుచున్నది. ఈ శతకము కేవలము స్తుతిరూపమున నుండక రసవంతమై గుణాలంకార శోభితమై కావ్యముగ నవతరించినదని" శ్రీ చదలవాడ జయరామశాస్త్రిగారు తమ సూర్యశత కానువాదమున నుటంకించిరి.[2] కావున దీని యనువాదములు కూడ రసవన్మధురమై యుండవలెను. మయూరకవి 'సూర్యశతకము' నందలి పదునైదు శ్లోకముల ననువదించి శ్రీనాథుడు తన కాశీఖండమున జేర్చెను. శివరాత్రి మాహాత్మ్యమున గూడ రెండు శ్లోకములు పరివర్తితములైనవి.

అధునికయుగమున దీనిని సంపూర్ణముగ ననువదించినవారు శ్రీ ఆకుండి వ్యాసమూర్తి శాస్త్రిగారు (1893), శ్రీ వడ్డాది సుబ్బారాయుడు గారు (1899), శ్రీ దాసు శ్రీరాములుగారు (1902), శ్రీ చదలవాడ జయ రామశాస్త్రి గారు (1965), శ్రీ నేమాని సూర్యప్రకాశకవి గారు, శ్రీ భళ్ళమూడి నరసింహమూర్తి గారు (1972).

శ్రీనాథుని కాశీఖండములో కొన్ని శ్లోకముల ననువదించుకొన్నట్లే శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు, శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి గారు వారి

గ్రంథములగు మధురపండితరాజము, చైత్రరధము లందుకొన్ని భావచ్ఛాయలు చేర్చుకొనిరి.

శ్రీ శ్రీరాములుగారు పై రెండు అనువాదములను జూచియుందురు. మరల తిరిగి వ్రాయుటకు కారణము "శ్రీ వ్యాసమూర్తిశాస్త్రిగారు గొప్ప సంస్కృత పండితులగుటచే వారి యనువాదము తెనుగు కాకపోయినది. శ్రీ వడ్డాది సుబ్బరాయుడుగారు సహజముగ కవులగుటచేతను సంస్కృత మూలమున గల గంభీరార్థములు తెలుగులోనికి రాలేదు. అందువలన శ్రీరామకవిగారు మూలసూర్యశతకమేగాక వ్యాఖ్యానములనుగూడబరిశీలించి మయూర కవికృతిని పూర్వరీతిగ అనువాదములుగాక తెనుగు గావించిరి" అని శ్రీ నిడదవోలు వెంకటరావుగారు ఈ సూర్యశతక పీఠికలో వ్రాసిరి".[3]

మయూరిని సూర్యశతక మందు ఫలశ్రుతి శ్లోకములు రెండింటితో జేర్చి మొత్తము 102 శ్లోకములు గలవు. 1 నుండి 43 శ్లోకములలో సూర్యునిప్రభ కిరణశోభ వర్ణించబడినవి. తరువాతి యారు శ్లోకములందు సూర్యుని రధాశ్వముల వర్ణన గలదు. తరువాతి పన్నెండు శ్లోకములలో అనూరుని వర్ణనమును, పిమ్మట పదకొండు శ్లోకములందు రథ వర్ణనమును, నటుపిమ్మట ఎనిమిది శ్లోకముందు సూర్యమండల వర్ణనమును కలవు. శ్రీ దాసు శ్రీరాములుగారును నట్లే మయూరుని వంద పద్యముల ననువదించి మిగిలిన రెండును ఫలశృతిగ చెప్పిరి.

ఈ రసవన్మధురమైన స్తుతి కావ్యమున కనుగుణముగ శ్రీ శ్రీరాములుగారు మిక్కిలి మధురముగ తెనిగించిరి.

మూ. జంభారాతీభ కుంభోద్భవ మివ దధతః స్సాంద్ర సిందూర రేణుం
రక్తసిక్తా ఇవౌఘై రుదయగిరితటేధాతు ధారాద్రవస్య
ఆయాంత్యా తుల్యకాలం కమలవనరుచేవారుణావిభూత్యై
ర్భూయాసుర్భానయంతో భువన మభినవాభానవో భానవీయాః

దీనిని శ్రీ వడ్డాది సుబ్బారాయుడుగారు మొదలగువారెట్లు తెనిగించిరిరో గమనింపుడు -

నను. 1.మ॥శ్రీ బంభారికరీంద్ర కుంభ యుగళీ సింధూర ఖుంభద్రజో
రాజివ్యాప్తి నొ ప్రాగ పహార్యతటనిర్యద్ధాతు ధారాద్రతా
ఘాబస్రార్ధతనోసయోద్గమగనసరోజా భాప్తినోరక్తమౌ
బ్రాజేణ్ను వ్యజగద్విభాసిఘృణులై శ్వర్యంబు మీకిచ్చుతన్

ఆ. వ్యా. 2 తావిదెసహ త్తి కుంభముల తోరపుఁజెందిర పుస్రజంబునన్
ఓలెను దయాద్రి సానువుల భాసిలు జేగురుటేటి వెల్లువన్
బలెనపుడుప్పునం బుజవిభన్ బలెనెట్టని డాలుమీఱు వే
వెలుగు వెలుంగుమీకు శుభవృద్ధి నిరామయసిద్ధిఁజేయుతన్

శ్రీ. శ్రీ. జేజేరాయని కుంభికుంభ గతమౌ సింధూరముల్‌తాల్చి యో
యోజంజేగురు వాగులయ్యుదయ శైలోపాంతమందంటియో
రాజీవప్రభలేక కాలమునఁ బ్రారంభించియో యెట్టనై
తేజుల్‌చిమ్ము నవార్కభానులిడునెంతే మీకు నైశ్వర్యముల్

యా. ప. ముల్లోకమ్మల జ్ఞానదీపములు తమ్ముల్ జిమ్ము నూత్నారుణో
త్ఫుల్లశ్రీలకు నంగరక్షకములున్ పూర్వాద్రి ధాతుద్రవా
భ్యర్లాసమ్ముల తోడునీడలును వేల్పుందంతి సింధూర దీ
వ్యల్లీలాకృతులైన భానురుచులై శ్వర్యమ్ము మీకిచ్చుతన్

చ. జ. శా. శ్రీలరహించు నింద్రుని కరి చిక్కని యౌదలజెందిరంపుజూ
ల్దాలిచినట్లు పూర్వనగధాతు ఝరాంబుల గెంపులై తటిం
గ్రాలుచుఁ బద్మషండరుచిర క్తిమ ముజ్జగముల్ విభాసిలం
బోలన భానుభానువులు పొంపిరివో సిరులిచ్చు మీకిలన్

భ. న. ధారా ద్రవంబులఁదడిసె నొక్కో!
జంభారి మదకుంభికుంభోద్భవంబగు
సింధూరరేణువు సెందెనొక్కో
ఉదయభూధరతటి నుద్భూతమగు ధాతు
సమకాల సంభూతకమనీయ కమల షం
డారుణ దీప్తులనందెనొకో!
మందేహరాక్షసమారణశోణిత
స్రావశోణప్రభల్ సాకెనొక్కో!

అనుచు నమరులు నుదయాద్రి నలరువారు
మనుజవరులును నసురులు మదిదలంప
భాసమాన ప్రభారుణ పాదపంక్తి
సర్వపురుషార్థసిద్ధులొసంగుఁగాక

శ్రీ పి. లక్ష్మికాంతకవి గారు-

ఉదయాద్రిశిఖరసానూద్ధ్భాత ధాతుధా
రా మజ్జనక్రీడ రక్తినొంది
జంభారిభద్రేభ కుంభస్థలీసాంద్ర
సింధూర రజముతోఁ జెలిమిజేసి
త్రిదశకన్యాకరార్పిత హేమజలజాత
బలిపుష్పపరిచితిన్ బ్రౌఢిమెఱసి
దరహసితాంభోజ దళదళాంతరరాగ
సంగ్రహోత్కంఠచే జాలువాఱి.

యబ్జజాండఘటీ బహిరంతరముల
దళుకు జలపోతగావించి వెలుగునవిగొ
నవనవారుణ భానుభానువులు ప్రార్థ
నాంజలిఘటింపుఁ డభ్యుదయమ్ములొసగు

మొదటి యనువాదము సంస్కృతపదప్రచురమై, దీర్ఘసమాసఘటితమై అనువాదమున నుండదగిన సద్యస్ఫురణను సంతరించుకొనలేక పోయినది. నాలుగవదానిలో "ముల్లోకముల జ్ఞానదీపములు" అదనముగ జేర్పబడినది. జంభారాతి ప్రసక్తిలేదు. అయిదవ యనువాదములో నన్నియు ననూదితములైనవి. మూలశ్లోకములన్నియు వృత్యనుప్రాసాది శబ్దాలంకారములతో కూడియున్నవి. ఇందు 'భ' కారము వృత్యనుప్రాసతో గూడియున్నది. 'భ' అనగా కాంతి, కాంతిమంతుడగు సూర్యనారాయణుని వరముగ చెప్పుకొన వచ్చును. వృత్యనుప్రాసఅనువాదములలో కానరాదు. భళ్లమూడి నరసింహమూర్తి గారు సీసపద్యమును స్వీకరించిరి. కాన మూల ప్రపంచితముచేసి "మందేహరాక్షస మారణ శోణిత" అనునది చేర్చియు ననువదించిరి. ఉత్ప్రేక్ష యన్నిట పరివర్తిత

మైనది. పింగళి వారిది స్వేచ్ఛానువాదము. అలంకారశాస్త్ర పరిజ్ఞానమును వ్యక్తపరచు నుదాహరణ లెచ్చట బట్టిన నచ్చట గలవు.

34వ శ్లో- సంసక్త సిక్త మూలాదభినవ భువనోద్యాన కౌరితూహలిన్యా
యామిన్యా కన్యయేవామృతకరకలశావర్జితే నామృతేన
ఆర్కాలోకః క్రియాద్వోముదముదయ శిరశ్చక్రవాళాలవాల
దద్యున్ఫోలప్రవాళ ప్రతిమరుచిరహః పాదపప్రాక్ప్రవాళః

త్రిభువనోద్యానమున యామిని యను కన్య చంద్రుడను అమృత కలశమును చేతఁబూని పగలను చెట్లకు అమృతమను నీరుపోయ మొలకెత్తిన లేఁజిగురుల వలె నున్న అర్కకిరణములు ముదము నొసంగు గాక యని చెప్పబడిన యీ శ్లోకమున సావయవ రూపకాలంకారము, ఉత్ప్రేక్షాలంకారములు కలవు.

దీని యనువాదములు-

వ.సు. భువనోద్యానకుతూహలిత్వమున రేపూఁబోఁడి మూలంబునన్
ధనళాంశుండను కుండతో నమృతమున్ దాఁబోయఁబ్రాగద్రిపెఁ
దవుబింబంబను పాదునన్ ననుచు ప్రత్యగ్రప్రవాళాభమౌ
దివసోర్విజనవప్రవాళ మణిదీప్తి వ్యాప్తి బ్రోచున్ మిమున్ 34

ఆ.వ్యా. అలరాత్రంబుజనేత్ర నూత్నభవనోద్యానాశనో ప్రాక్కు భృ
ద్వలయాలవాలము యామినీకరఫలలోపాత్తామృతసేచనో
జ్జ్వలముం చేయఁగ విద్రుమాభ దినవృక్షాప్రాక్ప్రవాళంబు నా
విలసిల్లు న్రవిధామ మందు నెది ముద్విస్తారి మీకద్దియౌ

దా.శ్రీ. పొలుపుగ ముజ్జగంబులను పూవులతోఁటను బెంచు రాత్రియన్
గులుకుమిటారి చంద్రుఁడను కుండను బ్రాజ్నగ చక్రవాళమన్
చెలువపు బోదియన్ బగటిచెట్లకుఁదానమృతంబు వోయ ని
మ్ముల మొలకెత్తు లేఁజిగురు ప్రొద్దుటి యెండ ముదంబు మీకిడున్

యా.ప. జగమన్ పువ్వులతోట పెంచగ మహాశ్రద్ధన్ నిశాకన్య ఆ
రగ నారంగ సుధాకరామృతగము ధారన్‌పోయ చెమ్మెక్కిప్రా
జ్నగ శృంగాళియె పాదుగా మొలిచి శ్రోణిద్యోతులన్ చిమ్ము నీ
వగలన్ చెట్టుకుమొల్క ఆర్కరుచి సంపద్వృద్ధి మీకిచ్చుతన్

చ.జ. జగమను క్రొత్త పుష్ప వనిసాగ సుధానిధి గిండిరాత్రి క
న్యగొని సుధన్ మొదల్దడుప నయ్యుదయాగమ కొమ్మ పాదునం
జిగురి తొగర్జిగిం గలిగి చెన్నగు నాపగలింటి చెట్టు మొ
ల్కగ నుదయించు భాస్కరు ప్రకాశము మీకొసంగుం బ్రమోదమున్

భ.న. అభినవంబయి మెసలారు భువనోద్యాన
వనవాటి కౌతుక భావమొనయ
యామినీకన్యక యమృతాంశు కలశమ్ము
చేఁబూని యమృతమ్ము చిలుకుకతన
స్త మితమూలోదయ చక్రవాళ శిఖరా
వాలోద్గతంబయి వన్నె కెక్కి
బాలప్రవాళ సప్రతిమరుచిన్ దిన
పాదపాంకురము వ్యాప్తి పొదల

హేతుభూత ప్రవాళమ్ము నై తనర్చి
పరమసమ్మోదకారియై ప్రణుతికెక్కి
భాసమానమ్మయి పరగు భానుదీప్తి
సర్వపురుషార్థసిద్ధు లొసంగుఁగాక.

దాసు శ్రీరాములు గారిది మూలవిధేయముగ, విశదముగ హృద్యముగ నున్నది. 'కులుకు మిటారి' యన్న పదము పద్యమునకుఁ దెనుఁగుఁ దనమాపాదించినది. వ.సు. రాయల వారి యనువాదమున తెనుగు దనము తక్కువ. చదలవాడ జయరామశాస్త్రి గారిది, యామిజాల పద్మ నాభశాస్త్రి గారిది మూల విధేయముగ నున్నవి. భళ్ల నరసింహశాస్త్రిగారి దానిలో భావవివృత్తి గలదు. "సర్వపురుషార్థసిద్ధులొసంగుగాక" యను మకుటముకో ప్రభావర్ణనను వారు చేసిరి. కావున "ముదమునకు" మారుగ ఆ మకుటమునేయుంచిరి.

దత్తానందాః ప్రజానాం సముచిత సమయాకృష్టసృష్టైః పయోభిః
పూర్వాహ్ణేవిప్రకీర్ణా దిశిదిశి విరమత్యహ్ని సంహారభాజః
దీప్తాంశోర్దీర్ఘ దుఃఖప్రభవ భవభమోదన్వ దుత్తారనావో
గావోవః పావనానాం పరమ పరిమితాం ప్రీతిముత్పాదయంతు. 9

దీనికి దాసు శ్రీరాములు వారిది –

కాలమునం బయస్సులనుఁగాంచి యొసంగి ప్రజాసుఖంబిడున్
జాలఁజరించు ప్రొద్దుటన్వి శన్వి రమించును దీర్ఘదుఃఖ బం
బాలభవాబ్ధి కోడలు సుమా రవిగోవులు భవ్యపావన
త్వాలఘులవ్విమీకుఁబరమాధికతుష్టినినిబుష్టి నిచ్చుతన్.

మూలములో 'గో' శబ్దమునకు కిరణములు, గోవులని రెండర్థములు గలవు. కావున యచ్చుట శ్లోషోపమ కలదు. అనువాదమున రూపకాలంకారము కలదు.

యా. ప. సమయస్ఫూర్తి పయస్సులన్ గురిసి ఉత్సాహమ్ము గల్పించుచున్
క్రమవృత్తిన్ తొలిప్రొద్దునన్ వివిధ దిక్సంచారముంజేయు చ
స్త మయంబౌనెడ సంస్థితిన్గనుచు సంసారాబ్ధికిన్ నౌకయై
విమతఘ్నుం బినుపూతగోగణము సంప్రీతిన్ మిమున్ గాచుతన్

దీనియందును రూపకాలంకారమే కలదు

వ. సు. సమయాకృష్టవిసృష్టనిర్మల పయస్సంరక్షితాక్ష్మా ప్రజౌ
ఘములెవ్వెల్లడ తేపటం జెదరి యేకంబౌనుంచూపఫ్సవి
త్రము లార్తి ప్రభవోగ్రదుర్భవ భయోదన్వన్మహానావల
ర్వము గోవుల్గలిగించు మీ కహరహం బానంద సందోహమున్

అ. వ్యా. సమయాకృష్టవిసృష్ట పుష్కలపయస్సంప్రీతితాత్మ ప్రజ
మ్మమితాఘ ప్రభవద్భవాబ్ధికలముప్ర్వాంచత్పవిత్రాధిరా
జము ప్రాహ్ణప్రతిదిక్ప్రకీర్ణము పునస్సాయం నివృత్తమ్ము గో
సమజమ్మ సర్కజుమిచ్చు మీకమిత హర్షశ్రీ ప్రకర్షములన్

పైరెండును సంస్కృత పదభూయిష్టమై సరళతను స్పష్టతను గోల్పోయినవి.

చ. జ. తగువేళంగొని జార్చు నాపయసులందన్ లోకులానందముం
దగుచుం బ్రొద్దున దిక్కుదిక్కుఁజనుచంతం గూడుచున్సాయమం

దొగి సంసార భయాబ్ధి తారకములై యుద్వేల మోదంబిడుం
దగ గోవుల్వలె మీకుఁ బావకులకుం దామర్కునూత్నాంశువుల్

ఇందుపమాలంకారము గలదు.

సముచితసమయాన సత్పయస్సుల గొని
యింపార జనముల కిచ్చి యిచ్చి
పూర్వాహ్ణమందున పొదలి నల్దెసలందు
విప్రకీర్ణమ్ములైన వెలసి వెలసి
దివసాంతమందున దిరుగు మొగమ్ములై
సంహృతికార్యమ్ము సల్పి సల్పి
బహు దుఃఖభూయిష్ట భవమహాబ్ధితరణ
యానపాత్రమ్ములై యలరి యలరి.

పావనులకును కుతుకంబుఁ బదిలపరచి
గోవులను నామ మన్వర్థభావమందు
భాసమాన ప్రభారుణ పాదపంక్తి
సర్వపురుషార్థసిద్ధులొసంగుగాక.

పద్యము ఛేకానుప్రాసతో నిర్వహింపబడినది. గీతపద్యమందలిచివరి రెండు పాదములు ప్రభావర్ణనమున మకుటము నుంచిరి. గోవులు ప్రొద్దుటి వేళ తమ పాలిచ్చి ప్రజల కానందమొసంగును. దినము పూర్వభాగము ప్రొద్దున మేతకై నలుదిక్కులకేగి సాయంకాలము మందజేరుననియు, తమ్ముఁగొల్చు వారిని, అనగా తమ పాలచే విప్రులను, అగ్నులను తృప్తి గావించి, వారిని సంసార సాగరమును దాటించున వగుచున్నవి. పై పద్యమున కవి గోవుల విషయము తెల్పి గోవులనే అన్వర్థనామము గలిగిన ప్రభారుణ పాదపంక్తి సర్వపురుషార్థసిద్ధి లొసంగు గాక యని మాత్రమే చెప్పిరి. భావవిస్తృతి కలదు. సూర్యునియొక్క పవిత్ర గోగణము మిమ్ము సంప్రీతిని గావించునని యింకొక యర్థము స్ఫురించుచున్నది. యామిజాల పద్మ నాభస్వామి గారు శ్లేషార్థము నీవిధముగ సూచించి,

సమయస్ఫూర్తి వయస్సులన్ గురిసి ఉత్సాహమ్ము గల్పించుచున్
క్రమవృత్తిన్ తొలిప్రొద్దునన్ వివిధ దిక్సంచారముంజేయుచ

స్త మయం చేనెడు సంస్థితిన్గనుచు సంసారాబ్ధికిన్ నౌకయై
విమతఘ్నుం బినుపూతగో గణము సంప్రీతిన్ మిమున్గాచుతన్
శాతశ్శ్యామలతాయాః పరశురివతమోరణ్యవహ్నే దివార్చిః
ప్రాచ్యేవాగ్రేగ్రహీతుం గ్రహకుముదవనం ద్రాగు దస్తాగ్రహస్తః
ఐక్యంబింద్వ్యు స్ధభూమ్యోరవధిరవ విధాతే వవిశ్వప్రబోధం
వాహోనాంవో వినతా వ్యపనయతు విపన్నా మధామాధిపస్య - 54

దీనికి శ్రీనాథుని యనువాదము -

చిఱు సానబట్టించి చికిలిసేయించిన గండ్రగొడ్డలి నిశాగహనలతకు
గార్కొన్న నిబిడాంధకార ధారాచ్ఛటాసత్ర్త వాటికి వీతిహోత్ర జిహ్వ
నక్షత్ర కుముదకాననము గిల్లెడుపొంటె ప్రాచియెత్తిన హస్త పల్లవాగ్ర
మరసి మింటికి మంటికైక్య సందేహంబుఁ బరిహరింపంగ
బాల్పడ్డయవధి
సృష్టి కట్టెఱ్ఱ తొలుసంజె చెలిమికాడు
కుంటు వినతామహాదేవి కొడుకుఁగుఱ్ఱ
సవితృసారధి కట్టెఱ్ఱ చాయఁవేలు
వరుణు డుదయించెఁబ్రాగ్దిశాభ్యంతరమున -1-121

ఇది భావానువాదము.

భ.న. నక్తంబనెడి వల్లి నరుకంగ సమకట్ట ఖరతరంబగునట్టి పరశువోలె
గ్రహములన్గు ముదవర్గమ్మును గ్రహియింపగాఁజూచు
ప్రాగగ్రకరమువోలె
పృధ్వీనభంబుల వేర్పాటు సేయఁగా రేకెత్తు సీమాంతరేఖవోలె
భువన సంశ్రేయంమ్ముఁబొదలఁజేయఁగనెంచి సత్ప్రబోధ మొనర్చు
స్రష్టవోలె
తిమిరకాంతారదీప్తాగ్ని తేజమువలె
భిన్న భిన్నా కృతులతోడ విశ్వదృష్టి
భాసమానుఁ డనూరుఁడు భద్రుడెలమి
సర్వపురుషార్థసిద్ధులొసంగుగాక

సీసము యొక్క పరిధి మూలభావమునకు బెరిగియుండుటచే నిచ్చట గీతమున కొన్ని స్వంతవిశేషణములు చేర్చవలసి వచ్చినది.

యా.ప. కఱకుం గొడ్డలియై నిశాలతకు ప్రాక్త న్వంగి హస్తాగ్రమై
మెఱుగుం జుక్కల కల్వతోట చిదుమన్ మింటిన్ భువిన్ దెల్పగా
సరిహద్దయి దవవహ్నియై యిరులఁగాల్పన్ సృష్టితెల్వొందగా
సరసీజాసనుడౌ ననూరుడు వరిన్ శాసించు మీపాపముల్

అనువాదము మూలవిధేయముగ సుగమముగ నున్నది.

వ.సు. శ్యామావల్లి నిశాతదాత్రముఁ దమిస్రారణ్య దావార్చియున్
వ్యోమాగ్రహకైరవౌఘ గృహయాళూదస్త ప్రాగ్ధస్త మున్
భూమీఖ్యైక విభేదకావధి జగద్భోధై క సంధాతయౌ
ధామాధీశ రథాశ్వనేత మిము వాత్సల్యంబునన్ బ్రోచుతన్

విపత్తులను నాశనము చేయునని యుండ వాత్సల్యంబున బ్రోచున్ యని వీరి యనువాదమున గలదు.

చ.జ కటిరే తీవకు వాడిగొడ్డలి తమఃకాంతార దావాగ్ని ముం
దటి చంద్రాదిగ్రహంబులన్ కలువలందం బ్రాచి పై కెత్తుముం
గరమై యైక్యము మిన్ను మన్నులకు వేర్గాంవించు హద్దై జగ
మ్మెఱుగం జోపు విధాతయైన రవి వాహేశుండ డంచున్ వెతల్

"కటిరేతీవ" అను నెత్తుగడ కఱకుగా నున్నను, మూలానుసార ముగ నున్నది.

దా.శ్రీ. రేయను తీగకుం బరశురీతి దమో టవికర్చిభాతిఁ బ్రా
క్తోయజనేత్ర కల్వలనుఁగోయు కరాగ్రగతిం జగత్సుబో
ధాయతి ధాతపద్ధతి వియద్భువులేర్పడఁ దొల్చునట్టిమేల్
ఊయిస్థితిన్ దలిర్చెడు ద్యురత్నముసారధి మీకొలార్చుతన్

ఇది మూలవిధేయము. కొలార్చుతన్ అన్న ముగింపు మనోహరము. కొల యనగా లేమి, పాపము, బాధ. ఈ మూడిటిని పోగొట్టునని యభిప్రాయము.

ఇట్లు సాభిప్రాయ పదప్రయోగము జేసిరి. ఇట్టి పదప్రయోగ ప్రావీణ్యము వీరికి వెన్న తోబెట్టిన విద్య

మూర్ధ్న్యద్రేర్ధాతు రాగస్త రుషకిసలయో విద్రుమోఘప్సముద్రే
దిఙ్మాతంగోత్త మాంగేష్వభినవ నిహిత స్సాంద్రసింధూర రేణుః
సేమ్ని వ్యోమ్నశ్చ హేమ్న స్సురశిఖరి భువోజాయతేయః ప్రకాశః
శోణిమ్నా సౌఖరాంశోరుషసి దిశతువః శ్శర్మశోభై క దేశః. 41

దీనికి శ్రీరాములు గారి యనువాదము –

మలలకు మీఁదజేగురులు మ్రాకులయందుఁజివుళ్ల వార్ధి చా
యలఁ బగడంబులున్ దెసలహత్తుల నెత్తులఁజెంది రంపుఁబూఁ
తలు దివి మేరుశైల భువిఁదప్త సువర్ణములైన సూర్యర
శ్ములుదయకాల శోణములు సొంపుల నింపులు మీకు నింపుతన్

సంస్కృత సమాసభేషజ మిచట మచ్చునకైన బొడగట్టదు.

వ.సు. చిగురై చెట్లను జేగురై గిరులపై సింధూర శృంగారమై
దిగి భేల్కుంభములన్ మహారజిత ధాత్రీ భృద్విభావ్యాప్తియై
గగనంబందురు విద్రుమ ప్రతతియై కంధిం బ్రభాతంబునన్
దొగరై పర్వెడు ప్రొద్దు నెండపొడ సంతోషంబు మీకిచ్చుతన్

రెండవ పాదము నుండి సంస్కృతపదగుంఫనము గలదు. హేమాద్రి యనువాదములోనికి రాలేదు.

ఆ.వ్యా. జలధిన్విద్రుమ మల్ ద్రుమాళిఁజివురుల్ శై లంబునం జేవురుల్
బలభిత్కుంభి శిరంబు నందవిరళ ప్రత్యగ్రసింధూర ధూ
ళులు వింటన్హరువింటి పై డితళుకుల్ శోణద్యుతిన్భానుదీ
ప్తి లవంబుల్ వఱువాతనేవ విభవత్రీప్త్యావహంబయ్యెడున్

హేమాద్రి యన్నను, స్సురశిఖరి యన్నను మేరుపర్వతము. హరు వింటిపై డి తళుకులని అర్థమును గూర్చిరి.

యా.ప. చిగురై చెట్లకు వార్ధికిన్ పగడమై సింధూరమై వెల్ల యే
నుగు నెమ్మోమున ధాతురాగ మగుచున్ పూర్వాద్రిపై మింట స్వ
ర్ణగసౌవర్ణ విభూషమై అరుణిమన్ ప్రాభాతశోభాస్పదం
బగుచున్ వెల్గెడు తిగ్మభానురుచిసౌఖ్యంబిచ్చు మీకెప్పుడున్

చ.జ. నగమూర్ధంబున ధాతురాగమటు శోణచ్ఛాయనై చెట్టులం
జిగురై దిగ్గజ రాజశీర్షములపై సింధూరపుంధూళియై
తగు తారాపథసీమ హేమగిరి జాతస్వర్ణకాంతిం బలెన్
జిగివట్టేనెది భానుతేజమది రంజించున్ సుధాప్తి న్ మిమున్

భ.న. అద్రి మూర్ధమ్ముల యందు గైరికధాతు
రాగసంకాశమై రాణనెసగి
క్షితిరుహాగ్రహములపై కిసలయమ్ములభాతి
విద్రుమము లటు సముద్రమందు
దిఙ్నాగ మస్త కదేశమ్మునం దభి
నవము సింధుర రేణువుగ నొప్పె
గగనభాగమ్మున కాంచనశైల సం
భవ సువర్ణద్యుతి పటిమదీర్చి.

సుప్రభాత సమయమందె సురుచిరముగ
నేక ముఖరాగదీప్తుల లెనయజేయు
భాసమానమయిన తీవ్రభానుదీప్తి
సర్వపురుషార్థసిద్ధులొసంగుఁగాక

ప్రభావర్ణన మంతయు నీపై మకుటముతో జెప్పిరి. పై రెండు పద్యములు ప్రసన్నములైన పదములతో నొప్పుచుభావవివరణ గావించబడినవి.

వ్యగ్రై రగ్ర్యగ్రహోదుగ్రసన గురుభరైర్నో సమగ్రై రుదగ్రైః
ప్రత్యగ్రై రీషదుగ్రై రుదయగిరి గతోగోగణై ర్గౌరయాన్గామ్
ఉద్గాఢార్చిర్వ్లీనామర నగర నగగ్రాపగర్భామివాహ్నో
మగ్రే యోగ్రే విధత్తే గ్లవయతుగహనం సగ్రహగ్రామణీర్వః. 96

("వ్యగ్రై రగ్ర్య గ్రహేన్ద్రగ్రసనగురు" అనునది పాఠాంతరము). పైశ్లోకమున గల వృత్త్యనుప్రాసతోనె మూలశబ్దానుసరణముగ శ్రీరాములు గారనువదించిరి.

వ్యగ్రములగ్ర్యనుగ్రహభహారిగురుల్ సముదగ్రలీలఁ బ్ర
త్యగ్రములీషదుగ్రములు నౌనురుగోవుల గోవుగౌరతా
భాగ్రతిఁబ్రాగ్గిరిన్నిలచి ప్రాచి సరాగసురాగగాం దినం
బగ్రమునందుఁజేసెడి గ్రహాగ్రణి మీకగు నగ్రగస్థితిన్

ఇట్టి ప్రౌఢరచన యరుదుగా గనిపించును. మిగిలిన గ్రంథమంతయు ప్రసన్న రచనాశోభితమై యొప్పుచున్నది. దీని యర్థము ఎవడుదయాద్రి నధిష్టించినవాడై పగళ్లల ముఖమునందు (బ్రొద్దున) వడివడిం బఱచుచు తమకు దూరపుదెసనున్న ముఖ్యగ్రహములైన చంద్రుడు లోనగువానిని వెలవెలఁబాఱజేయు చెయిదమను బరువుగలవైన లేతవగుట వలన ఇంకను సంపూర్ణముకానివై, కొంగ్రొత్తవై ఇంచుక వేడిమిగలవైన తనకిరణములచే భూదేవిని పెల్లగు దీప్తులడంగులవై న దేవతలపట్టణమైన మేరుగిరిశిలలు గలదానిని వలె పసుపువన్నె గలవానిగా జేయుచు, శ్రేయస్సును గావించుచున్నాడో ఆ గ్రహరాజు అతిఘోరమైన మీ పాపమును హరించుగాక! ఇట్లత్యుగ్రమైన పాపములు ఆ గ్రహరాజు అనుగ్రహము వలన హరించునని స్ఫురింపజేయుటకు అర్థకాఠిన్యమున్నను 'గ్ర' అన్న వృత్త్యనుప్రాసను మూలవిధేయముగ గట్టిగ బట్టిరి. ప్రసన్న రచన కుదాహరణము –

మునుమును తూర్పుకొండఁ దుద ముద్దుల కల్కితురాయి మానికం
బనఁగ దిశాసతీమణుల కందపుపూఁతకు రోచనాంబు చ
ర్చనలననొప్పి మక్కువల జక్కవలార్చెడి వాఁడిచూపు ట
ర్చనలను గాంచు బాలరవిరశ్ములు మీకిడుఁజింతితార్థముల్. 12

24వ శ్లోకములో "రుచిరివ" అని మయూరుడు సామాన్యముగ జెప్పిన దానిని "మేల్గనురుచి" యని (పరమాత్మ తేజ మను నర్థమున) మూలకర్త యభిప్రాయమునకు శ్రీరాములు గారు వన్నె దెచ్చిరి.

మేరువుమీఁది నున్ననగు మేల్మిశిలల్ నలఁగంగనీక సా
మీరజవంబునం దుముకఁబెట్టిన గుఱ్ఱులు వేఱె లేమిచే

చారుతరార్క కాంతమణిజంబగు వహ్నియ దారితెల్పఁగా
మీరిన సూర్యగుఱ్ఱములు మేలుగ ముజ్జగమేలు గావుతన్. 44

పగ్గమలౌనటంచరుణవారుణపాశము లంటఁబోకుమా
యెగ్గిడి యేక చక్రమని కృష్ణనిచక్రము ముట్టబోకుమా
దిగ్గున నెన్మిదౌ తగును దేవహయంబనఁబోకుమాయటం
చగ్గముగాఁ బరోపకృతి కర్కుఁడు దిద్దినవాఁడు మీకగున్. 59

పగ్గములు లేవని వరుణుని పాశములను గోరకుమా యని రథసారథి యనూరుని హెచ్చరించుట, ఒంటిచక్రమని కృష్ణుని చక్రమును ముట్టబోకుమని, ఎనిమిదవ గుఱ్ఱము కావలెనని దేవేంద్రుని ఉచ్చైఃశ్రవమును కావలె ననబోకుమా అని రథసారధిని మందలించిన విధము. మూలకర్త యభిప్రాయా నుగుణముగ సూర్యుడన్యాపేక్ష లేనివాడని పరోపకృతి కలవాడని హృద్యముగ జెప్పిరి.

అంతొౌటి చిమ్మచీఁకటులు నాఱ్చుకరంబులు వేయిగల్గు భా
స్వంతుని మోయలేక శ్రమబట్టు మరుత్తుల నక్కడక్కడన్
వింతగ మెత్త లార్తు రని వేఱుఁగ వేఱుఁగ నేర్పరించు న
త్యంత పటుప్రభావ జగదక్షరథంబు శుభంబు మీకిడున్. 63

ఈ రథవర్ణనలో 'అంతొౌటి' యను దేశ్యప్రయోగము కలదు. ఇది అర్థస్ఫూర్తి నిచ్చుచు చిమ్మచీకటిలో తటిల్లత వలె మెఱయుచున్నది.

తీరిన గంగలో నిసుకతిన్నెల దూరిన డెక్కలాడక
మ్మేరువు కందరంబులను మెట్టుల మ్రొగ్గినఁగాళ్లు తొట్రిలన్
మీరిన పచ్చరాగరిక మేయఁగ సూర్య గుఱాలు నిల్వ సొం
పూనఁ 'జలోచలోజలిది' హుమ్మను నగ్రగుఁడేలు మిమ్ములన్. 61

ఈ పద్యములో 'చలో చలో జలిది' యన్న అన్యదేశ్యప్రయోగము గలదు. అశ్వము నదల్చునపుడు "చలో చలో" యనుట లోకవ్యవహారము కావున నీఅన్య దేశ్య ప్రయోగమిచట పద్యమునకు స్ఫూర్తినిచ్చు చున్నది.

గంధర్వైర్గద్యపద్య వ్యతికరితవచోహృద్యమా తోద్యవాద్యై
రాద్యైర్యో నారదాద్యైర్మునిభి రభినుతో వేదవేద్యైర్విభిద్య

అసాద్యా పద్యతేయం పునరపిచజగద్యౌవనంసద్య ఉద్య
న్నుద్యోతౌ ద్యోతితద్యౌర్ద్యతు దివసకృతో సావవద్యానివో ద్య. 36

మద్దెల దిద్దిమల్ సరిగమాయను గీతులు గద్దెపద్దెముల్
గ్రద్దన దిద్దు వేలుపుల గాణలు తొల్లిటి సుద్దులొద్దికన్
విద్దెలమారి వేల్పు రుసి పెద్దలు సద్దిడ ముజ్జగానకుం
దద్దయు జప్పనంబొసగు నవ్యరవిప్రభ మీకు మేలిడున్ 36

ఈ యనువాదము మూలప్రపంచితమై మనోజ్ఞమై యున్నది. దీనిని లోకోత్త రమగు ప్రజ్ఞతో ననువదించి వారికిగల శాస్త్రాభినివేశమును ప్రదర్శించిరి. ఈ పద్యమౌదార్యగుణము కలిగియున్నది. 'ద్ధ' కారము ప్రాసాక్షరముగ నున్నది. అదే యక్షరము వృత్యనుప్రాసతో మద్దెల ధ్వనిని ధ్వనింపజేయుచున్నది. శ్రీ మానపల్లి రామకృష్ణకవి గారు, ఆకొండి వ్యాసమూర్తి శాస్త్రులవారి సూర్యశతకమునకు పీఠిక వ్రాయుచు నుడివిన వాక్యములు సత్యములని చెప్పక తప్పదు. 'సూర్యశతకము రచనాపాటవముతో సందర్భశుద్ధియు అర్ధగాంభీర్యమును, లేఖనవైదగ్ధ్య మును గలదనుట నిస్సంశయము. దానిలో బాదపూరకములగు పొల్లుపదములకునవకాశమే లేదు. మఱియు బెక్కుచోటులు నానాశాస్త్ర కళాపరిచయం దెనిగించుచున్నవి. ఇట్టి కృతి దెనిగిం చునపుడు సంస్కృతమున గనిష్టపక్షము వ్యాఖ్యానకౌశలమును, దెనుగున ప్రయత్న జనితము అగులలితమధుర వాక్పరిస్పందనమును ప్రధాన గుణములు. ఈ రెండింట నేదికొఱవడినను భాషాంతరీకరణము పండితశ్లాఘ కెక్కనేరదు".

మీలచ్చక్షురిజిహ్మ శ్రుతి జడరసనం నిఘ్నితఘ్రాణవృత్తి
స్వవ్యాపారాక్ష మత్వక్పరిముషితమనః శ్వాసమాత్రావశేషం
విస్రస్తాంగం పతిత్వా స్వపదపహరతా దశ్రియంవో ర్కజన్మా
కాలవ్యాళావలీఢభం జగదగద ఇవోత్థాపయన్ప్రాక్ప్రతాపః. 31

దీనికి వ.సు. రాయలవారి యనువాదము -

కనుమోడ్పున్ వినరానికర్ణము జడఘ్రాణంబు జిహ్మత్వచం
బు నిరర్థంపు రసజ్ఞు ఖండితమనంబున్ ద్రిక్కుశ్వాసంబు స్ర

స్త నిజాంగబయి వ్రాలుకాలఫణీ దష్టం బైస్వపద్విశ్వమ
ల్లనఁదెల్పం బరమౌషధంబు రవికల్యజ్యోతి ప్రోచున్ మిమున్. 31

ఆకొండి వ్యాసమూర్తి గారి యనువాదము -

విగతార్థగ్రహపాటవేంద్రియము నావిర్భూత నిశ్వాసి మం
చగతిం జేష్టలుదక్కి బుద్ధిసెడి వాచాహీనమై దీనమౌ
జగమున్కాల భుజంగదష్టముఁ జికిత్సన్వేగఁబ్రత్యుత్థితం
బుగఁజేయంగల వెజ్జులోయన నినస్ఫూర్తుల్సిరుల్మీకిడున్

దాసు శ్రీరాములు గారి యనువాదము -

కనువ్రాలన్ శ్రుతిమ్రాన్పడన్ రసననాకంబోక ముక్కెద్దియు
న్గనకాత్వక్కు స్పృశింపకుల్లము నడంగన్ శ్వాసయొక్కండుద
క్కను వేరొక్కటిలేక తూలిపడు నక్కాలాహిసందష్టమౌ
జనమున్ లేపెడి వెజ్జు బాలరవితేజంబార్చు మీయాపదల్

చ.జ. మూసినకన్ను మూర్కొనని ముక్కు శ్రవింపని వీనులుం జవిం
బాసిననాల్క తాఁకటినత్వక్కుతలంపని యుల్లమంగముల్
గాసిలుబూని కాలఫణికాటున మూర్ఛిలి పండులోకమున్
భాసిల లేఁపుమందయిన భాను నవద్యుతి మీకిడున్ సిరుల్

యా.ప. కాలవ్యాళ కఠోరవర్తనమునన్ కన్నుల్ చెవుల్ చిత్తమున్
కాలుంజేతులు నూపిరాడక పడంగాచూచి నిద్రాళు జీ
వాళిన్ లీలగ మేలుకొల్పి విషవై ద్యస్ఫూర్తికి నారోగ్యమున్
చాలంగూర్చెడి బాలబానురుచి నిచ్చల్ మిమ్ము కాపాడుతన్

భ.న. ఉన్మీలభావంబు నొందు చక్షుర్యుగి
ఘనవిజిహ్మము నొందు కర్ణయుగము
నిఘ్నులౌ భావాన నెగడెడు ఘూణంబు
జడభావమును బొందు సరసరసన
స్పర్శవిజ్ఞానంబు సడలిన చర్మంబు
విస్రస్త భావాన వెలయు మనము

శ్వాసమాత్రావశిష్టైక జీవంబును
గల్గి శైథిల్యాంగకములతోడ
కాలసర్పావలీఢతన్ గనిన జగము
నగదమట్టుల నుత్థాపనంబొనుర్చు
భాసమానమ్మగు నవీనభానుదీప్తి
సర్వపురుషార్థసిద్ధులొసంగుగాక

దీనిని శ్రీనాథుడు ప్రకరణోచితముగ గొంత వర్ణించి తెనిగించెను.

నేత్రంబులున్మేష నిస్పృహత్వము నొంద
శ్రుతిపుటంబుల శక్తి చొక్కువడఁగ
ఘ్రాణేంద్రియజ్ఞానకళయొరుసొరుగా
జిహ్వావివేకంబు చిఱుతవోవ
నంతరంగమున మోహాంధకారముగ్రమ్మఁ
దనువు చేష్టా దరిద్రతవహింపఁ
బ్రాణముల్ శ్వాసమాత్రమునఁ బర్యవసింపఁ
దలచీర యెఱుగని దశఘటిల్లఁ

బాముగఱచిన మూర్ఛిల్లి పడినయట్లు
పడిరి పాశ్చాత్యదేశంబు పంచజనులు
తరణిదీధితిలేమిఁ జై తన్య మెడలి
వితతనిద్రాసమావేశ విహతులగుచు — కాశీఖండము

ఇందు కాలభుజంగదష్టుని యవస్థలోగల యనుభావములు పంచేంద్రియముల స్వకర్మత్యాగముఁ దక్కిన విషచిహ్నములు సూచింపఁబడియెను. ఔషథమను భావమును గ్రహించిన యనువాదకులు వ.సు. రాయుడు గారు, చదలవాడ జయరామశాస్త్రి గారు, భల్లమూడి నరసింహమూర్తి గారు. వైద్యుడని యనువాదమున పరివర్తింపజేసినవారు శ్రీ ఆకొండి వ్యాసమూర్తి గారు, శ్రీరాములు గారు, యామిజాల పద్మనాభశాస్త్రి గారు. 'కాలాహింసదష్టతాభినయమును లేపెడి' వాడు వెజ్జు అన్నది అనువాదమున రమ్యముగనున్నది. మూలమున ననువాదము నను రూపకాలంకారమే పరివర్తితమైనది.

హేలాలోలం వహంతీ విషధర దమనస్యాగ్రజే నావకృష్ణా
స్వర్వాహిన్యాస్సుదూరం జనితజవజయాస్యందనస్య స్యదేన
నిర్వ్యాజం తాయమానే హరితి మనినిజేస్పితఫేనాహితశ్రీ
రశ్రేయాంశ్యపక్ష్మిశ్శమయతు యమునే వాపరాతాపనీవః. 47

అహిరపు నన్న లాగిన నోయారముగం జలియించి పాణుచున్
గుహజననీ సమీపమున గొప్పరథంబు గతిం జవంబుతో
డ హరితకాంతితో మఱుఁగుదబ్బలతో నపరార్కనందినీ
మహిమ వహించు నర్యముని వార్వపుబంతిశుభంబుమీకిడున్. 47

అహిరిపుడన్న అనూరుడు, శ్రీకృష్ణుడు. అహిరిపు దనగా కాళియు జంపినవాడని యర్థము. ఆయన యన్న బలరాముడు. ఇట్లు అనూరుడని, బలరాముడని యర్థద్వయము కలదు. అహిరిపు నన్న యనుట వలన బలరామ యనూరు లిరువురకును అన్వయించుట వలన మూలముననున్న భావము సమగ్రముగ తెలుగునకు వచ్చుటకు వీలుపడినది. “విషధర దమనస్యాగ్రజేన” అనుచోట శ్లేషయున్నది. విషధర దమనుడు గరుత్మంతుడు. అతని యన్న అనూరుడు. విషధరదమనుడు విషధరుడైన కాళియుని దమనుడు శ్రీకృష్ణుడు, అతని యగ్రజుడు బలరాముడు. ఇట్లు అనూరుడనియు, బలరాముడనియు అర్థద్వయము గలదు. దీనికి శ్రీరాములు గారు “అహిరిపునన్న” అని యనువదించిరి. ఈ సమాసము నందు పైయర్థద్వయము చక్కగ లగించినది. ‘గంగ’ యనుటకు ప్రాస నిర్వహణమునకై “గుహజనని” యని శబ్ద కల్పన జేసిరి. యమునానది యనుటకు అపరార్కనందిని యనిరి. ఇట్లు శబ్దార్థకల్పనకు, మూలకారుని కేమాత్రము తీసిపోక మూలము చెడకుండ తన ప్రత్యేకతను ప్రదర్శించు కొనుచు ప్రశంసనీయముగనీ పట్టున ననువదించి పండితకవియు, మహాకాల్పనికుడు అగు మయూరమహాకవికి సరిజోడిగనుండిరి.

మయూరమహాకవి కల్పన లుత్ప్రేక్షాతిశయోక్త్యలంకారముల నాశ్రయించి యుండును. ఆ భావములు తెలుగులోనికి రాబట్టవలెనన్న అతని యలంకార రచనమును, నాతని కల్పనాశక్తికి ననుగుణముగ ననువాదము చేయవలెను. శ్రీరాములు గారు పై విధముగ మయూరుని యలంకార రచన కనుగుణముగ

యనువాదము చేసిరి. అయినను కొన్ని పట్టుల నయ్యలంకారము లనువాదములోనికి రాలేదు.

శ్రీ నిడదవోలు వెంకటరావు గారు శ్రీరాములు గారి యనువాదము లోనికి రాని కొన్ని యలంకారములను అర్థవ్యక్తిలేని కొన్ని పద్యములను పద్యములను బేర్కొనియున్నారు. 18వ శ్లోకములో "అస్త వ్యస్త త్వశూన్యో" అనుచోట శ్లేష యున్నది. అస్త వ్యః తత్త్వశూన్యః అని పదవిభాగము చేసి దీపమునకు విశేషముగ వ్యాఖ్యాతలు చెప్పిరి. శ్రీరాములు గారు దీనిని సూర్యునకు మాత్రమే విశేషముగా చెప్పిరి.

అట్లే 35వ శ్లోకములోని "నాంతర్నిశ్శేష కృష్ణశ్రీ యముదధిమివ ధ్వాంతరాశింపిబన్" అనుదానికి అనువాదము "సిరిగన నల్లనల్ల నగు చీఁకటి సంద్రము ద్రావునట్టి". దీనిలో పై శ్లోకార్థము చక్కగ నభివ్యక్తముకాలేదు. "నాంతర్ని శేష కృష్ణశ్రియః' అనుచోట శేషశాయి యగు లక్ష్మీసమేతుడగు విష్ణువు పరమగు శ్లేషార్థము సాధించుట దుర్ఘటము. ఇటువంటిది 42వ శ్లోకములోని మూడవ పాదమునకును సంపూర్ణాభిప్రాయము వ్యక్తము కాలేదు. 'పీతాంబర విశదతరోద్వీక్షితా....' దీని యనువాదము 'పీతాంబరునిచేత విస్పష్టముగ చూడబడుచుండిన' అన్న యర్థము రాలేదు. 'వసు పంచుకోకతో వెలలు సరోజలక్ష్మి యనగ', 56వ శ్లోకములో 'శ్లిష్టశీతేతరాంశౌ' అను నంశము వదలివేయబడినది.

62వ శ్లోకములో రథవేగముచే తలక్రిందైన యానూరుడు చేసిన "విప్రతీప ప్రణామము" అనువాదములోనికి రాలేదు. మిగిలిన యనువాదములీ యర్థమును జక్కగ నభివ్యక్తము జేసినవి.

ఇట్టివి రెండు మూడు తప్ప మిగిలినవన్నియు నర్థవ్యక్తి గలిగి ప్రసాదగుణము కలిగి మనోజ్ఞముగ నున్నవి.

ఈ శతకములో శ్రీరాములు గారు ప్రయోగించిన దేశ్యపదములు –

జేజేరాయఁడు (1)

ముక్కిఁడిగంటు, మొండి దోసకారి, దొసంగులు (6)

దివ్వె (11), మక్కువలు, జక్కవలు (12)

విర్విచెట్టులు (17), పెంకులు ప్రేలు (19)
వత్తి (23)
చిత్తరు, మేల్కలము (26), విన్నాణము (32)
మద్దెలదిద్దిమల్ గద్దెపద్దెముల్, గాణలు, సుద్దులు, విద్దెలు (36)
రిక్కలు దవ్వెక్కియు నెక్కకున్న (37)
సాటి నాకెవరెవరంచు దోడుపడు
రవరవ నిక్కనెక్కు (38), కోల (39)
మలలు, జేగురులు, మ్రాకులు. చివుళ్లు, పగడంబులు (40)
లాఁతివేవెలుఁగు (43), దివిదారివడారము (45), సంజ, పచ్చపట్టు (46), దబ్బలు (47), సిగ్గున, మోములు (48)
నాలుగుజాలు (50), చలో చలో జలిది (ఆన్యదేశ్యము)
అంతోటి (63), మరత్రాళ్ళు (64), బుఙ్టన (ధ్వన్యనుకరణము) (66)
కలికితురాయి (74), మేలిమికొండ (75)
గలగల యెండునేల (78), చక్కని చుక్క (88)
నలుమూళ్ల యొడళ్లన్ (ద్వాదశార్కులు)
పాపబువ్వలగల వేలుపన్న (గరుత్మంతుని యన్న) (94)
పెట్టనికోట, అన్నము, నీళ్లు (100)

శ్రీనిడదవోలు వెంకటరావు గారిట్లు నుడివియున్నారు – "శ్రీరామ కవిగారు మహాకవులేగాక ప్రాచీన మహాకావ్య లక్ష్యలక్షణ పరిజ్ఞానము గల మహావిద్వాంసులు. వారి దేవీభాగవతపీఠికలో వ్యాకరణఛందోవిశేషముల నెన్నింటినో వివరించినారు. ఇందు వారుపయోగించిన కొన్ని యతులు –

జ్ఞ – క యతి : కనురుచివంటి భాస్కరుడు జ్ఞానదయాదులు మీకు నిచ్చుతన్ (ప 24)

మ – వ యతి : దీ.... వుల వెలిగించు దీపము మిమున్
రవిదీప్తి సుఖింపఁజేయుతన్ ........... (23)
మహిమ వహించు నర్యముని వార్వపు బంతి
శుభంబు మీకిడున్ (47)

ద్వారశబ్దమున కచ్చుతో యతి – అప్పకవీయమున నొకటే యుదాహరణ మీయబడినది.

ద్వారము లందిడంగ నరుణాఖ్యుఁడదల్చిన ....... (48)

అలమిన పెద్దచుక్కలకు ద్వారనభంబయి..... (74)

'ప్రపీతుఁడు' (64) ఉపసర్గసంవిధానము శ్రీనాథునకు మాత్రమే గలదు. తిరిగి శ్రీరామకవి గారికి మాత్రమే గలదు. అందువలననే చెళ్లపిళ్ల వారు శ్రీరామకవి గారిని "అపర శ్రీనాథుడు" అని ప్రశంసించినారు.

దేవీభాగవతాదులలో వీరి శైలి పేశలమై మధురమైన సంస్కృత సమాసమిశ్రితమైన నాతిప్రౌఢ రచనతో గూడుకొని యున్నది. తెలుగు నాఁడు మొదలైన కావ్యఖండికల యందు వీరి శైలి దేశ్యభిముఖముగ సాగుచు తెలుగుదనము గుబాళించుచు సాగిపోవుచుండును. మయూరుని సూర్యశతకము ననువదించుటలో వీరి శైలి సహజముగ వారికిగల సంస్కృతపద ప్రయోగాభిలాషను వ్యక్తము చేయునదిగనుండి, సంస్కృతాంధ్రభాషాసమ్మిశ్రితమై పేశలమై యొప్పుచున్నది. ఆవతారికలో కవి ఇట్లు నుడివియుండిరి –

"కలుగు తెలుంగు కబ్బములు కట్టడి మందలు మందలిన్ని వం
దలను గణింపశక్యమగునా? యిక నందులకేమి యందులో
లలితపదార్థ విస్ఫురణలం దనియించు పరోపకార మా
న్యులు పదివేల కొక్కఁడుగ నుండును పాత్రులు వారు ప్రస్తుతిన్." 2

పై జెప్పిన "పదివేల కొక్కడు" లో వీరొకరు.

## అధోజ్ఞాపికలు

1 సూర్య శతకము – పీఠిక – శ్రీ చదలవాడ జయరామశాస్త్రి గారు, పు. 19

2. – పైది – పు. 9)

3. సూర్యశతకము – శ్రీ దాసు శ్రీరాములుగారు – మహాకవి దాసు శ్రీరాములు స్మారక సమితి ప్రచురణ, 1979, పు॥ 5.)

# 4. నాటక సుమములు

## (i) కురంగగౌరీశంకర నాటిక

కురంగ గౌరీశంకరనాటిక యందలి యితివృత్తము ప్రఖ్యాతమై నప్పటికి చక్కని కథాసంవిధానమునకై కొంత కల్పింపబడినది. నాటక శిల్పము ఇతివృత్తము, సన్నివేశకల్పన, పాత్రచిత్రణలపై నాధారపడి యుండును. వీనిలో మొదటిది యితివృత్తము. ఇది నాటకమునకు శరీరము వంటిదని భరతుడు చెప్పెను.

"ఇతివృత్తంతు నాట్యస్య శరీరం పరికల్పితం"[1]

మన భారతీయులేకాదు పాశ్చాత్యులును దీనికి ప్రాధాన్యము నొసంగిరి.

ఇతివృత్తము విషాదాంతనాటకమునకు ఆత్మవంటిది. కావున అది ప్రధమ స్థానమును, అటు తరువాత పాత్రచిత్రణ రెండవస్థానమును వహించును.[2]

దీని యందలి కథ పార్వతీపరమేశ్వరుల పరిణయము. కాని దీని యందు చేసిన మార్పులకు సంస్కృతవాఙ్మయమునం దెక్కడను ప్రమాణము గానరాదు. శ్రీ శ్రీరాములు గారు వ్రాసిన స్వతంత్రనాటకముగ దీనిని నెన్న వచ్చును. ఇందలి కురంగకథ కల్పితము. కురంగము నారాయణ స్వరూపము. శివపార్వతుల యైక్యము వర్ణించి శ్రీమన్నారాయణుడు కురంగమైనట్లు కథ కల్పింపబడినది. హిమవత్పర్వతమున తపస్సుచేసికొనుచున్న శంకరునకు, పార్వతికిని సంయోగము కల్పించుటకై నారాయణుడు కురంగ రూపమున వెలసెను. ఈకురంగము శివుని యొద్దకు జేరునంతవరకు గాని, శివుడున్నచోటు పార్వతికి తెలియలేదు. ఇది శాకుంతలములోవలె అతిథిమర్యాదలు పొందని దుర్వాసుడిచ్చిన శాపఫలితము. పార్వతియొద్ధనున్న కురంగము శంకరుని జేరుటకు కామ, వసంతులు కారణమైరి. కురంగము శివుని జేరగానే శాపమోక్షణము కలిగిన తరువాత పార్వతికి పూర్వజ్ఞాన మొదవి శివుని నర్చించ మందరగిరి జేరెను. అచట కామదహనము తరువాత నారాయణ సాక్షాత్కారము జరిగి నాలుగవ యంకమున శివపార్వతుల కల్యాణముతోను, బ్రహ్మ భరతవాక్యముతోను కురంగ గౌరీశంకర నాటిక ముగియును.

ఇది నాలుగంకములనాటిక. ద్వితీయాంకమును మూడు రంగములుగ విభజించిరి. అట్లే చతుర్థాంకమును నాలుగు రంగములుగ విభజించిరి. భారతీయ సంప్రదాయరూపక ప్రక్రియాబద్ధము కానిది యీ రంగవిభజన. ఇది పాశ్చాత్య రూపక ప్రభావము కావచ్చును.

ప్రథమాంకమున కిరాతుడు వెంబడిచుచున్న కురంగమును గౌరి తన చెలుల సాహాయ్యముతో పొందును. ఈ కురంగమే శంకరునితో పార్వతికి సంయోగము కల్పించుటకు తరువాత నుపకరించును. దీర్ఘ సమాధి నున్న శంకరుని మేల్కొలిపి జగత్కల్యాణమునకై గౌరీకల్యాణము జరుగుటకు కూడ బీజముగ కథ వ్యాప్తము కావింపబడినది.

ద్వితీయాంకము మొదటిరంగమున జరుగవలసిన జగత్కల్యాణము ,తారకాసురుల కథ పేర్కొనబడినది. రెండవ రంగమున గౌరిచే బెంచబడు కురంగమును గ్రహించుటకు నుపాయ మూహింపబడెను. మూడవ రంగము తత్ప్రయత్నము.

తృతీయాంకము పతాకసన్నివేశము. కామదహనము జరిగిన పిమ్మట పార్వతీ పరిణయమును నారాయణుడు నిశ్చయించును. చతుర్థాంకమున రెండవరంగమున శివుని విరహము, మూడవ రంగమున పార్వతి విరహము వర్ణింపబడినవి. ఈ రంగములు కథావేగము నవరోధించుచున్నవి.

ఇందు ప్రథమరంగమందలి లేడి వర్ణన, దుర్వాసశ్శాపకథ, అభిజ్ఞాన హేతువగు కురంగము, మన్మథుని రక్షాబంధనము, మొదలగున వన్నియు కాళిదాసు శాకుంతలములో గల పోలికలను దెలుపుచున్నవి.

ద్వితీయాంకమున మొదటి రంగమున దేవేంద్రుడు మన్మథుని వేడుకొను సన్నివేశము కలదు. ఇది చాల క్రొత్తవిషయము. తక్కిన ప్రబంధములం దెచ్పటనైనను మన్మథుని దేవేంద్రుడు సమానపదవిగా జూచునే గాని యిట్లు తనకంటె నత్యధికునిగ జూచుట లేదు. శ్రీరాములు గారిందు నూతనకల్పన జేసి మన్మథునికి ఇంద్రుని కంటె గొప్ప పదవిని కట్టబెట్టిరి.

తృతీయాంకమున శివపార్వతులు కురంగము కొఱకై వాదులాడుకొను సన్నివేశము రమ్యముగ కల్పింపబడినది.[3] ఇది మయూరకృత పార్వతీపరమేశ్వర ద్యూతమును దలపింప జేయుచున్నది. ఇందు "మృగాంకధారి" యను శబ్దముపై శ్లేషచమత్కారము సాధింపబడినది. మృగమను అంకమును అనగా గుర్తును ధరించినవాడు. ఇది మృగపరమైన యర్థము. మృగముయొక్క అంకమును, గుర్తు లేక ఆకారమును ధరియించినవాడు నారాయణుడని ప్రకరణార్థము. మృగాంకుడుచంద్రుడు. చంద్రుని ధరియించినవాడు శివుడు. ఇది శ్రీరాములు గారి పాండిత్యమునకు తార్కాణము. అట్టిదే "పశుపతి" పద ప్రయోగము కూడ శివుడని, లేడి యజమాని యని రెండర్థములు స్ఫురించునున. ద్వితీయాంకము నందలి మూడవ రంగమున బ్రహ్మచారి వాక్యములు గూడ నట్టివే. దీనినే నాటకీయవ్యంగ్యము (Dramatic irony) అందురు.

చతుర్థాంకమున మైనాక కోలాహలులను కవిగారు ప్రవేశపెట్టి పురాణ కథలను ధ్వనింపజేసిరి. కోలాహలవృత్తాంతములో వసుచరిత్రగాథను తడవిరి. ఈ ప్రబంధముపై కవిగారికి గల ప్రత్యేకాభిమానము వ్యక్తమైనది.

భవభూతి నాటకము లందువలె నిందును విదూషకపాత్రలేదు. కాని నాటకము నందతటను ఈ హాస్యము అంతర్వాహినిగా నున్నది. ప్రస్తావన యందే కొంత హాస్యమును ప్రవేశపెట్టిరి. దిక్పాలకుల ఆకులపాటులోను, వటవేషధారియగు మన్మథుని సంభాషణలోను, భృంగీశ్వరుల సంవాదము లోను కొంత హాస్యము బ్రకటించిరి. ఇవన్నియు కవిగారి హాస్యప్రియ తకు తార్కాణములు. రచనా గాంభీర్యముతోబాటు హాస్యముగూడ ప్రస్ఫుటమై యొప్పారుచుండను.

కవిగారు బహుభాషాకోవిదులు, ఇందు ప్రథమాంకమున పార్వతి చెలి 'బాల' దయారసమున గూర్చి సంస్కృతమున శ్లోకము చెప్పును. ఇది పదకొండవపుటలో గలదు. 25వ పుటలో బ్రహ్మచారి గౌర్యాశ్రమమునకు వచ్చును. తెరలో నొక శ్లోకము చదువును. అట్లే మూడవ యంకమున 39వ పుటలో నొక సంస్కృత ఆర్యోక్తి వివరించబడినది. అందే శివుడు పార్వతిని వర్ణించుచు చెప్పిన ఆర్యావృత్తము, సంస్కృతభాష యందు కవికి గల సామర్థ్యమును పూర్తిగ

వెల్లడించుచున్నది. అట్లే నాలుగవ యంకమున మూడవరంగమున 58వ పుటలో గౌరి శివుని గూర్చి చెప్పిన సంస్కృతశ్లోకమున 'మనోకులవిశోధనం విహిత విగ్రహారాధనమ్' అని విగ్రహారాధనమును సమర్థించిరి. వీరి సంస్కృతభాషాశైలి ద్రాక్షాపాకరమ్యమై బిగువు చెడక హృగయంగమముగా నున్నది.

ప్రథమాంకమున కిరాతరూపమున నున్న బ్రహ్మ నోట నాటక సంప్రదాయోచితముగ గ్రామ్యభాషను ప్రదర్శించిరి. అచ్చట నాదనామ క్రియలో గ్రామ్యభాషాప్రయుక్తముగ పాటను గూడ వ్రాసిరి.

ఓలబ్బా వోలబ్బా యారె ఇచట
గోలచేయఁగ వచ్చినారె పోరె ।వోలబ్బా।[4]

దిక్పాలకుల సంభాషణలో "జనానా – ఖాన్దునానా, దివాల, దుస్తు వసూలు" మొదలగు అన్యదేశీయములను గూడ ప్రయోగించిరి.

ప్రస్తావనలో కవి "పదిరెండేడుల యీడునం గవిత జెప్పంబూనె" ననియు వ్యస్తాక్షరి యందు ప్రవీణులనియు శతావధానము చేయగల వారనియు, గణితశాస్త్రము (సిద్ధాంతము) హోరాశాస్త్రమందు సామర్థ్యము గలవారనియు జెప్పబడినది. దీనికీనాటకమే తార్కాణము.

ప్రస్తావనలో వసంతఋతు వర్ణన రాగనిర్ణయముచేసి వసంతరాగములో వ్రాయుట వీరి సంగీతశాస్త్రాభిజ్ఞతను వెల్లడించుచున్నది.

తృతీయాంకమున రతి రోదించుచు శివునుద్దేశించి పాడినపాట 'సింహేంద్ర మధ్యమము' అను రాగమున రచింపబడినది. ఇట్లు వివిధ రాగములలో ఈపాటలు వ్రాయుట వారి సంగీతశాస్త్ర పాటవమును ప్రస్ఫుటమొనర్చును. ఈ రంగముననే గౌరి పాడిన పద్యము 'సిగ నొక పూదండి జేర్చి దమస్న .......'"[5] ఇది ప్రబంధపు పోకడలతో కడు మనోజ్ఞముగ నున్నది.

ద్వితీయాంకమున దిక్పతులు పడుచున్న యిక్కట్లు వర్ణించుటలో కవిగారికి గల లోకజ్ఞతయే గాక శాస్త్రజ్ఞానముగూడ మిక్కిలిగ అభివ్యక్తమైనది. శని ద్వాదశమందు ప్రవేశించెననుట జ్యోతిశ్శాస్త్రప్రమేయము. చతుర్థాంకమున మూడవరంగములో గౌరీముఖతః 'సర్వం ఖల్విదంబ్రహ్మ' అను మహావాక్యము "జన్మాద్యస్యయుతః" అను వేదాంత సూత్రము నుద్ఘాటించి కవి తన వేదాంతశాస్త్ర

పరిచయమును ప్రదర్శన గావించిరి. అట్లే నాలుగవ రంగమున, శివుని పరమాత్మ త్యము నిరూపించబడినది. భరత వాక్యములో ధ్యానయోగ సమాధులిత్యాది పద్యమున భారతీయతత్త్వధ్యాన సంప్రదాయముల నుద్ఘాటించి ధన్యులైరి.

కవిగారికి గల సంఘసేవాతత్పరత, కన్యాశుల్కము, వరశుల్కము లను దురాచారనిర్మూలన మొదలగునవి యిట్టి పురాణనాటకములలో గూడ వ్యక్తము జేసిరి. భృంగీశ్వరుల సంభాషణలో కన్యాశుల్కము గూర్చి, మాలతీవకుళావళికల సంభాషణలో వరశుల్కమును గూర్చి అతి బాల్యవివాహములను గూర్చి, స్త్రీవిద్య గూర్చి ప్రస్తావనవశముగ పేర్కొనిరి. ఈ సందర్భమున అక్షతావివాహముల ప్రస్తావన కలదు. పరిణయమైన పిమ్మట కాపురమునకు పోని స్త్రీలకు పునర్వివాహము చేయవచ్చునన్న ధర్మశాస్త్రవిషయము ప్రసంగించి వారి ధర్మ శాస్త్రజ్ఞతను విశదీకరించిరి. భృంగి నోట పై అధికారుల స్వార్థపరాయణత్వమును విమర్శించిరి.

ఈ నాటకమంతయు కవి లోకజ్ఞత కుదాహరణము. చతుర్థాంక మందలి మూడవ రంగములో పార్వతి చెలికత్తెలతో విహారము సలుపుచు, శివపూజకు వర్జ్యములైన పుష్పములు ఉమ్మెత్తలు, మొగలిరేకులు, ప్రీతి యైనవి ద్రోణార్క పుష్పములు అని చెప్పించి సంప్రదాయమును సమర్థించిరి.

నాటక శిల్పమువకు ప్రధానమైనది పాత్రచిత్రణ. ఇందలి నాయికా నాయకులు పురాణదంపతులైన గౌరీశంకరులు. ఈ పాత్రలు జీవాత్మ పరమాత్మకు ప్రతీకలు. గౌరి శంకరునికై పడు తత్తరపాటు పరమాత్మను జేరుటకు జీవాత్మపడు ప్రయాస యంతయు కాననగును. పరమపావని యగు పార్వతి పాత్ర ఆద్యంతము పవిత్రముగ పోషింపబడినది. ఆదిని కిరాతపాత్ర కడు మనోజ్ఞముగ చిత్రింపబడినది. పాత్రోచిత భాష యా పాత్రకు జీవముపోసినది. శివుడు గౌరిపలని విరహమున భృంగితో సంభాషించుచు గౌరి తనయందే యుండెననుటయును ఆమె కతమున మన్మథుని రూపుమాపి, రతివిలాపంబున తిరుగ బ్రదికించుటచేత యావై రంబుననే మన్మథుడు తన్నుడికింప మొదలుబెట్టినా డనుటయును మిక్కిలి యుచితముగ నున్నవి. భృంగిపాత్ర విదూషకుడు లేని చోటు తీర్చుచున్నది.

శివుని వాక్యములలో భగవద్గీతలో భగవంతుడు చెప్పిన యీక్రింది వాక్యములు స్ఫురించును–

'యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థసర్వశః' – 4–11

ఎవరేరీతిగా నన్నుపాసించుచున్నారో వారినారీతిగనే అనుగ్రహించుచున్నాను. తన భక్తులను చేగొనుటకు తాను తహతహ చెందుదునను గీతావాక్యములు ధ్వనించును.

జీవుడు పరమాత్మను పొందవలెనన్న బ్రహ్మజ్ఞానము, నారాయణ భక్తి యవసరము. ఈ వేదాంతర్థము బోధించుటకే పరమేశ్వరుడు, గౌరి, బ్రహ్మ, నారాయణుడు మొదలగు పాత్రలు ప్రవేశపెట్టబడినవి.

ఇట్టి పరమార్థబోదకమగు పురాణనాటకమైనను కవి కొన్ని తేటతెనుగు లోకోక్తులతోను, సంస్కృత లోకోక్తులతోను నాటకమును రమ్యముగ తీర్చిదిద్దెను.

"బుద్ధిః కర్మానుసారిణీ" – 1–9
'యద్భువ్యం తద్భవతి' –3–39
'వివాహశ్చ వివాదశ్చ సమయో రేవశోభతే' – 4–50
'పుణ్యమునకుబోవ పాపము వెంబడించినట్లు' – 3–42
'చావుతప్పి కన్ను లొట్టబోయె' – 4–61

"అన్నము ఆకులో వడ్డించుకొని యాకలి కోర్వలేనని మొఱపెట్టుకొనుచున్నట్లు" – 4–60

'అయ్యగారి రొట్టె నేతిలో పడ్డట్టే' – 4–53

ఇట్టివి కోకొల్లలుగగలువు. 'ఆదినాట, అంత్యసురటి' అన్న కట్టుబాటు నరసి సురటిరాగములో ఋషిపత్నులు గౌరీశంకరులకు "హారతి" పాట పాడుచు శాస్త్రీయపద్ధతిగ ముగించిరి.

ఇట్లు ఈ సర్వాంగసుందరముగ తీర్చిదిద్దిన ఈ దివ్యమైన నాటక శిల్పము సహృదయ హృదయంగమముగ నున్నది.

## అధోజ్ఞాపికలు

1. నాట్యశాస్త్రము, అ.1, శ్లో. 19
2. The plot there is the first principle and it were the soul of tragedy character holds the second place. Aristotles poetics - Butcher's translation. P.26-2
3. శ్రీ మయూర మహాకవి రచిత సూర్యశతకమునకు అనువాదము, చదలవాడ జయరామ శాస్త్రి గారు - పార్వతీ పరమేశ్వర ద్యూతము', పు.28, శ్రీ సరస్వతి గ్రంథమాల, 1965.
4. ప్రథమాంకము, పు.11
5. తృతీయాంకము, పు. 35



**దాసు శ్రీరాములు**

ఏప్రిల్ 8, 1846 - మే 16, 1908

## (ii) అభిజ్ఞాన శాకుంతలము

### (అచ్చ తెనుగు)

అమలిన తారకాసముదాయము లెన్న వచ్చును గాని శాకున్తలాను వాదముల నెన్న శక్యము గాదు. శ్రీ దాసు శ్రీరాములు గారితో కలిసి నాటికి ఆఱుగురు తెనిగించిరి. శ్రీ పరవస్తు వేంకటరంగాచార్యులు గారు 1878 లోను, శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులు గారు 1883 లోను, శ్రీ రాయదుర్గం నరసయ్య శాస్త్రిగారు 1894 లోను, శ్రీ వడ్డాది సుబ్బరాయ కవిగారు 1906 లోను అనువదించిరి. శ్రీ దాసు శ్రీరాములుగారు 1892 నవంబరు 19న ప్రారంభించి, డిసెంబరు 10వ తేదీకి అనగా ఇరువదినాళ్లలో వ్రాసి ముగించినారు. కాని ముద్రణమాత్రము 1898లో జరిగినది. ఇందులో సుప్రసిద్ధములైనవి శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారిది, శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి గారిది. శ్రీ దాసు శ్రీరాములు గారిది అచ్చతెనుగున వ్రాయబడినది. మద్రాసులోని కొందరు విద్యార్థుల ప్రోత్సాహముతో తెనిగించుటకు ప్రారంభింపగా నదియచ్చతెనుగులో కుదిరినదట. అందులకుగాను నాటకమంతయు అచ్చతెనుగుననే రచించిరట. నవనవోన్మేషమైన ప్రతిభ గలిగిన యీ కవివరులు "నభూతో న భవిష్యతి" యనునట్లు తెనుగున రచించి తమ ప్రత్యేకతను పొందు పఱచుకొనిరి.

'ఇందు పెట్టిన పేర్లుమటుకు మున్ను వాడినవే వాడబడినవి. రెండు మూడు చోట్లలో సామెతలు చెప్పవలసి వచ్చినపుడు, 'దిక్కు – లోకులు' అనునట్టి మాటలు చేరినవి. ఆ మాటలు మార్చిన యెడల వానియందము చెడునని తలంచి యిట్లు వ్రాసితి' నని గ్రంథపీఠికలో వక్కాణించిరి.[1]

1902 లో కృష్ణాపత్రికలో 'ఎడ్వర్డ్ కారినేషన్' ఉత్సవ సందర్భమున బందరులోని నేషనల్ థియేటర్‌లో శ్రీ దాసు నారాయణరావు గారిచే రచింప బడిన 'శాకుంతలము' ప్రదర్శించినట్లు వ్రాసిరి. కాని శ్రీ దాసు నారాయణ రావు గారు శాకుంతలము ననువదించినట్లెచ్చటను జెప్పబడలేదు. కావున వీరి తండ్రిగారైన శ్రీ దాసు శ్రీరాములు గారు వ్రాసినదే ప్రదర్శించి యుండవచ్చును. దీనివలన ఆకాలమున నీనాటకమునకెంత వ్యాప్తి కలదో తెలియుచున్నది. నటులకు

పనికివచ్చునట్లు పాటలు, టుమిరీలు గ్రంథాంతమున చేర్పబడుటచే దీనిని ప్రదర్శించుటకు ననువుగానున్నది.

అభిజ్ఞాన శాకున్తలమును రచించిన కవి కాళిదాసు జగమెఱిగిన బ్రాహ్మణుడు. నాటకములలో తలమానికమగు నీనాటకము ప్రపంచములో ననేక భాషలలో అనువదించబడి మిక్కిలి ప్రఖ్యాతి గాంచినది. ఇట్టి నాటకము ననువదించి పండితుల మెప్పు వడయుట దుష్కరము. అందునను మూలములోని రమణీయత ననువాదము లోనికి తెచ్చి అచ్చతెనుగున రచించుట యెంతటి కష్టమో పండితులకు తెలియనిదికాదు. అయినను వైచిత్రీ ప్రదర్శనమునకే అచ్చ తెనుగున రచించి అట్టి దుర్లభకృత్యమున కృతకృత్యులై పండితుల మెప్పుపడసిరి.

అచ్చ తెనుగు నాటకము మెచ్చదగినదా యన్నదానికి ప్రస్తావనలో శ్రీరాములుగా రిచ్చిన సమాధానము మెచ్చదగియున్నది.

కఱి మొదవుపాలు వెల్లావు కమ్మపాలు
వేలుపుల బాస తెలుఁగును వేఱుగావు
కలియఁగలిపినఁ గలపక కలియబోవు
మేపిన సడని చేతిని రూపు చవులు

అచ్చతెనుగు ఎంత చవిగా నుండునో యిట్లు చమత్కరించిరి–

తల్లి వేలుపుబాసకుఁ బిల్ల లెంద
ఱున్న ముద్దుల కూతుర దొక్క తెనుఁగె
చంకదిగదని చిట్టాట జాడజూపి
తప్పటడుగుల నడిపింప దలఁచుచుండ్రు

అచ్చతెనుగుపై నింతటి యభిమానము గలవారు కావుననే దీనిని అచ్చతెనుగున అనువదించిరి.

వంటకము ఎంత అమృతోపమానముగ నున్నమ వడ్డించువాడు సమర్థుడుకాకున్న ఆ వంటకము వ్యర్థముగ పారవేయబడును లేదా మిగిలిపోవునేగాని చక్కగా వినియోగము కాదు. నేర్పుగలవాడై న భోక్త లనుబట్టి ఆ పాకపు చవులూరించుచు వారుతినగలిగినంత తినిపింపగలడు. కాళిదాసు

పచించిన పాకమును ఈ యనుభవజ్ఞులైన అనువాదకులు తెలుగు భోక్తల కందించిరి. శ్రీరాములు గారు తెలుగువారి 'తెల్లావుపాల' పాయసమును గూడ 'గోరుముద్దలు' చేసి ముద్దు ముద్దుగా తినిపించిరి.

అనువాద వ్యత్యాసములను పరిశీలించునపుడు తులనాత్మకదృష్టితో తూకము వేయక ఎవ్వరెంత మనోహరముగ భావవివృతి చేసిరో యెఱుంగవలెను. ఇతరుల యనువాదములతో బోల్చి వాని వలె ప్రశస్తి గాంచలేదే యని చప్పరించుట తగదని కవి మొదటనే చెప్పియున్నాడు. "ఇది యచ్చతెనుగు ముద్దులపట్టి తప్పటడుగుల చిట్టాట మాత్రమే". అది ఎంత ముద్దుగానున్నదో పరిశీలించుట మాత్రమే జరిగినది. సుప్రసిద్ధానువాదకర్త లైన శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులు గారు, శ్రీ వేదం వేంకటరాయ శాస్త్రిగారు, శ్రీ వడ్డాది సుబ్బరాయకవిగార్ల యనువాదముల కెంత చేరువలో నున్నదో పరిశీలించుట మాత్రమే జరిగినది.

కాళిదాసు నాందీశ్లోకములందంతట శివుని స్తుతియే యుండును. ఈ నాటకమున గూడ శివుని స్తోత్రమే కలదు.

యాః సృష్టిః స్రష్టురాద్యావహతి విధిహుతం
యా హవిర్యాచ హోత్రీ
యేద్వేకాలం విధత్తః శ్రుతివిషయగుణా
యాస్థితా వ్యాప్యవిశ్వం
యామాహుః సర్వభూతప్రకృతి రితియయా
ప్రాణినః ప్రాణవన్తః
ప్రత్యక్షాభిః ప్రపన్న స్త నుభి రవతు
వస్తాభిరష్టాభిరీశః

దీనికి అచ్చతెనుగు అనువాదము –

పట్టించు నెఱదంట మొట్టమొదటిచేత
వితములారసి వేల్చు వేల్మితాల్చు
వేలిమి కూడేగి వెలయు దివాణంబు
పగలు రాతిరులు యేర్పాటు నెళవు

పున్నమ యమవసల్ వన్నెమీఱినచోఁటు
జగము బ్రాకిన సద్దు సంచుమూట
అన్ని బూతాలగూడలరించు సామాను
ఉసురుదారులకుసురొసగుబ్రాపు
ఎల్ల ఱకు దెల్లమయిన యీ యెనిమిదైన
రూపుల ననఁగి పెనఁగి యెఱుంగఁబడిన
యన్ని కలుములతో నొప్పుచున్న దొర
మేలొసఁగి కీడుఁ దొలగించి మమ్ము నేలు - అం. 1, ప. 1

దీనికి వీరేశలింగం పంతులు గారి తెనుగుసేత -

'ఎయ్యది యాద్యమౌ నజునిసృష్టికి హవ్యము నేదితాల్చుఁదా
నెయ్యది సోమయాజి మఱి యేయవి కాలవిభాగమిచ్చు రెం
డెయ్యది తాల్చి శబ్దగుణ మెల్లెగ నుండును హేతుభూతమౌ
నెయ్యది సర్వభూతముల కెయ్యది ప్రాణము ప్రాణికోటికెం
దయ్యది తులాష్ట దేహముల నందు శివుండిడు మీకు భద్రముల్'

శ్రీవేదము వేంకటరాయశాస్త్రి గారి యనువాదము -

"శ్రీకిం బుట్టువొసంగె నేది యెవివానిన్వేల్చు మోచున్ హవిన్
లోకశ్రవ్యగుణాంకమేది యెవి కాల్చున్ కాలమున్ రెండునున్
లోకుల్ ప్రాణులు దేన భూతతతిగల్గున్ దేనఁ బ్రత్యక్షుడౌ
నాకాయంబుల నెవడెన్మిదిట నాయీశుండు మిమ్మోముతన్"

దీనికి వడ్డాది సుబ్బరాయకవి గారి యాంధ్రీకరణము -

ఎదివిధి యాదిసృష్టి వహియించు హుతంబెది యేది హోత్రియై
వదనొనరించు రెండు శ్రుతికందు గుణంబున విశ్వపూర్ణ మే
దెదఖిల భూత వుంబ్రకృతి యెందునఁ బ్రాణులు ప్రాణవంతమున్
తదధిగతాష్టదృశ్యతనులందగు నీశుడు మిమ్ముఁ బ్రోచుతన్

ప్రత్యక్షమగు ఈశుని యష్టతనువుల ద్వారమున పరమేశ్వరుడు మిమ్ము రక్షించుగాక యని మూలభావము.

ఈ శ్లోకమును గూర్చి శ్రీ రాళ్లపల్లి సుందరంగారు విమర్శించిరి.[2] మూలమునందలి తాభిః, ప్రత్యక్షాభిః, అష్టాభిః, తనుభిః యన్న సాభిప్రాయ విశేషణములతో పరికరాలంకారము చెప్పబడినది. “ఈశుడు” అన్న శబ్దమునకు ఐశ్వర్యమనియు అర్థముగలదు. అష్టతనువులవలన అష్టైశ్వర్యము లొసంగునన్న ధ్వనిగలదు. దాసు శ్రీరాములు గారిది గ్రహించి ‘కలుములు’, ‘ఎనిమిదైన రూపములు’ అన్న రెండుపదములును మూలములోవలె సాభిప్రాయముగ ప్రయోగించిరి. క్రమముతప్పక, తత్సమశబ్ద సాంగత్యములేక అలంకారమును విడనాడక మూలధ్వనిన వివృతముగ అచ్చతెనుగున అనువదించుట వీరికి తగినది. అనువాదకర్త లందరు ‘ఈశ’ శబ్దమును గ్రహించిరి. శ్రీ వేదము వారు ‘ప్రత్యక్ష’ శబ్దమును గూడ ఉపేక్షింపలేదు గాని క్రమము నేమఱిరి. “శ్రీ” కారముతో సంప్రదాయానుగుణమున ప్రారంభింపవలెనని మూలమున ‘యాసృష్టిస్స్రష్టురాద్యా’ యని యుండ “శ్రీకి బుట్టువొసంగెనేది” యని అనువదించిరి.

ప్రస్తావనలో నటి ఏకాఋమీద పాటపాడిన బాగుగ నుండును అని ప్రశ్నింపగా మూలమున ప్రస్తావనాసూత్రధారుడు, “నన్విమ మేవనాతిచిర ప్రవృత్త ముపభోగక్షమం గ్రీష్మర్తుం అధికృత్య గీయతాంతావత్ సంప్రతిహి” అను దీనికి శ్రీరాములు గారిట్లు తెనుగు చేసిరి – “నేనో నేనో యని ముందఱ చిందులాడుచున్న దానిని వదిలివేసి, వెనుకనున్న దానిని వెదకి పట్టుకొనబోవుట మంచిపని కాదు.” ఇపుడు మనపాలబడియున్న వడకాఋనే మెచ్చి పాడుము. మొదటి వాక్యము మూలములో లేదు. “నాతి చిరప్రవృత్త మ”ని మాత్రమే గలదు. ఇట్లే యాద్యంతము తెనుగుతన ముట్టిపడునట్లు లౌకికపద ప్రయోగములతో ననువదించిరి.

శ్రీ వీరేశలింగంపంతులు గారు మూలవిధేయముగ నిట్లనువదించిరి. “ఓసీ! ఇంతకు ముందె వచ్చినదియు, భోగములకు తగినదియునైన యీ గ్రీష్మ సమయమును గూర్చి యేపాడవలెను. శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి గారును, శ్రీ వడ్డాది సుబ్బరాయుడు గారును ‘ఉపభోగక్షమము’ గ్రీష్మ ఋతువు అను మూలపదములతోనే యనువదించిరి.

**వర్ణనలు :** ఇందు ప్రఖ్యాతి చెందిన రెండు మూర్తి చిత్రణలు గలవు. పరుగెత్తుచున్న లేడివర్ణన మూలమున నిట్లు గలదు–

గ్రీవాభఙ్గాభిరామం ముహురనుపతతి స్యందనే బద్ధదృష్టిః
పశ్చార్ధేన ప్రవిష్టః శరపతన భయా ద్భూయసాపూర్వకాయమ్
దర్భైరర్ధావలీఢైః శ్రమవివృతముఖ భ్రంశిభిః కీర్ణవర్త్మా
పశ్యోదగ్రప్లుతత్వా ద్వియతిబహుతరం స్తోకముర్వ్యాం ప్రయాతి

శ్రీరాములు గారి యనువాదము -

దుష్యం :- ఏమి యీలేఁడి సాహిణీ! మనల నెంతమేర దాటించుకొని వచ్చినది ఇంకను జూడు. దీని పోడిమి పొక్క! (అచ్చెరువుతో) ఆహా ఏమి ఈ లేడి దౌడు! ఎంత వెంటఁబడి తగిలినను జూపునకే యందుటలేదే!

మెడ మరలించు సోయగముమీరఁగఁజేరఁగఁబారు తేరువెం
బడిఁ బడనిట్టిచూచి మునుమై వెనుమైఁ గుదియించుఁ గోలపై
బడునని దబ్బ మేపు సగబాల్దిని వేనట ద్రోవఁగ్రక్కుమీ
దడవలులెస్స క్రిందడుగు అక్కడనక్కడ బోవుఁజూడుమీ!' - 1-7

కందుకూరి వారి యనువాదము -

"వడిబఱతెంచు తేరిదెసఁ బల్మఱు మార్మెడపెట్టి చూచుచుం
గడు శరపాతభీతిఁ దనకాయము ముందుకుఁగుంచి యెంతయుం
బడలిక నోటినిండెఱచి మార్గమునిండ సగంబుతిన్న ద
ర్భలు పడ మింటఁబాఱెడు ధరంబదమూనక పెద్దదాఁటులన్"

(విస్మయముతో) ఆ! ఏమది! ఎంత వేగముగ వెంబడించుచున్నను ఇంత లోనే యది కనబడుట ప్రయత్నసాధ్య మయ్యెను.

వేదము వారిది-

రాజు :- సూతుడా, మమ్ము నీసారంగము కడుదూర మాకర్షించినది ఇది యిప్పుడును,

శ్రీమీఱం ద్రిప్పిగ్రీవం బెదరక కనుచుం జేరువౌతేరు సారెన్
భూమన్బశ్చార్ధకాయంబు శరభయమునం బూర్వకాయంబుఁ దూఱక

సాముగ్రన్తాగ్రదర్భల్ శ్రమవివృతముఖస్రస్తముల్ దారి రాలన్
స్థామోదగ్రప్లుతాప్తిం జదలనధికమున్ స్వల్పముర్వింజరించున్

(ఆశ్చర్యపడును) ఏమి నేను వెంబడించుచునే యున్నను, ఈ మృగము నాకంటి కగపడుటయే దుర్ఘటమగుచున్నది.

వ.సు. రాయలవారి యనువాదము –

రాజు :– సూతుడా! మనల నీసారంగము అతి దూరమాకర్షించింది. అది యిప్పుడును

వెనుకొను తేరివంక నొకవింతగ గ్రీవము పంచిసారెఁగ
న్గొని శరపాతభీతిఁ గడుఁ గుందుచు ముందఱకుం బిఱిందిమై
తన యరదిన్న దర్భతతి దారి పగర్చెడు నోఁఱజాఱ నే
ల నలతి నింగినెక్కుడుగ లంఘనదీర్ఘతనేగుఁజూడుమీ – 1.7

(విస్మయముతో) ఏమిటి? వెనువెంటనే వచ్చుచున్నను నాకు దీనిని జూచుట ప్రయత్న సాధ్యమగుచున్నది.

దాసువారి అనువాదమున 'ఇంకను జూడ దీని పోడిమి పొక్క!' అన్నది మూలమునలేదు. ఇది అనువాదమునకు తెలుగుతనము చేకూర్చుచున్నది. 'కనబడుటయే ప్రయత్నసాధ్యమయ్యెను'. కనుబడుటయె దుర్ఘటమగుచున్నది అని యనుటకన్న 'చూపునకే యందుటలేదే' యనుట తెనుగువారి మాటతీరును తోపింపజేయుచున్నది. మిగిలినవి ప్రయత్న సాధ్యములే. వేదము వారు స్రగ్ధరావృత్తములో మూలముకన్న కఠినతరమైన భాషలో వ్రాసిరి. రథవేగమును సూచించు మఱియొక మనోహరమైన చలద్వర్ణన మొకటి ప్రథమాంకముననే గలదు.

"యదాలోకే సూక్ష్మం ప్రజతిసహసా తద్విపులతాం
యదర్థే విచ్ఛిన్నం భవతివృతసంధా నమివ తత్
ప్రకృత్యాయద్వక్రం తదపి సమ రేఖం నయనయోః
నమేదూరే కించితణమపి నపార్శ్వే రథ జవాత్"

దాసువారిది -

నలుసును దొడ్డగున్ దటుకునన్ నడఁభూటకువద్ది చేర్చిన
ట్ల లరునుఁబుట్టు సారమలకైన దితిన్నఁగఁగన్ను దోయికిన్
బొలుచును లేదుఁ దౌలదిదిపోయిననే మఱిప్రక్కప్రక్క చా
యలదిదినాఁగనే నిముసమైనను నాయరదంబు నెవ్వడిన్ - 1-7

కందుకూరి వారిది-

ఏది కడుఁజిన్నదై యుండు నిప్పుడదియు
క్షణములోపల గొప్పదై కానుపించు
నేది నడుమను నెడముండి యెసఁగుచుండు
నదియు నొకటిగాఁగలిసియున్నట్లతోఁచు
ప్రకృతిచేతకు నెయ్యది వక్రమగునొ
పరఁగనయ్యది సమరేఖ వలెనె యుండు
దూరమిది చేరువిది యని తేరి వడిసి
నిర్ణయింపఁగ రాదేక నిముషముననె

వేదము వారిది -

చిన్నదివోలె దోచు నెది చెచ్చెరఁగ్రాలు నదే విశాలమై
పన్నుగ వంకరై నదియె భాసిలు నెంతయుఁ దీరితిన్ననై
భిన్నము తెంపువోయి సరిఁజేరినయట్లగుఁ దేరివేగమా
దెన్నగ దవుపజ్జయును నేర్పడవౌర నిమేషమేనియున్

వ.సు. రాయల వారిది -

అన్ను వగాఁ గనంబడు నదప్పుడు గొప్పదియౌను మధ్య వి
చ్ఛిన్న ముగాననేగలయఁజెర్చినటుల్ సహజాతి వక్రమున్
దిన్న నిరేఖఁదోచెడును దేరివడిన్ని మిషార్థమేని నా
కన్నుల కింత దవ్వులనెగల్గదు దాపున నిల్వ దేదియున్.

కందుకూరివారు మాత్రము రెండు గీతపద్యములలో వర్ణించిరి. మిగిలిన వారందరు ఉత్పలమాలలోనే రచించి దృశ్యపరిణామము చక్కగ తోపింపజేసిరి.

ఇట్టిదే సప్త మాంక ప్రారంభమున గలదు. ఆకాశము మీద నుండి త్వరగ క్రిందికి దిగుచున్న వారికి  భూతలము ఎట్లు గానవచ్చునో అందు వర్ణించిరి. వల్కల ధారిణి యగు శకుంతల మూర్తిచిత్రణను కాళిదాసెంత మనోహరముగ స్వాభావిక రమణీయత నెంత హృద్యముగ వర్ణించెనో తెలియుచున్నది.

సరసిజ మనువిద్ధం శైవలేనాపి రమ్యం
మలినమపి హిమాంశోర్లక్ష్మ లక్ష్మీం తనోతి
ఇయమధికమనోజ్ఞా వల్కలేనాపి తన్వీ
కిమివ హిమధురాణాం మండనం నాకృతీనామ్

దాసువారి యనువాదము –

తామరపూవు నాచుమడతంబడియుం గననొప్పు నెంతయున్
బ్రామిడి యయ్యుఁ జూడమురిపంబగుఁ జంద్రుఁడున్
కోమలి ప్రూనిపీచు ముడికోక కడుంగనుదోయి మన్పునే
లా? మిసిమొక్కు మేనులకు నానగ లీనగలంచు నుంచగన్. 1–20

కందుకూరివారి యనువాదము –

నలినము శైవలంబునఁ బెనంగొనియుండియు రమ్యమేయగున్
మలినకళంకముం గలిగి మంజుల తన్వహియించుఁ జంద్రుఁడన్
చెలువున మించె నీ జలజ నేత్రయు వల్కలధారణంబునన్
తలపగ సుందరాంగులకుఁ దాను విభూషణ మేది గాదిలన్ – 1–16

వేదము వారిది –

కమలము శైవలాకృతికిఁ గాంతి దొలంగక తేజమే గనున్
హిమకరమండలంబు సిరినేపారయున్మలినొంక యుక్తి చేన్
రమణను మించు నీ యువతీరత్నము వల్కలమే ధరించియున్
సుమధుర మోహనాంగులకుఁ జొక్కపు భూషణ మేదిగాదొకో –1–0

వడ్డాది వారిది –

“నలినము నాఁచుతో బెరసినం గననయ్యెడు దర్శనీయమై
చలువలఱేనికిం జెలువొసంగు మలిమ సమయ్యు నంకమీ

చెలియ తరుత్వచంబున విశేష మనోహర మాధురీ గుణం
బలవడినట్టి యాకృతుల కాభరణం బెది కాకపోయెడున్" - 1 - 20

శ్రీ శ్రీరాములు గారు నాలుగవ పాదభావము, నాలుగవ పాదమున 'మిసిమెక్కు మేనులకు నానగ లీనగ లంచు నుంచగన్' అని వివరముగ చెప్పి, తృతీయ పాదభావమును వేఱొక గీతపద్యమున భావవిస్తృతి గావించి ప్రసన్న రచనను గావించిరి. శ్రీ దాసు వారు వల్కలమునకు 'మ్రానిపీచు ముడికోక' అని చెప్పి విస్తృతిజేసిరి. అయినప్పటికి భావవిస్పష్టత యంతగలేదు.

రెండవ అంకమునగల శకుంతల వర్ణన -

అనాఘ్రాతం పుష్పం కిసలయ మలూనం కరరుహైః
అనావిద్ధం రత్నం మధునవ మనాస్వాదిత రసమ్
అఖండం పుణ్యానాం ఫలమివచ తద్రూపమనఘమ్
నజానే భోక్తారం కమిహ సముపస్థాస్యతి విధిః - 2 - 10

దానికి దాసువారి యనువాదము -

ఎపుడు మూచూడని విరి గోరిడని చిగురు
గ్రుచ్చని రతన మానని క్రొత్త తేనె
మించు మోముల పంట నమ్మంచి రూపు
నెవనిఁ గలయంగఁ గూఱ్చునో యెఱుగనలువ - పు. 32

కందుకూరి వారి యనువాదము

వాసన చూడనట్టి ప్రసవంబు నఖంబులఁ ద్రుంపనట్టి నూ
త్నాసపల్ల వంబుఁ బరులానని క్రొవ్విరితేనె సూచి వి
న్యాసములేని రత్నము మహాతత పుణ్యఫలంబుఁబోలు నా
భాసుర గాత్రిసోయగ మెవండు భుజింప విరించి వ్రాసెనో

వేదము వారిది -

ఆనని తావిపూవు నఖరాగ్రము సోకని పల్లవంబు క్రొం
దేనె రసంబు గ్రోలనిది తీరయి విద్ధముగాని రత్నమున్

మానని రూపు పుణ్యఫ రమంజు ఫలంబన ఘంటఖండమున్
నేనెఱుగన్విరించి యెవనిం బరిభోక్తను గూర్పనెంచునో - 2-44

వడ్డాది వారిది -

కానని రత్నకందళము కైకొనగిల్లని పల్లవంబు మూ
ర్కొనిల సత్ప్రసూన మెవరున్ రసమానని యట్టి క్రొత్త పూ
దేనె యఖండమైన సదదృష్ట ఫలంబును బోలె నొచ్చె ముం
బూనని యామె రూపెవనిఁ బొందగజేయునొ ధాత యీమహిన్ -2-11

శాకుంతల నాటకములో నీశ్లోకము సుప్రసిద్ధమైనది. ఇందు శకుంతల రూపమునకు నైదుపమానములు చెప్పబడియున్నవి. పుష్పము, కిసలయము, రత్నము, మధువు, ఫలము. ఈ అయిదింటిలో నట్టనడుమఁబడిన రత్నమునకు తప్ప మిగిలిన యుపమానములతో నీవల నా వల గల వానికి పరస్పర సంబంధము గన్పట్టుచున్నది. అవియును నొక క్రమములో లేవు ముందు పుష్పము, తరువాత కిసలయము, ఆ తరువాత మధువు, అని ఇట్లు వ్యత్యాసపడి యున్నవి. దీని ప్రథమ ద్వితీయ పాదముల మొదళ్లు పాఠకులచేఁ దార్మారుబడి యుండునేమో యని యూహించి ఈ శ్లోకమును వడ్డాది సుబ్బరాయ కవిగా రీవిధముగ పై రెండు పాదములు తార్మారు చేసి సూచించియున్నారు.

అనావిద్ధం రత్నం కిసలయ మలూనం కరరుహైః
ఆనాఘ్రాతం పుష్పం మధునవ మనాస్వాదితరసం

"అనావిద్ధం రత్నమ్మ" నుపాదమే సరియైనచో నీ క్రింది విధముగ పద్యము చదువుదనిరి.[3]

గోరగిల్ల నిచిగురు మూర్కొనని పువ్వు
చవిగొనని క్రొత్త తేనె తొలువనిరతన
మామె రూపమఖండ పుణ్యఫలమనఘ
మొదనిట విధి యెవనిజేయునో యెఱుంగ - 2 - 10

ఈ పద్యవిషయమై కందుకూరి వీరేశలింగం పంతులుగారి యనువాదము, శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి గారి యనువాదముల గూర్చి 1959, 1960

భారతులలో జుగుప్సాకరమైన విమర్శలే గావించిరి. సౌందర్యము స్పర్శనీయము, దర్శనీయము, శ్రవణీయము, ఆస్వాదనీయము, అఘ్రాణీయము అను నవస్థాభేదముల జెంది పంచేద్రియభోగ్యమగును. దీనిని బట్టి శకుంతలా సౌం దర్యము శ్రవాణీయమును దక్క సర్వేంద్రియములను పరితోషింపజేయు సౌందర్యము కలదని తెలియుచున్నది.

'అనాఘ్రాతం అనాస్వాదితరసం' అను ప్రయోగములనే నాసా జిహ్వేంద్రియముల తర్పణ, 'అలూనంకరుహైః' అనునది స్పర్శభావ స్ఫోరకతచే త్వగింద్రియమును, రత్నశబ్దముచే దర్శనీయత్వ వ్యంజకతచే నయనేంద్రియమును తర్పణము గావించుచున్నవి. ఇట్లు నాలుగింద్రియముల ప్రయోజనము కొఱకే మహాద్భుత చిత్రణము గావించియు కవికుల తిలకుడు తనివినొందక 'పుణ్యానాం ఫలమనెను'. 'పుణ్యానాంఫల మ'నుటకే మోక్షత స్ఫురించుచున్నది. తత్ప్రాప్తి యే గదా మానవుని జన్మసాఫల్యము. అది జనన మరణాతీతమనియు, శాశ్వతానంద సంధాయక మనియు, ఉపనిషత్తులు ప్రవచించుచున్నవి. నిరంతర తపోయోగాది బహువిధ క్లేశానుభవ పూర్వకముగ పొందదగిన ఫలమిచట సులభప్రాప్తమై మర్త్యమును స్వర్గముగా రూపొందింపదలచిన మహాకవి సృష్టి సార్థకమగుచున్నది. ఈ భావము చక్కగా గ్రహించి పంతులుగారును, శాస్త్రిగారును యథాతథముగ ననువదించిరని శ్రీ తమ్మి వెంకటరత్నం గారి భావన.[4] శ్రీ బెల్లం కొండ రాఘవరావుగారు పంతులుగారి యనువాదము కంటె శాస్త్రి గారిదే మేల్తరముగ నున్నదని చెప్పక తప్పదని ఈ శ్లోకములోని వ్యంజకార్థమును గైకొని జుగుప్సాకరముగ విమర్శించిరి.[5] 'నఖరాగ్రముల త్రుంపనట్టి పల్లవ' మనుట కంటె నఖరాగ్రముల సోకని పల్లవంబు అనుటలో మార్ధవము మిగుల సూచితమనియు, "రత్నమున" అనుటయు నట్టిదేయనియు విమర్శించింది. "పరులానుట" యన్నది విపరీతార్థమునకు తావలమగుచున్నది. వేదమువారు "క్రొందేనెరసంబు గ్రోలనిది" యని యౌచిత్యము పోషించినట్లున్నదనిరి. వడ్డాదివారు 'గోరగిల్లని చిగురని', 'చవిగొనని క్రొత్త తేనె' యనియు వ్రాసిరి. ఈ విషయమున శ్రీరాములుగా రందరికన్న నెక్కువ సారస్యము జూపిరనవచ్చును. వారు "గోరిడనిగురు, ఆనని క్రొత్త తేనె" యని ప్రయోగించి యౌచిత్యమును బోషించిరి. "ఉపమా కాళిదాసస్య"–

అర్థోహి కన్యాపరకీయ ఏవ
తామద్యసం ప్రేష్య పరిగ్రహీతుః
జాతో మమాయం విశదః ప్రకామం
ప్రత్యర్పితన్యా స ఇవాంతరాత్మ - 4-21

జాతోస్మి సద్యో విశదాంతరాత్మా
చిరస్య నిక్షేప మివార్పయిత్వా -4-3

దీనికి దాసువారి యనువాదము -

ఆడుబిడ్డ మఱొక్కరిదైన సొమ్ము
ఈమెఁ బెనిమిటి యింటికంపించి లోన
నున్న దేవర కుదిరి కూర్చుండు నింక
నరిదితలపోతలను నిల్పినపుడె బోలె - పు. 62

కందుకూరి వారిది -

కన్య యెపుడుఁ బరునిసొత్తె కాన దాని
నిప్పుడు ప్రతిగ్రహీతకు నప్పగించి
దాపుడు ధనంబు స్వామికిఁ దార్చినట్టు
లెంతొ నిర్మలమయ్యె నాయంతరాత్మ

వేదము వారిది -

కన్య యనఁగాదె జగతిలోనన్యు సొమ్ము
దానిఁబతిఁజేరఁ బంపిన తత్క్షణంబ
యెంతయు ప్రసన్నమయ్యె నాయంతరాత్మ
యిల్లడను గాచి యొడయని కిచ్చినట్లు - 4-10

వద్దాది వారిది -

కన్యయన్యుని యర్థంబె గాన దాని
పరిగృహీత చెంతకు నేఁడు పంపుకతన
స్వచ్ఛమయ్యెను నాయంతరాత్మ మిగుల
నిల్లడి యొసంగినది వెండి యిచ్చినట్లు - 4-23

ఆడపిల్ల దాపుడు ధనము వంటిది. యుక్త వయసు రాగానే వరుని కప్పగించి గృహస్థులు నిశ్చింతగ నుందురు. "భర్తా రక్షతి యౌవనే" అన్న వాక్యమునుబట్టి వరుని కప్పజెప్పుదురు. ఇందలి ఉపమాలంకారమును అనువాదకులందరును గ్రహించి చక్కగా సరళముగ భావ విస్పష్టతను గలిగించుచున్నారు. ఈ సంఘటనలో ఉపమానము సందర్భ శుద్ధిగ ప్రవేశపెట్టబడినది. ఏ ఉపమాన మెపుడు ప్రయోగించవలెనో యెట్లు ప్రయోగించవలెనో యెఱిగిన సమర్థుడు కాళిదాసు. అందులకే "ఉపమా కాళిదాసస్య" యనిరి. "అంతరాత్మ నిర్మలమయ్యె" అనుటకు "లోన నున్న దేవర కుదిరి కూర్చుండు నింక" అని తెనిగించిరి. 'అంతరాత్మను' "లోన నున్న దేవర" అనుట లెస్సగా నున్నది. ఇట్టి ఉపమానములు ఈ రూపకమందంతట నెచ్చట తడవిన నచ్చట గలవు.

పాతుం నప్రధమం వ్యవస్యతిజలం యుష్మాస్వపీతేషు యా
నాదత్తే ప్రియమండనాపి భవతాం స్నేహేన యాపల్లవమ్
ఆద్యేవః కుసుమ ప్రసూతి సమయే యస్యా భవత్యుత్సవః
సేయం యాతిశకుంతలా పతిగృహం సర్వైరనుజ్ఞాయతాం - 4-9

ఆస్మాన్ సాధు విచిన్త్య సంయమిధనానుచ్చైః కులం చాత్మనః
త్వయ్యస్యాః కధమప్య బాంధవ కృతాం స్నేహ ప్రవృత్తించతాం
సామాన్య ప్రతిపత్తి పూర్వకమియం దారేషు దృశ్యాత్వయా
భాగ్యాయత్త మతః పరం నఖలుద్వాచ్యం వధూబన్ధుభిః - 4-18

శ్లోక చతుష్టయములోని ఈ రెండవ శ్లోకములోని కాశ్యపుని పలుకులలో అరణ్య సంభవమైన శకుంతల యొక్క మనః ప్రవృత్తియు గూడ అంతరంగమున ధ్వనించుచున్నది. 'పాతుం న ప్రథమం వ్యవస్యతి' అనుదానికి శ్రీరాములుగారి యనువాదము -

మొనయదు మీరు ద్రాగుటకు ముందరి నీళులు ద్రావ గైకొనం
దునుమదు మీననన్ నెనరుతో నగలాసనటారియైన దా
నొనరుచు నబ్బపబ్బముగ నోపిక మీతొాలుపూఁత కాఱిదే
చను మగనింటికిన్ సెలవొసంగుడు మీరు శకుంతలమ్మకున్ - 4-9

కందుకూరి వీరేశలింగం పంతులు గారి యనువాదము –

ఎవతె జలంబు మీకిడక యెన్నడుఁ ద్రాగదు తాను ముందుగా
నెవరితె ప్రేమచేఁ జిదుమదీప్సిత భూషణయయ్యు మీచిగు
ళ్లవతెకు మీరు తోల్త ననలెత్తుట పండువుగాఁగ నుండు నా
ప్రవిమలగాత్రి యేగుఁపతిపజ్జకు నందఱనుజ్ఞ యీయరే

వేదము వారిది –

త్రాగదెవర్తె దస్సినదె త్రావకయుండ జలంబు మీరుమున్
దాఁగయి సేతకే నెవతె దాఁకదు కూరిమి మీ ప్రవాళముల్
సాగును బండువెవ్వతెకుఁ జయ్యన మీ తొలుపూవు సూతిచే
నేగెడు నాశకుంతల యిదే మగనింటికి వీడు కొల్పరే

వడ్డాది వారిది –

పోయక మీకు నీరెవతె పూనదొ ముందుగఁ ద్రావ దేనికా
దోయెద యుష్మదాద్య కుసుమోదయ వేళను బండు వేదిగా
గోయదా మీయిగుర్ను గనుగోరియుఁ గూరిమి భర్త యింటికిన్
బోయెడు నాశకుంతల యనుంగున కందఱనుజ్ఞ యీయరే

శకుంతలకు ఆశ్రమపాదపములె సహచరులు, నేస్తులు. వానిని గూడ ఆశ్రమ పాలితయైన తనతో సమానముగ జూచును. వానితోనే సంభాషించును. ప్రథమాంకమున శకుంతల పొగడను జూచి యిట్లనును. “ఇదిగో చూడుడు ఈగున్న పొగడ గాలికిఁ గదులుతు నన్ను వేగిరము నీళ్లుపోయ రమ్మని పిలుచుచున్నట్లున్నది. అవిగో ఆ చిగురుటాకులు వ్రేళ్ల వలెనే యున్నవి.” మరల ఈ యంకములో గూడ శకుంతల వృక్షములకు నీరిడుట కవి సూచించెను. ఆ పాత్రను దలచినప్పుడెల్ల కుండతో ఆశ్రమ వృక్షములకు నీరుపోయుచున్న యామె మూర్తి కన్నుల యెదుట సాక్షాత్కారించును. తపోవనవృక్షముల ననుజ్ఞ యిమ్మనుట ప్రకృతికి పాత్రకు గల గాఢ సంబంధము వ్యక్తమగుచున్నది. ఈ భావనలన్నియు పంతులు గారి యనువాదమున సరళములైన పదములతో ప్రసన్నమైన భావముతో భాసించుచున్నది. శ్రీరాములు గారు ‘శకుంతలమ్మ’ అనుట తెలుగువారి యలవాటైన తెలుగు ఆడబడుచుల సంబోధనము తెలియజేయుచున్నది.

శ్లోక చతుష్టయ మందలి మూడవశ్లోకమున దుష్యంతుడు చేసిన దోషము శకుంతల తొందరపాటును దెల్పుచు, దానిని సరిదిద్దుకొని, యందరి భార్యలతో సమాన గౌరవమును జూపుమనియు చెప్పినట్లు ధ్వనించు చున్నది.

తలపులు చిక్కఁబట్టు జడదాలుపులన్ మమ్ము బారఁజూచిమీ
కొలమున గొప్పనెంచి నినుగుట్టుగ నెట్టులో గట్టుకున్న యా
చెలిమిని గాంచి నీదు పెర చేడల నెక్కువగం దలంచు మా
చెలి నికనోట బందుగులు చెప్పరు తక్కిన నెగ్గ నోముదే - 4-17

పంతులు గారి యనువాదము -

మమ్మును సత్తపోధనుల మాన్యభవత్కులమున్ స్వబంధులన్
సమ్మతి వేఁడకీమె యెటొసల్పిన నీపయి కూర్మినెంచి మా
కొమ్మను నేలుకొమ్ము సరికొమ్మలతో సమగౌరవంబునన్
బిమ్మటిదెల్ల భాగ్యమగు బేర్కొనరాదది యింతి బంధువుల్

వేదము వారిది -

పోలగ నెంచుమమ్ములఁ దపోధనుల న్నిజసత్కులంబు నీ
బాలికయెట్లొ నీపమున బంధుకృతంబుగఁగొన్న యాతమిన్
బాలనసేయు బాలనిజభామలతో సరిప్రేమ నాపయిన్
మేలగులెల్ల భాగ్యము జన స్వజనంబది వేడఁబాడియే

వడ్డాది వారిది -

తలచితపోధనుల్ మము లెస్సగ దావకమైన మహాకులమున్
నెలతుక బంధుకృతంబుగ నెట్టులొ నీ యెడ గల్గిన యా చెలిమిన్
సలుపుము నీవు సమప్రతిపత్తిని భామలలోవల దీనికి న
వ్వలిది యదృష్టవశంబది బాలిక బంధులు వాకొనరానిదగున్

దీని గుఱించి శ్రీ ఎమ్. ఆర్. కాలేగా రిట్లు భావించిరి - శకుంతల నవమానింపక తగిన విధముగ గౌరవముగ భార్యగ స్వీకరించవలెనని కోరుచున్నాడు. దుష్యంతుడు కణ్వుని యంగీకారము బడయకయే వివాహము చేసికొనెను. కాబట్టి కణ్వుని కోపమునకు గాని, శాపమునకు గాని భయపడి

యుండవచ్చును. అంతేకాదు. అందుకని కాశ్యపుడు ఆత్మ నిగ్రహము కలవాడనియు, కావున నిది యంతయు సమగ్రముగ పరిశీలించి యీ చట్టబద్ధమైన వివాహమునకు అంగీకరించితి ననియు ధ్వనించుచున్నది. “ఉచ్చైః కులమ్” అనుటలో పురువంశమునకు ప్రతిష్ఠ తెచ్చునట్లు మెలంగవలయునని హెచ్చరించుచున్నట్లున్నది. ‘అబాంధవ కృతమ్’ అనుటలో ఈ వివాహము తానే యిచ్ఛాపూర్వకముగ ఎట్టి వత్తిడి ఎవరి వలన లేకుండ చేసికొంటిని. ఇదంతయు బాగుగ తెలుసును గనుక శకుంతలను అందరి భార్యల వలె గౌరవించ వలెనని ఆమె యదృష్టము బాగున్న పట్టపురాణిగ గూడ విశేష గౌరవముతో సన్మానింపుమని ధ్వనించు చున్నట్లు నుడివిరి. “పితా రక్షతి కౌమారే, భర్తా రక్షతి యౌవనే” అను లోకాచారము ననుసరించి తన యనంతరము రక్షించవలసినది భర్త. తనను గాని, “కులపెద్ద” లను గాని – బంధువులను గాని సంప్రతింపక వారి యనుమతి గైకొనకయే భర్తగా రక్షించు భారము తానే స్వయముగా ప్రీతితో పైన వేసికొనెను. కావున నీ శకుంతలను గౌరవముగ రక్షించు భారము దుష్యంతునిదని హెచ్చరించుచున్నట్లున్నది. పట్టపురాణిగ కాకపోయినను తోడి పత్నులతో సమానముగ గౌరవింప వలెనని చెప్పినట్లున్నది. ఇంత శ్లోకములో అనంతమైన భావమును ఇమిడ్చెను. కావుననే దీనిని శ్లోక చతుష్టయములో మొదటిదిగ పరిగణించిరి. శ్రీరాములు గారు ‘ఎట్టులో కట్టుకొన్న’ యనుట సాభిప్రాయముగ జెప్పిరి. ఆ పదములు కవి చెప్పదలచిన భావమును స్ఫురింపజేయుచున్నవి. అనువాదము లన్నియు మూలమందలి యర్థమును, స్పష్టము చేయుచు సరళముగ నుండి ప్రసాద గుణోద్దీపితములై యున్నవి.

## పాత్ర స్వరూప సాక్షాత్కారము :

శాకుంతల మందలి చతుర్థాంకము ముక్తాహారము నందలి నాయకమణి వంటిది. ఈ ఘట్టము రసవంతముగను గుణోత్కరమునై సహృదయహృదయము లార్ద్రములగు విషాదరేఖా శబలితమై యున్నది. ఈ కథాకథనము రసవత్తరమును గుణోత్కరమునై చిత్రలేఖకుని రూపచిత్రణము వలె భావుకుల మనశ్చక్షువులకు చిత్ర స్వరూపముల సాక్షాత్కారింపజేయును.

శకుంతల యత్తవారింటి కేగునప్పటి కణ్వులవారి మనస్థితి యిట్లున్నది–

కాశ్యప :

యాస్యత్యద్యశుకుంతలేతి హృదయం సంస్పృష్టముత్కంణ్ఠయా
కణ్ఠస్తంబిత బాష్పవృత్తి కలుషం చిన్తాజడం దర్శనం
వైక్లబ్యం మమతావదీదృశ్య మహోస్నే హోదరణ్యౌకసః
పీడ్యన్తే గృహిణః కథం సుతనయా విశ్లేషదుఃఖైర్ణవైః - 4-6

శ్రీరాములు గారి కాశ్యపుడు మడిగట్టుకొని వచ్చుచు, నిట్లనుచున్నాడు -

గుండెలు జల్దరించెను శకుంతల యేగెడి గ్రుక్కమింగి గొం
తెండిన మాట బొంగురగు నేడువ నేడువఁ జూపు మ్రాన్పడెన్
దండిగ గానకాపునయి దగ్గరదీసిన నాదుపాట్లె యి
ట్లుండగ గన్న గేస్తుల కెటో తొలిసారిగ బిడ్డనంపుచోన్ - 4-6

కందుకూరి కణ్వుడు స్నానముసేసి ప్రకాశించుచు -

కొందల మందె డెందము శకుంతల తానిపుడే గునంచయో
క్రందుగ బాష్ప రోధమున గంఠము నుంజెడె దృష్టిమాంద్యముం
బొందె నాకింత పెంచిన తపోధనులే యిటు కుంద నెంతగాఁ
గుందుదురో తమంతఁగను కూఁతులఁబాయు గృహస్థు లక్కటా!

వేదమువారి కాశ్యపుడు స్నానోత్థితుఁడై ప్రకాశించుచు -

కుందు జనించె నేగెడు శకుంతల యిప్పుడెయంచు బాష్పపుం
గ్రందు నడంప లోనెలుగుగాడ్పడె! జింతకు జూపు మ్రాన్పడెన్
వందురనిట్లు ప్రేమ వనవాసినె నేఁదము బాసి క్రొత్తగా
నందనలేగ నేవగమనంబున నెట్లు గృహస్థు లోర్తురో

వ.సు. రాయల వారి కణ్వుడు స్నానము చేసి వచ్చి ప్రకాశించుచు -

హృదయము బెంగగాంచు నిపుడేగు శకుంతల యంచు నెల్లుగ
ద్గదమగు బాష్పమాచుకొన దర్శనముంజెడెఁ జింత గానలో
బ్రదికెడు నాకె యింతవగపాటిలఁ గూరిమిఁగన్న కూతులన్
వదలుట నౌ వినూతనపు వంత గృహస్థుల నెంత యేచునో

వడ్డాది వారు "బిడ్డలను వదలుట" యనిరి. అంతకన్న 'బిడ్డ నంపుట' యన్నదే మేల్తరము. "కంఠస్తంభిత" యన్న దానికి అనువాదములు 'ఎల్గు గద్గతమగు'. వీనిలో "గొంతెండి మాట బొంగురగుట" "గద్గదమగుట" యన్నవి సందర్భ శుద్ధిగ నున్నవి. "అరణ్యౌకసః" అన్నదానికి 'కాన కాపు' అన్నమాట భావయుక్తముగ లేదు. వీరేశలింగం పంతులు గారింత విశేషణము గూడ జేర్చి "ఒకింత పెంచిన తపోధనులే యిటుకుంద" అనుటచే భావముతో పాటు పద్యము గూడ ప్రసాదగుణ శోభితమై రమణీయముగ నున్నది. ఆ గృహస్థు హృదయవేదనను వ్యక్తము చేయుచున్నది.

అత్తవారంటికేగు శకుంతలకు హితబోధ చేయు శ్లోకము గూడ రమ్యమైన శ్లోకచతుష్టయములో నొకటి.

శుశ్రూష స్వగురూన్ కురు ప్రియసఖి వృత్తం సపత్నీ జనే
భర్తుర్వి ప్రకృతాపి రోషణతయా మాస్మఁప్రతీపంగమః
భూయిష్టం భవ దక్షిణాపరిజనే భాగ్యేష్వనుత్సేకినీ
యాన్త్యే వంగృహిణి పదం యువత యోర్వామాః కులస్యాధయః–4–17

శ్రీరాములు గారి యనువాదము –

కొలువుము పెద్దలన్ సవతి కొమ్మల నీ చెలికత్తెలట్లుగా
దలపుము పెన్మిటెంత బెడిదంబుగ నల్గిన మాఱుపల్క కి
మ్ముల బలగంబుపై నెనరు పూనుము గల్మికి నుబ్బఁబోకు మి
ట్ల లరిన గేస్తురాల్ నలుగురౌననఁ దక్కిన నింటిచేటగున్ – 4–18

పంతులు గారిది–

గురులకు సేవఁజేయు మనుఁగుంగతి జూడుము నీ సపత్నులన్
వరుఁడ లుకన్వహించినను భర్త్ర విరుద్ధవుగా కుమీసునన్
బరిజనులందుఁ జూపుము కృపంగడుఁ బొందకు భాగ్యగర్వమున్
తిరిగిన నిట్లు కాంతురు సతీత్వము కాంతలు నింద్యలొందుచోన్

వేదము వారిది -

గురుల భజింపు భక్తిఁగడు గూర్పు సపత్నులకుం బ్రియాళువై
వరుడు శంకించినన్ గినుక పట్టకు వాదము సల్పకెప్పుడున్
బరిజనమున్దనుపు భాగ్యము లబ్బిన నుబ్బకీక్రియన్
దరుణులు గేహినీపదము దాల్తురు వామలు వంశదుఃఖదల్

వడ్డాది వారిది -

పనివిని కొల్వు పెద్దల సపత్నుల చోటప్రియాళువృత్తి గై
కొను పతియల్గనల్గి ప్రతికూలవు గాకుము భోగభాగ్యమున్
గనుగొని పొంగబోకు దయగల్గుము సేవకులందు నాతిగా
చను గృహిణీ పదంబిటుల చూడగ లాతి కులాధి యేసుమీ - 4-19

శ్రీ కందుకూరి వారి పద్యము ప్రసిద్ధి గాంచియున్నది. శ్రీరాములు గారి యనువాదము గూడ ప్రసాద గుణము గలిగి పంతులుగారి యనువాదముతో సమానముగ నడచుచున్నది. వేదము వారిది, వడ్డాది వారిదియు ప్రసన్నముగ నున్నను, ఒకటి రెండుచోట్ల కొంచెము కాఠిన్యము వహించుచున్నది. ఇందు 'కులస్యాధయః' అన్నదానికి 'ఇంటికి చేటగున్ అనుట మిగిలిన వానికన్న సందర్భశుద్ధిగ నున్నది.

## పద్య శిల్పము :

భావావిష్కరణకు రసోద్దీపనకు కవికి పద్యమెంతో నుపకరించును. వచనములో చెప్పిన దానికన్న పద్యములో చెప్పిన ఆ భావమునకు గాంభీర్యము చేకూరును. రససాక్షాత్కారమగును. రౌద్రరస భయానకాది రసముల సంచారము గావింపవలసి వచ్చినపుడు రసజ్ఞులైన కవులు పద్యమునే యాలంబనముగ జేసికొందురు. దానికి తగిన వృత్తము నెన్నుకొందురు. నండూరి బంగారయ్య గారన్నట్లు "లోకానుభవమును పురస్కరించుకొని మానవ స్వభావమును మథించి తీసిన యమూల్య రహస్యములను నిక్షిప్త మొనర్చుటకు గూడ బంగారు నగను దాచుటకు దంతపు భరిణ నుపయోగించినట్లు కాళిదాసు పద్యము నుపయోగించును".[8]

రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్యశబ్దాన్
పర్యుత్సుకోభవతి యత్సుఖితోపి జన్తుః
తచ్చేతసాస్మ రతి నూనమబోధపూర్వం
భావస్థిరాణి జననాంతర సౌహృదాని – 5–8

శ్రీరాములు గారి యనువాదము –

రవురుల్ సౌరులు చూచి తేటలగు పాటల్ వీనులం జొన్పిచిన్
చవికిం జంకలు కొట్టుకొందుఱు సుగాలంబొందియున్ జాడన
ట్లవుగాఁ దొల్లిటి పుట్టు వందుగల నెయ్యంబుల్ల ముంబట్టి ని
క్కువమా సుద్ధి తలంపులోఁబడు పరాకుల్ తెల్పకున్నప్పుడున్ – 64

ఈ గంభీరభావమునకు తగిన వృత్తమును మత్తేభమునే యెన్ను కొని రచన చేయుట గమనింపదగినది. ఈ పద్యము గాంభీర్యము, ధారాశుద్ధి, అర్థవైశద్యము గలిగి యున్నది. 'సంతోషించు' అనుట 'చంకలు కొట్టుకొను' అను పదమును వాడుటలో కవి యెక్కువ మక్కువ జూపును. "తేటలగుపాటల్" అనుట సాభిప్రాయము. క్షణమునకు ముందు హంస పదికపాటను విని ఆ గీతార్థమును తలచివ్యాకులపడెను. ఈ వ్యాకుల పాటాపాట వలన కలిగినది. "మధురశబ్దము, తీయనిపల్కులు, సుస్వరంబులు" అనుటకన్న "తేటలగు పాటల"నుటయే యుచితము. తేటయగు పాటగాక పోయిన యా గీతార్థమెఱిగి యా యనుభవము పొందలేడు. కనుకనే పాట, పాటకి విశేషణము 'తేట' రెండును, నిప్పట్టున పట్టుగా నున్నవి. దీనిని పంతులు గారు గీతములోను వేదమువారు అటవెలదిలోను రచించిరి.

పంతులు గారిది –

మున్నెఱుగకయు మదినంబు పూర్వజన్మ
భవ్యసఖ్యముల్ స్మరణకు వచ్చుగాన
జనుడు సుఖితుడయ్యు సురూపచయముఁగనియు
సుస్వరంబుల వినియు నుత్సుకతఁగాంచు

వేదము వారిది -

మంచిరూపుగాంచి మధుర శబ్దంబు విని
సఖియునుత్సు కిల్లి స్రుక్కుటెల్ల
భావరూఢపూర్వ భవసౌ హృదంబుల
స్మరణగాదె భోధవిరహితంబు -3-100

వడ్డాది వారిది -

తిన్నని వస్తువుల్ గనియు దీయనిపల్కుల నాలకించియున్
మున్నెఱికం దపించుఁ గరమున్ సుఖముండియు బ్రాణిదానిదే
మన్ననబోధ పూర్వ జననాంతర భావనిరూఢ సౌహృదో
త్పన్న వినూతన స్మృతియె తథ్యము దానికి హేతువారయన్ - 5-2

వేదము వారి యనువాదము మూలవాక్యములతో గంభీరముగ నున్నది. పంతులు గారిది అర్థవై శద్యము కలిగియున్నది. వడ్డాదివారు మూడవ పాదము వచ్చుసరికి వారికి సహజమైన సంస్కృత సమాన విన్యాసమును గావించిరి.

## పాత్రోచిత భాష :

ఆంధ్రీకరణమునకు వన్నె తెచ్చు మఱియొక సుగుణము పాత్రోచిత భాష. కాళిదాసాదులు పాత్రోచిత భాష వాడిరి. దాని ననుసరించియే తెనుగు కవులును పాత్రోచిత భాషనుపయోగించిరి. ఈ విషయమై పాతాళభేది సుబ్రహ్మణ్య కవి గారిట్లుటం కించిరి - "నాటకమునకు ముఖ్యాంగము అగు పాత్ర పోషణమునకు, పాత్రౌచిత్యమును, పాత్రబేధమును నెఱింగి తత్త దుచిత భాషాప్రయోగము చేయుట మెరుగుగనుండును. కథ పాత్రను బట్టుకొని ప్రతిపదంబునను ప్రకృతి ధర్మములు సొంపులు గులుకుచుండవలయును. ప్రపంచ ధర్మ ప్రతిబింబములుగ నుండునట్లు రచింపవలెను. నాటకముల ప్రజా పరిస్థితిని మేలుగూర్చు నట్టి విషయములు బోధించునట్టి వై యుండవలెను". ఈ ధర్మము ననుసరించియే వేదము వేంకటరాయశాస్త్రిగారును, దాసు శ్రీరాములు గారును పంచమ షష్ఠాంకముల మధ్యమునందు గల ప్రవేశకమున కావలివాంధ్రచేత, బెస్తవారిచేత వ్యవహారికమునే మాట్లాడించిరి. కందుకూరి వీరేశలింగం పంతులుగారు సరళ గ్రాంథికమున

నాయనువాదమంతయు నిర్వహించిరి. వడ్డాది సుబ్బరాయ కవి గారు అచ్చతెనుగు నుపయోగించిరి. వేదమువారు నెల్లూరు మండలమున గల వ్యవహారికమున, కావలి వారి సంభాషణ నిర్వహించిరి. "ఆపాట్నా" "ఎల్లాం", "ఇల్లిదిగో. "తెలుస్తావుంది", "నడిమద్దెంలో" ఇవి నెల్లూరు మాండలిక పదములు. సంభాషణే గాదు ఒక గేయమును గూడా గ్రామ్యముననే యున్నది.

బెమ్మనొసట్టు రాసిన బువ్వేమో చెడిపోదుగందా
దమ్మ మెగానీ కమ్మ మెగానీ దప్పరాదు గందా
మ్యాకలమింగే బ్యాపన రొయ్యకి మెత్త మణంచు గందా
యేకలిశేసిన యాకలి కోసం యీసుడొప్పు గందా – 135

శ్రీరాములు గారు కూడ యిచ్చట నొక పద్యము వ్రాసిరి –

బమ్మ యేర్పాటు సేసిన పనులపాట్లు
గోరమైయుండఁజేయక తీరదయ్య
నల్ల మేకను బిగబట్టి గొల్లుమనుచు
జాలిగుండెల సోమాసి జంపలేదా

మిగిలిన యంకము లందంతటట నీచ పాత్రలకును గ్రాంధకమునే ఉపయోగించిరి. శ్రీరాములు గారు పాత్రోచిత భాషాప్రయోగమన్ని పాత్రల విషయమున పాటించిరి. అనసూయా ప్రియంవదలు శుద్ధశ్రోత్రియ భాషలో సంభాషించిరి.

ప్రియంవద : – ఈ విరజాజి ఈ గున్న మామిడిని ఎష్టా కలసిమెలసి యున్నదో, అష్టగానే తానునుఁ దగిన మగనితో ననగిపెనగి యుండవలెను సుమీ (అం. 1).

అట్లే గౌతమి పాత్ర గూడా, ఆనాటి శ్రోత్రియ స్త్రీల సంభాషణ ననుసరించియే యుండును.

గౌతమి : 'అషీ! యేమే శకుంతలా ఏలాగున నున్నదే? నీ యొడలు కొంచెమేమైనా నిమ్మళమనషే. బిడ్డా బొత్తిగ నలిగిపోయినావే!

వేట బలగములోని వారును గ్రామ్యముగనే సంభాషించిరి.

బలగము : "మాప్పబూ సిత్తాలుండి సిత్తాలుండి".

వీరే గాదు రాజమాత పంపిన కరభకుడు గూడ గ్రామ్యములోనే జామాత సందేశము నందించెను.

కరభకుడు : బాబో! బాబో! జోవూరు జోవోరండి. అమ్మగారు సెలవిచ్చిందే మంటే నుండి, ఉఁ మఱగంటే నండి నేటికి నాల్గోనాడంట కడుపునగన్న బిడ్డలకంట, కాలూసేయి నొచ్చకుండానంటా బాబు సెప్పుకుంటా నండి. రచ్చగట్టెనోమటండి. ఉపాసం సేస్తారంట. అబ్బాయిగారు అక్కడ ఉండాలంట.

మూలమున కరభకుడును ప్రాకృతముననే సంభాషించెను. కానిచో విదూషకుడు వ్యవహారికము గ్రాంథికము కలిపి అచ్చటచ్చట అసభ్యములైన తిట్లతో సంభాషించును. శ్రీరాములు గారు వృత్తిచే న్యాయవాదులు. వారికి కచ్చేరీలలో నుపయోగించు అధికార భాషతో పరిచయముండుటచే షష్టాంకమున ఫణిహారి దుష్యంతుని కడకు మంత్రి నుండి తెచ్చిన పత్రములో వ్రాయబడ్డ భాష "కోర్టు కచ్చేరీలలో" నుపయోగించు భాష.

"ఈనాడు పంటకాపులు సిస్తు దస్తు కట్టుచున్నందునను, వానిం బరికించుట లెక్క పెట్టుటచేతను, ఒక ప్రోలికాపుమనివి మట్టుకు వినుటయు, తీరు మానించుటయు జరిగినది". 'పేటలోనున్న యోడబేరి మిత్రావసువు అనువాఁడు తనయొక్క యోడ మునిగిపోయినందున దిగులుపడి చనిపోయినాడు. ఆ యోడబేరి సొమ్ము కలవాడైనందున అతని సొమ్ము కొన్ని వేయివరాలును, కొంత నేలయును అయియున్నది. అది దివాణము వారికి చేరవలసినదిగా తీరుమానించినారు'. "తీరుమానించుట, యనునది యధికార భాషాప్రయోగము. ఈ పాత్రోచిత భాషలో సన్నివేశమును రక్తి కట్టించినది నాటి మాండవక వ్యవహార పద ప్రయోగము లెఱుంగుటయే వీలుగ నున్నవి.

## అపురూపములైన అచ్చ తెనుగు పదములు :

శ్రీరాములు గారు కొన్ని తత్సమ పదములకు అచ్చతెనుగు చేసిరి. అవి కృత్రిమములుగ నున్నను సొగసుగ నున్నవి.

తాపసకన్య = జడచుట్టల తపసి, సేనాపతి = దండపడవాలు, ఇంద్రుడు = నూరు జన్నాల సోమాసి, చంద్రుడు = తమ్మిసూడు, కిం పురుషులు = మానిసితలలు గుఱ్ఱము మొండెముగల వేలుపు తెగవారు, అంతరాత్మ నిర్మలమగును = లోనున్న దేవర కుదిరికూర్చుండు నింక, జీవిత సర్వస్వం = ఉనికి మినుకుల వడారము. సాకెత సెట్టికుమారిత యనుటకు “సాకేతాబాయి” అనిరి.

షట్పది = ఇఱుమూడు కాళ్లపురుగు. “రతి సర్వస్వమధురం” అన్న దానికి తెలుగు మరునిమాట వడారము. “అప్సర సంభవ” – అచ్చరల యాడబడుచు, “మనోరథరప్రియతమా” యన్నదానికి మమకారపు మోహరీలమూట.

మూలమునకు రమ్యతను, అనువాదమునకు తెనుగుతనమును కూర్చిన తెనుగుపలుకుబళ్లు. లౌకిక పద ప్రయోగములు – పోడిమి పొక్క (దుష్యంతుడు – 1) పున్నెము నొడిగట్టుకొందము (దుష్యం–1), అనగి పెనగి యుండవలెను సుమా (ప్రియంవద–1), ఈడునకు జోడునకు దగినట్లున్నదే (దుష్యం–1), ఈయన రూపు జూడగా కన్నుల పండువుగా నున్నది (ప్రియం–1), నిలచితి పరువు పోపునేమోయని (దుష్యం–1), ఏలినవాడా, నాసామిరంగడా (విదూ 2), నీ దగ్గరనే హాయిగా పీటవేసెదనులే (విదూ 2), రక్కసులకు జడిసి తోక మడతబెట్టినావని (విదూ 2), ఆ ముద్దరాలు మన పెద్దలకు గుండెపట్టు (చిన్నవాడు – 2), నీ నీడను జూచుకొని నీవే వెఱచెదవు (ప్రియం–3), కడుపు నింద ద్రొక్కవలయునా యేమి (విదూ 2), నాడెందమా యిక నీతోకాడింపుము (దుష్యం –1– 30), వన్నెల విసినికఱ్ఱ గాజులు తొడిగించుట (అనగా సీమంతము జేయుట); (ప్రలీ–3), షోకు, సెబాస్, జోహారు వంటి అన్యదేశీయముల గూడ ప్రయోగించిరి.

**లోకోక్తులు :**

రచనకు రమ్యతను జేకూర్చు కొన్ని మూలమందున్న లోకోక్తులనే గాక ఆ మూలకముగ వ్యవహారమందున్న కొన్ని లోకోక్తులను, సమయస్ఫూర్తిగ, అర్థమతుకునట్లుపయోగించుట వీరికి వెన్నతో బెట్టిన విద్య.

గోఱుచుట్టు మీద రోకటిపోటు (విదూ–260) తినగ తినగ కర్జూరము కనరై చింతపండు పచ్చిపులుసు మీద పోవుచున్నదే (విదూ–2) రాయలు దలచిన

దెబ్బలకు కొదవా (విదూ 2), పులి ప్రక్కలో జోరీగ నైతిని (విదూ 2), కడుపులో తెగులుఅట్టు కాపురములో మాటలు గుట్టు (ప్రియం - 3), ఆడబోయిన తీర్థమెదురాయె నన్నట్లుగా నైనదే (చెలులు–3), నల్లనివన్నియు నీళ్లు తెల్లనివన్నియు పాలు (అన–4), ఒక చెంపగొట్టిన పాలు, ఒక చెంపగొట్టిన నెత్తురు (ప్రియం–4), నీనోట నూవు గింజనానదు (అన–4), కల్మియు లేమియు కావడికుండలు (తాపస బాలుడు –4), నోటిలో వేలుబెట్టిన గఱువనేరరమ్మ (శకుం–4), లోకులు కాకులుగారె (శార్ఙ 5), అప్పటి మాటలకు దుప్పటియిచ్చితిగాని యెల్లప్పుడు తప్పునిచ్చితివా యన్నట్లున్నది (శకుం–5), అంగిట విసము మున్నాల్క తేనెను బెట్టుకొన్నవాడవు (శకుం 5), ఈతకు మిక్కిలి లోతు, చావునకు మిక్కిలి కీడును లేదుగదా (శకుం 5), తీగలాగిన పొద కదలును (శార్ఙ 5), వచ్చిన పని వాకిటనే యయినది (గౌతమి 5), ముందు నూయి వెనుక గోయి (దుష్యం 5), మీఁగొట్టె నేతపడనే పడ్డది (విదూ 6), ఆరునెలలు సావాసము చేసిన కానివాండ్రకు కంచములలోను (విదూ 6).

ఆనాడు వ్యవహారమున నుండి వినవింపుగా నుండిన జాతీయము లన్నిటిని గ్రహించి సందర్భశుద్ధిగ ప్రయోగించి స్వతంత్ర నాటకములవలె భాసింపజేసిరి.

**లోకజ్ఞత :**

అనువాదమున కవి తన లోకజ్ఞత ప్రదర్శించుటకు అవకాశముండదు. అయినను అనుభవజ్ఞుడు తన లోకజ్ఞత నేదోయొక సందర్భమున ప్రదర్శింపక మానడు. రెండవ అంకమున విదూషకుడు 'అనియతవేళం శూన్య మాంసభూయిష్ట ఆహారోశ్యతే' అనును. శ్రీరాములు గారి నాటికి బ్రాహ్మణులకు మాంసభక్షణము నిషిద్ధము గాన మూలవిషయము నిట్లు పరివర్తించిరి – "ఆకటి అయినపుడు కూరలా గడ్డలా నంజుడింత మొగాన పారవేతురు". దానికి పంతులుగారు "వేళ తప్పి కఱకుట్ల మాంసము భోజనమునకు సంభవ మగుచున్నది". 'శూల్యమాంసభూయిష్టము' నకు శ్రీరాములు గారు 'నంజు దనిరి'. మిగిలినవారు 'కఱకుట్లు' అనిరి. అట్లే 'యవని' శబ్దమునకు శ్రీరాములు గారు 'చెంచువాండ్ర'నిరి. పంతులుగారు 'కిరాతకాంత' లనిరి. వేదము వారు 'యవన యువతు' లనిరి. వడ్డాది సుబ్బరాయకవి గారు 'యవన వనిత' లనిరి. వీరి కాలమునాటికి యవన

వనితలు లేరు. చెంచు వాండ్రిప్పటికి వేటాడుట కలదు. కావున చెంచు వాండ్రనుటయే యుక్తముగ నున్నది. అట్లే సాకేత సెట్టి కుమారిత యనుటకు సాకేతా బాయి యనుట కూడ మహారాష్ట్రుల యేలుబడి వచ్చిన తరువాత మన యాంధ్రవనితలు గూడ తమ పేర్లచివర బాయి అని చేర్చుకొనుట నాగరికమైనది. ఆయలవాటు ననుసరించియే యిట్లు పరివర్తింపజేసిరి. అట్లే చతుర్థాంకమున కాశ్యపులవారు, మడికట్టుకొని వచ్చుట గూడ కవికాలము నాటి యాచారమును తెలుపుచున్నది.

## శాస్త్ర పరిజ్ఞానము :

మహాకవుల కావ్య శిల్పచిత్రణమును, రసహృదయమును. అనువాదకుడు తన యనువాదమున వివృతము గావించవలెను. శాస్త్ర విషయ వివరణమున ననువాదకుడును నంత దిట్టయైనపుడె యా విషయముల నాతడు వివరింపగలడు.

తృతీయాంకమున దుష్యంతుడు అనసూయ ప్రియంవదలను “కిమత్రచిత్రం యది విశాఖే శశాంకలేఖా మనువర్తతే” యనును. విశాఖ నక్షత్రములలో నొకటి. ఇందు రెండు చుక్కలుండును. అందుచేత సంస్కృతమున సాధారణముగ నిది ద్వివచన ప్రయోగము కలది. అనసూయా ప్రియంవదలిద్దఱే సఖులు గావున విశాఖ వారి కుపమానమని కవి భావన. శ్రీరాములు గారి యనువాదమున దీనిని వివరించుచు నిట్లు వ్రాసిరి–

దుష్య : ఇరువదియేడు చుక్కలలో పదియారవ చుక్కకు గుఱుతులైన రెండు చుక్కలను నెలవంక దగ్గిర నున్నపుడేవిధముగ నుండునో, అట్లుగా మీరిద్దఱు ఈ ముదియ యొద్దంజేరి యుండగా ఏదియు వింతగాదు.

మిగిలినవారి యనువాదములందు భావవివరణము లేకయే మూల శబ్దానుసారముగ అనువదించిరి.

కందుకూరి వారు : విశాఖ చంద్రకళ ననుసరించునేని అందు చిత్రమేమున్నది.

వేదము వారు : విశాఖలు చంద్రరేఖ ననువర్తించుట చిత్రమా!

వడ్డాది వారు : విశాఖ చంద్రరేఖ ననుసరించుట చిత్రము గాదు గదా!

శ్రీరాములు గారి సంగీత శాస్త్రాభినివేశనమును దెలియజేయు నింకొక సన్నివేశము–

శకుంతల : "సఖి! చింతతామయగీతిః నఖలు సన్నిహితాని లేఖన సాధనాని" దీనిని శ్రీరాములు గారిట్లు పరివర్తించిరి. "సఖియలారా! ఇదిగో చక్కని యొక జావళి కట్టినాను. "కలము, కాగితము, సిరా" లేదాయె గదా!."

ఇందు 'జావళి' పదము అమూలకము.

ప్రియంవద : ఇదిగోనమ్మా! ఏమి కావలెనేమిటి? చిలుక పొట్టవలె మెత్తగా నున్నది. ఈ పచ్చతామరాకు మీద నీ గోళ్లతో వ్రాయరాదటమ్మా!

కందుకూరి వారి యనువాదము :

శకుంతల : సఖి! నేనొక గీతము నాలోచించితిని వ్రాయుటకు తగిన సాధనములు దాపున నేమియు లేవు.

ప్రియం : ఇదిగో చిలుక పొట్టవలె మృదువుగానున్న యీ తామరాకు మీద గోళ్లతో నక్షరములను వ్రాయుము.

వేదము వారిది –

శకుంతల : సఖులారా! గీతికనూహించితిని. వ్రాత సాధనములు లేకయెట్లు?

ప్రియం : ఇదిగో చిలుక కడుపు. వన్నె చిన్ని తామరపాకులో కొనగోరుల వ్రాయుము.

వ.సు. రాయల వారిది –

శకుంతల : సఖులారా! గీతిక నాలోచించితిని గాని లేఖనోపకరణములు చెంతలేవు.

ప్రియం : ఇదిగో! చిలుక పొట్టవలె సుకుమారమయిన యీ లేంత తామర పాకు మీద నీ కొనగోరులతో వర్ణవిన్యాసము గావింపుము.

ఈ యనువాదములలో శ్రీరాములు గారి దిచ్చట రమ్యముగ నున్నది. జావళి శృంగార రసాత్మకమైన పదము. అది చాలవఱకు విరహిణీ నాయికల

వర్ణనలతో కూడి యుండును. కావున జావళి రచించినను మార్పు ఈ సన్నివేశమున కెంతయు తగియున్నది. ఇట్టి మార్పు సంగీత రసజ్ఞుడే చేయగలడు. ప్రియంవద "వ్రాయరాదుటమ్మా" యనుట సహజముగ నున్నది. "వర్ణవిన్యాసము గావింపుమ"నుట వంటి సంభాషణ యిచ్చట కృత్రిమముగా నున్నవి.

ఇట్లు తెలుగు పలుకుబడి దుసికిలిపోకుండ, శాస్త్రపాటవము ప్రదర్శితము చేయుచ్చు నీ నాటకము తెనుగు జేసిరి. శ్రీరాములు గారి 'వెల్లావు కమ్మపాల చవిచూచిన' ముద్దుల కూతురగు తెనుగును తప్పటడుగులతో చిట్టాటల యాడించి మాట నిలుపుకొనిరి.

## అధోజ్ఞాపికలు

1. శాకుంతలము - శ్రీ దాసు శ్రీరాములు గారు, పీఠిక, పు.1
2. భారతి - ఆంధ్రీకరణము - శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి, సుందరం రాళ్లపల్లి, 1969, ఏప్రియల్, 46-/1/79.
3. శ్రీ మదభిజ్ఞాన శాకుంతలము - (శ్రీ వడ్డాది సుబ్బారాయకవి, 1906, పు.32)
4. భారతి - శ్రీ తమ్మి వెంకటరత్నం, 1960 డిసెంబరు పు.61
5. భారతి - శ్రీ బెల్లంకొండ రాఘవరావు, శాకుంతల అనువాదము, 1959, మార్చి. పుట.65
8. భారతి - వండూరి బంగారయ్య, 1944 ఏప్రిల్ పు. 296



## (iii) మహావీర చరిత్రము

శ్రీ దాసు శ్రీరాములు గారు భవభూతి విరచిత నాటకముల మూడింటి ననువదించిరి. ఇది యా కవిపై వీరికి గల విశేషాభిమానమును వ్యక్తము చేయుచున్నది.

భవభూతి మహాకవి విదర్భదేశ మందలి పద్మ పురవాసి. ఈతని తాత భట్టగోపాలుడు. తండ్రి నీలకంఠుడు. తల్లి జాతుకర్ణి. ఈతడు వేదములు ఉపనిషత్తులు నీతిశాస్త్రము ధర్మశాస్త్రము వ్యాకరణశాస్త్రము మీమాంస తర్కశాస్త్రము క్షుణ్ణముగ నభ్యసించెను. ఈతని పేరు కూడ నీలకంఠుడే. "సాంబా పునాతు భవభూతి పవిత్రమూర్తిః" ఇత్యాది శ్లోక రచనచే భవభూతి యనుపేరు వచ్చినట్లు ఐతిహాసికులు చెప్పుదురు. ఈతడీ నామము చేతనే వ్యవహార ప్రసిద్ధుడు "శ్రీ కంఠపద లాంఛనః భవభూతిర్నామ' అని మూడు నాటకములందు చెప్పుకొనెను. భవభూతి మొదటి నాటకము మహావీరచరిత్రము.[1]

'The Mahaviracharitam is a typical drama of forming dramatist' అని ఎస్.వి. దీక్షితులు గారు చెప్పిరి.[1] శ్రీ తోడరమల్ దానిని సమర్థించుచు నిట్లనిరి - "మహావీర చరిత్రము యువ నాటకకర్త యొక్క నాటకము. ఈ మహావీర చరిత్ర రచయిత యొక్క తొలి రచన యనియే నేను పూర్తిగ విశ్వసించు చున్నాను. భావ విస్పష్టతలేని పాత్రచిత్రణ కవసరమైన మానవ ప్రకృతియొక్క సునిశిత పరిశీలన గారి యిందు లేవు. మహావీర చరిత్రము, అంతేకాదు అతని యితర రచనలతో దీనికి పోలిక లేదు. పై గా అతని రచనలనంగీకరింపని వారిని తృణీకరించి నట్లగపడును."[2]

ఇట్లు పండితులచే నిరాదరింపబడినప్పటికి భవభూతి యెడ గౌరవముచే శ్రీ శ్రీరాములు గారు ఈ నాటకముననే గాక భవభూతిచే రచింపబడిన మిగిలిన రెండు నాటకములు 'మాలతీ మాధవము', మరియు 'ఉత్తర రామచరిత్రము'ల నాంధ్రీ కరించిరి. అట్లే శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారును భవభూతి మూడు నాటకములను అనువదించిరి. మహావీర చరిత్రను వీరిరువురే యాంధ్రీకరించిరి. ఈ నాటక మంతయు భవభూతిచే రచింపబడలేదందురు.

6,7 అంకములు సుబ్రహ్మణ్య కవి యను నతడు రచించెనందురు. ఇవి భవభూతి వ్రాయలేదనుటకు కారణములు శ్రీ తోడరమల్ గారిట్లు చెప్పిరి–

1. పద్యములు, వచనభాగములు మాలతీమాధవములోను, ఉత్తరరామ చరిత్రలోను మరల మరల వచ్చినవి. అట్లు 6,7 అంకములలో లేవు.
2. మొదటి అయిదంకముల నుండియే యితరాలంకారికులు లక్ష్యములు గ్రహించిరి.
3. మహావీర చరిత్ర 5–39లో రాముడు దుందుభి ఎముకలను కాలి బొటన వ్రేలితో నెత్తి పారవేసినట్లున్నది. 7–16 లో లక్ష్మణుడు ఎత్తెను యని యున్నది. ఇది స్వవచన ఘాతము.
4. ప్రాకృతప్రయోగములుగూడనట్లే తెల్పును. 'క, 'ఇవ' మొదట ఐదంకములందు పదము అనుస్వారముతో ముగించి పిమ్మట 'క' ప్రయోగింప బడెను. అట్లే 'ఇవ' అన్నది మొదట ఐదంకము లందు 'ఇవ్వ' అనియు, చివరి రెండులో "జివ్వ" అనియు ప్రయోగింపబడెను.[3]
5. విద్రావిత VII-27 ఛందోగణములు చివరి రెండంకము లందలి విద్రావిత గణములకు వలె లేవు. కావున నిది భవభూతి వ్రాయలేదనిరి.

దౌరాత్మ్యా దరిభిర్ని జార్జవశుచౌ మాయా విభిర్వంచితే
ధర్మాత్మ వ్యతిధౌ నిరాగసి జగత్పూజ్యే గృహానాగతే
ఏతస్మిన్ను చితం ననామ మవిహితం వాచాపి నావేదితం
పాపం ప్రత్యుతదారుణం వ్యవసితం సఖ్యంకి మేతాదృశమ్ – 5–46

ఈ శ్లోకము నుండి భవభూతిది కాదని యందురు. దీనికి ప్రతివ్యాఖ్యలు గూడ గలవు. ఇదే ప్రథమ గ్రంథమైన చివరికెట్ల సంపూర్ణముగ నుండునన్న ప్రశ్న పొడమును. అవి బహుశః శిథిలములు కాగ శ్రీ సుబ్రహ్మణ్య కవి పూరించి యుండవచ్చును.

అనువాదము కత్తి మీద సాము వంటిదని యెల్లరకు విశదమే. శ్రీ శ్రీరాములు గారును మూలకవి భావానుసారముగ తెలుగునుడికారపు సొంపు వంపు గాకుండ

జాతీయ పదప్రయోగములతో బాలకాండము మొదలుకొని యుద్ధకాండము వరకు గల కథ నంతటిని నౌచితీమంతముగ ఏడంకములుగ రచించిరి. ఈ యంకములలో గల యచ్చుటచ్చుటి పద్యములు పరిశీలించిన వారి యనువాద రీతి విశదము కాగలదు. ప్రథమాంకమున సీతోర్మిళా సహితుడగు కుశధ్వజుడు, రామలక్ష్మణ సహితుడుగా కౌశికుని యాశ్రమమునకు వచ్చుట వర్ణింపబడినది.

గ్రంధారంభ శ్లోకము –

> అధస్వస్థాయ దేవాయ నిత్యాయ హతపాప్మనే
> త్యక్త క్రమ విభాగాయ చైతన్య జ్యోతిషే నమః

దీనికి శ్రీరాములు గారి యనువాదము –

> మొదలుతుద చిన్నఁదనమును
> ముదిమియు లేకెల్ల పాపములఁ బాపుచుఁ చా
> నుఁ దనందయుండి జ్ఞానం
> బు దన మెలపునట్టి దేవు నారాధింతున్

దీనిలో శ్లోకభావ మెంత స్పష్టముగ సరళముగ వ్యక్తమగు చున్నదో కాననగును.

శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారి యనువాదము –

> ఆదిమధ్యాంతములు లేని యవ్యయంబు
> పూర్వ పరభేద మెఱుగని పుణ్యతేజ
> మఖిల విజ్ఞాన భావకం బాత్మనిష్ట
> మైన దివ్యపరంజ్యోతి నభినుతింతు

మొదటి యనువాదము మూలవిధేయము.

సీతోర్మిళలతో కుశధ్వజుడు విశ్వామిత్రాశ్రమ ప్రవేశముతో ప్రథమాంక మారంభమగును. ఈ యంకమున అహల్యాశాపవిమోచనము, తాటకవధ, యజ్ఞవిఘ్నకరులైన మారీచ, సుబాహులతో యుద్ధము చేయుట గలదు. నిమంత్రణ వ్యాజమున దీక్షితుడగు జనకునకి సందేశమంపి సీతోర్మిళా సహితుండగు కుశధ్వజుని

విశ్వామిత్రడు తన యాశ్రమమునకు పంపునట్లు చేసి, సీతారాముల కన్యోన్య సందర్శనావకాశము కలుగజేసెను. ప్రథమ దర్శనముతోనే యనురాగవతి యగు సీత ప్రేమకు అహల్యా శాపము వలన వ్యక్తమైన రాముని మహిమ, తాటక సుబాహుల వధతో నప్రమేయమును, ననుపమానము నగు రాముని వీరము ఉద్దీపనమగును. విశ్వామిత్రుడు రంగములోనికి ప్రవేశించుచునే రాముని వీరము నిట్లు గ్గడింనెను.

> రక్షోఘ్నా నిచమంగళాని సుదినే కల్యాని దారక్రియా
> వైదేహ్యాశ్చ రఘూద్వహస్యచ కులేదీక్షా ప్రవేశశ్చనః
> అస్తే యానిచతానితాని జగతాం జేమాయ రామాత్మనో
> దైత్యారేశ్చ రితాద్భుతాన్యథ ఖలువ్యగ్రాః ప్రమోదామహే - 1-137

దీనికి శ్రీరాములు గారి యనువాదము -

> ఫక్కు ఫక్కున వెల్గపండ్ల బోలెను రక్క
> సుల తలన్ ప్రక్కలై పొలియునాడు
> శృంగారవతు లిదె మంగళంబని యిండ్ల
> రంగవల్లులు తీర్చి పొంగునాడు
> నానా శుభ శ్రివిధానాశయుడు రాము
> డలరి జానకిc బెండిలైననాడు
> అక్షీణదక్షతా వీక్షాప్తి దీక్షాప్ర
> వేశంబు మాకు గావించునాడు.
>
> శుభ పరంపర జగమెల్ల జుట్టునాడు
> రాఘవాకారుడైన నా రావణుని చ
> రిత్రములు చిత్రములుగా స్ఫురించునాడు
> డెందమానందమునc జిక్కి చిందులాడు - పు. 8

ఈ పద్యమున కెనలేని సొగసు ఎత్తుగడ ముగింపుగూడ రమ్యమే. పొలియునాడు, పొంగునాడు అని యిట్లు పాదములన్నిటిని అసమాపకముగ అంత్యానుప్రాసతో ముగించి చివరి పాదము “డెందమానందమునc జిక్కి

చిందులాడు" అని భావమును పూర్తిగావించి పఠితల డెందము ఆనందమున జిక్కి చిందులాడునట్లు ముగించి పద్యమునకు భావస్ఫూర్తి కలిగించిరి. ఇట్ల మూలకముగ అనువదించుట వలన నీ గ్రంథము స్వతంత్రము వలె భాసించును. ఈ పద్యమును పఠించిన వారెవరు దీని నాంధ్రీకరణమని తలంపరు. దీనికి మల్లాది వారి యనువాదము మూలవిధేయముగ నిట్లున్నది -

కలుగగ మేలుకీడు తొలగన్ సుదినంబున యందు సద్విధుల్
సలుపుట వెన్క రామునికి జానకి నిచ్చుట పెండ్లి చేయుటా
వలమన యజ్ఞదీక్ష యటు పైని జగంబుల బ్రోవ రాముడై
వెలసిన చక్రి బీరముల వేడుక యింతయు వీటికే కదా.

ఉత్పత్తి ర్దేవయజనాద్బ్రహ్మావాదీ నృపః పితా
సుప్రసన్నోజ్జ్వలామూర్తి రస్యాం స్నేహం కరోతిమే - 1-21

'స్నేహం కరోతిమే' యన్న దానికి శ్రీరాములు గారు "చిన్న దాని పయి నాకు గన్ను గలదు" అనుట యనౌచిత్యము కలుగుచున్నది. శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రి గారిది రమ్యముగ నిట్లున్నది -

జననంబాయ జ్ఞావని
జనకుండా బ్రహ్మావాది జనకుడు చక్కం
దనమా కన్నుల పండువు
కనుకనె మరి నెయ్య మొదవె గన్న నీకన్నన్.

రావణ నియంత్రితుడైన రాక్షసమంత్రి సీతను రావణునకు నిచ్చి వివాహము చేయుడని యడుగుటకు వచ్చును. అతని యెదుటనే తాటకవధ మొదలగునవి జరుగును. ఆ సందర్భమున రాముని జూచి రాక్షసుడు "అహో! దురాత్మనో రామహతకస్య సర్వకుశః ప్రభావః" (160,పు.38) అన్న వచనములోని "రామహతకస్య" అన్న దానిని శ్రీరాములు గారు "పుట్టువు మాలిన రాముడని" వ్యాజస్తుతి స్ఫురించునట్లు తెనిగించుట మనోజ్ఞము. శ్రీ మల్లాది వారు "ఏమి ఈ దురాత్ముడగు నృపకుమారుని సర్వాతిశాయి సామర్థ్యము" అని మూలానుసరణముగ తెనిగించిరి. రామహతకస్య అనువాదానికి నిజమైన యనువాదము 'రాముడను

చచ్చినవాని యొక్క' అని యుండవలయును. తెలుగులో "చచ్చినవాడు" అన్న దూషణార్థము కలదు. అది గ్రామ్యాంధ్రములోనిది. ప్రబంధవ్యవహారము కాదని యాశబ్దమునకు దుర్మార్గుడని, దురాత్ముడని మన కవులనువదించుచు వచ్చిరి. ఇది కృతకమయినను శ్రీరాములుగారౌచిత్యమును పాటించి తాత్త్వికముగ ననువాదము చేసిరి. హతకుడు పుట్టువు మాలిన వాడైనాడు.

తరువాతి రెండవ యంకమున నూతన వధూవరులగు సీతారాముల సన్నిధికి మాల్యవంతుని బోధచే ప్రేరితుడై సముద్దీప క్రోధజ్వలనుండగు భార్గవుండు యుద్ధోన్ముఖుడై వచ్చును. ఇందలి పద్యములన్నియు వీర రసోజ్జ్వలముగ నున్నవి. ఇందలి రసము వీరము.

విచ్చల వచ్చినాడిదిగా వీరుడు తాపసి సాధుసంగముం
గ్రచ్చుఱఁ గోరు టొక్కటియకాదట వీరరసంబు లాగెడిన్
హెచ్చుగ నన్ను బట్టి యిటు లీనును వెన్నెలఁబోలెఁజల్లనై
మచ్చికఁ గమ్మతావులిడు మైథిలి కౌగిలిని నడ్డగించెడిన్ - పు. 415

యట్లేయుంచిరి. ఈ యంకము నందలి యనువాద మంతయు నిట్లే రసోచితముగ సాగినది. 'వించున్నవా' యన్న వైదిక ప్రయోగము. "సొంటికాయ" వంటి జాతీయపద ప్రయోగములీ యంకమునకు పొంకము గూర్చినవి. శతానందుని శాపవాక్యములలో గల -

పెద్ద ముసుళ్లకుం బడిన బెన్బిదు గున్నత వృక్షముంబలెన్
గ్రద్దన బూడిదై ధరణిఁగ్రాలగఁజేసెదఁ జూడుఁ డీతనిన్ - పు. 651

అన్న ఉపమాలంకారము మూలములో లేదు.

చతుర్థాంకారంభము నందలి విష్కంభమున మాల్యవంతుని రాజనీతి చక్కగ ప్రదర్శింపబడినది. విష్కంభానంతరము శూర్పణఖావిష్ట మంథర ప్రవేశము. తదనంతరము రాముడు సీతాలక్ష్మణ సహితుడై ప్రయాణాయత్తుడగుట, భరతునికి పాదుకాప్రధానము, దుఃఖా విష్టుడగు దశరథుని నిర్గమనమును చేర్చబడినది.

అసాధ్యమన్యథా దోషం పరిచ్ఛిద్య శరీరిణః
యథావైద్యస్త ధారాజా శస్త్రపాణిర్భ విష్యతి - 4-23

ఇందలి యుపమాలంకారము యనువాదమున నిట్లున్నది -

సతతము వైద్యుడును మహా
పతియును శస్త్రంబుపూని ప్రజమన్తు రొగిన్ - పు. 53

రామలక్ష్మణుల యరణ్యవాస విధిని విన్న జనకుడు 'జీరకంఠుడైన వానికే యిప్పుడా క్రియ ప్రాప్తమయ్యెను' (పు. 95) అనెను. ఇందలి "జీరకంఠ" మన్న పదమును యథాతథముగనే యనువదించిరి అది యంత రమ్యముగ లేదు. తెచ్చిపెట్టుకొన్న యరువుసొమ్ము వలె వీర రసోద్దీపనకై యీ పద్యము భావ విస్తృతి యొనర్చి రచింపబడినది. విడి-విడి, విచ్చలవిడి యన్న ప్రయోగమే విరళముగ కనబడును. విచ్చలు అని వ్యస్తముగ ప్రయోగించుట కూడ గలదు. కాని యా ప్రయోగ మరుదుగ గానబడుచున్నది. "విచ్చలు" అన్న పదము సాభిప్రాయముగ ప్రయోగింపబడినది. ఈ ప్రయోగ మెట్లరుదో అట్లే పరవాడగు పరశురాముడు అంతఃపురము ప్రవేశించుట కూడ.

భార్గవుని యుగ్రరూపవర్ణన మూలమున నిట్లున్నది -

అయం స భృగునందన స్త్రిభువనైక వీరో ముని
ర్యయేపని వహో మహానివ దురాసదస్తే జసాం
ప్రతాప తపసోరివ వ్యతికరస్ఫురస్మూర్తి మా
ప్రచండయివ పిండతా ముపగతస్వ వీరోరసః - 2-23

దీని యనువాదము -

ఇతఁడా బార్గవుఁడితడా త్రిభువనాహీనైక వీరుండహో
ప్రతతాచ్ఛాచ్ఛటలేమి? యీతని ప్రతాపంబుం దపంబున్ మహో
గ్రతతో రూపువహించెనో? ప్రకట వీరప్రక్రమోద్యద్రస
స్థితులే ముద్దయిగట్టిపాటి పటుమూర్తిందాల్చెనో చూడగన్ - పు. 45

ఈ పద్యము యొక్క యెత్తుగడ మనోజ్ఞము. "ఇతఁడా, ఇతఁడా" యని యొకే పాదములో వెంటవెంటనే రెండు మారులు వచ్చుట యీ పరశురాముని నిర్దేశించి చూపినట్లున్నది. ఈ పదములీ భావప్రకటనకు దోహదము

చేయుచున్నవి. ఈ యనువాదము మూలమునకు వన్నెవెట్టు చున్నది. అదే సందర్భమున పరశురాముని వర్ణన –

జ్యోతిర్జ్వాలా ప్రచయజటిలో భాతికంఠే కుఠార
స్తూణీరం అసెవపుషిచ జటాచాపచీరాజినాని
పాణౌబాణః స్ఫరతివలయీ భూత లోలాక్షసూత్రం
వేషః శోభం వ్యతికరముగ్రశాంతస్తనోతి – 2–26

ముట్టినది గండ్రగొడ్డలి మూపునందు
బెట్టినది యంపదాన యెడల్పెనయు జడలు
కట్టినది నారధోవతి గట్టిత్రోలు
పట్టినది విస్ఫురత్ఫూ్కర బాణమఱుత
జుట్టినది యక్షమాల యిట్టి వేష
ముట్టిపడు నుగ్రశాంత భావోదయంబు – పు. 46

ఈ పద్యమందలి యనుప్రాస భావోద్రేకమును మరింతగ నుద్దీపింప చేయుచున్నది. పరశురాముని వ్రేటుపాటును "హడావిడి" ని స్ఫురింప చేయుచున్నది. ఈ యనుప్రాసల 'హడావిడి గడబిడల'తో గీతము నాలుగు పంక్తుల హద్దును దాటి యాఱుపంక్తుల వరకు సాగినది. కాస్త ఆగి వెనుకకు చూచి ఆ ఉగ్రత యుడిగి శాంతముత్పన్న మై రమణీయముగ నున్నది. అటుపిమ్మట చంపకమాల నందుకొనిరి. పరశురాముడు హడావిడిగ ప్రవేశించి రమణీయమైన రాముని ముఖారవిందమును జూచి ప్రసన్నుడై తొల్లిటి యావేశమును నడంచుకొనెను. భావానుగుణమైన పదనిర్మాణము పద్యపు టల్లిక అల్పకవుల కందునది కాదు.

భావము పూర్తికానప్పుడు ఉత్పలమాలాది వృత్తములకు గాని గీతములకు గాని ఒకటి రెండధిక పాదములు చేర్చుట కలదు. పరశురాముడు తన ప్రతాపమును జెప్పుకొన్న పద్యములు పన్నెండు పాదములు గల ద్విపదగా రచించి మూలభావమునంతటిని పొల్లు పోనీయక పొందుపరచిరి.

శ్రీరాములుగారు శ్లోకాములలో నున్నవి పద్యములుగను, గద్యముగ నున్నవి వచనములుగను ననువదించిరి. శ్రీ మల్లాదివారు పలుచోట్ల శ్లోకములను

వచనముగ తెనిగించిరి. రాముని సౌందర్యమును జూచిన పరశురాముడు తనలో "కొండికవీడు చంద్రగతి కోమల పంచశిఖండ మందలి......." (పు. 48) అన్న పద్యమును ఆ ప్రక్కనే యున్న. తొల్లి నిశంభునోరువని ధూర్జటి చాపము ప్రక్కలై పడిన' అని యున్న పద్యమును 2-32, 33 శ్లోకములకు యథాతథానువాదములు. వీనినే మూలకుంచితముగ వచనములో శ్రీ మల్లాదివారు వ్రాసిరి. ఇట్టివి పలుచోట్ల కాననగును. భవభూతి రచనలలో హాస్యము చాల అరుదుగ నుండును. విదూషకుని వంటి పాత్రలు లేనేలేవు. ఎచటనైన హాస్యమును భాసింపజేసిన నది వాక్య చమత్కృతియే కాని వేరొండు గాదు. ఇట్లపురూపముగను, నల్పముగనున్న యీ హాస్యమును చేజారిపోకుండ శ్రీరాములు గారు తన యనువాదములో భద్రపరిచిరి. "కథయే తానతాపిత్యాహో" అని రాముడన్న వాక్యమును "అబ్బా యేమి యిచ్చో నిదియైన గొమ్మనుచు నిచ్చినాడు" (పు. 50) అని నిగూఢముగ నున్న పరిహాసాధిక్షేపముల నిందు నిక్షేపించిరి. 'శిరశ్మాల ముత్కోప మతి' యన్న దానిని "నాకు నడినెత్తి మేకు వంటి వాడైనాడు" అని మూలవిధేయముగ ననువదించి హాస్యముద్భవింప జేయవలెనని తలంచి గాని యది పై దానివలె నిగ్గుదేరలేదు. దీనినే మల్లాదివారు "తలనొప్పి వచ్చుచున్నదని" మనోజ్ఞముగ చెప్పిరి.

ఈ యంకములో "కల్పాపాయ ప్రణయి విదహత్కాల రుద్రానలత్వం" (2-24) అన్న శ్లోకములోని ఉపమాలంకారము అనువాదములో ఉత్ప్రేక్షాలంకార మైనది.

గంధ ద్విపేంద్రకలభః కరికుంభ కూట
కుట్టాకపాణి కులిశస్య యథామృగారేః -2-31

అన్న ఉపమాలంకారము 'కరికుంభముల మాంసమారగింప దలచిన సింగములఁ బిల్లయేనుఁగు చేరినట్లున్నది గదా!' (పు. 48) యని వచనములోనే యనువదించినను మూల మందలి యుపమాలంకారమునే గ్రహించిరి.

రెండవ యంకము యొక్క పరిశేషమే మూడవ యంకము. కోపోద్ధతుడగు పరశురాముని శాంతింపజేయుటకు వశిష్టుడు, విశ్వామిత్రుడు, శతానందుడు,

జనకుడు, దశరథుడు ప్రయత్నింతురు. వశిష్టుడు పరశురామునితో “ఆయుధ పిశాచగ్రస్తుడవై యున్న నేమి ప్రయోజనము! జ్యోతిష్మతీ ప్రసారము కలిగించుకొని సకలకర్మ వినాశ హేతువగు పరబ్రహ్మంబునీ యంద సాక్షాత్కరింపజేసికొను” మని శాస్త్రవాక్యంబులుపదేశించెను. కర్త, యనువాదకు లిద్దరు గొప్ప శాస్త్రవేత్తలు గావున నీ యనువాదము తదభిముఖముగ సాగినది. శతానంద జామదగ్న్యులు మత్త వృషభముల మాడ్కి వాగ్యుద్ధము చేయుచు జరిపిన సంవాద ప్రౌఢిమ తదను రూపముగనే యనువాదమున నున్నది. పరశురాముడు శతానందుని ‘స్వస్తి వాచనిక’ యని నిందించును. అనువాదమున గూడ ‘అరే! స్వస్తి వాచనిక బ్రాహ్మణుడా’ యనే యున్నది. దీనిని మార్చిన స్వారస్యము చెడునని ఉన్నది. శ్రీ మల్లాది వారు ‘పాలబుగ్గల పిల్లలు’ అని తెనుగుదనమును జూపుట లెస్సగా నున్నది.

పై సంఘనలన్నియును మిథిలయందే జరిగినట్లు భవభూతిచే మార్పు చేయబడినవి.

పంచమాంకారంభమున సంపాతి ప్రవేశంబును తరువాత మాయా మృగ వృత్తాంతమును, సీతాపహరణము, కబంధవధ, శ్రవణరక్షణ, వాలివధ మొదలగునవి మూలానుసరణముగ వర్ణింపనడినది. భవభూతి వీనిని మహావీర్య సద్గుణోపేతుడగు శ్రీరాముడు వాలిని చెట్టు చాటు నుండి సంహరించె నన్నది యనౌచిత్యమని దాని నిట్లు మార్చెను. మహామేధావి యగు మాల్యవద్బోధితుడగు వాలిని రావణ మైత్రిని స్మరించి రామ సంహారము నందు నియోగింపబడినట్లును వర్ణించి యనౌచిత్యమును పరిహరించెను. పంచమాంకారంభమున జటాయు, సంపాతి సంభాషణలో సీతాప హరణము వరకు గల వృత్తాంతమును తెలిపిరి. జటాయుగాడు, ‘అసిముండ, సిగ్గుమాలినదాన, రాక్షసిముండ’ మొదలగు వ్యవహారిక పదములను ప్రయోగించి తెనుగుదనమును గూర్చిరి. ఈ యంకములో శ్రీ మల్లాదివారు చాల వరకు పద్యభావములను వచనములో సంక్షిప్తముగ వ్రాసిరి. శ్రీరాములుగారు యథాతథముగ పద్య రూపమున రచించిరి. పద్యమున నున్న భావస్ఫూర్తి వచనమున కలుగదని వీరు పద్యరచననే యనుసరించిరి. మూలమున శూర్పణఖ యొక్క చెవులు మాత్రమే కోయబడినట్లున్నది. శ్రీ మల్లాదివారు మాత్రము ముక్కు చెవులు రెండును కోయబడిన వని వ్రాసిరి.

జటాయువు మరణవార్త విన్న రాముడు 'అంత పవిత్రుడవైన నీ కెట్టి గతిపట్టెను' అనెను. ఇట్లనుట యమూలకము. అయినను నిచ్చటి సందర్భమునకి చేర్పు తగియున్నది. ఇట్లు మూలమునకు వన్నె దెచ్చు నమూలకము లచ్చటచ్చట గలవు. "తేనాపి రావణేమైత్రి' యని మూలమున నుండ "వానవుని యందు మైత్రిజేసి" (పు. 116) యని గలదు. ఇట్టి మార్పులవల్ల యా సన్నివేశ మందలి పాత్రల చిత్రణకు వన్నె గూర్చుటయే గాక యౌచిత్యమును బోషించుచున్నవి.

ఈ యంక ప్రారంభమున సీతకై ఆక్రోశించు రాముని మాటలలో కరుణరసము, వాలి శ్రీరాముల యుద్ధము నందు వీరరసము వర్ణింపబడినది. 5-21, 5-44 శ్లోకము లందలి యుపమాలంకారములు 5-4, 5-12, 5-26, శ్లోకములందలి ఉత్ప్రేక్షాలంకారములును యనువాదములోనికి వచ్చినవి. ఈ పంచమాంకమున గల ఈ క్రింది శ్లోకము భవభూతిది కాదని విమర్శకులు చెప్పుదురు -

దౌరాత్మ్యా దరిభిర్ని జార్జ వశుచౌ మాయా విభిర్వంచితే
దర్మాత్యన్యతిధౌ నిరాగసి జగత్పూజ్యే గృహానాగతే
ఏతస్మిన్ను చితం ననామ విహితం వాచాపి నావేదితం
పాపం ప్రత్యుతదారుణం వ్యవసితం సఖ్యం కిమేతాదృశం -5-46

నిర్ణయసాగర ముద్రణాలయ ప్రకాశకుల ప్రతిలో తద్వ్యాఖ్యాత మిగిలినది సుబ్రహ్మణ్య కవి వ్రాసెనని చెప్పెను. సంస్కృతమున మహావీర చరిత్ర వ్యాఖ్యాతలగు శ్రీరామచంద్ర మిశ్ర చూచిన ప్రతియు, శ్రీ వీరరాఘవ వ్యాఖ్యాత జూచిన ప్రతియు వేరుగ నున్నవి. శ్రీ మల్లాది వారు వ్రాసిన 'వెనుకను తల్లివంక వీరులు ముందు బలాది నాధులర్' అన్న పద్యము, శ్రీరామచంద్ర మిశ్ర వ్రాసిన గ్రంథములో లేదు వారు చూచిన ప్రతి వేరై యుండును. అట్లే అనువాదకు లిరువురు చూచిన గ్రంథములు వేరై యుండును.

షష్ఠాంక ప్రారంభమున మాల్యవంత త్రిజటతో విష్కంభము కలదు. తరువాత రావణ, మండోదరుల ప్రవేశము, పిమ్మట ఇంద్ర చిత్రరథుల ప్రవేశము కలవు. మూలములో వీరి సుదీర్ఘ సంభాషణము వలన నీ గ్రంథము తగినంత

మన్నన బడయలేదు. రాముని జయముతో షష్టాంకము పూర్తి యగును. సప్తమాంకమున పుష్పకమున రామభద్రాదులయోధ్యకు చేరుట, భరతాదుల సమావేశము, అనంతరము భరతవాక్యముతో అంక సమాప్తిగావింపబడి నాటకము ముగింపబడినది.

సజీవ పాత్రచిత్రణము వలె సన్నివేశ కల్పనమును చాల విశిష్టమైన ప్రాధాన్యము కల్గియుండును. నాటకకర్త ప్రతిభ యంతయు దాని మీదనే యాధారపడి యుండును. వీరరసములు అనుచితమైన వానిని త్యజించి, సారములు ఉచితములైన సన్నివేశములను మాత్రమే గ్రహింపవలెను. కాని భవభూతి చాలవరకు రాముని ఉదాత్తతను ప్రదర్శించినప్పటికిని నాటకము పండితుల యామోదము పొందలేదు. దీనికి కారణములు శ్రీ ఐ. శేఖరు గారిట్లు చెప్పిరి – “పలురకములైన పాత్రలను భవభూతి ప్రవేశ పెట్టలేకపోయెను. చిత్రరథేంద్రుల సంభాషణము సుదీరమై విసుగు జనింపజేయును. సన్నివేశ కల్పనయు చక్కగ లేదు.”

మూలకథను మార్చి కొంతవరకు నాటక నిర్మాణము చేసినను పదునాలుగు సంవత్సరముల వృత్తాంతము చెప్పటకు సన్నివేశముల కల్పింపవలెను. మాల్యవంతుడు వేసిన పథకము లన్నియు రాముడు భిన్నము చేసినట్లే కాక ముఖ్యమైన సంఘటలనేకములు కాకతాళీయముగ జరిగినట్లు ఉన్నది. అతని రచన నాటక శైలి యనుటకన్న కావ్యశైలి యనుట యొప్పును. ఈ నాటక ద్వారమున సరస, సరళ, సుందరమైన కవిత చెప్పువాడనియు, ఉత్తమ నాటక రచనాచణుడనియు స్పష్టమగుచున్నను, ఈ నాటకము పండితామోదము పొందలేదు. అయినప్పటికిని శ్రీరాములు గారు భవభూతిపై గల యభిమానముచే దీనిని తెనిగించిరి.

పిల్లకాకి కేమి తెలియు నుండవింటి దెబ్బ – 269, పు. 5 ; పాడుజేసెదనని కంకణము కట్టుకొని యున్న వాడమ్మా – 260 పు. 44 ; కడుపులోని చల్ల కదలకుండ – 360, పు. 55 ; తల్లి పుట్టి నింటిని మేనమామ యొద్ద పొగడెదవేమి? – 360, పు. 56 ; నీ నొష్టనే పొ చినదా ప్రొద్దు – 7– 160. మొదలగు

జాతీయములతో మట్టుమాపు (160, పు.32), సొంటికాయ (360, పు.68), గంతుగొట్టు (5-105), తికమలకలగుట (560, పు.115), నంగనాచి (6-184), అరికల పంట యగుట (6-137), చిట్టెముగట్టుట (6-138) నిమ్మళముగ (7-165), పిల్లకాయలు (7-178), కన్నుల చిరుత (7-178), వంటి తెలుగునుడికారపు సొంపుతోను, తెలుగు పదములుగ ప్రచలితములగుచున్న సాపడు (50-104), బడాయి (5-117), హవేలి (6-136), వంటి అన్య దేశీయములతో ఈ నాటకమునకు మరింతగ మనోహరమైన తెలుగుతీరు తీయములను గూర్చిరి.

ఈ నాటకము, శ్రీ రాజా మంత్రి ప్రగడ భుజంగరావు గారిచే స్థాపింపబడి శ్రీ నందిరాజు చలపతిరావు గారి సంపాదకత్వమున వెలువడిన 'మంజువాణి' లో 1901 వ సంవత్సరమున కొన్ని నెలలు వరుసగా ప్రచురింపబడినది.

## అధోజ్ఞాపికలు

1. Bhavabhuti - His life and literature by S.V. Dixit, P. 23.
2. Mahaviracharitra - by Todamal, P. 100; published by the Lahore University Principal, Loahore 192.

   "I am fully convinced that the MV was the auhtor's first attempt, as it lacks power of expression and keen insight into that human sentiments which chahacterise that his M.V is uncouth and clumsy. Again in MV. he does not allude to any of his works where as we find him speaking him disparagingly of those who did not approve of his productions".
3. Mahaviracharitra of Bhavabhuti with commentary by Vira Raghavulu - published by Nirnaya Sagar Press. Bombay; 1926. P. 42, 47 of I; II of 48,50,51,53; IV of 60,119,121,128,160,202.



# (iv) మాలతీ మాధవము

సంస్కృత మందలి దశరూపకములలో ప్రకరణమొకటి. ఈ మాలతీ మాధవము ప్రకరణము. కాళిదాసుని యనంతరము నాటకములు రచించిన వారిలో ప్రథమగణ్యుడుగా నెన్నదగిన పదవాక్య ప్రమాణజ్ఞుడగు భవభూతిచే నీ ప్రకరణము రచింపబడినది.

ప్రకరణము శుద్ధము, సంకీర్ణమని రెండు విధములు. నాయిక కులీనయైన శుద్ధము, గణికయైన సంకీర్ణము. ఇందలి నాయిక కులీన గావున నిది శుద్ధ ప్రకరణము. ప్రకరణము నందలి యితి వృత్తము ఉత్పాద్యమై యుండవలయునని లాక్షణికుల మతము.

అథ ప్రకరణే వృత్తముత్పాద్యం లోక సంశ్రయం
అమాత్య విప్రవణి జామేకం కుర్యాచ్చనాయకం
ధీర ప్రశాంతం సపాయం ధర్మకామార్థ తత్పరం
శేషం నాటక వత్సంధి ప్రవేశక రసాదికం

అని దశరూపకము.

నాయకుడు బ్రాహ్మణ వైశ్యామాత్యులలో నెవరైన గావచ్చును; నాయకుడు ధీరశాంతుడై యుండవలెను.

యత్రేతి వృత్తముత్పాద్యం ధీర శాంతశ్చ నాయకః
రసం ప్రధానం శృంగారశ్శేషం నాటక వద్భవేత్
తద్ధిప్రకరణం శుద్ధం ధూర్తం మిశ్రంచ తత్తి థా
కులస్త్రీ నాయకం శుద్ధం మాలతీమాధవాణికం

అని రసార్ణ వసుధాకరము.

శ్రీరాములు గారు పీఠికలో నిట్లు తెలిపిరి – 'కథా సరిత్సాగరంబున తృతీయంబగు లావణకలంబకంబున నాల్గవ తరంగంబున విదూషక కథా భాగంబున ఆదిత్య సేనుని పుత్రిక నొక పరివ్రాజకుడు దొంగిలించుకొని వచ్చి తన యిష్టసిద్ధికై శక్తికి బలి యీయగడంగ విదూషకు డడ్డువడి వాని శిరంబు ఖండించి యా రాజపుత్రిం గాపాడినట్లు చెప్పబడియున్నది.

రత్నావళీ నాగానందముల వలె నాయికా నాయకులును తత్ప్రవర్తనమును నిందు గ్రహింపబడక యేకదేశ కథా ఛాయను మాత్రము పోలియున్నంత మాత్రమున దీని ఇతి వృత్త మందలిదే మనియు, ప్రఖ్యాత యనియు ననుట కెంతమాత్రము బొసగి యుండనేరదు. కాని యిందలి యితి వృత్తము కల్పిత మగుటం జేసి ఇది ప్రకరణమే యనందగి యున్నది. ఇందు నాయిక కులస్త్రీ యగుటచే శుద్ధ ప్రకరణంబు నాబడు.

సంస్కృత కవులలో సుప్రసిద్ధుడును, శ్రీ కంఠపదలాంఛనుడును నగు భవభూతి రామాయణకథను గ్రహించి మహా వీరచరిత్ర, ఉత్తరరామ చరిత్ర యను నాటకములను రచించెను. ఈ మూడవ నాటకమగు మాలతీమాధవము కల్పితము. స్వతంత్రము. ఈ నాటకమును దాసు శ్రీరాములు గారు 1900 సంవత్సరముననను, శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు 1958 వ సంవత్సరమునకు అనువదించిరి.

ఒక విధముగ జెప్పవలెనన్న కవికి అనువాద రచన కంటె స్వతంత్ర కావ్య రచనయే సుఖకరము. అనువాద పద్ధతి స్థూలముగ జూచిన మూడు విధములుగ నుండును. మూలానుసరణము, విషయానుసరణము, భావానుసరణము. ఈ మూడు పద్ధతులలోను మూలానుసరణ పద్ధతి అనువాదకుని శక్తిని బట్టి పరీక్షించుచుండును. శ్రీరాములు గారు ఈ మాలతీమాధవమును చాల వరకు మూలానుసరణ పద్ధతినే యనుసరించిరి. గొప్ప భావకుడైన భవభూతి శైలి యొకచో ఉజ్జ్వలముగను, మరియొకచో హృద్యముగను, మరియొకచో సుందరముగను సరసముగ నుండును. అనువాదము గూడ యట్టి పటిష్టమైన శైలి గలిగి యుండవలెనని శ్రీరాములు గారు మూలానుసరణముగ ననువదించిరి.

శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు తన యనువాదమును గూర్చి యిట్లు తెలిపిరి– "ఈ రూపకమును మక్కికి మక్కి యన్నట్లు ప్రతిపదాంధ్రీకరణ పద్ధతిని గాక భావము ప్రధానముగ దెనిగించితిని. ఇందలి యౌచిత్యా నౌచిత్యములకు ప్రాజ్ఞలోకమే ప్రమాణము". దీనిని బట్టి వీరు భావానువాద పద్ధతిని స్వీకరించిరని తెలియుచున్నది. ఈ పద్ధతియు మెచ్చతగినదే. శ్రీరాములు

గారు మొత్తము మీద మూలానుసరణ పద్ధతినే యనుసరించినను అటనట భావానుసరణ పద్ధతి ననుసరించియును స్వతంత్ర గ్రంథము వలె భాసింపజేసిరి. ఇందలి నాందీ పద్యములు అనువాదకుని సామర్థ్య ప్రదర్శనకు నాంది యనదగియున్నవి.

సానన్దం నన్దిహస్తా హతము రజరవాహుత కౌమారబర్హి
త్రాసాన్నా సాగ్రరధ్రం విశతి ఫణిపతౌ భోగ సంకోచ భాజి
గణ్డోడ్డి నాలిమాలా ముఖరిత కకుభస్తాణ్ణ వేశూల పాణే
వైనాయక్యశ్చిరంవో వదన విధుతయః పాంతు చీత్కారవత్యః - 1-1

అపిచ,

చూడాపీడ కపాలసంకుల గళన్మన్దాకినీ వారయో
విధుత్రా లలాటలోచన పుటజ్యోతి ర్విమిశ్రతిషః
పాంతు త్వామ కఠోరకేతక శిఖా సందిగ్ధముగ్ధన్దవో
భూతేశస్య భుజంగ వల్లివలుయ స్రజ్నద్ధ జూటాజటాః - 1-2

దీనికి శ్రీరాములు గారి యనువాదము-

వునుకలదండ పాగకును బొంగి దిగంబడు గంగ నీటితో
బొనరుచుఁజంచలా లతలఁబోలిన మూడవ కంటి దీప్తి తో
దనరుచుఁ గమ్మగేదఁగి విధమ్మునఁ గన్పడు చంద్రరేఖతో
నెనసి భుజంగనద్ధమగు నీశుని నెంజెడలేలు మిమ్ములన్

మరియు,

బసవనిచేతి మద్దెలరవంబులఁ జేరుఁ గుమారు నెమ్మికిన్
బుసబుసమాని పాఁపదొరముక్కలుఁదూరు ఫణంబు మూడ్చినన్
దెశలునుగండముల్ దొరయుఁదేఁటులు జిమ్మిన విఘ్ననాయకుం
డు శివుని తాండవంబుననుఁ దుమ్మిన తుమ్ములు మమ్ము నేలుతన్ -1-

ఇంతియగాక,

అబ్బురమైన పల్వరుసనంటి గళుక్కు గళుక్కు మంచు నా
గుబ్బగ ముక్కులం జెవులఁ గుంటి తొళుక్కు తొళుక్కు మంచు బి

ట్టుబ్బిన గండభాగముల నుండి బొళుక్కు బొళుక్కు మంచుఁబెన్
బొబ్బలు పెట్టుచున్న లువ పుట్టెగుహందిగజారు తెల్ల చూ
లబ్బి శిరంబునంగల మహానది ధారలు మిమ్ము నేలుతన్ - 1- 3

ఇంకను,

ఎట్టని తెప్పలునెఱపు లెల్లనుఁబట్టి రవంత విప్పినన్
జిట్టున లోకమెల్ల నలిసేయునుఁ జందురు సోఁకినంతెనే
జుట్టు మనన్ సుధల్బొడమి చూపుకొన ల్తడు పున్మనోభవున్
గుట్టఁడఁగించెనట్టి దగు గోహము మూడవకన్ను ప్రోవుతన్

దీనికి శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రి గారి యనువాదము -

తలగైసేసిన కర్పరంబులఁ జలద్గంగాబువుల్ నిండు మిం
చులకన్ మించిన ఫాలనేత్ర రుచులన్ సొంపారి లేగేదఁగిన్
దలఁపింపందగు లేఁతచందురుని చందంబందమీ నొప్పు నా
గలతావేష్టిత జూటముల్ శివుజటల్ గాపాడు మిమ్మెల్లడన్ - 1-1

ఆనటరాజు నాట్య సమయంబున నందికృతానకస్వనం
బొసఁగవచ్చు షణ్ముఖుని యానముఁగాంచి తలంకి శేషుడె
ట్లేని యణంగ నాసిక మిళిందతతుల్ కటసీమమోఁగనిం
తైన మహాగణాధిపతి యానన చాలన శోభ యేలుతన్

జగధరుని వ్యాఖ్యానము నందు చీత్కారమునకు 'భీతి గొలుపు ధ్వని విశేషము' అని వ్రాసినను శ్రీరాములు గారు మాత్రము "తుమ్ము" యని అనువదించిరి. నాసాపుటములోనికి నాగరాజు ప్రవేశింపగనే అసం కల్పిత ప్రతిచర్యగ తుమ్ము వచ్చుట సహజము. కనుక అశుభసూచకమేయైనను. సహజమైనందున చీత్కారమును 'తుమ్ము' అనియే దాసువారనువదించిరి. బాధాకరములగు తుమ్మెదలను పారద్రోలు శిరశ్చాలనమును త్రాసహేతువగు నాగరాజును వెడల నడచు యత్నమగు తుమ్మును అనిష్టవారణమునకు ఉపకరించినది. కనుక వానిని ప్రశంసించుట తగుననియే భావించి శ్రీరాములుగా రిట్టి యనువాదమును కావించిరి. మల్లాది వారి యనువాదమున 'చీత్కారపు' టూసే కానరాదు.

యేనాను కేచిదిహనః ప్రథయన్త్య వజ్ఞాం
జానన్తి తే కిమపి తాన్ప్రతి నైషయత్నః
ఉత్పత్స్యతేస్తి మమకోపి సమానధర్మా
కాలోహ్యయం నిరవధిర్వి పులాచ పృథ్వీ – 1-6

ప్రస్తావనలో సూత్రధారుడు కవికాలాదు లెరింగించు సందర్భము నందలిది దీని భావమును సంగ్రహముగ చేసి తేటగీతిలో శ్రీరాములు గారిట్లు చెప్పిరి –

మనకు మూఢత్వమిడు వారుమనలబోలు
మూఢు లెన్నటికై ననుఁ బుట్టగలరు
ఇంత భూమండలమున ననంతమైన
కాలమున నంచు నొక్కింతఁ గానరాదు – పు. 3

దీనినే మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు విపులముగ నర్థవివృతి గావించుచు నుత్పలములలో దెనిగించిరి.

ఈకృతి గాంచి యెవ్వ రవహేళన సేయుడు రామహాత్ములే
దేకనుఁగొందు రొండు రచియింపగలేదిది వారి కోసమై
మాకు సమాన ధర్ముఁడగు మానిసి పుట్టకపోఁడు భూతలం
బాకడలంటియుండె కడయన్నది లేనిది కాలమందుమా – పు. 4

శ్రీరాములు గారు అవహేళన చేయువారిని వెటకారము చేయుటకే సమానధర్మ యనుదానికి 'మూఢ' శబ్దముగ అనువాదము చేసిరి. పై రెండు పద్యములే గాక శ్రీరాములు గారింకొక పద్యమును వ్రాసిరి.

నా గుణములు సెప్పుకొననేల నాదు గురువు
జ్ఞాన నిధి యను నామంబు గలుగువారు
నామము యదార్థమింక మాకేమి కొదువ
పెద్దలగుణంబులే మాకుఁ బేరుతెచ్చు – పు. 3

యద్వేదాధ్యయనం తథోపనిషదాం సఖ్యస్య యోగస్యచ
జ్ఞానం తత్కథనేన కిం నహితతః కశ్చిద్గుణో నాటకే

యత్రౌఢిత్వ ముదారతాచ వచసాం యచ్చార్థతో గౌరవం
తచ్చేదస్తి తతస్త దేవగమకం పాండిత్య వైదగ్ధ్యయోః - 1-7

దీనికి శ్రీరాములు గారి యనువాదము -

వేద వేదాంత సాంఖ్యాది వివిధ విద్య
లిందుఁబనిలేదు ప్రౌఢవాక్సుందరత యు
నర్థగౌరవమును నున్న నంతెచాలు
నాటకములందుఁ బాండిత్య నైపుణులకు - పు. 3

మల్లాది సూర్యనారాయణ శాస్త్రి గారి యనువాదము -

నేర్చితి వేదశాస్త్రములు నేర్చితి సాంఖ్యము యోగశాస్త్రమున్
నేర్చితి నంటయేల కృతి నీరసమే? నటుగాక యర్థముల్
తీర్చిన భావముల్ రుచులు తేఱిన మాటలు నాటకంబునన్
జేర్చితినా అదే తెలియజేయును విద్యలగల్గు చాతురిన్ - పు. 4

భవభూతి శాస్త్రపాటవము నెఱింగించు శార్దూల వృత్తమున కనువాదము దాసుకవి వృత్తములో వివరింపకపోయినను దాని భావమును సంగ్రహముగ తేటతేల్లముగ తేటగీతిలో నిమిడ్చిరి. విషయమును వదలక మూలానుసరణముగ వివరించుచు చెప్పదలచినది సూటిగ సముచితముగ వెలయించిరి. తన యనువాద మిట్టిదని తెలుపుటకో యనునట్లు ఈ రెండు పద్యములు ప్రస్తావనలో నుదాహరణ ప్రాయముగ నున్నవి. ప్రస్తావనలో చివరి భాగములో సూత్రధారుడు 'తతఃకిమ్' అన్న దానిని శ్రీరాములు గారిట్లనువదించిరి -

సూత్రధారుడు : సరి యికనేమి ఆడువారమిరువురము ఆఁడువార మగుచున్నాము గదా!

ఇది యమూలకమైనను సందర్భమునకు జక్కగ నతికినది. మీదు మిక్కిలి ఆడువారమన్న రెండు చోట్లను వేర్వేరర్థములచే చక్కని చమత్కారమును వెలార్చిరి. ప్రస్తావన యందలి సంభాషణ అంకము లందలి పాత్రల సంభాషణ వలె రససిద్ధిని

కలుగజేయదు. నేర్పరులగు కవులిట్లు చమత్కారమును ప్రదర్శించుచు పాఠకులకు ఔత్సుక్యము గలిగింతురు!

సాధారణముగ కవులు అనువాదమును స్వతంత్రము వలె భాసింప చేయుట కచ్చుట సన్నివేశమునకు దగిన వాతావరణము సృష్టించుటకు చిన్న చిన్న మార్పులు చేయుట సహజము. అట్టిదే క్రింద నీయబడిన యుదాహరణము. అయిదవ పుటలో కామందకి వచనములో పేర్కొనబడిన "పద్మావతీ నగరమును" కొండవీడుగ పరివర్తింపజేవిరి.

కామందకి అవలోకిత ప్రవేశించునపుడు ఆ పాత్ర ప్రవేశ సూచకముగా నిట్లు అనినది – "కాషాయ వస్త్రములు కప్పుకొని కూర్చుండి రెండు వేషములు వచ్చుచున్నవి." ఇది యింపుగ లేదు. మల్లాది వారి యనువాదమే లెస్సగ నున్నది. "అంత వారిరువురు రక్త వస్త్రములు ధరించి కామందక వ్యవలోకితలై ప్రవేశింతురు".

మాధవుడు –

అత్రాంతరే కిమపి వాగ్విభ వాతివృత్త
వైచిత్ర్యముల్ల సిత విభ్రమముత్పలాక్ష్యాః
తద్భూరి సాత్విక వికారమపా స్త ధైర్య
మాచార్యకం విజయి మాన్మథమా విరాసీత్ – 1–26

దీనికి శ్రీరాములుగారి యనువాదము –

అంతలో వాగగోచరం బైన చిత్ర
సాత్వికంబుప్పతిల్లె నా చంద్రముఖికి
మన్మథాచార్య వర్యుని మహిమజేసి
యొడలు కదలదు చెమరించె వడలెఁబారె
కంటితడి గాఱ్ఱు సొంపును గగురుపుట్టె – పు.లు 11,12

దీనికి మల్లాదివారి యనువాదము –

గురువయి మన్మథుండపుడు క్రొత్తగ నేర్చిన యట్లు కూరిమిన్
పరవశమై మనంబెగయ నామది ధైర్యమణంచుచున్ మనో

హర లలిత త్రపాస్మిత దృగంచల లీలలు భ్రూవిలాసముల్
సురచిరభంగి నత్తరుణి చూపిన చొప్పులు చెప్పనేర్తునే - పు. 16

దీనికి శ్రీరాములుగారు భావ పరిపూర్తికై యైదుపాదములు గల గీతముతో తెనిగించిరి. ఇందు నాయకునకు రాగోదయ హేతువు చెప్పబడినది. రాగోదయమునకు కారణము నాయిక యొక్క విలాసాదులు. సాత్వికాదుల వలన నా విలాసాదులు వ్యక్తము చేయబడినవి. మూలములో "తద్భూరి సాత్విక వికారమ పాస్త ధైర్యం" యన్న దానిని వివరించుచు ఒడలు కదలదు, చెమరించె, వడలె, పాలె, యిత్యాదిగ విశదము చేయబడినవి. తరువాతి శ్లోకములో నాయికా వీక్షణాదికముచే తదీయ హేలవ్యక్తము చేయబడినది. మూడవ దానిలో నాయకుని స్థితి అన్యోన్యాలోకన వలన శృంగార రసము ధ్వనితమైనది, ఈ మూడు శ్లోకములు కనువాదములు మనోజ్ఞముగ కుదిరినవి.

స్తిమిత వికసితానాముల్ల సద్భ్రూలతానాం
మస్రుణ ముకులితానాం ప్రాంత విస్తార భాజామ్
ప్రతినయన నిపాతే కించిదాకుంచితానామ్
వివిధ మహిమ భూవం పాత్రమాలోకితానామ్ - 1-27

అలసవాలిత ముగ్ధస్నిగ్ధ నిష్పంద మందై
రవికవిక సదంత ర్విస్మయ స్మేరతారైః
హృదయమయరణం పద్మ లక్ష్మ్యాః కాటాక్షైః
అపహృతమపవిద్ధం పీతమున్మీలితంచ - 1-28

వీనికి శ్రీరాములుగారి యనువాదమిది -

కదలక యుండునట్టుల వికాసము చూపుచు బొమ్మలొప్పగా
తుదలనుఁ గాంచె మెట్టనయి తొంగలి ఱెప్పలనార్చి యార్చి యొ
ప్పిదముగ వ్రాల్చి యొక వింతగఁదేల్చి మరల్చియుం బదిం
బదిగ ననుంగనుంగొనియె భామ విరామములేని చూపులన్ - పు. 12

మెర మెర మెల్ల మెల్లన భ్రమించుచుఁ దద్దయు సిద్ధయై కళా
విరళత విస్మయోల్ల సన వీఁగగ నచ్చపలాక్షి చూపు దా

బారి పారిలాగి త్రాగి తలపోసి గుటుక్కున మ్రింగివేసె న
బ్బురముగ నాదు చిత్తమునుఁ బొమ్మిక మాటలు వేయునేటికిన్ – పు. 12

మల్లాది వారి యనువాదము –

ఒకచూపు కుల్కుచు నొక్కింత ననుసోఁకి
మురియుచు దాఁగుడు మూఁతలాడె
ఒకచూపు క్రీగంట నొయ్యనొయ్యనఁ జని
యవతంవ రుచులతో నాటలాడె
ఒకచూపు కనురెప్పలొత్తుచు నేతెంచి
నా చూపు కదియ వెన్కకును జాఱె
ఒకచూపు కీగ్రంటి నొదిగి చెక్కిలిదీర్చి
చిఱునవ్వులీలతోఁ జెలిమిచేసె.

అట్లు క్రీడించి యాసరోజాక్షి చూపు
లలసియుం గూడి యుత్సాహబలము కలిమి
నశరణంబైన నా హృదయంబు వెల్వ
రించి స్నేహంబుతో రంగరించి మ్రింగె – పు. 16

రచనకు కాంతిని, శోభను గూర్చు ఛేకానుప్రాసాది శబ్దాలంకారముల నించుమించుగ సముచితస్థానంబున సరసంబుగ మేళవించి ప్రతిభావంతుడైన యనువాదకుడు తన రచనకు శోభను గూర్చును. శ్రీరాములు గారి యనువాదములోని ఆర్చి యార్చి, వ్రాల్చి వ్రాల్చి యన్న ఛేకానుప్రాస యాపద్యమున కొక వింత సోయగమును గూర్చినది. ఇప్పట్టున మల్లాదివారి యనువాదము రమ్యముగ నున్నది. మూలములో నీ రెండు శ్లోకముల భావమును (26,27) ఒక సీస పద్యములో కుదించిరి. నీ పద్యపాదము లన్నిట "ఒక చూపు" పై చూపు బెట్టి హృద్యంబుగ నాభావముల వెల్వరించిరి. ఆమె చూపులు 'దాగుడుమూత లాడె' నని 'ఆటలాడె' నని యమూలక పదముల ప్రయోగించుటచే యాపద్యము పలుదెఱంగుల హొయలు గల్కుచున్నది.

ఈ పై మూడు పద్యములు నాటకమున బ్రధానరసమునకు నాధారము లనదగినవిగ నున్నవి.

ద్వితీయాంకమున మాలతితో లవంగిక మాధవుడు పొగడ పూదండను గూర్చు విధమును వివరించుచు 'ఈ దండను గూర్చునప్పుడు పడిన త్రిప్పలు చూచిన వారికి గాని యెట్లు తెలియును. కనుబొమ్మలు పయికిఁగ్రిందికి గదలుచునే యున్నవి కదా! పుంఖాను పుంఖములుగ మన్మథుడు విడచు బాణములో యనునట్లు వచ్చుచు బోవుచుఁ జిత్రముగాఁ దిరిగినవి కదా' (పు. 19) యనును. శ్రీరాములు గారి యీ యనువాదము మూలమునకు వివరణభూతముగా నున్నది. ఈ యుత్ప్రేక్షాలంకారము గూడయిట చక్కగ నొదిగినది. "న స్వయమేవ చేరచీవర విరుద్ధః పరిచయః" అని కామందకి యన్న దానిని వివరించి శ్రీరాములు గారిట్లు అనువదించి యీ సందర్భమునకు మరింత స్ఫూర్తిని కలుగజేసిరి.

"సంసారబంధములు విడచి గంతలు బొంతలు గప్పిన మాబోంట్లకు సంసార సాంగత్యమెపుడు ఫలించినదో అపుడె అన్ని విధములయిన మనోవేదనలు కలుగుచున్నవి. మీ వంటి సంసారుల పిల్లతో బొంత కట్టుకున్న నా వంటి సన్యాసినికిఁ దగిన పరిచయమే .... ........" (పు. 2) మల్లాది వారిట్లు యథామూలముగ ననువదించిరి. ఆ సందర్భముననే మాలతి యన్న మాటలు– కథముషాపహారీ కృతాస్మిరాజ్ఞస్తాతేవ". దీనికి మల్లాది వారు యథామూలముగ 'నన్ను రాజు గారికి కానుకాగా నిచ్చెనా?' (పు. 32) దీనికి శ్రీరాములుగా రమూలకముగ చెప్పి వారి యనువాద విశిష్టతను సామర్థ్యమును వెలువరించిరి.

"నన్ను వేటగొఱ్ఱెను జేసి నై వేద్యము పెట్టును గాబోలు" (పు. 23) అట్టిదే. "దుర్దర్శనేన ఘతితామియమప్పనేన" దీనికి అనువాదము 'కాకి ముక్కుకు దొండపండన్నది' స్వేచ్ఛానువాదము (పు. 24). ఈ లోకోక్తి ఈ సందర్భమున నున్న "ధూమగ్రహమునకు చంద్రరేఖ" యన్న నిదర్శనాలంకారమునకు పబలకముగ నున్నది. ఈ స్ఫూర్తి మల్లాది వారి ఈ క్రింది యనువాదమున గానరాదు–

> భూవరుని మెప్పుగోరెడి భూరివసువు
> మాలతిని నందును కిచ్చి మేలుగాంచు
> ఆ కురూపుండ చేపట్టు నీకుమారి
> నిందుకల దుర్గ్రహంబు గ్రహించునట్లు – పు. 34

రసవత్తరమైన యింకొక మార్పు –

కామందకి : అప్రాస్తా వికీ మహిత్యేషా కథా (పు. 48)

దీనికి శ్రీరాములు గారు వలపులు గులుకు తెనుగు పలుకుబడులతో అతి సహజముగ నిట్లనువదించిరి–

కామందకి : "ఇప్పుడు తెలిసికొనవలసిన యవసరము లేదు, పయిగాఁ జెప్పదలంచు కొనినయెడల సపాదలక్ష గ్రంథమగును. ఈ భారత మిప్పుడు మీకేల?" (పు. 25)

దీనికి మల్లాది వారి యనువాదము–

కామందకి : అది యిపుడు ప్రస్తావించవలసినది గాదు – పెద్ద కథ (పు. 34)

పంతులుగారి యనువాదమున నున్నంత యర్థపుష్టి దీని యందు లేదు. తృతీయాంక మందలి మాధవుడు చెప్పిన పద్యములందలి గుణములను, లోకలక్షణముగా జెప్పుదానిని అనువాదమున కామందకి యొక్క సామర్థ్యము చెప్పుచు లోక సామాన్యముగ జెప్పినను, దానిని కామందకికే వర్తింపజేసిరి. దీని మూలశ్లోకము–

శాస్త్రేషు నిష్టాసహజస్య బోధః
ప్రాగలబ్భ్యు మభ్యస్త గుణాచవాణీ
కాలావ బోధః పతిభానవత్వ
యేతేగుణాః కామదుషూః క్రియాను – 3–11

దీనికి శ్రీరాములు గారి యనువాదము –

శాస్త్రము లెఱుంగు జ్ఞానమా సహజగుణము
నేర్పులాడియు మాటలు నేర్చునదియుఁ
గాలము లెఱింగి పనిసేయ – గలిగినదియుఁ
గామధేనువు కార్య సంఘటన కీమె – పు. 31

శ్రీ మల్లాది వారి యనువాద మిచ్చట సరళముగను, ప్రసన్నముగ విశదముగ నున్నది.

శాస్త్రపాటవంబ సాధారణ ప్రజ్ఞ
ప్రౌఢిమంబు చతుర భాషణంబు
సమయ సముచితోక్తి సమయ నిరీక్షణ
మీప్సితార్థసిద్ధి హేతువులగు - పు. 44

ఈ తృతీయాంకములో నిరువుర యనువాదములు చక్కగా సాగిన వని చెప్పవచ్చును.

శ్రీ కాలే గారు మాలతీమాధవములో నీయంకముల పొందికను గూర్చి విమర్శించుచు - 3,4 అంకముల నొకటిగను, 6,7,8 అంకముల కలిపి రెండవదిగను జేయవచ్చు ననిరి. పైన జెప్పినట్లు అయిదవ యంకము లేకపోయినను కథాగతి కవరోధము కలుగదు. కేవలము అద్భుత,బీభత్స, రస ప్రవేశమునకే యీ యంకముద్దేశింపబడి నట్లున్నది.

పంచమాంకమున మాధవుడు మహామాంసమును విక్రయింప శ్మశాన భూమి కరుగును. అచట అఘోరఘంటుడు కరాళదేవికి మాలతిని దెచ్చి బలి యీయబోవును. మాధవుడు సమయమునకు వచ్చి రక్షించును. ఈ యంకమందలి స్థలము శ్మశానభూమి. ఈ యంకమున బీభత్స, భయానకాద్భుత రసముల జొప్పించెను. మిగిలిన యంకముల వలె రసవంతముగ నుండదు. రసహీనముగ నుండుటచే నేర్పుగల కవి దానిని సామర్థ్యముతో పాఠకుని యౌత్సుక్యమును సడలనీయక తొల్లిటి యుద్వేగమే కలుగజేయును. 'అస్తి నాకు తశ్చిదేవం భూతం మహాద్భుతం ప్రకరణం' అను వాక్యము ననుసరించి అద్భుతాది రసములు శృంగార రసమునకు వికృతి రసమైనను ఇచట అద్భుతరసము ప్రవేశపెట్టి కవి మెప్పించెదనని చెప్పుకొనెను. మూలము సంస్కృతము గావున ఆ భాషకు సహజమైన గాంభీర్యముచే కవి తన ప్రతిజ్ఞ నెట్లో నెరవేర్చుకొనగలుగును. కాని తెనుగుననిది యనువాదకుల సామర్థ్యమును బట్టి పరీక్షించునట్టిది. ఇందు వారెట్లు కృతకృత్యులైనారో పరిశీలింపనగును.

దాసు శ్రీరాములుగారీ యంకమున ఛందోవైవిధ్యమును ప్రదర్శించి యీ పరీక్షలో కృతకృత్యులైరి. ఈ యంక ప్రారంభమున గల రెండు పద్యములును యోగవిద్యకు సంబంధించినవి. ఈ మొదటి పద్యమును తరువోజులోను, రెండవ

పద్యము తరళములోను అనువదింపబడినది. తరళములో మొదటి రెండు పాదములలోను ఛందస్సు తప్పినది మూడవ పద్యము పంచచామరమున రచియింపబడినది. నాలుగవ పద్యము సీసములోని చిత్ర రగడ (ఇందు అయిదు ఇంద్రగణములు, రెండు సూర్యగణములు, నాలుగు పాదములందు గలవు). ఆరవ పద్యము అయిదు పాదములు గల ఉత్పలమాల. ఈ యంకముననే కాపాలికులు మహేశ్వరుని స్తుతించు సందర్భమున నొక దండకము గలదు. భగవంతుని దండకముతో స్తుతించుట యాచారము. మూలముననను నొక దండకము గలదు. మూలదండకము 2 నగణములు, 16 రగణములతో సాగినది. శ్రీరాములు గారి దండకము నన్నయ గారి దండకమువలె తగణములతో సాగి అంతమున నొక గురువుతో ముగిసినది. అట్లే 13,14 శ్లోకము లందలి భావమును పది ద్విపదలుగ ననువదించిరి. ఇందు శ్మశానమందలి ప్రేతగణముల వర్ణన గలదు. ఇట్లు ఛందో వైవిధ్యమును ప్రదర్శించి పాఠకులకు రక్తి కలిగించిరి.

శ్రీ మల్లాదివారు దండకమును పది రెండు పాదములు గల సీసముగ ననువదించిరి. దాసువారు చూపినంతటి ఛందో వైవిధ్యమును బ్రదర్శింపలేదు.

అసారం సంసారం పరిముషిత రత్నం త్రిభువనం
నిరాలోకం లోకం మరణశరణం బాంధవ జనమ్
అదర్పంకం దర్పం జననయన నిర్మాణమ ఫలం
జగజ్జీర్ణారణ్యం కథమపి విధాతుం వ్యవసితః – 5–30

దీనికి శ్రీరాములు గారి యనువాదము –

ఓరి దురాత్మ! యేటికిటు లూరకపూనెద సార మౌర సం
సారము ముజ్జగంబు చ్యుతసారము లోకము వీతకాంతి వి
స్తారము బాంధవంబు మృతిచారము కామమపేతదర్ప సం
చారము నేత్ర నిర్మితి లెనున్న వికారము నాకు జీర్ణకాం
తార మిదెల్ల కంటకయుతంబును గ్రూరమృగప్రచండమున్ – పు. 49

భావపరిపూర్తికై ఈ ఉత్పలమాలయు నయిదు పాదములు గలిగి యున్నది. ఈ యథానువాదము చక్కగా విశదముగ మూలమునకు దగ్గరగ సాగినది.

దీనికి మల్లాది వారి యనువాదము -

జగతిన్ రత్నవిహీనఁజేయ నణపన్ సంసారసారంబు పె
న్వగలన్ జంపఁగ బాంధవాళి జగమునాల్గింప జీర్ణాటవిన్
బగటిన్ జీకటిసేయ నిష్ఫల మొనర్పన్ గన్నులన్ మన్మథున్
దిగులొందింపగనెట్లు సిద్ధపడి యుద్రేకించితో దుర్మతీ

దీనికి పాఠాంతరము గలదు -

లోకత్రయంబున కేకైక రత్నంబు
సారంబనాది సంసారమునకు
సకలజగత్ప్రకాశ దివ్య తేజంబు
ప్రాణబంధన మెల్ల బంధుతతికి
కందర్ప దర్ప విక్రియ మోహనాస్త్రంబు
మానవనయన నిర్మాణ ఫలము
భూతలంబున సముద్భూత నందనవాటి
బ్రహ్మ సంకల్పప్రభావ మహిమ
అనెడి యిమ్మణిదీపిక నపహరించి
కాటికిందెచ్చి యార్పి జగంబునెల్లఁ
గటికిచీఁకట్లు దిగిఁ ద్రొక్కి కాణాన్ప
జూతువే? నరఘాతుకాచోర హతక - పు. 70

సంక్షిప్తముగ నున్న దానిని సుస్తృతముగావించుట, విస్తృతముగా నున్న దానిని సంక్షేపించుట యొక యనువాద పద్ధతి. ఇచట విషయమును విస్తృతము గావించి భావవివృతి గావించిరి.

ప్రణయసఖీ సలీల పరిహాసరసాధిగతై
ర్లలిత శిరీషపుష్పహనవై రపితామ్యతియత్
వపువివధాయ తత్రతపశస్త్రము పక్షపతః
పతతుశిరస్యకాణ్ణయమదణ్డ ఇవైషభుజః. -5 31

దీనికి శ్రీరాములు గారి యనువాదము

ప్రియసఖి కోడిగంబునకు ఱిమ్ము శిరీషసుమమ్ముఁదాకిత
ద్దయు శ్రమనొందు దేహమునఁదాఁకఁగ శస్త్రము నీవు వైచిన
న్దయ యొకయింతలేని యమదండముఁబోలఁగఁ దక్షణకబ యీ
భయదకఠోరమౌ భుజముపాటును జూడుము నీదు నెత్తిపై పు.50

దీనికి మల్లాది వారి యనువాదము -

సఖులు విసరు శిరీషపుష్పములు తగిలి
కందు నీతన్వి మేనిపైఁ గత్తియెత్తి
యెగరు నీనెత్తినిపుడు నాయెడమచేతి
గుద్దులతోఁబగుఁగొట్టి నిన్ గూల్చువాడు. పు॥లు 70,71

మూలమున కావ్యలింగాకారము కలదు. శ్రీరాములు గారి యను వాదమున ఉపమాలంకారము గలదు మల్లాది వారి దానిలో అలంకారము లేకపోయినను ప్రసన్నమైన రచనతో క్లుపముగ భావమును వివరించిరి.

(6-10)

'విరసం విరహాయసం సోఢుం తవచిత్తమసహంమే'

దీనికి శ్రీరాములు గారి యనువాదము -

నీవు పోయిన విరహంపు నిప్పులోన
మ్రగ్గిపోవకయున్న నామానసంబు పు 80

ఇది మూలముకన్న రసదీప్తి కలిగియున్నదని చెప్పవచ్చును. ఇందుగల రూపమాలంకారము మల్లాదివారి యనువాదమున లేదు. అలంకారము లేకపోయినను సుస్పష్టమై మూలములోని భావములను చెక్కుచెదరనీయక యనువాదములోనికి తెచ్చిరి.

విరసమై విస్తరించు నీ విరహబాధ
వోర్వఁజాలదు నాచిత్తముజ్జ్వలాంగి పు 80

అష్టమాంక ప్రారంభమున గల చంద్రోదయ వర్ణన మనోహరముగ నున్నది.

దళయతి పరిశుష్యత్ప్రౌఢతాలీవిపాండు
స్తిమిరనీకరముద్యన్నైంధపః ప్రాక్ర్పశః
వియతి పవనవేగాదున్ముఖః కేతకీనాం
ప్రచలితఇవసాంద్రో మందమందః పరాగః. 8–1

మూలమందలి ఉత్ప్రేక్ష దాసువారి యనువాదమున ఉత్ప్రేక్షగను, మల్లాది వారి యనువాదమున ఉపమాలంకారముగను పరివర్తితమైనది.

దాసు వారిది -

ఎండిన తాటియాకువలె నెల్లెడందెల్లన తెల్లనై మృగాం
కుండుదయింప దీప్తు నొనగూడఁగఁజీఁకటులిచ్చె గంధవా
హుండు నభంబున న్విసర నున్ముఖమై విర్రబాఁకె నెంతయున్
దండిగఁగేతకీ మృదులతాంత దురంత పరాగమోయనన్ పు॥లు 69,70

మల్లాది వారిది -

గాలిఁగదలిన గేదంగిపూలరజము
చదల నెఱియచు నున్నట్లు చంద్రకాంతి
తూర్పుదెసనుండి యల్లనఁదోఁచితోఁచి
తిమిరము నణంచుచుండెను దిశలు వెలయ పు. 99

జీవయ న్నివ సమూఢసాధ్వ సస్వేదబిందు దధికంఠమర్పృతామ్
బాహురైందమయూఖ చుంబితస్యంది చంద్ర మణిహార విభ్రమః. 8–3

దీనికి శ్రీరాములు గారి యనువాదము -

బెదరి బెదరి చెమర్చి యొప్పిదముమీఱు
చంద్రకాంతి మణీహారసదృశమైన
నీదు చల్లని భుజలతనిండఁజుట్టు
కుతక నర్పింపగదవే బ్రతుకువాడు పు. 70

అనుదానిలో మూలములోని "బాహురైందవ మయూఖచుంబితస్యంది చంద్రమణిహార విభ్రమః" అనుదానికి అనువాదము= చంద్రకాంత మణిహార

సదృశమైన. ఇచట మూలములోని సొగసు రాలేదు. బాహువు చంద్రకాంత మణిహారముతోఁ బోల్చబడినది. బాహువు, హారము రెండును మనోహరములైనవి. రెండును మెడచుట్టూ చుట్టబడినవి. రెండును మిమకరుని కరములచే మనోహరముగ చెమర్చబడినవి. "ఐందవమయూఖచుంబిత" అనునది సార్థకమైన విశేషణము. అది తెనుగునలేదు. అట్టిదే మాధవుడన్న "చివర ముట్టించని యీ పలుకుల సొగసేమి" అనునది. దీనికి మూలము 'అనవసితార్థ మన్థరస్య వచసశ్చారుతా'. ఇందు 'అనవసిత' యన భావపరిపూర్తికాని లేక మాటపూర్తిగాని. దీనికి చివర ముట్టించు' (పు. 75) యున్న యనువాదము సొగసుగలేదు. ఇప్పట్టున మల్లాదివారి అనువాదము హృద్యముగ నున్నది. 'సెబాసు, మాట పూర్తి కాకపోతే నేమి ఎంత శ్రావ్యముగ నున్నది.' (పు. 101).

త్వద్వత్సలః క్వసతపస్వి జనస్యహంతా<br>
కన్యావిటః పతిరసౌపరిరక్షతుత్వామ్<br>
శ్యేనావపాత చకితావనవర్తి కేవ<br>
కించేష్టసే ననుచిరాత్తవలీకృతాసి. 8–6

దీనికి శ్రీరాములు గారి యనువాదము –

ఎక్కడికేగె నీదు మగఁడేడె తపస్వులగండఁడౌ కదా<br>
మిక్కిలి చిన్ని కన్నియల మిండఁడె కాదె సరె యితండని<br>
న్నిక్కడబ్రోచుతి చేబవిరియేచి లటుక్కునఁబట్ట ముక్కునం<br>
జిక్కిన పిచ్చికంబలెన్ చెచ్చెర బ్రింగెద నిన్నుఁ జూడుమీ.

మల్లాది వారి యనువాదము –

కన్యకా జారుఁడు తపస్విఘాతుకుండు<br>
నీవిటుఁడు నీమగండు నిన్గానఁ గలఁడె?<br>
మీన వల్లంకి గొని డెగబ్రింగునట్లు<br>
మిసమిసలు దేఱు నిను నేను బ్రింగుదాన – పు. 105

శ్రీరాములు గారి యనువాదములో తపస్వుల గండడు, చిన్న కన్నియల మిండెడు వరకు సొగసుగ ననువాదమున్నది. "శ్యేనావపాత చకితావన వతింకేవ"

యన్నది తెనుగునలేదు. మల్లాది వారిది మూలానుసరణముగ మనోహరముగ నుండి చిన్న గీత పద్యములో నన్ని విషయముల ననువాదములో జూపిరి.

బాహుఘట్టనఁ గంకాళపంక్తి రాల
బ్రహరణంబుల వీరులు మహినే డుల్ల
రుండ చందంబుగా బత్తి చండ జలధి
రెండు పాయలు విచ్చి దాఁబడఁజేసె - పు.75

ఈ పద్యమునకు మూలము శార్దూలమున రచింపబడినది. ఆ శార్దూల వృత్తమున కిది చక్కని భావానువాదము. మాలతిని గూర్చి మాధవుడు చెప్పు పద్యములో "పడతులఁ జేరబిల్చుకొని" యన్న పదము మూలములో లేదు. ఇయ్యమూలక శబ్దప్రయోగము అచ్చటి వాతావరణమునకు తగియున్నది. యుద్ధ వార్తలు వినుట కందరు ఉత్సాహము జూపుదురు. కాబట్టి మాలతి అక్కడనున్న తన సఖిజన మనుచు పిలచుట సహజముగను ఉచితముగను నున్నది.

నవమాంక ప్రారంభము నందలి మొదటి రెండు పద్యములును మూలమునకు తీసిపోని చక్కని యనువాదములు. మొదటి శ్లోకము నందలి యుత్ప్రేక్ష అనువాదము లన్నిట అనువర్తింపబడినవి. ప్రకృతి వర్ణనలో దిట్టయైన భవభూతికి అనువాదకులు 'సమయుజ్జిల'ని విశదము గావించిరి. ఆర్యావృత్తమున గల శివస్తోత్రమును చక్కని చిక్కని పదములతో నా వర్ణన నొక కంద పద్యమున రచించిరి.

జయదేవ భువన భావన
జయశంకర నిఖిలవరద జయనిగమనిధీ
జయ రుచిర చంద్రశేఖర
జయ మన్మథ గర్వహరణ జయ శివ యంచున్ - పు.78

తరువాతి మూడు పద్యములును బృహదశ్మ భూమిధరము యొక్క వర్ణన గలదు. ఇదియు మూలమునకు చేరువగనే యున్నది.

అపహసిత బాంధవే త్వయా విహితం సాహసమస్య తృష్ణయా 9-19 అన్న దానికి

తల్లికైన జెప్పక తండ్రికైన

జెప్పకయె సాహసించితీవప్పుడట్లు

అన్నది భావానువాదము.

కచ్చిత్సౌమ్య ప్రియ సహచరీ విద్యుదాలింగతి త్వా – 9–25

దైవాప్త ష్యేర్జగతి విచరన్నిచ్ఛ యానుత్ప్రియంచే – 9–36

ఈ రెండు పద్యములు మందాక్రాంత వృత్తములు. కాళిదాసు మేఘ సందేశమున స్ఫురింపజేయును. వీనికి తెలుగుసేత చాల చక్కగ నున్నది.

నవేషు లోధ్రప్రసవేషు కాంతిర్ద్రిశః కురంగేషు గతంగజేషు

లతాసూనమ్రుత్వమితి ప్రమధ్యత్యక్తం విభక్తా విపినే ప్రియాయై – 127

దీనికి దాసు గారి యనువాదము –

పొలఁతి తనుకాంతి లొద్దుగపూల యందు

గన్నులందము లేళ్ల యందు గతులసొగసు

గజము లందును మేనిజోకలతలందుఁ

బంచి యిక్కొననే యుండెఁ బరమసాధ్వి – పు. 83

దీనికి మల్లాది వారి యనువాదము –

కరులు లోధ్రంబును లతలు హరిణములును

గమనమార్దవ నమ్రమతేక్షణమ లందు

కనఁబఱుచు క్రొఁత్త సొంపు లెక్కడివి? యకట?

నా సతిని బొట్టఁ బెట్టుకొన్నవి నిజంబు – పు. 118

"నా సతిని బొట్టఁబెట్టుకొన్నవి" అనుటకన్న "పంచి యిక్కోనని యుండె" యన్నది మూలమునకు దగ్గరగను స్ఫూర్తి మంతముగ నున్నది.

గురజాడ వారు "దుర్గమ్మ" లో నీభావచ్ఛాయలే కాన వచ్చుచున్నవి. "కుముదాకరణే శరదిందుచంద్రికా" (9–49) యను మూలమునకు 'కలువ కొలకున వెన్నెలల్గాసెనేని' యనుట చాల రమ్యముగ నున్నది (పు. 89)

దైవాత్పశ్యేర్జ గతి విచరన్ని చ్ఛయామత్రిప్రియాంచే
దాశ్వాస్యాదౌ తదనుకథయే ర్మాధవీ యామవస్థామ్
ఆశాతంతుర్న చ కథయతాత్వరిత ముచ్ఛేదనీయః
ప్రాణత్రాణం కథమపి కరోత్యాయ తాక్ష్యాః సఏకః - 9-26

శ్రీరాములు గారి యనువాదము -

జగముల నెందునే విధి వశంబున మాలతిఁ జూడఁగల్గినన్
జిగిదగు లీల నూఅడిలఁజేసి పదంపడి మాధవుండు ని
వ్వగ దురటిల్లి పొందెడి యవస్థను దెల్పుము నీదు రాకకున్
సొగయుచు నూరకే యెదురు సూచుట నయ్యడియాస త్రాడుఁదాఁ
దెగదని తెల్పుమయ్యదియె తీవియబోడికిఁ బ్రాణదాతయౌ - పు. 82

మల్లాది వారి యనువాదము -

తరుణి కృశాంగి మాలతిని దైవ వశంబున గాంతు వేని ముం
దర తగ నూఅడించి యటఁదద్భతి మాధవునొందు దుర్దశా
పరిణతిఁ దెల్పు మానకు రవంతయు భంగము రానియట్లు న
న్నరయుదు నన్న యాశకద యాసతి ప్రాణము నిల్పు నింతకున్ - పు. 118

శ్రీరాములు గారి పద్యముత్తరార్థము అన్యథా ప్రకల్పింపబడినది. ఆశాతంతువు తెగకుండ కాపాడుసుమా యని మేఘుని హెచ్చరించుచు చెప్పిన దిచ్చట, ఇంకొక విధముగ మార్పు చెందినది. అయిదు పాదముల నిడివియున్నను భావ విస్తృతి యడియాసయే యైనది. ఇప్పట్లున మల్లాదివారి యనువాదము కొంచెము మూలానుసరణముగ సాగినను "ఆయాశ కథ యాసతి ప్రాణము నిల్పు నింతకున్" అని అన్యథా ప్రకల్పింపబడినను నీ యనువాదమే సుందరముగ నున్నది.

చివరి భాగమున 'కమ్మనిపూలు దలలదాల్తురే కాని రోకళ్ల దంతురటరే' అన్న దృష్టాంతాలంకారము రమ్యముగ యనువదింపబడినది.

సహజ లాలిత్య మాంగళ్య సహిత గదవె
రాక్షసత్వంబు సూపకే రమణి మీద

బుట్టుతావుల కమ్మని పూలు తలలఁ
దాల్తు రేకాని రోకళ్ల దంతు రటవె – పు. 89

ఇట్లు పదలాలిత్య పరిశోభితమైన చక్కని యనువాదము సాగినది. ఈ నవమాంక మంతయు పద్యమయము. పద్యములన్నియు చక్కగ యనువదింపబడినవి.

దశమాంకము నందలి పదమూడవ శ్లోకము నందలి అర్థాంతరన్యాసము అనువాదముల చక్కగ పరివర్తింపబడినది.

ఏషాప్రవాసం కథమప్యతీత్య
యాతాపునః సంశయమన్యథై వ
కోనామ పాకాభిముఖ స్వజన్తో
ర్ద్వారాణి దైవస్యపి ధాతుమిష్టే – 10–13

అన్నది ఉత్తరామచరిత్ర మందును గలదు. దీని భావము తెలుగులో సంగ్రహముగ ననువదించిరి. అనువాదకు లిరువురు ఇందలి అర్థాంతర న్యాసమును పరివర్తింపజేసిరి.

శ్రీరాములు గారు –

ఈ కలికి తాను బడరాని యెల్లపాట్లు
తప్పక ప్రవాసమునఁబొంది తరలె మరల
నవని నెవ్వరికేని శక్యంబె తొల్లి
చేసికొన్నది యిపుడు బోసేయకుండ – పు. 94

మల్లాది వారు –

కష్టములు దాఁటి గట్టెక్కి కంటఁబడిన
కాంత వెండియు సంశయగ్రస్తమయ్యె
పక్వమై సిద్ధమగు కర్మఫలము నెవ్వ
డను భవింపక తప్పించుకొనఁగ గలఁడు – పు. 132

ఈ పద్యముననేగాక ఇందు మఱికొన్ని పద్యములకు ఉత్తరరామ చరిత్ర యందలి పద్యములతో బోలికయున్నది. మాధవుడు మాలతికై యన్వేషించుచు

మేఘునితో సంభాషించుట, కాళిదాసు మేఘసందేశమును అడవి మృగములను లతలు ప్రశ్నించుట, కాళిదాసుని విక్రమోర్వశీయమును వలపింపజేయును.

ఇట్లు పదవాక్య ప్రమాణజ్ఞుడగు భవభూతి రచించిన ఈ ప్రకరణమునను మనోహరముగ శ్రీరాములుగారనువదించిరి. అట్లే వీరి ననుగమించుచు మూలకర్త భావముల నాకళించుకొనుచు శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు వారి యనువాదము తీర్చిదిద్దుకొనిరి. అనువాదకులిరువురు భవభూతి భక్తులే. వీరిరువురును భవభూతి రచించిన మూడు నాటకములను ముగ్ధమనోహరముగ ననువదించిరి. అమూలకములైన కొన్ని లోకోక్తులతో తెనుగుతనమును ప్రతిబింబింపజేసిరి.

**శైలి :** పెద్ద పెద్ద ఉపన్యాసముల వంటి వచనములు ఈ నాటకము నందలి లోపము. ఇది గౌడ రీతిని రచింపబడినది. అమేయమును, అస్తోకము నగు పదశీలము కలవారనువాద కర్తలు. భావమున కనుగుణముగ శబ్దించు శబ్ద ప్రయోగములతోను, ఛందో వైదగ్ధ్యముతోను చక్కని చిక్కని జాతీయములతోను లోక సమ్మోహనకరమగు తెలుగు నుడికారంపు సొంపులతో యింపు గూర్చుచు వీరి రచన సాగినది. ఇందు హాస్యమునకు తావులేదు. అయినను మదయంతికా మకరందుల వివాహ సందర్భమున గల యా చక్కని చమత్కారము లోటును దీర్చినది. ఇందు నీచ పాత్రలు సహితము సంస్కృతముననే సంభాషించినవి. ప్రకృతి వర్ణనలపట్ల కాళిదాసు ప్రభావము భవభూతిపై కొంత కలదని బృహదశ్మి భూధరముల, లవణానామ నదీ ప్రవాహముల వర్ణనలు విశదము చేయుచున్నవి. మాధవుడు మాలతికై యరణ్యమున గ్రుమ్మరుచు, చేతనాచేతనముల సంబోధించుచు, దుఃఖించు వాక్యములు, విక్రమోర్వశీయము చతుర్థాంకమున పురూరవుడూర్వశిని వెదకుచు ప్రలాపించు వాక్యములు, కాళిదాసు భావములకు ఛాయలుగ నున్నవి. “ఈ పట్టున పుండరీకముఖ బంధులోపిన నిచ్చుచుండ నీ విట్టులుగా నీవాపజలమెల్లను నొంటిగ ద్రావయుక్తమే” (పు. 84) అన్న భావమును గ్రహించి వేణీ సంహార నాటకమున భట్టనారాయణుడు యుధిష్ఠిరునిచే “నివాస జలమ్మును ద్రావగ నీవు తమ్ముడా” యని విలపించెను.

ఇట్టి ప్రఖ్యాతమును విశిష్టమున నైన నీ ప్రకరణము అనువాదకుల విశిష్టతకే మాత్రము న్యూనత కలుగకుండునట్లనువదించిరి. అనువాదకుని ప్రత్యేకతను పాండిత్యమును ప్రదర్శించునట్టివియును యనువాదమునకు వన్నె బెట్టునవియును యమూలకములునైన కొన్ని లోకోక్తులు, నుడి కారపు సొంపులు –

కాకిముక్కుకు దొండపండు – 24 ; మీ కొప్పుల నేకోసికొందున నా చెప్పులు మీరు మోయవలదా – 62 ; ముప్పదిత్రిప్పలు మూడు చెఱువుల నీరు – 21 ; మొగుని కొట్టి మొగసాలకు మొఱపెట్టుకొన్నట్లుగ ; ఒక చెంపగొట్టిన పాలు నింకొక చెంపగొట్టిన నెత్తురు ; ఇంద్రాయుధము పోటు లెంతైన మాను మనసు నాటిన మాట మానదెన్నటికిని – 1– 63 ; లోకులు కాకులు గదా – 1–64 ; చల్లకు వచ్చి ముంతదాచిన నేమి ప్రయోజనము – 2–1 ; లోకమంతయు గారడిగా నున్నది – 2–67 ; నీ నొసిటనే యుదయించెనా బ్రొద్దు – 10 ; గట్టిగా జెప్పి కూకలు పెటించుట – 61 ; ఎదురు చెక్కుచుండు – 12 ; తప్పు తన వద్ద నుంచుకొని యితరుల నిందించుట గంట కొట్టించెదను – 50 ; అబమోసుబమో తెలియదు గదా – 63 ; మడ్డిగుంట – 63 ; చుట్టములే వంగి చూడనైన చూడరు గదా – 63 ; వలుపులు వడికిచ్చుట – 64 ; ఎడాపెడా దెబ్బలు – 12.

అనువాదకు లిరువురిట్లు చక్కని రచనా విన్యాసమును వెలార్చిరి.[1] ఈ నాటకము శ్రీ పోలవరము జమీందారు గారైన బహద్దూరు కె.ఆర్ వి. కృష్ణారావు గారి సంపాదకత్వమున వెలువడిన 'సరస్వతి' పత్రికలో 1809 వ సంవత్సరమున కొన్ని నెలలు వరుసగా ప్రచురింపబడి నవంబరు నెలకు పరిసమాప్తము గావింపబడినది.[2]

## అధోజ్ఞాపికలు

1. అనువాదము లెక్కువగా లేకపోవుటచే నీరెండింటికిని సరిపోల్చుటయైనది.
2. ఈ పత్రికాప్రతులు రాజమహేంద్రవర మందలి 'హితకారిణి సమాజ గ్రంథాలయమునను, గౌతమీ గ్రంథాలయమునను గలవు.

# 5. గద్యసుమము

## (i) అభినవ గద్యప్రబంధము

ఛందోరహితమైన వాక్యరచనను సంస్కృతములో గద్యమనియే వ్యవహరింతురు. తెలుగులో వచనము,గద్యము అని సమానార్థకములుగ వ్యవహరించుచున్నారు. ఛందోనియతిలేని రచనను గద్యమని లాక్షణికులంద రంగీకరించిరి. సంస్కృతమున గద్యరచన ముత్తెఱుగులని వామనుడు కావ్యాలంకారసంగ్రహమున నిట్లు చెప్పెను –

కావ్యం గద్యం పద్యంచ గద్యం వృతగన్ధి
చూర్ణముత్కలికాప్రాయంచ
పద్యభాగవద్వృత్తగన్ధి అనావిద్ధ లలితపదం చూర్ణ
విపరీత ముత్కలికాప్రాయమ్

పద్యపాదభాగముల కలయికతో వృత్తములవాసన దోపించుచుండు వచన రచనము వృత్తగన్ధి, దీర్ఘసమాసముల గడబిడలు లేక తేలిక పలుకులతో నుండు పొడిపొడి వచన రచనలు చూర్ణము. దీర్ఘసమాసముల గడబిడలు గలిగి యుద్ధతోక్తులతో నుండు రచనముత్కలికాప్రాయము.

వామనునికి తరువాతివాడగు విశ్వనాథకవిరాజు గద్యము నాలుగు భాగములని భాగించెను. ముక్తకము,వృత్తగన్ధి,ఉత్కలిక,చూర్ణకము. మొదటిది సమాసరహితము. రెండవది వృత్తభాగములతో గూడుకొన్నట్టిది. మూడవది దీర్ఘ సమాసాఢ్యము. నాల్గవది యల్పసమాసకము. ఏవాఙ్మయమునందైన మొదట పద్యము, తదనంతరము గద్యము పుట్టుట సహజస్థితియై యున్నది. పద్యకావ్యములు[1] పాడుటకై వీలై, శ్రావ్యములై, కావ్యరసానంతదమును గలుగజేయుచున్నవి. పద్యకావ్యములు నియమబద్ధముగ రచింపబడినను, పదముల పొందిక నడక కల్పనలు, భావనాశక్తి, కవిత్వ తత్త్వా శ్రయములుగ నుండును. గద్యకావ్యములు,వ్యాకరణతత్త్వాశ్రయములై విషయ ప్రధానములుగ నుండును.

గద్యము ప్రధానముగ మూడుశాఖలలో వికాసమును పొందినది. 1.నన్నయ నుండి నాయకరాజులవరకు,2.చంపూకావ్యములు.3.వచనైక రచనలు. పద్యరచన 11వ శతాబ్దినుండి నభివృద్ధి పొందియుండలేదు. గద్యరచనలు శాసనములందు గలవు. భారత రామాయణ భాగవతాది గ్రంథములందును ప్రబంధములందును గలవు. కావ్యయుగములో గద్యలలో అనుప్రాసాది శబ్దాలంకారముల ప్రయోగములతోను,సంస్కృతపదజాలముతోను ప్రౌఢముగ నున్నవి. ప్రబంధము లందలి గద్యములు వర్ణనప్రాయములై వారి పాండితీ ప్రకర్ష ప్రకటించుటకు ఆటపట్టులై ఆంధ్రసాహిత్యము నందు వచన రచనలకు బ్రమాణములుగ నున్నవి. ఇట్టి హృద్యములైన గద్యములీ కాలమున విలసిల్లినను గద్యకావ్యములు వెలువడలేదు. 18వ శతాబ్ది పూర్వార్థమున గద్యకావ్యములు వెలువడినవి. సముఖము వెంకటకృష్ణప్పనాయకుడు, 'సారంగధర,' 'జైమినీ భారతము' లను గద్యకావ్యములను రచించెను. కళువె వీరరాజు వచనభారతమును రచించెను. ఈతని కాలము నుండి వచన రచన వికాసము చెందనారంభించినది.[2] కళువె వీరరాజుకవి తెలుగు వచన రచనా కుమారిని ప్రౌఢకవుల నిర్బంధముల నుండి విడిపించి సంకెళ్లను విడగొట్టించి దాస్యవిముక్తి గావించి స్వేచ్ఛనొసంగి రాణింపజేసి తోడివారిలో సగౌరవముగ తలయెత్తుకొని స్వతంత్రముగ మనగల 'హోదా' ను ప్రసాదించి పుణ్యమును గట్టుకొనినాడు. అటుపిమ్మట 19వ శతాబ్దిలో పరవస్తు చిన్నయసూరి గారు 'నీతి చంద్రిక' యను పేర హృద్యమైన గద్యకావ్యమును రచించిరి. 1872లో నరహరి గోపాల కృష్ణమసెట్టిగారు 'శ్రీరంగరాజచరిత్ర' అను నవల వ్రాసి దానిని ప్రబంధమనియే పేర్కొనిరి.[3]

పైన బేర్కొనినట్లు గద్యకావ్యములనే రచించిరి గాని గద్యప్రబంధముల రచించిన వారు అరుదు. ప్రబంధ నియమములన్ని తు.చ.తప్పక పాటించుచు గద్యమున చెప్పవచ్చును. గద్యప్రబంధమును రచించిన వారిలో శ్రీదాసు శ్రీరాములు గారే యాద్యులని చెప్పవచ్చును. పెద్దనాదులు రచించిన ప్రబంధ మార్గమున గద్యములో రచించినవారు వీరుగాక వేరొకరు లేరని చెప్పవచ్చును. చిన్నయసూరి ప్రభృతుల గద్యరచన ఉత్కలికాప్రాయము అయినది. 'అభినవ గద్యప్రబంధము' యొక్క రచన ప్రధానముగ వృత్తగ్రంధియై యున్నది.

శ్రీరాములుగారి మిత్రులైన శ్రీమోటుపల్లి రాఘవయ్యగారు వారితో విలాసముగ ముచ్చటించుచు, 'నీవర కెన్నడునులేని యొక కథను కల్పించి తెలుగు భాషలో నొక గద్యప్రబంధము నొక్క వారము రోజులలో వ్రాయగలరా?' యని ప్రశ్నించిరట. 'ప్లీడరు' పనిలో నుండుటచే నిట్టి కార్యమును బూనుకొనుట కించుకైన వ్యవధి లేకుండినను -

ధరణిని లేనిది యెపుడె
వ్వరివలనను వినని దఖిల వర్ణనముల సుం
దరమగు చరితము గద్యము
న రచించెద నేడునాళ నలుబదిపుటలన్.[4]

అని ప్రతినబూని మిత్రులుకోరిన ప్రకారమున వారము దినములలో నీ గ్రంథమును బూర్తిచేసి, వారిచేతితోనే శుద్ధప్రతి యొకటి గూడ వ్రాసి యిచ్చి మిత్రుని సంతోషబెట్టిరట.

మనోరంజకమగు ప్రబంధములు తఱచుగ ప్రణయ వృత్తాంతములనే యాధారముగ గొని శృంగారరసోచిత వర్ణనా ప్రాధాన్యము గలిగి విస్తరిల్లును. వీనియందు వర్ణనాత్మక కవితకు ప్రాముఖ్యమెక్కువ. వీని స్వరూప స్వభావముల గూర్చి శ్రీ డాక్టరు పల్లా దుర్గయ్యగారిట్లు చెప్పిరి– "సంస్కృతపురాణేతిహాసముల నుండి ప్రసిద్ధ కథావస్తువును నాటకముల నుండి శుభాంతత,వస్త్వైక్యము, సంభాషణావిధాన పాత్రపోషణాదులును,మృగయావినోద, వైమానికగమన శీతలోపచారాదులును,నాటికల నుండి ప్రఖ్యాత ధీరలలిత రాజనాయకత్వము, కన్యానాయకత్వము, ప్రత్యక్ష పరోక్ష (చిత్రస్వప్నాది) సందర్శనాదులచే నాయికా నాయకులకు ప్రథమాను రాగోదయవిధానమును,నాయికానాయక సహాయులగు చేటీ, యోగినీ, విదూషకాదులును, స్త్రీ పాత్ర బాహుళ్యము,నాయికా ప్రణయ కోప, నాయకానునయ,పాదాభివందనాదులును,మహాకావ్యముల నుండి రసాలంకారవర్ణ నాదులను,కథాకావ్యములనుండి సర్వప్రబంధ సామాన్య ప్రణయపరిణయకథ, విప్రలంభాదులు, శృంగారరసప్రాధాన్యమును, అభ్యాయికలనుండి ఆశ్వాస విభాగములును, ఈ కథాఖ్యాయికావతారికల నుండి

యిష్టదేవతాగురుస్తుత్యాద్యవ తారికాంశములును మరియు చంపూకావ్యములనుండి గద్యపద్యోభయమ యత్వము,భిన్న వృత్తరచనావిధానమును,ఇత్యాద్యనేక రమణీయవిషయములను మాలాకారి భిన్నవర్ణపుష్పములను వలె స్వీకరించి, యేకత్రమేళవించి రూపొందింప బడిన ప్రత్యేకరస నిర్భరరచనయే ప్రబంధము.సమస్తవిధ సంస్కృతకావ్య సౌందర్యమును సంతరించుకొనిన సరససాహిత్యప్రక్రియ ప్రబంధము".[5]

ఇందలి వర్ణనాదుల గూర్చి నన్నెచోడుడు కుమారసంభవమున నిట్లు నుడివెను–

వనకేళి రవిశశిసంధ్యా
తనయోదయ మంత్రగతి రతక్షితిపరిఖాం
బునిధి మధుఋతుపురౌద్యా
న నగ విరహద్యూత వర్ణనాష్టాదశముల్

ఈ కవి యీ ప్రబంధ లక్షణములతో నీ – వర్ణనలెల్ల నీచిన్ని ప్రబంధమున గూర్చు వింతయే ఇందలి యితివృత్తము కల్పితము. తన మిత్రుడు కోరినట్లీవర కెన్నడును లేని యొక కథను కల్పించి గద్యప్రబంధముగ చిత్రించిరి. ఇది చిన్న గ్రంథమైనను కల్పనాదృష్టిలో మేటియనవచ్చును. ఈ విషయమున శ్రీరామకవి పింగళి సూరనార్యుని బోలి యున్నారు. అభూతకల్పనాచాతురి యందు సూరనగారి వలెనే వీరును నిరుపమానులై గొప్ప కథాద్వయమును సృష్టించిరి.

ఇందలి కథ రేఖామాత్రముగా నిది – పాంచాలదేశమున నింద్రావతి యను నొక పురంబును పద్మపాదుండను రాజు పాలించుచుండెను. అతనికి కాంతిమతి, కలవాణులను భార్యలు గలరు. సంతానము లేదు. ఒకనాడు భార్యలతో నుద్యానవనమున కేగి యచట నొక పొన్నచెట్టు మీద కాలజ్ఞుడు, దివ్యదృష్టి యను విహంగద్వయమును చూచెను. అందు స్త్రీ విహంగమైన దివ్యదృష్టి రాజు యొక్క యపత్యరాహిత్యము ప్రస్తావించి యాతనికి సంతానము కలగువిధం బెటింగింపుమన కాలజ్ఞుడట్లె చెప్పెద వినుమనెను. ఆ పలుకులు విని రాజు తన భార్యలకు చేసన్న చేసి చూపెను. అది చూచి రహస్యము చెడగొట్టునని చెప్పక

చెట్టుతొఱ్ఱలోనికి బోయినవి. రాజు అందులకు మిక్కిలి చింతించి,హుతాశుడై యింటికేగెను. కాని నాడు నిదురరాలేదు. అపుడు ఱేనికి వినోదార్థము కలవాణి కథ చెప్పనుపక్రమించెను.

కపిలదేశమున కబళాపురమున ప్రభాకరుండు, కనకవల్లి యను బ్రాహ్మణ దంపతులు కలరు. వారి కుమారుడు విద్యానాథుడు. విద్య యబ్బకపోవుటచే తండ్రిచే ఇంటినుండి వెడలగొట్టబడి యరణ్యము చేరి నాగరాజగు రత్నఫణుని కుమార్తె మందారమాలచే ప్రేమింపబడి భారతి మంత్రోపదేశము పొందెను. అతడుపదేశము పొంది తల్లిని స్మరించి 'ఓతల్లీ! కనకవల్లీ!' యనెను. దీనిని విని యన్యథాభావించి యాతని ప్రాణము నొక మృతశుకశరీరము లోనికి జొనిపి యాతని శరీరము చెడకుండ నభిమంత్రించి యొక వృక్షశాఖకు తగిలించి చిలుకను చేగొని నాగలోకమునకు వెడలిపోయెను. అచట శుకరూపమున విద్యానాథుని వలన నిజము తెలిసికొని మరల నాశరీరమున్న యెడకు బోగా నది యచ్చట లేదు. ఇట కుమారుడు రాకపోవుటచే తల్లిదండ్రులు వెదకి శరీరమును తీసికొని పోయిరి. ఆ శరీరమున ప్రాణము లేకున్నను చెడిపోకుండుటచే చికిత్స చేయించుచుండిరి.

మందారమాల చిలుకను తీసికొని కళేబరము కొఱకు వెదకుచుండగ ప్రమాదవశమున నుగ్రదంష్ట్రుడను రాక్షసుని చేజిక్కెను. అతడామెను పరిణయ మాడ నభిలషింప నేర్పుగ తప్పించుకొనవలెనని 'తన కొక ముని శాపమున్నదని చదివిన శుకము, చదియని శవము కనులబడినప్పుడామె శాపవిముక్త యగుననియు, నంతవరకు ఆమెను గూడినవాని శిరము సహస్రశకలంబగునని చెప్పెను. చివరకు నుగ్రదంష్ట్రుడుజ్జయిని నగరాధీశుని భారతీనిలయమున శుక రూపమున నున్న విద్యానాథుని చదియని శవముగ నున్న విద్యానాథుని శరీరమును దక్కించుకొని వచ్చుచుండ మందారమాల తండ్రి రత్నఫణునితో పోరు సంభవింప శుకమును, శవమును మందారమాలకడ దించి యాతనితో తలపడి నిహతుడయ్యెను. అచట మందారమాల శుకములోని యూపిరి మనుజు శరీరములోనికి జొన్ప యాతడు లేచెను. చివరకామెను పరిణయమాడి యుజ్జయిని యందు మంత్రిపదవి యందుండెను.

ఈ కథ యంతటిని అయిదు రాత్రులలో కలవాణి చెప్పినది. తరువాత నొకరోజు కాలజ్ఞుడు చంద్రభాగానదిలో ప్రాతఃకాలమున స్నానము చేసి కాళికాలయమునకు బోయి పూజించిన మూడుదినములలో మేలు చేకూరునని చెప్పెను. రాజు అట్లు చేసి కాంతిమతి వలన ప్రతాపభానుడు,కలవాణి వలన కీర్తిచంద్రుడను నిరువురు పుత్రులను బడసి ప్రజాపాలనంబు చేయుచు సుఖంబున నుండెను.

ఇంతటి సుదీర్ఘమైన కథను ప్రబంధవర్ణనలలో నేయొక్కటియును విడువక అచ్చులో నలువది పుటలలో వ్రాయగలిగెనన్న ఆ కవి ప్రజ్ఞ యనితరసాధ్యమని చెప్పవలెను. ఇదియపూర్వమైన కథాకల్పనాశక్తి గల ప్రబంధము. కావ్యములన్ని టివలె శ్రీకారముతో ప్రారంభించి సుకవి స్తుతి,కుకవినింద మొదలైనవి చేసి ప్రబంధనిబంధనలన్నిటిని తు.చ.తప్పక పాటించెను.

నన్నెచోడుడు చెప్పిన యష్టాదశ వర్ణనలన్నిటిని సమయోచితముగ నీ చిన్ని పొత్తమున పొందికముగ పొందుపరచెను. ప్రారంభమున మయనిర్మితమగు ఇంద్రావతీ పురవర్ణనము గావించి, నాయకుడగు చంద్ర వంశరాజైన పద్మపాదుని వర్ణించెను. కరి, గిరి, కిరి, ఫణి కమఠంబుల తలబరువు దీర్చుటకీరాజు బాహువులు ధరాభారమును వహించెనట. చమత్కృతమగు శ్లేషతో నాయికలగు రాజకాంతల వర్ణన జేసెను. 'కానరాని కౌనులు పేదఱికాన ముష్టికి లోబడియెనట'. అమహోరు సౌందర్యములు రంభకు మృగ్యంబులట. ఇట్లే వనకేళి వర్ణన గూడ చేసెను. ఇచట కుందమందార పున్నగాది పుష్పవృక్షములను పదునెనిమిదింటిని పేర్కొనెను. అట్లే కాఱడవి వర్ణనలో పదమూడు రకముల క్రూరమృగములను బేర్కొనెను. ఇట్లు సమగ్రమైన పట్టిక యిచ్చుట శ్రీనాథుని లక్షణము.

పుష్పించి యున్న యొక కొమ్మను ఉపరతినున్న స్త్రీలతో శ్లేషించెను. అట్లే మల్లియను ప్రసవసమయ మందలి స్త్రీలతో బోల్చి 'రంభ తన నిజాపత్య భావంబునకు గడువగచు చుండె'నని వ్యంగ్యరీతిని కథాప్రకాశము చేయుట మిక్కిలి ఉచితముగ నున్నది. భూసురకుమారుడు కాఱడవిని ప్రవేశించినపు డది కీకారణ్యమని చెప్పుటకు 'తూర్పది పడమరది యన యేర్పరింప నలవిగాకున్నదని' యొక్క మాటతో నటవీ వర్ణన చేసి యాయడవి భావుకుల హృదయంగతమగునట్లు

చెప్పెను. (పు. 18). కవి యుపజ్ఞ కిదియొక మచ్చుతునక. 'కమలాకరంబు కరంబు వినోదకరంబుగ' కాసార వర్ణన యొనరించెను. (పు. 19). మందారమాల చెలికెత్తెతో చేసిన జలకేళి వర్ణన (పు॥లు 19,20) వీరి పాండిత్య ప్రతిభావిశేషము లకు చక్కని నిర్వచనము. ఇచట నీ సంభాషణ యంతయు శ్లేషచమత్కృతి కలిగియున్నది.

విప్రకుమారుడు మందారవతిని జూచి మోహితుడై 'మ్రింగ మెతుకు లేదు మీసాలకు సంపెంగనూనె' యనినట్లున్నదని, వలువ దులిపి వల్లెవాటు వైచుకొని జట్టుముడివైచుకొనెనట. మానవ ప్రకృతిని కవి ఎంత నిశితముగ పరిశీలించునో తెలియుచున్నది. ఆ పాత్రభావన, ఆభావన కనుగుణముగ కదలిక అట్టిదే మందారమాల మూర్తిచిత్రణము. 'మోమునగ్రాలు ముంగురులు దక్షిణ కరాంగుళుల జెవుల కైవత్తి, ముక్కెర చక్కదిద్ది, వామ హస్తాంగుష్ఠతర్జనులు, చుబుకంబున నొయ్యారంబుగ దీర్చి, బొమలొకయింత సోయగంబుగ నెగఢించి కన్నులల్లార్చి, తలిరాకువాతెఱ మొలకనవ్వొలయ దలయించుక గదిలించి, యొక్క పఱి గ్రుక్కళించి, యామొలకపాలిండ్లీ కులుకులాడి పయ్యెద సవరింపుచు తులరేని జుంటి తేనియలొలుక నిట్లనిపలికె'(పు. 22). ఇది కవి తన శబ్దములతో ఛాయా చిత్రముతీసి పాఠకుల కనులయెదుట నిలిపెను. ఇది మనుచరిత్రలో వరూధినిని తలపించుచున్నది. 'ఈ చక్కదనాల యిక్క నాకు దక్కెనేని / చక్కెరవిలుకానికి నిక్కముగనేనొక మ్రొక్కు చెల్లింతుననెను' . ఎంత చక్కని మ్రొక్కుబడి.

మందారమాల శుకరూపమున నున్న విద్యానాథుల సంభాషణలో వింధ్య నగ వర్ణన (పు. 28) ప్రబంధచోతమై శ్లేషచమత్కృతి ఘటింపుచు శృంగార రసాత్మకమై యొప్పుచున్నది. వీని యనవరత నిశ్చలస్థితిని గడు మెచ్చితి. ఇతని కూటముల మృదులతాప్తిదేలు నునుపుసానుల జూచితె? (పు. 28). ఇట్లర్థద్వయముతో వర్ణన సాగినది.

వసంతఋతువర్ణన గ్రంధారంభముననే యున్నది. (పు. 8). "ప్రాగంగనాముఖన్యస్త సింధూరతిలకంబన" 'గుముదబాంధవుండు తూర్పుకొండపై నుదయించెనని' చంద్రోదయ వర్ణన గావించెను. (పు. 13). ప్రాతఃకాలమున కోడికూత,ఠోకటి చప్పుడు,శ్రుతిగోచరంబగునను (పు. 15) సూర్యోదయవర్ణన

చేయుటతో పాఠకులకు తెలుగువారి పల్లెసీమ త్రుటికాలమున మనమున మొదలును. ప్రాక్పారావార వర్ణనలో కవియొక్క వర్ణనావైశద్యము విశదమగును. "యాతాయాత స్రోతవ్రాత సమేతంబై పక్షచ్ఛేద భయంబున నిజ గర్భంబునం దాగిన భూభృత్సముదయంబునకు నింద్రారియదే తూర్పు దెసకు దండుబోవు చున్నాడు లెండు లెండు బాసటపొండని వెలువరించెనో యన తండోపతండ డిండీర ఖండమండితంబై యండజేంద్రుడాఖండలపురి నుండి యమృతభాండంబు గొని తెచ్చునాడు శతకోటి తోటిదీటింపబోవు తఱి వీటిపాటై యేపాటియేని యీ నీటంబడియెనో యన, విశాల శైవాల జాల నీలంబై నీలకంధరుండు త్రిపురాసురుల జయించి, మరల దన యంపదోన నారాయణశరమ్ము దాచెనోయననుత్తుంగరంత్త రంగ సంగంబై, నింగినున్న బలాహకంబులకు నీరుబెట్టుచున్నదో" యని యభివర్ణింప దగి యున్నది (పు॥లు43,44). ఈ ఉత్ప్రేక్షమాలతో, యనుప్రాస విన్యాసముతో నీ వర్ణన పరాంకోటికెక్కినది. నారాయణశరము దాచుటకు తగిన స్థలమే (నార+అయన) నీటికి స్థానమయినది. నీటి యందుండక మఱి యెచ్చట నుండును. సార్థక పదప్రయోగముతో చమత్కరించుట యెంతేని యుచితముగ నున్నది.

ఉగ్రదంష్ట్రుడు రత్నఫణునితోడను, కపిలునితోడను చేసిన యుద్ధవర్ణనమున (పు45) కవి యొక విశేషమైన క్రమమును పాటించెను. కపిలుడు, రత్నఫణు లొనర్చిన యుద్ధమును దీర్ఘసంస్కృతసమాసములతోను, ఉగ్రదంష్ట్రు డొనర్చిన పోరును తేటతెనుగు పదములతోను వర్ణించెను. "ప్రళయ కాలాభీల కీలామాలా మూలంబైన కాకోలంబుగ్రక్కుచు యోజనాయుత ఫణిసందీప్త మాణిక్యచ్ఛటాచ్ఛటలు దిక్తటంబుల నటింప పూత్కారమేదురంబై రోదోంతరంబు భేదిల్లునట్లు" నిజ సర్ప రూపంబున రత్నఫణుడు దోచుట ఈ సుదీర్ఘ సమాసరచన ఉగ్రదంష్ట్రునిపై నాతనికి గల సుదీర్ఘ క్రోధమును వ్యక్తము చేయుచున్నది. పక్షిరూపమున యుద్ధముచేయు చున్న కపిలునితో "నా గోటికి సాటిరారు పక్కులారా" అని ఉగ్రదంష్ట్రుడనుట చమత్కారము.

మందారమాల విరహవర్ణన (పు. 49) యందుగల మన్మథోపాలంభమున మన కవి, రాయలనాటి ప్రబంధకవులకన్న నొక యాకెక్కువే చదివినట్లు దోచును. 'కువలయాధీశా'! నీవు సాధుచక్రంబుల బాధకుండవు. రుద్రాక్షివైభూతి

పాండుశరీరుడవై యనవరత జంగమాచారుండవైన లింగము ధరించి నీవు రామానుజ కులజు పొత్తు హత్తితివి. నీకు నిలకడయేదది? ఓరీ నీసిరి నడమంతరము. నీ స్థితి రెణ్ణాళ్ల పట్టపగలు'. లోకోక్తుల ప్రయోగములోను తెనుగు నుడికారపు సొంపు అమరికలోను తీయని తెలుగుపదాలను విరిచి అర్థాలను అద్భుతముగ వ్యక్తముచేయుటలను చేమకూర కవికి సరిదోడు. రామానుజ కులజుడన మన్మథుడని యొక అర్థము. రామానుజ మతమని యింకొక యర్థము గలదు. చంద్రుడు శివుని సిగపూవుగాన శైవసంబంధి రామానుజ మతస్థులకు, శైవులకు పొరపొచ్చెములు లేవుకదా, కావున వైరివర్గము వాడని యర్థము. ఇందు ఊటబావి వలె యెన్నియో అర్థములు తలచినకొలది స్ఫురించును.

వివాహవర్ణనాంతరము కుమార్తె నత్తవారింట బుద్ధికలిగి యుండుమని (పు. 52) చెప్పిపుచ్చుట శ్రీనాథుని దమయంతిని,వసుచరిత్రకారుని గిరికను తలపించుచున్నది. పద్మపాదుడు మగువలతో డుగవచ్చి బారయనుచు లగడసాల యాడెనని (పు. 56) చెప్పి ద్యూతవర్ణన గూడ విడువక చేర్చెను.

పుత్రోత్సవ,నామకరణములందు వివాహపు లగ్నము నిర్ణయించుట యందును కవికి గల జ్యోతిశ్శాస్త్రపాండిత్యము ద్యోతకమగును. ఆ శాస్త్రమున నంతటి నిష్ణాతులు కావుననే 1901 రాజమహేంద్రవరమున జరిగిన జ్యోతిశాస్త్ర వేత్తల సమావేశసభ కధ్యక్షత వహించిరి.

శ్రీరామకవి 'చదువులచిలుక' శ్రీనాథుని రాజహంసకు గాని,సూరనార్యుని శుచిముఖికిగాని యా 'భారతీదేవి ముందటిపలుకుఁ జిలుకకు' కాని తీసిపోవు నది గాదు. కవికిగల నానాశాస్త్రప్రావీణ్యము ఈ శుకము నోట చెప్పించెను. (పు.లు. 31,32). చంద్రకేతుని యెదుట శుకము చార్వాకునితో ఈశ్వరు దున్నాడని వాదించి ఈశ్వరుడెట్టివాడో చెప్పి (పు॥లు 41,42) గెల్చుట జూడ ఈతని 'సివిలు కోర్టులో జడ్జీముందు' నిలచి ప్రతివాదితో వాదించి గెలిచిన వైనము కాననగును. ఈవాదము కవి ప్రతిభావ్యుత్పత్తులనేగాక వృత్తిచేత న్యాయవాదియై పొందిన యనుభవమును వెల్లడి చేయును. ఇచట ఈ కవి యొక్క తర్కవేదాంత శాస్త్ర సారపరిజ్ఞాన పరిమితియు వెల్లడైనది.

మందారమల్లి విద్యానాథుని గాంచినతటి శృంగారరస వర్ణనము.

ఉగ్రదంష్ట్రునితో సలిపినపోరున వీరరసమును, కనకవల్లి కుమారునికై తపించి నప్పుడు కరుణరసమును, రక్కసుని వర్ణనలో భీభత్సభయానక రసములు,అట్లే అద్భుత శాంత రౌద్రరసములను, నేయొక్కటి విడువక సందర్భోచితముగ హాస్య రసమును జోడించుచు రసపరిపోషణ గావించెను.

శ్రీరామకవి శైలి ఒక్కొకచో దీర్ఘసంస్కృత సమాసభూయిష్టమై మత్త మాతంగ ఠీవిని బోల్చుచు, మరియొకచో యలతియలతి యచ్చ తెలుగు పదములతో రాయంచ నడకసౌరును పుణికిపుచ్చుకొన్నట్లుండును. దీర్ఘసంస్కృత సమాస గుంఫనము ఆప్రక్కనే తేటతెనుగు సమాసముల పొత్తు గూర్చుటయే వీరి ప్రజ్ఞ. నిపుణుడైన స్వర్ణకారునివలె చక్కగ రెంటిని యతుకు కానరాకుండ కలిపెను.

“శీతకర శీతవాతులాండజాత సంఘాతసమేత చేతోజాత యాతనాతి భీత చేతస్కమై యే తెఱంగుదోవక వేదురుపట్టినట్లు యిటునటు దిరుగుచున్న యా కన్నియ చిన్నియ లెల్ల సూచి” (పు. 48) వాక్యమున మొదటి సగభాగము సుదీర్ఘ సంస్కృత సమాస భూయిష్టముగాను, తరువాతి భాగము తేటతెలుగు పలుకులు గలిగియు నున్నది. ఇట్టిదే యింకొక యుదాహరణము – “మహాభీల దంష్ట్రా కరాళవదనగహ్వరుండైన కర్బురవర్ణుండా చక్క నిక్కి నిక్కి యక్కోమలిం జూచి యమ్మక్క యనియా చక్కనిచుక్క నాయిక్కకుం గొంపోయి మక్కువం జిక్క దక్కించు కొందుగాక” (పు. 37). ఇందు ఇంకొక విశేషము ‘క్క’ అను వృత్త్యనుప్రాసమును సాభిప్రాయముగ ప్రయోగించెను. పొత్తమంతయు నిదేవిధముగ గంగా యమునల సంగమము వలె శోభించును.

కవి యీ ప్రబంధకన్యను చక్కని యలంకారములతో కైసేసెను. “ఆ విద్దెలమారి ముద్దుచిలుకల గైకోలుసేసికొన్న కపిలుడు శుకలాలసుండైన వ్యాసుం బోలె” యున్నాడట(పు. 33). ఈ యుపమానమీ సందర్భమున కెంతేనియు తగి యున్నది. మందారవల్లి “పాలవెల్లికడ భాసిల్లుమోహినీదేవత యన” యొప్పు చున్నది. (పు. 22) ఇందలి ‘మోహినీ దేవత’ యనుపదమును సాభిప్రాయముగ ప్రయోగించెను. విప్రకుమారుడున్నది చిట్టడవి. మఱి యామె మోహినీ పిశాచమా? మోహినీదేవతయా? యను సందేహము రావచ్చును.

ఈ ప్రబంధము చదువగనే యీ కవి శబ్దాలంకారప్రియుడేమో యనిపించును. కాని కవి వీనితో చక్కని భావస్ఫూర్తిని,రసస్ఫూర్తిని కలిగించుటే కాక లోకోత్తరమైన చమత్కారముల కల్పించెను."ఈ పిట్ట నీకేమి కట్టిపెట్టు? కావరమ్మున కనుగానక, పట్టరాని పట్టుబట్టి, పట్టికోలు మేలుగాదు" (పు. 44). ఇందలి 'ట' కార వృత్త్యనుప్రాసము అతడెంత గట్టిపట్టుపట్టెనో తెల్పుచున్నది. అట్టిదే యింకొకటి - "అనళీకనాళీ కపాళీకల్పిత మృణాళనాళ శృంఖలులఁ గట్టంబడియెనో యనగ" (పు. 21). గట్టిగ బంధించవలెనన్న కనీసము మూడుచుట్లు అయిన చుట్టవలెను. 'ళ' కారములో మూడుచుట్లున్నవి. అట్టివి అయిదు 'ళ' కారములున్నవి. అనగా పదునైదు చుట్లతో నీకవి గట్టిగ బంధించి యుత్ప్రేక్షించెను. "ఏరా మారా. హరికుమారా! నీనారాచంబులు ఘోరంబులయ్యె' (పు. 49). ఈ యమక మందలి 'ర' కారము, ఊచిరంపాన పెట్టుచున్నాడను అర్థము స్ఫురింపజేయును.

పూర్వకవుల ననుసరించుట న్యూనత కాదు. అది వానిని సంభాషించుట. శ్రీరామకవి, శ్రీనాథుని యొరవడిగా పెట్టుకొన్నను నితర ప్రబంధకవులను గూడ ననుసరించెను.

> 'ఆడువారిలో నాడువారినో నొక వారిజానన' (పు. 19)
> 'అలరుంబోడులలో నలరుంబోడుములు' - నందితిమ్మన
> 'బారదూరము నుండి యోలయోల యని' (పు 19)
> 'ఓలంబాలక యోలయోలంచు నోలోలంచు మేలంచు'
>
> - రామరాజ భూషణుడు

ఇందలి పాత్రలకు నామకరణములు సహితము కవి సాభిప్రాయముగ జేసియుండెను. పాత్రస్వభావగుణముల ననుసరించి వారి నామములున్నవి. రాక్షసుని పేరు 'ఉగ్రదంష్ట్రుడు'. అతని పట్టణము 'నిష్కళ'. ప్రభాకరుడు - బ్రాహ్మణుడు. "నిగమాగమవేదియు, నీతికోవిదుడును, సంగీత సాహిత్య కళా పారంగుతుడును, అంగ, వంగ, కళింగ, కాశ్మీర, టెంకణ, కొంకణ, ద్రవిడ, కర్ణాటాది దేశపాలకుల సభాంతరంబుల నిజవిద్యామహత్వంబు కలిమితో" (పు 16) ప్రభాకరుని వలె తన కీర్తి వ్యాపింపజేసి సార్థకనామధేయు డయ్యెను.

ఇతని పురము 'కబళాపురము'. బ్రాహ్మణులు భోజనప్రియులు. 'తత్కబళ చాతురీమహిమను' గూర్చి శ్రీనాథుడు మున్నె తెలిపియుండెను గదా!

కాంతిమతి – భర్తకు సమయమునకు తళుక్కుమనెడి చక్కని యాలోచనలు చెప్పెడి మతిమంతురాలు.

కలవాణి – కలవాణి కలది కావుననే చక్కని కథలు చెప్పగల నేర్పరి.

విద్యానాధుడు – నేతిబీరకాయవంటివాడు. కాని భారతీ మంత్రోపదేశముతో నిక్కముగ విద్యానాథుడే యయ్యెను.

ఈ గ్రంథములో నింకొక విశేషము. అవతారికలోని మూడవపద్యమగు ఉత్పలమాలలో నిరువది మంది కవులను సంగ్రహించి స్తుతించిరి. ఆరవ పద్యమగు ఆటవెలదిలో పాత్ర పాటించుట విశేషము. కొన్ని పదములకు క్రొత్త పర్యాయ పదములు కల్పించిరి.[6]

ఎత్తకాండ్రు = గ్రంథకర్తలు, గద్దెపుసుద్ది = వచనసూక్తి
ఱెక్కదారి = పక్షి, అభ్రపుష్పము = గగన కుసుమము

అవతారికలోని 'సర్వజ్ఞత్వము సాంబమూర్తిది...' (పు. 5) యన్న పద్యము లోని 'సుధీకుంభుల్' అన్న విశేషణము విశేషము. ఈ ప్రయోగమరుదుగా కాననగును.

ప్రబంధమునకు తెనుగుదనము కూర్చుటకు తెలుగుజాతీయములు, సామెతలు ప్రయోగించిరి.

'మంచికిం బోచిళ్లు బొమ్మనునట్లు' (పు. 12) ; 'దొంగవాకిట మంచము వైచుట' (పు. 12) ; 'ఊదుపొట్టలు నమలువాని కూచబియ్యము లెక్కడివి' (పు. 12); 'పోరలేక పారిపోవుచు నా పఱుగందికొమ్మనునట్లు' (పు. 19) ; 'బాపనపోటు కప్పకాటును లేదనకొనకుము' (పు. 41) ; 'నాలుక నూవుగింజనానదు' (పు. 15); 'కాలికి బెట్టిన వ్రేలికి వచ్చుచున్నది' (పు. 19) ; 'ఆడలేక మద్దెల యోడన్నట్లు' (పు. 19) ; 'ఈతకు మిక్కిలి లోతును,చావున కెక్కువ కీడును లేదు' (పు. 19) ;

'మ్రింగ మెతుకు లేదు మీసాలకు సంపెంగ నూనె యన్నట్లు ' (పు21) ; 'ఈనంగాచి నక్కలపాలు చేసెననినట్లు' (పు. 24) ; 'ఏమియు నెఱగని నంగనాచి' (పు 29); 'నోట వేలిడిన కఱవనేరవు' (పు. 27) ; 'గోరుచుట్టుపై ఱోకలిపడియె' (పు. 30); 'తన గట్టుత్రాళ్లు తాదెచ్చుకొన్నట్లు' (పు. 36) ; 'కోడె క్రొవ్వి యాఁబోతుపై ఱంకెలు వైచినట్లు' (పు. 44) ; 'హనుమంతుని ముందటరా కుప్పిగంతులు' (పు. 44) ; 'ఎలుక వచ్చి పిల్లిని వెక్కిరించె నన్నట్లు' (పు. 44) ; 'సాధురేగిన సహదేవుడు గట్టలేడు'.

ఈ లోకోక్తు లడుగడుగున సంపెంగలు గుబాళించినట్లు కావ్యమందంతట సువాసనలు వెదజల్లుచున్నవి. సంస్కృతసూక్తులు గూడ యెడ నెడ జేర్చి కదంబములోని మరువము వలె కమ్మతావుల ప్రసరింపజేసెను. 'బుద్ధిః కర్మానుసారిణీ' (పు. 12), 'గతజలసేతుబంధనము' (పు. 15),'నందోరాజా భవిష్యతి' (పు. 38), 'ధర్మోజయతి' (పు. 44),ఏకక్రియాద్వ్యర్థకరీ' (పు. 43).

శ్రీకారముతో ప్రబంధమును ప్రారంభించి శ్రీకారముతోనే ప్రబంధమును ముగింపజేసెను. ఇది ప్రాచీన సాహిత్యసంప్రదాయమే. నన్నిచోడ కవి 'కుమార సంభవమును శ్రీకారముతో కృతి ప్రారంభించి మంగళ మహా శ్రీవృత్తముతో కృతి ముగించినాడు. దీనిని ప్రాచీనకవులు,కొంతమందియే పాటించినారు. నవ్య యుగమున తిరిగి గద్యప్రబంధమున పై సంప్రదాయమును పాటించినవారు శ్రీరాములుగారే. ప్రబంధము చివర చిత్రకవితాబంధముల జేర్చెను. 'వసుధాధీశ విఖ్యాక' యని ప్రారంభించి యొక్కొక్క యక్షరమే విడచుచు ముక్తపదాక్షరముల గ్రహించుచు మరల పదము చెప్పి యథారీతిని నొక్కొక్క యక్షరము విడిచి చివర శ్రీతో నిట్లు ముగించెను –

నవసుధాధీశవిఖ్యాక
వసుధాధీశవిఖ్యాక
సుధాధీశవిఖ్యాక
ధాధీశవిఖ్యాక
ధీశవిఖ్యాక

శవిఖ్యాక
విఖ్యాక
ఖ్యాక
కవీరసభామాత్త
వీరసభామాత్త
రసభామాత్త
సభామాత్త
భామాత్త
మాత్త
తమోహర రహిత
మోహర రహిత
హరహిత
రహిత
హిత
తతనయాభ
తనయాభ
నయాభ
యాభ
భవనగ
వనగ
నగ
గజప
జప
పశ్రీ
శ్రీ

ఇట్లు చిత్రాతివిచిత్రముగ నీ గద్యప్రబంధమున్నదో యన్నట్లు నీ చిత్రకవితతో ముగించుట చిత్రము. అర్థవివరణ గ్రంథాంతమున కలదు.

## అధోజ్ఞాపికలు

1. ఆంధ్రవాఙ్మయచరిత్ర– శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు గారు, ఆంధ్ర గ్రంథమాల, మద్రాసు. 1. 1957. పు. 125)
2. ఆంధ్ర వచనరచనాపరిణామము,పు. 105.
3. అభినవ గద్యప్రబంధము,తృతీయముద్రణము, 1974, పు. 3.
4. అభినవ గద్యప్రబంధము– తృతీయముద్రణము. 1974. పు. 4
5. ప్రబంధవాఙ్మయవికాసము (రాయలయుగము) – డాక్టరు పల్లా దుర్గయ్య, 1973, పు. 124. )
6. అభినవ గద్యప్రబంధము. పు. 11

  

శ్రీ రాములు గారి లిఖిత ప్రతి

# 6. పద సుమములు

## (i) పదములు

సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః స్త నద్వయమ్
ఏకమాపాతమధురం అన్యదాలోచనామృతమ్.

సరస్వతీ స్తనద్వయమైన సంగీతసాహిత్యముల రసామృతమును శ్రీ దాసు శ్రీరామకవి కడుపునిండగ్రోలి గఱ్ఱున త్రేన్చిన మహానుభావుడు.

అనేక శతాబ్దముల నుండి సంగీతసాహిత్యములు రెండును గంగా యమునల స్రవంతులవలె జాతీయసంస్కృతిని సుసంపన్నము చేయుచునేయున్నవి. కాని ఈ రెండును ఒకేవ్యక్తియందు సంగమించుట అపురూపము. అట్టి సంగమము శ్రీ దాసు శ్రీరాములు గారియందు గోచరించును. వీరు సుప్రసిద్ధ వాఙ్మయ కారులేగాక వాగ్గేయకారులుకూడ. 'కలం' వట్టి పదం వ్రాయగలరు. పదం వ్రాసి పాడగలరు. పాటపాడి అభినయించి చూపగలరు.

శ్రీ దాసు శ్రీరాములు గారు కృష్ణలీలా ప్రతిపాదకములగు పదములతో గూడిన నొకచిన్న సంగీతగ్రంథమును వ్రాసిరి. ఏలూరు 'సబార్డినేట్ కోర్టులో' 'ఫస్టుగ్రేడు ప్లీడరు'గనుండుకాలమున శ్రీరాజా బొమ్మదేవర నరసింహనాయుడి గారి వలన ప్రేరేపింపబడి 'సర్వజిత్' సంవత్సర చైత్రశుద్ధ ప్రతిపత్తు మొదలు మార్గశీర్ష బహుళ అమావాస్య వరకు రచించిన భగవన్నామ పఠనానుకూలకృతులను, శ్రీ కృష్ణలీలా ప్రతిపాదకములగు పదములు కృతులు, జావళులు, సర్వజతులు మొదలుగునవి చిన్ని పుస్తకము అని దీని అముఖమున వ్రాసిరి. ఇది 1897 డిసెంబరు 20వ తేదీన ముగించబడినది. దీనిని గానవిద్యావినోద రసికజనానంద కరముగ నుండునటుల వ్రాసితి ననిరి.

ఈ గ్రంథము రెండు భాగములు.మొదటి భాగమున 12 కృతులు, 15 పదములు, 13 జావళులు, 1 మంగళము కలవు. రెండవ భాగములో 10 కృతులు, 2 శ్లోకములు, 10 పదములు, 9 జావళీలు, 14 సర్వజతులు, ఒక తిల్లాన యుండి యంతమున నొక 'మంగళహారతి'తో ముగింపబడినది. కీర్తన

లన్నిటికి రాగతాళములు పేర్కొనబడినవి.

కృతులు : క్రొత్త సంగీతవిద్యాదర్పణముతో కృతిలక్షణమిట్లు చెప్పబడినది – భగవత్సంబంధమైన స్తుతి గల్గి, పల్లవి అనుపల్లవి చరణములు గలిగియుండును. కృతిలోని సంగీతము స్వరగతులతోను గమకములతోను నిమిడియుండును.[1]

మాతువు (పాటలలోని మాటల కూర్పు) దేవతాస్తుతిగను, పల్లవి అనుపల్లవి చరణములతోను మొదటి చరణపు కడపటి భాగము అనుపల్లవ యొక్క ధాతవును అనుసరించి తక్కిన రెండుచరణాలు మొదటి చరణ ధాతువును (పాటలలోని సంగీతపు కూర్పు) అనుసరించి యుండును. కొన్ని కీర్తనలలో అనుపల్లవి చరణాల కడపటి బాగాలు మధ్యమకాలపు ఆవర్తములు కాగ అనుపల్లవి చరణాంతములతో తిరిగి పల్లవి ఎత్తుకొనుటలో మాతువులో భావం పూర్తియగును. పల్లవి యొక ఖండమయితే అనుపల్లవి రెండు ఖండాలు. చరణాలు నాలుగు ఖండములైన తక్కినవి రెట్టింపు – నుండును[2] సుబ్బారావు దీక్షితులు గారు సంగీత సంప్రదాయ ప్రదర్శినిలో వివరించిన కీర్తన పద దరు చౌక వర్ణ తానవర్ణాదుల లక్షణములను పై విధముగ పేర్కొనబడినవి. దీనినే వివరముగ శ్రీ రజనిగారిట్లు చెప్పిరి – "కీర్తనలు పల్లవి అనుపల్లవి చరణములతో కూడి వుండాలి వృత్తములకు వలెనే యతిప్రాసలు పల్లవులు సుబోధకరంగా బోధన రూపముగ నుండును. పల్లవిలోని యభిప్రాయము అనుపల్లవి లోను, చరణములలోను విశదముగ తెలుస్తూ తిరిగి తిరిగి పాడబడుతుండే పల్లవితో భావము వాక్యము పూర్తి అవుతూ ఉంటుంది. పల్లవి యొక ఖండంగాను, అనుప్లవి రెండు ఖండములుగను, నాలుగు ఖండములుగను వుంటాయి'.[3]

తాళ్లపాకవారి సంకీర్తనలలో పల్లవి రెండు ఖండములగను, అనుపల్లవి లేకయే నాలుగేసి పాదములు గల మూడుచరణము లుండును. జయదేవుని యష్టపదులలో పల్లవి యనుపల్ల వులలో రెండు రెండేసిపంక్తులుండి చరణములు రెండేసిపంక్తులుచొప్పున ఎనిమిదిచరణము లుండును.

నారాయణతీర్థులనాటికి పల్లవి యొకపంక్తిగను, తరువాతి రెండు పంక్తులు అనుపల్లవిగను నాలుగేసిపంక్తులలోగల మూడు అనుపల్లవులతో ముగియును. అటుపిమ్మట క్షేత్రయ, త్యాగయాదులనాడు పల్లవి, అనుపల్లవి మూడు చరణాలుగ

నున్నవి. చరణాలు కొన్నిటిలోమూడు మాత్రమే కాకుండ 4,8,9,10 కూడ ఉంటూ వచ్చినవి. నాటినుండి నేటివరకు చివరి ఖండములో వాగ్గేయకారుడు నిర్ణయించు కొన్న నామముద్ర వచ్చుచునే యుండును. శ్రీరాములు గారి ముద్ర "దాసు రామహృదయ". వారి కృతులు పల్లవియును, మూడుచరణములు కలిగియున్నవి. రెండవ భాగమందలి రెండవ కృతియైన "గణాధిపతి స్తుతి"లో జయ జయ విఘ్నములు గలవు. మిగిలిన కృతులు, జావళీలు, పదములందు మూడేసి పాదములు గలవు. శ్రీ త్యాగయ్య గారినాటికి కృతి సుస్థిర స్వరూపము దాల్చినది.

శ్రీరాములు గారినాటి కిట్లు కృతి చక్కని స్వరూపము దిద్దుకొన్నది. వీరు మొదటి భాగములో ఈ క్రింద పేర్కొనిన దేవతల స్తుతిపరముగ కీర్తనలు రచించిరి. విఘ్నేశ్వరుడు, సరస్వతి, శ్రీరామ, శ్రీకృష్ణ, జగదంబ, లక్ష్మీజగదంబపై వ్రాసిన కృతికి, లక్ష్మిపైవ్రాసిన కృతికి మధ్య తత్వప్రతి పాదకమైన కృతి యొకటి సురట రాగమున రచింపబడినది శ్రీరామునిపై నైదుకృతులు, శ్రీకృష్ణునిపై రెండు కృతులను రచించిరి. విఘ్నేశ్వర స్తుతి 'హిందుస్థానీ కాఫీరాగముతో ప్రారంభించిరి. మిగిలిన కృతులు శ్రీరాగము, హిందూస్థానీ, భైరవి, పూర్వకల్యాణీ, సురటి, కమాచి, ధన్యాసిభైరవి, కల్యాణి, అఠాణా రాగములలో రచించిరి.

రెండవభాగ మందలి మరల విఘ్నేశ్వరస్తుతి ప్రారంభించిరి. మొదటిది సురటరాగములోను, రెండవది నాటరాగములోనుగలవు. తరువాత శ్రీకృష్ణుని స్తుతి గల కృతులొకటి ఆరభిరాగములోను, రెండది శ్రీరాగములోనుగలవు. ఆరభి రాగములోనున్న కృతికి చిట్టస్వరుముకూడరచించిరి. చిట్టస్వర స్వరూప వికాసములగూర్చి శ్రీ రజనిగారిట్లు చెప్పిరి – 'చిట్టస్వరకల్పన అర్థము తాత్పర్యము తేలికయైనప్పటికి స్వరాక్షరాలను గానం చేస్తే కృతి, రాగము పాడేటప్పుడు కలిగే రసానందమే కలుగుతుంది. చిట్టిస్వరమనేది ప్రత్యేకంగా నిలిచే సంగీతరచన కాకపోయినా కృతిగా పరిణమించిన కీర్తన గానంలో తప్పనిసరిగా రక్తి కలిగించే చిట్టచివరి యంశము. ఈ యంశము సభాసంప్రదాయములు వర్థిల్లిన యుగంలో బాగా అభివృద్ధి చెందింది. ఈ చిట్టస్వరములు రాగలక్షణమునకు, లక్ష్య ప్రాయములు. కృతియనే సంగీతరచనకు ప్రత్యేక వ్యక్తిత్వము, ఠీవి, సౌందర్యము సమకూరుస్తుంది. చిట్టస్వరకల్పనతో సహా రచించపబడిన కృతులు సంపూర్ణ

వికాసము గలరచనలుగా గౌరవింపదగినవి త్యాగరాజుపంచరత్న కృతులలో ఈ చిట్టస్వరకల్పనలకు సాహిత్య సంబంధము గూడా రచయిత మయినది. ముత్తుస్వామిదీక్షితులు కొన్ని జతిస్వరసహితమైన స్వరకల్పన రచించి. శ్యామశాస్తులు, తన విలంబికాలకృతులలో అనుపల్లవి తర్వాత ముద్దులొలికే చిట్టిస్వరాలు చేకూర్చారు. ఈ చిట్టస్వరపకల్పనలో శ్యామశాస్త్రులుకు మించిన వాడట ఆయన కుమారుడు సుబ్బరాయశాస్త్రులు."[4]

శ్రీరాములు గారు రచించిన యీ చిట్టస్వరము రసస్ఫూర్తిని కలిగించుచున్నది. నాట గౌళ ఆరభి వరాళి శ్రీరాగములను ఘనరాగవంతకము లందురు. ఈ ఘనరాగములోనినైన అరభి శ్రీరాగములలో శ్రీకృష్ణ సంబంధమైన కృతులు రెంటిని రచించిరి. తరువాత రెండు శ్లోకములు రామపరముగ సంస్కృతమున వ్రాసిరి. ఆ రెంటిని ఏరాగములోనైన పాడుకొనవచ్చు ననిరి. ఈ శ్లోకద్వయము దీర్ఘసమాములు లేక చూళికవలె నున్నవి. విష్ణుస్తుతికై సికీరాగములో తెనుగునురచించిరి. రెండవది ఝుంఝూటి రాగములో సంస్కృతముగ నున్నది. దీనికి రెండే చరణములు కలవు. శివస్తుతి శ్రీరాగములోను, శుద్ధకాంభోజిలోను రచింపబడినవి. కామేశ్వరీస్తుతి వసంతరాగమున రచించిరి. దీని కొకటేచరణము.

ఈ కృతులు భావానుగుణమైన శైలిలో అర్థగాంభీర్యము కలిగి రసోద్దీపకముగ నున్నవి. ఇవి కొన్ని సంస్కృతమున మరికొన్ని తెనుగున రచింప బడినవి. మొదటి భాగమున నున్న శ్రీకృష్ణపరమైన కృతి 'కృతకృత్యాభవితాసి రసనే, కృష్ణనామజపరే - రసనే కృష్ణనామజపరే' యన్నది. ధన్యాసి రాగమున సంస్కృతమున నున్నది. ఇది కదళీపాకమున రచింపబడి సుధాదుగ్ధమధురముగ నున్నది. ఆ ప్రక్కనే గల కృష్ణపరమైన కృతి భైరవరాగమున నలతి యలతి తేటతెలుగు పదములతో రచింపబడినది.

'ఇటు రారా - యిదిమేరా - యేరా నందకుమారా ।ఇటు।

1. సన్నజాజి పూలదండ సవరించి సేవించెద ।ఇటు।
2. మొగమున కస్తురిదిద్ది సిగదువ్వి సేవించెద ।ఇటు।
3. మేలైన గంధము మేనబూసి సేవించెద ।ఇటు।

4. ఆకుమడుపు లందిచ్చి అడుగులొత్తి సేవించెద । ఇటు ।
5. దాసు రామకవి హృదయావాసుడవని సేవించెద । ఇటు ।

కృష్ణభగవానుని తన చేతులతో నలంకరించి సేవించి ఆనందపడే భక్తుని కోరిక యిందు వ్యక్తమగుచున్నది. ఇట్టి భావస్ఫూర్తినే దోపించు త్యాగరాజకృతి కలదు. అదియును భైరవిరాగముననే రచియింపబడినది.

'చేతులార శృంగారము ఁజేసి చూతును శ్రీరామచేతు' । చేతు ।
సేతుబంధన సురపతి సరసీరుహవాదులు బొగడనా । చే ।
చరణం ॥ మెరుగుబంగారందెలు బెట్టి మేటియౌసరిగ
పల్వలుగట్టి సురతరుసుమములు శిఖనిండ జుట్టి
సుందరమగు మోమున ముద్దుబెట్టి । చేతు ।

భాగవతము సప్తమస్కంధమున పోతన నవవిధ భక్తిమార్గముల నిట్లు నిరూపించెను –

తనుహృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం
బను నీతొమ్మిది భక్తి మార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుడై యుండుట భద్రమంచు దలతున్ సత్యంబు దైత్యోత్తమా
– ప. 167

దీని మూల శ్లోకము –

శ్రవణం కీర్తనం విష్ణోస్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్
ఇతి పుంసార్పితావిష్ణో భక్తి శ్చేన్న వలక్షణా
క్రియతే భగవత్యద్దేతస్మన్యధీరముత్తమమ్

పై వానిని బట్టి నవవిధ భక్తిమార్గములు – 1. శ్రవణము, 2. కీర్తనము, 3. స్మరణము, 4. పాదసేవనము, 5. అర్చనము, 6. వందనము, 7. దాస్యము, 8. సఖ్యము, 9. ఆత్మనివేదనము – అని తెలియుచున్నది. ఈ శ్రీరాములు గారి కృతిలో అర్చనము, పాదసేవనము, దాస్యము, సఖ్యము అన్నవి హెచ్చుగ ప్రతి

పాదితములైనవి. శ్రీవేణుగోపాలపరముగ మొదటిభాగమున పదునైదు, రెండవ భాగమున పది పదములు రచించిరి.

**పదములు**

పదము అన్నదానికి నిర్వచనము క్రొత్త సంగీత విద్యాదర్పణములో నిట్లు కలదు - 'దేవతాసంబంధముగను శృంగారరసము గల్గి నాయికా నాయక లక్షణములకు సంబంధించి యుండును. మరియు పల్లవి అనుపల్లవి చరణములు గల్గి యుండును.[5] శ్రీఎన్.గంగప్ప గారి యభిప్రాయము - 'పదం అంటే సామాన్యార్థంలో పాట అనే వాడుక. ఇది రాగాల తాళాలతోను ఉండవచ్చు. లేదా స్వర రహితము కావచ్చు. ఇది జానపదుల సాహిత్యంలో స్పష్టంగా తెలుస్తుంది. కోలాటము,దంపుళ్లపాటలలో తాళముంటుంది. రాగంతో పాటు విసర్రాయి కలిపి పాటలలో రాగానికే కాని తాళాని కవకాశం లేదు. 'పదం' పాడమన్నది జన వ్యవహారం'. [6]

శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారిట్లు వచించిరి - "శృంగారరసమయమై రాగతాళ నిబద్ధమైన రచనకు 'పదము' అను సంకేతనామము వాడుట సంగీత రసికుల సంప్రదాయమైనది. క్షేత్రయకాలముననే యీ వాడుక వచ్చినట్లున్నది". శ్రీదివాకర్ల వెంకటావధాని గారు దాని వికాసపరిణామము గూర్చి యిట్లు సంక్షేపించిరి. - "ఏ వాఙ్మయమందైనను గద్యపద్యములకంటె గేయమె ముందవతరించునని విమర్శకుల యభిప్రాయము. ఆంధ్రవాఙ్మయవిషయమున గూడ నది యదార్థమే. నన్నయకు పూర్వము దేశికవితామార్గమునకు చెందిన పలువిధములైన పదములు గీతములు వ్రాయబడుచుండెనని యూహించుట కాధారములున్నవి. పాల్కురికి సోమనాథుడు 'పండితారాధ్యచరిత్రమున' తుమ్మెద పదములు, వెన్నెలపదములు,వాలేశుపదములు మున్నగునవి పేర్కొని యుండుటయు, బసవపురాణమును 'అతత బసవపురాతనభక్తి గీతార్థసమితయే మాతృకగాగ' రచించితినని చెప్పుటయు,నిందుకు నిదర్శనము. శివకవులు పాడుట కనుకూలమైన గద్యలు, రగడలు, వచనములు కొన్ని రచించియుండుట నిజమే గాని యవి మతప్రచార ప్రధానములే గాని రసప్రధానములు గావు. కాగా మనకిప్పుడు లభించుచున్న రసవద్గేయసముదాయమున తాళ్లపాక

అన్నమాచార్యులు రచించిన సంకీర్తనలే యాద్యములని చెప్పదగియున్నవి. అతడధ్యాత్మశృంగారకీర్తనలు పెక్కువేలు రచించుటయేగాక సంస్కృతమున 'సంకీర్తన లక్షణము' అను పేర నొక లక్షణగ్రంథమును కూడ వెలయించి యాజాతి వాఙ్మయమున కొక స్థిరత్వము చేకూర్చెను.'[8] అన్నమాచార్యుడు సంకీర్తన లక్షణమును నిట్లు నిర్ణయించెను –

పదముల యర్థము పల్లవి
వదలక యన్నిటికి నేకవాక్యత సేయన్
గుదిగ్రుచ్చినట్లు తగురై
పదముతుదిన్ మరియు మరియు పల్లవి యలరున్

పల్లవి యందు భావమునే అనుపల్లవి కొంచెముగా విశేషించినది. అనుపల్లవి లేకపోవుట గూడ గలదు. చరణములు మూడిటికెక్కువగా గూడ వుండవచ్చును. ఎన్నియైనను పల్లవి భావమును పోషించి పల్లవితోనే ముగియుట వాటిపని'.[9]

దక్షిణాంధ్రయుగము,పదవాఙ్మయమునకు స్వర్ణయుగమని చెప్పదగినట్టిది. అసంఖ్యాకములైన పదములు కృతులు రచించి, యొకవంక సాహిత్యమునకును వేరొకవంక సంగీతమునకు నపారగౌరవప్రతిష్టలు కలిగించిన క్షేత్రయ్య, త్యాగయ్యలు ఈ యుగమున నవతరించుటయే యిందుకు కారణము. మరియు నాకాలమున తండోపతండములుగ వెలసిన యక్షగానములలో తత్కర్తలు పద్యములకంటె పదములకే ఎక్కువ ప్రాధాన్యమొసంగి యుండిరి. త్యాగయ్య కృతులు కేవలము శ్రవ్యములైనవి. క్షేత్రయ పదములట్లుగాక యభినయాను కూలము లగుటచే దృశ్యతాగౌరవమును గూడ పొందినట్టివి. సంగీతము సాహిత్యము అభినయమను మూడు కళలకును కూడలియైన త్రివేణీసంగమ మాతని పదసముదాయము.[10]

శ్రీరాములు గారి పదములును అభినయానుకూలములై యున్నవి. మనోజ్ఞ పదరచన వర్ణనావైదగ్ధ్యము, దృశ్యసాక్షాత్కారశక్తియు కలిగి మానవ మనఃప్రవృత్తుల చిత్రీకరించుచు చక్కని వర్ణనతో మనోజ్ఞమైన భావచిత్రాలను బొమ్మ కట్టించుచు సున్నితమైన భావప్రకటనాచణత్వము కలిగియున్నవి.

ఆనాడు నట్టువనార్లు, కళావంతులు రెండువిధముల నాట్యము చేస్తూ వుండేవారు. ఒకటి భరతనాట్యమని, రెండవది కర్ణాటకాభినయమని వ్యవహరించే వారు. ఈ రెండవపద్ధతి నాట్యానికే పదములను, జావళీలను నుపయోగించేవారు. దాసు శ్రీరాములుగారి జావళీలలో ఆ విధముగా కర్ణాటకాభినయానికి ఉపయోగించేవాటిని మూడింటిని ఉదాహరించెదనని శ్రీరజనీకాంతరావు గారు ఈ క్రింది మూడింటిని యుదాహరించిరి.[11]

1. (మోహనరాగం) కల్యాణిరాగము - ఆటతాళము
   తత్తరపడనేల తాళు తాళుర సామి
   అత్తింటి కోడలరా -
   కొత్తగానె వచ్చి కొన్ని నెలలాయెరా

2. ముఖారి రాగం ( ఖండితనాయిక)

   అడవి ముష్టికాయ అది నీకు ప్రియమాయె -
   అయ్యో నేనేమందురా

3. ఆనందభైరవి (ప్రోషితభర్తృకయైన నాయిక)
   వనితరో యీ వన్నెలేలనే - యీవేళ నాకు

అ.ప. ఆకులేల పోకలేల ఆగరేల గంధమేల
   మగనికి దయలేక యేను సగమైయున్నట్టివేళ

స్వాధీనపతిక, వాసవసజ్జిక, విరహోత్కంఠిత,విప్రలబ్ధ,ఖండిత, కలహాంతరిత, ప్రోషితపతిక,అభిసారిక,అను అష్టవిధనాయికలు స్వీయ, పరకీయ, సామాన్య అను త్రివిధములగు నాయికలు గలరు. స్వీయలో ముగ్ధ, మధ్య, ప్రగల్భ అని మూడు విధములు.

ముగ్ధలలో అజ్ఞాతయౌవన, జ్ఞాతయౌవన, నవోఢ,విప్రలబ్ధ,నవోఢ యని అంతఃభేదములు కలవు.

మధ్యాభేదములు - ధీర, అధీర, ధీరాధీర,జ్యేష్ట, కనిష్ట.

సామాన్యలో ఉత్తమ,మధ్యమ,అధమ యని మూడువిధములు. ఈ పై జెప్పిన నాయికలను ఈ పదములందు దర్శింపవచ్చును.

ఈనాడు వ్యాప్తిలో నున్న ఈ పదములు నాట్యమున కెట్లనుకూలించు చున్నవో చూడనగును.

## 1. కల్యాణిరాగము - ఆటతాళము

నాయిక పరకీయ, ప్రౌఢ లక్షిత, అయోగ,విప్రలంభశృంగారము. నాయకుడు పపతి, సంచారులు దైన్యము,త్రాసము,మోహము, విషాదము, శంక, చింత, హర్షము, స్మృతి, విభేధము, ఆలస్యము, వితర్కము, అమర్షము, గ్లాని, శ్రమ, ఔత్సుక్యము, చక్షుఃప్రీతి, అసూయ, ధృతి దోషము.

తత్తరపడనేల తాళు తాళుర సామి అత్తింటి కోడలరా

*(అయోగ విప్రలంభము, దైన్యము, త్రాసము, ధృతి, దైన్యము)*

కొత్తగా నేవచ్చి కొన్ని నాళ్లాయెరా పొత్తు గడియమరచి

*(దైన్యము, ఆలస్యము, వితర్కము, మోహము)*

పోరు మావారు చిత్తమున నేరమెంచకురా చీకటివేళకాదురా

*(విషాదము, దోషము, వితర్కము, మోహము, దైన్యము)*

అత్తగారింటలేకున్నపుడైన రావైతివిరా సామి

*(త్రాసము, మోహము, దైన్యము, ధృతి)*

మక్కువ చెక్కిలినొక్క రాకురా సామీ నొక్కు లెక్కడ దాతురా

*(మోహము, ఉగ్రత, మోహము, శంక, వితర్కము)*

అక్కడ నున్నది యదిగో యాడబిడ్డ - యిక్కథలెరిగిన

*(త్రాసము, అవహిత్థ, అసూయ, వితర్కము)*

నెగిరిపైబడు సామి - నిక్కముగ నీకే దక్కితిరా నేటి

*(ఉగ్రత, ధృతి, ఔత్సుక్యము)*

మాపటికిరా పోరా - పక్కని పంచాదిగది వెలపటి

*(అమర్షము, వితర్కము, ధృతి)*

తలుపు మూయకుంచెదరా ।తత్తర।

*(ఔత్సుక్యము, ధృతి )*

రమింపవచ్చిన నాయకుని సమయభేదము వలన కూడేటందుకు లేనందున ఉపపతిని సముదాయించి నందు నన్ను అత్తగారింటివద్ద యున్నందునను ఆడబడుచు ఆగడము చేయుననియును, మిక్కిలి తాపము చేత కూడదని రాత్రికి పడమటి కిటికిదారిని తన లోగిటికి రమ్మనుటచే నాయిక లక్షిత. లక్షిత యన కొంతవరకు బయల్పడిన తప్పిదము గలది.

'శ్వశ్రూరత్ర నిమజ్జతి అత్రాహం దివసకం ప్రలోకయ' అన్న అర్థవ్యంజన లక్ష్యశ్లోకమునకు అనుసరణము. ఇది కవియొక్క అలంకారిక శాస్త్రపాటవమును అభినయకౌశలమును వ్యక్తము చేయుచున్నది. సంగీతము, సాహిత్యము, అభినయము అను మూడుకళలకును కూడలి యైన త్రివేణి సంగమము వీరి పదసముదాయము అన్న వాక్యమిచ్చుట నిరూపితమైనది.

**14. ఆనందభైరవి - రూపకతాళము**

నాయిక - స్వీయ- ప్రౌఢ - వాసవసజ్జిక - నాయకుడు దక్షిణుడు. విరహవిప్రలంభ శృంగార, కరుణరసములు సంచారులు. చింత, శంక, విషాదము, వితర్కము, నిర్వేదము, స్మృతి, శ్రమ, అమర్షము, ఔత్సుక్యము, హర్షము, మతి, దైన్యము, నిశ్వాసము.

వనితరో యీ వన్నెలేలనే - యీవేళ నాకు వనితరో యీ
*(ఔత్సుక్యము, చింత, నిర్వేదము, విషాదము.)*
వన్నెలేలనే *(వితర్కము.)*
తనువేల తరుణులేలా ధనమేలా ధామమేలా
*(చింత, వితర్కము)*

1. ఆకులేల పోకలేలా - అన్నమేలా పానమేలా
*(చింత, దైన్యము, ఆమర్షము, ఔత్సుకము)*
రాకయుండి ఆశలుడిగియున్న వేళ
*(చింత, నిర్వేదము)*

2. సొగసేలా సొమ్ములేలా అగరేలా గంధమేలా
*(చింత, వితర్కము, విబోధము)*
మగనికి దయలేక మేను సగమైయున్నటివేళ ।వనిత।

3. భాసురాంగి తోటలేలా పాటలేలా ఆటలేలా
*(దైన్యము, వితర్కము, నిర్వేదము)*
దాసురామ పాలుబాసి ఆసలుడిగియున్నవేళ ।వనిత।
*(హర్షము, గ్లాని, దైన్యము, నిర్వేదము )*

ఇట్టిదే సామాన్య నాయిక వర్ణన. సామాన్య యని చెప్పుటకు గల కారణములు స్వీయమైన రాయబారమావశ్యకము కాదు. అనాదినుండి సామాన్యగానే యభినయింపబడుచున్నది. పరకీయలైన రహస్య గోపనము లేదు. పరిశేషన్యాయము ననుసరించి యీామె సామాన్య.

మొత్తము ఇరువదియైదు పదములలోను పదునలుగురు నాయికలు స్వీయలు, నలుగురు పరకీయులు, ఏడుగురు సామాన్య నాయికలు వర్ణింపబడిరి. కల్యాణి, ముఖారి, దర్బారు, హిందూస్థానీ, కాఫీ, ద్విజావంతి, యదుకులకాంభోజి, కాఫీ, అసావేరి, బేగడ, బేహాగ్, అఠాణ, జంఝూటి, శుద్ధకాంభోజి, తోడి, ఆనందభైరవి, శంకరాభారణము, రాగములతో నీపదముల రచించిరి. తాళవైవిధ్యము కూడ ప్రదర్శించిరి. ఆట, త్రిపుట, రూపక, ఏక, జంపె, ఆదితాళములు గలవు. క్షేత్రయ పదములలో త్రిపుట తాళమున రచితములైనవి ఎక్కువగా నున్నవి.

ఈ పదములందలి భాష పాత్రోచితమైన శిష్టజనవ్యవహారసిద్ధమైన భాష. భావములు స్వభావసిద్ధములు. స్వభావసిద్ధమైన భావమునకు తగినభాష, భాషకు తగిన భావము చక్కగ వ్యక్తమైనవి. క్షేత్రయ తన పదములను మువ్వగోపాల పరముగ చెప్పెను. సారంగపాణి కార్వేటినగర వేణుగోపాలుని పరముగ చెప్పెను. శ్రీరాములుగారు తోట్లవల్లూరు వేణుగోపాలుని పరముగ చెప్పిరి. మూడింట నాయకు డొక్కడే – దక్షిణుడు. ఏ నాయకుడు వచ్చినను అతడు దక్షిణ నాయకుడే.[12] ఇతడు కవుల పాలిటి కల్పతరువు. ఇందు వివిధములైన నాయికలను వర్ణించిరి. ఉన్నవి ముచ్చటగ ముప్పదికి మించకపోయినను వైవిధ్యమును జక్కగ ప్రదర్శించిరి. వీరు ఆనాటి వేశ్యలకు ఈ పదములను అభినయముబట్టి చూపెడివారట. ఇవన్నియు అభినయానుకూలముగ నున్నవి. రాగం, తాళం, శబ్దం మూడును సమపాళ్లలో ఇందు రంగరించి రసమనోజ్ఞమైన ఖండములుగ సృష్టించిరి.

భావం అనుస్యూతముగ పూసలలోని దారమువలె ఎడతెగకుండ అంతర్లీనమై రసస్ఫూర్తికుపస్కారమై పదమనోజ్ఞత్వమునకు దోహదము చేయుచున్నది.[13] 'ఇది క్షేత్రయ పదంలోని మహాత్యం'. ఆ ఒరవడి క్రిందనే రచింపబడిన ఈ పదములలోని భావములు గూడ మధుర మంజులముగ నున్నవి. క్షేత్రయ పదములలోని సామాన్యలక్షణము పల్లవి అనుపల్లవి మూడుచరణాలలో మనోజ్ఞ ముగ నుండును. ఇట్టివి శ్రీరాములు గారి పదములు గూడ.

కట్టివైతువా పడకింటిలో వానిబట్టి పైటకొంగున
ఇట్టివాడు వంటియింటి కుందేలాయె
యెక్కడబోయె ననుకోరాదమ్మా ၊ కట్టి ၊

1. విడిచితి నాసామి – వీథి తిరిగి వేగత్తెల గూడునే
తడబాటు లేక చేతను జిక్కినప్పుడే చెడనీక
పదిలము చేసుకొనవలెనమ్మా ၊ కట్టి ၊

2. ఏమరి నేనూరకుంటినా యీ రాత్రి యేవేళ
కేబుద్ధియో – కోమలముగ నింత గోవకొన్నవాడు
వామాక్షి మనువాడ నమ్మరాదమ్మా ၊ కట్టి ၊

3. మోసపోతి వేణుగోపాలదేవుని బాస నిజముగాదె
దాసు శ్రీరామదాసుని హృదయము –
బాసి గడియయైన నిలువ నొల్లదమ్మా ၊ కట్టి ၊ 2–12

ఇందు నాయికని ధృష్టుడగు నాయకుడు వేణుగోపాలుడు అన్యనాయికా లోలుడగుటచే నాయకు నేవిధముగ పదిలము చేసికొనినదో వ్యక్తమైనది. ఈ పదములన్నియు మధురభక్తి సంభరితములు. శ్రీ వేణుగోపాలుని చేరుటకు నాయికలు పడు తహతహయు యావేదనయు ఇందు గలదు.

'ఆడుదానరా దోసము కాపాడురా పరిహాసము నినుగూడని
నా వేసము మాటాడనైన గూడదటరా' 1–4
'వలవల కన్నీరు వరదలై పారగా – తలవ్రాసెగా దైవము
అలరు తేనియ విసమైన గ్రోలెద' 1–15

'నోటమాటనైన నోచుకోనైతినా' (1–6), 'హరి హరి హరి నిద్రాహారము లెరుగక దరిలేని విరహసాగరమున నీదుచు' (1–11) హా యేమిచేతునని ఈ నాయికలు ఆ వేణుగోపాలుని దర్శనమునకు, పొందునకు పడు ఆవేదనలో కరుణరసము వ్యంజితమై హృదయము ద్రవింపజేయును.

ఇందు జీవాత్మ పరమాత్మ సంబంధము చెప్పబడినవి. ఆ వేణుగోపాలుడు సాకారముగ నచటలేడు. కావున నా వేణుగోపాలుడు పరబ్రహ్మము. జీవాత్మలైన త్రివిధనాయికలు పరమాత్మ సంయోగమునకై వారి ప్రయత్నము మూలాధారము నుండి సహస్రారము వరకు పయనించి సుషుమ్న యందు బయల్వెడలు జ్వాలయందు పరబ్రహ్మ స్వరూపమును దర్శించవలెననెడి తహతహ వారిలో కనబడును. జీవాత్మ పరమాత్మల సంయోగముననే బ్రహ్మజ్ఞానము సాక్షాత్కర మగును. సుషుమ్నాంతర్దృష్టి మరలించిన బాహ్యలక్ష్యంబు గైకొని ముంగిటనున్న వానిపై మనస్సు పరుగిడి విషయవాంఛలకు లోనగును. కావుననే 'పదిలము చేసుకోవలెనమ్మా' (2–12) యని చెప్పుచున్నది. నాయికా వేణుగోపాలుర సంబంధము రజ్జుసర్పభ్రాంతి వంటిది. ఇది సర్పమే యనిన మోహము, ఇది త్రాడెయన్న మోక్షము, ఆమె నాయిక యన్నపుడు మోహము, జీవాత్మయని తలంచినపుడు మోక్షము కలుగును. ఇదియే మధురభక్తి.

ఏ రచనకైనను అలంకారములు నిండుతనమును చేకూర్చును. అట్టివి కొన్ని ఉపమానములు –

| | |
|---|---|
| 'అడవి ముషిణికాయ అది నీకు ప్రియమాయెనే' | 1–2 |
| 'ఇంతి మంతనములు ఎండమావుల నీళ్ళు' | 1–2 |
| 'అందరాని పండు కాసపడినట్లు' | 1–13 |
| 'నీ వలపుమిద్దిపై నిడుపరుగు మీసాలపై తేనె' | 1–15 |
| 'ఇట్టివాడు వంటయింటి కుందేలాయె' | 2–12 |
| 'పంజరమున చిలుక పగిది' | 2–16 |
| 'మొగలిపూవు చిదుమ మల్లా కంటినట్లు' | 2–16 |
| 'మా చెలిమి కాకియు గోవెల చందమాయె' | 2–19 |

ఈ పదములందు శృంగారరస పరమావధిని చూపుటయే గాక చక్కని చిక్కని జాతీయములు గూడ గ్రుచ్చియెత్తిరి.

అరచేత వైకుంఠము జూపు(1-15), విసము చక్కెరచేసి విడచుట (1-7), మసిబూసి మారేడుకాయ జేయుట (2-19), ముంజేతి కంకణమున కద్దమేల (జావళి -1-11), చల్లకు వచ్చి ముంతదాచనేల (2-12).

కొన్ని తెలుగు పలుకుబడులు – సంతమెరుగులాడి, తంతరగొట్టుది, చేతిసంచి వెచ్చము, కాసుజేయదు, వట్టికట్టు గారడి (1-2), తిరుమంత్రములగుట (1-3), తలవ్రాసెగా దైవము (1-5), తలతడిపి బాసలుచేయు (1-7), పోటాపోటీలు (1-7), గీర్వాణము (1-9), కపర కపర చీకటి (1-16), ఆకాశపుష్పము (1-15), గయ్యాళి (జా.-1-1) ఈ పదములను వీరు జానుతెనుగున వ్రాసిరి. జాను తెనుగు నెవ్వరేయర్థమున ప్రయోగించినను వీరు తెలుగునాట తెలుగు పలుకుబళ్లు యవి యన్యదేశీయములైనను వానినిగూడ గ్రహించిరి. హోషామాషీ, బహరి ఖాతాలు, వావారె వావారె, భేషు భేషు (1-7), బేజారు (1-3). ఇందు కొన్ని మనోహరమైన భావచిత్రములు గలవు. 'నాసామి నీకిది న్యాయమా' (1-13). అన్ని పదములలోని పరకీయమున వేణుగోపాలుని జూచినప్పటినుండి ఇంత యన్నము నిద్ర గూడ మాని యాపాటలాధరుని పటమున వ్రాసికొని మాటిమాటికీ తమినాటి చూచుకొనుచు కాటుక కనుల వెంట తీఱుగా జారు కన్నీట మీటిన విచ్చుగుబ్బలపై శాటి తడియున్న యది. ఇకేటి మాటలు - యామెను చూచిన యామె జాలిగాథ విన్నవారి మనసులు కరుణతో ద్రవించును. 'ముక్కుపచ్చులారని చిన్నదాన నన్నెక్కడ కంపెదరె' అన్న పదములోని ముగ్ధ నవోఢ యగు నాయకి మేజువాణి నాటి సిగ్గుల పెళ్ళికూతురు మన కన్నుల గట్టినట్లు సాక్షాత్కరించును.

ఈ పదములన్ని అభినయానుకూలములు. ఆనాటి వేశ్యలు వాటిని బాడి అభినయించేవారట. 'వనితరో యీ వన్నెలేల', 'తాళు తాళుర సామి' అన్న ఈ రెండు పదములును ఈనాడు సుప్రసిద్ధ నర్తకులైన శ్రీ జోశ్యుల సీతారామశాస్త్రి గారి శిష్యురాంద్రు సభలలో నభినయించుచున్నారు. ఈ పదములు ఆకాశవాణి

కేంద్రము నుండి గూడ ప్రసారమగుచుండును. సంగీత విద్వాంసులు పాటకచేరీల యందు పాడుచుందురు.

'వీరి సంగీతరచనలు కొన్నింటిలో పిఠాపుర వీణాచార్యులు శ్రీ తుమురాడ సంగమేశ్వరశాస్త్రిగారు, సహగేయకారులై స్వరవరుసలును కూర్చుతు ఉండినట్లు ద్వారం వెంకటస్వామినాయుడు గారు మాకు చెప్పినారు' అని శ్రీ రజని కాంతరావుగారు వారి వాగ్గేయకార చరిత్రలో వ్రాసిరి.[14]

పదముల తరువాత మొదటిభాగములో 13, రెండవభాగములో 9 జావళులు వ్రాసిరి.

**జావళి :** ఇది దరువు లక్షణమును, గ్రామ్యగానమును అనుసరించి యుంటుంది. సరళమైన వ్యావహారిక భాషలో సాగే శృంగారాత్మకమైన తేలికపాట. ధాతువు (పాటలోని సంగీతకూర్పు) మధ్యమకాలంలో చిందులు త్రొక్కుతు ఉంటుంది.[15] 'ఇది శృంగార రసముతో నాయిక నాయక లక్షణములతో గ్రామ్యభాషతో నిమిడి యుండును. ఇది సాధారణముగ మధ్యమకాలముగ పాడదగినవై యుండును'. (రచన కర్తలు ధర్మపురి సుబ్బారావు మొదలగువారు.)[16]

రజనీకాంతరావు గారింకను నిట్లు చెప్పిరి. – 'పదవర్ణాలలోను, సర్వజతులలో నుండే స్వరకల్పన లయధాతువిన్యాసాన్ని వర్ణించి శృంగార రసాత్మకమైన సాహిత్యంలో మధ్యమకాలంలో స్పష్టమైన లయతో ఆనందముగా సాగి యుఋ్ఱూతలూగించే రచన జావళి ... లయాత్మకత వలన మధ్యమకాలం వలన జావళికి గూడ పదవర్ణ స్వరజతుల వలెనే భరత శాస్త్రానుగుణ్యంగా నాట్యం చేయడానికి భావం అభినయించడానికి ఎంతో అవకాశమున్నది. ధాతువును, మాతువును గూడ తేలిక రచనగా ఉంటుంది. కనుక సంప్రదాయక సంగీతంలో జావళి లలితసంగీత రీతిగా జనరంజకత పెంపొందింది. మొత్తానికి జావళి మహారాష్ట్రుల ప్రోత్సాహం వలన వారి యాస్థానంలో పెంపొందింది. తిరువాన్కూరు మహారాజు 'స్వాతితిరునాళ్' రచించిన జావళులే చారిత్రకంగ మొట్టమొదటి జావళియని చెప్పవచ్చును. అంతవరకు చౌకకాలంలో గానం చేస్తూ ఉండిన శృంగారాత్మకములైన పదాలనే మధ్యకాలంలో గానంచేసి జావళులు

అనిరా అని ఆవిధంగా జావళీ రచనా పరిణామము కలిగి ఉండవచ్చని కూడ తోస్తుంది”.[17]

స్వాతి తిరునాళ్ తరువాత జావళీకర్తలలో ప్రసిద్ధిపొందినవారు ధర్మపురి సుబ్బారావుగారు. ధర్మపురీశునికి అంకితంగాను, తిరుపతి నారాయణస్వామిగారు ఎన్నో జావళీలు చెప్పారు. కరూరి శివరామయ్య అనువారు ‘ఓ మైడియర్’ వంటి ఇంగ్లీషు మాటలు కూడ చేర్చి జావళీలు రచించారట. కరూరివారి తరువాత వారిలో జావళీలు రచించిన వాగ్గేయ కార విద్వాంసులలో పూచి అయ్యంగార్ అని ప్రసిద్ధి పొందిన రామ్నాడ్ శ్రీనివాసయ్యంగారు ఘనులు.

ఆంధ్రదేశములో ఉత్తరసర్కారులలో దాసు శ్రీరాములుగారు, గబ్బిట యజ్ఞనారాయణశాస్త్రి గారు కూడ జావళీలను వివిధ కీర్తనలను రచించి ప్రసిద్ధి పొందిరి.

దాసు శ్రీరాములుగారి జావళీలను కృష్ణా, గోదావరులలోని ఆనాటి నట్టువరాండ్రు దేవాలయాలలో నాట్యాభినయానికి ఉపయోగించే వారట. వీరు రచించిన జావళీలను హిందూస్థానీ కాఫీ, హిందూస్థాని భైరవి, జంఝూటి, శంకరాభరణము, కన్నడ, ఖమాసు, సావేరి, ఫరజు, సురటి, కమాచి, రాగములలో రచించిరి. వీనిలో యెనిమిదింటిని హిందూస్థానీ కాఫీ రాగమును రచించిరి. ఫరజు రాగమున మూడిటిని, జంఝూటి రాగమున రెంటిని, మిగిలిన రాగములలో నొకటొకటి రచించిరి. తాళ వైవిధ్యమును గూడ ప్రదర్శించిరి. మధ్య ఆది, చాపు, ఆట, ఏక, రూపక తాళములనుపయోగించిరి. ఏడు జావళీలకు ఆదితాళము, మరి యేడింటికి రూపకమును, ఐదింటికి చాపుతాళములను వ్రాసిరి. ఆట, మధ్య, ఏక తాళమున నొక్కొక్క జావళి గలదు.

ఈ జావళీల యందును మధురభక్తి యంతర్లీనముగ నున్నది. లయాత్మకత వలనను, మధ్యకాలము వలనను పదములవలె భరతశాస్త్రానుగుణ్యముగ నాట్యము చేయుటకును భావ మభినయించుటకును అనుకూలముగ నున్నవి.

జావళి మొదటిభాగము - 9

కానడరాగము - రూపకతాళము

నాయిక సామాన్య – ప్రౌఢ – మధ్యమ – విరహోత్కంఠిత – విప్రలంభ శృంగారము, సంచారులు – ఔత్సుక్యము – హర్షము, గర్వము – దైన్యము – ధృతి – విషాదము– వితర్కము – విశ్వాసము.

రమణిరో సముఖాన రాయబారమేటికే నిమిషమైన

(ఔత్సుక్యము, గర్వము, వితర్కము, దైన్యము)

తాళలేనే నేనే వాని రమ్మందునే ।రమణి।

(ఆలస్యము, ఔత్సుక్యము)

2. కోరివాని జేరి పన్నీరు పైజల్లినను వేరుసేయ మేరగాదు

*(ఔత్సుక్యము, ముదము, దైన్యము, వితర్కము)*

వేవేగరమ్మందునే *(ఔత్సుక్యము)*

3. భాసురాంగ వేణుగోపాలా యింత పంతమేల

*(ఔత్సుక్యము, హర్షము, వితర్కము)*

దాసురామకవి సన్నుతిజేసె నికరమ్మందువె

*(ఔత్సుక్యము, హర్షము, విశ్వాసము)*

రెండవభాగము – 15 వ పదము

ఆనందభైరవి – చాపు

నాయిక సామాన్య – పరోఢ – ఖండిత – నాయకుడు అనుకూలుడు. వియోగవిప్రలంభ శృంగారరసము – సంచారులు నిర్వేదము – ఔత్సుక్యము విషాదము– తాపము – వితర్కము – విబోధము – ముదము – ఈర్ష్య– అర్పరము.

వట్టుబెట్టెద నాచేయి బట్టరాకురా సామి ।వట్టు।

*(అమర్షము, ఔత్సుక్యము, దైన్యము, ఔత్సుక్యము)*

గట్టిగా పదివేల కరకువరాలు మూట గట్టి నాకట్టెదుట

*(వితర్కము, ఔత్సుక్యము)*

బెట్టి మాటాడ రారా (ఔత్సుక్యము) ।వట్టు।

1. గారాన నొకయమ్మ కని పెంచినబిడ్డ యూరకే
   *(ముదము, ఔత్సుక్యము, నిర్వేదము)*
   వచ్చునా తేర సరిగచీర ।వట్టు।
   *(వితర్కము, ఔత్సుక్యము)*

2. వలచివచ్చినవారు విలువ బెట్టకపోరు
   *(ముదము, విబోధము, నిర్వేదము)*
   అలరింతు తేరా మంచి ఆణిముత్యాలపేరు ।వట్టు।
   *(ఔత్సుక్యము, ఔత్సుక్యము)*

3. భాసుర వేణుగోపాల జేజేల మిన్న
   *(ఔత్సుక్యము, ఔత్సుక్యము)*
   దాసు శ్రీరామకవి దాని యేలకయున్న ।వట్టు।
   *(హర్షము, విషాదము, దైన్యము)*

**సర్వజతులు :** మధ్యమకాలంలో శృంగార రసావలంబియై సాగే ధాతువు పల్లవి, అనుపల్లవి, చరణాలు. అనుపల్లవికి చివర ముక్తాయిస్వరరూపమయిన ధాతువులో సగం పాటయును, సగం స్వరము, చిట్టచివర తధిగిణతోం అనే పాటయును చేర్చి పల్లవి ఎత్తుకోవాలి. సాహిత్యం కూడా ఉంటుంది. స్వర రూపమైన చరణపు మొదటి ఖండికను ఆ స్వరసాహిత్యము పాడుకొని క్రమంగా చరణము యొక్క మొదటిదీ, రెండవదీ, మూడవదీ, నాలుగవదీ, అయిన స్వర సాహిత్యాలను పాడి అప్పటికప్పటికి చరణపు మొదటి ఖండపు స్వరంలో వ్యాసం చేసుకొని తరువాత చరణపు తక్కిన ఖండికలను చౌకవర్ణానికి చెప్పినట్లే పాడవలెను. కొన్ని స్వరజతులు పాటసమూహమును గర్భమందుంచుకొని స్వరసందర్భ రూపమై సాహిత్యములతో ఉండుటలో ఆయా రాగమూర్ఛనలకు తగినట్లు ఆరోహణ క్రమమైన స్వరాలలో ఒక్కొక్కదాని కొక్కటి లేక రెండేసి స్వరసాహిత్యలను పెంచి రచించడము. అదేవిధంగా అవరోహణక్రమంగా రచించడము కూడ ఉన్నది. స్వరజతుల, మాతువులు దేవతాస్తుతిగా ఉండటమే గాక కొన్నిటికి ఆరంభంలో పల్లవి వంటి మాతుకల్పన కూడా కద్దు.[18]

క్రొత్త సంగీత విద్యాదర్పణమున నిట్లు చెప్పబడినది– 'స్వరజతి మధ్యమ కాలంగా శృంగారరసమైన మాతువులును, పల్లవి, అనుపల్లవి, చరణములను, అనుపల్లవికి చివర ముక్తాయి స్వరూపమైన ధాతువును అందు సగము పాటమును, సగము స్వరము, చివర తథిగిణతోం అనుపాఠమును జేర్చి పల్లవి యెత్తుకొను చున్నట్లుండవలెను. దీనికి సాహిత్యము పోకడ గూడ యన్ని యక్షరములుగ నుండును"– ప్రసిద్ధ రచన కర్తలు శ్యామశాస్త్రి, అదిఅప్ప, మొదలగువారు'.[19]

ఈ గ్రంథమున మూడు స్వరజతులు గలవు. ఒకటి కల్యాణి, రెండు బిళహరి, మూడు శంకరాభరణ రాగములలో రచింపబడినవి. అటు పిమ్మట తిల్లాన, సురటిరాగముతో రచింపబడినది కలదు.

**తిల్లాన :** అన్యదేశీయమైన తిరితిల్లాన నుండి తీయబడిన యొక విధమైన రచనకు 'తిల్లాన' యనిపేరు.[20] ఇది సాధారణముగ మధ్యమ కాలముగ నుండును. దీనిలోని సంగీతము మిక్కిలి సజీవముగను, వేగముగాను ఉండును. దీనికి పల్లవి అనుపల్లవి అను విభాగములుగ నుండును. దీనియందు గల మాతువు స్వరసాహిత్యయుతమగు జతులు గలదిగా నుండును. కొన్ని తిల్లానలకు చరణము కూడ కలిగియుండును. శ్రీరాములు గారిచే రచింపబడిన తిల్లానాకు చరణము లేవు.

తిల్లాన లక్షణము గూర్చి రజనిగారు ఒక్కమాటలో నిట్లు చెప్పిరి – 'అన్యదేశీయులైన తిరితిల్లానా అనే గ్రామ్య పాటములతో దేశీయరాగాలలో వర్ణక్రమంతో తాళబద్ధమై యుంటుంది. ఈ తిల్లాన స్వరజతులు గూడ అభినయాను కూలముగా నున్నవి'[21]. ఈ గ్రంథము మొదటి భాగాంతమున సురటరాగమున ఆదితాళముతో, 'నా మనోరథము చూరగొన్న విన్నాణపు దొంగకు మంగళం' అని మంగళముతో ముగించిరి. అట్లే ద్వితీయ భాగము చివర శ్రీరాగములో ఆదితాళముతో 'నవ్వు మొగముతో నన్ను జూచిన నా ముద్దుసామికి మంగళం' అని మంగళముతో ముగించిరి.

అభినయము చేయువారు, క్రొత్తవి యభినయించ ఔత్సుక్యము కలవారికి అనువుగా నీపదములు, జావళీలు, స్వరజతులు గలవు. ఈ గ్రంథము శ్రీరాములు గారికి ఆద్యతన పదరచయితగ నొక విశిష్టస్థానమును చేకూర్చినది.

అన్ని శాస్త్రములు క్షుణ్ణముగ దర్శించిన మహానుభావులు శ్రీ శ్రీరాములు గారు. అన్ని శాస్త్రముల సంగమము ఒకరిలో కూడుట భగవంతుని చిద్విలాసము.

## అధోజ్ఞాపికలు

1. క్రొత్త సంగీత విద్యాదర్పణము - శ్రీ ఏకా సుబ్బారావుగారు - ది ఓరియంటల్ పవర్ ప్రెస్, తెనాలి, 1944. పు. 499
2. ఆంధ్రవాగ్గేయకారచరిత్రము - శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు గారు - విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ, 1956, పుట. 75
3. - డిటో - పు. 76
4. ఆంధ్రవాగ్గేయకారచరిత్రము, పు. 82
5. క్రొత్త సంగీత విద్యాదర్పణము, పు.450
6. క్షేత్రయ్య పదసాహిత్యము, పు.80
7. సాహిత్యోపన్యాములు - క్షేత్రయ్య పదసాహిత్యము, పు.12.
8. సాహిత్యోపన్యాసములు - క్షేత్రయ్య పదసాహిత్యము, పు.25.
9. - పైది - పు.17
10. క్షేత్రయ - శృంగారము డా॥ దివాకర్ల వేంకటావధాని గారు,పు.25.
11. ఆంధ్రవాగ్గేయకార చరిత్రము, పు. 487
12. సారంగపాణి పదములు - (ప్రాచీన గ్రంథావళి, సరస్వతి పవర్ ప్రెస్ తెనాలి, పు.22)
13. క్షేత్రయ పదసాహిత్యం, పు.90
14. ఆంధ్ర వాగ్గేయకార చరిత్ర, పు.487
15. పైది పు. 77
16. కొత్త్ర సంగీత విద్యాదర్పణం పు.450.
17. ఆంధ్రవాగ్గేయకార చరిత్ర, పు॥లు 43,44.
18. ఆంధ్ర వాగ్గేయకార చరిత్ర, పు॥లు 76,77.
19. క్రొత్త సంగీత విద్యాదర్పణము, పు.449.
20. పైది. పు.450.
21. ఆంధ్రవాగ్గేయకారచరిత్ర, పు.77)

## (ii) లక్షణావిలాసము

'కవితాప్రక్రియలలో యక్షగాన మొకటి. ఆంధ్రతాముద్రను భద్రపరచిన మన దేశసాహిత్యప్రక్రియల కెల్లఁదలమానికము యక్షగానము'.[1] ఈ యక్షగానములు ఆంధ్రదేశమున 12వ శతాబ్ది నాటికి కలవని పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రము వలన దెలియుచున్నది.

" ... కదు నద్భుతంబుగ కంభసూత్రంబు లదరంగ బొమ్మల నాడించువారు. ఆదటగంధర్వ యక్ష విద్యాధరులై పాత్రలనాడించువారు", అని వర్ణించారు. అటుతరువాత శ్రీనాథుడు దీనిని గురించి ప్రస్తావించెను.

కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు
గాంధర్వమున యక్షగాన సరణి. భీ.ఖం. 3-65

అని శ్రీనాథుడు భీమఖండమున యక్షగానప్రశంస నెరపెను. 1420 ప్రాంతమున ద్రాక్షారామ ప్రాంతమున నిది ప్రచారములో నున్నట్లు దెలియుచున్నది. క్రీడాభిరామమున జక్కులపురంధ్రి ప్రదర్శనమును వర్ణించెను. ఏకపాత్రకములైన జక్కులవారి ప్రదర్శనలను కొరపంజులలోని పద్ధతులను కలుపుకొని యుదాత్తములైన యితివృత్తములతో నృత్యనాటకములుగ ఈ యక్షగానములు క్రమముగా రూపొంది దేవుని సన్నిధిలో ప్రదర్శింపబడుచు రాజాదరణ పొందినవి.

దీని లక్షణములను అప్పకవి, చిత్రకవి పెద్దన, తాళ్ళపాక అన్నమాచార్యులు మొదలగు లాక్షణికులు నిర్వచించిరి. ఆచార్య యస్.వి.జోగారావు గారు సాహిత్యప్రక్రియగ యక్షగానము నిట్లు నిర్వచించియుండిరి. 'యక్షగానమందితివృత్తమెట్టిదైన గావచ్చును. రచనా ప్రక్రియ శ్రవ్యముగాని, దృశ్యముగాని కావచ్చును. ఏ ప్రక్రియ యందైన గీతి ధర్మము విహితము. అందు రాగ తాళములలో నొకదానికి గాని, రెండింటికి గాని, తగు ప్రాధాన్యము గల రచనా విశేషములు (రేకు, దరువు, పదము, కీర్తన మొదలగునవి), ద్విపద (మంజరియును) పద్యములుఁ, జాత్యుపజాతివృత్తములు, అర్థపద్యములు, సంస్కృత శ్లోకములును, వచనము నందే ప్రయోజనాత్మకము గాని, సంవాదాత్మకము గాని, వర్ణనాత్మకమైననుగాఁదగును. చూర్ణికలు, విన్నపములు,

మొదలగు గద్య ప్రభేదములు నుండఁదగును. ఏలాది గీత ప్రబంధవిశేషముల ప్రయోగ మైచ్ఛికము.' [2]

ఈ యక్షగానములు సర్వోపభోగ్యములైన సమాహారకళాస్వరూపములనియు, వివిధ ప్రక్రియానుబంధము అనియు, బహువిధ పదకవితా ప్రభేదసమీకరణము లనియు, వస్తువైవిధ్యశోభితము లనియు, ఛందో వైవిధ్యమునకు భాషా వైవిధ్యమునకు లోక వృత్తప్రదర్శనమునకును నాకరములని ఆచార్య యస్.వి. జోగారావుగారు నుడివిరి. ఇంతటి వైశిష్ట్యము కలవి కావుననే దక్షిణాంధ్రరాజులు వీనిపై మిక్కిలి మక్కువ జూపిరి. రఘునాథనాయకుడు, విజయరాఘవనాయకుడు మొదలగు తంజావూరు నాయకరాజులు, స్వయముగా వారి స్వర్ణలేఖినిని బూని యనేక యక్షగానములను వ్రాసిరి. వారి స్వర్ణలేఖిని చిరుగజ్జెల సవ్వడులు, మహారాష్ట్ర రాజులకొలువు కూటము నందును, దందడించినవి. శాహాజీ, ఏకోజీ మొదలగు మహారాష్ట్రరాజులా స్వర్ణలేఖిని నందిబుచ్చుకొని వారును ననేక యక్షగానములు వ్రాసిరి.

రాజాశ్రయము లభించిన యీ ప్రక్రియకు రాజభోగము లన్నియు సమకూరినవి. 'యథారాజా, తథాప్రజా' అటుతరువాత పదములట్టి యభినయము చేయనేర్చినవారును అదేచేతితో కలముపట్టి కవిత్వము వ్రాయగల సమర్థులైన కవులందరు యక్షగానములు వ్రాసిరి. శ్రీదాసు శ్రీరామకవి గారి కవితామహా ప్రస్థానమున కిది తొలిమెట్టు. పదునాలుగవయేట 'సోమలింగ శతకమును', అశువుగ అయాచితముగ చెప్పిన తరువాత వీరు వ్రాసిన మొదటి గ్రంథము 'సాత్రాజితీ విలాసమ'ను యక్షగానము. దీనిని వీరి పదునాలుగవ యేట యనగా 1860లో వ్రాసినట్లు కవి దేవీభాగవతాదిని నుడివి యుండిరి. శ్రీ విష్ణురావుగారు వ్రాసిన శ్రీరాములు గారి జీవితచరిత్ర గూడ ఈవిషయమును స్పష్టము చేయుచున్నది. ఆచార్య శ్రీ యస్.వి. జోగారావుగారు ఆంధ్ర యక్షగాన వాఙ్మయచరిత్ర రెండవ భాగములో నిట్లు వ్రాసిరి - ("112 ఉప్పలూరి కనకయ్య - దాసు శ్రీరాములు-21").

ఈ జంటకవుల రచన 'సాత్రాజితీ విలాసమ'ను భామాకలాపము. 1873వ సం॥న వ్రాయబడిన దీని కాగితపు ప్రతియొకటి ఆ కవుల సన్నిహితజ్ఞాతులలో నొకరగు శ్రీ బందా కనకయ్య గారి కడ (వీరు నాడు గుడివాడలో వకీలు

వృత్తియం దుండిరి) దయతో నాకాప్రతిఁ జూడ నొసంగిన వారికిఁ గృతజ్ఞుడను. వీరిరువురు 19వ శతాబ్ది ఉత్తరభాగమున నుండినవారు. ఇరువురు సన్నిహిత జ్ఞాతులు. ఇందు శ్రీరాములుగారు సుప్రసిద్ధులు. దేవీభాగవతాది బహుగ్రంథ కర్త. వీరి తండ్రి కన్నయ్య మంత్రి. అల్లూరి (బందరు తాలూకా) కరణము. శ్రీ మధునాపంతులవారి ఆంధ్ర రచయితలలో వీరి చరితము జూడనగును. కనకయ్యగారి తండ్రి మల్లయ మంత్రి. ఈ కవుల భామాకలాప రచన కూచిపూడి భామా కలాపబాణిలో నున్నది. రచన మిక్కిలి ప్రౌఢమును సరసములైనది. కాని యలసములైన హాస్యప్రసంగములు కొన్ని కావ్యౌచితిని దిగనార్చుచున్నవి."[3]

శ్రీరాములుగారు 'సంవరణోపాఖ్యానమను' గ్రంథమును, 'లక్షణా విలాసమ'ను నొక యక్షగానరూపకమును రచించిరి, అని శ్రీ విష్ణురావుగారు దాసు శ్రీరాములుగా రి జీవితచరిత్రలో వ్రాసిరి. ఈ యక్షగానమందలి యొక చాకలి వర్ణనము గూర్చిన సీసపద్యభాగమును వారికి జ్ఞప్తి యున్నదని వ్రాసిరి.

...... నోయి పల్లకీల్మోయగా
కాయలెక్కిన బుజాల్గలుగువాడు
వేనవేల్మేనాలు మోయగా మోయగా
చట్టువెక్కిన యరచేతివాడు
.... డంబుమీరిన పిల్లిగడ్డంబువాడు[4]

1875వ సం॥మున వీరు డోకిపర్రు గ్రామమునకు శ్రీపోలవరపు గంగయ్యగారు, హనుమయ్యగారల ఆహ్వానముపై విచ్చేసి యట నొక పాఠశాలను నెలకొల్పిరి. అచట నున్నపుడే 1876 లో లక్షణావిలాసమును రచించిరి. ఇది ఆ గ్రామ దైవమైన శ్రీ మదనగోపాలస్వామి పరముగ రచింపబడినవి. గ్రంథాదిని శ్రీపోలవరపు హనుమన్నగారి (వీరి) పూర్వుల వంశమును వ్రాసిరి. హనుమన్న గారి గుణగణముల గూర్చి మిక్కిలిగ కొనియాడిరి. వారి వంశస్థులైన శ్రీపోల వరపు నరసింహారావుగారి వద్ద 'ఈలక్షణావిలాస' ప్రతి నాకు లభించినది. నాకు లభించిన ప్రతి శ్రీదాసు శ్రీరాములు గారి స్వదస్తూరి కాదు. దానిని మరియొకరు చూచుకొని వ్రాసియున్నటు వంటి ప్రతి. దాని ముఖపత్రముపై 'శిథిలములు పూరింపబడినవని' వ్రాయబడియున్నది. అట్లే ఆచార్య యస్.వి.

జోగారావుగారు చూచిన 'సాత్రాజితీ విలాసము' 1873లో కనకయ్యగారు గాని, వారి బంధువులు గాని అసలు ప్రతిని చూచుకొని వ్రాసికొనినదియై యుండవచ్చును. కాని యీ యక్షగానము మాత్రము 1860 లో రచింపబడినదని స్పష్టముగా చెప్పనేచెప్పిరి. ఇపుడా సాత్రాజితీవిలాసము అలభ్యము. శ్రీబందా కనకయ్యగారి కుటుంబము హైదరాబాదుకు తిరిగి నివాసమును మార్చిరి. ఆ సందర్భమున దానిని పోగొట్టుకొనినట్లు వారి కుమారులు శ్రీ శ్యామలరావుగారు చెప్పిరి. ఈ లక్షణావిలాసమును ఆచార్య యస్.వి.జోగారావుగారు సాత్రాజితీ విలాసమును గూర్చి వచించినట్లు ఇదియును కూచిపూడి వారి భామాకలాపపు బాణీలోనే రచింపబడినది. రచన మిక్కిలి ప్రౌఢము సరసము నైనది. అసభ్యముల యిన హాస్యప్రసంగములు కలవు. శ్రీవిష్ణురావుగారు వ్రాసిన పల్లకీ బోయీల వర్ణన గల పద్యమిందులేదు. అది శిథిలభాగములలో పోయి వుండవచ్చును. ఇది దృశ్యకావ్యము. ఆనాడు వేశ్యలచే ప్రదర్శింప బడుచున్న సిద్ధేంద్రస్వామి వారి భామాకలాపములచే ప్రభావితులై వీరును అదే బాణీలో నీయక్షగానమును వ్రాసియుందురు.

సహజసరససన్నివేశబంధురమై యుండుటచే నీ యితివృత్తమును నిమిడ్చిరి. యిందలి యితివృత్తము పౌరణీకమైనది. నాయకుడు డోకిపుర మదనగోపాలుడు. నాయిక లక్షణ. శ్రీకృష్ణుడు మద్రరాజు పుత్రియైన లక్షణను పణముగా బెట్టిన మత్స్యయంత్రమును ఛేదించి పరిణయమాడును. తరువాత ప్రణయకలహముచే శ్రీకృష్ణుని దూరము చేసికొని విరహవేదనను భరింపలేక చెలికత్తె శుకవాణికి లేఖ వ్రాసి యిచ్చి రాయబారమంపును. అవి నిష్ఫలమగుటచే చివరకు తానే బయలుదేరి శ్రీకృష్ణుని వద్దకు వచ్చును. అచ్చట వారిద్దరికిని సంవాదము జరుగును. చివరకు లక్షణ అభిమాన ముడిగి శ్రీకృష్ణునకు మ్రొక్కును. శ్రీకృష్ణుడామెను పరిగ్రహించుటతో మంగళంతముగా యక్షగానము ముగియును.

డోకిపుర గోపబాలు నస్తోక కృపను
కన్నయామాత్య కామాంబికా తనూజుడు
దాసు రామాభిదాన విద్వద్వరేణ్య
డీకృతియొనర్చె లోకోపకృతిని గోరి

అని పల్లవి వ్రాసి మంగళారంభ సూచకమైన శ్రీకారము నిలిపి సీసముతో ప్రారంభించెను. మంగళాదిని మంగళమధ్యాని మంగళాంతాని యని కావ్యలక్షణము ననుసరించి 'నారాయణ' స్తుతితో నిట్లు ప్రారంభించిరి.

శ్రీ మదఖండ లక్ష్మిని నిల్పె నెవ్వాడు
  ఔమ్మునం దక్షిద్వయింబునందు
బ్రాహ్మణోదయలీల బరగించె నెవ్వాడు
  మోమునందును బొడ్డుగీమునందు
...... ........... ...............

తదుపరి కమ్మవారిపై నొక సీసపద్యమును కమ్మగ జెప్పి, శ్రీ పోలరపు హనుమన్నగారి పూర్వికుడైన వెంకటరామాఖ్యునితో ప్రారంభించి వారి వంశీయుల చరిత్ర చెప్పబడినది. దీని తరువాత ఒక సంధివచనము గలదు. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన లక్షణావిలాసంబునకు కథాక్రమం బెట్టిదనిన – ఈ వచనాంతమున శ్రీ గంగయ్య గారిచే శ్రీరాములుగారి పరముగ రచింపబడిన 'మంగళహారతి' గలదు.

అష్టావధానులకు నిస్స్వార్థదాతలకు
శిష్టవర్ణితులకు శ్రీరామకవిచంద్రులకు. । మంగళం ।
సదమల డోకిపుర మదనగోపాలక
పదపద్మభక్తి లబ్ధ పరమదాసభక్తులకు । మంగళం ।

దీనితదనంతరం మొందు రెండాకులు పోయి యుండవచ్చును. లక్షణా విరహముతోనే కథాప్రారంభమని తోచును. భామాకలాపముననను సత్యభామా విరహముతోనే ప్రారంభమైనది.

మనసు నిల్పలేనమ్మ । నన్ను మన్నించి నీవేగి రమ్మ ।
అని మదనగోపాలునితో డితెమ్మని లక్షణచే పాడబడు ఒక కీర్తన గలదు.

అటు తరువాత

మత్ప్రాణనాయక హితాత్వహితా సపత్ని యద్ధుశ్చహః
కుసుమమార్గణ మార్గణౌఘః తన్నిష్కుటః

సశుకకోకిల అహార్వేమేయౌవనం
సపదిహేయమ భూదహోసత్
అను శ్లోకమును లక్షణ పాడి దాని యర్థమును గూడ లక్షణయే చెప్పును.

సవతి మందుబెట్టినేమో శ్రీకృష్ణుడు రాలేదు, పోయి పిలిచిరమ్మని చెలిని ప్రార్థించును. లక్షణ విరహము చెలికత్తె యనునయింపు సందర్భమున రసపోషకము లైన సంభాషణచతురిమను చక్కగా ప్రదర్శించిరి. నందితిమ్మన గారి పారిజాత పహరణము నందలి సీసభావమును బోలిన దొకటి లక్షణ నోటబలికించును.

ఉవిద యెవ్వతె నోఁచియున్నదో యీ స్యమం
దకరత్నమింక నొదల ధరింప
నీరైవతక శైల చారుకూట విటంక
కేలికింకెవ్వతె పాలుపడునో
యెవ్వతె కబ్బునో యీ వసంతారామ
కర్పూరకదళికాగారవసతి
నీలమణిసౌధజాలకంబుల నిన్నుఁ
గూడి యెవ్వతె వారిజూడగలదా

యకటనేఁబెంకఁబెరిఁగిన శుకమయూర
శారికాబృంద మెవ్వతెఁ జేరునొక్కొ
నన్ను నాతోడి సవతులు నగకమున్న
పంతమలరంగ నిన్ను మెప్పింతుఁగాక - పారిజా .1-13

కలువరాయని మానికపు చొక్కపుకుదుళ్లు
పూదోటలేపాటు బొందునొక్కొ
అందంపు చందంపు బపరంజి పంజరా
ల్గల చిల్కలేకస్తి గందునొక్కొ
కెంపురామెట్లు డిగ్గియ నోట నోలాడు
రాయంచ లేపంచ డాయునొక్కొ
తళుకొందు మగరాల పలకలపై నాడు
గొరువంక లేవంక కరుగునొక్కో

యీ చెలుల గుంపులేజాడ జూచునొక్కొ
యింక నా భాగ్యమంతయు నెవతెదొక్కొ
వైళమీవేగి డోకిపూర్వాసుడైన
మదనగోపాలు తేగదే మంజువాణి.

ఇట్లు లక్షణ చెలికత్తెను తొందరపెట్టును. ఇంతలో పరాశరభట్టారకులు శిష్యసమేతముగ ప్రవేశించును. అతనిని జూచి గ్రహచారఫలమెట్లుండెనో తెలిసి కొన ప్రశ్న యడుగును. ఇచట గురుశిష్యుల సంవాదము హాస్యసంవాదము హాస్యరసోత్పత్తికై సృష్టింపబడినది. కాని ఈ హాస్యము ముదురుపాకమునబడి అసభ్యముగ నున్నది. కాని యిట్లు ముందు విమర్శించుటకు ఆనాటి సామాజికులు, వారి యభిరుచులు గూడ తెలిసికొనవలెను. ఈ యక్షగానముల నాటికి ప్రదర్శనలు రాజాస్థానముల నుండి పల్లెల పాల్పడినవి. పట్టణ ప్రజలకు నాటకము లందు 'మోజు' హెచ్చినది. "1860 సంవత్సరములో ధార్వాడ నాటక సమాజము వారు ఆంధ్రదేశమంతటా వారి హిందీనాటకాలతో విజయయాత్ర చేసి ఆంధ్ర ప్రజలలో నాటకోత్సాహాన్ని కలిగించారు. వీరి నాటకములను ప్రజలు తండోపతండములుగా చూశారు."[5]

ఈ నాటకావతరణముతో తోలుబొమ్మలాట, వీధిభాగవతములు, జంగం కథలు మొదలగునవి క్రమక్రమముగా దివానక్షత్రములవలె మలగిపోయినవి. తరువాత మనవారును సంస్కృతనాటకములనువదించి వానిని ప్రదర్శించుచు వచ్చిరి. అందలి భాష పామరుల కందునదిగలేదు. అది సభ్య సమాజమునకై యుద్దేశింపబడినవి. అందులో మోటుహాస్యమునకు చోటు లేదు. ఈ వీధి నాటకము లచ్చటచ్చట ఇంకను పల్లెలలో పాటక ప్రజల కొరకై జాతరల సందర్భమున ప్రదర్శించుచున్నారు. తోలుబొమ్మలాట లందలి కేతిగాడు, బంగారక్క, జట్టుపోలిగాడు, అల్లాటప్పుగాళ్ళవలె ఈ వీధిభాగవతము లందును ఒక హాస్యగాడుండును. వాడు పాత్రలు ప్రవేశించుటకు ముందును, ఒక యంశమునకు మరియొక యంశమునకు నడుమను కాలవ్యవధాన మున్నప్పుడును వచ్చి సభికులను తన హాస్యప్రసంగముచే నవ్వించును. ఈ హాస్యము నాగరికులకు చాల యసభ్యముగ నుండి వెగటు కలిగించును. కాని పల్లెపాటకపు జనము ఆ హాస్యమునకే యిష్టపడుదురు.

శ్రీరాములుగారి చిన్ననాట నిట్టి భాగవత ప్రదర్శనము చూచి యుందురు. అదియును గాక యీ యక్షగాన ప్రదర్శనలు జూచువారును పల్లె ప్రజలై యుండిరి. నాగరికులకు నాటకములు కావలసి యుండెను. ఆ నాటకము లందలి హాస్యము సభ్యముగ నుండును. ఈ యక్షగానములు గ్రామీణులకై యుద్దేశింపబడినవి గావున వారికి తగిన 'మోతాదు'లో మోటుహాస్యమును వీరిందుత్పన్నము గావించిరి. ఈ హాస్యము తీసివేసినను కథావగతికి లోపమురాదు కాని ఈ హాస్యమిచ్చటి కరుణరసమునకు కొంత విశ్రాంతిని చేకూర్చునదిగ యున్నది. కావున నిది యావశ్యకమే.

శోకమూర్తియగు లక్షణ తాను మద్రరాజపుత్రి ననియు, శ్రీకృష్ణుడు పృథు రోమయంత్రమును (మత్స్యయంత్రము) గొట్టుటచే తానతనిని భర్తగ వరించితిననియు చెప్పుచు రాజపుత్రిక నన్న గర్వమును ప్రదర్శించెను. ఈమె సత్యభామవంటి అభిమానవతి. ఈమెకు కూడ సవతి మాత్సర్యము గలదు. శ్రీకృష్ణుడెక్కడున్న నిన్ను మరువడని యతనిపై యలుక యేలయని శుకవాణి కందార్థమున ప్రశ్నించును. అపుడు శ్రీరాగమున లక్షణ తన యీర్ష్యనంతటిని నిట్లు వ్యక్తముచేయును.

ఓ యమ్మా నా ప్రాణనాథుండు నన్ను
విడవాడి నాసవతి యింట నున్న నాకే
మి ఫలమమ్మ – – –

**శ్రీరాగము – ఆటతాళము**

కట్టనివిచీరెలజే కననివి కడుపులటే
కట్టడి బ్రహ్మవాని దానింట గట్టివేసె నింకేమి మాటే
ముడువనివి పువ్వులటే తొడనిధి దొడవులటే
పడతిరో దాని కోరికలే పండెనే యింకేమి మాటె
తేలియనిది మాటేనటే తిననది యన్నమటే
కలికిరో వానికి నాపై కరుణలేదింకేమి మాటె ...
ఉండనిది యిల్లేనటే పండనిది పానుపటే
ఉండగా డోకిపుర్గోపాలుండు దానింట నింకేమిమాటే –

యని చింతించుచుండ సదయునితోడి తెచ్చెదనని ఆ పడతి యెట్టి మందు బెట్టిననేమి మందుల గుణముల మళ్ళింతునని గోపాలదేవుడు చాలగ నిన్నే బతిమాలునట్లు చేసెదనని చెప్పి యూరడించును. చక్కని సంభాషణ రచనావిన్యాసములతో రసపోషకములైన సన్నివేశకల్పన లతో ప్రదర్శనాను కూలముగ రచించిరి. ఇంతలో చంద్రోదయమగును. చంద్రోదయ వర్ణన, చంద్రోపాలంభనము, మన్మథోపాలంభనము చేయును. విభుడు భోజనందన యింట వినోదించుచున్నా డన్న వాక్యము విని మూర్ఛ నందును. ఇచ్చట చంద్రోదయవర్ణనము ప్రబంధ శైలిలో రసవంతముగ రచింపబడినది.

ప్రాక్సతీధమ్మిల్ల బంధంబుపై నొప్ప
బెట్టిన రాగిడీబిళ్ళ యనగ
ఉదయగో త్రాధీశుదురులీల బట్టిన
బెడగైన కెంబట్టు గొడుగనంగ
హరిపదాగ్రసముద్భవాంబుపూరంబుల
బుట్టు బంగరు దమ్మిపువ్వనంగ
చెలువువార చకోర శిశుపాళిపాలిటి
కెంపురా పసిపాలగిన్నె యనగ

చందమామా చందమామా రారోరోరి చందమామా
చందమామా చెందరాని చంద
మబలల యందు జూపుడు
పొందుగాదుర ।చం।

ఇది ఆహిరిరాగమున రచింపబడిన దరువు. తోడిరాగమున నున్న నింకొక దరువు.

కలగంటి కలగంటినె ఓ చెలి నేడు
కలతనిద్దురబట్టేనే కల । కల ।
లోనా చెలువుని గలపియుంటినే । కల ।

ఇట్టిదే భామాకలాపములోగూడ భామ కలగనిన యట్లు 'కలగంటినమ్మా నిన్నరేయి' యని పాడును. ఇట్లు ప్రచారమున నున్న భామాకలాపమునకు ఈ లక్షణా విలాసమునకును సన్నివేశసంవిధానమున దగ్గర పోలికలు గలవు.

పాత్రపోషణ గూడ పోలియే యున్నది. అందలి నాయిక సత్యభామ. అభిమానవతి. గర్విష్ఠి. సవతి మాత్సర్యము గలది. ఇందును లక్షణ అట్టిదిగనే చిత్రింపపడినది. కృష్ణుడు ఆమె యభిమానమును, గర్వమును పొగొట్టి పాదాక్రాంతను జేసికొనును. శృంగారరసపరిపోషణ చక్కగా సాగినది. విభావా, సుభావ పంచారీ భావములు, సాత్త్వికభావములు చక్కగ ప్రదర్శితమైనవి. ముఖారి రాగమున గల లక్షణా శుకవాణి సంవాదములో –

> బాలనే తాళజాలనే యీవేళ లీలమన్మథుడదిగా
> క్రోధోద్వేలుడై దండెత్తెనే ।బాలనే।

అన్న దరువులో సాత్త్వికభావములైన కంపము, అశ్రువు, స్తంభము, ప్రళయము, స్వేదము, గాద్గదము, రోమాంచము, వైవర్ణ్యము మొదలగునవి రసానుకూలముగ రచింపబడినవి. ఇందు విరహవిప్రలంభము, వివర వర్ణింపబడినది. ఆంగీరసమైన శృంగారమునకు అంగరసములుగ హాస్యము, కరుణ రసములు పరిపోషింపబడినవి.

పాత్రల స్వభావశీలములు కన్నులకు గట్టినట్లు చిత్రింపబడినవి. శుకవాణి సమయోచితవాక్యనిపుణ. కార్యసాధనతత్పర. నాయిక అభిమానవతి గర్విష్ఠి. సవతి మాత్సర్యము గలది. మనోదార్ఢ్యములేని సుకుమారి. విషాదవార్త శ్రవణము తోడనే మూర్ఛిల్లునట్టిది. దీర్ఘక్రోధికాదు. నాయకుని ఒక్క అనునయవాక్యముతోడనే ప్రసన్నురాలగును. నాయకుడు శ్రీకృష్ణుడు లీలా మానుష విగ్రహుడు. దక్షిణ నాయకుడు. అభిమానధని. నాయిక యలుకను దీర్చుటయందు నేర్పరి. పరాశనభట్టు, శిష్యుడు, ద్వారపాలకుడు ఈపాత్రలు కేవలము హాస్యరసోత్పత్తికై ప్రవేశపెట్టబడినవి.

నాయకరాజుల యక్షగానాలలో సాధారణముగ ఉపయుక్తములైన రాగాలు ఆహిరి, హుసేని, కన్నడ కళవాణి, కురంజి కాంభోజి, ఎరుకుల కాంభోజి, గుమ్మకేదార, కేదారగౌళ, ఖమాచి, గౌడిపంతు, ఘంటారవము, తోడి, నటనా రాయణి, నాగగాంధారి, పంతువరాళి, పూరి, బిలహరి, భైరవి, మధ్యమావతి, మనోహరి, మారువధన్యాసి, ముఖారి, మోహన, రేనగుప్తి, లలితపంచమము, శంకరాభరణము, శుద్ధసావేరి, సామంత, సారంగ, సావేరి, సౌరాష్ట్ర, సైంధవి సాళసౌరాష్ట్ర మున్నగునవి.[6]

శ్రీరాములుగా రుపయోగించిన రాగములు – శ్రీరాగము, రేవగుప్తి, పున్నాగ వరాళి, పూర్యముఖారి, మారువరాగము, ముఖారి, శుద్ధకాంభోజి, ఘంటారవము, శహన, అహిరి, దర్బారు, ఆనందభైరవి, అసావేరి, తోడి, యమునాకల్యాణి, జంఝూటి, శుద్ధసావేరి, పంతువరాళి, సారంగము, శంకరాభరణము, పున్నాగము, సారాష్ట్రము. శ్రీరాగముతో ప్రారంభించి శ్రీరాగముతో ముగించిరి. సౌరాష్ట్ర రాగమున మంగళవార్తికము నెఱపిరి. 17 దరువులు, 4 కందార్థాలు, ద్విపద, కందము, సీసము, పంచచామరము, ఒక కీర్తన గలవు. ఆది, ఆట, చాపుతాళముల లోనే యీ దరుపులు సాగినవి. ఆ దరుపులన్నియు యభినయానుకూలముగను రచి యింపబడి సామాజికులను రసానందపరవశులను కావించునట్టివిగ నున్నవి.

ఈ యక్షగానము భామాకలాపమున కనుకరణమైనను పదరచనా విన్యాసములోను, భావనాపటిమయందును, సన్నివేశసంధానముననును, తెలుగు నుడికారవిన్యాసములోను, లోకోక్తుల రచనలోను తన ప్రత్యేకతను ప్రదర్శించు చున్నది. ఇందలి ఆవేలము అశ్రావ్యమునునైన హాస్యమును తొలగించిన నీ యక్షగానము నాగరిక సభ్యసమాజము సమక్షమున ప్రదర్శనాయోగ్యమై వారి మన్ననలకు పాత్రమగును.

సర్వోత్కృష్టమైన యాధునిక యక్షగానములలో ఈ లక్షణావిలాసమొకటి.

## అధోజ్ఞాపికలు

1. యక్షగాన వాఙ్మయచరిత్ర – ఆచార్య యస్.వి.జోగారావు,పు.2
2. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర – ఆచార్య యస్.వి.జోగారావుగారు పు.లు. 214–15
3. ఆంధ్ర యక్షగాన వాఙ్మయచరిత్ర – ఆచార్య యస్.వి. జోగారావుగారు, రెండవ భాగము. పు. 182.
4. మహాకవి దాసు శ్రీరాములు జయంతి సంచిక, ఏప్రియల్, 1975,పు. 5.
5. ఆంధ్ర నాటకరంగ చరిత్ర – శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి.పు. 333.
6. ఆంధ్రవాగ్గేయకారుల చరిత్ర – శ్రీ బాలంత్రపు రజనీకాంతరావుగారు, పు.386.

# 7. పత్రికాసుమము

## (i) అనల్ప జల్పితాకల్ప కల్పవల్లి

పందొమ్మిదవ శతాబ్ది పాదము మోపినది. సామాజిక చైతన్యము వేగము పుంజుకొని కాలచక్ర గమనముతో 'పోటీ' వేసికొని చకచకా సాగిపోయినది. ఈ యుగమున జరిగినన్ని మార్పులు మరేయుగము నందును గానము. రాజకీయ వ్యవస్థలో మార్పు, సామాజిక వ్యవస్థలో మార్పు, సాహిత్యములో మార్పు, సంగీతములో మార్పు, ఒకటననేల నాట్యము, చిత్రలేఖనము, ఆచార వ్యవహారము లందును మార్పు. అంతేకాదు చివరకు కట్టు బొట్టునను మార్పులు కలిగినవి. మహమ్మదీయులు మొగలాయిలు – ఇట్లు పరదేశీయులెందరో మనదేశమును పరిపాలించిరి. వారు రాజకీయవ్యవస్థలో తగుమార్పులు తెచ్చిరి. మరికొందరు మతవిషయములందును తలదూర్చిరి. కాని సంఘజీవన విధానమును గూర్చి కలుగజేసికొనినవారు లేరు. ఆంగ్లేయులు అడుగుపెట్టి హిందూసామ్రాజ్యమునే గాదు, హైందవ సామాజిక వ్యవస్థనే కూకటివ్రేళ్ళతో కదలించిరి. అయో మార్గములు, తంతితపాలా పద్ధతులు, వీనితో ఆంగ్లవిద్యను గూడ ప్రవేశ పెట్టిరి. క్రొత్తక వింతయని ఆంగ్ల విద్యపై 'మోజు' పడి ప్రజలు ఆర్షవిజ్ఞానము నకు తిలోదకము లిడిరి. ఆంగ్లవిద్య నభ్యసించినవారికి పెద్ద పెద్ద యుద్యోగములు యెరజూపి వారి 'కచ్చేరీ' లకు కావలసిన సిబ్బందిని 'తయారు' చేసికొనిరి. ఆనాడు ఆంగ్లవిద్య నభ్యసించుట నాగరికతగ పరిగణింపబడినది. ఇట్లు వారి సాహిత్యముతోడను ప్రవేశము కలిగినది. మిల్టన్, కీట్సు, షెల్లి మొదలగు సుప్రసిద్ధ ఆంగ్లకవుల కవితలు తెలుగులోనికి వచ్చినవి. వారి సాహిత్యము లోనున్న ప్రక్రియ లన్నియు తెనుగున కూడ వెలసినవి. ఖండకావ్యములు భావగీతములు, కథానిక, నవల, విమర్శ, వ్యాసము మొదలగు వానితో పత్రికా నిర్వాహణ కూడ ప్రారంభమైనది.

ఈ పత్రికలు ప్రారంభమున సాహిత్యసముద్ధరణకై యుద్భవింపలేదు. ఆంగ్లేయుల కబంధహస్తముల నుండి హిందూదేశమును, హిందూ సమాజమును రక్షించుటకై ప్రజలను తట్టి లేపి తిరిగి చైతన్యవంతుల చేయుటకై యావిర్భవించినవి.

ఆనాడు క్రైస్తవ మిషనరీలు తమ మతమే సర్వోత్కృష్టమైనదని వారి మతమును స్వీకరించవలసినదని ప్రచారము చేయుచుండిరి. ఆ ప్రచారమునకు పత్రికలు కావలసి వచ్చినవి. వీనిని ముద్రించుటకు ముద్రణాలయము లావశ్యకములైనవి.

**పత్రికానిర్వహణ పూర్వరంగము :** 1770 లో బంగాళాదేశములో 'గుమాస్తా' యుద్యోగము చేయుటకై వచ్చిన ఛార్లెస్ విల్‌కిన్స్ (Charles Willkins) సంస్కృతము నభ్యసించిన మొదటి యాంగ్లేయుడు. అతడు భగవద్గీత, హితోపదేశము, శాకుంతలమును ఆంగ్లమున కనుకవదించెను. అతడే తన స్వహస్తములతో దేవనాగరిలిపిలో ముద్రించుటకై అచ్చులు తయారుచేసెను. ఆ కళను 'పంచన్నన్' (Punchannan) అన్న కమ్మరవానికి నేర్పెను. లండన్ మిషనరీ సంస్థకు చెందిన కేరే (Carey) అను ఆంగ్లేయ 'మిషనరి' తన మతప్రచారమునకై 'శెరామ్‌పూర్' నకు వచ్చి ముద్రణాలయమును ప్రారంభింపగా 'పంచన్నన్' అక్కడికి తన యనుచరుడును, ఈ కళయందును సుశిక్షితుడైన మనోహర్ అనునతనితో వచ్చి చేరెను. బహుశ తెలుగు అచ్చులను గూడ వీరే తయారుచేసి యుండవచ్చును. ఈ ముద్రణ యంత్రముల సాహాయ్యముతో వేలకొలది బైబిలు అనువాదములను ముద్రించి వారి ప్రచారమునకై యుపయోగించుకొనిరి. తరువాత మత ప్రచారమునకై పత్రికలను గూడ ముద్రించిరి.[1]

ఇట్లు పందొమ్మిదవ శతాబ్ది రెండవ దశాబ్దమున పత్రికానిర్వహణకు, అంకురార్పణ జరిగినది.[2] బంగాళాదేశములో నున్న మిషనరీలు బంగాళీ భాషలో 'దిగ్దర్శన్', 'సమాచార దర్పణ్' అను మాసపత్రికలను 1818 లో ప్రారంభించిరి. ఈ పత్రికలో హిందూ మతమును ఖండించుచు వ్రాయుచుండిరి. అదే సంవత్సరము జేమ్స్‌సిల్కు బకింగుహామ్ సంపాదకత్వమున 'కలకత్తా జర్నల్' అను పత్రిక వెలువడింది.[3]

రాజారామమోహనరాయల వారి వ్యాసములను ఆంగ్లమున కనువదించి, ఆ పత్రిక ప్రకటింప సాగెను. రాజారామమోహనరాయల వారు ఉపనిషత్తులలోని పరిశుద్ధాస్తిక మతమును గూర్చి ప్రచారమును చేయుటకును, 'మిషనరీల' దుష్ప్రచారము నరికట్టుటకును, 4-12-1921 తేదీన 'సంవాదకౌముది' అను బంగాళీ వారపత్రికను స్థాపించిరి. 'మిరాల్ ఉల్‌అక్బర్' పారశీకభాషలో నింకొక

పత్రికను గూడ అదే లక్ష్యముతో స్థాపించిరి. 1853 లో 'ఆడం' అను ఆంగ్ల గవర్నల్ జనరలు పత్రికాస్వాతంత్ర్యమును చాలవరకు అరికట్టెను. జేమ్సు సిల్కు బకింగ్‌హామ్‌ను ప్రవాసమంపెను. ఈ విషయమై రాజారామమోహనరాయ లెంత ప్రయత్నించినను లాభము లేకపోయెను.

అయినను పత్రికలు వెలువడుచునే యున్నవి. ప్రభుత్వమును విమర్శించుట కూడ జరుగుచునే యుండెను. 1844 లో గాజుల లక్ష్మీ నర్సుసెట్టిగారు చెన్నపట్ట ణము నుండి వెలువడుచున్న 'నేటివ్ సర్కులేటర్' అను పత్రికను దాని ముద్రాక్షరశాలను కొని 'క్రిసెంటు' పత్రికను నడిపిరి.[4] దీనికి 'హార్లి' యను దొరను సంపాదకునిగ నియమించిరి. ఈ పత్రిక ప్రభుత్వోద్యోగుల యక్రమ చర్యలను దుయ్యబట్టినది. మత విషయములు, సంఘసంస్కరణాది విషయము లిందు ప్రచురించి సమాజాభివృద్ధి కెనలేని సేవచేసినది. పత్రికా యాజమాన్యము వహించిన ఆంధ్రులలో ప్రథములు వీరనవచ్చును. అప్పటిలో 'నేటివ్ హెరాల్ట్', 'రికార్డు' అన్న పత్రికలద్వారమున క్రైస్తవమిషనరీలు క్రైస్తవమతమును ప్రచారము చేయసాగిరి. ఈ 'క్రిసెంటు' పత్రిక వానిని ఖండించుచు 'మిషనరీ'లు చేయు అప్రమాణములను, అన్యాయములను విమర్శించినది. క్రమముగ ఆంధ్రభాష యందును తెలుగుపత్రికలు వెలువడుట ప్రారంభింపబడినవి. బళ్ళారిలో నున్న మిషనరీలు 'సత్యదూత' యను తెలుగుపత్రికను నెలకొల్పి వారి మతప్రచారము గావించుకొనుచుండిరి. ఇది హిందూమతమునకు విరుద్ధముగ ప్రచారము చేయుచుండెను. ఇందలి భాష యెల్లరకు అర్ధమగునట్లు వ్యావహారికములో వ్రాయబడినది. తెలుగులో మొదట వెలువడిన పత్రిక యని యిది 1835 లో ప్రచురింపబడిదని శ్రీదిగవల్లి శివరావుగారు,[5] శ్రీ నిడదవోలు వెంకటరావుగారు[6], డా॥ అక్కిరాజు రమాపతి గారు[7] వారి యభిప్రాయముల వెలిబుచ్చిరి. కాని శ్రీ ఆరుద్రగారు[8] దానికిగాను సరియైన ప్రామాణికాధారాలు లేవని అది మొదటి పత్రిక కాదనిరి. 'క్రిష్టియన్ లిటరరీ సొసైటీ', మద్రాసులో 1858 లో స్థాపింపబడినదనియు 'సత్యదూత' యను తెలుగుపత్రికను నవంబరు 1888 నుండి ప్రచురించుచుండెననియు తెల్పిరి. మొదటి తెలుగుపత్రిక 'వృత్తాంతిని'[9] అని 1831–37 మధ్యకాలంలో వెలువడిన తెలుగుపత్రికలు లేవని, ఆ వృత్తాంతిని 1838 లో వెలువడినదని శ్రీ ఆరుద్ర, శ్రీ నార్ల వారి యభిప్రాయము. స్థోమతు

గల స్థానికులైన పెద్దలచే స్థాపింపబడి, శ్రీ మండిగల వెంకటరామశాస్త్రిగారను[10] మహాపండితుని సంపాదకత్వముతో గ్రాంథిక భాషలో బేతపూడి సుందర రామయ్యగారి వంటి పండితుల రచనలో వర్తమాన వార్తలతో వెలువడుచుండెనని శ్రీ ఆరుద్రగారు వ్రాసిరి. ఇవియే కాక సాహిత్యవిషయములు, సంఘ సంస్కార విషయములు గూడ చర్చింపబడుచుండెడివి. వివాహాది శుభసమయములందు భోగమేళములకు మాఱుగ సంగీతవిద్వాంసుల పాట 'కచేరీ' లు పెట్టించిన బాగుండనని కొందరు లేఖకులు ఆ పత్రికకు వ్రాసెడి వారు. పత్రికాముఖమున సంఘ సంస్కారము అపుడే యంకురించినది.

'వర్తమానతరంగిణి' (1842–52) సయ్యదురహముతుల్లా అను నాతడు స్వంత ముద్రణాలయములో ముద్రించి మద్రాసు నుండి ప్రచురించు చుండిరి. ఏడవ ప్రతి నుండి శ్రీ పువ్వాడ వెంకట్రావుగారు సంపాదకత్వము వహించుచుండిరి. ఈ 'వర్తమాన తరంగిణి'లో ప్రమాణస్థాయిగల రచనలు క్రైస్తవమత ప్రచారఖండన, సమస్యాపూరణలు, అధికారుల నిరంకుశ ప్రవర్తనలు మొదలగునవి ప్రచురించెడి వారు. 'లోకరక్షకుడు', 'జనమనోరంజకుడు', 'లోకోపకారి', 'న్యాయవాది', 'సకలజనసమ్మతుడు', 'వికటసంకట కవి' అన్న లేఖకనామములతో (Pen names) కొందరు ప్రజ్ఞావంతులు సంపాదక లేఖలు వ్రాసెడివారు. బ్రౌను దొరగారే కాక 'ఆంధ్ర భాషా సంజీవని', 'వివేకదర్శిని' మొదలగు పత్రికలు ఈ వర్తమాన తరంగిణి నెంతో ప్రశంసించినవి. ఆంధ్రదేశమున మిక్కిలి వ్యాప్తిని చెందిన ప్రాచీన పత్రికలలో నీ పత్రిక మొదటిది. మహాభారతము 1842 లో దీనియందు తొలిసారిగా ముద్రింపబడినది. దీనిలో కొన్ని ప్రబంధములు, శతకములు గూడ ముద్రింపబడినవి.

క్రైస్తవ మతప్రచార మరికట్టుటకు, ప్రభుత్వపుటక్రమచర్యల నిరోధించు టకుగాను వెలువడిన పత్రికలు క్రమముగ సాహిత్యపురోభివృద్ధికి గూడ దోడ్పడు చుండెడివి. దీని తరువాత 'దినవర్తమాని' (1861–72), హితవాది (1862–68) వెలువడినవి. ఇవి క్రైస్తవపత్రికలు. హితవాదినిని 'షార్కే' దొరగారు ప్రచురించుచుండిరి. "శ్రీ యక్షిణి" యను పత్రిక (1863–65) బళ్లారి నుండి త్యాగరాజ మొదలియార్ అను తమిళపండితునిచే ప్రకటింపబడుచుండెను. ఈతడాంధ్రమున గూడ గొప్పపండితుడు. వివేకవర్ధిని, తత్త్వబోధిని, వీనిని

పేర్కొన్నవి. 'తత్త్వబోధిని' (1964-70) అను పత్రిక చెన్నపురి వేదసమాజము వారిచే ప్రకటింపబడు చుండెను. ఈ పత్రిక యందలి స్త్రీ పునర్వివాహ విషయ కోపవాదోపవాదములు తమకెంతో యుపయోగ పడినట్లును 'రుచిరఫణితి' నున్నట్లును కీ.శే. శ్రీ వీరేశలింగం పంతులు గారు వ్రాసియుండిరి.[11] 'సుజనరంజని' యను పత్రిక 1865లో ప్రకటింప బడినది. శ్రీ వింజమూరి కృష్ణమాచారి గారిచే ప్రకటింపబడినది. చిన్నయసూరి రచనలు కొన్ని యిందుగలవు. ఆంధ్ర 'గ్రంథ చింతామణి', 'తత్వబోధిని' దీనిని ప్రశంసించినవి.

'ఆంధ్రభాషాసంజీవని' (1871-83,1892-1900) మద్రాసు నుండి ప్రకటింపబడుచుండెడిది. శ్రీ మహామహోపాధ్యాయ శ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు దీనికి సంపాదకులుగా నుండిరి. ఇది తెనుగుదేశమున మిక్కిలి వ్యాప్తిలో నున్నది. దీనివలన ననేకములైన యితర ప్రాచీన పత్రికలు పరిచయము చేయబడినవి. శ్రీ వీరేశలింగం పంతులు గారి మొదటి రచన లిందే వెలువడినవి. స్త్రీవిద్య, స్త్రీ పునర్వివాహము మొదలగు విషయములలో వివేకవర్ధనితోను, పురుషార్థ దాయనితోను వాదోపవాదాలు జరిపినది. గోదావరి విద్యాప్రబోధిని (1870) రాజమహేంద్రవరము నందలి జిల్లా ఉన్నత ప్రధానోపాధ్యాయులు 'బారో' (Barrow) దొరగారిచే ప్రారంభింపబడెను. శ్రీవీరేశలింగం పంతులుగారు ఈ పత్రికకు వ్యాసములు వ్రాయుచు క్రమముగ పత్రికారచయితలుగ పత్రికా నిర్వాహకులుగ ఆరితేరిరి. 'పురుషార్థదాయిని' అనుపత్రిక. ఇది హిందూధర్మ సంరక్షణకై వెలువడిన పత్రిక. అపప్రచారము చేయుచున్న క్రైస్తవ మిషనరీలను నిర్దాక్షిణ్యముగ విమర్శించినది. ప్రభుత్వ అక్రమములను గూడ నిశితముగ విమర్శించినది. స్త్రీ విద్య, బాల్యవివాహములు, స్త్రీ పునర్వివాహముల గూర్చి చర్చించుచు 'సంజీవని' పత్రికతో వాదోపవాదములు జరిపినది. 'స్వధర్మ ప్రకాశిని' 1873లో బందరు నుండి వెలువడినది. ఇది గూడ హిందూధర్మ సంరక్షణకై వెలసిన పత్రికయే. తరువాత మద్రాసునుండి 'బ్రహ్మానందరంజని' (1874), కాకినాడ నుండి 'లోకరంజని' (1874), నరసాపురము నుండి విద్యామనోహారిణి (1874), విశాఖపట్నము నుండి 'సకలవిద్యాభి వర్ధిని' (1875-79), అను పత్రికలు వెలువడు చుండెను. 'వివేకవర్ధిని' (1874-91) రాజమండ్రి నుండి శ్రీకందుకూరి వీరేశ లింగంపంతులు గారి అధ్వర్యమున వెలువడుచుండెను.

భాషాభివృద్ధి, దేశాభివృద్ధి ప్రధానలక్ష్యమని చెప్పుకొనిరి. ఇది మాసపత్రికగా కొన్నినాళ్ళు, పక్షపత్రికగా కొన్నాళ్ళు మరికొన్నాళ్ళు వారపత్రికగను వెలువడి యుండెను. అప్పటికింకను దినపత్రికలు వెలువడియుండలేదు. 1911 లో 'గౌతమి'[12] యనునది తెనుగునాట వెలసిన మొదటి దినపత్రిక. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారు దీనిని ప్రారంభించి ఒక సంవత్సరము నడిపిరి. ఈ వివేకవర్ధిని తొలుత ఆంధ్రభాషా సంజీవిని ముద్రాక్షరశాల యందు ముద్రింపబడు చుండెను. నాలుగవ సంచిక నుండి శ్రీధర ముద్రాక్షరశాల యందు ముద్రింపబడెను. మరి కొంత కాలము నిలిపివేయబడెను. మరల పునరుద్ధరింపబడి 1891 వరకు వెలువడుచుండెను.

తొలుత ఆంధ్రభాషా సంజీవని పత్రికాధిపతియైన మహా మహోపాధ్యాయ శ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారితో స్త్రీ విద్యావిషయములపై నభిప్రాయ భేదములు వచ్చినవి. అందుచే అచ్చట ముద్రించుట మానియుండవచ్చునని తలంపవలసి యుండును. ఆ దినములలో గ్రంథములు గాని, పత్రికలు గాని చెన్నపట్టణములోనే ముద్రించుకొను చుండిరి. చెన్నపట్టణమునను ముద్రాక్షర శాలలు తగుమాత్రముగనే యుండి యుండుటచే సమర్థులును, సంపన్నులును నైన కవులు స్వంత ముద్రాక్షరశాలలు నెలకొల్పుకొని పత్రికలను నిర్వహించుకొనుచు తద్వారమున క్రైస్తవ మత ప్రచారము నరికట్టుచు వేరొకవంక పురాతన గ్రంథములను ముద్రించుచుండిరి.

శ్రీ పురాణం నారాయణశాస్త్రిగార[13]ను పండితుడు ప్రప్రథముగ ముద్రాక్షరశాల చెన్నపట్టణమున నెలకొల్పియుండెను. దీని తరువాత ముద్దంశెట్టి పార్థసారథి సెట్టి గారి 'ఆదర్శ ముద్రాక్షరశాల' గణన కెక్కినది. అటు పిమ్మట 'పుదూరు' కుటుంబస్థులు 'భాస్కర ముద్రాక్షరశాలా'ధిపతులై యుండిరి. అచటనే 1847 లో శ్రీ పుదూరి సీతారామశాస్త్రి గారిచే రచియింప బడిన 'పెద్దబాలశిక్ష' అను సుప్రసిద్ధ గ్రంథము ముద్రింపబడినది. శ్రీ పుదూరు శాఖీయుడైన శ్రీ వావిళ్ళ రామస్వామి శాస్త్రులుగారు తొలుత 'ఆదర్శముద్రాణాలయము' న భాగస్థులుగ నుండి తరువాత 'సరస్వతీ నిలయము' అనుదానిని 1854 లో స్థాపించి అనేక పురాతన గ్రంథముల ప్రచురించిరి. ఇట్లు పండితులే ముద్రాక్షర శాలలు స్థాపించి పత్రికలను, గ్రంథములను ప్రచురించుట ప్రారంభించిరి.

'వివేకరత్నాకర ముద్రాక్షర శాల', 'శారదాంబ నివాస ముద్రణాలయము', 'హిందూ ముద్రాక్షరశాల', 'వాణీ దర్పణము' మొదలగు ముద్రాక్షరశాలలు ఇట్లు వెలసినవి. ఆ సమయముననే 'సంజీవనీ ముద్రాక్షరశాల' స్థాపించి శ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు 'ఆంధ్రభాషా సంజీవని' యను పత్రికను, ప్రారంభించిరి.

అటుపిమ్మట బందరులో కేశవరాజు అండ్‌కో, వారు 'స్వధర్మప్రకాశిని' అను పత్రికను ముద్రాక్షరశాల నొకదానిని ప్రారంభించిరి. ఇదియు సనాతన ధర్మప్రతిష్ఠాపనకై వెలువడిన పత్రికయే. ఈ ముద్రాక్షరశాల యందే 'పురుషార్థ ప్రదాయిని' గూడ ముద్రింపబడుచుండెను. భాషా సంజీవిని యందు సాహిత్య పరమైన వ్యాసములే గాక సాంఘికవిషయకమైన వ్యాసములు గూడ ప్రచురింప బడుచుండెను. గ్రంథసమీక్షలు, ప్రత్యేకమైన వ్యాసములు, ప్రత్యేకానుబంధములు ముద్రింపబడుచుండెను. ముఖ్యముగ ఆంగ్లపదములకు తెలుగు పారి భాషిక పదములు గల్పించి ప్రచురించుచుండిరి. ఈ పత్రిక బాల్యవివాహములు, స్త్రీ విషయక సమస్యలపై 'వివేకవర్ధిని'తో వాదోపవాదములు జరుపుచుండెను. శ్రీ వీరేశలింగం పంతులుగారిని, వారి గ్రంథములను హేళన చేయుటకై ఈ పత్రిక కనుబంధముగ 'హాస్యవర్ధిని' అను పత్రిక వెలువడినది. ఇందుకు ప్రతిచర్యగ 'వివేకవర్ధినికి' అనుబంధముగ 'హాస్యసంజీవని' ప్రచురించి శ్రీ వెంకటరత్నం పంతులుగారిని అధిక్షేపించుచుండిరి. అట్లే కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు[14] కాకినాడ నుండి 'ఆర్య మత బోధిని' అను మాసపత్రికను నడుపుచు వీరేశలింగముగారిని తీవ్రముగ విమర్శించుచుండిరి. వీరేశలింగం పంతులు గారి సంఘ సంస్కరణోద్యమము, గ్రంథములు, వారి విమర్శకు గురియైనంతగా మరి యెవరి విమర్శకును గురికాలేదు. ఇట్లు 'ఆంధ్రభాషా సంజీవిని పత్రిక', 'స్వధర్మ ప్రకాశిని', 'ఆర్యమత బోధిని' ఒక పక్షమున నుండి స్త్రీ పునర్వివాహములను ఖండించు చుండినవి. 'వివేకవర్ధిని', 'పురుషార్థ ప్రదాయిని' వేరొక పక్షమున నుండి స్త్రీ విద్యను, స్త్రీ పునర్వివాహమును పోత్సహించుచు వానిని సమర్థించుచుండినవి.

ఇట్లు స్వధర్మ రక్షణకును, సాంఘిక దురాచారముల రూపు మాపులకును, సాహిత్య పునరుద్ధరణకును వెలసిన పత్రికలు పండితు లొకరి నొకరు ప్రత్యక్షముగ తెగడుకొనుట కుపరించినవి. ఈ పత్రికల ప్రభావము శ్రీరాములుగారి పైనను

ప్రసరించినది. వీరును నుత్తేజితులైరి అవాదోపవాదములు జదివి ప్రేరితులై యొక స్వంత పత్రికను శ్రీరాములు గారును నెలకొల్పి తమ యభిప్రాయములను పత్రికాముఖమున ప్రకటించిరి. 'అనల్ప జల్పితాకల్ప కల్పవల్లి' యను పత్రికను 1880 లో స్థాపించిరి. అప్పటికి వీరికింకను వాణీ ముద్రాక్షరశాల లేదు. వీరి పత్రికను బందరులో నున్న కేశవరాజు అండ్ కో., వారి ముద్రాక్షరశాలలో ముద్రించుచుండిరి.

ఈ పత్రిక గూడ ప్రత్యక్షముగ 'వివేకవర్ధిని'ని ఖండించుచుండెను. అందులకే యీ పత్రిక స్థాపింపబడినదేమో యని తోచును. దీని ప్రతి యొకటి గౌతమి గ్రంథాలయమున గలదు (పత్రికలు నం. 321). ఆ పత్రికాముఖపత్ర మిట్లుండెను.

శ్రీరస్తు – సంచిక 5,6,7,8,9

శ్రీ మదల్లూరగ్రహార

వర్తమాన పరిపాలకులగు

దాసు కన్నయమంత్రి మార్తాండులకుం

బుత్రరత్నంబగు

శ్రీరామ పండితునిచే రచియింపబడిన

అనల్ప జల్పితాకల్ప కల్పవల్లీ

నామక పత్రిక

– (0) –

ప్రమాది సంవత్సర భాద్రపదము, ఆశ్వీజము, కార్తీకము,

మార్గశరము, పుష్యము,

బందరు కేశవరాజు సమూహము వారి

స్వధర్మ ప్రశాశినీ ముద్రాక్షరశాల యందు ముద్రింపబడియె

జనవరి ౨ంవ తేది ౧౮౮౦ సం॥

దీనిలో 40 నుండి 86 పుటలు గలవు. దీని యందలి భాష గ్రాంథికము. చాల ప్రౌఢముగ నున్నది. ఇది యంతయు స్త్రీ పునర్వివాహము ఖండించుచు వ్రాయబడినది. ఇది పుస్తకరూపమైన మాస పత్రిక యని సాంఘిక మత

విషయముల గూర్చి కొంతకాలము అచ్చు వేయించుచు ప్రచురించుచుండెడి వారని వారి కుమారులైన శ్రీదాసు విష్ణురావుగారు[15] వ్రాసి యుండిరి. కాని ముఖపత్రము నందు మాత్రము భాద్రపదము, ఆశ్వీజము, కార్తీకము, మార్గశిరము, పుష్యము అని యైదు మాసముల పేరులే వ్రాసియుండుటచే పుష్యమునకు పూర్వము నాలుగు మాసములపాటు పత్రికలు వెలువడియుండక పోవచ్చునను యూహకు అవకాశము కలుగుచున్నది.

శ్రీరాములుగారు 1878 వ సంవత్సరము ఏప్రియల్ మాసములో న్యాయవృత్తికై బందరు వచ్చిరి. న్యాయవృత్తిలో రెండు సంవత్సరములు స్థిరపడిన పిమ్మట ఈ పత్రికా నిర్వహణకు పూనుకొనిరి. వారిని కార్యమునకు ప్రేరేపించిన విషయము లింతకు ముందు చర్చించి యుంటిమి. అంతకు పూర్వము మద్రాసులో మాత్రమే గల ముద్రాక్షర శాలలు మచిలీపట్టణమునకు వచ్చుట సుప్రసిద్ధులైన పండితులు పత్రిక చేత నుంచుకొని మత సాంఘిక రాజకీయ విషయములు నిష్పక్షపాతముగ చర్చించుట, యొకరినొకరు ఖండించుకొనుట మొదలగు ఈ విషయములు వీరిని ప్రేరేపించినవి. పసితనముననే శ్రీరాములుగారు నోబిల్ పాఠశాల నుండి అల్లూరునకు చదువు విడిచి రప్పింపబడిరి. మతము భ్రష్టమగునేమో యని తల్లిదండ్రులు వీరిని ఇంటికి రప్పించుకొనిరి. దీనితో చదువు కన్న మనుగడకన్న ముఖ్యమైనది మతమే యని, సర్వోత్కృష్టమని ప్రాణమొడ్డియైన మత భ్రష్టము గాకుండ చూచుకొను భారము ప్రతి భారతీయునిపై యున్నదని విశ్వసించిరి.

అప్పటికి ధర్మశాస్త్రాదులు, స్మృతులు, శ్రుతులు మొదలగువన్నియు ఆపోశన బట్టి యున్నారు. ధనమా రెండు చేతులా సంపాదించుచున్నారు. శ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారును, స్వధర్మ ప్రకాశినియందు శ్రీ వీరేశలింగం పంతులుగారిని ఎట్లు అధిక్షేపించుచున్నదో గమనించుచునే యున్నారు. వీరును తొలుత వీరేశలింగం పంతులుగారిని ఎదుర్కొన్నవారే. తరువాత అందలి యుక్తాయుక్తముల కూలంకషముగ పరిశీలించి వీరేశలింగం పంతులుగారిని ప్రోత్సహింప ప్రారంభించిరి. కావుననే బహుకాలమువరకు వీరేశలింగము పంతులు గారి ప్రచారము గోదావరి మండలము దాటి యీవలకు రాలేదు.

ఈ పత్రిక వెలువడునాటికి స్త్రీ పునర్వివాహాదులపట్ల వీరత్యంత విముఖులని తెలియుచున్నది. ఈ లభ్యమైన పత్రిక యందు వాద ప్రతివాదములు, ఖండన మండనములు చక్కగ చర్చించబడినవి. వారి యుద్దేశము పత్రిక ప్రారంభపు పుటలందిట్లు వ్రాయబడినది – 'అస్మద్దేశీయులగు సదాచార ప్రవర్తకులారా నేనిపుడు వ్రాయబూనుకొనిన విన్నపమును సదాచార పక్షపాత బుద్ధితోను శాస్త్రైకదృష్టితోను విమర్శించి శాస్త్రీయమని తమ డెందంబులకు దోచినంత వరకు బుద్ధి మంతులగు వర్ణశ్రేష్టులంగీకరింతురని నమ్ముచున్నాడను ...

"ఏ దేశమునను ఏ కాలమునను పెద్ద లెవ్వరంగీకరింపని యొక పని ధర్మము ధర్మంబని చెప్పంబూనుకొనుట తన పిచ్చి తనకానంద మనినట్టే కదా! నేనిప్పుడు వ్రాయం బూనుకొనిన కుల స్త్రీ పునర్వివాహ నిషేధ విషయమును విశేష విచారము వలన గాని తెలియకపోవునంతటిది గాదు."

తన వాదనను యుక్తికంటె శాస్త్రముల నుపబలకముగా గైకొని సమర్థించిరి. వ్యభిచారము కూడదని చెప్పవలసిన పనికి, విధవలకు వివాహములు చేయవలసిన దని చెప్పుట సరికాదనిరి. అప్పయ దీక్షితుల వారు తమ కుమారికకు సంభవించి నయాపత్తునకు దుఃఖించి యిప్పటికి బూర్వమందే స్త్రీలకు పునర్వివాహ నిషేధము బలముగా జూపట్టుచున్నందున ఏ వీలునైన పునర్వివాహము సిద్ధాంతీకరింతమని తలంచి తన పాండిత్య ప్రకర్ష వలన గొందరి నోడించియు మనకు ఎల్లవిధముల నిది నిషిద్ధమని తనకు మిగుల దుఃఖకర మయినప్పటికిని గూతురు విధవాత్వమును సహించెనే గాని పునర్వివాహము చేయలేదని దృష్టాంతముగ వివరించిరి.

మన వితంతువుల గతి తలలంచుకొనినపుడు పగవారికైన మనసు దహించుకపోదా యన్నదానికి సమాధానమేమన 'దిక్కులేని యనాధబాలురను జూచినపుడు మాత్రమాజాలి కలుగవా? మనసు కరుగక పోవునా? దీనికి వారి కర్మమని యూరకుండక తప్ప' దనిరి. దొరతనము వారీ విషయమై చింతించు చున్నారనుదానికి సమాధానమిది – 'పిల్లలను తల్లిదండ్రుల నుండి యెడబాపి యా తల్లిదండ్రులు కన్నీరు మున్నీరుగ దుఃఖింపగ లేశమయినా దయలేక వారిని క్రిష్టియనులుగ జేయుచున్న మిషనరీల జూచుచు తాము దాక్షిణ్యరహితులై యూరకయుండు దొరతనము వారు విధవల దురవస్థలజూచి దూషింతురన నమ్మవశముగాద'నిరి. స్త్రీ పునర్వివాహములు జరిగిన పతి వచ్చిననాటి

సంతోషము కంటె పతి చచ్చిననాటి సంతోషము మేలుగానెంతురు. నిత్యకల్యాణము పచ్చతోరణముగ నుండునని వేడుక పడుదురు. ఇట్టి అపార పారమార్థికములగు లాభముల నాశించి స్త్రీ పునర్వివాహములకు ప్రయిత్నించుటవంటి నరకము దెచ్చు పాతక మింకొకటి లేదని నొక్కి వక్కాణించిరి. స్త్రీ పునర్వివాహము వలన జనసంఖ్య యధికమగునని, దానివలన నష్టముల నిట్లు వర్ణించిరి. "స్త్రీలకు పునర్వివాహము చేయించి జనసంఖ్య యతిశయించినట్లు కావింప నేర్తుమేగాని ఈ మహాభూతములకు నెక్కువ సారమును, మరికొన్ని మహాభూతములును గాని సృజియింపనేరము. జన సంఖ్య అతిశయించిన కొలది మహాభూతముల సారమును భగవంతుడు హెచ్చించినను నమ్మకమైనా లేశమును లేదు. నిన్న మొన్నటి రెండు సంవత్సరముల కఱవునకు ఇది వరకున్న జనులే యన్నము లేక క్షుత్పీడితులై మలమలమాడినది మన కన్నులతో జూచినదే కదా! ఇక జనసంఖ్య యెక్కువయ్యేనేని యేమి చెప్పవలయును, మాటిమాటికి నన్యదేశముల వారీ దేశమునకు వాణిజ్యాదుల కొరకు వచ్చి యిచ్చటనే నివసించుటచేతను యిచటి వారితర దేశములకు బోవుట, వచ్చి యిచ్చటనే నివసించుటచేతను సాధువులు గాన యుద్ధములు లేకుండుటచేతను యిదివరకే యీ దేశము జనాకీర్ణమయి యున్నదని మసమెరిగినదే. ఈ దేశమునందుత్పన్నములగు ఖనిజములనుగాని, పంటలను గాని, ఓషధులను గాని యితర దేశముల వారెత్తుకొని పోగా మిగిలి నదే మన యనుభవమునకు రాదగియున్నది.

ఎప్పటికిని యెత్తుగా నున్న పైరునందు ఒక్కొక్క మొలకను బట్టి చూచితిమా జలహీనమయి యుండును. పలచగా నున్నప్పుడు దుబ్బుకట్టి బలిష్టమయి యుండును. మరియు జనాకీర్ణమై యున్నచోట రోగము అతిశయింపకమానవు. ఇది వరకే పూర్వములేని విషూచి మొదలగు రోగములు మన దేశమున వ్యాపించి యున్నవి. జనులెచట కూడి యుందురో అచ్చటనే అసత్య దంభ చౌర్య వ్యభిచారాదు లెక్కువగా నుండును. పశువుల మేత కాధారముగ నున్న బీటినేలలు దున్నవలసి వచ్చునుగాన, మేతకు బీటినేలలే లేక పశువులు నశించి సేద్యము లేక పోవును. అడవులు కొట్టి యిండ్లు గట్టవలసి వచ్చును గాన యిండ్లు గట్టుకొనుటకు కొయ్యలే లేకపోవును. ఇది వరకు అన్యదేశముల వారిచేత నాశ్రయింపబడుచున్న యీ దేశము యితర దేశముల నాశ్రయింపవలసి వచ్చును. కాబట్టి దేశమంత కంటె

జనాకీర్ణము అగుటకు సేయుయత్నము మనకెంత నష్టకారి యగునో బుద్ధింతులు విచారించుడీ.”

ఈనాడు మన దేశమున బహుళ ప్రచారము పొందిన భావములనే యానాడు శ్రీరాములుగారు ఈ పత్రికాముఖమున ప్రచారము చేసిరి. ‘నానృషిః కురుతే కావ్యం’ అని కవులను ఋషితుల్యులుగ మన పూర్వులు పరిగణించిరి. వీరి పట్ల ఇది యన్వయమగుచున్నది. అటుపిమ్మట విధవల వలన ఈ దేశమువారు పొందుచున్న యుపకారములు నుగ్గడించిరి. ‘వేయి వరహాలయిన విధవ తోబుట్టువునకు సమానముకాద’ ను పూర్వోక్తిని నుడివిరి. వీరు చెప్పిన యీ హితవులు మాత్రము యేమంత సమంజసముగా లేవని చెప్పవచ్చును. వితంతు సమస్యను సానుభూతితో పరిశీలింపకపోవుటచేతనే యిందలి వాదములు పెచ్చరిల్లినవి. ఇందు శ్రీరామకవిగారు న్యాయవాదిగ తమ వాదనాపటిమను వెలార్చిరేగాని వారి యంతరంగము కరుణాతరంగిణి యని యితర విషయముల వలన తెలియుచున్నది. అయినను తగిన సానుభూతితో పరిశీలింపక పోవుటకు తగిన కారణములు తెలియరాలేదు. కాని యుత్తరోత్తరకాల మందు ఈ విషయము ననే వారు పశ్చాత్తాప పడినట్లు తెలియుచున్నది.

ఇందు ‘వివేకవర్ధిని’ ప్రస్తావన దెచ్చిరి ఆ పత్రిక యందు తెలిసియో తెలియకయో యేమోమో వ్రాసిరి. వారికి వేదశాస్త్రములయందు అంతగా నమ్మకము లేనట్లు తోచుచున్నదని చెప్పి యింకను నిట్లు వ్రాసిరి. ‘రాజమహేంద్రవరము నుండి వచ్చిన వివేకవర్ధిని యను పత్రిక యందు మనవారిది సువిద్య కాదనియు, ఆ శాస్త్రముల యందు కొన్ని బూతు కూతలున్నవనియు అవి చదివినవారు చెడిపోవుదురనియు, వ్యర్ధముగా దేవాలయములు మొదలగువానికి మనవారు అర్థవ్యయము చేయుట మంచిది కాదనియు, విధవా మదనకండూతి నివారణార్థమై వెచ్చముసేయుట యోగ్యతరమనియు మన పెద్దలు వ్రాసిన గ్రంథములయందున్నవి. తెలిసి తెలియని కూతలనియు నేమేమో వ్రాసియున్నారు’. (పు. 56)

ఈ వ్యాసాంతమున బేర్కొన్న ప్రచ్ఛన్న బౌద్ధులును, చార్వాకులును, వీరేశలింగం పంతులుగారి నుద్దేశించి సంబోధించినవియై యుండవచ్చును.

ఏలయన దానికి కొంచెము దిగువగ నిట్లు వ్రాసిరి. 'తన ప్రాణమును, తన యర్థమును లోకవిరుద్ధమైన తనకు తోచిన పనియందే వినియోగింతుననియు రేయింబగలు తుదలేని వంతం దురిపిల్లు వారికావంతయు దీన దీరనేదీరదు' (పు. 86).

వీరేశలింగం పంతులు గారు తాము నమ్మిన యుద్యమములకై తన ప్రాణములు, తన యర్థమును తన సర్వస్వమును నర్పించిరి. కావున పై విషయము వీరి నుద్దేశించి చెప్పినవే యనవచ్చును.

ఇందు స్త్రీ పునర్వివాహ విషయములనొక చక్కని క్రమ పద్ధతిలో చర్చించిరి. స్త్రీ పునర్వివాహమును నిషేధించెడు తన సిద్ధాంతమును, తదనుకూల శాస్త్రాధారముల జూపి తరువాత ప్రతి పక్షులీ విషయమై చేసిన, సిద్ధాంతములను ఖండించి వారి శాస్త్ర పాండితీపాటవమును వెలార్చిరి. యంశములు కలదిగా నుండవలయు ననిన – 1.స్త్రీలకు పునర్వివాహము చేయరాదనియు, 2. స్త్రీల కుంబునర్వివాహము చేసినందుకు దోషము వచ్చుననియు, 3. స్త్రీలకు బునర్వివాహము చేసినందున నరకము గలుగుననియు యిట్లు పన్నెండంశములకు సూచించిరి.

ప్రతి వివాహము నందు 'సుకన్యాం కనకసంపన్నాం, సర్వాభరణ భూషితాం' అని చదువుచున్నారు. ఇక పునర్వివాహము చేసిన యెడల 'ఊఢాం, వైధవ్యసంపన్నాం, సర్వాభరణ విసర్జితాం' అని చదువవలసి వచ్చునని తన సహజ హాస్యధోరణిని జతపరచుచు స్త్రీ పునర్వివాహము శాస్త్రసమ్మతమని చెప్పెడివారు ఎట్టి శాస్త్రమును గనపరుపవలయుననిన స్త్రీ పునర్వివాహము చేయవచ్చుననియు, స్త్రీ పునర్వివాహము దోషము లేదనియు, స్త్రీ పునర్వివాహము వలన కులమునకు బాధలేదనియు మొదలుగా గల నంశముల నాటింటిని వివరించి వానికి జూపవలసిన శాస్త్ర ప్రమాణముల వివరించి వానిని ఖండించిరి. యాజ్ఞవల్క్యస్మృతి, పరాశరస్మృతి, మనుస్మృతి, నారదస్మృతి, వాసిష్ఠస్మృతి, గర్గస్మృతి, ఆపస్తంభస్మృతి, వ్యాఘ్రపాదస్మృతి, దేవలస్మృతి నుండి కూర్మ గరుడ ఆదిత్యపురాణముల నుండి, ఋగ్వేద బ్రాహ్మణము నుండి ఉదహరించి ప్రతిపక్షుల వాదముల ఖండించి తన వాదమును నిలబెట్టుకొనిరి. తన యిష్టదైవతమగు

శ్రీమద్గోపాల పరబ్రహ్మమూర్తి తన హృదయమున కిట్లు దోపించినందునను, బుద్ధిమంతులయిన కొందరిప్పటి పెద్దల యభిప్రాయంబులును ఇట్టివైనందునను కొందఱు విపక్షులవలె గొందరవ్యుత్పన్నులు విచారింపకయే మోసపోవుదురో యను భయంబు వలనను సులభశైలినీ యుపన్యాసము స్వకీయ 'పత్రికా ముఖంబునం బ్రచురించినాడను' అని వినయముగ విన్నవించిరి.

'ఎవ్వనిమట్టునకు వాడు తానే బుద్ధిమంతు డనుకొనుట సర్వదాపనికి రాదు. సాధ్యమైనమట్టునకు భగవంతుని మీద భారముంచి పూర్వాచారముల ననుసరించుచు వేదశాస్త్రములకు విరోధముగ నుండక హీనాచారములం గైకొనక పరుల దూషింపక తాను దూషింపబడకుండ విద్వత్పరుడై నీతిగలిగి యుండవలెను. నా విజ్ఞాపన మాలకించి ధీమంతు లయినవారిందుగల మంచి యంశములను జూచి చ ... 'మని యసంపూర్ణముగ నున్నది. వ్యాసము ముగింపునకు వచ్చినది. ఒకటి రెండు వాక్యములింకను నుండనోపును.

ఋషితుల్యులైన మహాకవులు ఘటనాఘటన సమర్థులు. ఏస్మృతుల నాధారముతో నీవిషయముల ఖండించిరో యా స్మృతుల యాధారము తోనే వానిని సమర్థింపజాలుదురు. శ్రీరాములుగారు ప్రథమమున వీరేశలింగంపంతులు గారిని ప్రతిఘటించినను తరువాత ఆ యుద్యమము సదుద్దేశముల నాకళించుకొని 'తాబట్టిన కుందేటికి మూడేకాళ్ళని' తన వాదమే నెగ్గవలెనని, తను జెప్పినదే యెల్లరును సర్వదా శిరోధార్యమని గ్రహింపవలెనని యనక వారి ఉద్యమమునకు చేయూత నొసగిరి. ఈ పత్రిక స్థాపించిన 18 సంవత్సరముల తరువాత జరిగిన యొక సభను గూర్చి శ్రీరాములగారి జీవితచరిత్రలో విష్ణురావుగారు వ్రాసిరి.[16] 1898 వ సంవత్సరము గుంటూరు జిల్లాలో జరిగిన సభను గూర్చి శ్రీ రాయసం వెంకటశివుడుగారు ఆంధ్రపత్రికలో వ్రాసిన విషయమును వివరించిరి. శ్రీరాయసం వెంకటశివుడుగారు వారి 1896 జులై 'జనానా' పత్రికలో నిట్లు వ్రాసిరి. 'ఏలూరులో న్యాయవాదులుగ నుండిన మ.రా.రా. శ్రీశ్రీ దాసు శ్రీరాములు పంతులుగారు సంఘసంస్కరణ విషయముల గురించియు ముఖ్యముగ స్త్రీ విద్యాస్వాతంత్ర్యము లను గురించియు సాధారణ జనుల యుపయోగార్థమై కడచిన నెల రాజమహేంద్రవరము, బెజవాడ మొదలగు తావులందు రమ్యములగు నుపన్యాసములు చేసిరి. ఉద్యోగముల నుండి కొంత తీరిక గల యితర

విద్యావంతులు గూడ నిట్లు పాటుపడినచో తెలుగు దేశమునకు శీఘ్రమే మంచిదశ వచ్చును.'[17] 1902 జూన్ నెల 7 వ తేదీ ఉయ్యూరు గ్రామములో శ్రీ శ్రీరాములు గారి యధ్యక్షతన జరిగిన కృష్ణా మండల సంఘసంస్కరణ సభ గూర్చి శ్రీ రాయసం వెంకటశివుడుగారు వారి జూన్‌నెల 'జనానా' పత్రికలో ప్రశంసించి యుండిరి.[18] శ్రీకె. రమణారెడ్డిగారు 'ఆంధ్రజ్యోతి' వారపత్రికలో ప్రచురించిన శ్రీదాసు శ్రీరాములుగారి లేఖలో వారి మనుమరాలు దుర్గాంబగారికి పదకొండుఏండ్ల ప్రాయము ననే వైధవ్యము సంప్రాప్తమైనపుడు వారెంత మనోవేదన పడినది యందు వివరించిరి. ఆ వివాహము వివాహమే కాదనిరి. అధర్మ వివాహ మనిరి. తన యుపన్యాసములను తన యుద్దేశములను గ్రహించిన తన కుమారులు వారి మేనకోడలి విషయమై యట్లు దాసీనముగ నుండుట మేలాయని వాపోయిరి.

ఈ 'అనల్ప జల్పితాకల్ప కల్పవల్లి' పత్రిక ప్రచురించునాటికి శ్రీరాములు గారు స్త్రీ పునర్వివాహ విషయముపట్ల విముఖులని విశదమగుచున్నది. అటు తరువాత వారి యభిప్రాయమును మార్చుకొనిరి. కావున నీ పత్రికావశ్యకత లేకుండుటచే యొక సంవత్సరమునకే మూత పడినది. ప్రతిభా వ్యుత్పత్తులు పుష్కలముగా గల పండితప్రకాండులలో వీరొకరని యీ పత్రిక ఋజువు చేయుచున్నది. న్యాయవాదులగుటచే యుక్తి ప్రతియుక్తులు, ఖండన ప్రతిఖండన లలో వాదనాపటిమను ప్రదర్శించిరి. దీనిని ప్రతియొక్కరును చదివి గ్రహింప వలసి యున్నది.

ఈ పత్రికానిర్వహణము వంశపారంపర్యముగ దాసువారింట వచ్చు చున్నది. వీరి తరువాత వారి ద్వితీయపుత్రులు శ్రీదాసు నారాయణ రావు గారు 'కృష్ణాపత్రిక' సంపాదకులుగ నుండి నిర్వహించిరి. ఇది యెల్లఱెరిగిన విషయమే శ్రీరాములుగా జ్యేష్ఠపుత్రులు శ్రీదాసు కేశవరావుగారును 1834 లో 'జ్ఞానోదయము'[19] అను యెనిమిది పుటలు గల పక్షపత్రికను ఏలూరు నుండి ప్రచురించిరి. వారి ప్రథమ పుత్రులు బారిష్టరు గారైన శ్రీదాసు త్రివిక్రమరావు గారు 'ఆంధ్రవాణి' యను పత్రికను వాణీ ముద్రాక్షరశాల యందు ముద్రించి ప్రచురించిరి. వీరి కుమారులు కూడ సహాయ సంపాదకులుగ నేడు పనిచేయు చున్నారు.

# అధోజ్ఞాపికలు


1. Studies In the History of Telugu Journalism - Ed. by K.R. Seshagiri Rao - Origins of Telugu printing - J. Mangamma. P. I.
2. 101. D - Origin of Telugu Jouralism - Hundra P. 8.
3. 1857 పూర్వరంగములు – శ్రీ దిగవల్లి వెంకటశివరావు, బి.ఏ; బి.యల్; విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ, 1951.పు॥లు 24,37.
4. 1857 పూర్వరంగములు – శ్రీ దిగవల్లి వెంకటశివరావు, బి.ఏ; బి.ఎల్. విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ, 1951.పు॥లు. 24,37.
5. *Telugu Journalism - Past and Present by Sri D.V. SivaRao. P.27*
6. *Literary Journalism -by Nidadavolu Venkata Rao, p. 57*
7. *Literary Jouralism by Nidadavobu Venkata Rao. P. 57*
8. *Beginnings of Telugu Journalism by Arudra. p. 17*
9. *Ibid, p. 10*
10. వీరేశలింగం పంతులు సమగ్రపరిశీలన – డా॥ అక్కిరాజు రమాపతి పు.183.
11. వీరేశలింగము పంతులు – సమగ్ర పరిశీలన – డా॥ అక్కిరాజు రమాపతి రావు, విశాలాంధ్ర ప్రచురణ, విజయవాడ, 1972, పు. 186
12. *Literary Journalism by Sri Nidadavolu Venkata Rao. P. 77.*
13. *Beginnings of Telugu Jouralism by Arudra, pp. 18,91*

14 వీరేశలింగంపంతులు – సమగ్రపరిశీలన, పు.206.

15. దాసు శ్రీరాములు గారి జీవితచరిత్ర– దాసు విష్ణురావుగారు, అముద్రిత ప్రతి, పు.25).
16. శ్రీరాములుగారి జీవితచరిత్ర – శ్రీ దాసు విష్ణురావుగారు, పు॥లు 41,45
17. తెలుగుజనానా – శ్రీ ఆర్. వెంకటశివుడు గారు, బి.ఏ.,జులై,1896,సంపు. 5, పు॥ 16.
18. తెలుగుజనానా – శ్రీ ఆర్ వెంకటశివుడు, బి.ఏ., జూన్ 1902,సంపు. 9, సంచిక 12. పు. 379.

19 చింతామణి సంపు. 3, 1893–94 – ఎడిటర్ ఎన్. సుబ్బారావు, బి.ఎ. గారు. జ్ఞానోదయ పత్రిక ప్రకటన రాజమండ్రి పై చింతామణి పత్రిక యందు కలదు.

# 8. కదంబ సుమములు

## (i) రాజకీయ, సాంఘిక పరిస్థితులు

స్వాతంత్ర్యయోధుల రుధిరధారలచే నరుణిమ జెందిన భారతాభవీథుల రాహు విముక్తుడైన బ్రిటిష్ భానుడు దేదీప్యమానముగ తేజరిల్లు చున్న దినములవి. ఒక శతాబ్దము పైగా సాగిన నిరంతరాంతర్యుద్ధముల వలన దేశము రక్తసిక్తమై భీభత్సముగ నున్న దినములవి. ప్రజలు శాంతి సౌఖ్యములకై యలమటించి తపించి తరుణోపాయమునకై యన్వేషించుచున్న కాలమది.

ఇంతకుపూర్వము రత్నగర్భయని యశేషకీర్తి వడసిన భారతదేశపు నడిగడ్డపై పదునాఱవ శతాబ్దమున నాళందులు, బుడతకీచులు, పరాసులు, ఆంగ్లేయులు వర్తకవ్యాజమున నడుగుపెట్టిరి. క్రమక్రమముగ సంస్థానాధీశుల నుండి యీ సుసంపన్న దేశమును చేజిక్కించుకొని వారి కరణ మొసగి విదేశీయులే పరిపాలింపసాగిరి. ఈ వర్తక సంఘములలో నాంగ్లేయులది పై చేయి. కావున దేశమంతటిని వారే స్వాధీనము చేసికొనిరి. ఈ యాంగ్లేయ వర్తకులు కంపెనీవారని పిలువబడుచుండిరి. ఈ కంపెనీ యుద్యోగస్థులు లంచగొండులై పేద ప్రజానీకమును పీడించి దుష్పరిపాలన చేయసాగిరి. భూస్వాముల దోపిడికే వెన్ను విరిగియున్న రైతులపై పన్నులభారమధికముగా మోపిరి. భూస్వాముల నుండి రక్షించుటకు రైత్వారీవిధానము ప్రవేశపెట్టినప్పటికిని యీ పన్నులభారము వారు మోయలేనిదైనది. పన్నులు చెల్లించనివారిని క్రూరముగా హింసింపసాగిరి. 'డాంబేసెమరు' అను నొక ఆంగ్లేయుడు కోయంబత్తూరు జిల్లాలో నొక గ్రామములో నధికారులు రైతులను పెట్టిన బాధలను స్వయంగా చూచి బ్రిటిష్ పార్లమెంటు ఎదుట నిట్లు చెప్పెను – 'కొందరిని తలక్రిందులుగా కోదండము వేసిరి. కొందరిని రెక్కలు విఱచి కట్టిరి. కొందరి నెత్తిన బండలు పెట్టి కొరడాలతో బాదిరి. కంపెనీ ఖజానాలో డబ్బు తక్కువైనప్పుడు భూమిశిస్తు వారు పెంపసాగిరి. శిస్తులభారము పెరుగుటతో బాటు చెఱువులు, కాలువలు మరామత్తులు చేయించుట మానిరి.[1]

భూమిశిస్తు 50% మిగిలిన ఇతర పన్నులు 25% కట్టెడివారని హిందూదేశము నందు అమెరికా మిషనరీగనున్న రెవరెండు జె.టి. సండర్లాండు గారు వివరించిరి.[2]

'మోతార్భా' యను నొక విధమగు తలపన్నును విధించి యే వృత్తి గాని, యే వ్యాపారముగాని చేసికొన వీలులేని హీనస్థితికి ప్రజలను దిగజార్చిరి.[3] తిండికి బట్టకు ప్రజలు మొహము వాచిరి. కనీసము ఉప్పుతో గంజినీళ్లు త్రాగుదుమన్నను వీలులేకుండ ఉప్పుపన్ను విధించిరి. ఇంగ్లాండు దేశపు యంత్ర పరిశ్రమతో పోటీ చేయలేక బాధపడుచున్న నేత మగ్గముల వారి మీదను ఈ పన్నుల భారము పడుట వలన రాట్నములతో బాటు ఆ పరిశ్రమ గూడ మూలబడినది. ఎక్కువ పన్నులు వసూలు చేసినవారిని పై అధికారులు శ్లాఘించు చుండిరి. కావున ఈ క్రింది అధికారులు ప్రజలను పీడింపసాగిరి.

1816 లో సర్ థామస్ మన్రోగారి 'సలహా' ప్రకారము 'తాసిల్దారు' గారి 'రెవిన్యూ' అధికారి 'పోలీసు' వారిపైనను అధికారి యగుట వలన అదుపు లేక విజృంభించిరి. దీనివలన 'జిల్లాకలెక్టరు' ఇష్టానిష్టముల బట్టి పన్నుల విధింపు జరుగుచుండెడిది. పన్నులు చెల్లింపనివారి ఆస్తిపాస్తులే కాక నాగళ్ళు మొదలగు పనిముట్లను గూడ 'జప్తు' చేసి వారిని బాధించిరి. గ్రామసీమల నుండి తొలగింపబడిన రైతాంగము పొట్టగడువక వేలసంఖ్యలో సైనికులుగ చేరిరి. దేశీయులైన తమ సహోదరులపైన కత్తినెత్తిరి. మరి కొందరు బందిపోటులైరి. వీరే పిండారీలు, థగ్గులు. మహారాష్ట్రసేనలో కొందరు ఈ దారి దోపిడీదారులకు నాయకత్వము వహించిరి. వీరు దేశమంతటా విచ్చలవిడిగా విజృంభించిరి. అప్పటి దేశస్థితిని రెండు పద్యములలో 'ఆంగ్లేయ పరిపాలనా ఫలితముల'న్న చిన్ని పొత్తములో నిట్లు' వర్ణింప బడినవి.

గతియింపలేదు లోకఖ్యాతమైన ఢ
క్కామల్లు నేతమగ్గముల పనులు
కడముట్టలేదు బంగాళములోని మే
ల్వలి పెంపుఁబట్టుదువ్వలువ పనులు
చెడిపోవలేదు వాసింగన్న యానాము
మరఫిరంగి పరిశ్రమములవృత్తి
నశియింపలేదు నానా సాగరములో
గ్రాలు హైందవ నావికాచయంబు

ప్రబల మొగలాయి సామ్రాజ్యభానుబింబ
మస్తమించెడి నందాక నస్తమింప
కుచ్చదశనున్న దేశభాగ్యోదయంబు
సమసె నీష్టిండియా పణిక్సంఘశక్తి.

పలువిధంబుల సస్యములకుఁ దావలమయ్యె
క్షామదేవతకు వాస్తవ్యమయ్యె
కనకరత్న కదంబకముల కాకరమయ్యె
గర్భదారిద్ర్యమే ఖాయమయ్యె
మువ్వైపు సంద్రముల్ మొనయుచున్నను నుప్పు
నకుఁ గొఱగాని హైన్యంబు గలిగి
పట్టు ప్రత్తికి నాటపట్టయ్యు పెఱవారి
కట్టుగుడ్డలె తారకంబులయ్యె
అంగడుల నన్నియున్నవి యల్లునోట
గడ్డ యనుటకుఁ దార్కాణ గాననయ్యె
భరతవర్షంబునాఁ గల్పతరువెకాని
యనుభవము మాత్ర మొరులపాలయ్యె నకట!

అధికారుల దుర్మార్గములను పైయధికారులకు తెల్పుకొనుటకు సామాన్య ప్రజలు తగినంతటి విద్యావంతులు కారు. వారికి అక్షరజ్ఞానము లేదు. భూస్వాములలోను, వర్తకులలోను కొంచెము విద్యాసంస్కారము గలదు. 15 కోట్ల భారతీయ ప్రజలలో మూడు నాల్గువేలమందికి కొన్ని చిన్ని యుద్యోగము లీయబడినను ఆ యుద్యోగములకు సగటున సాలుకు 300 రూపాయలకన్న హెచ్చుజీతములు లేవు.[4] ప్రభుత్వములో భారతీయులకిట్టి పలుకుబడియు దినదినమునకు చెలరేగుచున్న వీరి దుండుగములకు గురియై ప్రజలు దుర్భరదారిద్ర్యములో నలమటించిరి. చక్కగ పండిన సంవత్సరములలో నైనను 4,5 కోట్లమంది ప్రజల కాహారము లేకుండెను. హిందూదేశమందలి ప్రజాసామాన్యములో నయిదవ భాగమునకు దినతిండి, కట్టుకొన బట్ట లేకుండెనని 1820 లో నందన నామ సంవత్సరపు కఱవు, 1876లో ధాత నామ సంవత్సరపు కఱవుల వలన నిరూపిత మగుచున్నది. శ్రీరాములు గారు 1876 వ సంవత్సరపు

కఱవు సందర్భముగ ప్రజలు బాధపడిన విషయము 'అనల్పజల్పితాకల్ప కల్పవల్లి' లో పేర్కొనిరి.

దేశము నలుమూలల నశాంతిజ్వాలలు జ్వలించినవి. ఆంధ్రదేశమున వాని నడంచుటకు కొందరు మహానుభావులు నడుము కట్టుకొనిరి. వారు శ్రీ కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్ళేగారు, 'కుంఫినీ' వారి కొలువులో 'సూపరిండెండెంటు మేజిస్ట్రేట్' గా పనిచేసిన శ్రీ పెంబాకం రాఘవాచార్యులవారును, శ్రీ వెన్నెలగంటి సుబ్బారావు పంతులు మొదలగువారు ప్రజాసేవ కుపక్రమించిరి. శ్రీ గాజుల లక్ష్మీనర్సుశెట్టిగారు 'చెన్నపట్టణస్వదేశీ సంఘము' అను ప్రజాసంఘమును 'క్రెసెంటు' అను జాతీయ పత్రికను, 1844 లో స్థాపించి గొప్ప రాజకీయ ఆందోళన లేవదీసి యిరువదియైదేండ్లు ప్రజాసేవ చేసిరి. వీరు నీలిమందు వ్యాపారము చేసి విశేష ధనమార్జించిరి. ఆ ధనమంతయు ప్రజాసేవకే వినియోగించిరి. చెన్నపట్టణపు 'హైకోర్టు అడ్వకేటు జనరల్ ' గా నున్న 'జాన్ బ్రూన్‌నార్ట ను' వారు గూడ దోడ్పడిరి. ఆంధ్రుల యగచాట్లు గురించి పార్లమెంటుకు శ్రీ లక్ష్మీనర్సుశెట్టిగారు పదే పదే 'మహజరు' ల పంపి వారికి నివేదించి కొంత కృషి చేసియుండిరి. వీరందరు చేరి ' హిందూ లిబరరీ సొసైటీ' యను ప్రజా సంస్థను స్థాపించి ఇంగ్లీషు విద్యాభివృద్ధికి కారకులైరి. వీరి తరువాతి తరము వారు వీరి కృషిచే ప్రభావితులై వీరు చేయుచున్న సంఘసేవ నందిబుచ్చుకొని రాజకీయ సాంఘిక సంస్కారములను గూర్చి కృషి చేసిరి. సామ్రాజ్యవాదపు దోపిడి క్రింద నలిగిపోవుచున్న ప్రజానీకము బ్రిటీష్‌వారిని ద్వేషించి, వారి పరిపాలనను అంతమొందింప మార్గము లన్వేషించుచుండిరి. ప్రజలేకాదు సంస్థానాధీశులు, సైనికులు సహితము ప్రభుత్వమును ద్వేషింపసాగిరి. వారి ప్రభుత్వమును కూలద్రోయుటకు మంత్రాంగములు జరుపుచుండిరి.

ఆంగ్లేయులు హిందూమతమువారి జోలికిపోవకయున్న వారి ప్రభుత్వము చిరస్థాయిగ నుండెడిదేమో! ప్రపధమమున 'కుంఫిణీ గవర్నరు' లు, 'కలక్టరు' లు హిందూదైవములను గౌరవించెడివారే ![5] ఆ శ్రీరంగదేవుని ఉత్సవములలోను తిరువాన్కూరు పద్మనాభస్వామి రథోత్సవము లోను ఆంగ్లోద్యోగులు బారులుతీర్చి ముందు నడచుచు గౌరవించెడివారట. కాని క్రమక్రమముగ వారు క్రైస్తవమత

ప్రచారము చేయుట నారంభించిరి. అక్కడక్కడ పాఠశాలలోని బాలురను బాలికలను వారి మతములో కలుపుకొనుచుండిరి. వారి తల్లిదండ్రులీవిషయమై 'ప్రీవీకౌన్సిల్' వరకు బోవుట కూడ కలదు. బ్రాహ్మణ బాలురనేగాక మహమ్మదీయ బాలబాలికలను గూడ వారి మతములో కలుపుకొను చుండిరి. ఈ విషయములు శ్రీ దిగవల్లి శివరావుగారు రచించిన '1857 పూర్వరంగమను గ్రంథములో విపులముగ వర్ణింపబడినవి.

అది 1844 వ సంవత్సరము. మరి రెండు సంవత్సరములకు అనగా 1846 లో శ్రీ శ్రీరాములుగారు జన్మించిరి. అపుడు ఆంధ్రదేశమున క్రైస్తవమత ప్రచారము ముమ్మరముగ నుండెను. 'బైబిలు' పాఠ్యగ్రంథముగ పెట్టవలెననియు, ప్రయత్నములు జరిగినవి. 'చర్చ్'లు ప్రార్థనామందిరములు పలుతావుల నిర్మింపబడినవి. బందరులో నోబుల్‌దొరగారు నోబుల్ పాఠశాల స్థాపించిరి. ఆ చుట్టు ప్రక్కల గ్రామములందలి సంపన్న కుటుంబీకుల పిల్లలచ్చట విద్య నభ్యసించు చుండిరి. శ్రీరాములుగారు నచ్చట విద్యనభ్యసించుటకు పోయిరి. దొరగారప్పు డప్పుడు వారింటికి గొనిపోవుట తల్లిదండ్రులు వినిరి. ఆ దినములలో క్రైస్తవ మిషనరీలు హిందూబాలురను వారి మతములో చేర్చుకొనుట వినియున్న తల్లితండ్రులు దొరగారికెట్టి దురుద్దేశము లేకపోయినను భయపడి వెంటనే స్వగ్రామము నకు పిలిపించుకొనిరి. అప్పటికింకను రైలు మార్గములు లేనందున ఒక ఒంటెద్దుబండి కట్టించుకొనిపోయి బాలుని తీసికొనివచ్చిరి.

1839లో 'లార్డు ఎనిఫినిస్టన్' యొక్క ప్రణాళిక ననుసరించి 'మద్రాసు ప్రెసిడెన్సీ' లోని 'జిల్లా' కేంద్రములలో ఇంగ్లీషు బోధనా భాషగా గల పాఠశాలలు నిర్మింపబడవలెనని, తిరుచినాపల్లి, మచిలీపట్టణము, బళ్ళారి, కేలికట్‌లలో పాఠశాలలు స్థాపింపబడినవి.[6] మచిలీపట్టణము నందలి పాఠశాలలో శ్రీరాములు గారు విద్య నభ్యసించిరి. 1857 లో మద్రాసు విశ్వవిద్యాలయము స్థాపింపబడినది. అప్పటికి భారతదేశమున మద్రాసు,కలకత్తా,బొంబాయి నగరములలో మూడు విశ్వవిద్యా లయములు స్థాపింపబడినవి. వీని ద్వారమున పాశ్చాత్య సాహిత్య సంస్కృతులు దేశమున వ్యాప్తిపొందినవి.

ఆంగ్లేయులు ఏ ఉద్దేశ్యముతో నీ విద్య ప్రవేశపెట్టినను ఫలితము మాత్రము భారతీయుల మూఢవిశ్వాసములు నశించినవి. దేశప్రజలందరు ఒక త్రాటిపై నడచిరి. అందరిలోను రాజకీయ సాంఘిక ఆర్థిక స్వాతంత్ర్యాభిలాష రేకెత్తినది. ఇంగ్లీషు చదివినవారికి ఉద్యోగములిచ్చి ప్రోత్సహించినవారు ఉద్యోగములలో పడి స్వరాజ్యముమాట యెత్తరని యభిప్రాయపడిరి.

ఈ దేశపు ప్రజలు క్రమక్రమముగ ఇంగ్లీషువారి నాగరికత కంతటికి దాసానుదాసులు గాగలరను భావము ప్రభుత్వమునకున్నది.[7] దానితో భారతీయ పాఠశాలలలో నింగ్లీషుభాషకు ప్రాముఖ్యమిచ్చుట సంభవించినదని కొందరభి ప్రాయపడిరి. ఏది ఏమయినను నింగ్లీషు భాష ప్రజలకు కనువిప్పు కలిగించినది. భారతీయులకు విశాల దృక్పథము అలవరచినది. తాము పరాధీనులుగ నున్నామని గుర్తించిరి. 'తనుకట్టు త్రాడు తానేతెచ్చుకొన్నట్లు' ఆంగ్ల విద్యవలననే ఆజ్ఞానవిముక్తులై జ్ఞానోదయమై ఆంగ్లేయులపైనే కత్తి కట్టిరి. 'చినికి చినికి గాలివానయైనట్లు' 'కుంఫినీ' వారి తప్పిదము లొక్కొక్కటి కలసి చివరికి మహావిప్లవము 1857 వ సంవత్సరమున నాలుగువైపుల నుండి ముంచెత్తినది. ఉత్తర ప్రదేశము ప్రధాన కేంద్రమైనది. ఝాన్సీలక్ష్మీబాయి, నానాసాహేబ్, అయోధ్యాబేగం, తాంతియాతోపె, మొదలైనవారు ఈ విప్లవమున నాయకత్వము వహించిరి. ఆంగ్ల ప్రభుత్వము దీనిని అతి చాకచక్యముతో నణచి వైచినది. విప్లవకారుల నతి క్రూరముగ శిక్షించినది.

ఈ ప్రథమ సంగ్రామ వార్తలు దేశమంతట వ్యాపింపగనే 1857 లో కొండదొరలు 'సన్యాసిభూపతి' యను వ్యక్తి నాయకత్వమున తిరుగుబాటు చేసిరి. కాని యిదియును అణచివేయబడినది. 1864-65 లో బ్రిటిష్‌వారు 'ఏజెన్సీ ' ప్రాంతమంతట 'పోలీసుస్టేషనులు' స్థాపించిరి. అయినప్పటికి 1879-80 లో 'రంపపితూరి' ప్రారంభమయినది. మన్యము రైతులు, 'ముఠాదారుల' అధికారుల దౌర్జన్యమునకు వ్యతిరేకముగ నీ తిరుగుబాటు చేసిరి. బ్రిటిషువారి ప్రభుత్వము వైదొలగించుటకుగాని, వారిని దేశము నుండి వెడలగొట్టవలెనను ఉద్దేశముతో గాని ఈ విప్లవము ఆంధ్రదేశములో చెలరేగలేదు. ఉత్తరహిందూస్థానమున సిపాయిపితూరి యొక్క లక్ష్యము 'షా ఆలం' అను మొగలాయి చక్రవర్తిని

సింహాసనస్థుని చేసి బ్రిటిషువారిని వైదొలగించుట. ఆంధ్రులకు, ఆంగ్లేయులపైగల అభిమానము నకు కారణము కొందరు ఆంగ్ల ప్రముఖులు వారి సాహిత్యము నకు సంఘమునకు చేసిన యఖండసేవ కారణమై యుండవచ్చును. వారిలో కొందరు ప్రముఖులు గెలియర్, నార్టన్‌బ్రూస్, బ్రౌను, మెకంజీ మొదలగువారు. గాజుల లక్ష్మీనరసుసెట్టిగారికిని నార్టన్‌గారికిని మిక్కిలి స్నేహము కలదు. అట్లే యాంధ్ర కుటుంబములతో చాలమంది ఆంగ్లేయులకు స్నేహము కలదు. ఒకరింటికొకరు వచ్చి పోవుటయు గలదు. నోబుల్‌దొరగారు శ్రీరాములుగారిని వారింటికిని గొనిపోయి ఫలహారములను గూడ బెట్టెడివారట. – శ్రీరాములుగారు వారి కుమారుని వివాహ సందర్భమున నావూరి యాంగ్లేయులకు వారింట గొప్పవిందు చేసిరట. ఇట్లు పరస్పర సన్నిహిత స్నేహసంబంధములుండుటచేతనో పాశ్చాత్యుల యందలి వ్యామోహము వలననో వారివరకు వచ్చినగాని కార్యమునకు గడంగని ఆంధ్రుల నిర్లక్ష్యభావము వలననో ఆంధ్రులు ఏ విప్లవమున బాల్గొనలేదు.

1857 అనంతరము దేశమున రాజకీయ సాంస్కృతిక రంగములలో గొప్ప మార్పులు వచ్చినవి. కుంఫినీ పరిపాలన యంతరించినది. విక్టోరియా మహారాణి ఇండియా చక్రవర్తినియైనది. భారతీయులు వారి కడగండ్లు గట్టెక్కినవని సంతసించిరి.

ఏ మతవిశ్వాసం గలవారికి గాని యే యాచారములు గలవారికి గాని మేము అధికాదరణమును గాని అనాదరణముగాని చూపించము. అందరిని సమానముగ చూచెదము. మతాచారములలో నే విధముగ జోక్యము కలుగ జేసికొనము. శాసనధర్మము యొక్క సంరక్షణము నందరు సమానముగ పొంది సుఖముగ నుండవచ్చునని విక్టోరియారాణి ప్రకటించినది. సంస్థాన ప్రభువుల కయ్యములతోను, విప్లవములతోను, బందిపోట్ల దోపిడులతోను, కఱవు కాటకము లతోను విసిగి యున్న ప్రజాళికీ ప్రకటన నమృతసేచన మైనది. కవి, గాయకులు జయగీతముల పాడిరి. వారితో పాటు మన కవిగారును గొంతుకలిపి 'అన్నుల పాణి విక్టొరియాఖ్యరాణి నిత్య నిరుపమ కల్యాణి సత్యవాణి' అని ద్వాత్రింశతి పద్యములు పాడిరి. అదియే విక్టోరియా 'ద్వాత్రింశతి.'

బ్రిటిషువారిలో గూడ ఎంతో మార్పు వచ్చినట్లు ఆమె ప్రకటనలోనే కానవచ్చు చున్నది. హతశేషములయిన స్వదేశీ సంస్థానముల జోలికి పోకుండుట, భారతీయుల మతాచారముల నపహసింపకుండుట, వారితో సాధ్యమైనంతవరకు సాన్నిహిత్యము పెంపొందించుకొనుట, అవశ్యకర్తవ్యమని వారు గ్రహించిరి. విక్టోరియా రాణికి ప్రతినిధులుగ నిచట పరిపాలనను నిర్వహించువారు ఈ దేశ ప్రజల భాష లెరుగకుండ అభిప్రాయ ప్రకటనను నడుపుట అసాధ్యమని విశదమయినది. కాబట్టి పరిపాలనలో భారతీయుల తోడ్పాటు అవశ్యకమని, అందులో వారికి ఆంగ్లభాష బోధింపవలెననియు, ఆంగ్లము నేర్చిన భారతీయులు స్వరాజ్యము కూడ తలపెట్టకుందురనియును నాంగ్లేయులు అపోహపడిరి.

కాని ఆంగ్లభాషాధ్యయమువలన భారతీయుల విజ్ఞానమినుమడించినది. వ్యాపారము పరహస్తమైనదని గుర్తించిరి. చేతిపరిశ్రమ ఒకటొకటీ మూలపడినది. మాంచెష్టరు యంత్రాగారములతో పోటీచేయ లేక రాట్నములు అటకల కెక్కినవి. దేశైశ్వర్యము విదేశములకు తరలింపబడినది. ఆర్ష విజ్ఞానమంతరించినది ప్రజల కొరకు వారి క్షేమము కొరకు యంత్రాగారములు, ఆంగ్లపాఠశాలలు నిర్మించితిమని కలిగించిన నమ్మకము వమ్మయినది.

1857 లో తపాల పద్ధతి ప్రవేశపెట్టబడినది. 1857లో రైలు మార్గములు వేసిరి. ప్రజలు వీనిని జూచి యబ్బురమంది వింతగ జెప్పుకొనిరి.[8]

అచ్చమ్మా యిది యేమిటె ! రెయిలటే ఆసి యిదేనా సరే
బుచ్చమ్మా వినలేదటే గడియలో బోవచ్చునే కాశికిన్
అబ్బో దేహము గ్రుద్దుకోదటే అయో ఆ సౌఖ్యమేమందునే
యిచ్చారాజ్యమటంద్రు ట్రైనుగని యెంతయే వింత విప్రాంగనలో

ఇంతలో విక్టోరియా మహారాజ్ఞీ స్వరస్థులైరి. అందరితోపాటు వారును ఇట్లు దుఃఖించిరి.[9] 1902 లో ఎడ్వర్డు ప్రభువు కిరీటధారణ పట్టాభిషేకోత్సవములు జరిగినవి.

పూర్ణగుణధాము డెడ్వర్డు భూమిధవుడు
సీమలో నేడు పట్టాభిషిక్తుడయ్యె

లండనస్థుల కన్నుల పండువయ్యె
హిందుజనులకు మానసానందమయ్యె.[10]

అని మరియొకసారిప్రజలు జయగీతిక లాలపించిరి. వారికింకను బ్రిటీషు వారిపై నమ్మకము గలదు. పాశ్చాత్య మోహజాలములో జిక్కి సర్వము విస్మరించిరి. విద్యాధికులు ఈ కుతంత్రము లెఱిగి యా మాయనుండి నిద్రాణమైన జాతిని మేల్కొలుపవలెనని నిశ్చయించిరి. దేశభక్తులూరూర ఇంటింట వెలసిరి. క్రమక్రమముగ భారతీయులకు కనువిప్పు గలిగించిరి. పాశ్చాత్య వ్యామోహములో బడి పారతంత్ర్యమున నున్నామని గుర్తించిరి. బ్రిటీషు వారిని భూషించిన నోటనే దూషింపసాగిరి. మరల దేశవ్యాప్తంగా స్వాతంత్ర్యోద్యమము ఉద్ధృతముగ గొనసాగినది. ఈ పర్యాయము ఉత్తర హిందూస్థానమే గాక దక్షిణ హిందూ స్థానము గూడ పాల్గొనినది. ఈ సమరమున నెవరికివారే సేనాపతులు. ప్రక్కవారిని ప్రబోధించి వారిని గూడ నడుము గట్టించి యుద్ధరంగమున కురికించుచుండిరి. ఈ సమరమొకచోట ఒకనాడు జరిగినది కాదు. ఒక అర్థశతాబ్దము సాగినది. శ్రీరాములునాటికది ననలెత్తసాగినది. రక్తపుబొట్టు చిందింపకయే స్వాతంత్ర్యము సంపాదింప నిశ్చయించిరి. ఈ సమయమున కత్తులకు మారుగా 'కలముల' బట్టిరి. పత్రికలు వారి యుద్ధరంగములు, సభాస్థలులే వారి సైన్య సమీకరణ స్థలలు. చాతుర్వర్ణ ప్రజలే చతురంగబలములు. మూడుకోట్ల ప్రజానీక మొక్కటై సాగినది. పరదేశీయులై నప్పటికిని 'జార్జి నార్టన్‌బ్రూస్' 'కాటన్‌హ్యూమ్' మొదలగువారు వారికి తరుణోపాయముపదేశించిరి. జాతీయ కాంగ్రెస్ ఏర్పడినది. దీనికి ముఖ్యకారకుడు బ్రిటీష్‌దొర హ్యూమ్.

ఇంతలో లార్డు కర్జన్ బెంగాల్ విభజన నొనరించెను. మరల ఇంకొక కురుపాండవ సమరము సమారంభమైనది. దాదాబాయి నౌరోజీ కలకత్తాలో స్వరాజ్య శంఖారావము పూరించెను. 'స్వరాజ్యము నా జన్మహక్కు' అని తిలక్ విప్లవధ్వజమెత్తెను. ఫిరోజిషా మెహతా, గోపాలా కృష్ణ గోఖలే, సురేంద్రనాద్ బెనర్జీ, రెనడే మొదలగువారు పారతంత్ర్యమును పారద్రోలవలెనని పట్టుబట్టిరి. 'వందే మాతరం' అని ప్రజాసేన బిలబిల ముందుకు సాగినది. ప్రజలెంతటి త్యాగమున కైనను సంసిద్ధులుగ నుండిరి. ఈ సందర్భముననే బిపిన్‌చంద్రపాల్ గారు ఆంధ్రదేశమున ప్రచారమునకు వచ్చినపుడు ఆ సభకు అధ్యక్షులుగ నుండుటకు

పెద్దలందరు భయపడుచుండ శ్రీరాములుగా రధ్యక్షత వహించి యెటువంటి 'అరస్టు'లు జరగకుండ సభను జయప్రదము గావించిరి. బిపిన్‌చంద్రపాల్ పర్యటనతో విజృంభించిన ఆంధ్ర తేజము ఆశాంతము ప్రసరించినది. ఆంధ్రులు నడుము బిగించి ముందు కురికిరి. వీరిని ప్రబోధించుచు రాజకీయ, మత, సాంఘిక, సారస్వత పత్రికలు వెలువడినవి. 1892 లో కందుకూరి వీరేశ లింగం పంతులుగారు ప్రచురించిన 'పురుషార్థప్రదాయిని' , 1874 లో 'వివేకవర్ధిని', 'చింతామణి', 'జనవినోదిని', 'సత్య సంవర్ధని', 'ఈశ్వరవాది', 'జనానా', 'కౌముది', 'సతీహితబోధిని', 'సుజనరంజని', 'వ్యవసాయము', 'తత్వసాధని', 'కామేశ్వరి', 'హిందూసమాజ సంస్కారిణి', 'సావిత్రి', 'కళావతి సరస్వతి', 'కృష్ణాపత్రిక' మొదలగునవి వెలువడుచుండెను. 1874–75 ప్రాంతములలో శ్రీరాములుగారు 'అనల్పజల్పితాకల్పకల్పవల్లి' అను పుస్తకరూప మైన మాస పత్రికను సాంఘిక విషయములను గూర్చి వ్రాయుచు కొంతకాలము ప్రకటించిరి.

ఈ స్వాతంత్ర్య విప్లవమునకు తోడుగ సాంఘిక విప్లవము గూడ సాగినది. ఈ విప్లవాగ్నికి శ్రీరాములుగారు గూడ రెండు సమిధలు చేర్చిరి. వీరు రాజకీయ ములకన్న సాంఘిక విషయములపట్ల ఎక్కువ మక్కువజూపిరి. రాజకీయ సభలలో కన్న సాంఘిక సభలలో నెక్కువగ పాల్గొనిరి. ఆంధ్రదేశమున గుంటూరు, ఏలూరు, రాజమండ్రి, విశాఖపట్టణము, విజయనగరము, బెజవాడ, ఉయ్యూరు మొదలగు గ్రామము లందు రాజకీయ మహాసభలు, వానికి అనుబంధముగ సాంఘికసభలు కూడ జరిపి అమాయక ప్రజలకు కనువిప్పు గలిగించిరి. ఈ సభలలో శ్రీరాములు గారు పాల్గొనుచుండిరి. ముఖ్యముగా సంఘసంస్కరణ సభలో పాల్గొనెడి వారు. ఏలూరులో జరిగిన గోదావరి మండల సాంఘిక సభకు భార్యతో గూడపోయిరి. 1902 దీనినే ఈ విషయమున మద్రాసు టైమ్సు పత్రికలో వేసిరని లియోనార్డు గారు వారి గ్రంథములో (కందుకూరి వీరేశలింగం) నిట్లు వ్రాసిరి. "Madras Times, 11-6-1897 "Some Telugu women had attended social conferences with their husbands".[11] (కొందరు ఆంధ్ర స్త్రీలు వారి భర్తలతో బాటు సాంఘిక సభలకు హాజరయిరి.)

1902 జూన్ ఏడవ తేదీని నాల్గవ కృష్ణామండల సంఘసంస్కరణ సభ ఉయ్యూరులో జరిగెను. ఈ సభకు బ్రహ్మశ్రీ పండిత శ్రీరాములుగారాధిపత్యము

వహించిరి. వీరి ఉపన్యాస పటిమను గూర్చి 1902 జూన్ 15వ తేది కృష్ణా పత్రికలో వ్రాయబడినది. 1897 న కృష్ణామండలము నందలి సభలో నావరకు చర్చించుట కేర్పరుపబడిన సాంఘిక విషయములు కొన్నియు గూడ కాలము చాలదన్న మిషపై విడిచిపెట్టబడినవని శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు గారి వారి స్వీయ చరిత్ర[12]లో వ్రాసిరి. కాని శ్రీరాములు గారు మాత్రము తన ధైర్య సాహస శాంతగుణాదుల వలనను విశేష పాండిత్యపటిమ వలనను నిట్టి యడ్డంకులను తొలగించి సభను సక్రమముగా నడుపుచుండిరి.

ఈ పరివర్తన యుగమున రెండు పక్షముల వారుండిరి. 1. సంప్రదాయ వాదులు. 2. సంస్కరణవాదులు. తొలుత వితంతు వివాహముల పట్ల విముఖత జూపి సంస్కరణ వాదులను ప్రతిఘటించుచుండి, తరువాత దాని యందలి మేలును గ్రహించి వితంతు వివాహోద్యమములలో పాల్గొని 'రండాముండన ఖండనమ' ను వ్యాసమును వ్రాసిరి. 'తాబట్టిన కుందేలుకు మూడేకాళ్ళు' అని తాననుసరించిన మార్గమే శ్రేష్టమనక విశిష్టమైన మార్గమునే యవలంభించెడివారు. విధవా వివాహములందు కందుకూరి వీరేశలింగం పంతులు గారికి చేదోడువాదోడుగా నుండిరి. 1915 'జనానా'లో ఆంధ్రదేశము నందలి వితంతువుల జాబితా, అందు వివాహమైన వారి జాబితా నీయబడినవి. వారు సాధించిన ప్రగతి నిందు సూచించిరి. ఆనాటి సంఘములో మరియొక దురాచారము, సముద్రయానము చేసినవానికి ప్రాయశ్చిత్తము చేయుట. సముద్రయానము వలన దోషము లేదని సహేతకముగ చారిత్రకాధారములతో నిరూపించుచు 'సముద్రయాన' మను నొక వ్యాసము వ్రాసిరి. తానేకాక ఆనాటి కొందరు ప్రముఖులు గూడ సముద్ర యానము వలన దోషము లేదని చెప్పుటకు బందరు నుండి మద్రాసు వరకు సముద్రముపై ప్రయాణము చేసిరి.

అతి బాల్యవివాహములను గూడ వీరు తెగడిరి. బ్రాహ్మణులంతః శాఖా భేదములు కలిగి పరస్పరము ద్వేషించుకొనుచుండిరి. వారు అంతః శాఖా వివాహములు చేసికొనిన నిట్టి కలహము లుండవని చెప్పుటకు గాను 'తెలుగు నాఁడు' వ్రాసిరి. ఆనాడు బ్రాహ్మణ బ్రాహ్మణేతర ద్వేషములు తలయెత్తి యుండలేదు. శ్రీరాములుగారు శిష్టాచారపరాయణులయ్యు సంస్కరణాభిలాషులు. ఇన్ని దురాచారములున్న యానాటి సంఘమును అందలి ప్రజలను వారి

జీవనమును కన్నులకు గట్టినట్లు వారి కావ్యము లందంతట అద్దముపట్టినట్లు ప్రదర్శించిరి. సంఘములో అగ్రవర్ణపు బ్రాహ్మణులను – వారి కుల వర్తనములు, ఆచార వ్యవహారములు, వేషభాషలు మున్నగునవి కన్నులకు కట్టినట్లు 'తెనుగువాడు' నందు వ్రాసిరి. ఈ బ్రాహ్మణుల వర్ణన దేవీ భాగవతములో షష్ఠస్కంధమున హైహయులు భార్గవులను బాధించు సన్నివేశమున గలదు.[13] ఆనాటి ప్రజల వేషధారణ ఈ విధముగ నుండెను – సంపన్న గృహస్థులు బంగారు సరిగంచు ధోవతులు గోచియిడి చెంగులు జీరుకాడ కట్టెడివారు. తలకు కచ్చూరములతో కాచిన సంపంగి నూనె వ్రాసికొనెడివారు. మీసాలకు గూడ ఈ నూనెను వ్రాసి మెలిపెట్టి విడచెడివారు. ఈ మీసములలోను చాలా రకములు గలవు. (దే.భా.2.527). నున్నగ దువ్విన మీసములు, మెలిపట్టి విడిచిన మీసాలపై గొప్ప నిమ్మకాయలు నిల్పగలిగెడివి కొన్ని (తె నా–పు.11), దండిగా బెంచబడిన మీసములు కొన్ని (తె.నా – పు 32), గండు మీసాలు కొన్ని (దే.భా –7–455). అందరికి విధిగ జుట్టు ముడి యుండెడిది. నెత్తికి జరీ ఉత్తరీయము చుట్ట, 'ఇస్త్రిర' చేసిన 'కోటు' బుజాన మడచి తీర్చిన 'జరీ' మధిరయోణీ (తె.నా–పు.20) ధరించి వ్రేళ్ళకు వెలగల యుంగరములు, చెవులకు రవల తమ్మెట్లు ధరించెడి వారు. కొందరు అపరంజి విడికడియములు, మణిబంధాన ధరించెడివారు.

సంపన్న స్త్రీలు రవ్వల ఉంగరములు, రవ్వలదుద్దులు, గూబకు పచ్చరాళ్ళతో చేసిన బంగారు కచ్చులు, జడపై రవ్వలబిళ్ళ ముక్కున బులాకి, చేతులకు పైడి కంకణములు, మురుగులు, మెడలో గుండ్లకంటె, మిరియాల గుండ్లు, చంద్రహారము, కాళ్ళకు 'పాంజేబులు' అందెలు. కడియములు, నడుమునకు వడ్డాణము, మొలనూలు (దే.భా.–3–532) మొదలగునవి ధరించెడివారు. చీర మీగాళ్ళు జారునట్లు పసందుగ కట్టెడివారు. కొందరు సంపన్నులు పాపటకు అడ్డముగ మొగలిరేకు, పసిడి తమలపాకు ధరించెడివారు. (తె.నా.–పు.15)[14] లౌకికులు ఆంగ్లేయుల పారశీకము ఉర్దూ హిందీ పదములు కలిపి మాట్లాడుచుండిరి. కార్యాలయములలో వారికి అన్ని భాషలతోను పరిచయ ముండును. కావున ఆభాషలు వారి సంభాషణలోను, రచనలోను దొరలుచుండును.

అచ్చా దరబారుకి బలుకుశాలుకరే వునుకూబరా
బరాద్మిదునియామేనై యనుచు మేటిని వేంకటరామచౌదరి

- లక్షణా విలాసం

నోట నాల్గింగిలీష్ముక్కలు నేర్చి
పూల్గూసుం నాన్సెన్సు యూగోలేయనుచు - తె.నా
యలతి యైదారూళ్లు కమలుదారీచేసి
'ఖబడ్దార్ బాత్నకో కాన్పకడ' ను - చ.ద. - 91
చలో చలో జల్ది ............ - సూ.శ. - 61

వైదికులు 'అస్సే ! చూస్సివషే! వోషే ! చెవుడషే ! (తె.నా.పు.9) అని ఛాందసముగ మాట్లాడుచుందురు. శ్రీ గురజాడ అప్పారావు గారి కన్యాశుల్కములో బుచ్చమ్మ పాత్ర గూడ నిదేవిధముగ ఛాందసముగ మాట్లాడును. వీరికి మడి ఆచారములు యెక్కువ. దినములో చాలభాగము తడిబట్టలతోనే యుందురు. మగవారు గాని ఆడవారు గాని ఎవరింఢ్లకైనను వెళ్ళినను వారితరుల చేతి వంటకములు తినరు. వారి అత్తెసరు వారు వేసికొని పచ్చళ్ళతో ఆ దినము గడుపుకొందురు. (దే.భా.-అల్లూరి వర్ణన). వారిండ్లలో విస్తరి చుట్టు, పప్పు గూరలు, పచ్చళ్ళు వేసికొని నేతి కరుళ్ళతో తృప్తిగ భోజనము చేయుదురు. (తె.నా.పు.8) బ్రాహ్మణులందలి యంతఃశ్శాఖలు, వారి యాచారవ్యవహారములు కనులకు గట్టినట్లు 'తెనుగునాడు' నందు వర్ణించిరి.

గొల్లవారి యాచారవ్యవహారములు గూడ దేవీభాగవతము నందలి అల్లూరి వర్ణనలో వివరించిరి. 'పాత్ర గొంగడి వీపుపై గప్పి, బుజమున గొంకికర్రను మ్రోపి కొంకినడచు, నుచ్చుబ్రాతల పింజగ్రుచ్చి మున్మాల గట్టి, మఱ్ఱాకుపొత్తి వేమారు మడచును (దే.భా.-అల్లూరి వర్ణన). వైశ్యులు గూడ ద్విజులే, వేదోక్త కర్మల కధికారమున్నదా లేదా యను చర్చలాదినములలో జరుగుచుండెను. కొందరు వీరిని ధిక్కరించి యజ్ఞములు గూడ జేసిరి. వీరి యిండ్లకు వచ్చి శ్రోత్రియ స్మార్తకర్మలు కలసికట్టుగ జేయ నిరాకరించిరి. ఇవన్నియు వైశ్యుడై యుండి యజ్ఞము జేసి పూతుడైన శ్రీ అత్మూరి లక్ష్మీ నరసింహ సోమయాజి విపులముగ వ్రాసిరి. అప్పటికి నిప్పటికిని వైశ్యుల వృత్తి వర్తకము. వైశ్య వనితలు చేయు బేరసారముల గూర్చి దేవీ భాగవతమందలి అల్లూరి వర్ణనలో కలదు.

వెలమలు, కమ్మలు ధనవంతులై భూస్వాములై 'జమీందారు'లై ప్రభువులుగ గణింపబడెడివారు. వీరి యాస్థానములలో పండితులను, కవులను పోషించి సన్మానములు చేయుచుండిరి. తరువాత కాపులు, గొల్లలు, గవలలు, ఈడిగలు, మాలలు మొదలగు బ్రాహ్మణేతరులు గలరు. ఇందు కాపులకు వ్యవసాయము ముఖ్యవృత్తి. మిగిలినవారాయావృత్తులను జేసికొనుట గలదు. ఆనాడు వారు మాట్లాడిన వ్యావహారిక భాష శాకుంతలములో షష్ఠాంకారంభమున గల ప్రవేశకములో బెస్తవారి సంభాషణలో కాననగును.

బ్రాహ్మణులు, వైశ్యులు శాకాహారమును, మిగిలినవారు మాంసాహారమును భుజించెడివారు. వారికి నంజుడెట్లు ప్రతి నిత్యముండవలెనో యట్లే బ్రాహ్మణులకు పప్పుగూరలే గాక అప్పడములు వడియములు తప్పనిసరిగ నుండవలెను. ఆ దినములలో బ్రాహ్మణులు తిను కొన్ని వంటకములు – చారు, కూరలు, పప్పులు, పచ్చళ్లు, వడియాలు, వరుగులు, అప్పడాలు, దప్పళాలు (పులుసులు), ఊరగాయలు, మెంతిమజ్జిగ, పాలు, పాయసాన్నంబులు, గారెలు, బూరెలు, బొబ్బట్లు, అట్లు, పులిహోర, దధ్యోదనము, పూర్ణములు, పూరీలు, తైరువడలు. వీనిని వైదికులు సన్నకుట్టు విస్తళ్ళలో వడ్డింప తిందురు. (తె.నా. 10). నియోగి సుతులు మంచి యరటాకున వడ్డించుకొని తిందురు. (తె.నా. 18). గోంగూర వైష్ణవులు తప్ప మిగిలిన వారందరు కడు మక్కువమీర యారగింతురు (తె.నా. 18) ఆనాడు పాడి పంటలకు కొదవలేదు. గడ్డపెరుగు, చిక్కనిపాలు త్రాగుచుండిరి.

పై జెప్పినవారే గాక దేవదాసీలు గూడ నుండిరి. వారినే మనము వేశ్యలు, సానులు, బోగమువారు అందుము. వీరు దేవాలయములలో దేవుని యెదట ప్రతి నిత్యము నృత్యము చేయుటకు, ఉత్సవ సమయములలో నృత్యము చేయుటకు ఉద్దేశింపబడిరి. క్రమముగ వారు పడుపు వృత్తి నవలంభించి సంఘములో గౌరవ స్థానమును గోల్పోయిరి. వివాహాది శుభకార్యములందు ఊరేగింపుల యందు వీరు నృత్యముల జేసెడివారు. తరువాత శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు, శ్రీశ్రీరాములుగారు మొదలైనవారు దీనిని మాన్పించిరి. శ్రీరాములు గారు సంగీత సాహిత్యము లందును, నాట్యమునందును ప్రవీణులు. ఆ కాలమున భరతశాస్త్ర ప్రవీణలయిన వేశ్యలు పినపాల భవాని, చదలవాడ పిచ్చాయి, చదలవాడ రాజరత్నము.[15] వీరు శ్రీరాములు గారి యెదుట అభినయించి వారిచే

మెప్పు పొందిరి. వేశ్యలే సంగీత 'కచేరీ' చేసెడివారు. ఎవరైన గృహిణులు సంగీత 'కచ్చేరీలు' చేసినవారిని వేశ్యల క్రింద జమకట్టెడివారు. ఆ కాలముననే కాదు నేటికి ప్రతి గ్రామము నందొక రామాలయమున్నది. ఆ రామాలయపు ముంగట రచ్చబండ, ఆ బండమీదకు గ్రామము నందలి అన్ని వర్ణముల వారు చేరి సాయంత్రమగుసరికి సమావేశమై భారతము నుండి భారత రాజకీయముల వరకు చర్చించెడివారు. ఈ క్రింది పద్యములలో ఆనాటి ఈ దృశ్యము కన్నులకు గట్టినట్లు అగపడును -

ముదికరణాలు రాముగుడిమోనల రచ్చలు దీర్చి భారతాల్
చదువుచు లోకవార్తల ప్రశంసలనంద్రు తెలుంగుభాష మం
చిది మన పిల్లకాయలు వచించెనే యింగిలిపీసుపున్ పుసస్
బెదవులదాఁట దెంతటి యెఫెయు బియే యెమి వచించినన్
- తె.నా.. - పు. 13

ఆ గ్రామములకు బెద్దలు గ్రామ మునసబు. వీరి మాట వినని వారి నెట్లు శిక్షించెడివారో తెలియుచున్నది.

ఈతటి ఊతిరాచతిక మెంతటి దుర్గతిదెచ్చెఁగాని మా
తాత హయాములో నుడుగుదాఁటిన వారలబట్టి తెచ్చి చ
ట్రాతను గట్టి కొట్టి పదిరాత్రు లటుంచిన రాజుతోడ వి
జ్ఞాతము సేయువాఁడొకడు గల్గెనె యందురు వృద్ధలౌకికుల్
- తె.నా.- పు. 13

ఇట్టి చీడపురుగులున్నను వారి సంఘమున సంపన్న కుటుంబికులు ఔదార్యము గలవారై వచ్చినవారికి లేదనకుండ భోజనము పెట్టువారు . కవిగారి తల్లిదండ్రులిట్టివారు.

కన్నయ్య పండింప గామమ్మ వండింప లేచిన విస్తళ్లు లెక్కలేదు
కన్నయ్య నిలిపింప గామమ్మ గొలిపింప వేల్పుగొల్పుల కొక్క వేళలేదు
కన్నయ్య తెప్పింప గామమ్మ యిప్పింప కొలచిన ధ్యానంబు విలువలేదు
కన్నయ్య వ్రాయింప గామమ్మ చేయింప నుపకారములకు మారొడ్డులేదు
- దే.భా. పు. 39

వీరేకాదు అట్టి సంపన్న కుటుంబికులగ్రహారమం దక్కడక్కడ నుండెడివారు. సర్ థామస్ మన్రోగారిట్లనిరి – 'ఈ గ్రామ ప్రజా సంఘములు చిన్న ప్రజాస్వామికములు. దీనికి కావలసిన యధికారము లెల్ల కలవు. దేశీయ ప్రభుత్వ సంస్థ లెవ్వియు వీని యధికారమునకు భంగం కలిగించవు. ఎన్ని ప్రభుత్వములు మారినను ఇవి చెక్కుచెదరక నిలచియున్నవి. ఈ సంస్థల మూలముననే భారతీయ ప్రజలు కొంతవరకైన శాంతి స్వాతంత్ర్యములు పొందగలిగిరి.[16]

శాంతి సౌఖ్యములతో నలరారుచున్న నీ గ్రామములపైనను యాంగ్లేయుల ప్రభావము పడినది. 'మునసబ్‌కోర్టు'లు, 'సబ్‌కోర్టు' లు వచ్చినవి. 'సబ్‌కోర్టు' పైది 'హైకోర్టు'. ఆపైది ప్రీవీ కౌన్సిల్. 'ఫస్ట్‌గ్రేడుప్లీడరు'లు 'సబ్‌కోర్టు'లో పనిచేయుటకు అవకాశము గలదు. శ్రీరాములు గారు ఏలూరు 'సబ్‌కోర్టు' లో పనిజేయు సందర్భమున నూజివీడు జమీందారులగు పాపమ్మరావుగారికి రామచంద్రాపురాధీశులకు మధ్య 'కేసు' 'ప్రీవీ కౌన్సిల్' వరకు పోయినది.

ఆ రోజులలో కొందరు న్యాయమూర్తులు లంచగొండులై యుండిరి. మనవాళ్ళయ్యరు అను అవినీతిపరుడగు న్యాయమూర్తి అట్టివాడు. శ్రీరాములు గారు మరికొందరితో జేరి పై యధికారులకు దెల్పి వానిని పని నుండి తొలగింపజేసిరి.

న్యాయరక్షణకై 'పోలీసు' శాఖ కలదు. ఇందలి యుద్యోగస్థులు గూడ లంచగొండులే. ఏలూరులో 'పోలీసు' వారి 'షరీకు'లో దొంగతనములు జరుగు చుండ శ్రీరాములుగారు పై యధికారులకు దెల్పి యచటి నుండి 'బదిలీ' చేయించిరి.

ఆంధ్రదేశమున నొకవంక సముద్రయానము చేసినవానికి ప్రాయశ్చిత్తములు విధించుచున్నను వర్తక వాణిజ్యములు విదేశములతో జరుగుచునే యుండెను. ముఖ్యముగ బర్మాతో వర్తకము ఎక్కువగ జరిగెడిది. బర్మా ముఖ్యపట్టణమగు రంగూనుకు చాలమంది వెళ్ళుచుండెడి వారు. కొందరాంధ్రు లచ్చటనే స్థిరపడిరి. దీనిని గూర్చి జానపదగేయములు మన తెలుగుదేశమున విస్తృతముగ నున్నవి.

ఆంగ్లేయుల నాగరికతాప్రభావము ఆంధ్రుల యాచార వ్యవహారములపై ప్రసరించినది. కట్టుబాట్లులోనే గాక ఆహారవస్తువులలో గూడ మార్పు సంభవించినది. నియోగులు చెడావులు ధరించెడివారట.

... ..... బుజాన రుమాలు వైచిలేఁ
గచ్చను జీరుఁగోచి యిడికట్టిన మల్మలు చెంగుజాఱఁగా
నిచ్చిచెడావులందొడిగి యేగు నియోగి సుతుండు నిచ్చలున్
తె.నా. పు. 11

శ్రోత్రియులు పరదేశములకు వెళ్లునప్పుడొంటిపొర యట్టి చెప్పులందొడుగు కొనెడివారట. (దే.భా. – అల్లూరివర్ణన, పు.19). విక్టోరియా 'ద్వాత్రింశతి' యను గ్రంథములో నా మార్పుల నిట్లు సూచించిరి.

పండించినారమ్మ వాడలం వారిచే గమగమ వలచు బంగాళదుంప
తొడిగించినారమ్మ శాస్త్రుల కొమరుచే టక్కుటక్కుమనుచు జడావుజోడు

శ్రోత్రియకుమారుడై నప్పటికిని అధునాతన నాగరికత మీరి చెడావులజోడు ధరించెడివారు. విదేశీ దండయాత్ర లకు దేశము గురియైనట్లే దానితోబాటు హిందూమత మన్ని తాకిడులకును గురియైనది. క్రైస్తవ మత బోధల ఫలితముగ ఉత్తరహిందూస్థానములో శ్రీ రాజారామమోహనరాయలు బ్రహ్మసమాజమను దానిని స్థాపించి విగ్రహారాధనను నిరసించి ఏకేశ్వరోపాసనను ప్రభోదించెను. కందుకూరి వీరేశలింగం పంతులుగారు ఆంధ్రదేశమున దీనికి మిక్కిలి ప్రచారము నిచ్చిరి. రాజారామమోహన రాయలు, కందుకూరి వీరేశలింగం పంతులుగారు బోధించిన సంఘసంస్కరణములకు శ్రీరాములుగారు పూర్తి సహకారము నిచ్చినను విగ్రహారాధన నిషేధముకు వీరంగీకరింపకుండిరి. దీని విషయమై వీరిట్లు చెప్పిరి – 'జందెమూడ్చినగేస్తు సారద్రాగిననేమి వెల్లుల్లినీరుల్లి దిననినేమి' (చ.దం–88). నిగ్రహము లేని మనసు అతి చంచలుని గోర నణచిపెట్టినయట్లు దొంగ గొడ్డును దొడ్డిఁదోలినట్లు, దుష్టజంతువు బోను దూర్చి పట్టినయట్లుండును.

అల్లూరిలో గల 'అలుగులమ్మ' అను దేవతకు జంతుబలులు నిచ్చెడి వారు. శ్రీరాములుగారు దానిని నిషేధించి దేవతకు పాలుపొంగళ్లు నైవేద్యమును పెట్టుడని బోధించిరి. ఆ విధానము ననుసరించునట్లు చేసిరి. నేటికిని ఆవూరి యాదవులు శాకాహారులే యని యావూరి యాదవ ప్రముఖులలో నొకరైన శ్రీ భట్రాజు సోమేశ్వరరావుగారు చెప్పిరి.

భారతీయవిద్యాసంస్థలే గాక 19వ శతాబ్ది యుత్తర భాగమున యాంగ్లేయ పాఠశాలలు పెద్ద గ్రామము లందుండెడివని తెలిసికొంటిమి. క్రమముగ నవి విస్తృతమైనవి. ఇంకను ఛాందసము గలిగిన కొందరు బ్రాహ్మణులు యితర వర్ణము వారి బాలురను తాకుచుందురని వారి బాలురింటికిరాగానే యా బట్టలను వేరుగ ఉంచి తాకకుండ నుంచెడివారు. అది తెలుగునాడు నందలి పద్యమున జూడనగును –

ఈ యిసుకోలు బళ్ళకడ నింగిలిపీసులు పీసుపాసుగాఁ
గూయఁగజొచ్చి యామయిలగుడ్డలు వంకె దగిల్చి రండు మొ
ర్రోయన నాలకింప రిసిరో ! కలికాలముగాలె రామ రా
మా యను వృద్ధురాలయిన స్మార్తవితంతువు మాటిమాటికిన్ – ప. 43

స్త్రీలు ఈ బళ్ళకు బోయి విద్య నభ్యసించుట కిష్టపడెడివారుకాదు. ఇట్టి స్త్రీల విజ్ఞానము కొరకు 'హిందూసుందరి', 'సతీహిత బోధిని' మొదలగు పత్రికల ద్వారా వారికి చరిత్ర, భూగోళము, శరీరశాస్త్రము, విజ్ఞాన శాస్త్రము, గృహ వైద్యము బోధింప ప్రయత్నించుచుండిరి. శ్రీమతి శారదాంబగారు, బండారు అచ్చమాంబగారు, కొటికలపూడి సీతమ్మగారు మొదలగు స్త్రీ లింటివద్దనే వారి పెద్దల వలన విద్య నభ్యసించి గ్రంధరచన జేయుటయు గలదు. శ్రీరాములుగారి కుమార్తె శ్రీమతి శారదాంబ గారు 'నాగ్నజితీ పరిణయము', 'మాధవ శతకము' అను రెండు గ్రంథములు రచించి చిన్ననాటనే దివంగతలైరి. మాధవ శతకమున నానాటి స్త్రీల దుస్థితి గూర్చి విన్నవించినారు. ఇది పూర్తిగ స్త్రీ జనక్షేమార్థక భగవత్ప్రార్థనా పద్యములు గల శతకము. దీనిని 1902 ఎడ్వర్డుకొర్నేషన్ సందర్భమున హిందూసుందరి, పత్రికాధిపతులుచితముగ నీ శతకమును హిందూ సుందరి పత్రిక కొన్నవారి కొసగిరి.

పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్థ మాంధ్రదేశ సాహిత్య చరిత్రలో మిక్కిలి ప్రాముఖ్యము గలది.

తెలుగు సాహిత్యముపై ఆంగ్లేయ ప్రభావము మిక్కిలిగ గలదు. శ్రీరాములు గారును దీనిచే ప్రభావితులైరి. తెలుగునాడు పీఠికలో వీరిట్లుటంకించిరి– "సంఘ విషయములఁ గూర్చి అబాధకములగు చమత్కార కావ్యములు మన దేశభాషలో

లేవు. ఐరోపాఖండము వారి ప్రస్తుత నాగరిక ప్రవర్తనమునకు కారణభూతమైనవి యిట్టి కావ్యములే యని నేను జెప్పనవరసము లేదు." (తె.నా.- పు. 21)

ఆంధ్ర రచయితలే గాదు భారతీయ రచయిత లందరు పాశ్చాత్య సాహిత్య సంస్కృతులకును, వాని వైవిధ్యమునకును ముగ్ధులై తమ భావనా ప్రపంచమును రచనాక్రమమును తీర్చి దిద్దుకొనుచు వచ్చిన కాలమును నిదియే. ఈ విధముగా ఈ కాలమొక సంధియుగము.

విద్యావంతులు దేశభాషలలోని గ్రంథములు కొనుట తగ్గించి, 1834-35 నాటికి యాంగ్ల గ్రంథములను విశేషముగ కొనుచుండిరి. పాశ్చాత్య సంపర్కము వలన కలిగిన నవీన భావప్రకరణమునకు భాషా పత్రికలు గూడ చాల తోడ్పడెను. అనేకములైన ఉద్యమములు ముందడుగు వేసినట్లే ఈ ఉద్యమమునకు వంగదేశమే ముందడుగు వేసెను.[17]

ఆనాటికింకను సంప్రదాయ విద్య పూర్తిగ నశింపలేదు. ఆంగ్ల విద్యతో బాటు భారతీయ శాస్త్రములను నేర్చుకొనెడివారు. అష్టావధాన శతావధానములను జేసిన వారును గలరు. అందు శ్రీరాములుగారొకరు. చతుర్విధ మధుర కవితలు నేర్చిన విశేష ప్రజ్ఞావంతులును గలరు. అంతే కాక వేదవేదాంగములు, ఉపనిషత్తులు స్మృతులను సాంగోపాంగముగ నేర్చిరి. అక్షరాభ్యాసమైన వెంటనే వేదవిద్య నభ్యసించిరి. తరువాత యుక్తవయస్కులు కాగానే ఆంగ్లేయులు నిర్వహించు 'జనరల్ నాలెడ్జ్ టెస్టు' మొదలగు పరీక్షలకు చదివి యందుత్తీర్ణులై సర్కారువారి యుద్యోములు చేయుచుండిరి. తరువాత 'ఎఫ్.ఎ.,బి.ఏ.ఎం.ఏ., పరీక్షలవరకు కూడా కొందరు చదువుచుండిరి. అట్లే 'ప్లీడరీ' పరీక్షలకు ఇంటివద్దనే యభ్యసించి వానిని కట్టి యుత్తీర్ణులై 'ప్లీడరు'లు గను 'మునసబు' లుగను, న్యాయమూర్తులు గను నుద్యోగములు చేయుచుండిరి. వీరు 'సర్కారీ' యుద్యోగములు చేయుచుండుటచే నా పరిభాషా పదములు వీరికి విశేష పరిచయముండుటచే వీరి కవనములలో నా పదములు చోటు చేసికొనుచుండెను. ఇంకను 'సర్కారు వారి కార్యాలయములలో వెనుకటి అరబ్బి, ఉర్దు, పారశీక పదములు వాడుకలో నుండుటచే నాంగ్లపదములతో నీ పదములు గూడ ప్రయోగింపబడుచుండెను. శ్రీరాములు గారి కవితలో గూడ యిట్టి పదములు దొరలుచుండును.

ఇట్లు పాశ్చాత్యసాహిత్య సంస్కృతులపై యభిమానము దృఢమగుటచే నవల, వ్యాసము, విమర్శ, నాటకము, చరిత్ర, స్వీయ చరిత్ర మొదలగు ప్రక్రియలు వెలువడినవి. సంప్రదాయ పద్యకవిత గూడ కలదు. అయితే ఆంగ్లకవిత ప్రభావమున అవతరించిన యాంధ్ర కవిత తక్కువ. ఆంగ్లవిద్యచే ప్రభావితమై ఆ కావ్యముల చదివి ఆనందించి అనుసరించిన కొద్దిమంది రచయితలలో శ్రీరాములుగారొకరు. పందొమ్మిదవ శతాబ్దికి చెందిన 'రొమాంటిక్' కవుల ప్రభావము ఇరువదవశతాబ్దమునకు పూర్వమందున్న కవులపైబడినది. శ్రీరాములు గారును ప్రభావితులైరని చెప్పవచ్చును. వీరి 'దేవీభాగవత' మందలి యల్లూరి వర్ణన, గ్రామీణవర్ణన కవిత, (Pastoral Poetry) ప్రక్రియకు చెందినవి. అవహేళనా (Sattire) మార్గమునకు చెందినది 'తెలుగునాడు'.

వీరి కవితను గూర్చి శ్రీ కొత్తపల్లి వీరభద్రరావుగారు తమ 'తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము' అన్న గ్రంథములో నిట్లు వ్రాసిరి. 'దాసు శ్రీరాములుగారు (1846-1908) దేవీభాగవతము (1907) మొదలైన బృహద్గ్రంథములతో బాటు 'తెలుగునాడు' అను వీధిని గూడ రచించిరి.[18]

"ఇటీవలననగా నాంగ్లప్రభుత్వ మారంభమైన పిమ్మట నావిర్భవించిన కవులలో మా సమకాలికులగు కవులలో ప్రాచీన సంప్రదాయముగ కవి సామగ్రిని సేకరించి రచనకు కడంగువారు వీరుదక్కలేరు" అని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారిచే కీర్తింపబడిన దాసు శ్రీరాములుగారు (1846-1908) దేవీభాగవతము మొదలయిన బృహద్గ్రంథములతో బాటు 'తెనుగునాడు' అను వీధిని కూడ రచించిరి. ఇందు యథోచితముగ రసపోషణకై ఇంగ్లీషుమాటలను వాడుటకు వెనుదీయలేదు. మచ్చునకు ఈ యుదాహరణము గ్రహించవచ్చును. 'నడువీధి రెడ్డిగారిడి రచ్చదీర్చుచో సివిలుజడ్జీ లని చెప్పవచ్చు'. (నియోగులు - తె.నా. 21); ఇట్లీ కవిపుంగవులు తమకున్న ఆంగ్లభాషావిజ్ఞానమును సంస్కృతాంధ్రముల వలెనే తమ వ్యుత్పత్తిలో నొక భాగము చేసికొనిరి. ఆనాడాంధ్రదేశమున విస్తరించిన కవితాశాఖలన్నిటిని వీరు చేపట్టిరి. దేవీభాగవతమను పురాణమును, సుబోధ, ఆచార నిరుక్తి, త్రిమతములు, శ్రాద్ధసంశయవిచ్ఛేద, నమస్కారవిధిదీపిక, దురాచార పిశాచభంజని యను వైవిధ్యములు గల గ్రంథముల రచించిరి. స్మృతుల నుండి ఉపనిషత్తుల నుండి ఉదాహరణము లొసంగబడిన ధర్మశాస్త్రగ్రంథములవి.

'అభినవగద్యప్రబంధమ'ను వచనప్రబంధము, 'రండాముండనఖండనము', 'సముద్రయానమను' వ్యాసములు, కాళిదాస భవభూతుల ఆంధ్రీకరణ నాటకములు, 'పతిత సంసర్గప్రాయశ్చిత్తకోపన్యాసములు, 'తర్కదీపిక' యను తర్కశాస్త్ర గ్రంథము, 'సారసంగ్రహగణిత' మను 'గణితశాస్త్రగ్రంథము', 'భృంగరాజమహిమ' యను వైద్యగ్రంథానువాదమును, 'కృష్ణార్జున సమరము', 'వేదాచల మహాత్మ్యము' 'సంవరణోపాఖ్యానమను' ప్రబంధములు, 'చక్కట్లదండ', 'కామేశ్వరీశతకము', ముద్దుగుమ్మ, చిలుకలకొలికి, సూర్య, సోమలింగ, శతకములు, 'తెనుగునాడను' అవహేళన కావ్యము, విక్టోరియా ద్వాత్రింశతి యను చిన్న ముక్తకము, 'సాత్రాజితీ విలాసము', 'లక్షణావిలాసవమను' యక్షగానములు, 'అభినయ దర్పణ' మను నాట్యశాస్త్రమును, 'కృష్ణలీలలు' అను పదములు రచించిరి. ఇందు కామాక్షి శతకము సంస్కృతమున వ్రాయబడెను. 'అభిజ్ఞాన శాకుంతలము', 'ముద్రారాక్షసమను' నాటకములు అచ్చతెనుగున రచింపబడినవి. 'చక్కట్లదండ' యను నీతి పద్యముల శతకము గూడ యచ్చతెనుగున రచింప బడినది. దీనియందును దురాచారములను చక్కగ వివరించిరి. వీరు 'అనల్పజల్పిత కల్పకవల్లి'అను నొక పుస్తకరూపమైన మాసపత్రికను గూడ కొన్నాళ్లు నిర్వహించిరి. ఇట్లానాడు ఆంధ్రవాఙ్మయము శాఖోపశాఖలుగ విస్తృతి చెందినది.

ఇంతటి సాహిత్యము విస్తృతమగుటకు కారణము ముద్రణయంత్రములు, 'రైలు'బండ్ల వంటి ప్రయాణసాధనములు, తపాలా (అంచెమాల) సౌకర్యములు కలిగియుండుట. 'రైలు' బండ్లను తొలుత ప్రవేశపెట్టినపుడు వలదని వృథావాదము చేయువారిని గూర్చి 'జనవినోదిని' యిట్లు వ్రాసినది – "పొగబండి చేత కలుగు ధ్వనికి బాటకు సమీపపు పొలములలో మేయుచు తిరుగుచుండెడి గొడ్డుగోదలు బెదరి పరుగెత్తిపోవుననియు దీనిచేత కాపులకు నష్టము కలుగుననియు" కొందరాక్షేపించిరి. పొగబండ్లు పరుగెత్తునపు డంతట సవారిగుఱ్ఱములు బెదరి దారి విడచి పరుగెత్తిపోవుననియు, వానిని పెంచుచు వచ్చు వాడుక వీడ్వడిపోవుననియు, గుఱ్ఱపు వ్యాపారము బొత్తిగ నిలిచిపోవుననియు మరి కొందరాక్షేపము చెప్పిరి.[19] ఇట్లు చెడ్డకే గాదు మంచికార్యములకు గూడ వృథా వివాదములు చేయువారీ నాడేకాదు ఆనాడును మెండుగ నుండిరని తెలియుచున్నది.

ఆనాడు ఈనాటి వలెనే యున్నతవిద్యకు విదేశముల కేగుచుండిరి. 'బారిష్టరు' 'ఐ.సి.యస్.' 'ఇంజనీరింగ్' మొదలగునవి యభ్యసించుటకు ఆంగ్లదేశమునకు పోవుచుండిరి. వారందరు సముద్రము మీదుగ ప్రయాణము చేసినవారే. శ్రీరామ వెంకట సుబ్బిశెట్టిగారు ఎడింబరో వెళ్ళి ఇంజనీరింగ్ పరీక్షలో నుత్తీర్ణులై మనదేశమునకు తిరిగివచ్చిరి. వీరు 1922 లో స్వయముగ విమానమును నిర్మించి యందు పయనించిరి.[20] శ్రీరాములు గారి నాటికిచ్చట విమానములు లేవు. రైటు సోదరులు 1903 లో విమానముల గూర్చి కనుగొనిరి. 1905 లో వారు విమానమును నిర్మించి వారునుపయోగించిరి. 1910-11 లో యూరోపు, అమెరికా దేశముల మధ్య విమానప్రయాణములు జరుగుచుండెను. శ్రీరాములుగారు 1908 లో స్వర్గస్థులైరి. కావున హిందూదేశములో నాటికి విమానములు లేవు. అవి చూచిన వారి కావ్యములలో నెచటనైన వర్ణించెడివారే. కావున వీరి పద్యమున విమానములను పేర్కొనలేదు.

గెలుపిండియానాడ గెలుపింగిలీషీమాట గెలుపు వేలుపుబాసగెలుపుతెలుగ
గెలుపుస్టీమరులార గెలుపు రైల్రోడ్లార గెలుపు హైస్కూళ్ళారగెలుపుసైన్సు
గెలుపు కాలువతార గెలుపు సోద్దిపుటానకట్టలారా టెలిగ్రాపులార
గెలుపు డార్విన్‌థీరి గెలుపు థియాసఫి గెలుపు నేషనలు కాంగ్రెస్సు నీకు

గెలుపు విక్టోరియారాణి గెలుపు గెలుపు
గెలుపుగెలుపని పలుకుటె గెలుపు మనకు
అని పలుకు దాసురాముడిట్లచ్చ తెనుగు
కబ్బమందమునిండఁ జక్కట్లదండ — చ. దం. 100

సోద్దెపు ఆనకట్టలను, టెలిగ్రాపు, స్టీమరులను జెప్పినవారు విమానములను వీరు చూచిన వానిని గూడ నిచట చేర్చిడివారే.

ధర్మశాస్త్రవిషయమై సందేహము వచ్చినపుడు పండితసభ నేర్పాటు చేసి యిరుపక్షములవారును వాదోపవాదములు చేసి తీర్మానములు చేసెడివారు. 'పతిత సంసర్గప్రాయశ్చితకోపన్యాసము', తత్ఫలితముగరచింప బడినది. శ్రీ గుంటూరు భానుమూర్తియను నియోగ బ్రాహ్మణుడు ఒక కన్యను వివాహమాడెను. ఆ కన్య పునర్వివాహము చేసికొన్న యొక వితంతువు చెల్లెలు. ఈ విషయమాతనికి

తెలియదు. అతనిని వెలిబెట్టిరి. అతడు ప్రాయశ్చిత్తము చేసికొనదలచెను. కాని వైదికులు ధనాశాపరులై వానిని మిక్కుటముగ పీడింప అతడు శ్రీరాములుగారి నాశ్రయించెను. ఈ విషయకముగ నొక స్వాములవారితో చర్చ జరిపెను. ఆ స్వాముల వారొకనాటి రాత్రి ఎవరికిని చెప్పకయె పరారైరి. తరువాత శ్రీ జంధ్యాల గౌరీనాథశాస్త్రిగారికి, శ్రీరాములుగారికీ వాదోపవాదములు జరిగినవి. ఆ వాదోప వాదముల సారాంశమే 'పతితసంసర్గ ప్రాయశ్చిత్తకోపన్యాసము'. వైశ్యులు వేదోక్త కర్మలకు అర్హులని చెప్పుటకు వైశ్యధర్మదీపిక వ్రాసిరి.

ఆ దినములలో నిత్యవ్యవహారములలో నున్న పద్ధతుల నతిక్రమించినవారిని వెలివేసెడివారు. వెలి వలన సంఘబహిష్కారము జరిగెడిది. వారు పంక్తి భోజనమునకు కూడ అనర్హులు. శ్రీ ఆత్మూరి లక్ష్మీనరసింహ సోమయాజులు గారను[21] వారిని బాధించుటను బందరు పట్టణస్థిత అశేష బ్రాహ్మణ సభవారి తరపున శ్రీపురాణం సుబ్రహ్మణ్య అవధానిగారు, శ్రీ వడ్లమన్నాటి వెంకట్రామయ్యగారు, శ్రీకాశీనాధుని బ్రహ్మయ్య లింగముగారు. 1897 లో అనగా హేవళంబి నామ సంవత్సర వైశాఖ శుద్ధ 12 గురువారము నాడు 'నోటీసు' నిచ్చిరి. ఆ 'రిజిష్టరు నోటీసు' నకు సమాధానమును 25 అంశములతో నొక సుదీర్ఘమైన లేఖ మూలకమున వారికి ప్రత్యుత్తరము 20-5-1897 న నిచ్చిరి. శ్రీరామపండితులవారి జవాబు పంపినమీదట గుండె బ్రద్దలై ఇక మీదు మిక్కిలిపోయిన బ్రాహ్మణజాతి దుర్వర్తనమంతయు బైటపడునని భయపడి మిన్నకుండిరట. ఈ ఉత్తరప్రత్యుత్తరములు శ్రీ లక్ష్మీనరసింహసోమయాజి జీవిత చరిత్రము 'ఉపన్యాసములు' అన్న గ్రంథములో విపులముగ గలవు. 1901 ప్లవనామ సంవత్సరములో వచ్చిన ఆషాఢమధికమా? శ్రావణ మధికమా? అన్న అంశము పరిష్కరించుటకై గొప్ప సదస్సు రాజమహేంద్రవరమున జరిగెను.[22] తెలుగు సిద్ధాంతులందరు నలుమూలల నుండి విచ్చేసిరి. ఆ సభలో రాజమహేంద్రవరమందలి కళాశాల గణితశాస్త్రోపన్యాసకులును, భారతీయ హైందవ జ్యోతిశాస్త్రవేత్తలును, తంజావూరు కాపురస్తులునగు శ్రీటాగట్ వెంకట సుబ్బారావుగారు, మైసూరు సంస్కృతోన్నత పాఠశాలలో సిద్ధాంతోపన్యాసకులు శ్రీ తాండవ కృష్ణమాచార్యులగారును, బ్రహ్మశ్రీ శ్రీదాసు శ్రీరామపండితులును అధ్యక్షులుగా ఎన్నుకొనబడిరి. సభలో వాదోపవాదములు జరిగిన పిమ్మట

శ్రీరాములగారి తీర్మానము ప్రకారము శ్రావణమని నిర్ణయింపబడినది. ఇట్లా దినములలో గొప్ప పండిత సదస్సులు జరుగుచుండెడివి. రైతులకు సహకారోద్యమము గూర్చి యప్పుడప్పుడే తెలియుచుండెను.[23] శ్రీరాములుగారు సహకార వ్యవసాయమును గూర్చి 'The elevation of Ryot' అన్న శీర్షికలో 1905 లో కృష్ణాపత్రికలో వ్రాసిరి. వైద్యము కూడ నాటు వైద్యము, ఆయుర్వేదవైద్యము, యునానీ వైద్యము అను పలురకములైనవి కలవు. పశువులకు నాటువైద్యము చేయువారికి శాస్త్రపద్ధతిలో నెట్లు చేయవలెనో వీరు విపులముగ వర్ణించిరి.[24] అపుడపుడే ఇంగ్లీషువైద్యము గూడ వ్యాప్తికి వచ్చుచుండెను. ఒకప్పుడు పాట్నాలో నుండు ప్రభువుకు దేహస్వస్థత లేక అక్కడి వైద్యులు నివృత్తి చేయలేక పోయిరి. అంతలో ఆ గ్రామ ప్రాంతముననున్న నొక ఇంగ్లీషు వైద్యుని పిలిపించి చికిత్స చేయగ జబ్బు నయమ్మైంది. అప్పుడా వైద్యుని ఏమికావలెనో కోరుకొనుమనగా కలకత్తా, హుబ్లీలవద్ద వర్తకము చేసికొనుటకు అనుమతిని కోరెను.[25] అట్లే ఢిల్లీ 'పాదుషా' కు గూడ ఆంగ్లేయవైద్యుని మూలముగ దేహము స్వస్థత చేకూరెనని ఏనుగు వీరాస్వామయ్యగారు వారి కాశీయాత్ర చరిత్రలో వ్రాసిరి. అట్లు క్రమముగ 'యింగ్లీషు' వైద్యము దేశములో వ్యాప్తమయ్యెను. శ్రీరాములుగారి నాటికీ వైద్యము వ్యాప్తిలో లేదు కావున వారి శ్వాసకోశసంబంధమైన జబ్బునకు గుంటగలగరాకును ఔషధముగ సేవించిరి. ఆ సమయముననే వారు 'భృంగరాజమహిమ'యను ఒక అనువాద గ్రంథమును వ్రాసిరి. ఆ దినములలో వివాహాది శుభకార్యము లైదు దినములు జరిపి విశేష ధనమును వ్యయపరచెడివారు. ఈ శుభకార్యము లందు సంగీతకచేరీలు, పండితగోష్ఠులు, వేశ్యలచే నాట్యప్రదర్శనములు చేయించెడివారు. ఈ విధముగ సంగీత నాట్యములు రెండును అభివృద్ధి పొందినవి. కాని వివాహాది శుభకార్యములకై విశేష ధనము వ్యయము చేయకూడదని, అది యొక దురాచారమని 'దురాచార పిశాచభంజని' లో వ్రాసిరి. ఆనాటి వారి వినోదములు – హరికథలు, యక్షగాన ప్రదర్శనములు, తోలుబొమ్మలాటలు, కథాగానములు, నాట్యములు మొదలగునవి. చిన్నపిల్లలు కోతికొమ్మచ్చి, గూటీ బిళ్ళలు,(దే.భా.పీఠిక,పు.3), చెడుగుడి (దే.భా.5) మొదలగు ఆటలాడెడివారు. పెద్దవారు పచ్చీసు, చదరంగము (అబి.గ.ప్ర.పు.53) ఆడెడివారు. 'కవర కవర

చీకటి ' యుండగనే తొలికోడి కూత తోడ రోకళ్ళ దంపుళ్ళ చప్పుళ్ళకు లేచి తలవాకిలిపై పాచిజల్లి, కలాపిజల్లి ముగ్గులు పెట్టుచు, భూపాలరాగమున బాలకృష్ణుని బాల్యచేష్టలను పాడుకొనుచు, సూర్యదేవుని కూడ తట్టిలేపెడి యా ప్రశాంతములైన పల్లెపట్టులు అందలి యమాయిక ప్రజానీకమును శ్రీరాములు గారు తమ కావ్యములలో ప్రతిబింబింపజేసిరి.

సమకాలిక ప్రజల జీవనవిధానమును వివరముగ తెలుపు కావ్యములకు ప్రత్యేకస్థానము గలదు. ప్రజలు సన్నిహితముగ వారి సమస్యలకు సన్నిహితముగ రచింపబడు కావ్యము లందరిమెప్పును బొందును. శ్రీరాములుగారాంధ్రుల జీవిత విధానమును చక్కగ నవగాహన చేసికొని వారి కావ్యమందంతట ప్రతిబింబింప జేసిరి.

## అధోజ్ఞాపికలు

1. ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర - శ్రీ యేటుకూరి బలరామమూర్తిగారు, పు. 241.
2. ఆంగ్లేయుల పరిపాలనాఫలితములు - గుంటూరుజిల్లా కాంగ్రెసు సంఘ ప్రచురణ, శాలివాహనశక 1843, దుర్మతి, అషాఢము, పు. 15.
3. 1857 పూర్వరంగం - శ్రీ దిగవల్లి శివరావుగారు, పు. 196.
4 బ్రిటిష్ రాజ్యతంత్ర యుగము, పు. 80
5. 1857 పూర్వరంగము,పు. 5
6. డా.సి.ఆర్.రెడ్డి- శ్రీ గొౖరెపాటి వేంకటసుబ్బయ్య. పు॥లు 92,93
7. తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు భాషాప్రభావము - శ్రీకొత్తపల్లి వీరభద్రరావుగారు, పు॥ 247).
8. తెలుగునాడు, ప. 45.
9. కలావతి / పత్రిక / - సంపాదకత్వము. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, రాజమండ్రి, సంపు. 3. ఆగష్టు 1901, పు. 489; పద్యమనుబంధమున చేర్ప బడినది.
10. కృష్ణాపత్రిక, ఆగష్టు 15, 1902, పు. 5.
11. Kandukuri Veeresalingam - (1848. - 1919). - A biography of of An Indian Social Reformer - by J.C. Leonard, 1970.
12. స్వీయచరిత్ర - శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు పు. 82

13. దేవీభాగవతము - శ్రీదాసు శ్రీరాములుగారు, ద్వితీయ ముద్రణము, స్కం. 298 నుండి 310, పు॥లు 418 -19)

14. దేవీ భాగవతము - శ్రీదాసు శ్రీరాములుగారు, ద్వితీయ ముద్రణము స్కం. 3 నుండి 205 పు॥లు)

15. మహాకవి దాసుశ్రీరాములు - జయంతి సంచిక 192 పు. 9.

16 ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర, పు. 24.

17. తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు భాషా ప్రభావము, పు. 238.

18. తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు భాషా ప్రభావము. పు. 278

19. జనవినోదిని - పత్రిక - శ్రీ. వి. కృష్ణమాచారిగారు, పు. 229.

20. యస్. పి. శెట్టిగారిజీవితచరిత్ర - శ్రీదాసు. శ్రీరాములుగారు, పు. 38.

21. శ్రీలక్ష్మీనరసింహసోమయాజి జీవిత చరిత్ర - శ్రీ గ్రంథి వెంకటసుబ్బరాయ గుప్త. పు. 104.

22. కలావతి - పత్రిక, 1901, నెం. 8. సంపు. 3. 475

23. కృష్ణాపత్రిక, 1905 డిశంబరు 15, పు. 7)

24. కృష్ణాపత్రిక 1905, ఆగస్టు 15, పు. 7

25. కాశీ యాత్ర - శ్రీ ఏనుగుల వీరాస్వామయ్యగారు, పు. 274-75



## (ii) పాశ్చాత్య సాహిత్య ప్రభావము

ఆంధ్రకావ్యకన్యకకు పందొమ్మిదవ శతాబ్దపు ఆంధ్రకవులు క్రొత్త తొడవులకై సేసిరి. ఆ సారస్వత ప్రాంగణమున క్రొత్త వైతాళికులు వింతయైన క్రొత్తగానములు నాలాపించిరి. ఆ నవయుగ వైతాళికులలో శ్రీదాసు శ్రీరాములుగారొకరు. వీరి గానములో భావావేశము పెల్లుబికినది. దేశభక్తి తొణికిసలాడినది. వింతవింతగ అతిశయోక్తులతో ఆకాశవీధులలో విహరించు ప్రకృతిని వీరు వాస్తవిక ప్రపంచమునకు తెచ్చి ప్రేమావేశములతో గూడిన భావగీతములతో ఆరాధించిరి. వీరికి ఈ ప్రేరణ పాశ్చాత్య సాహిత్య ప్రభావము వలన కలిగినది.

ఆనాడు పాశ్చాత్య సాహిత్య ప్రభావము ఏ కొంతయో పడనివారు లేరని చెప్పవచ్చును. దీనికి కారణము పూర్వ విద్యావిధానములో విప్లవాత్మకమైన మార్పు కలుగుటయే. 1835 లో ఆంగ్ల విద్యాభ్యాసము కొరకు బెంటింగు ప్రభుత్వము ధనసహాయము చేయ సంకల్పించింది. తామస్ బాబింగ్‌మెకాలే దీనిని క్రియా రూపములో పెట్టి భారతీయ విశ్వవిద్యాలయములలో ఆంగ్లభాషను ప్రవేశపెట్టెను. ఆక్సుఫర్డు,[1] కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయములందలి పట్టభద్ర పరీక్షకన్న ఇక్కడి 'మెట్రిక్యులేషన్' పరీక్ష కఠినముగ నుండెడిది. అచ్చట విద్య నభ్యసించిన విద్యార్థికులు మాతృభాషలో గ్రంథరచన కుపక్రమించుటచే ఆ మాతృభాష నూతన శోభతో విరాజిల్లినది. తత్ఫలితముగ ఆంధ్రభాషలో క్రొత్త ప్రక్రియలెన్నో వెలసినవి. నాటకము, వచనము, జీవితచరిత్ర, స్వీయచరిత్ర, వ్యాసము, విమర్శ, నవల, కథానిక మొదలగునవి.[2]

ఆంగ్ల భాషతో పరిచయముగల పండితులందరు ఆ గ్రంథముల ననువదించుటకు పూనుకొనిరి. ఈ అనువాదములను పత్రికలు ప్రకటించి వీనికి మరికొంత దోహదము చేసినవి. విలియమ్ కౌపరు రచించిన 'మాతృపట స్వీకరణము[3] (On the Receipt of my mother's picture) ను 'మాతృపట' మనుపేర శ్రీవావిలాల వాసుదేవశాస్త్రిగారు అనువదించి 1874 లో 'పురుషార్థప్రదాయిని' యను పత్రికలో ప్రచురించిరి. శ్రీ భమిడిపల్లి సీతారామారావుగారు 'కింగ్ కెన్యూట్' (King Canute) అను పద్యములను అనువదించిరి. అవి 1899 'సరస్వతి' పత్రికలో ప్రచురింపబడినవి. శ్రీకందుకూరి

వీరేశలింగంపంతులుగారు 'షేక్స్పియర్' నాటకముల నెన్నిటినో తెనిగించిరి. 'ఒథెలో' నాటకమును శ్రీ పనప్పాక శ్రీనివాసాచార్యులుగారును, రెంటాల వెంకట సుబ్బారావుగారును తెనిగించిరి. 'మహాజనోయేన గతఃన పంథాః' అను సూక్తి ననుసరించి కవులనేకులు ఆంగ్లసాహిత్య గ్రంథములను దెనిగించిరి. వారిలో శ్రీరాములుగారి కుమారులైన శ్రీదాసు నారాయణరావుగారొకరు. వీరు 'టెన్నిసన్' కవికృతంబగు 'లాక్సులెహాల్' అను కావ్యమును 'కాముక చింతనము' అనుపేర నాంధ్రీకరించిరి. అట్లే 'మాత్యూ ఆర్నాల్డు' యొక్క 'లోటస్ ఈటర్సు' (Lotus Eaters) అను గ్రంథమును 'విస్మృతివృక్షప్రభావము' అనుపేర ననువదించిరి. అట్లే ఎడ్విన్ ఆర్నాల్డుయొక్క 'లైట్ ఆఫ్ ఆసియా' (Light of Asia) అను గ్రంథమును 'సంగీతరసతరంగిణి' అను బుద్ధనాటకముని రచించిరి. ఇది రచనలో నుండగ శ్రీనారాయణరావుగారు మరణింపగ శ్రీరాములు గారుదానిని పూర్తిచేసిరి.

శ్రీనారాయణరావుగారు 'విస్మృతివృక్ష ప్రభావమును' రచించుటకు గల కారణముల నిట్లు చెప్పిరి. 'ఈ టెన్నిసన్ కవి రచించిన 'లోటస్ ఈటర్స్' అనునది ప్రకృతి వర్ణమునందతిశయించినదియయి యాంగ్లేయుల స్వభావవిచక్షణాదక్షత లేక లక్షణంబుగా నుండు కతంబునను, ముఖ్యముగా నందు లౌకిక భారధూర్వహణ ఖిన్నాత్రులగు మానవుల మానసంబులకు బుట్టు విసువు తేటతెల్లంబుగగాన్పించు గాన సర్వోత్కృష్టంబగు మనుజప్రకృతి విజ్ఞాన మాపాదింప సాధనలేశంబగుటం జేసియు, నియ్యదియు మదియోద్యమంబునకు యుక్తంబగునని యెంచి యీ గ్రంథమును 'విస్మృతి వృక్షప్రభావము' అనుపేర తెనిగించితిని. కాల్పనికోద్యమ (రొమాంటిసిజమ్) భావావేశము వీరిని లోగొన్నదని పైదానినిబట్టి చెప్పవచ్చును. భావావేశం, వ్యక్తిత్వప్రకటన, చింతాక్రాంతహృదయం, ప్రకృతి రహస్యపరిశోధన, మానసిక శక్తుల వ్యక్తీకరణం, ప్రకృతిజీవితం యెడల ఆశ్చర్యకరమైన దృక్పథం, నూతన విషయములను పరిశోధించుటలో అమితోత్సాహము, సామాన్య నిరాడంబర జీవితాన్ని ఆరాధించడం, ప్రజాస్వామి కదృష్టి[4] అన్నవి 'రోమాంటిసిజమ్' యొక్క ముఖ్యమైన లక్షణములని చెప్పవచ్చును. ఈ నవీన సాహిత్యము ఆనాటి కవులందరి మనసులను చూరగొని వారిపై తన ప్రాభవము నెరపినది. అందు శ్రీరాములు గారొకరు. వీరు పునరుజ్జీవన (రినైజాన్సు) సారస్వతలక్షణములను గూడ ఆదరించిరి.

శ్రీరాములుగారు స్పెన్సరు, ఆర్నాల్డుల ననుసరించి 'పాస్టోరల్' కవిత్వమును వ్రాసిరి. శ్రీదేవీభాగవతాదిని వ్రాసిన అల్లూరి వర్ణనలో 'పాస్టోరల్' కవిత్వము దర్శనమిచ్చును. దీనిని గుఱించి ముందు ప్రకరణము లందు విపులీకరింపబడినవి. శ్రీరాములుగారు సంప్రదాయయుగమునకు చెందిన జెఫ్రీచాసరు (1340-1400) కావ్యములలోని పోకడలను సుపరిచయము చేసికొనిరి. ముఖ్యముగ తనకాలపు ఆచారవ్యవహారముల నాకళింపు చేసికొనుట, వివిధవిషయములలో విస్తృత పరిచయము సంపాదించుకొనుట, నిష్పాక్షితదృష్టితో వ్రాయుట, అన్ని వర్ణముల ప్రజల జీవిత విశేషముల నవగాహన చేసికొనుట, విమర్శనాయుత హాస్యరసము మొదలగు ప్రత్యేక లక్షణములను గ్రహించి 'తెలుగునాడు' ను రచించిరి.

ఛాసర్ 'కాంటర్‌బరీ టేల్సు' ను రచించెను.[5] ఈ కావ్యములో ముప్పది మంది యాత్రికులు కాంటర్ బరీలో నున్న 'సైంట్‌థామస్' సమాధిని దర్శించుటకు పోవుదురు. ఆ బృందములో వివిధ ప్రకృతులు గల మానవులు, అనేక వృత్తులకు చెందినవారు కలరు. ఈ ముప్పది యాత్రికుల వేషభాషలను గ్రంథ ఉపోద్ఘాతము (Prologue) లో చిత్రించిరి. ఇందు ప్రతి పాత్రయు జీవముతో తొణికిసలాడు చుండును. ఆనాడు ప్రతి వర్గమునకు, కులమునకు వృత్తికి ప్రత్యేకమైన దుస్తులుండెడివి. ఆ దుస్తులందలి వ్యత్యాసములను ఛాసరు చాకచక్యముతో చిత్రించెను. ఒక ప్రక్క వృత్తిలో ముఖ్యాంశములను, మరొకప్రక్క వ్యక్తిగత విషయములను తగుమాత్రముగ సమ్మేళన చేసి సజీవపాత్రలను సృష్టించెను.

అదేవిధముగ 'తెలుగునాడు' లో బ్రాహ్మణసమాజమును ఉన్నయది ఉన్నయట్టుల గన్నయదియు గన్నయటుల వన్నెవెట్టి, చిత్రించిరి.

ఉన్నది యున్నయట్లు మధురోక్తులఁజెప్పిన కబ్బమెప్పుడున్
బన్నమునొంద దందఱును బాగనిమెత్తురు లేనిపోని దం
ధన్నలు కొన్ని పన్నుక కతల్ పెదఁబెట్టిననేమి యన్నెమా?
పున్నెమ? పూరుషార్థమ? బుబుక్షువు సేసిన బ్రాహ్మనార్థమా?[6]

'రినైజాన్సు' యుగపు లక్షణమగు స్వాతంత్ర్యపిపాస, స్వేచ్ఛ, పాత్రనిబంధనల యుల్లంఘన మొదలగునవి పై వాక్యములందు కనిపించుచున్నవి.

ఈ 'తెలునాడు' నందు బ్రాహ్మణ సమాజమందలి వివిధ శాఖలను, వారి వృత్తులను, వేషధారణను, అలవాట్లను కన్నులకు గట్టునట్లు ఛాసరు పాత్రలవలె

చిత్రించిరి. ఈ 'తెలుగునాడు'పై రిచర్డుసీల్, జోసఫ్ ఎడిసన్ (1672–19) ప్రభావము కూడ కలదు. స్టీలు బాట్లరు పత్రికను స్థాపించి వివిధవర్గాల ప్రజలను వారి జీవనమును గురించి హాస్యము స్ఫురించునట్లు వ్రాసిరి. ప్రతి వ్యాసము నందు హితబోధ, కాలక్షేపము, కలిసియుండవలెనని యితని లక్ష్యము. తేలిక జీవనము లను, తప్పిదములను అపహాస్యముపాలు గావించుటవలన నీతిని పెంచగలదని ఈతని ఉద్దేశము. స్టీల్ తన పత్రికను ఆపివేసి తన సహాధ్యాయుడు 'ఎడిసన్' స్థాపించిన 'స్పెక్టేటర్' పత్రిక చేపట్టెను. ప్రజలకు మతవైషమ్యముండరాదని వారి మధ్య సామరస్యము ఉండవలెననియును, అనవరసమైన పై మెరుగులు, వేషములు పనికిరావని సూచించెను. సాంఘికజీవనములోని తీవ్రవిభేదములను సమన్వయ పరచగలిగిరి. అప్పటి వరకు దూషణతోను, మోటుదనముతోను కూడిన హేళన రచనలో మార్పు తీసికొనివచ్చి సమరస భావముతో కూడిన హార్దిక హాస్యరచనను చేసిరి. వీరి హాస్యము హృదయమును గాయపరచదు. మందహాసమును జనింపజేయు నేకాని కడుపుబ్బ నవ్వు పుట్టించదు. ఇవన్నియు 'తెలుగునాడు' నందలి పాత్రలలో గోచరించును. 'చక్కట్లదండ' యందలి 32,51,78,98 పద్యము లందలి పాత్రలలో పైవిధమైన హాస్యము ప్రతిబింబించును. 'దేవీభాగవతము' నందును కొన్ని పాత్రల నిట్లు చిత్రించిరి. ప్రథమ స్కంధమందలి బుద్ధోత్పత్తి యందు బృహస్పతి పాత్ర, పంచమస్కంధ మందలి మహిషాసురువధ యందు, నోటమిపొందిన వరుణుడు, కుబేరుడు మొదలగు పాత్రలు, షష్ఠస్కంధమున హైహయులచే బాధింపబడిన భార్గవులపాత్రలు – ఇవన్నియు బ్రాహ్మణ సంఘముమందలి కొందరు వ్యక్తులకు ప్రతీకలు.

ఆత్మకథ, జీవితచరిత్ర మొదలగు రచనలు పాశ్చాత్యసాహిత్యసంపర్కము వలన విలసిల్లినవి. దేవీభాగవతము పంచమస్కంధమున దేవీవర్ణన సందర్భమున (ప. 518) కెంపు యొక్క ఆత్మచరిత్ర చమత్కారముగ చిత్రించిరి. దేవీభాగవతము వంటి మహాపురాణమునను నిట్టివి చిత్రింపబడిన వనిన వీరిని పాశ్చాత్య సాహిత్య ప్రభావ మెంత లోగొనినదో స్పష్టమగు చున్నది.

నాటకరచన పాశ్చాత్య సాహిత్య ప్రభావము వలననే వర్ధిల్లినది. వీరి 'కురంగగౌరీశంకర' నాటికపై ఈ ప్రభావమెక్కువగా కనబడును. అంకములు రంగములుగ విభజింపబడినవి. 1880 అనంతరము 'స్త్రీ స్వాతంత్ర్యోదయము'

ప్రబలమైనది. అదే ఆనాటి రచనలలో ప్రతిబింబించినది. అట్లే 'కురంగగౌరీశంకర నాటిక' యందును నీవిషయము ప్రస్తావింపబడినది. 'విక్టోరియల్'[7] యుగమందలి రచయితలు వినోదముతో బాటు సంఘసంస్కరణము కూడ సాహిత్యాశయము కావలెనని నమ్మి ఎక్కువగా ప్రయోజనాత్మక రచనలనే సృజించిరి. అదేవిధముగ శ్రీరాములు గారి ప్రతి రచనలోను వినోదము, సంఘసంస్కరణ రెండును సమపాళ్ళలో రంగరింపబడి యుండును.

ఫ్రాన్సిస్ బేకన్ (1561–1621) ఆంగ్లభాషకు వ్యాస (Essay) ప్రక్రియను నూతనముగ ప్రవేశపెట్టెను. శ్రీరాములుగారు 'సముద్రయానము', 'రండా ముండన ఖండనమ'ను, వ్యాసములు రచించినట్లు వారి జీవితచరిత్ర యందు చెప్పబడెను. కృష్ణాపత్రికలలో వారి వ్యాసములు కొన్ని ప్రచురింపబడెను. 'వ్యవసాయకుని స్థితి బాగుపరచుట',(The Evolution of the Ryot ) డిశంబరు 1905 వ సంవత్సర కృష్ణాపత్రికలో గలదు. ఇందు సహకార వ్యవసాయము వలన కలుగు లాభము లుగ్గడింపబడినవి.

పత్రికారచన గూడ ఆంగ్లేయుల సంపర్కము వలననే భారతదేశమున అవతరించినది. వీరును ఆప్రభావముచే 'అనల్ప జల్పితా కల్ప కల్పవల్లి' అను పత్రికను కొన్ని మాసములు ప్రచురించిరి.

'అభినవ గద్యప్రబంధము' ఒక వచన రచన. ఇందలి యితివృత్తము 'అరేబియన్ నైట్సు', కాశీమజిలీలు' వంటి కథలను బోలియున్నది. శ్రీగురజాడ శ్రీరామమూర్తిగారి 'చిత్రరత్నాకరము' లో 'అరేబియన్ నైట్స్' అందలి కొన్ని కథలను స్వీకరించిరి.[8] ఈ గ్రంథమున నివి స్వేచ్ఛానువాదము గావింపబడినవి. పురాణేతివృత్తముల గాక 'అరేబియన్ నైట్సు' వంటి కాల్పనిక కథలను స్వీకరించుట ఆ యుగప్రభావము. ఆ ప్రభావము వలననే భారతదేశ భాషలలో వచన రచన బాగుగ నభివృద్ధి పొందినది. కావుననే శ్రీరాములు గారి స్నేహితులు శ్రీమోటుపల్లి రాఘవయ్యగారు వారిని నూతనకథతో ప్రబంధలక్షణ ములతో గద్యముగ వ్రాయుడని కోరిరి.

ఖండకావ్యరచన పాశ్చాత్య సాహిత్య ప్రభావము వలన ఆంధ్రదేశమున శాఖోపశాఖలుగ విస్తృతి గాంచినది. వీరి అల్లూరి వర్ణన ఒక ఖండకావ్య మని చెప్పవచ్చును.

శ్రీరాములు గారు గొప్ప న్యాయవాదులను, సుప్రసిద్ధులైన పండితులలో నొక రగుటచేతను, నానాశాస్త్రప్రావీణ్యము గలిగి యుండుట వలనను వీరికి పాశ్చాత్యులతో స్నేహము కలిగినది. వీరి కుమారుడు గోవిందరావుగారి వివాహ సమయమున తెల్లవారికి వారింట గొప్ప విందొసగియుండిరి. వీరి జ్యేష్ఠ కుమారులైన కేశవరావుగారి వాణి ముద్రాక్షరశాలలో విశ్వాసపాత్రుడును స్నేహ పాత్రుడను నైన నొక ఆంగ్లేయుడు[9] వీరి కింద పని చేయు చుండెను. ఇట్లు నిత్యవ్యవహారములో వీరికి ఆంగ్లేయులతో పరిచయముండుటచే వారి నాగరికతా ప్రభావము, సాహిత్యప్రభావము వీరిపై మిక్కిలిగ ప్రసరించినది. అందులకని సంప్రదాయ కవితను వీడలేదు. పాశ్చాత్యసాహిత్యమును వీరు చేపట్టలేదు. కేవలము దానిని పలుకరించిరి. అంతవరకే దాని ప్రభావము వీరిపై, అందుకని వీరు సంప్రదాయముపై వలపుబోయలేదు. పాశ్చాత్య సాహిత్యముపై మక్కువ వీడలేదు.

## అధోజ్ఞాపికలు

1. తెలుగుసాహిత్యముపై ఆంధ్రప్రభావము- శ్రీ కొత్తపల్లి వీరభద్రరావుగారు, పు॥ 64,67)
2. ఆంగ్ల సాహిత్య చరిత్ర. - శ్రీ గోపరాజు సాంబశివరావుగారు, పు॥ 655.
3. Studies in The History of Telugu Journalism, Ed. by K.R. Seshagiri Rao, 'Literaray Journalism' by Sri Nidadavolu Venkata Rao garu. p. 6.
4. ఆంగ్ల సాహిత్య చరిత్ర - రొమాంటిసిజిమ్ - శ్రీ గోపరాజు సాంబశివరావు, నవజీవన బుక్ లింగ్సు, విజయవాడ - 2, పు. 328
5. ఆంగ్ల సాహిత్య చరిత్ర - రొమాంటిసిజమ్ - శ్రీగోపరాజు సాంబశివరావు, నవజీవన బుక్ వింగ్సు, విజయవాడ -2, పు॥లు 47,48
6. తెలుఁగునాడు - స్తుత్యాదికము, వ, 6
7. విజ్ఞాన సర్వస్వము - ఆరవసంపుటము, పు. 442.
8. తెనుగుసాహిత్యముపై ఆంగ్లభాషాప్రభావము, పు. 244.- శ్రీ కొత్తపల్లి వీరభద్రరావుగారు
9. ఫిజీ పేట్రిక్

## (iii) వ్యక్తిత్వము

సహజ పాండితీదురంధరులైన శ్రీరాములుగారు వృత్తిచే న్యాయవాదులు. కవిత్వము వీరికి ఔత్సాహిక హేల (hobby). వీరు పాడినదంతయు సంగీతము. వ్రాసినదంతయు కవిత్వముగ నైనది. శ్రీచెళ్ళపిళ్ళవేంకటశాస్త్రిగారు వీరిని రెండవ శ్రీనాథుడని ప్రశంసించి యిట్లనిరి – 'విద్యావిషయముననే కాక రూపసంపద యెడల గూడ నిక్కవివర్ణనీయుఁడు, ఎక్కడనో గాని యిట్టి యుభయసామానాధి కరణ్యము లభింపదు. కావుననే 'విద్యారూపాం విరూపాణామ్' అని యభియుక్తులు నొడవిరి.

వశ్యాస్సుతా విత్తకరీచ విద్యా
నీరోగతా సజ్జన సంగతిశ్చ
ఇష్టాచ భార్యా వశవర్తినీవ
దుఃఖస్య మూలోద్ధరణాని పంచ

అను శ్లోకము నందలి యదృష్టములెల్ల నిమ్మహాకవికి సంఘటించి నందులకు నాకు నాశ్చర్యము గలుగుచుండును. కవులును నుండవచ్చును. పండితులు నుండవచ్చును. ఐశ్వర్యవంతులును నుండవచ్చును. కాని దాసు శ్రీరామ కవివంటి ధన్యులు కోటికొకరేని జేకూరుట యరుదు. కావున నీయన సర్వవిధముల ధన్యుడు'. [1]

శ్రీశ్రీరాములుగారిది భారీయైన విగ్రహము. నల్లకోటు, జరీతలపాగా, జరీ ఉత్తరీయము వల్లెవాటుగ వేసికొని చూచువారికి చేయెత్తి దండము పెట్టవలె నన్నట్లు హుందాగా నుందురు. ఆ కొనదేరిన ముక్కు వారి పట్టుదలను సూచించెను. ఆ కన్నులు కాంతిమంతములై వారి కీర్తి వలె విశాలములై చూపరుల నాకట్టుకొను చుండును. ఇది వారి కచేరీ వేషము. 'కలము' పట్టుకొని వ్రాయుటకు బల్లదగ్గర కూర్చుండునప్పుడు పాదముల జీరుకాడగడట్టిన సరిగంచు ధోవతియును పూర్వసంప్రదాయముల యెడల గౌరవము జూపుటకో యన్నట్లు గోష్పాదమంత చిన్న జుట్టుముడి గలిగి రవసెల్లా భుజము మీద ధరించి, నాటి సంపన్న గృహస్థులకు ప్రతీకగా నుండెడి వారు.

పిల్లలను పెద్దలను గూడ నలరింపజేయు వాక్పాటవము గలవారు. తన బిడ్డలను మనుమలను చెంత జేర్చికొని చిన్నశ్లోకములు, పద్యములతో ప్రారంభించి జ్యోతిశ్శాస్త్రాది సమస్తవిషయములా పసిబాలుర కర్థమగు నట్లు, ఔత్సుక్యము కలుగునట్లు బోధించెడివారు. ఎవరికెట్లు బోధించిన ఆసక్తిగ గ్రహింతురో యట్లు వారి వారి కనుగుణమైన విధమున బోధించెడివారు.

**ఉపాధ్యాయులుగా :**

ఉపాధ్యాయులుగా విశేషమైన యనుభవమును సంపాదించిన వీరి కిట్టిది వెన్నతోబెట్టినది. ఇదే ఉత్తరోత్తర సంఘసంస్కరణోద్యమ వ్యాప్తికి తోడ్పడినది. గ్రామస్థులు, పామరులు సహితము గ్రహించునట్లు సులభమైన శైలిలో వినువారి కుత్సాహము కలిగించునట్లు పాటలరూపము నను, హరికథారూపముననను జెప్పెడివారు. వారు ఆదర్శ ఉపాధ్యాయులు కావుననే గుడివాడ నుండి కవుతరము గ్రామస్థులు, అటనుండి డోకిపర్రు గ్రామస్థులు వారి వారి గ్రామములకు రప్పించుకొని వారిని గౌరవించిరి. శ్రీరాములు పంతులు గారికి కనకాభిషేకము గావించి సన్మానించిరి. పెద్దనవలె వీరిని పల్లకీలో నెక్కించి యూరేగించి వారి వారి భక్తిప్రపత్తులు ప్రదర్శించిరి. ఒక కవిగా కాక ఒక ఉపాధ్యాయుడుగా వీరిట్టి గౌరవము పొందిరి. నాడు గాని నేడు గాని యిట్టి గౌరవము ఏ ఉపాధ్యాయుడును పొందలేదు.

**అజాతశత్రువు :**

వీరు అజాతశత్రువులు. ఆ కాలములో పెద్దకవులొక్కొక్క రొక్కొక్క పత్రికను నిర్వహించుచు దూషణభూషణల సాగించెడివారు. కాని పంతులు గారు ఎవరిని దూషించినట్లు కానరాదు. సమకాలికు లనేకులు వీరిని 'ఆచార్య'[2] 'మహాపండితుడ' ని శ్లాఘించిరి. [3]వీరి యజాతశత్రుత్వము నిరూపించుటకు చిన్ననాట జరిగిన ఒక సంఘటన నుదాహరింపవచ్చును. వీరి తండ్రికి 'చేతపడి'[4] చేయించుటకు శ్రీ గురజాడ శ్రీనివాసులు గారి 'సలహా' మేరకు శ్రీముక్కామల లక్ష్మీనర్సుగారు, జంగము చంద్రశేఖరుడును వానిని పిలిపించిరి. కానీ ఆ లక్ష్మీనర్సుగారే శ్రీరాములుగారి వినయవిధేయతల కలరి వారి కాళ్ళు కడిగి తమ జ్యోతిషాది గ్రంథసంపుటము లను విధిపూర్వకముగ దానము చేసిరి. గురజాడ

శ్రీనివాసులుగారును సీతారామపురాగ్రహార స్వాధీనవిషయమై చాల యాటంకములు కలిగించిరి. చివరి కాతడును శ్రీరాములుగారికి విధేయుడయ్యెను.

**ఆదర్శ విద్యార్థి :**

తమకు తెలియని విషయములు అవకాశము లభించునపుడు ఇతరుల నుండి గ్రహింపవలెనను నాసక్తి కలవారు. కార్యార్థులై యచ్చటకు వచ్చిన పండిత ప్రకాండుల నుండి వారు వివిధశాస్త్రముల గ్రహించిరి. శ్రీసూరి సీతారామశాస్త్రి గారను వైయాకరణుని న్యాయవాదపరీక్షకు చదివించి వారికడ సిద్ధాంతకౌముది, శబ్దేందుశేఖరములను నేర్చుకొనిరి. వీరికి విద్యాతృష్ట మెండు. తానుద్యోగము చేయుచు తన పిల్లలను చదివించుచు వారు గూడ విద్యార్థివలె చదివి కృషి చేసి న్యాయవాద పరీక్షకు గట్టి కృతార్థులైరి. వారు స్వయముగా కృషిచేసి యింగ్లీషు భాష నభివృద్ధి చేసి కొని యందలి పరీక్షలకు గట్టి నెగ్గిరి. ఇంతటి విద్యాతృష్ణ గలవారు మిక్కిలి యరుదుగ నుందురు. విద్యార్థికి తెలివితేటలేగాక పరిశ్రమ కూడ నున్న మిక్కిలి రాణించునని వీరి చరిత్ర వలన తెలియుచున్నది. 'కృషితోనాస్తి దుర్భిక్షం' అని వారి సూక్తి. ఈ విషయమునే దేవీభాగవతములో నిట్లు వ్యక్త పరచిరి –

వరహాలవాన గురిసిన
గరములచేబట్టకున్నఁ గలుగునె ఫల మె
వ్వరికేనిఁ గాన బౌరుష
మరయంగ విధేయమనిరి యార్యులు సుమతి. స్కం. 5, ప, 96.

సాహసము, పట్టుదల వీరిలో పుంజీభవించి యున్నవి. శ్రీభానుమూర్తి గారి కకారణముగ కలిగిన వెలి విషయములోను, వైశ్యులు వేదోక్త కర్మలకు అధికారులని నిరూపించుటలోను వీరు చూపిన ధైర్యసాహసము లెనలేనివి. ఆ సందర్భమున వైదికులందరు కట్టుగా నిలబడి నియోగులిండ్ల స్మార్తకర్మలకు రా నిరాకరించినను, వారా ప్రయత్నము నుండి విరమింపలేదు. ఎదురు నిలచిన వారిని తూలనాడలేదు. నోరెత్తి యొక్కరిని దూషింపలేదు. మహాపండితుడును, షోడశకర్మాధికారియును నగు శ్రీ అవ్వా జగన్నాథశాస్త్రి గారిని ఏలూరునకు

తమ వ్యయముతోనే సకుటుంబముగా పిలిపించి నిత్యనైమిత్తకములు జరుగునట్లు చేసి వారి యాట కట్టించిరి. వారి పట్టుదల మేరువువలె చంచలమైనది. అవినీతి పనులు చేసిన వారిని ధైర్యముగా పై వారికి చెప్పి తగిన శిక్ష కలుగజేయువారు. ఎవరైన అన్యాయముగ పనినుండి తొలగింపబడి శ్రీరాములుగారిని ఆశ్రయించిన వారిని ఆదుకొని యాశ్రయము కల్పించి తనకు తోచిన సాయము చేయుచుండిరి.

**ధైర్యము :**

శ్రీరాములుగారి వ్యక్తిత్వము నందలి గొప్పలక్షణమింకొకటి నిర్భయత్వము. ఎట్టి యుపద్రవము వచ్చినను చలించెడివారు కాదు. వీరికిది తాతతండ్రుల నుండి సంక్రమించి యుండవచ్చును. వీరి తాత ముత్తాతులు ధైర్యముగ నిలబడి వారి యిలదైవమైన సోమేశ్వరుని పైనే వ్యవహారము నడిపి గెలిచిరి.[5] ఆ ధైర్యసాహసములే వీరికిని సంక్రమించినవి. 1891 వ సంవత్సరమున సీతారామపుర స్వాధీనమునకై పాపమ్మారావు జమీందారు గారి మీద తన ధనముతో వ్యాజ్యము వేసిరి. మొదట యోడిపోయిరి. కాని యధైర్యపడలేదు. 'హైకోర్టు' నకు బోయి గెలిచిరి. పాపమ్మా రావు జమీందారందులకై 'ప్రీవికౌన్సిలు'కు అప్పీలు చేసిరి. కాని 'కోర్టు' శ్రీరాములుగారి పక్షముననే తీర్పు చెప్పినది. వ్యాజ్యమాడుటకు కావలసిన ధనము గూడ శ్రీరాములుగారే యొసంగిరి. కష్టమునకు ఫలితముగవారికి రామచంద్ర పురార్థభాగము లభించినది. శ్రీరాములుగారేవిషయము చెప్పదలచినను సహేతుకముగను, స్మృత్యాదుల నుండి యుదాహరించుచును, శాస్త్రప్రమాణము లతో సిద్ధాంతీకరించువారు. వీరు వైశ్యధర్మదీపికను 1893 ఏప్రియల్ నెలలో ప్రారంభించి రాత్రి యెనిమిది గంటలనుండి పదకొండు గంటల వరకు తన 'కోర్టు' పని ముగించుకొనిన తరువాత పట్టుదలుగ కూర్చొని వ్రాయుచు ఆక్టోబరు నెల తుదకు సమాప్తి చేసిరి.[6] వైశ్యులు వేదోక్త కర్మల కర్హులని పరాశంస్మృతి, మనుస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి, పులస్త్య స్మృతి, కూర్మపురాణము, పద్మపురాణము, మార్కండేయ పురాణము, విష్ణుపురాణము, మత్స్యపురాణముల నుండి, ఉపనిషత్తుల నుండి, విజ్ఞానేశ్వరీయము మొదలగువాని నుండి శ్లోకముల నుదాహరించిరి. అంతేకాదు. ఇండియన్ లా రిపోర్ట్సు, కావెల్సు, హైకోర్టు (Cowell's Digest ) తీర్పుల

సంగ్రహము నుండి, శ్రీనివాసరావు, కుప్పుస్వామి నాయకర్‌ల 'హైకోర్టు' తీర్పుల సంగ్రహముల నుండి, టెల్టుంటు దొరగారు, మూరుదొరు గారు ప్రచురించిన తీర్పుల సంగ్రహముల నుండి, రాణీగారి 'ప్రీవీకౌన్సిలు' సభవారు తీర్మానించిన తీర్పుల సంగ్రహముల నుండి, రాణీగారి 'ప్రీవీకౌన్సిలు' సభవారు తీర్మానించిన హిందూదేశ 'అప్పీళ్ళ' నుండి, థామస్ దొరగారి "హిందూ లా' నుండి, దత్తుగారి 'హిందూదేశపు పూర్వకాల నాగరికత యొక్క చరిత్ర" నుండి ఉదాహరణము లొసంగిరి. ఇంతటి కృషి వీరు కేవలము ధర్మలోపమును సహింపలేక చేసిరిట. ధర్మములను ప్రకటింపబూనుట యె దీనికి ప్రయోజనమని వక్కాణించిరి. ఈ గ్రంథమును జూచి శ్రీ ఆత్మూరి లక్ష్మీనరసింహసోమయాజి గారు శ్రీరాములు గారిని ప్రశంసించుచు విజయనగ రము నుండి యొక లేఖ వ్రాసిరి. అందులో "వైశ్యధర్మదీపిక' యను గొప్ప గ్రంథమును రచించి వైశ్యకులమునకు అమితమయిన మేలు చేకూర్చినందులకై మిమ్ము 'ఆచార్యుల' ని పిలుచుటకు మాకు అనుజ్ఞ యివ్వవలయును, యా ఔదార్యమును, నిష్పక్షపాతబుద్ధియును, గ్రంథమునం దంతటను వెల్లడి యగుచున్నది. ఇది అల్పజ్ఞులను, కుయుక్తిపరులను నోరెత్తనీయదు. మీరు వ్రాసిన సూత్రములు స్వర్గలోకము నుండి ఊడిపడినట్లుగా కనబడుచున్నవి. వానిని నా యింటి ముందర గోడకు అతికించి అనుదినమునను చూచుకొను చుండెదను"[7] అని వ్రాసిరి.

**బహుశాస్త్రవేత్త :**

పూర్వకవులు బహుశాస్త్రవేత్తలు. శ్రీదాసు శ్రీరాములుగారును బహుశాస్త్ర వేత్తలు. ధర్మశాస్త్రము లన్నిటియందు శ్రీరాములుగారిది అందెవేసిన చేయి యని చెప్పవచ్చును. వారే విషయమును గూర్చి ప్రసంగింపదలచినను చారిత్రకాధారము లతోను, స్మృతిస్మృత్యాదుల నుండి యుదాహరించుచును, ననర్ఘళముగను ఉపన్యసించెడివారు.[8] శ్రీరాయసం వెంకటశివుడుగారీ విషయమును ఒకప్పుడు వాక్రుచ్చిరి. వైశ్యులు అమశ్రాద్ధమేకాదు, అన్నశ్రాద్ధమునకును అర్హులనియు వారు ప్రతిగ్రహీత లుగ నుండవచ్చుననియు తెల్పుచు బందరు, గుడివాడ మొదలగు ప్రదేశములందు పన్యాసము లిచ్చిరి.[9] ఈ విషయములనే 'శ్రాద్ధసంశయ విచ్ఛేది', యను గ్రంథరూపమున జయసంవత్సర వైశాఖమాసములో ప్రచురించిరి.

శ్రీరాములుగారు న్యాయవాదులు. తర్కశాస్త్రమును గూడ కూలంకషముగా పరిశీలించిరి. వారు 'హైకోర్టు' తీర్పులను గూడ సందర్భాను సారముగా నుదాహరించెడివారు. న్యాయస్థానమున వాదించునపుడు వారు కేవలము 'లా రిపోర్టుల' మీదనే యాధారపడక శాస్త్రవిషయములను గూడ పేర్కొనెడివారట.

**శిష్టాచారపరులు :**

ఏది శిష్టాచారము ఏది దుష్టాచారము అను అంశముపై 'ఆచారానిరుక్తి' 'దురాచార పిశాచభంజని' యను రెండు గ్రంథములను వ్రాసిరి. ఆచారమనగా ధర్మానుష్టానమని ఆచారనిరుక్తి యందు తెల్పిరి. శ్రీ జగన్నాధ కవి దీనికి 'సుబోధ' యను పేర వ్యాఖ్య వ్రాసిరి. దురాచార పిశాచభంజనికి వ్యాఖ్య శ్రీ ఉప్పులూరి కనకయ్యగారి పేర కలదు. శ్రీదాసు విష్ణురావుగారు దీనిని శ్రీరాములుగారే వ్రాసి వారి పేర్లు పెట్టిరని శ్రీరాములుగారి జీవితచరిత్ర యందు వ్రాసిరి. 'సుబోధ' వ్యాఖ్యాత వీరిని 'అఖిలశాస్త్ర విచక్షణదక్షుడని' ప్రశంసించెను.

'దురాచార పిశాచభంజని'[10] యందు తాను వేదశాస్త్రాదులందు ప్రమాణ బుద్ధిగల యాస్తికుడనని స్పష్టముగ తెల్పికొనిరి. శిష్టాచారముల విడచిన నిహపరబాధకము కాన విడవరాదనిరి. అన్ని ఆచారములు శిష్టాచారములని భ్రాంతి చెందుట తగదని వారు దురాచారపిశాచభంజని యందు శిష్టాచారములను వేదశాస్త్రపురాణాదుల నుండి సంగ్రహించి నిరూపించిరి. దురాచారములను వేర్పరచి చూపిరి. ధర్మములు రెండు విధములనిరి. అవి - 1. వేదములందు చెప్పబడినవి, 2. లౌకికాచారములు. ఇవి దురాచారములని యింతకు పూర్వము మనకు తెలియదు. తెలిసిన తరువాత వానిని చక్కదిద్దు కొనవలెనని యొక చక్కని యుదాహరణ నొసంగిరి. కొన్ని ప్రదేశము లందొక నూతినీరే చిరకాలము నుండి పానము చేయు ఆచారము కలదు. అంతకంటే మంచి నూతినీరు లభించినప్పుడు పూర్వపు నూతినీరు పానము చేయుట మానగూడదా? (చక్కట్ల దండలో గూడ యీ విషయమే యిట్లు చెప్పిరి) 'తాత గట్టిన నూయి తప్పదెన్నటికిని యుప్పునీళ్ళు ద్రావు మొప్పెగలడె'. (చ.1). ఇది వేదము లందు శాస్త్రములందు చెప్పబడలేదు. లౌకికాచారమనియే చెప్పవలెను. వైదికాచారములు నాలుగు విధములు. అవి. 1. విహితము 2. నిషిద్ధము. 3. కలివర్జితము 4.

శిష్టాచారములు. వేదశాస్త్రాదులు చేయవలసినదని చెప్పిన యాచారము విహితము. శాస్త్ర విహితములను గాని వేదవిహితములను బాధించెడి యాచారము నిషిద్ధము. కలియుగాది యందు లోకోపకారముకొరకు మహాత్ముల చేత కలియుగమున నివర్తింప బడిన యాచారము కలివర్జితము. ఒక శాస్త్రములో విరోధముగా నున్నను, మరియొక శాస్త్రములో ననుకూలించి యున్నచో నట్టి లోకాచారము శిష్టాచారము సత్యము వచించుట విహితము. అనృతము వచించుట నిషిద్ధము. వృద్ధపారాశరము, బృహన్నారదీయము, ఆదిత్యపురాణము మొదలైన గ్రంథముల నుండి యేబది యాచారములు కలియుగ వర్జితముగా బేర్కొనిరి. ఆంధ్ర వాచస్పత్యమున కలియుగ వర్జితములని చెప్పబడినది. ఆనాడు లోక బాధాకరములుగ నున్న లౌకికాచారముల నెన్నిటినో బేర్కొనిరి. ఇట్టివానిని వర్జింప నగునని కొన్నిటి పట్టిక నిచ్చిరి.

1. కొన్నిచోట్ల స్మార్తులలో నాడు భేదములు.
2. నియోగి వైదిక భేదములు.
3. మతాభిమానములచే సవర్ణులలో నొకరినొకరు నీచులుగా చూచుకొనుట.
4. వివాహాదుల యందు సంభావనలకని బ్రాహ్మణులు మొదలగువారు యజమానులం బీడించుట.
5. ఆహార యోగ్య ధాన్యాదులయందారోగ్యమును విచారించక మృదుత్వాదుల కిచ్చగించుట.
6. కొన్ని ప్రదేశముల యందు విందులకు గృహస్థులు తాము స్వయముగా పోయి పిల్చు విధులు నృత్య గీత వాద్యాదులతో పోయి పిల్చు విధులు.
7. దీపావళికి విశేషద్రవ్యము వెచ్చము చేసి మందుకాల్చుట.
8. స్త్రీలకు విద్య నేర్పకుండుట.
9. అతి బాల్యమునందు వివాహములు సేయుట.
10. అత్తలు కోడండ్ర యందు మిక్కిలి కఠినవృత్తిని చూపుట.
11. స్త్రీలను గృహము బయల రానివ్వక గదులలో మూసిపెట్టుట.

12. వెనుకాముందు లాలోచింపక స్త్రీల కాభరణములు చేయించుట.

13. స్త్రీల కనావశ్యకములగు కర్ణనాసికావేధలు సేయించుట.

ఈ మొదలగు నాచారములు లోకబాధాకరములు గాన వర్జింపదగినవి. లోకములో నానాడు ప్రబలిన దురాచారములను తెలిసికొనియున్నట్టి వారినెల్ల జనులు త్యజింపవలయునని యుద్దేశించి యనేక శాస్త్రముల పరిశీలించి గ్రంథకర్త యావత్తాత్పర్యమును నాలుగువాక్యములలో నిమిడ్చి యీ గ్రంథమును రచించిరి.

పై విషయములు శ్రీరాములు గారి సునిశిత పరిశీలన, గొప్ప శాస్త్రజ్ఞత తెలుపుచున్నవి. వీరి కవిత ప్రమాణోపేతమైనది. విషయము గ్రహించినను దాని పౌర్వాపర్యములవిచారింపక యనుసరించెడివారుకాదు. శాస్త్రము లన్నిటిని బుక్కిట బట్టిన విజ్ఞులువారు, ఇంతటి మహోదారమనీషియైనను గర్వమణు మాత్రమై ననుకానరాదు. ఉద్గ్రంథమగు దేవీభాగవతము నైదుమాసములలో బూర్తిగావించియు 'నా యసామర్థ్యంబునం బొడమిన యెల్ల తప్పులనుం బ్రమాద వశంబునం బొడమిన యపరాధంబులను లేఖకాదులవలన సంభవించిన దోషంబులను లెఖంజేయక నన్నుం గటాక్షించి క్షమింపబ్రార్థించుచున్నాడను'[11] అని వినయముగ విన్నవించిరి.

**వితరణశీలి :**

శ్రీరాములుగారు వితరణశీలి. శ్రీరాములగారెంత సంపాదించినది వారికే తెలియదు. నిత్యము వారింట కవి, గాయక, నటశ్రేణులకు సన్మానములు జరుగు చుండెడివి. శ్రీ తిరుపతి వేంకటకవుల వంటి వారనేకులు వీరిచే సన్మానితులైరి. హరికథపితామహుడు శ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారు కూడ వీరిచే సన్మానితు లైరవారిలో నొకరు. ఆంధ్రదేశపు నాలుగు చెరగుల నుండి పండితులు, గాయకులు వచ్చెడివారు. దేవీభాగవతమును తెనిగించుటకు ప్రారంభింపదలచినపుడు వారికి సంస్కృత మూలగ్రంథము దొరకలేదు. పల్నాటిలో నొకరి యింట నున్నదని తెలిసి దానినిమ్మని వారి నర్థించిరి. వారందుల కొప్పుకొనలేదు. అప్పుడు శ్రీరాములుగారు స్వయముగా బోయి వారిని ప్రతితో సహా పిలిచికొని వచ్చి యా గ్రంథము పూర్తి యగుదనుక వారింటనే యుంచుకొని పోషించిరి. (ఈ విషయమును వారి మనుమలైన శ్రీదాసు వామనరావుగారు తెల్పిరి). వీరిచే

పోషింపబడిన తెలుగు కుటుంబములెన్నో కలవు. వీరి దానధర్మములకై సంపాదించిన దానిలో సగము తరిగిపోయినది.

**నేత :**

కవిత్వము వీరికి అభిమాన విషయమే (Hobby) కాదు, అది వారి యుపదేశముల బోధ కొరక యుపకరణమైనది. తెలుగు ప్రజలకు తన సందేశము నందించు నొక సాధనమైనది. వీరు ఒక సందేశహారియైన కవి. శ్రీ కందుకూరి వారు ప్రారంభించిన సంఘసంస్కరణోద్యమమునకు వీరు నేతయై మిక్కిలి సమర్థముగ నిర్వహించిరి. గుంటూరు, ఏలూరు, రాజమండ్రి, విశాఖపట్నం, విజయనగరము మొదలైన నగరములందు సాంఘిక సభలు జరిపిన సందర్భములలో వారాసభ లందు పాల్గొని వాని కధ్యక్షత వహించి యా సభల జయప్రదము గావించిరి. ఆనాటి కొందరు ప్రముఖ సంఘసంస్కర్తలవలె నితరులతో వైరము తెచ్చుకొనుట గాని, వారిని తూలనాడుట కాని, వారిపై యభియోగములు దెచ్చి 'కోర్టు' కెక్కుట గాని వీరెరుగరు. తన సన్నిహితులు, యనుయాయులు, తన కెన్నడుదురాడ లేదు. చెప్పినదాని నాచరించి యాచరింపజేసెడివారు. 1889 వ సంవత్సరములో శుభకార్య సందర్భమున తెల్లవారికి దన యింట విందు జేసి సర్వేశ్వరుని దృష్టిలో నందరు సమానులే యని జాతి వర్ణ విభేదము లుండరాదని బోధించిరి. అంతేగాని యీ తెల్లవారి 'మద్దతు' గాని 'మిషనరీ' ల సహాయము గాని పొందలేదు. దాని కై ప్రయత్నమును చేయలేదు.

**ప్రగతిశీలి :**

శ్రీరాములుగారు ప్రగతిశీలురు. సంగీతసాహిత్యములు వేశ్యల సొత్తని, అవి నేర్చువారు వేశ్యాసమానులని తలుచు దినము లవి. శ్రీరాములుగారవి స్వయముగా నేర్చి తమ కుమార్తె శారదాంబగారిని సంగీతసాహిత్యముల రెండింట ప్రవీణను గావించిరి. బెంగుళూరులో వారిచే పాటకచ్చేరి గూడ చేయించిరి. ఇది గాంచి ముక్కుమీద వ్రేలు వేసుకొన్న వారే క్రమక్రమముగా వారి ముద్దుబిడ్డలకు వానిని ముద్దార నేర్పజొచ్చిరి. వీరి యందు సంగీతసాహిత్యముల సంయోగ సమనేతృత్వము గలదు. కోపర్నికసు, న్యూటను, హ్యూమ్, జేమ్సువాట్, మొదలగు వారి వలె క్రొత్త వింకను తెలియగోరవలె ననెడి వ్యక్తిత్వము గలవారు. 'శాకుంతల

మనువాద మచ్చతెనుగునజేయుట నూతనత్వమునకే మఱి రెండేండ్లు తాళి మూడిటికంటె ముద్దుగా నుండవలనని దాసు శ్రీరామ పండితుల వారింకొక భాషాంతరము చేసిరి'.[12] అని కందుకూరి వారిట్లనుట కేవల మపోహయే. వైచిత్రికొరకే వారట్లు తెనిగించిరి గాని పైవారితో ప్రతిభటత్వము వహించుటకును మాత్రము కాదు. పిల్లలకు నామకరణము చేయుటలోను నొక క్రొత్తపుంత ద్రొక్కిరి. వారి కుమారులకు, మనుమలకు నామకరణమందు 'కేశవనామము'లుంచిరి. వారి సంతతివారప్పటికిని ఆ నామములనే వహింతురు. (The Eleveation of the Ryot.[13]) 'రైతుస్థితి బాగుపంచుట' అను వ్యాసమును కృష్ణా పత్రికలో వ్రాసి 'సహకార వ్యవసాయము' దాని లాభముల గూర్చి యాంధ్రులకు తొలిసారిగ నెరిగించిరి.

**మోతుబరి రైతు :**

పోతన వలె వీరును హలమును కలమును చేపట్టిరి. ఈ సాదృశ్యము హలముపట్టు వరకే. పోతన గారి వలె దుర్భర దారిద్ర్యబాధ ననుభవించిన వారు గాదు. వీరు ఆగర్భశ్రీమంతులు. వీరు పొలము గట్టుపై నిలబడి 'అజమాయిషీ' చేయుటయే కాదు స్వయముగ హలమును పట్టి పొలమును పనిచేసినవారే.

లేతపాటునఁ జివ్వి పాత్రఁగట్టినగాని
మండ చక్కని యంటుమావిగాదు
....  ....  ....  ....
నాఱుపాటునఁ దీసి నాటి పెంచినఁగాని
దుక్కి మూసిన వరిదుబ్బుగాదు. చ.దం. 66

దుబ్బు పెరిగిన కొలదియు దుక్కిని మూసివేయుచుండును. అనుభవము లేనివారికీ విషయము తెలియదు. ఇట్టి ప్రయోగాదుల వలన వీరు మంచి యనుభవమున్న రైతుబిడ్డ యని చెప్పకతప్పదు. వ్యవసాయమునందు చేయి తిరిగినవారే కాని యితరులిట్టి రచన చేయలేరు. వీరు వ్యవసాయ శాస్త్రవేత్తయే కాదు, పశువైద్యశాస్త్రవేత్త కూడ. "పశువులకు విత్తు కొట్టుట"[14] యను వ్యాసమును కృష్ణాపత్రికలో వ్రాసిరి. అందు శాస్త్రానుసారముగ నాప్రక్రియ జేయవలెనే గాని మొరటుగ వైద్యము చేయరాదు. అట్లు చేసిన యెంత ప్రమాదమో యందు

తెల్పుచూ నా శాస్త్రోచిత ప్రక్రియ నెఱిగించిరి. గుంటగలగరాకు ఉపయోగముల దెల్పు ఆయుర్వేద సంబంధమైన గ్రంథము 'భృంగరాజమహిమ' అను దానిని సంస్కరించి యనువదించిరి.

వ్యవసాయ సంబంధమైన యెల్లవిషయములు వారి కెఱుకయే. ఏలూరులో వారి వసతిగృహమున నొక పెద్ద బావి త్రవ్వించి పెరటిలో మొక్కలను నాటించి పెద్ద తోటను బెంచిరి. సాయంసమయములందచ్చటికి బోయి స్వయముగ దగ్గర నుండి నీళ్ళు పెట్టించువారు.

చినుకుగాఱని మబ్బు జెఁఱగులటన్నియు గ్రమ్ము
　　పూతబూయని మావి పొలము నిండు
దారబిండని బట్టె తవుఁడు తట్టెడు మేయు
　　కాంద్రదున్నని దున్న కొమ్ము పొడుగు.　　　　చ.దం. 86.

ఇవన్నియు సేద్యగానిగా స్వానుభవములు. ఈ విషయము పుటలో మరికొంత వివరముగ నున్నది. వీరికి వైద్యశాస్త్రము నందును నభినివేశము కలదు. భృంగరాజమహిమ యను నొక చిన్న వైద్యగ్రంథమునకు వ్యాఖ్య వ్రాసిరి.

**హాస్యప్రియులు :**

శ్రీరాములుగారు హాస్యప్రియులు. వీరు తెలుగుసాహిత్యమున సరసమును సముచితమును నైన హాస్యము సృష్టించిన కవివరేణ్యులు. హాస్యరసమున వీరి లేఖినిని ముంచెత్తి వ్రాసిరి. శ్రీరాములుగారి పేరు ఉచ్చరింపగ 'తెలుగునాడు'లోని 'లేవరు లెండు లెండన్న' పద్యము స్ఫురింపక మానదు. శ్రీ విశ్వనాథ వెంకటేశ్వరుల్లగారిట్లనిరి "దాసు శ్రీరామ కవి గారి 'తెలుగునాడను' కావ్యమున ప్రతిబింబింతమగుచున్న వారి మనోవృత్తి మేలిమి బంగారు వంటిది నిశితమైన పరిశీలన. సరసమైన హాస్యము, గంటుచేయని తెగడిక వీరి మానిసికౌదార్య గుణమునకు బ్రతిబింబముగా నలరారుచున్నది."[15] దీనిని గురించి శ్రీ చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రి గారిట్లభినందించిరి. "శ్రీరాములు గారి పాకం సభ్యం. ఒక్క అక్షరం కూడ నిషేధించతగ్గది దీనిలో లేదు. ఎందరు కవులు సదస్యాలు (చేయకపోయినా) చూచి వుండరు. ఒకరేనా యిట్టి పద్యాన్ని వ్రాయఁగలిగినారా? దీన్ని బట్టే నేను ఈయన్ని అపర శ్రీనాథుడుగా భావిస్తాను". ఆనాడు ఈ గ్రంథమును

తెలుగువారు ప్రతియింట ఆసక్తితో చదువుచూ దానిని ధారణ పట్టెడివారు. ఉపన్యాసకు లిందలి పద్యములనుదాహరించి సభాసదుల కాహ్లాదము గూర్చెడివారట.

ఈ గ్రంథములోనె కాదు హాస్యము వీరి కవితలో నెచ్చటబట్టిన నచ్చట కాననగును. దేవీభాగవతములో హైహయులు భార్గవులను బాధించునప్పుడు అప్పటి వారి స్థితి యొక్క వర్ణన యెట్టివారినైన కడుపుబ్బ నవ్వింపకమానదు. వీరి గ్రంథములోనే కాదు, ఉపన్యాసములోనే కాదు, ప్రతి వాక్యమున వీరి యీ వ్యక్తిత్వము ముద్రవేసినట్లు కనబడును.

**జ్యోతిశ్శాస్త్రవేత్త :**

ఆనాడు తెలుగుదేశములో విలసిల్లిన గొప్ప జ్యోతిశ్శాస్త్రవేత్తలలో వీరొకరు. వీరి ఈ శాస్త్రపరిజ్ఞాన మన్నికావ్యము లందును నంతర్వాహినిగ దర్శనమిచ్చుచునే యున్నది.

గురుఁడు పంచాంగమును జూచి సురల కనియె
శుక్రుఁడేకాదశంబున సూర్యకుజులు
మూట నారింట శనియును మొనయువారు
లగ్నము శుభంబు పంచకరహితమనుచు - దే.భా. 5-165

'అభినవ గద్యప్రబంధమ'ందు రాజకుమారుల జనన సందర్భమునను వివాహ ముహూర్తము నిర్ణయించు సమయమున నీ ప్రజ్ఞ కాననగును.

తిథివారనక్షత్రయోగకరణలగ్నహోరాద్రేక్కాణ నవాంశ
ద్వాదశాంశ త్రిఁశాంశలు శుభోదయంబులైయుండ స్వక్షేత్ర
మిత్రక్షేత్ర స్వరపమోచ్చల సూర్యాది గ్రహసప్తకంబు
ప్రకాశింప మహారాజయోగంబునం .... ... .. .....

అబి.గ.ప్ర.పు.59

**వివాహముహూర్త నిర్ణయము :**

శుభగ్రహంబులేకాదశ స్థానగతంబులును గ్రూరగ్రహంబులుత్ర్యాయారి గంటులునునై యుండ విచారించి తారాబలచంద్రబలంబులు గల యొక శుభ దినంబున ........

చిన్ననాడే వీరికాశాస్త్రమునం దమితమైన యభిలాష జనించినది. అది క్రమముగ వృద్ధి పొందుచు వచ్చి చివరికి వీరొక గొప్ప జ్యోతిశ్శాస్త్ర సిద్ధాంతిగ స్థిరపడిరి.

**కళాభినివేశము :**

శ్రీరాములుగారు కళాత్మకమైన హృదయము గలవారు. సంగీతము నందును, నాట్యమునందును మంచి యభినివేశము గలవారు. ఆనాటి వేశ్యలకు వీరు స్వయముగ అభినయము పట్టి చూపెడివారట. ఇంతటి పండితులు కావుననే శ్రీరాములుగారు సభలో నున్న ముందుగ వీరికి నమస్కరించనదే నాట్య మారంభించెడి వారు కారట. 'అభినయదర్పణమ'ను నాట్యగ్రంథమును గూడ వ్రాసిరి. నాట్యము నందు వలెనే సంగీతము నందును గొప్ప ప్రావీణ్యము కలదు. పదములు, జావళీలు, స్వరజతులును గల గ్రంధమును రచించిరి. వీరి వలె సరసమైన పదకవితా రచన చేసిన వారు వారి సమకాలికులలో లేరని చెప్పవచ్చును. సున్నితమైన హృదయము, పట్టుదల, సదభ్యాసము గల వ్యక్తికే యీ లలితకళలలవడును. వారిట్టి వ్యక్తిత్వము గలవారు కావుననే యీ కళలు వారిని తమంత తాము వలచి వచ్చినవి.

**సంఘసంస్కరణము :**

చివరిదశలో వీరు న్యాయవాదవృత్తిని విసర్జించి సంఘసంస్కరణము నందే పూర్తిగ తమ కాలమును వినియోగించిరి. వీరుపాధ్యాయులుగ నున్నప్పుడు మత సాంఘిక విషయముల ప్రబోధించెడి 'అనల్పజల్పితా కల్పకల్పవల్లి' అను మాసపత్రికను నడపిరి. 'రండాముండనఖండనము', 'సముద్రయానము' మొదలగు వ్యాసముల రచించి సంఘమునందలి మూఢవిశ్వాసములను దొలగింప బ్రయత్నించిరి. ఏది పట్టినా 'భూర్భువస్సువరాది లోకముల్ నుతులు ముట్ట' జూచెడివారు. ద్వీపాంతరము లందు వర్తకము చేయుట యనాదిగా గలదు. వారందరు సముద్రయానము చేసిరి. నిత్యము జరుగుదానికి ప్రాయశ్చిత్త మనవసరమని వీరి యభిప్రాయము. అందులకే సుమారు 1894 వ సంవత్సర ప్రాంతములలో వీరు మచిలీపట్టణము నుండి మద్రాసునకు ఓడలో ప్రయాణము చేసిరి.

ఆ దినములలో స్త్రీలు సభలకు పోయెడివారు కాదు. శ్రీ వీరేశలింగము పంతులుగారి సభకు తన భార్యను తీసుకొని వచ్చెదనని చెప్పి యుండిరి. మాట దప్పువారు కాదు. కావున శ్రీరాములుగారి భార్య యానాడు బహిష్ఠయైనను స్నానము చేయించి సభకు తీసికొనిపోయిరి.[18] ఇందులకు శ్రీ వీరేశలింగము పంతులుగారు వారినెంతో శ్లాఘించిరి. దేవతారాధన లందు జంతుబలి మాన్పుటయే కాదు వారి యగ్రహారమైన యల్లూరి యందు బ్రాహ్మణేతరు లందరిచే మాంస భక్షణమును గూడ మాన్పించిరి. ఈనాటికిని వారు శాకాహారులె. నేనా గ్రామమునకు పోయినప్పు డచ్చటి గ్రామస్థులు శ్రీ భట్రాజు సోమేశ్వరరావు గారను నొక యాదవప్రముఖులీ విషయమును జెప్పిరి. ఇంటగెలిచిరచ్చగెలుపు మన్న యాదర్శ సంస్కారము వారిది.

గ్రామము లందు 'నిశానీదారు' లుండరాదని వీరి యభిప్రాయము. వీరి యుపన్యాసముల ఫలితముగ గురజ, అంగలూరు మొదలగు గ్రామములందు స్త్రీ విద్యానిలయములు వెలసినవి. అల్లూరిలో నున్నవారు అమాయకులగు యాదవులు కారు. శ్రీరాములు గారు వీరినందరిని కమ్మని కవిత్వము చెప్పు కాళిదాసులుగ తీర్చిదిద్దిరని చెప్పవచ్చును. ఇట్లు వీరు సంస్కారమును తమ అగ్రహారమునందే ప్రారంభించిరి. బ్రహ్మసమాజప్రచారము ముమ్మరముగ నున్న దినములవి. చాలమంది పెద్దలు వైదిక మత సంప్రదాయాచారముల ననుసరించుట గాని, విగ్రహారాధన చేయుట గాని కూడదని ప్రబోధించిరి. కాని శ్రీరాములుగారు సంఘములోని దురాచారముల వీడవలెనే గాని మతమును శిష్టాచారముల వీడరాదని తమ మదికి దోచిన ధర్మముల నుపదేశించి శిష్టాచారములననేవో ప్రబోధించిరి. విగ్రహా రాధన తారావళిలో నిట్లు వక్కాణించిరి.

అమ్మాయి బొమ్మరిండ్లలికి ముగ్గులు పెట్టి
బొమ్మల నమర్చునె బుద్దితోడ
వివిధ నాగంకోటీ విక్టోరియా రాణి
ఫోటో గ్రహించునే బుద్ధితోడ
పత్రికాధీశ్వరుల్ బహువిధపటముల
పుటముల వైతురేబుద్ధితోడ

సాహెబెస్స్వరులను స్టాట్యూలుడంబుగ
నిల్పి కొలుచుటయెబుద్ధితోడ
భూమికర్తను దానొక్క బొమ్మచేసి
కొలుచువానికి నొక్కింత ఫలములేదు
ఉత్తమప్రాణికోటికి జిత్తశుద్ధి
సాధనంబగు విగ్రహారాధనంబు

ఏకేశ్వరోపాసకులను హేళన చేయుటకై యీ గ్రంథమును రచింపలేదు. తమకుతోచిన మార్గమిది యని మాత్రమే తెలియజెప్పిరి. బ్రహ్మసమాజముపై 'మోజు' కలిగి కొందరు జందెములు తీసివేసిరి. అది వీరి కిష్టము లేదు.

'జందెమూడ్చిన గేస్తు సారద్రాగిననేమి తెల్లుల్లి నీఱుల్లి దిన్ననేమి'
చ.దం.88

యని వారి అయిష్టతను వ్యక్తబఱచిరి. అట్లని సంప్రదాయమే మంచిది దానినే యనుసరింపుమనెడివారు కాదు. 'చాదస్తుల' నిట్లు మందలించిరి.

నేళ్ళు చెల్లిన బాపండు పెద్ద చెఱ్వునఁజల్లుఁ బేడనీళ్ళు - చ.దం. 71

వీరు సంఘసంస్కర్తయైనను సనాతన ధర్మములను వీడని దొడ్డ గృహస్థు. శ్రీవీరేశలింగము పంతులుగారి పాలితపుత్రుడు వితంతువివాహము చేసికొన నొల్లక శృంగేరి పీఠాధిపతులచే ప్రాయశ్చిత్తము చేయించుకొని చెఱుకుపల్లి వెంకటరత్నము కుమార్తెను వివాహము చేసుకొనగోరెను. ఆ పీఠాథిపతులు ఒక దొడ్డ గృహస్థు నుండి నిదర్శనపత్రము తెమ్మని కోరగా నాతడు శ్రీరాములు గారి నర్థించి వారి నుండి యట్టి పత్రము పొంది పీఠాథిపతుల కొసఁగ వారామోదించిరి. అంతేకాదు వీరు దైవభక్తితత్పరులు. 'కామాక్షీశతకము', 'సూర్యశతకము' 'సోమేశ్వరశతకములు' వీరి విశిష్టమైన భక్తి తత్పరతను విశదము చేయును.

**భోజనప్రియత్వము :**

అన్ని కళలవలె భోజనము చేయుట గూడ ఒక కళయే. అష్టభోగముల లోనిది పెద్ద చోటుచేసికొన్నది. మన ఆంధ్రకవులలో భోజనప్రీతి గల వారిలో ప్రథములు శ్రీనాథుడు, ద్వితీయులు శ్రీరాములుగారు. వీరికిని శ్రీనాథునుకి వలె నరటాకులలో భుజించుట యిష్టము.

కమ్మని కందిపప్పు నురుగారఁగఁగాచిన నేతిబొట్టు దూ
రమ్మున దావిగ్రమ్ముకొనిరా బొగుపెత్తిన యాకుఁగూరలుం
గుమ్మడి పొట్ల కాఁకర మునుంగయు దొండ బెండ శా
కమ్ములు దప్పళంబులను గల్పి భుజింతురు శాలితండులా
న్నమ్ములు బ్రేవుమంచును దినం బరటాకులలోన బ్రాహ్మణుల్
– తె.నా, పు. 16, ప 44

ప్రతినిత్యము ఇన్ని వ్యంజనములున్నను వీరికి అప్పడములు, వడియములు గూడ తప్పకయుండవలెను.

గుడిఁబట్టి దిగఁద్రిమింగుగొప్పదెయ్యానకుగుడితలుపెన్ననప్పడముగాదె
– చ.దం, 80

ఒంటిదానవు చిన్నదానవయో మృదూరుపదాబ్జవా
కంటకోపముతోడజన్యముఖంబునఁబడి నిల్చెదే
పంటిక్రిందికి నప్పడంబవొ పప్పవో వడియంబవో
దంటయేనుఁగు జాజిపూవులదండ పట్టినపోల్కియొ.
– దే.భా.–5–223

నీ దీర్ఘదంష్ట్రలకు నరశరీరంబులు వడియములా విడియములా ?
– అభినవ గద్యప్రబంధము, పు. 38.

ఇట్లవకాశము లభించినప్పుడెల్లచో నీ యప్పడములు వడియముల సమూలకముగ నైన తన రచనలో జొప్పించి, వానిపట్ల తనకున్న ప్రీతిని వ్యక్తపరచిరి.

**నమ్రత :**

ఇంతటి విశిష్టమైన వ్యక్తిత్వము గల మహాపండితుడైనను గర్వమణు మాత్రమును లేదు. తనకు తోచిన మార్గమిది యని మాత్రము చెప్పిరి కాని ఆ మార్గమును నవలంబింపుడని బలవంతము చేయలేదు. వారి మార్గము ననుసరింపకపోయిన వారిని తూలనాడలేదు. "నా హృదయమునకు తోచినది

వ్రాయుచున్నాను. ఇందు నావలన బొడమిన తప్పులు నాకు నగపరచి పెద్దలను వారు నాకు బుద్ధిచెప్పి సవరించుకొన జేసిరేని మిక్కిలి సంతోషించెదను. మాకంటె నితడు పండితుడా? మాకు తెలియని యర్థ మితడేది చెప్పగలడని, గ్రంథము జూచినతోడనే నిరసించి కూలద్రోయక, గ్రంథము సాకల్యముగా చిత్తగించువారు గదా సాధువులు. కావున అటువంటి సాధువులకే విన్నవించుకొన్నాడను." వీనివలన నానాడు కీర్తి ప్రతిష్టల నాశించి కొందరు కుమతు లిట్లామూలాగ్రముగ పరిశీలింపకయె విమర్శించి వితండవాదనలకు దిగెడివారని దెలియుచునే యున్నది. (ఆచార నిరుక్తి – పీఠిక). దేవీభాగవతములో గూడ నల్పజ్ఞుల గూర్చి యిట్లు చెప్పిరి. "ఇప్పటి కవులలోఁ గొందరు ఏకైక మతావలంబులయినవారును, బహుగ్రంథద్రష్టులు కానివారును, పరరంధ్రాన్వేషణతత్పరులును నగువారు దంభంబు సూపుచు దమ ప్రావీణ్యంబు పలువురు గొనియాడుదురో యని యడియాసంజిక్కి యాక్షేపింపం దొరంకొనువారు కలరు. కావున వారలకిందు నా మార్గం బిదియని చెప్పి నాజోలికి వచ్చుట క్షేమంబు కాదని తొలగించుకొనుట యుక్తంబని యెంచితి" అని సాధ్యమైనంత వరకు ఈ వివాదములకు దూరముగ నుండెడివారు. పైగా దాని ఫలితమిట్లు చెప్పిరి –

ఈదాడొనఁ గోదాడని
వాదంబుల ఊనునిలువవలయునె ఫలమే
మీదీన మానరాదా
కాదనినను గాక దంతగణనంబె కదా !

గంటు చేయని తెగడికయు నిందు గాననగును.

బాలకృష్ణుని వలె నాలమందల వెనుక తిరుగుచు దొడ్లు, బావులు, తోటలందు గ్రుమ్మఱుచు 'చెడుగుడు', 'కోతికొమ్మచ్చులు' మొదలగు ఆటల బ్రొద్దుపుచ్చుచు దైవానుగ్రహముచే సహజపండితులై, లౌకికవిద్యల, కళల నేర్చి యింతింతవారంత వారై విశిష్టమైన వ్యక్తిత్వము సంపాదించి సనాతన ధర్మప్రతిష్ఠాపకులైన వీరిని శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటకవీశ్వరులిట్లు ప్రశంసించిరి. "వారు సరసకవి, విద్వత్కవి, స్వతంత్ర కవి, ఆశుకవి, దాత, నేత,"

సర్వజ్ఞత్వము సాంబమూర్తిది మనుష్యప్రజ్ఞ యల్పంబు దు
ర్గర్వంబుల్ కొఱగావు దూషణల మోక్షశ్రీలు చేకూర వీ
యుర్విన్ ఖానికుడెన్ని రాళ్లు వడపోయున్ రత్న మొక్కఁటికై
గుర్వర్థం బొకఁడున్నఁ జాలదె? సుధీకుంభుల్ పరీక్షించినన్

– అ.భి., గ‌ప్ర పు. 5

ఈ సర్వజ్ఞత్వంబు యిట్టి మహాత్మునిలో సాంబమూర్తి నిక్షేపించెను.

## ఉపయుక్త గ్రంథసూచిక


అభిజ్ఞానశాకుంతలము : శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులు గారు, హితకారిణి సమాజము రాజ మహేంద్రవరము, 1958–63.

అభిజ్ఞానశాకుంతలము : వడ్డాది సుబ్బరామకవి, చింతామణి ప్రెస్, 1906

ఆంగ్ల సాహిత్య చరిత్ర : శ్రీ గోపరాజు సాంబశివరావు గారు, నవజీవన బుక్ లింక్స్, విజయవాడ.

ఆంగ్లేయ పరిపాలనాఫలితములు – హిందూదేశము : జె.పి. పాన్సు గారి ఉపన్యాసభాగములకు ఆంధ్రీకరణ, గుంటూరు జిల్లా కాంగ్రెసు సంఘ ప్రచురణము

ఆంధ్రనాటక రంగ చరిత్ర : మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, రేణుక, 22 నాగార్జున నగర్, మద్రాసు 24

ఆంధ్రభాషా భూషణము : కేతన, వావిళ్ళ వారిప్రతి, 1949

ఆంధ్రభాషా వికాసము : శ్రీగంటి జోగిసోమయాజులుగారు, త్రివేణి పబ్లిషర్స్, మచిలీపట్నం

ఆంధ్రవచనరచనాపరిణామము : గొబ్బూరి వెంకటానంద రాఘవరావుగారు, ఆద్దేపల్లి అండ్ కో, రాజమండ్రి 1961

ఆంధ్రవాగ్గేయకార చరిత్ర : శ్రీ బాలంత్రపు రజనీకాంతరావుగారు, విశాలాంధ్ర ప్రచురణాలయము, విజయవాడ, 1958

ఆంధ్ర వాఙ్మయ చరిత్ర : శ్రీకాశీనాథుని నాగేశ్వరరావుగారు, ఆంధ్ర గ్రంథ మాల, మద్రాసు, 1957

ఆంధ్రవాఙ్మయ చరిత్రము : శ్రీ వంగూరి సుబ్బారావుగారు, కమలాకుటీర్, నరసాపురం. 1957

ఆంధ్రాభిజ్ఞానశాకుంతలము : శ్రీ వేదము వెంకటరమణశాస్త్రిగారు, ది యిండియన్ ప్రింటింగ్ వర్క్సు, మద్రాసు, 1923

ఆంధ్రశబ్దచింతామణి : ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక 1932

ఆంధ్రశతకవాఙ్మయము : శ్రీ గోపాలకృష్ణారావుగారు ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఆకాడమీ, హైదరాబాదు

ఆంధ్రుల సంక్షిప్తచరిత్ర : శ్రీ యేటుకూరి బలరామశాస్త్రిగారు, విశాలాంధ్ర ప్రచురణ, విజయవాడ. 1966

ఆత్మూరి లక్ష్మీనరసింహసోమయాజి జీవితచరిత్రము : శ్రీ గ్రంధి వెంకట సుబ్బయ్య గుప్తాగారు, ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల, బెజవాడ, 1912

ఎస్.పి.శెట్టిగారి జీవితచరిత్ర : శ్రీదాసా శ్రీరాములుగారు, బెంగుళూరు విద్యార్థి వర్తక సంఘం - 1928

కందుకూరి వీరేశలింగం పంతులుగారి స్వీయచరిత్రము : శ్రీ కందుకూరి వీరేశ లింగం పంతులు గారు, విజ్ఞానచంద్రికా గ్రంథమాల, సంపాదకుడు కె.వి. లక్ష్మణరావుగారు.

కాశీయాత్ర : శ్రీ ఏనుగుల వీరాస్వామయ్యగారు, సంపాదుకులు శ్రీ దిగవల్లి శివరావు గారు, విజయవాడ 1941

కుమారసంభవము : నన్నెచోడుడు వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు, చెన్నపురి, 1961

క్రొత్త సంగీతవిద్యాదర్పణము : శ్రీ ఏకా సుబ్బారావుగారు దిఓరియంటల్ పవర్ ప్రెస్, తెనాలి . 1949

క్షేత్రయ్య పదములు : సంపాదకుడు శ్రీ గిడుగు వెంకట సీతాపతిగారు, సీతాపురం రాజా డాక్టరు రావు వెంకటమహీపతిచే ప్రకటితము, 1912

క్షేత్రయ్య పదసాహిత్యము : డాక్టర్ శ్రీ ఎన్. గంగప్పగారు, ఆంధ్ర సాహిత్య ఆకాడమీ ప్రచురణ, హైదరాబాదు, 1974

క్షేత్రయ (శృంగారము) : డాక్టరు దివాకర్ల వెంకటావధాని గారు, ఆంధ్రసాహిత్య ఆకాడమీ హైదరాబాదు (సాహిత్యో పన్యాసములు – 3 )

చంద్రశేఖరశతకము : చంద్రశేఖర కవి, మద్రాసు వావిళ్ళ, 1919

చైత్రరథము : శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు, సరస్వతి పవర్ ప్రెస్, రాజ మహేంద్రవరము 1976

డాక్టరు సి.ఆర్.రెడ్డి : శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్యగారు, దేశీకవితా మండలి, విజయవాడ.

తిరుపతి వెంకట కవుల సాహిత్యసమీక్ష : శ్రీశిష్టాలక్ష్మీపతిశాస్త్రిగారు, నిర్మలా పబ్లిషర్స్, విజయవాడ

తెనుగు వ్యాకరణవికాసము : డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తముగారు, గిరిజా ప్రచురణలు, బాపట్ల, 1969

తెలుగుసాహిత్యముపై ఆంగ్లభాషాప్రభావము : శ్రీ కొత్తపల్లి వీరభద్రరావుగారు, ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రచురణ, వాల్తేరు.

తెలుగు హాస్యము : శ్రీ ముట్నూరి సంగమేశంగారు, ఆంధ్రసారస్వత పరిషత్తు, హైదరాబాదు, 1954

దురాచారపిశాచభంజని : శ్రీ దాసు శ్రీరాములుగారు, వర్తమాన తరంగిణీ ముద్రాక్షరశాల, చెన్నపురి.

నన్నయ భారతము ఆంధ్రవాఙ్మయారంభదశ (ద్వితీయ సంపుటము) : డాక్టర్ దివాకర్ల వెంకటావధాని, ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య ఆకాడమీ, హైదరాబాదు

ప్రబంధవాఙ్మయము : డాక్టర్ పల్లా దుర్గయ్య, ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాదు, 1973

1857 పూర్వరంగము : శ్రీ దిగవల్లి శివరావుగారు

భామాకలాపము : శ్రీ సిద్ధేంద్రయోగి భ్రమరాంబామల్లిఖార్జున గ్రంథాలయములో ఒక ప్రతి కలదు; మంజువాణి ప్రెస్. 1906

భారతదేశమున బ్రిటిష్ రాజతంత్రయుగము అను బ్రిటిష్ ఇండియా చరిత్రము : శ్రీదిగవల్లి వెంకట శివరావుగారు, విజయవాడ

భాగవతము : బమ్మెరపోతన, వావిళ్ళ రామస్వామి అండ్ సన్సు, చెన్నపురి, 1926

భారతము : కవిత్రయము,

భారతీశతకము : శ్రీ గిడుగు వెంకటసీతాపతిగారు, నవ్యసాహిత్య పరిషత్తు, గుంటూరు.

బాలవ్యాకరణము : చిన్నయసూరి

భృంగరాజమహిమ : శ్రీదాసు శ్రీరాములుగారు, వాణీ ముద్రాక్షరశాల, 1906

మధురపండితరాజము : శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు, యం. యస్సార్ మూర్తి అండ్ కో, విశాఖపట్నం.

మాలతీమాధవము : శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు, 1958

మనహాస్యము : శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారు, ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు, 1968

మహావీరచరిత్రము : మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు, శ్రీ యజ్వ అండ్ కో, ఏలూరు

యయాతిచరిత్ర : శ్రీ పొన్నెగంటి తెలగన్న, వావిళ్ళ రామస్వామి అండ్ సన్సు, మద్రాసు, 1930

వికృతి వివేకము : వావిళ్ళ రామస్వామి అండ్ సన్సు

విస్మృతి వృక్షపరిభావము : శ్రీ దాసు నారాయణరావుగారు,

వీరేశలింగము పంతులుగారు సమగ్ర పరిశీలన : డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు గారు, ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, సికింద్రాబాదు, 1972

వైశ్యధర్మదీపిక : శ్రీదాసు శ్రీరాములుగారు, వాణీప్రెస్, బెజవాడ, 1909

శతకసంపుటము : ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఆకాడమీ, హైదరాబాదు

శ్రాద్ధసంశయ విచ్ఛేదిని : శ్రీదాసు శ్రీరాములుగారు, వాణీ ముద్రాక్షరశాల, ఏలూరు; 1896

శృంగార నైషధము : శ్రీనాథుడు

శ్రీకృష్ణభూపాలీయము – శ్రీ చంద్రకవి, మైసూరుప్రభుత్వ ప్రచురణ, 1924

శ్రీదాసు శ్రీరాములుగారి జీవితచరిత్ర : శ్రీ దాసువిష్ణురావుగారి లిఖితప్రతి

శ్రీదేవీ భాగవతము : శ్రీ ములుగు పాపయారాధ్యులవారు, ప్రకాశకులు శ్రీ పిచ్చాకోటయ్య, భేతపూడి వీరభద్రయ్య, బెజవాడ 1942

శ్రీ దేవీభాగవతము : శ్రీ తిరుపతి వెంకటకవులు, భైరవి ప్రెస్, మచిలీపట్టణము, 1909

సర్వలక్షణసారసంగ్రహము : శ్రీ కూచిమంచి తిమ్మకవి, మంజువాణి ప్రెస్, ఏలూరు, 1927

సారంగపాణి పదములు : పురిపండా అప్పలాచార్యగారు సంకలనం, ప్రాచీన గ్రంధావళి 10, సరస్వతీపవర్‌ప్రెస్, రాజమహేంద్రవరము, 1961

సాహిత్యోపన్యాసములు : క్షేత్రయ పదసాహిత్యము, ఆంధ్రప్రదేశ్ పదసాహిత్య ఆకాడమీ, హైదరాబాదు

సుగ్రీవవిజయము : కందుకూరి రుద్రకవి, మాధవీబుక్ సెంటర్, హైదరాబాదు

సూర్యశతకము : శ్రీ వడ్డాది సుబ్బరాయకవి, వావిళ్ళ రామస్వామి అండ్ సన్సు, మద్రాసు 1950

సూర్యశతకము : శ్రీ ఆకొండి వ్యాసమూర్తిగారు,

సూర్యశతకము : శ్రీదాసు శ్రీరాములుగారు, మహాకవి దాసు శ్రీరాములు గారి స్మారక సమితి, హైదరాబాదు, 1979

సూర్యశతకము : శ్రీ యామియాల పద్మనాభశాస్త్రిగారు, త్రివేణిప్రెస్, మచిలీపట్నం

సూర్యశతకము : శ్రీ చదలవాడ జయరామశాస్త్రిగారు, సరస్వతీ గ్రంథమాల, 1965

సూర్యశతకము : శ్రీ భళ్లమూడి నరసింహమూర్తిగారు, అవంతి ప్రెస్ రాజమండ్రి 1972. శ్రీగజలక్ష్మీ పబ్లికేషన్స్ కటక్, ఒరిస్సా.

**సంస్కృత గ్రంథములు :**

చంద్రాలోకము : బుధరంజనివ్యాఖ్య, యన్. రాఘవాచార్య. 1951

మాలతీమాధవము : భవభూతి : జగధరుని వ్యాఖ్యతో

మహావీరచరిత్రము : భవభూతి శ్రీ వీరరాఘవులు గారి వ్యాఖ్యతో, నిర్ణయసాగర్ ప్రెస్, బొంబాయి, 1926

శ్రీమద్దేవీభాగతము : శ్రీ తిలకాఖ్య వ్యాఖ్యతో, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, చెన్నపురి 1930

సూర్యశతకము : మయూరుడు

**పత్రికలు :**

ఆంధ్రపత్రికలు 1911, 1929 సంవత్సరాది సంచికలు, మద్రాసు ; ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, కాకినాడ ; అనల్పజల్పితాకల్పకల్పవల్లి, 1880. బందరు ; కలావతి, 1901, 1902 రాజమండ్రి ; కృష్ణాపత్రిక, 1902 1905 బందరు ; చింతామణి, 1893-94, రాజమండ్రి ; జనానా, జూలై 1896 ; జనవినోధిని, 1877 ; భారతి, 1960, డిసెంబరు, 1969 ఏప్రిల్, చెన్నపట్నం; మంజువాణి, 1901, ఏలూరు ; మానవసేవాపత్రిక, శ్రీ గురుమూర్తిగారు, మద్రాసు; సత్యసంవర్ధిని, 1899, రాజమహేంద్రవరము ; సరస్వతి, 1899 ; హిందూసుందరి, 1902.

**నిఘంటువులు, విజ్ఞానకోశములు :**

ఆంధ్రవాచస్పత్యము; విజ్ఞానసర్వస్వము; ఆంధ్రవిజ్ఞానసర్వస్వము; సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము; శబ్దరత్నాకరము

Encyclopaedia of the great Personages of the Madras Presidency and the adjacent states

The New Universal Encyclopaedia, Vol.8

**ఆంగ్లగ్రంథములు :**

Abhijnanasakuntalam : Kalidasa (M.R. Kale)

Aristotles Poetics : Butchies translation

A back ground to the Study of the English literature : Sri B. Prasad

A catalogue of the Telugu books in the Library of the British Museum

A studies in Devi Bhagavatam : Dr P.G.Lalye, Popular Prakasam Pvt Ltd ' Bombay

History of Telugu literature : Sri G.V.Sitapati

Kandukuri Veeresalingam ( A biography of an Indian reformer) : Sri J.G.Leonard, Michigan, USA, 1930

Mahaveeracharitam : Todarmall, Lahore University, Lahore

An out line of the History of English literature : Sri william Henry Hudson

The Scholar Gipsy : Sri Mathew Arnold

A short history of English literature : George Saintsbury

The Poetical works of Edmond Spencer : Spencer

Studies in the History of Telugu Journalism : Ed.K.R. Seshagiri Rao Malati Mathavam - Bhava-bhuti (K.R.Kale)



**మహాకవి దాసు శ్రీరాములు గారి కృతులు ఒక సమీక్ష**

పుస్తకమును ఆవిష్కరిస్తున్న డా॥ పి.యస్.ఆర్. అప్పారావు

అధ్యక్షులు డా॥ దాశరథి ఆగష్టు 18, 1986

అనుబంధము - 1

# లక్షణావిలాసము

**(లిఖితప్రతి శిథిలములు పూరింపబడినవి)**

డోకిపుర గోపబాలు నస్తోక కృపను
కన్నయామాత్య కామాంబికా తనూజుడు
దాసు రామాభిధాన విద్వద్వరేణ్యు
డీకృతియొనర్చె లోకోపకృతిని గోరి । పల్లవి ।
శ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీ
శ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీ
శ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీశ్రీ జేయున్

– శ్రీరస్తు –

శ్రీమఖండలక్ష్మిని నిల్పె నెవ్వాడు ఔమ్మునం దక్షిద్వయమ్మునందు
బ్రాహ్మణోదయలీల బరగించె నెవ్వాడు మోమునందును బొడ్డుగీమునందు
ఆ స్వర్గవాహిని నటించె నెవ్వాడు పదములందాత్మీయ పదమునందు
ధరణీధరేంద్రంబు ధరియించె నెవ్వాడు కరమునం దమలకర్పరమునందు

జగతి నస్తోకజయసముచ్ఛ్రాయకలిత
లలిత చక్రంబు నెవ్వాడు వెలయదాల్చె
భుజమునందును పాణిపంకజమునందు
నతడు సర్వేశ్వరుండు నారాయణుండు

అతని యడుంగుదమ్మిని మహత్వ దయాసముదీర్ణ దాతృతా
మతిజితకర్ణ లచ్యుతసమంచిత పుణ్యకళాసుధామయా
త తకృతి గద్యపద్య విహిత శ్రవణాస్రవణాచ్ఛకర్ణుల
ద్భుత సుకలాప్రపూర్ణ లిలబుట్టిరి బుట్టువు సార్థకంబుగన్
కమనీయ గుణరూపకము వహించిన మానికమ్ముదాల్పినవారు కమ్మవారు
పరమకళ్యాణియౌ పద్మాలయను తమ కమ్మగా గలవారు కమ్మవారు
రమణీయ ధైర్యసామ్రాజ్యంబు హేమాద్రి కమ్మబూసినవారు కమ్మవారు

స్థిరతర బ్రాహ్మణాశీర్వాద పటిమచే కమ్మగట్టినవారు కమ్మవారు
ఆప్తులగువారికెల్ల నిత్యంబు మేలు
కమ్మలంపెడువారుబో కమ్మవారు
లాలితాలాపమోచాకలాపములను
కమ్మ చవులున్నవారుబో కమ్మవారు

ఆ కమ్మకులవనధి ను
ర్వీ కన్మరుదాదులలర వేంకటరామా
ఖ్యాకమ్మార్యతపఃపరి
పాకమ్మగు కల్పపాదపం బుదయించెన్

హైదరబాదులో నయవనాథిపుడైన నబాబ యారె యెం
తే దయదాదివానునకు దెల్పు వహవ్వ వహవ్వరె ఖుబ
చ్ఛాదరబారుకే బలుకుశాలుకరే పునుకూ బరాబరా
ద్మీదునియా మెనై యనుచు మేదిని వెంకటరామ చౌదరిన్

ఆ వెంకటరామాఖ్య మ
హోవర వర్ణోత్తమోత్తమాంగ మణికి దా
నివిర్భూతి వహించెన్
కేవల శుభరుచులమాతినీడన ఘనుడై

పోలవరాన్వయాబ్ధి పరిపూర్ణ కలావిధు డత్యుదాత్త బా
హోల సమానశక్తి ముసలాయుధు డక్షయలక్షణక్షణా
వాలకదుండు పూజిత సుపర్ణరధుండు ద్విపన్మధుండు స
న్మో పధుండు సల్లలిత మన్మధు డెన్నగ మాతినీడిలన్

ఆ మాతినీడు సద్గుణ
సామగ్రి గలాని నొక్కసత్పుత్రక చూ
డామణి గని భువి మించెన్
శ్రీమీరగ నాత డక్కినీడన బరగెన్.

రాణించు పంచకళ్యాణి సాద్రమాణి దానెక్కువా డొక్కనాడక్కినీడు
సిద్దెంపు బద్దంపు ముద్దైన పల్లకీ నెక్కువా డొక్కనా డక్కినీడు

హైదరాబాదు సుబేదారు మేడపై నెక్కువా డొక్కనాడక్కినీడు
నేల జేజేల మాన్యాలకై పలుకొండ లెక్కువా డొక్కనా డక్కినీడు

దుర్మదాంధుల గనిన జేతుల తుపాకి
దాల్చి జెండాడు నొక్కనా డక్కినీడు
చక్కదనముల యిక్కయౌ నక్కినీడు
అన్ను లెక్కిన చుక్కరే డక్కినీడు

సరసమ సరసమధుర వా
క్యరస మధురసమత లేక యలరెజుమీ సుం
దర సమదర సమతం
వరవర్ణిని యక్కినీని వనితామణిగాన్

కాంచె నతండు సద్గుణ నికాయము సంపదతోనె గూర్చె న
ల్పంచు సమస్త భూమి గొనియాడగ జేజులు మెచ్చసాటి ప్రా
పంచికులందు లేడనగ వాటిగ మేటిగ కీర్తి లోకమున్
నించిన మంచివాని సరినీని వనీనిలయాగ్రహారకున్

ఆ సరినీనికి బుచ్చమ
కేసరి వారిలో సరోజ మింధుముఖియె పో
హౌసుగ వారికి రాముని
దాసుండై హనుమదాఖ్యు ధన్యుడు పుట్టెన్

రామావనీ సురేంద్ర నీ క్షేత్ర జీవనప్రదుడయ్యె నెవ్వాడు భక్తి యుక్తి
అయుతాంభోరాశి కవల నాత్మఖ్యాతి సూపించె నెవ్వాడు శుద్ధబుద్ధి
తత మహోన్నత పర్వతశ్రేణి నీటిపై దేలించె నెవ్వాడు ధృతినియతిని
తంట దీరిచి లోకకంటకాసుర గర్వమడగించె నెవ్వాడు పుడమికడిమి

అరయ నెవ్వాడు సువృష వాహాత్మజుండు
పరగ నెవ్వాడు గోత్రసంభరణ చణుడు
మరియు నెవ్వాడు సుగ్రీవమానితుండు
అతడు హనుమంతు డగుట సత్యంబకాదె

ఆయన కిల్లాలగు నవ

లా యనవరతాత్మ భర్తృలాలిత సేవో
పాయనమున నెనయగు నా
శ్రీయనదగి వేంకమాఖ్య సీమంతినిదాన్

అ జోటిగర్భ భాసిన్
రాజోడుపడంగ కాంతిరాజిలి ధరణీ
రాజుల యౌదలలకు దా
రాజూచుచు గంగయాఖ్యరత్నము పుట్టెన్

తన ముఖంబుర్వరా దైవతలోచనోత్పలముల కబ్జబింబంబుగాగ
తన బాహుశత్రుసంతాన హృన్నాళీక తతికి మత్తేభహస్తంబుగాగ
తనమాట దారుణీధవ కిరీటాంచిత ఘనపంజరమున శుకంబుగాగ
తనకీర్తి దశదిశా తరుణీకుచన్యస్త కలిత పాటీరపంకంబుగాగ

తన గుణావళి కవిలోకధనముగాగ
తన విభవమఖిలామర తరువుగాగ
వరలె నౌరౌర శ్రీప్రోలవరపు వంశ
గంగయాఖ్యుండు కలియుగ కర్ణుడనగ

అతనికి నలువురు చెలువలు
పతిహిత కృతిమతిని పేరుపడి కౌసల్యా
సతియు సరమ్మయు నచ్చమ
ప్రీతిని మహలక్ష్మియనగ జెలువొంది రొగిన్

అందు సర్వాంబ సర్వాంబ యనగ బరగి
యీశు భజియించి విబుధలోకేశవినుత
గుణాగణాఢ్యుని రామభక్తు నిజశత్రు
గంధ గజసింహు హనుమంతు గాంచిమించె

శ్రీమత్ప్రోలవరాన్వనవాయ జలధిశ్రీసోము డాత్మాశ్రిత
గ్రామాలంబలతా వతంసము కవీంద్రత్రైదశాశీర్వచో
గ్లామేరుప్రధితోరుకీర్తి కవికాలాగ్ర ప్రభుండుత్ప్రభా
ద్యోమాణిక్యము గంగయాఖ్య హనుమంతుండెన్న సామాన్యుడే

ఇమ్మహి నెన్నజెన్నగు నహీనగుణంబు గలాడు భూరిసా
రమ్మున దానకౌశలభరమ్మున కీర్తిగలాడు నీతిక
మ్మమ్మగు బుద్ధిశాలి హనుమత్ప్రజాగ్రణికేమి పుణ్యమో
కమ్మకులాగ్రరత్నమనగా వహియించె హితానులాపముల్

శేషమ యశేష విహిత మనీషివినుత
దోషరోషాదిరహిత సంతోషసహిత
భూషణవిశేషమహిత సత్పోషణగుణ
సహియుతనుబెండిలియై శోభనతిశయిల్లె

పాపశూన్యత నిర్జరాప గోపమయైన బాపమ దోబుట్టు పడుచుగాగ
గంగయ్య పదభక్తి గలుగు గంగయ పేరి బుడుతడు తన పెద్దకొడుకుగాగ
రామనాథ కృపాప్తి రామనాథాఖ్యుడే కొండిక తన చిన్నకొడుకుగాగ
లక్ష్మీనృహరివరోల్లసితుండు లక్ష్మీనృసింహుడు నేత్రతాంచితుడుగాగ

జగతి వర్ధిల్లు వర్తమాన గతిశాలి
సత్ప్రభాహేళి యైశ్వర్యచంద్రమౌళి
పాలితాశ్రిత రింఛోళి పోలపరవు
హనుమన మనంగలడు నూరుహాయనములు

హనుమన సహోదరీమణి యచ్యుతమ్మ
మహిత గుణశాలి యగు వీరమాచనేని
గంగయాఖ్యు బెండ్లాడి కాంచె సుతుల
ప్రాప్తతేజుల బుచ్చయ్యబ్రహ్మయలను

శ్రీనివాసుండును శ్రీయిచ్చి రక్షింప నీశ్వరుండై శ్వర్య మిచ్చిబ్రోచు
బ్రహ్మ దీర్ఘాయువొప్ప నొసంగపాలించు పాకారి జయరమాప్రభునిజేయు
దినమణితేజఃప్రదీప్తుని గావించు జలజహితుడు యశస్సహితుజేయు
గణనాథుడు మహత్త్వగ ణనీయు నొనరించు క్రౌంచారి శక్తిసంకలితుజేయు

గంగయాఖ్యుని శేషాంబ కడుపుపంట
హనుమదాత్మజు రామనాథాఖ్యు పొందు
ఘనత లక్ష్మీనృసింహుని గన్నతండ్రి

నాకు బ్రియశిష్యు విజయలక్ష్మీ కృపాప్తి
ఏవంవిధ గుణవంతున
కావర్జిత కామవిదిత – యాశనసుతమా
మావంతునకుం దనుగత
హోవాగ్రణి పోలవరపు హనుమంతునకున్

**అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన లక్షణావిలాసంబను కావ్యంబునకు కథాక్రమంబెట్టిదనిన –**

**(పోలవరపు గంగయకవిచే రచియింపబడు మంగళహారతి – ఆదితాళము)**

అంగజ జనకపా దాశ్రితులకు
నా టక సంగీత విద్వత్సార్వభౌములకు । మంగళా ।
సిరియు వాణియు శక్తి సిరివాణీ శక్తు లొసగి ।
భరియించు కవితా రాజ్యపట్టాభిషిక్తులకు । మంగళా ।
కందర్ప సుందరాకారు లస్మదాది మిత్రులకు
దాసు వంశవార్ధిచంద్రులకు । మంగళా ।
మంత్ర మంత్రార్థ సమంచితులకు
కన్నయమంత్రీంద్రసహిత కామాంబ నందనులకు । మంగళా ।
అష్టావధానులకు నిరతాన్నదాతలకు
శిష్టవర్ధితులకు శ్రీరామ కవిచంద్రులకు । మంగళా ।
సదమల డోకిపుర మదన గోపాలక
పదపద్మభక్తి లబ్ధ పరమ దానశీలకు । మంగళా ।

## నాటరాగం - చాపు తాళం

..... .....  ...... ...

..... ....  ........

లక్షణ మనసు నిల్వలేనమ్మా । నన్ను మన్నించి నీవేగిరావమ్మా
దివినరసింహ విభునేలు ప్రోలవరపు హనుమనేలు
గోపాలు జూపుమంతే చాలు
ఓయమ్మా నాప్రాయమెంత హేయమాయెనమ్మా

శ్లో ॥ యత్ప్రాణనాయక హితాత్వ హితాస పత్నీ
యద్దుస్సహాః । కుసుమమార్గణమార్గణౌఘః
తన్నిష్కుటః । సశుక కోకిల ఆహవోర్వీ ।
మేయౌవనం సవదిహేయమభూదహోసత్

టీ ॥ ఓయమ్మా । యత్ - యేకారణము వలన, అహితా - నాకు మిక్కిలి అహితురాలైన, సపత్నీ - ఆమందులమారి నా సవతి, ప్రాణనాయకహితా - నా ప్రాణవిభుడైన శ్రీకృష్ణమూర్తికి హితురాలైనదో, యత్ - యేకారణము వలన, కుసుమమార్గణ మార్గణౌఘః - మిక్కిలి మనోహరములైన మన్మథ బాణపరంపరలు, దుస్సహాః - సహింపనలవికానివైనవో, తత్ - ఆకారణము వలన, సశుక కోకిలః - చిలుకలు, కోకిలలతో గూడిన, నిష్కుటః - నా యుద్యానవనము, అహవోర్వీ - రణరంగమైనది గదమ్మా, అయమ్మాసపది - యిప్పుడు సత్యోగ్యమైన, మే యౌవనం - నా జవ్వనం, హేయం - వ్యర్థమైనదిగాను, అభూత్ - ఆయెగదే ఓయమ్మా.

## శ్రీరాగము - ఆది

ఏమిసేతునె లలన యేమనందునె కాము మేనమామ
యదిగోనే కాసెకో జేసెనమ్మ । యేమి ।

నిలువలేగదే వాని । పిలచిరాగదె । వలరేడల్లదే
చూడవే వచ్చె బాకు గ్రుచ్చెనమ్మ । ఏమి ।

మాయలాడిగా । సవతి । మందుబెట్టెగా । కోయని
కోయెల యదిగోనే కూసె ధృతిబాసెనమ్మ । ఏమి ।

లీల డోకిపూ। ర్జనులపాలి దైవమే। పోలవరపు
హనుమదాఖ్యుని యేలె గోపబాలుడమ్మ ।ఏమి।

**రేవగుప్తి : ఆట**

**శుకవాణి వాక్యము**

కలికీ। చిలుకల। కొలికీ। అళికీరావళికి నీవళికితే సేబాసు
ఇంతి। సొగసుల। దొంతీ। కంతుకసంతు వారింతు వాక్యముల
లేమా। సద్గుణ। గ్రామా। సోముసదాముపేరాము మాన్పెదజూడు
బాలా। డోకిపూరి। పాల। బాలగోపాలు నీపాలుజేసెగదమ్మ

**లక్షణావాక్యములు ......**

ద్వి॥ ఓయమ్మ యిపుడు నేనోర్వలేనమ్మ।
నాయకుండలగియున్నాడు గదమ్మ।
సవతి కోరికలెల్ల సఫలంబు లాయె।
పువుబోడినేజేయు పూజలిట్లాయె।
ఆమాయలాడి మందిడియె నిందాయె।
నామాటచేదాయె నను జేరడాయె।
వెన్నెల కాకాయె విధి శత్రువాయె।
క్రొన్న నల్పులువాడి కోలలట్లాయె।
చిగురాకు బాకాయె చేదా యె సాద।
మొగి నిద్రలేక రేయుంబగలాయె।
మెయి కృశ మాయె నేమియు దోచదాయె।
ఆయయొపయ్యెరకూన యదిదయ్యమాయె।
వనితరో డోకిపూర్వాసు వైళంబ
పనిబూని మదనగోపాలు దేగదెవె.

సీ॥ కలువరాయని మానికపు జొక్కపు కుదుళ్లు పూదో
టలేపాటు బొందునొక్కొ। అందంపు చందంపు టపరంజి
పంజరాల్గల చిల్కలేకస్తి గందునొక్కొ। కెంపురామెట్లడిగ్గి
యంనీట నోలాడు। రాయంచ లేపంచ డాయునొక్కొ

తళుకొందు మగరాల పలకలపై నాడుఁగోర్వంక లేవంక క
రుగునొక్కొ। యీ చెలుల గుంపులేజాడ జూచునొ
క్కొ। యింక నాభాగ్యమంతయు నెవతె దొక్కొ। వైళమీ
వేగి డోకిపూర్వాసుడైన । మదనగోపాలు దేగదే మంజువాణి .....

**శుకవాణి వాక్యము**

**ఘంటారవము – చాపు**

కలికీ చిలుకలకొలికీ యీగతి చిలుకనేటికే మదిలోన దలకనేటికే ।
బందు రత్నాలపేట నీకిత్తు మాటలేలనే । యిట్టు లెచ్చోటగాననే ....
కొమ్మ బంగారు బొమ్మ వేగ నియెమ్మెకానినే। నిటకు। రమ్మనందునే.....
బాల సుగుణాలవాల డోకిపురపాలయంచు నే। బాల గోపాలుదెత్తునే.....

ఓయమ్మా నీవేల చింతిల్లెదవు మన పరాశన
భట్టారకులవారు వచ్చుచున్నారు గావున గ్ర
హచారఫలంబెట్లుండునో తెలిసికొని ప్రశ్న
యడుదునా లలనా ....

**లక్షణావాక్యము**

అలాగే చేయుమా సఖీరత్నమా ...
(పరాశనభట్టారకుడు శిష్యులతో వచ్చుట : గురుశిష్యసంవాదము ...)

**పున్నాగవరాళి – ఆట**

గురువు : రారా యో శిష్యా। పనసజెప్పు। కోరా। నా శిష్యా। ఔరా నీవిట్లు
ఆగడాల్జేసేపు। చేరి చదువపు అట్టె చెంపలు వేసేరా।

శిష్యుడు : అయ్యా చూడు। చదువలే। నయ్యా నేడు। దెయ్యము పాడూ
కోనియ్యావు కూస్సేపు। అయ్యయ్యో యిదియేమి అన్యాయమొ కాని
..........

గురువు : కూడిరావషరా। కాని కూత। కూస్సావషరా। వేడుక పడి నీకు విద్య
జెప్పగా వస్తే యేడుపషర। చెమడాలెత్తు నూకెద చూడు.............

శిష్యుడు : తగు తగునయ్యా । నీ సరసమం । తయు దెలుసెనయ్యా । నగు బాటుగాగ యిందరిలోన నిను బట్టి యెగనెత్తి దిగద్రొబ్బి యగడుజేసెద జూడు ....

గురువు : ఔరౌరా యేరా । యింతమాట ఆడుతావషరా । మీరినావుర చెవులు మెలివేసి యిషుజూడు । చేరి నీతల్లితో జెప్పెద చూడరా । .......

శిష్యుడు : మంచిదేనయ్యా । నాతో నీవు । మాటాలాడకయ్యా । కాంచక డోకి పూర్గోపాల బాలుని । యెంచితే చాలదె యీ చదువేటికి

**వాక్యములు**

గురువు : ఓరి శిష్యా యిష్టాౢరా ।

శిష్యుడు : అయ్యా సిద్ధముగా నున్నాను

గురువు : ఓరి వేదము జదువు కుంచావురా ।

శిష్యుడు : చిత్తము అలాగే చదువుతానయ్యా

గురువు : హరిః ఓం ఇత్యాహ

శిష్యుడు : ఆరే ఊఁ అచ్ఛాహై

గురువు : ఓరి భ్రష్టకానా శ్రీరామలోనే హంసపాది యన్నట్లు
నేను వేదము నీవు మ్లేచ్ఛభాష యుచ్ఛరించే వేమిరా ..... మ్లేచ్ఛుడు గాడురా ..........

శిష్యుడు : అయ్యా గోలకొండ నవాబు యెవరయ్యా అయ్యా! ఒక మండలానకు అధిపత్యము చేసే నవాబుగారి భాష జబ్బుదై యింటింట ఆమశ్రాద్ధాలకు తిరిగే మనవారి యేదం దొడ్డదయిన దటయా

గురువు : ఓరి భ్రష్టరండాకొడకా యిక చెడిపో ఛావురా

శిష్యుడు : అయ్యా నేనేమీ చెడిపోనుగా యిష్టాౢ అయామంటివా నీవే చెడిపోతావయ్యా

గురువు : అట్టే బుగ్గలు మెలికెతునా వెర్రి ముండాకొడకా .....

శిష్యుడు : అట్టె చెవులు సాగదీతునా చాదస్తపు ముండాకొడకా

గురువు : కాగానెరా నీతల్లి అట్టా చెప్పినది ...

శిష్యుడు : కాగానే నయ్యా నీ పెండ్లాము అష్టా చెప్పినది ......

గురువు : ఓరీ నీవు వేదము జదువుట కర్హుడవు గావు గాని స్మార్తము జెపుతానురా

శిష్యుడు : అయ్యా చెప్పవయ్యా. చెప్పుకుంచాను.

గురువు : ఇదివరకు నీవేమట్టుకు జదువుకున్నావురా ......

శిష్యుడు : గర్భాదాన కర్మ పూర్తిగా జదువు కున్నానయ్యా

గురువు : ఓరి క్రియ జరిగించగలవురా .....

శిష్యుడు : అయ్యా గడచిన శివరాత్రి నాటి రాత్రి శివాలయంబున లింగపీఠంబు చాటు చేసుకొని యొక కళాసీవారి పడుచుకు నేనే గర్భాదాన క్రియ జరిగించినా నయ్యా

గురువు : ఓరి భ్రష్టా నీకు ప్రాయశ్చిత్తము కావలసి యున్నది గదరా......

శిష్యుడు : ఈలా అంటూ ఉంటివా నీకే ప్రాయశ్చిత్తమవుతుందయ్యా

గురువు : ఓరి నీవిందుకక్కరకురావుగాని కావ్యపాఠము జెప్పుకోరా

శిష్యుడు : అలాగే చెప్పవయ్యా

గురువు : ఓరి నీవిదివరకెంతవరకు జదివినావురా

శిష్యుడు : పంచకావ్యములు పచ్చుడి పచ్చుడిగా నూరినా నయా

గురువు : అలాగైతే నైషధం విద్వదౌషధం అన్నాడు గనకు నైషధం జదువుకోరా

శిష్యుడు : చిత్తం చెప్పవయ్యా చెప్పు

గురువు : నిపీయయస్య క్షితిరక్షణః కథా

శిష్యుడు : నిపియేరాయేభీ ..........

| గురువు | శిష్యుడు |
|---|---|
| ఓరి నిపీయరా | నీపియే |
| ఓరేనీ పీ - యా | నాపియా |
| ఓరి నీ అనరా | నీ అనరా |

| | |
|---|---|
| నీ అంటే నీ అంఛావురా | నీ అంటే నీ అంఛావురా |
| ఓరి భ్రష్టా యిందుకు అక్కరకు | ఎందుకక్కరకు వస్తానయ్యా |
| రావురా | మరి |
| ఛీ నాతో వాగక పోరా | నాదారిని నేబోతే నీ మడిపంచీ |
| | దర్భాసనాలు |
| | నీనెత్తికే వస్తవి గాదుటయ్యా |
| ఓరి శిష్యా లక్షణంగానే యున్నది గాని | చిత్తం అయ్యవారూ... |
| యిక చదువు చాలించి కూర్చుండరా | |

**లక్షణ చెలికత్తె యగు శుకవాణి – పరాశన భట్టారకునిం బిల్వ వచ్చుట**

**యమునా కళ్యాణిరాగము – ఆదితాళము**

ఎట్టో యిక పరాశనభట్టారకా ॥
గట్టిగా జూడవయ్యా గ్రహఫలము లక్షణకు ।ఎట్టో।
రాగదయ్యా । మ్రొక్కేను బాగౌనయ్యా ।
వేగప్రశ్నము జూచి వినిపింపుమయ్యా ఫలము ।ఎట్టో।
ఏమనందు । వేగమె । యా ముకుందు –
వేమారు దలచి కల్గినవిధము దెలుపుమా ।ఎట్టో।
చాలా దయకల్గి మమ్మేలుమయ్యా ।
లీల డోకిపుర గోపాలుడు రాడాయె ।ఎట్టో।

హాస్యకాడు : అసీ నీవెవ్వతె

శుక : నేను లక్షణ చెలికత్తె నగు శుకవాణినయ్యా .......

హాస్యకాడు : అయితే నీవు నాముందర గూర్చుండుము
నేను రాయుచుంటేను నీవు చూచుచుందువుగాని

శుక : చిత్తమయ్యా

## హాస్యకాని వాక్యములు

ప్రశ్న చక్రము మూడు కోణములు గల్గినది. అందు క్రిందనుండి మీద వరకు నొక్క రేఖ యుండును.దానియం దూర్ధ్వముఖంబై యొక బీజంబు నాటి యుండును. ఎవ్వడేనియుం దన యభీష్టంబు దలంచి ధండంబు సమర్పించిరేని యున్నది యున్నట్లు తేటపడగలదు. కావున నీదంతా నాకుం దెలియవచ్చినది. బాల లక్షణ పెనిమిటి మీద బెంగపెట్టుకొన్న ... అందుకు నేను చెప్పుచున్నాను వినుము. స్వస్తి ... సాని శతాబ్దః లక్షాతొంభై నోట్లు, అగునేటి భాగారి సంవత్సరికం. యివ్వాళ అమావాశ్యా అంగారక వారం. అరవై ఆరింటికి పై దాటియున్నది.

చెలికత్తె : యిదేమిటండీ అయ్యవారూ । సాని శతాబ్దాః అంటూ ఉన్నారు. తమకు ఏ అబ్దగ్రాహ్యమండీ. సౌరమానాబ్ధమా ? చాంద్ర మానాబ్ధమా?

పరాశన : అసీ అదిగాదే. పురాణార్ధ గ్రాహ్యాః అని శాస్త్రకారుడు అన్నాక నేను రంగసాని శతాబ్దాః అని అన్నానే.

చెలి : నక్షత్రం మంచిదేమో చెప్పండి.

పరాశన : జ్యేష్టానక్షత్రము తొంభై ఆరునూ పై నూటపద్దెనిమిది కరణం యోగం బాగుండలేదు. మీనం మేషం। తులా కర్కాటకం. యిప్పుడు అర్ధరాత్రిం గనుక కన్యమూలను ప్రవేశింపగా మొదటిపాదము మీదు, ఒక పాదము క్రిందు చేయగా మిధునం మధ్యమ మహాబాగా వుంటుంది. అగ్ని కార్యాలకు లబలబలు - యేమడుగుతావు. మహా బాగా యెప్పుచూ యున్నది. శ్రీ కృష్ణమూర్తి త్వరలోనే వస్తారు. అదిగో నిన్ను కనిపెట్టుకుని యున్నవాణ్ణి నన్ను మాత్రం ఆ శ్రీకృష్ణమూర్తిని అమ్మవారు కనిపెట్టి యున్నట్లు కొనియే యుండుమా!

## శుకవాణి వాక్యములు

ఓయమ్మా మన పరాశనభట్టారకుల వారిని తెలుసుకున్నాను. గ్రహబలము బాగానే యున్నదని చెప్పిరి. గనుక మనంబున చింతమానుమమ్మా బంగారుబొమ్మా!

నెలతరోయింత ....... ........... ............

ఎట్లోర్తు కమ్మ తెమ్మెరలకు। కసిగందుమేను। కమ్మనిల్తుని పుష్ప
కాండంబు లేచు। ఊరకి ననుజూచి యోర్వలేకున్న వారైన పగనా
సవతుల కోరికలు। దీరుగాబోలు సందియము లేదమ్మ।
వేరాస లేదింక వెన్నెల చిచ్చు చొరబారుదునో లేక। సుమరస
విషము వెరపులేకిపుడ త్రావెదనో। నావంటి। కొరనోము నోచిన।
కొమెరెలెందేని పరికింప భువిగానబడిరటె చెపుమువదలక డోకిపూర్వాసు
డైనట్టి మదనగోపాలు సమ్మతి నిటుదెమ్ము।

**పూర్వముఖారి - ఆది - త్రిపుట**

చేడెరో మగవారినమ్మి। చెడనివారు గలరా।
వేడుక రతివేళ వేరుగాని। నోడారినట్లు మనసాడదమ్మా। ।చేడెరో।
అక్కరో తమ అక్కరైనను మ్రొక్కులిడుదురమ్మా। చక్కగా
ఆసమయము గడచిన మ్రొక్కినను మార్మోము సేతురే। ।చేడెరో।
పడకటింటిలోపల నెన్నైన। బలుకుదురోయమ్మా। గడపదాటిన వెనుక
నవన్నియు గాలికిబోవుజుమీ। లలనా। చాలగా బతిమాలి యెంతో।
జాలి జెందితినమ్మా, లీలడోకిపూర్బాలగోపాలుని చాలనమ్మి నెనీలాగైతిని।

సీ ॥ మహిమతో మా తండ్రి మద్రరాజెలదా
పృథురోమ యంత్రంబు బట్టెనమ్మ।
పెట్టెలో బహుసతిప్రియుడు గోపాలుండు
వదలకదానేల వచ్చెనమ్మ
వచ్చెబో యందరివలె గాక పటుశక్తి
నేల నయ్యంత్రంబు నేసెనమ్మ।
యేసెబో నేనేల యితడ నావరుడని యందరిలోపల నంటినమ్మ।
యంతయును విధికృతమని యరయవలయుగాక।
వేరొండు గలదటే కాన వేగ వదలకీ వేగి డోకిపూర్వాసుడై న
మదన గోపాలు దేగదే మంజువాణి।
వేరొండు గలదటే కాన వేగ వదలకీవేగి డోకిపూర్వాసుడైన। మదన
గోపాలు దేగదే మంజువాణి ........ ..............

## శుకవాణి

కందార్థము :-

అక్కా యిక్కథలేటికి । మక్కువ మిక్కిలిగ నిన్నె మన్నించుజుమీ ....
యెక్కడనుండిన హరిదానిక్కము నీకేలచింత । నీరజ నయనా ।
ఆ దయశాలి నిన్ను మరచునా । నేరమా అలిగిన నిత్యమా పొలయల్క
నేరుపుమీరగనే వాని దెచ్చెద ...........

## లక్షణ

ఓయమ్మా నాప్రాణనాథుండు నన్ను విడనాడి
నా సవతి యింట నుండిన నాకేమి ఫలమమ్మా .............

## శ్రీరాగము - ఆట

కట్టనివి చీరెలటె । కననికడుపులటె ।
కట్టడి బ్రహ్మవాని దానింట -
గట్టివేసె నింకేమి మాటే ........
ముడువనివి పువ్వులటే ।
తొడగనివి దొడవులటే ।
పడతిరో దాని కోరికలే । పండెనే యింకేమి మాటె .....
తెలియనిది మాటేనటే । తిననిది యన్నమటె .....
కలికిరో వానికి నాపై । కరుణ లేదింకేమి మాటె ........
ఉండనిది యిల్లేనటె । పండనిది పానుపటె ............
ఉండెగా డోకిపుర్గోపా । లుండు దానింట । నింకేమి మాటె ...

## శుకవాణి వాక్యము - శహనరాగము - ఆదితాళము

మదిరాక్షిరో నీమదిని చింతమానవే । సదయుని దోడితెచ్చెదనే గడియలో।
మందయాన యదెట్టి మందుబెట్టిననేమి । మందుల గుణములు మళ్ళింతు చూడవే,
ఏమి జెప్పిన నేమి । ఎంత జేసిన నేమి । భామినీ యల్లదాని బలిమి ఏపాటిది చూడుము ।
లీలను డోకిపుర బాలగోపాలదేవుడు చాలగా నిన్నె బతిమాలునట్లు జేసెద । ఓయమ్మ।

## లక్షణావాక్యము

వారిజాక్షుండు  నా ఇల్లు జేరకుండుటకు నేజేసిన నేరమే మమ్మా ।

ద్విపద: మదిరాక్షి ఏమమ్మ మది నిల్వదమ్మ ।
అదయుడై ప్రాణేశు- డలదానిజేరె
వారిజగర్భుండు వారకమున్నె । చేరి నానొసట వ్రాసిన వ్రాత
ఫలము దప్పింప నెవ్వారిదరమె యోయమ్మ । త్రిప్పరాని విరాళి
ధృతివాయు నమ్మ । చెలువుని నాయిల్లు జేరగనీక । కొల కొడిగట్టిన
కొమెరలకిపుడు । కడిగినాయుసురు తాకక ఎట్లు మానుపుడమినేజేసిన
పుణ్యంబు లెల్ల । కడ వ్యర్థమాయెనో కాక ఈ వేళ । నిడువాలు కనుదోయి
నిండి కన్నీరు । వరదలై వక్షోభవములపై కార । భరముగాదటవె ।
యీ పటువిరహాగ్ని నెలత నేజేసిన నేరమేమమ్మ । కలనైన మారుపల్క
గలేదె కొమ్మ । వదలక డోకిపుర్వాసుడైనట్టి ।
మదన గోపాలు సమ్మతి నిటు దెమ్మ ।

### దరువు - మారువరాగము - అటతాళము :-

నేరమెంచుటకు కారణమా । నాపై నేరమెంచుటకు కారణమా ।
వారకదానొక్కసారి నా కౌగిట । జేరియుండగ రత్నహార మొత్తినది ।
అలివేణిరో యింత అన్యాయమా । నోటి పలుకే తన కెంతో బంగారమా ।
చెలువుగ నుపరతి సేయువేళ ముదిత కలనాతమ్మరసమా కనుల సోకినది ।
మంచి మేలము నాయందయెనా । అట్ల మందయాన యందు నిందాయెనా ।
ముందుచేరి నామొవి నొక్కరా । నందంపు ముక్కెర అడ్డమయినాది ।
పడతి ముందుచేరి నామొవి నొక్కరా । నందంపు ముక్కెర అడ్డమయినాది ।
పడతి డోకిపురా పాలుడమ్మా । నన్ను బాసి దాని పంచ బట్టెనమ్మ ।
కడుమోహమున దానినొడిసి పట్టగరా । గడుసు గుబ్బల రైకముడి దావీడినది ।
। నేర ।

### దూతికావాక్యము - కందార్థము

వనజదళనేత్ర నిన్నున్ । ఘనతర విరహంబురాశి గట్టెకింపం ।
గను దరణిగ నను దలపుము ।

మనమున నీకేల చింత మానుమా । సంతసింప బూనుమా ।
దానవారాతిని దాని పొందెడబాసి
మానుగాసేతు మరులు గొల్పెద చూడు । । మాను ।

**లక్షణావాక్యము - చంద్రవర్ణనము**

సీ ॥ ప్రాకృతి ధమ్మిల్ల బంధంబుపై నొప్పుబెట్టిన రాగిడిబిళ్ళ యనగ ।
ఉదయ గోత్రాధీశుడురులీల బట్టిన వెడగైన కెంబట్టు గొడువనంగ ।
హరిపదాగ్ర సముద్భవాంబు పూరంబుల బుట్టు బంగరు తమ్మిపువ్వనంగ
చెలువు మీర చకోర శిశుపాళి పాలిటి కెంపురా పసిపాలగొన్నెయనగ
పతుల బాసిన యువతుల పటువియోగ వహ్నిశిఖ ప్రజ్వరిలజేయు
వాసుదేవతనయు చేనున్న కెందమ్మి ననయనంగ ।
నెల పొడిచె తూర్పుదిక్కున నెలత గనుమ ।

**దరువు - ముఖారి - ఆదితాళము**

అదిగో అదిగోనే । చంద్రుడు దయమాలెనే । మదిరాక్షిరో తాళగదవే
పదవే యెడవేడి యొదవె । చూడగ చూడగా । యెంతో వేడి
యాయెగా । యేడ వీడు చల్వరేడంట తోడటనేడట్లాయెసఖీ । మంచిది
మంచిది । వీని మంచి యిట్టిది । కొండెగాడు వీడు దన వంచన
యెంచడాయె గదే । బాలనే బాలనే యిక ।
జాలమేలనే యేల డోకి పూర్గోపాల బాలకు దేలక యుండెనో ।

**శుకవాణి వాక్యము - దరువు -**
**శుద్ధకాంభోజి - ఆదితాళము**

చంద్రబింబాననా చంద్రుడేమిసేయు లలనా చంద్రబింబాననా ।
సాంద్ర నిస్తంద్ర రుచి మదింద్ర నీలాల కవితాన ।
చింతనొందనేటికివాని । వంతమొక్కనాటికే ।
కొంత నీచెంత చేరి । సంతసింప జేసెద చూడు ।
ఊరక నాతో వాదటే । ఓర్చి యుండరాదటే ।
సార సారిరణవార వారవేల బేలా తలకు ।

డోకిపురపాలుడే సుశ్రీక గోపబాలుడే ।
రాక నిరాకరింప । నీరణ దెలుపనేల । చంద్ర ।

**లక్షణ వాక్యము - కందార్థము**

వటుతర విరహదవాగ్ని । చ్ఛటలకు మేనిచ్చి చంద్రసాంద్ర కిరణసం ।
ఘటితోష్ణత బైకొనగా । యెటులోర్తునె యమ్మ యీ కాకలకున్ ।
ప్రాణేశుడు రాకుండె నలుకన్ । యేకాంతమున నీవేగి
వాని మది సోకజెప్పి తోడితేకున్న తాళన్ । ఈ కాకలకున్ ।

**దరువు - అహిరిరాగము - ఆదితాళము**

చందమామా । చందమామా । ఔరా ఓరోరి । చందమామా । చందమామా।
చెందరాని చందమబలల । యందుజూపుట పొందు గాదుర । ।చంద ।
నిండుగ రేయెండ గాయెగా । దండితాసురుండు రాక యుండుగా । బ్రచండమాయెగా । మెండుగా మదనుండేచగా । దండి చెడినే బెండుబడితిని । పంతమూన పగదాననా । సంతాయె లక్ష్మివాని కాంతుతోనె సెరాదాననా ।
స్వాంతమున కృపయుంతు వనెనె । నెంత జెప్పిన సుంత వినవుర ।
శ్రీ పు డోకిపురోపకారకు । గోపాలదేవు ప్రాపు జేరకయున్న నాకు ।
యీ పగిది తమి రేప జేసిన తాపమున కేనోపగలనా । । చంద ।

**శుకవాణి - కందార్థము**

రమణీ లలామస్తంబే । రమయాన శశాంక కిరణ రాజికి ననల భ్రమ జెంది కుంద నేటికి । తమ పేర్మినెకాక యొందు । దలపగలదటే । నా పలుకింత యలతి సేయుదటే । వలవల కన్నీరు వలిప పయ్యెద కలియ దడియ నింత । తలపోత యెందైనా। దలప ।

**ద్విపద - లక్షణా వాక్యము**

ఎటుల దాళుదునమ్మ యీ వేళ కొమ్మ । కలకలా జాబిల్లి కాక ప్రీగమ్మా । సారంబు లేని యీ పటు విరహాబ్ధి । నేరీతి దాటుదు నిక నేది త్రోవ ।
సోగ వెన్నెల చిచ్చు సోకెనే మేను । వేగింపజాల యేవెరవున నైన ।

దాని మాయలలోన దగిలిన మగని మానుగా నను జేర్చి మన్నించవమ్మ ।
వదలక డోకిపూర్వాసు డైనట్టి । మదన గోపాలు సమ్మతి నిటుదెమ్మా ।

### లక్షణ – దరువు – ముఖారిరాగము – అట తాళము

ఎటలా సైతురా । ఏరా చంద్ర పటు శితచ్ఛవిసాంద్ర ।
కుటిలబుద్ధి ప్రకటించెద వక్కట కటా । కటకటా కటకట ।
విరహాంభోనిధి దరి జేరలేకవే । సరికి మేనుసోక । కరుకులగు నీకరు శరములు
చురచురా చురచురా చురచుర।మొగము జూడ నెంత వెగటైతినిరా, పగ సాధించెదురా।
తగిలె వెన్నెల సెగ లదేమో భగభగా భగభగా భగభగ ।
అల డోకిపుర ముద్దుల గోపాలు డలిగి యున్నాడు ।
తోలకురా కన్నులను కన్నీర్వల వలా వలవలా వలవల ।

### చంద్రదూషణము

గీ ॥ ఓ కలంకాంక నీజడద్భుదయ మెందు ।
బోవుర విషమ్ము నకును తోబుట్టువవుర ।
గురు బుధ విరోధి వగుచు నక్కుటనే కాక ।
పాండు రుగ్మతే నీకేల ప్రాప్త మగుర ।

గీ ॥ మొదలనే ప్రాచికమ్మును గదుర కరము ।
లకట నీరాడు శివుతల యంటు మనికి ।
ఓడ వని విష్ణుపదమెప్డు నొత్తు నునికి ।
నీచగతి దేలుగదర నిందింప జంద్ర ।

## మన్మథ వర్ణనము

### లక్షణా శుకవాణి సంవాదము

### దరువు – ముఖారి రాగము – ఆదితాళము

ల ॥ బాల నేతాళజాలనే యీవేళ ।
లీలమన్మథుడదిగో క్రోధోద్వేలు డై దండెత్తెనే ।బాలనే ।

శు ॥ ఏలనే యింత జాలిజెందెదు కాంత ।
మేలుగా నీరేయి నవ్వనమాలి గూర్చెద చూడవే ।ఏలానే ।

ల ॥ చెరకు విల్లంది చిలుక వార్వము నెక్కి ।
అరవిరుల శరపరంపరలు మేదుర తరంబుగ గురిసేనే । బాలనే ।

శు ॥ చెవినిల్లు గట్టి చెప్పిన వినవేమి ।
చివరురాకుటడిదంపు వాని పొగర డంచెద చూడుమా । బాలనే ।

ల ॥ తుమ్మెదలు జుంజుమ్మని మ్రోయగా ।
కమ్మవిల్తుడు శరమ్ము నాటగ తమ్మి బాకున గ్రుమ్మెనే । బాలనే ।

శు ॥ అమ్మరో యిట్లు సొమ్మసిల్లగనేల ।
రమ్ము రమ్ము వనమ్మునందిక గ్రుంమ్మరంగ జెల్లదే । బాలనే ।

ల ॥ నంద నందను డెందుండెనో గాదే ।
చందనాచలమంద పవనుని ముందు నిల్వదరంబటే । బాలనే ।

శు ॥ పడతి డోకిపూర్బాల గోపాలుని
తడయకను నీకడకు దెచ్చెద కడు వడంకెద వేటికే । ఏలనే ।

**లక్షణా వాక్యము - పంచచామరములు**

స్ఫుటార్భటిన్ ఛటాళిప్రాయఃపుం బికాళి గూయ నుత్కటోన్నట । త్పటు ద్విరేఫ కండమావరింప బల్ । హుటాహుటిన్ నటించి మారుడుక్కు మీరి వచ్చెనే । డటో యిటో యెటో గదమ్మ అమ్మయేమి సేతునె । దడాదడి లడాయికై వదండటంచు బల్కగా । బడాబడా బడాయిమీద ఫౌజులెల్ల మూగగా । నెడాపెడాను డాముసేయ నెక్కె జిల్క నయ్యనం । దానుగుడా గుడమ్మ డాసెనమ్మ కొమ్మ యేమిసేతునే

చం ॥ మది గృపలేక యింత చలమా ఫలమా కొలమానదిందునీ
మదమిది యేమి దీన ఘనమా మనమా వనమాలికిచ్చి యీ
యదన విరాళి గుంద గనవా ? చనవా ? మనవా శుభార్థివై ।
ప్రదరము వేసే దేమి పగరా పొగరా నగరాడు రోజపై

**లక్షణా వాక్యము**

**దరువు - దర్బారురాగము - అటతాళము**

ఇంత పాపమేర మన్మథనీ । కేమి వచ్చెనురా । పంతగించి మదంతి కమ్మున రంతు సేయగ నెంతవాడవు శాంతియును దాంతియును గద విలువింతరా చెంతకు రాకురా యిక । ॥ ఇంత ॥

గోలా ప్రాయముదానరా। నాపై నీకు। జాలి లేదాయెరా। ఏల నానుడి యాలకింపక పాల పువ్వుల గోల నేసెదు।

తాళరా వేళరా నీకిదె మేలుర చాలుర పదపద। మీదు తెలియలేవుర। యిందేమి సంపాదింప బూనితిరా।

కాదు కూడదటంచు బలికినగాని వినవదియేమి మదమో పోదురా పోదురా కాకిది వాదమా మోదమా। యీ పని।॥ ఇంత ॥ దాసజన పాలుడు। డోకిపుర। వాస గోపాలుడు। దాని నేతెడు వాసరమ్ముల యీ సొబగు దానేడు జనునది వేసమా రోసమా తక్కిన మోసమా భాసమాన బిరుద ॥ ఇంత ॥

గీ ॥ మధుప గుణశాలి యగుదు మన్మథ యిదేర।
మన్మథ విధానమున లేశమాత్రమైన।
ఫలము గడియించె చూడు నీ
బలగమెల్ల చెట్టు నొక్కొక్క పక్షియై చెడక యున్నె।

గీ ॥ అన్నగద్దియ తల్లి యిల్లమ్మువాడ। వకట
యాద్యంత రసహీనమైన ధర్మమేల కల్గెర పరమ చండాలి గుణము
ఓరి నిను బాయదట యుగ్రారి మదన।

**దరువు - శ్రీరాగము - ఆదితాళము**

మదన నిన్నే మందురా। యింత యదయతబూన
చొప్పిదమా వదమా మదమా నీకిది । మద।
బాలనురా వెత పాలైతిరా।
బాల వేడెదనిక చాలుర మేలుర తూలుర నాధృతి।తాళనురా చిన్న। దాననురా
మమ్మేలు డోకిపూర్గోపాలక బాలక యేమిర । మదన।

**లక్షణవాక్యము - ఓయమ్మ నేనేమి చేతునమ్మా**

శు ॥ ఓయమ్మా ఇలాగ నీవుంటే .........

ల ॥ ఓ యమ్మా నామనసేమో నిలువదు। అడుగులు తడబడు చున్నవె।
మోవి గదులుచున్న యది। మేను వడంకెడిని చెక్కులు చెమరు
వొడము నిదేమో గదే అమ్మయ్యా।

శు ॥ ఓ యమ్మా విన్నావటే యీ వార్త

ల ॥ అసెమ్మా త్వరగా చెప్పగదే

శు ॥ ఓయమ్మా నందనందనుండు నిన్నటి సందెవేళ భోజనందన యింట నెంతో వింతగా సరస సల్లాపము లాడుచు । ఆ చక్కని చుక్క చెక్కిలి నొక్కుచు పక్కున నవ్వుచు । యామందయాన యందివ్వగ వీడెము సేయుచున్నాడని వింటినే వాలుగంటీ ।

ల ॥ ఓయమ్మా ....... యెవరు జెప్పిరే .....

శు ॥ అమ్మయ్యా మన కుందరదన జెప్పినది

ల ॥ అక్కా నిక్కమేనటే – నిక్కమేనటే – నిక్కమేనటే ..........

**మూర్ఛ**

**శుకవాణి వాక్యము**

ఓయమ్మా వాడిన మోము దామరతో । వీడిన కచ భరంబుతో । ఊడినముక్తామణులతో కూడిన బింబాధరముతో తడబడు నడుగు దమ్ములతో తొడిఁబడు నిట్టూర్పు సెగలతో । దిగజారు చెమ్మటలతో సెగదేడు మైదిగతో। దస్సియుస్సురుస్సురనుచు మా లక్షణ యిదేమో కాని పరపునంబడి యొడ లెరుంగక గడగడ వండకు చున్నది . నాకేమి యుందోచదు గావున పరాశన భట్టారకునిం గొనివచ్చి హస్తము చూపించెదవమ్మా ।

**శుకవాణి – ఆనందభైరవిరాగము – చాపుతాళము**

ఓ పరాశన భట్టారకాహ్వయా యిపుడు మేమోపలేము నీవు రావయ్యా ।
ఆపనలవిగాని విరహతాపమునను లక్షణ యిదేమి పాపమో కాని
మారు పల్కదు గుల్కదు పండియుండెనయ్యా । ఓ ప ।
ఏమి దోచదేమి సేతుమూ యిట్లున్న మేము సూచి నిలువలేము ।
మోముదమ్మి కేలజేర్చి భామ నిడుద యూర్పులూర్చురామ రామ
రామ యీ విరాళికి బాళికి రట్టాయె నెట్టాయె । ఓ ప ।
కన్నులు మోడ్చి మేనెరుంగక మా లేమ యున్నదిపుడు మిమ్ము
జూడక । యెన్నడెరుగ మిట్టి వింత కన్నది విన్నది గాదు తెలియకున్నది

వన్నె చెక్కుల చెమ్మట గారగ వడగొట్ట కడగొట్టు పడుపున జడుపున । ఓ ప ।
డోకిపూరా గోపబాలుడు । తానెట్లు । రాక యెంతె నలుక బాయదు ।
కాకగొన్నమేను జేరరాక యున్న దయయొ యెంత కాకు వెట్టి
పిలిచినగాని కదలాదు మెదలాదు కడు మాయ యిడుమాయె । ఓ ప ।

**శుకవాణి వాక్యము**

శు ॥ ఏమయ్యా పరాశన భట్టారకయ్యా ।

హాస్య ॥ ఓసీ నీవెవ్వతవే ।

శు ॥ ఏమయ్యా మాటిమాటికి నడగెదవు । యింత మరుపేమయా

హాస్య ॥ ఆసీ ముప్పది యేండ్లకు లోబడిన వాడను । ముసలివాడను గానా । మోకాళ్ళు ముందుకు వచ్చినవి । మోచేతులు వెనక్కు పోయినవి । యిన్నాళ్ళవలె గాదు । మునుపటి తిండికిని యిప్పటి తిండికిని మిక్కిలి భేదమున్నది । అసీ యేమి చెప్పుదును। మున్ను మానెడు బియ్యము తెచ్చుకుంటె మాయింటి అంతకు సరిపోయేది । యిప్పుడు అయిదుమానికల బియ్యము నాకొంటిపూటికి సరిపోదు । అనుక్షణమును మా యింటిదానిని ముందరబెట్టుకొని దాన దీన కాలము గడుపుచున్నాడను. అదియేమి చిత్రమో యెంత దూరమున గుసగుసలాడినను చెవియొద్ద బొబ్బలు బెట్టినట్లుండును. దృష్టిబలము చాలా తప్పియున్నది. నేలనున్న నల్లపూస తాటికాయవలె తోచును. గోడచాటునున్న మానిసి బొత్తిగా కానరాదు. నీవంటి యాడుదానిని జూచినపుడు నాదేహము నాకే తెలియదు. నాకిట్టి యవస్థ వచ్చి యున్నందున మాయింటిది రేయుంబగళ్లు నాపక్కనే యుండి యెంత యుపచరించిన దృప్తిగాదు. కావున యింకా నీవంటి వాండ్రను ముగ్గురు నలుగురిని యుంచుకొనవలెనని యున్నాను. కావున నీవెవ్వతెవో చెప్పవే ।

శు ॥ నేను లక్షణ చెలికత్తెనగు శుకవాణినయ్యా ।

హా ॥ అయితే నీవేమి వచ్చినావే ।

శు ॥ మా లక్షణ వాడినమోము దామరతో వీడిన కచభరంబుతో । ఊడిన

ముక్తామణులతో। కూడిన చింతాభరముతో, తడబడు నడుగుదమ్ములతో। తొడిబడు నిట్టూర్పుసెగలతో, దిగజారు చెమటలలో, సెగదేరు మైదీగెతో, డస్సియుస్సురనుచు అదేమోకాని పరపునంబడి యొడలెరుంగక గడగడ వడంకుచున్నయది నాకేమియుం దోచక మీరు వచ్చి హస్తము జూచి తగిన సదుపాయము చెప్పి మమ్ము సంతసింపజేతురని పిలువ వచ్చితినయ్యా।

హా ॥ అలాగే వచ్చెదగాని నాకేమి పెట్టిస్తావే।

## శుకవాణి వాక్యం - కందార్ధం

శు : గట్టిగ నీవు పరాశనభట్టారక యటకు వచ్చి పటునైపుణ్యంబుట్టిపడ మమ్ము సంతసపెట్టిన నీనోటినిండా పెట్టింతునయ్యా। ఓ బాపనయ్యా। రట్టేలనయ్యా ఎట్టులైన నీవె మాకుండవా బెట్టుసేయ కూరకుండవు గాక

హా ॥ యేమిటే నోటినిండా బెట్టించేది।

శు ॥ గారెలు, బూరెలు, ఆరిశెలు కాదటయ్యా।

హా ॥ అయితే నేను చాలా తాగే వాడను నాకేమైనా పోయిస్తావా లేదా .........

శు ॥ కందార్ధము - అనువుగ లక్షణ హస్తమును గనుగొని మాతోడ బల్కగా జేసి ముదంబున మెలగించిన నేనింపొనరగ నీవు తాగినంతా పోయింతునయ్యా। ఓ బాపనయ్యా వేయేలనయ్యా। న్యాయము గాదయ్యా నాతోనేరా దప్పిపోకు నాకు నీకు ప్రొద్దుపోయిన వెన్క। పోయింతునయ్యా।

హా ॥ అయితే ఏమిటే తాగినంతా పోయిస్తానంటివి

శు ॥ కమ్మని అచ్చావు నెయ్యి అయ్యా।

హా ॥ అయితే నాకేమైనా కట్టబెడితే గాని నేను రానే।

శు ॥ కందార్ధము - మనవి విని మమ్ము గృపతో గనుగొని మాలక్షణకును కడుమోదంబుల్ బొసరింపవయ్య। యిపుడే ఘనతరముగ నేను నిన్ను గట్టింతునయ్యా। ఓ బాపనయ్యా। ఒట్టు సుమయ్యా। గట్టిగా నేను బొగడగావించు కొనుమయ్యా। దట్టింపు గల మంచి దిట్టమైన దాని గట్టింతునయ్య।

హా ॥ యేమిటే నన్ను గట్టిస్తానంటివి । చాలా భయమవుచున్నది .........

శు ॥ మంచి జరీ ధోవతులయ్యా ।

హా ॥ అలాగైతే వస్తాగాని పదవే ।

**హాస్యగాడు వచ్చి లక్షణ హస్తము చూచుట :-**

హా ॥ అసీ లక్షణ చేతిలో నేమీ లేదే ।

శు ॥ అదేమయ్యా ఆ చెయ్యి చూచేవు ।

హా ॥ మరి యేచెయ్యి చూడవలెనే । అయితే యిదే చెయ్యి ?

శు ॥ అది కుడిచెయ్యి కాదటయ్యా ?

హా ॥ నీవే కుడిచెయ్యి , యెవరు కుడిచేస్తారు.

శు ॥ ఆయా స్థానములు చక్కగా పరిశోధించి చూడవయ్యా ।

హా ॥ ఇది అర్థరాత్రము గనుక సమస్తమైన దోషములు నాభిక్రింద నాశ్రయించి యుండును. గావున నచ్చట చూతునా?

శు ॥ చూడవలసిన స్థలమందు చూడక తప్పునటయ్యా ?

హా ॥ మంచిది సరి. అచ్చట మూడుబెట్టి చూడగా రెండు పండుకొని యున్నవి ఒక్కటి మాత్రము ఊతముగా కొట్టుకొనుచున్నదే...

శు ॥ ఏమిటయ్యా, అవి ?

హా ॥ అక్కడ మూడు వ్రేళ్ళు బెట్టి చూడగా వాతశ్లేష్మములు పండుకొని యున్నవి. పిత్తమాడుచున్నది.

శు ॥ అందుకేమి చేయవలెనయ్యా ।

హా ॥ శ్రీకృష్ణ పాదాంబుజ రసము వేయించవే ।

**లక్షణ మెళకువనొంది అనే మాటలు :-**

ల ॥ హా ! కృష్ణా ! హా యదునందనా । హా మోహనాకారా ! హా ఏమి సేతుర!

## దరువు

### అసావేరి రాగం - ఆటతాళం

నామోహనాకార నా చిత్తధనచోర నను బాయదగు నటరా ।
వేమారు నీ నగుమోము మోమున జేర్చి కామించి యెన్నడు కౌగలించెదరా । నామో।
అంటి నీవాతెర జుంటితేనె సోనలాన నెన్నడు గల్గురా । నా సామి
కంటజూడక నన్నొంటి విడచి దాని యింట నుంటివి
ఇంక కంట । గనుటరా । నామో ।

గయ్యాలాడనేర గయ్యాళిగాను ముక్కుపచ్చలారని యీడురా
యిచ్చ దిరుగలేక యీ మోహభరమున పచ్చల పతకము బరువై తోచెరా । నా మో।
మరచితో యుపరతి పరిధికి నేజేయు మార్గమెల్లను సామి ।
యిదేమి కరుణించు మనచెల్మి కాకికోకిల చంద మొర యింపకుమా ।
డోకిపుర గోపాబాలకా । నామో ।

### శుకవాణి వాక్యము

ఓయమ్మా యేల చింతిల్లెదవు నామాట విని సుఖముగ మెలగవమ్మా ।

ల ॥ ఓయమ్మా యింతకు ముందే నాకు కొంచెము నిద్దురబట్టెనమ్మా ।
ఆ నిద్దురలోన నేనొక మేలుకల గంటినమ్మ ।

చం ॥ బిరబిర సేరవచ్చి మురభేది నినుం దగ గౌగలించి వాతెర
యధరంబు నొక్కి కసిదీర గుచద్వయి కేలుదోయి గ్రిక్కిరి
యగబట్టి కంచెల బగిల్చి తొడత్తొడలంట జేర్చి యేసరణిని
గూడెనో ? గద సైపనికేళి సుఖాబ్ధి ముగ్గితిన్

### దరువు - తోడి - అటతాళము

కలగంటి కలగంటినె ఓ చెలి నేడు । కలత నిద్దుర బట్టెనే ।
కలలో నాచెలువుని గలిసి యుంటినె । । కలగంటి ।
చెక్కిలి ముద్దాడెనే । నాకెమ్మోవి నొక్కి నొక్కులు దీర్చెనె ।
కౌగిటిలోన జిక్కి తాచొక్కెనె । మోము జూచి పక్కున నవ్వించెనె । నే
యేమందునె । సంతోషము । పాలపొంగాయెనే । రత్నాల సరాలు

దయచేసెనే నన్ను నే । వేళ విడనానెనే । సొగసు మీర । లీల
నా కళలన్ని ప్రీల జేసెనె । । కలగంటి ।
డోకిపుర వాసుడె । గోపాలదేవుడె చేరి నాపోకముడి విప్పెనే
మేల్రైవతిణి । రైక సడలించెనే । గుబ్బదోయి । జోకతోబట్టి
సుదతి యేమో చేసె । ।కలగంటి।

### శుకవాణి వాక్యము

ఓయమ్మా యీ స్వప్నము మంచిది శ్రీకృష్ణుండు రేపో మాపో రాగలండు. సందియంబు లేదు నామాట నమ్మమమ్మా కొమ్మా ।

### లక్షణ వాక్యము

ఓయమ్మా । నీవు జగన్మోహాకారుడైన నందకుమారుని వద్దకు కొంచెము రాయబారము పోయి రాగదవమ్మా ।

శు ॥ అలాగే పోయి వచ్చెద గాని ఆ శ్రీకృష్ణమూర్తి యిచ్చుటకు వచ్చినట్లయన నిన్నింత జేసి నందున కెట్లు పగతీర్చు కొందువమ్మా ।

### లక్షణ వాక్యము - శ్రీరాగము - ఆటతాళము

చూడవే । నే లక్షణనయితే చూడవే । గోపాలుని పస చూడవే ।
వీడకదా నొక్కనాడు నా యింటికి । రాడటే కీల్జడ జాడించి కొట్టెద । చూడవె ।
మదపతి । వాడు దాని మాట విన్నందుకు గడిసి
గుబ్బిగుబ్బల రొమ్మదిమి క్రుమ్మనేమో । । చూడవే ।
ఎనయక సన్నింత ఏచినందుకు మొనపంట మోవి కఱుక్కున నొక్కనేమో । చూడవే।
ప్రమదరో డోకిపూర్బాల గోపాలుని కొమరైన చెక్కిలి కొనగోట గిల్లనేమో । చూడవే।

### శుకవాణి - కందార్ధము

మధిరాక్ష యేను జనియిం । పొదవగ నీప్రాణనాధునొడబడి నిన్నున్ ।
గలియంగజేతు జూడుము । సుదతీ నీవు ధరియించు సొమ్ము
లీవమ్మా । అవి లేకున్న యెమ్మె గాదమ్మా । సమ్మతితో రాజసమ్ము ।
ఖమ్మునకు । నిమ్ముగ బోవుచో నెమ్మె గూర్పవలె । సొమ్ము లీవమ్మా ।

## లక్షణవాక్యము

### దరువు - పంతువరాళి - ఆదితాళము

ఓయమ్మా అలాగే యిచ్చేను । పుచ్చుకోవమ్మా ।
అక్కరో వేగ నీవు పోవె । తాళలేనే నా । చక్కని సామి నిందు దేవే ।
చుక్కల రాయని ధిక్కరించు రప । కెక్కిన చొక్కపు ముక్కెర
యిచ్చెద । కమ్మని నాలి గాలి వీచెనే । ఓయమ్మా ఝుం ఝుమ్మని
తుమ్మెదలు మ్రోసెనే । ఇమ్ము గులుకు ముత్యమ్ముల చేరుల ।
గ్రమ్ము కొనిన నా కమ్మ లిచ్చెదనే । మరుడు పువ్వుగోల వేసెనే ।
కొమ్మరో కోకిల కీరములు రొదలు జేసెనే । సారసరాగ శీత వినీల
మణిహార విద్రుమాది హారము లిచ్చెద.

భాసుర డోకిపురవాసుడె । ఓయమ్మ నన్ను బాసియున్నాడు గోపాబాలుడే।
గానర నాధు మహాసుషమాప్తిని । హసము చేసె బేసరి యిచ్చెద అక్కరో।

ఉ ॥ రమ్మను మీనలోచన కరమ్మను రాగము మీర చేర్చె భా ।
రమ్మను మావిరాళి యితరమ్మను కూలము గాదు
లేదు నేరమ్మను మారు తూపు ఖిదురమ్మనుకంపదలంప
లేడిపై । రమ్మను నీ యొడల్జల ధరమ్మను తక్కువ శైలవృత్తికిన్ ।

### దరువు - యమునా కళ్యాణి - ఆది

రాయబారము బోయి రాగదమ్మా । యిక వేయ్యేల వానితోడిదే
గదమ్మా । కొమ్మా । మాయలమారి దాని । మాట నమ్మి । నన్నెడ
బాయుట యిది తనకు న్యాయమా శ్రేయమా । ఓ యమ్మా ।
యికనయిన దా । మ్రొక్కితినని వాని మ్రోల ననుమా ।
నీకే దక్కితి దయ యుంచి తల్లిరమ్మనుమా । ।కొమ్మా ।
యెక్కడి పగవచ్చె నెటుల తాళు ననుమా । మక్కువతో నామోవి
నొక్కుమా గ్రక్కునా తక్కు మాకేల నను । గాసిపెట్టకు మరి
నేదాసి ననవె । యిట్లు జేసిన నేమి ఫలము జెందు ననవే । నన్ను బాసి
సవతి యిల్లు డాసి మరి మరునిపాలు జేసితి వవురా ।

యిది వేసమా । రోసమా । మోసమా । యాననవే ।
పాలించు డోకిపుర గోపాలా యనవే । రతుల దేలించు సుమేరుధీరా ।
యనవే । పాలముంచెదవో । నీట ముంచెదవో । పాలపడితి
నీ । వేళ నేతాళనే చాల నేర్పొప్పగను ।          ॥ రాయబారము ॥

**శుకవాణి వాక్యము**

ఓయమ్మా వేగనా కంతుజనకుని యంతికంబునకుం బోయి నీవృత్తాంతంబు దెలిపి తోడితెచ్చెద గాని నీవీ శృంగార వనంబు రంగైన చెంగలువ కొలని చెంగట శశికాంత మణిపీఠంబునం గూర్చుండవమ్మా । కొమ్మా ।

**లక్షణా వాక్యము -**

ఆ కృష్ణమూర్తికి నాముద్దుటుంగర మానవాలిచ్చెదగాని తీసికొని పోవమ్మా ।

**దరువు - రేగుప్తి రాగము - ఆటతాళము**

మానినీ । నీవు పోయిరమ్మా । యీ ముద్దుటుంగరమానవాలిచ్చి తోడి తెమ్మా
జాణగా సమయాసమయము లెరిగియు । నూన కౌశలినినానుడి దెల్పుము
। మానినీ ।

మీదు తెలియక మోసపోతే । యీ విరహాబ్ధి యీద దరమ్ము గాదేరికి ।
వాదేటికి యిక రాదగుననుచును । నా దయితుని దేవె  మోదమ్ము గుల్కగ ।
మానినీ ।

భాసుర డోకిపుర నివాసుని, గోపాలదేవుని । దాని యెన్నడు సుమశరుని ।
బేసి తూపు గమివాసి చేరగనె । హౌసుగ సురత విలాపము జెందద
। మానినీ ।

శు ॥    ఓయమ్మా అలాగే బోయి వచ్చెదనమ్మా ।

ల ॥    సరే పోయిరావమ్మా ।

**శుకవాణి కీర్తన - జంఝూటి రాగము - చాపుతాళము**

శ్రీరమారమణ సాధుచిత్త మోద కారణా ।
దారి తారి వీర జగదాధార నారాయణా ।          । శ్రీరమా ।

పంచబాణ జనక భూతపంచకాధినాయకా ।
కాంచనాంబరధరా విరించిముఖ సురార్చితా ।శ్రీరమా।

భాసమాన రూప కౌస్తుభా సమాన భూషణా ।
వ్యాసవల్మీక జాదిభాసావళి పోషణ ।శ్రీరమా।

పేశలాభ డోకిపుర నివేశ గోపబాలకా ।
అశ రిశనాశలో స పాశలేశ మౌనకా ।శ్రీరమా।

కం ॥ దండము కమలదళేక్షణ । దండము లోకైకనాథ
దండము శౌరీ । దండము కరుణా జలనిధి ।
దండము గోపాలదేవ । దండము కృష్ణా ।

## కృష్ణవాక్యము

వర్ధిల్లుము రాజవదనా । వర్ధిల్లు ముకుంద బృంద పందితరదనా ।
వర్ధిల్లుము సుగుణ సదన । వర్ధిల్లుము నిజవిలాస వర్ధితవదనా ।

## శుకవాణి - ద్విపద

జయజయ పద్మాక్ష జయ జయ భక్త రక్షా
జయ జయ రిపు శిక్ష - జయ కృపా వీక్ష,
జయ జయ శ్యామాంగ । జయ భాసతంగ ।
జయగరుడ తురంగ । జయ సాధుసంగ ।
జయ కరుణాలవాల । జయ సత్యశీల ।
జయయశోదాబాల । జయ స్వర్ణచేల ।
తగ దెల్పెదను నా యుదంతము నీకు ।
పొగడొందు నీ సతీపుంజంబులోన సుందరి సుగుణాఢ్య ।
శుభవంశ జాత । కందర్ప శాస్త్ర సంగతి
సముపేత । మద్రరాజ తనూజ మహీధరోరోజ ।
భద్రలక్షణ । విసర్పణను లక్షణను విడనాడి యీరీతి వేరు జేసితివి ।
కడువిరహ పయోధి గట్టెక్కలేక తడబాటు నొందుచు దనవెతలన్ని
తోడిబడ నేడు నాతో జెప్పి పంపె । ఘనమైన ముద్దుటుంగర మానవాలు।

గొనుమని యిచ్చె। చేకొనుమయ్య కృష్ణ।
నామన్వి యాలించి నావెంట నిపుడు। కోమలి నేలుటకును వేగరమ్ము।

**కృష్ణవాక్యము**

బాలశశాంక సమాళిక। మీలక్షణ రక్షణంబు మేమెరుగుదు మీ।
వేళనిచట బని యున్నది। రాలేమే పదవె పదవె రట్టేల యికన్ ।

**శుకవాణి రాదాయెనని లక్షణ విచారించుట :**

**దరువు : శుద్దసావేరి - అటతాళము**

వాని నిటకు తేదాయె చెలియ తానైన రాదాయె।
పూని వాని యలవిగాని మాయమాటలోన జిక్కి।
యచట తానిలచినదో। వాని।
మందయాన దాని మందులు తలకెక్కి మందర ధరుడుండెనే।
అందు పొమ్మని నేనంపినందున కల్క। జెంది సవతి
వాని బందు జేసినదో ।వాని।
భాసురాంగి విసిగి వేసరి మదియెంతో యీసు గొట్టునమ్మా
వాసుదేవుడిటకు వచ్చుననుచు దాని।
కాసవెట్టి దాసి జేసికొన్నదో। ।వాని।
దానడోకిపురగోపాలుడు తాను రానని పల్కెనో। పూని నేజేసిన
పూజలిట్టులుండ గా నితరుల ననుకోనేమి పని కొమ్మ।।వాని।

**అంతట చెలికత్తె రాగా లక్షణ వాక్యము -**

ఓయమ్మా ఏమమ్మా అచ్చటి వార్తలు ........

శు ॥ అన్నీ బాగానే యున్నవమ్మా

ల ॥ ఏమమ్మా। అలాగ నీవూ ...

శు ॥ మరేమి జెప్పమన్నావమ్మా।

**లక్షణ**

**దరువు - ముఖారి - అటతాళం**

వచ్చెద ననెనా రాననెనా నావల్లభుడేమమనెనే
పచ్చికస్తూరి పచ్చాకత్తరు। అచ్చుగ కానుక లిచ్చినమీదట। ।వచ్చెద।

పరమ భక్తిని వాని దరిజేరి నామన్వి । తరిజూచి చెప్పితివా ।
పరిమళ గంధము । పండాకు మడుపులు విరజాజి బంతులు
సరస నుంచి నంతట । । వచ్చెద ।
పూని నేనిచ్చిన ముద్దుటుంగరమానవాలిచ్చితివా ।
పూనీరు పన్నీరు పునుగు జవ్వాజి తేనెకప్పెరలంపినాననిబల్కిన ।వచ్చెద ।
కొమరైన డోకిపూర్గోపాలు మృదుపాదములకు మ్రొక్కితివా ।
కమలాఫలములు కమ్మనరటి పండ్లు కొమిరె పనసతొనలు
గొనుమని యిచ్చిన । వచ్చెద ।

## శుకవాణి - ద్విపద

వనజాక్షి వినవె నీ । వరుని చెంగటికి । పనిబూని నేనేగి వెరిసరి గతుల
విన్నవించితి । నీదు వృత్తాంతమెల్ల । విన్నభాగ్యంబేమి వృథ యయ్యేనమ్మా

ల ॥ వా ॥ ఓ యమ్మా వ్యర్థమె అయినదటమ్మా ........

శు ॥ వా ॥ ఔనమ్మా । వ్యర్థమె ఆయను.

ల ॥ వా॥ అయితే యేమన్నదమ్మా ।

శు ॥ ద్వి ॥ ఏమని సెప్పుదు నేమిలాభంబు । ఆ మాయలాడి యేమని జెప్పె నొక్కొ । యేమందు బెట్టెనో యేబాస గొనెనో।
ఖామ నీ యుసురు తాకునమ్మా ఎంత వేడినగాని యింద్రానుజుండు।
కాంత నేరాను పోగదె యనెనమ్మ ।

ల ॥ వా॥ ఓయమ్మ వానికెంత దయలేక పోయెనమ్మా ...........

శు ॥ వా॥ అవునమ్మ అందుకేమి జేతువమ్మా.

## లక్షణ

## దరువు - పున్నాగ - అటతాళము

ఎంత నిర్ధయుడె । లలన వా డెన్ని నేర్చినాడె । యింతిరో
నిన్నింత బంపితే రంతులేలా రాను పొమ్మనె । ఎంత ।

ఏమి చేతునే నేనోచిన నోము లిట్లాయెనె । రమణిరో తన
మోము జూపనైన రా మనసు లేక రాను పొమ్మానెనె । ఎంత ।

ఎన్నడు నెరుంగనె యిట్టివార్త విన్న మతిదూలునె చెన్నుగ
యురిబోసి కొందునా । ఎంత ।

డోకిపుర పాలుడె పోషిత భక్తా । నీక గోపాలుడె ।
యేకతమ్మున నిపుడు నిన్నంపిన రాకయుండె నా వ్రాతఫలమే ।ఎంత।

ఓయమ్మా నామది నిలువకున్నయది యింకొక్కసారి పోయిరావమ్మా

శు ॥ ఓయమ్మా మునుపటి వలెనె యిప్పుడు బోతె వినే యోగము లేదమ్మా

ల ॥ ఏమి చేతామె ఓయమ్మా ..........

శు ॥ కొంచెము వ్రాత మూలముగా నీమనవి తెలియజేసు కొనవమ్మా .......

ల ॥ అలాగే లేఖ యిచ్చెదనుగాని వ్రాయుటకు లేఖకునిం తోడి తెమ్మా

శు ॥ ఏమయ్యా పరాశన భట్టారకయ్యా ।
మా లక్షణ శ్రీకృష్ణునకు లేఖ వ్రాయం దలంచినది – యది వ్రాయుటకు
మిమ్ముందోడ్కొని పోవచ్చితి నయ్యా ।

హా ॥ కలము నాయొద్దనున్నది గాని బుడ్డీ నీది యిస్తావటే అలాగే వ్రాస్తాను.

శు ॥ అలాగే యిస్తాను గాని రావయ్యా ।

హా ॥ ఇదిగో కూర్చున్నాను చెప్పుమనవె ....

శు ॥ అదేమయ్యా । ఆ ముఖముగా గూర్చున్నావు,

హా ॥ దక్షిణే శిర ఉత్తమం । అన్నాడు గనుక దక్షిణ ముఖముగా కూర్చున్నానే ।

శు ॥గీ ॥ ప్రాఙ్ముఖుండైన నక్షర పంక్తి యొప్పు, దక్షిణ ముఖుండునగు నేని తప్పువడును, పశ్చిమ ముఖుండయిన గార్యభంగమగును. జెలగి యుత్తరముగ వ్రాయి జెందు శుభము అని యున్నది గాన తూర్పు ముఖముగా గూర్చుండి వ్రాయవయ్యా ।

హా ॥ అలాగే వ్రాయుచున్నానే ........

## లక్షణ ఉత్తరము

శ్రీ మహారాజ పూజిత పూజితులును శ్రీమదఖండ లక్ష్మీనిరతులును । రాజాధి రాజాంకితులును, రాజితైశ్వర్య సామ్రాజ్య యుతులును, అఖిలాండ కోటి వేధోండ పతులును, సుఖదాయి కారుణ్య శోభోన్నతులును, నైన శ్రీడోకిపురాధి నాయకునకు భానుప్రకాశ గోపాలదేవునకు సేవకురాలయిన శ్రీలక్షణాఖ్య వేవేల దండముల్విడువక మ్రొక్కి తెలియజేయంగల విజ్ఞాపనములు – సులలితేశ్వర చైత్ర శుద్ధ ద్వితీయ స్థిరవారము వరకు చెలగి మేమిచట ఊర కుశలంబున నున్నార మవల భద్రవార్తలు వ్రాసి పంపించవలయు, మద్ర భూపాలుండు మా తండ్రి నన్ను పరగ దేవర వారి పాదపద్మములకు, స్థిర భక్తి యుక్తనై సేవసేయంగ చెలగుచు బెండ్లిజేసిన యది మొదలు కలనైన మారుపల్క నెరుగంగనైతి, బాలను గాని నేప్రొఢను గాను. చాల నేర్పు నెఱుంగ జాణను గాను । సవతులతో పోరు సల్పుటెరుంగ । యెవరెట్లు పలికిన నెదురాడ వెరతు । చేరి కొండెము జెప్పచేతనే గాదు । మీరి మందులననేమో యెరుంగ । నీ కృప యొక్కటె నెరనమ్మి యుంటి, పాకారి వినుత నాపై కోపమేల । దయలేక మదనుండు దండెత్త నన్ను । రయమున పూల నారసముల గ్రుమ్మె । నిప్పుల కుప్పయ్యె నేల నింగి దోచె । మెప్పైన కమ్మె తెమ్మెర ఔర్యమాయె .. దినమొక యేడాయె. ధృతి దూరమాయె । పనిపడి నీకు నాపన్న రక్షణము । అదిగాక తావకీయాధరామృతము గొదలేక యీవేళ గ్రోలంగ నిల్పి । ప్రాణరక్షణ సేయ । బాడియౌనయ్యా । క్షణేతర కృపాప్తి చిత్తగింపవలె । వినుమిదె పదివేల విజ్ఞాపనములు.

ఇట్లు

వనజాక్షి లక్షణ వ్రాలు

హా ॥ అసీ శుకవాణీ ఉత్తరమంతా వ్రాసినానే

శు ॥ ఎలా వ్రాసినావయ్యా ।

హా ॥ అంతా బాగానే వ్రాసినాను.

శు ॥ వ్రాసిన విధము జెప్పవయ్యా అయ్యవారూ ।

హా ॥ అన్నియు పదినేను పంక్తులు వ్రాసినాను. అందులో మూడు భాగములు వ్రాసినాను. మొదటివి పదిపంక్తులు తుడుపులు, నడిమివి నాలుగు పంక్తులు హంసపాదులు, తక్కిన మూడుపంక్తులు చక్కనిసున్నాలు చుట్టినానే ......

శు ॥ అదేమయ్యా । తుడుపులు, హంసపాదులు, సున్నాలు వ్రాసేరటయ్యా।

హా ॥ ఎక్కడ వ్రాయవలసినది అక్కడ వ్రాయవలదటే ......

ల ॥ కం ॥ తప్పక యుత్తరమంపితి
తప్పెన్నక మారు వ్రాసి తగ బంపక నా
యొప్పుల కుప్పా యిప్పలు
మొప్పె వగలు మాని రమ్ము ముదమున కృష్ణా ।

**శుకవాణి వాక్యము**

శు ॥ ప్రత్యుత్తర మిలా యివ్వవయ్యా -

హా ॥ ఇదిగో పుచ్చుకోవే ..........

**లక్షణ**

**దరువు - ఆనందభైరవి రాగము - అటతాళము**

ఈ జాబు వానికివ్వవే । తోడితేవె । మానినిక పోపోవే । వేగరావె
రాజరాజ రాజరాజ మహారాజ రాజాధి రాడ్బిరుద రాజితులనియున్న। ఈ జాబు।
జాగేల పోయిరావే । వే వే వే వే । బాగాయె మనవి వినవే ।
యీ రేయిని । భోగశయానుని వేగరమ్మని యనురాగముతో
నెంతో వ్రాసితినమ్మా । ఈ జాబు ।
హరికి సాగిలి మ్రొక్కవే । సవతి లేని । తరిజూచి । చేతికీవే । రమ్మనవే ।
మరుని బారికి చాలా వెరచితి నికనైన । కరుణించి ననుబ్రోవగదె యని వ్రాసితి
। ఈజాబు ।

వర డోకిపుర వాసుడే । భక్తశుభ । కరుణుడైన గోపాలుడే । నాపాలి ।
సిరిగుల్కు తనమోవి చిమ చిమ నొక్కగా మరి మరి మనసాయె
దరిజేరుమని యున్న । ఈజాబు ।

ఓయమ్మా పోయిరావమ్మా ......... ...........

## శుకవాణి

### కీర్తన – పంతువరాళి – అటతాళము

నందకుమార । నవనీతచోర । సుందరాకార । సురశైలధీర ।
శిష్ట సంరక్ష । జితకనకాక్ష, దుష్ట విపక్ష । తోయరుహాక్ష । పదభూతగంగ।
పండిత సంగ । ముదిత మల్లవ రంగ మోహన రంగ ।
డోకిపుర శ్రీ కమలేశ పాకారి రిపునాశ, పటుకృపాలేశ .....
(హాస్యకాడు ద్వారపాలక వేషము న గూర్చుండు సమయమున శుకవాణి వెళ్ళి పిలచుట)

శు ॥ ఏమయ్యా । ద్వారపాలకా ।

హా ॥ తాసె, తాసె । భాంచోత్ ......... దూరజావు లగిడీసె మార్తుమ్ ।

శు ॥ అదేమయ్యా యోమో బాసలాడేవు ।
నేను వచ్చి యున్నానని సామివారితో మనవి జేయవయ్యా

హా ॥ స్వామీ నేను వచ్చియున్నానయ్యా ।

### కృష్ణవాక్యము

వాకిటి యొద్ద కావలి యుండుమంటే యీడకేమి వచ్చినావు ఛీ ...
వాగక వాకిటిలో యుండరా ...

హా ॥ ఛీ వాగక పోరా .........

శు ॥ ఏమని చెప్పినావయ్యా ...........

హా ॥ నేను వచ్చియున్నావని చెప్పితివే ...

శు ॥ శుకవాణి వచ్చి యున్నదని చెప్పవయ్యా ।

హా ॥ స్వామీ శుకవాణి వచ్చియన్నదయ్యా ।

కృ ॥ దాన్ని లోపలికి రానివ్వరా –.

హా ॥ పోవమ్మా సెలవైనది

శు ॥ కం ॥ జయజయ నందకుమారక
జయజయ సత్పోషణ ప్రచారకహారీ
జయజయ శత్రు విదారక జయజయ కరుణారస ప్రసారక శౌరీ ।

కం ॥ మత్తేభయాన లక్షణ
చిత్తజు బాధలకు భీతిజెంది ప్రియముతో
నుత్తర మంపినదిది గని
యిత్తరి దయసేయు మటకు నెలమిం గృష్ణా ।

కృ ॥ ఓసీ మీదేవి మిక్కిలి భాసురాంగి । మన్మధాగమవేదిని మాటకారి ।
కల్లగాదిట్టి నల్లని గొల్లవాని పొందు బడయునె నేరాను పొమ్ము ...
పొమ్ము ....

**అంతట శుకవాణి రాగా జూచి లక్షణ అనే వాక్యములు -**

ఓయమ్మా స్వామివారేమన్నారమ్మా ....
ఓయమ్మా స్వామివారేమన్నారమ్మా ....

శు ॥ తగినట్లే అన్నారమ్మా । ....

ల ॥ అంతమాట యేమాన్నారమ్మా । ....

శు ॥గీ ॥ ఓసీ మీదేవి మిక్కిలి భాసురాంగి ।
మన్మధాగమవేదిని మాటకారి । కల్లగాదిట్టి నల్లని గొల్లవాని
పొందు బడయునె నేరాను పోవే యనెనె

ల ॥ ఓయమ్మా యెంత తెలియక మోసపోతినమ్మా ।

శు ॥ ఏమమ్మా ఏమిచేసినావే ।

ల ॥ ఓయమ్మా యొకనాడు ఆ స్వామివారును నేనును హంసతూలికా తల్పమున నెంతో విలాసముగా నున్న సమయమున స్వామీ మాయందరిలో నీకెవ్వతె యందు మిక్కిలి మోహమో తెలుపుమంటినమ్మా ... అంతట నాకందరి యందును సమానమే నన్నారమ్మా; ఆడుదానను గాన యింత వచ్చునని తెలియక మోముచిట్లించి నల్లవాని నమ్మరాదంటినమ్మా .... నాటికామాట నానోటికి యేటికి వచ్చెనమ్మా । ఎంత మోసపోతినమ్మా ।

శు ॥ ఓయమ్మ అందుకేమి చేతుమమ్మా ।

ల ॥ నేనే వస్తాను పదవమ్మా ।

**సారంగ రాగము – అటతాళము – భైరవి**

నేనే వచ్చెదనేయమ్మా అభిమానమేటికిక నో కొమ్మా –
వానికి దయరావలెనమ్మ – చెలి రమ్మా ।నేనే।

వాదేటికి నాకిక లెమ్మా । వాని పాదములకు మ్రొక్కెదనమ్మా ।
కాదేని వాడు రాడు గదవమ్మా । పదవమ్మా ।నేనే।

నేరము జేసితి నందునే । నాధారము నీదే నందునె ।
దారిచూపు యేడ దానిమేడ వాని వేడ ।నేనే।

గొమ్మ డోకిపుర గోపాలు । డిపుడెమ్మెగుల్క వచ్చినచాలు
సమ్మతి పరుపగ చాలజాల మేలు చాల । ।నేనే।

(హాస్యకాడు ద్వారపాలకుని వేషము వేసుకొని ద్వారము వద్ద నిద్రించుచుండగ –)

శు । వా ॥ ఏమయ్యా ద్వారపాలకా యెంత పిలచినా పలుకవు ఓహో ద్వారపాలకా।

హా ॥ వాట్ నాయిస్ యీజ్ దట్ – డోన్టు స్పీక్కు –
ఐ విల్ బీట్ యు విత్ మై స్టిక్ – యూ ఫూలిష్, టేక్కేర్ ।

శు ॥ అయిడోన్టునో వాట్ యుసే । గెటౌట్

శు ॥ సరే మహా బాగానే వున్నదయ్యా ।

హా ॥ అయిడోన్టునో వాట్ యుసే । గెటౌట్

శు ॥ సరే మహా బాగానే వున్నదయ్యా ।

హా ॥ హు ఆర్ యు

శు ॥ నీ భాసలేమీ నాకు తెలియవు. తిన్నగా మాట్లాడవయ్యా ।

హా ॥ తు కౌన్ హై ।

శు ॥ శుకవాణి, లక్షణ వచ్చి యున్నారని స్వామివారితో మనవిచేయవయ్యా ।

హా ॥ స్వామీ, చుక్కదానికి అవలక్షణముగా నున్నదిట.
మీతో మనవి చేయమన్నారయ్యా ।

కృ ॥ ఓరే చుక్కదేమిటి అవలక్షణమేమిటి ఛీ వాగక పోరా .......

హా ॥ చుక్కదేమిటి అవలక్షణమేమిటి ఛీ వాగక పొండే ।

శు ॥ స్వామివారితో యేమి మనవి చేసినావయ్యా ।

హా ॥ చుక్కదానికి అవలక్షణముగా వున్నదని మనవి చేయమన్నారని చెప్పినానే।

శు ॥ యెంత చక్కగా చెప్పినావయ్యా ।

హా ॥ మరి యేలా చెప్పవలెనే ।

శు ॥ మీ దర్శనమునకు మీ భార్యయయిన లక్షణ వచ్చియున్నదని చెప్పవయ్యా।

హా ॥ స్వామీ మీదర్శనమునకు మీభార్యయయిన లక్షణ వచ్చినదయ్యా;

కృ ॥ అలాగైతే లోపలికి రానివ్వరా ।

హా ॥ స్వామివారి సెలవయినది లోపలికి పొండమ్మా ।

**సవతుల కయ్యము**

రుక్మిణి వాక్యము - అల్లల్లల్లా సిగ్గులేక నాయింటికేల వచ్చితివే

లక్షణా వాక్యము - ఓసి నీ యిల్లనగా నేమె బొమ్మరిల్లు

రు ॥ ద్రిమ్మరిదానా , ఆ బొమ్మరింటికేల వచ్చితివే ?

ల ॥ నోరుగాయవే సారసాక్షుడున్నాడని వచ్చినానే ।

**కయ్యపుపాట**

రు ॥ యెందుకు నీవు నాయింటికి వచ్చితివి । నిందు నందన బుద్ధి లేదటే । నీ కిందరిలో సిగ్గుగాదటే ।

ల ॥ ఇందు ముఖిరో నీ యిల్లనగానేమి? మందర ధరు జూడవచ్చితినే । యే మందు నీ వేసాలు మెచ్చితినే ।

రు ॥ ఓసి యోసి నావి వేసాలని యేవు కాసుజేయని దాన నందునే । పయిడి। బూసిన యిత్తడి నందునే ।

ల ॥ నాసాటి దానవే । నన్నా । నీవెంతో యీసుగొట్టుదాన వెరుగుదువే నీవు కూసిన కూతల కేమిలే ।

రు ॥ కంచుగంటవలె గట్టివాయిదానా । వంచాడించక వాగెదవె । యికమించిన వంచన జెందదవే ।

కృ ॥ ఓరి కొంచెము దూరము గానే యున్నదిరా

హా ॥ స్వామీ దూరమయితే నేను రాలేనయా

కృ ॥ ఓరి యెంతలో పోతామురా

హా ॥ సామీ నీకనేక భార్యలు గనుక యెక్కడ నుంటే అక్కడ సుఖము గలుగుతుంది. నేను ఒకదాన్ని పెట్టుకొనే కాపురము చేయుచున్నాను. అదిన్నీ గాక నేనెప్పుడును మా యింటిదానిని విడిచియున్న వాడను గాను. అలా విడిచితినా నాబుద్ధి మంచిది కాదు. అయితే యేమాయె ననుకుంటే యింటిదాని బుద్ధి అంతకంటే కొరగాదు స్వామీ నేనెట్లా వత్తునయ్యా ।

కృ ॥ ఓరీ యిన్ని మాటలేల రారా ।

హా ॥ స్వామీ మళ్ళా నన్ను మాయింటిదాకా పంపిస్తావు అలాగే వస్తాను.

కృ ॥ ఓరి నాయనుగ్రహము వున్నది. భయమేమి రారా.

హా ॥ స్వామీ శాకినీ ఢాకినీ యక్షిణీ కామినీ మోహినీ భూతప్రేత పిశాచములనే గ్రహములు గాక నాయనుగ్రహము కూడా వున్నదటయ్యా ।

కృ ॥ ఓరి గ్రహము కాదురా

హా ॥ స్వామీ మరేమిటయ్యా ।

కృ ॥ నా కరుణ రా

హా ॥ స్వామీ అలాగైతే వస్తాను గాని ముందుండి దారి చూపించండయ్యా ।

కృ ॥ ఓరి నాముందర నీవుండవలె కాని నేను దారి చూపేదటరా ।

హా ॥ స్వామీ నేనే ముందు నడచెద వాని నా చేతిలోని కఱ్ఱమీరు పట్టుకొని నావెంట రండయ్యా ।

కృ ॥ ఓరి సూర్య చంద్రులను నేత్రములుగా గల నేను నీ చేతికఱ్ఱ పుచ్చుకొని నడువవలెనటరా ।

హా ॥ స్వామీ నేనేమన్నా తప్పే కాని మరి యిప్పుడు ముందు నడువనా? వెనుక నడువనా ?

కృ ॥ ఓరి పక్కగా నుండరా ।

హా ॥ స్వామీ యేపక్క నుండేనయ్యా ।

కృ ॥ ఓరి యీపక్కగా నడువరా ।

హా ॥ స్వామీ అలాగైతే మీరు కుడిపక్క నుండేరటయ్యా

కృ ॥ ఓరి చాలా ప్రొద్దుపోయినది గాని యిక మాటలాడక నడువురా

హా ॥ చిత్తం మహాప్రసాదము స్వామి ।

### లక్షణ కృష్ణుడు వచ్చుచున్నాడని చూచుట

### ముఖారి రాగము - అటతాళము - ఆనందభైరవి

ఎవ్వారే వారెవ్వరె । వచ్చేవారెవ్వరె వారెవ్వరె ।
మువ్వపు నడకల నివ్వటిల్లుచును ।
దవ్వు దవ్వులను నవ్వుచు వచ్చే, । దెవ్వరే ।
రంగుగ బంగారు చెంగుల దుప్పటి । సింగారించుక పొంగుచూ
వచ్చేదెవ్వరే । పాటలా తేటల నీటు గుల్కుచును ।
వాటపు విలాసము దేలుచు వచ్చే । దెవ్వారే ।
ఈశుడు డోకిపురీశుడనుచు నధి ।
కాశతోడ మనమరయగ వచ్చె । దెవ్వారే ।

### శుకవాణి వాక్యము

ఓయమ్మా స్వామివారివలెనే నున్నారే ।

ల ॥ ఆశమ్మా అలాగే వున్నాడమ్మా ।

శు ॥ ఓయమ్మా అదిగో నెమలిపింఛమే ।

ల ॥ ఆశమ్మా వినవే వేణుగానమే ।

శు ॥ ఓయమ్మా అదిగో కౌస్తుభ రత్నమే ।

ల ॥ ఆశమ్మా చూడవే బంగారు దుప్పటి ।

శు ॥ ఓయమ్మా నీలమేఘుచ్ఛాయ మేనే ।

ల ॥ ఆశమ్మా కస్తూరి తిలకమే ।

శు ॥ ఓయమ్మా యిక లోపలికి పదవే ।

ల ॥ ఆశమ్మా అలాగే గాని స్వామివారు వచ్చుచున్నారు గనుక కావలసిన వస్తువులన్ని యుజాగ్రత్త చేసుకు రండమ్మా ।

**తోడి**

**లక్షణ – దరువు – శంకరాభరణము – ఆదితాళము**

తెండే సఖులారా విభుడు వచ్చుచుండె నమ్మలారా । పండు

టాకులు పోకా వక్కలు । యెండుగొబ్బరి । యేలకి కాయలు । తెండే ।

సన్న లవంగాలు సవరయిన జాపత్రి వన్నె జాజికాయ నున్నని దాచిని । తెండే ।

ముత్తెపు సున్నము క్రొత్త కర్పూరము । చిత్తరి మరువము మెత్తని దవనము

। తెండే ।

అన్నువ గంధము అత్తరుబుడ్లు మిన్న కస్తూరి పన్నీటి చెంబులు । తెండే ।

అదిగో డోకిపురదన గోపాలుడు । కదలి వచ్చెనె । చదరంగపు పెట్టె । తెండే ।

**అంత లక్షణ శ్రీకృష్ణుడు రాగానే తలుపు గడియ వేయగా సంవాదము**

**సంవాదపు పాట**

కృ ॥ వలపు గుల్క నీవద్దకు వచ్చితి తలుపు తియ్యవే భామా ।
నీ । తలపొన గూడెనే లేమా ।

ల ॥ వలపెక్కిన నా వలన నేమి । ఆ చెలియ వేడుకొమ్మనవే ।
ఆవల దారిని పొమ్మనవే ।

కృ ॥ కలనైనను నిక్కము నేను మరువ గలనటే యిట్లనదగునే ।
నీ చెలు వితరులకు గలుగునే ।

ల ॥ భళి భళి తగురా తెలిసితి నీమతి । పలుకు లికను వెయ్యేల ।
నీ । చెలిమికి మ్రొక్కెద చాలా ।

కృ ॥ జలజేక్షణ నీ మొలకనవ్వు ముద్దు ।
గులుకు మోము జూపించు దయ చిలుక నన్ను రక్షించు ।

ల ॥ నలతివి యెంతటి వాడవురా నీ ।
పలుకు వేయివరహాలే జేయు । నే దలకెద నిది నడునడు రేయి ।

కృ ॥ తలక నేటికే తస్కరునకు వలె । వలపున వచ్చినవాడ ।
భూ । వలయ మేలుచున్నాడ ।

ల ॥ యిలలో నందరు నెరుగరె । నే నన । వలె నటరా
గోపాలా । విం । తలు డోకిపురపాలా ।

**దరువు – పున్నాగరాగము – ఆటతాళము**

కృ ॥ కన్నుల నను జూడవే వన్నెలాడి నన్ను గూడవే

ల ॥ కన్నుల ఎరుపేమిరా చెక్కులను కాటుక మరకేమిరా

కృ ॥ యెంతటి యనుమానమే, అల్లది భాగ్యవంతుని లక్షణమే

ల ॥ హూంతకాడవురా । యెరుగుదు నీ వింతలిక యేలరా

కృ ॥ ఏమి చేసితినే । నా పయినింత తామసంబేలనే ।

ల ॥ స్వామీ నిన్నేమందురా । నే నోచిన నోము లిట్లుండెరా

కృ॥ డోకిపుర వాసుడన్ । గోపాలఖ్యాక దేవేశుడన్

ల ॥ రాకయుంటివిరా । యెంత నిరాకరించితివిరా.

**దరువు – చాపుతాళము**

కృ ॥ ఎలానే తాళజాలనే

ల ॥ ఔరా చాలురా యెంతో మేలురా

కృ ॥ నన్నేలవే సదయురాలవే ।

ల ॥ యింతయేలరా ముద్దరాలరా ।

కృ ॥ యిక మ్రొక్కెద మోవి నొక్కెద

ల ॥ రారా మ్రొక్కితి । నీకే జిక్కితి ।

**సంధి దరువు – శ్రీరాగము – ఆదితాళము**

లక్షణా కేళీ లక్షణ నారీ ।
సుమహిత దశవిధ చుంబనధారా ।
ఘనతర దంత నఖక్షత శోభీ
బంధుర బహువిధ బంధన మోదీ
అంచిత పంచ శరా గమవేదీ
నిరుపమ డోకిపుర వనమాలీ ।లక్షణా।

**మంగళార్తికము – సౌరాష్ట్ర రాగము త్రిపుట తాళము**

నీ పాదపద్మములకు నిత్యజయమంగళం ।
పాపారహిత నీకు పరమ శుభ మంగళం।
అమరులు సిద్ధులు అఖిల మునీశ్వరులు ।
విమలత నెల్లపుడు విడువక పూజసేయు ।నీపాద।

శ్రీలక్ష్మి భూలలన । నీలాంగన మఱియు ।
వాలాయము జేరి చాలా భక్తితో నొత్తు ।నీపాద।

వరడోకి పురపాలా । వరదా, గోపజనాలోలా ।
స్థిరతర కృపా విశాల శ్రీమదన గోపబాల ।నీపాద।

డోకిపురగోపబాలు నస్తోక కృపను
కన్నయామాత్య కామాంబికా తనుజుడు
దాసు రామాభిధాన విద్వద్వరేణ్యు
డీకృతి యొనర్చె లోకోపకృతిని గోరి ।నీపాద।

**సంపూర్ణము**



### అనుబంధము - 2

# అనల్పజల్పితాకల్పకల్పవల్లి

## శ్రీరస్తు

అస్మద్దేశీయులగు సదాచారప్రవర్తకులారా. నేనిప్పుడు వ్రాయబూను కొనిన యీ గొప్ప విన్నపమును సదాచార పక్షపాత బుద్ధితోను శాస్త్రైక దృష్టితోను విమర్శించి శాస్త్రీయమని తమ డెందంబులకు దోచినంతవరకు బుద్ధి మంతులగు వర్ణశ్రేష్ఠు లంగీకరింతురని నమ్ముచున్నాడను. మన శాస్త్రమును విడిచి విషయవిచారమే పెట్టుకొని కూర్చుంటిమేని పరలోకమందలి సుఖమును పొగొట్టుకొనుటయే కాక క్రమక్రమముగా సంకరులమై బ్రాహ్మణాది వర్ణధర్మములను మరచి చెడిపోదుము. ఇతరుల దృష్టియందెంత బాగుగా గనపడినను ఎవరి దురాచారము వారికి నష్టమును గలుగజేయమానదు. ఆ శాస్త్రీయ ప్రచారములను దొరతనమువారు మాన్పించి ఖ్యాతి జెందెదరు గానివి చేయించి ఖ్యాతి జెందరు. వైదికాచారములను విమర్శించు నపుడు వేదశాస్త్ర పురాణేతిహాసంబులు ప్రమాణములు గాని విషయ విచారంబు జేసుకొని మనలో మనము పరిశోధించుటకు శక్తులము కాము. వేదశాస్త్ర పక్షపాతబుద్ధియు వర్ణశ్రమాద్యభిమానమును, కర్మతో సంబంధించినంత వరకు నావశ్యకములు.

మనమిప్పుడు నవీనముగా నొక సిద్ధాంత మేర్పరచుటకు గాని అది సత్పక్షమని అవలంబించుటకు గాని సమర్థులము కాము. అయినను వర్ణాశ్రమా ద్యభిమానము కలిగి శాస్త్రీయాచారముల నవలంబించుట మహానుభావులగుకొందరికే గాని అందరికిని సాధ్యము కాదు. మన శాస్త్రములను బొత్తిగా విశ్వసించిన యితరులు మనలను దూషించిరేని వారిది రాక్షసకృత్యమని మనము నిశ్చయముగా నమ్మవలయును. అట్టివారితో నేవిషయమున గాని మనకు సంబంధము లేదు. వారు దూషించిన విషయమును మనము విమర్శంచుటయు ననావశ్యకము.

విరుద్ధ ధర్మములను జెప్పువారి సమ్ముఖమునే విషయముగాని మనము విమర్శింపబూనుకుంటిమా 'విధవకు మ్రొక్కగా నన్నుబ్రోలి బ్రతుకుమన్నట్లే' చెప్పుదురు. దేశము యొక్కయు వర్ణముల యొక్కయు క్షేమలాభములను విచారించు

వారందరు వేదశాస్త్రాదులను గట్టిగా నమ్మి యుండవలయును. 'కూడు గలిగినది గదా కులమేల ననక' శాస్త్రసిద్ధాంతప్రకారముగా దాము ప్రవర్తించుచు నర్వులగువారం ప్రవర్తింపజేయవలయు. ఒకడు తాను కులభ్రష్టుండై యితరు నట్లు బ్రవర్తింప జేయంబూను కొనుట 'తాజెడినకోతి వనమెల్లం జెరిచినట్లగు'.

విషయవిచారమును నమ్మి యాముష్మికప్రయోజనమును జెందుదు మనుట 'కుక్కతోకను బట్టుకొని గోదావరిని యీదబూనుటయె యగు'. ఏదేశమునను, ఏ కాలమునను పెద్దల్వెవరు నంగీకరింపని యొకపని ధర్మము ధర్మమని చెప్పంబూనుకొనుట తన పిచ్చ తనకానందంబనినట్లే కదా.

నేనిప్పుడు వ్రాయంబూనుకొనిన కులస్త్రీ పునర్వివాహనిషేధ విషయము విశేష విచారము వలన గాని తెలియకపోవునంతటిది కాదు. హిమవంతము మొదలుకొని సేతువు వరకు గల దేశమందంతటను భూమి పుట్టినది మొదలు మనకాలము వరకు వేదశాస్త్రములను నమ్మిన కులశ్రేష్ఠులందరికిని చక్కగా దెలిసియున్నయదియే. ఇంతియుకాక బహుశతాబ్దముల క్రిందట కృష్ణదేవరాయలవారి కాలమున పండితమండలాగ్రగణ్యులుగా నుండి నేటి వరకును బండితులందరిచే నీశ్వరావతారమని పేర్కొనంబడిన యప్పయదీక్షితులవారు తన కుమారికకు సంభవించిన యాపత్తునకు దుఃఖించి యప్పటికి బూర్వమందే స్త్రీలకు పునర్వివాహ నిషేధము బలముగా జూపట్టుచున్నందున ఏ వీలుననైన పునర్వివాహము సిద్ధాంతీ కరింతమని తలంచి తన పాండిత్యప్రకర్ష వలన గొందరి నోడించియు దుదకు ఛీ యిది సర్వథా నిషిద్ధమని తనకు మిగుల దుః ఖకరమయినప్పటికిని గూతురి విధవాత్వమును సహించెనే గాని పునర్వివాహమును జేయలేదని యిప్పటి మనవారందరు జెప్పుకొనుచునే యున్నారు.

ఇటీవల కొందరు వర్ణధర్మములు సెరుపదలచి స్త్రీ పునర్వివాహము శాస్త్ర సమ్మతమనియు నది యాచరింపదగుననియు నింగ్లీషుభాషలో గ్రంథములు రచించి దొరతనము వారిని బ్రేరిపించిరి గాని తోడనే విఫల మనోరథులైరి. కులస్త్రీ పునర్వివాహములను జేయుటవలన గలిగెడి నష్టములను చూపుటకు యుక్తికంటె శాస్త్రములను బలముగా బుచ్చుకొనవలయును. అట్టి యుక్తులను జెప్పుటకు గాని సశాస్త్రమును వివరించుటకు గాని నాకు విశేషసామర్థ్యము లేకున్నను కులభ్రష్టులు కాదలంచుకొనువారి దురవస్థను జూడలేక యధైర్యమును

విడిచి శాస్త్రమార్గము ననుసరించి కొంచెము ప్రసంగింప సాహసించుచున్నాడను.

జగదీశ్వరుడు ధర్మపక్షావలంబి యగుట యెల్లవారు నొప్పుకొనక తప్పదు.

1. నియమంబులచే గామంబునడంపవలయు. అది అభ్యాసము వలన సాధ్యమే కాని అసాధ్యము కాదు. నియమాభ్యాసము లేనివారలు నూరుగురను ఏకకాలమున గట్టుకొనినను గామోపశాంతిగానేరదు. నియయము విడనాడిన వారలు కొందరు పెక్కంద్రతో గూడియు గామోపశాంతి లేకనే యున్నారు. ఇంద్రియనిగ్రహము చేసిన సన్యాసు లెన్నిదేశములలో లేరు. నైష్ఠిక బ్రహ్మచారు లెందరుం కారు. కామోత్పత్తి కాలంబు మొదలు అనేక సంవత్సరములు దుష్ప్రవర్తన లేక నియమంబున వర్తించు వారెంద రెన్ని దేశములలో లేరు. భర్తలు దేశాంతరగతులయ్యు షండులయ్యు దీర్ఘరోగులయ్యు కులభ్రష్టులయ్యు నుండిన వారి భార్యలలో అమరణాంతము దుష్ప్రవర్తన లేక యుండువారి నెందరిని జూచుచున్నాము గాము. విధవలతో నియమంబుగలవార లెందరు లేరు. జోడు గూడక కట్టుబడియున్న యేనుగులు యెన్నిలేవు. గుర్రము లెన్నిలేవు. పక్షులెన్నిలేవు. కామము మనుష్య పశుపక్షాదులకు సమానమే అవి యన్నియు జచ్చిపోలేదు. సరికదా సంసర్గము లేనందున శరీరదార్ఢ్యము గలిగి యుండుట మన మెరిగినదే. కామము నిద్రాహారముల వంటది కాదు. అవి లేకున్న కొన్నినాళ్ళకే మృతిసిద్ధమై యుండు మిధునకర్మలేక చచ్చువారి నెచ్చటను గానము. ఒకటియే గతియని కొని యిక మనకు కలగనె కలగదనికొని నిరాశ చేసుకొనిన వారికి గామంబు కలగనే కలగదు. ఒకటి రెండు చవిజూచిన వారికిని యిదిగాకున్న మరియొకటి కలుగునని యాశపెట్టుకొనిన వారికిని కామము అధికమై నియమమునకు లోబడక యుండు ననుటకు సందేహము లేదు. ఇందున కొక దృష్టాంతము చెప్పెద.

2. జంత్వాహారము నిషేధముగా నెంచుకొనిన బ్రాహ్మణులకు దానియందు బుద్ధిపుట్టదు సరికదా రోతగా కూడ నుండును. ఇతరులగు శూద్రాదుల కనుదినమును దానియందలి వాంఛయతిశయించుచునే యుండును. ఇంతయేల తగులుకొనిపోయిన వారిలోను గృహంబుల నుండి చాటున వ్యవహరించెడి వారిలోను సభర్త ృకల సంఖ్యయే అధికముగా నుండునని మనము గట్టిగా చెప్పవచ్చును. ఇంతకును గామము గదా వ్యభిచారమునకు గారణమని చెప్పుచున్నారు. తలలు బోడిచేసుకొని ఒంటిపూట దిని వట్టినేల బండుకొనుచు,

ముతకబట్టగట్టి వ్రతాదులచే గృశించి యలంకారము లెవ్వియు లేక నుండువారి కామము సర్వదా యీ కర్మము లేక యెకడు బోయిన మరియొకనిం గట్టుకొనవచ్చునను బుద్ధిగలవారి కామము కంటె నెక్కువగా నుండుననుట యెంత యాశ్చర్యము. మారుమనుము గల గొల్లగవల యీండ్ర వాండ్రలో నేమి యితర దేశీయులలోనేమి వ్యభిచారము మిక్కిలి గలిగియున్నట్లే మనము సర్వదా వినుచున్నాము. కామమును సర్వాత్మనా సంభోగము లేకనే యడంచుకొనుట మనుజులకు సాధ్యమనుటకును అది యోగ్యతర మనుటకును ప్రసిద్ధికులగు నోబిలు దొరగారి గొప్పసాక్షిగా నున్నారు.

కావున వ్యభిచారము కూడదని చెప్పవలసిన పనికి విధవలకు వివాహములు చేయవలసినదని చెప్పుట సరికాదు.

3. వర్ణాశ్రమాది తారతమ్యములు గల మన మతములో ఇహలోకసుఖమును బట్టి దయ విచారించుటకంటె పిచ్చి వేరే లేదు. అట్లు విచారించితిమేని అయ్యో మాల, మాదిగవాండ్ర దురవస్థలు విచారింపశక్యమా. మన దరికయిన వాండ్రం జేరనివ్వమే. వాండ్ర వాండ్రకు నియతములగు కొన్ని నీచవృత్తులు దప్ప మరియేపని గాని చేయననివ్వమే. వాండ్రను పశువులకంటే నీచముగా జూచుచున్నామే. అట్లు దయవిచారింతిమేని కుల భేదములును బ్రహ్మచర్య సన్యాసాద్యాశ్రమములును మానకొనవలసి వచ్చును. కావున ఆయాశాస్త్ర నియమంబులకు లోబడి దయగలిగి యుండు వలయు. ఇహలోక సుఖము కంటే బరలోకసుఖము గొప్పదని మనము నమ్ముచున్నాము. గాన పరలోకప్రాప్తికి హేతువయిన విధవశీలమున ఇహలోక నీచభోగమందు తలంపుబెట్టి చెడగొట్టినందున మనము నిర్దయుల మగుదుము గాని సదయులముకాము.

4. మనము వేదశాస్త్రాదులనే చూచుచున్నాము గాని భగవంతుని యుద్దేశమిట్టిదని యెరుగజాలము. సుఖ మనుభవించుటకు ఉద్దేశించి అందరిని భగవంతుడు సృజించినా దనుటకు బ్రమాణమే లేదు. స్వర్గము, నరకము, పుణ్యము, పాపము, సత్పురుషులు, దుర్జనులు, భాగ్యవంతులు, దరిద్రులు, సుఖులు, దుః ఖులు. ఇందు గొందరియొక్క జననమే భగవంతుని యుద్దేశమా యేమి?

మన వితంతువుల గతి తలంచుకొనినపుడు పగవారికయిన మనసు దహించుకొనిపోదా యందురు. ఈ నిషేధము చిరకాలము నుండి వచ్చుచుండగా దేవునకు గాని, ఋషులకు గాని, మనవారి కందరికిగాని, యిప్పటి పండితులకు గాని యట్లుండలేదే. పయిగా ఈ దుర్వివాహములు జరుగునేమో నని మనసులు దహించుకొని పోవుచున్నవే. అందులకు గారణమేమి? ఒకవేళ వాండ్ర దుఃఖము జూచిన మనసు పెరపెరలాడదా యందురేమో. యీ పెరపెర తండ్రి, తల్లి, అన్నదమ్ములు, బంధువులు గతిగా నుండి వారు పోయిరేని దిక్కులేక యున్న బాలురు మొదలగువారి యందు మాత్రము కలుగకుండునా? దానికి మనమేమి చేతుము. వాండ్ర కర్మమని యూరుకొనక తప్పదు.

ప్రతి పట్టణంబునను ప్రతి యూరను మిషన్ స్కూళ్ళు స్థాపించి యనుదినంబును బైబిలను గ్రంథమును బాలురచే బఠింపించి క్రీస్తుమతమే యెల్లవిధముల మంచిదని బోధించి మనసులు కరిగించి తల్లిదండ్రులు మొదలగువారు కన్నీరు మున్నీరుగా దుఃఖింపగా లేశమయిన దయలేక వారలనుండి యెడబాపి అనేక బాలురం గ్రిష్టియనులుగా జేయుచున్న మిషనరీలం జూచుచు తామును ధాక్షిణ్యరహితులై యూరకయుండు మన దొరతనమువారు మన విధవల దురవస్థ జూచి మరల దూషింతురన నమ్మవశము గాదు.

స్త్రీల నిలువెడలనీక కారాగృహవాసులకంటెం గష్టతరమైన స్థితిలో నుంచి ఆమరణాంతము వారి పాలిటి యములోయన వర్తింపుచు అనేకులగు తమ సేవకుల మగశిశువులకు పుట్టినపుడే పురుషచిహ్నములు మొదలంగగోసి ఖొజ్జాలంజేసి మిగుల సంతసించు మహమ్మదీయులీ విషయమున నేమి చెప్పిననేమి.

ఇంతయేటికి జీవితేచ్ఛకంటె గామ మెక్కువ కాదు. ఎందరు రాజులు నిర్హేతుకముగా ననేకుల ననేక యుద్ధంబులకు బలియిచ్చిరో మన మాలోచించరాదా. బ్రతికియుండవలయునను నిచ్ఛ మనుష్య పశుపక్ష్యాదులకు సమానమే. గోవులు మొదలగు జంతువులను బ్రతికియుండగా గొంతు గోసి తమ జీవనాధారముగా జేసికొనుచున్న గొప్పవారి నెందరిని జూచుట లేదు.

5. ఈ విధవా వివాహ నిర్వాహకత్వ మహాకార్యమును తలజుట్టుకొనిన

వారి కోరికలు కొనసాగినట్లయిన కొన్ని అపార మార్థికములగు లాభములు కలుగవచ్చునేమో. అవి యెవ్వియనిన –

తమ భార్యలకు ముందుగా గల భర్తలు పెక్కండ్రు కన్నులగట్టి నట్లుండి పరమానందమును గలుగజేయరా. అయ్యో యాడువారందరును నెల నెల కొక వివాహము సేకూడెనని నిత్యకళ్యాణము పచ్చతోరణముగా నుండునని వేడుక పడకుందురా. వారందరు నికమీదట దైవసంకల్పము మంచిదై క్రమక్రమమున ననేక పతులకు భార్యలగుట సంభవించెనేని యెన్ని గోత్రములు వృద్ధిసేయరు. ఎంత స్వేచ్ఛ యనుభవింపరు. ఎంత స్త్రీ ధనము సేరదు. ఇంత యేల వారందరును బతి వచ్చిననాటి సంతోషము కంటె పతి చచ్చిననాటి సంతోషమును మేలుగా నెంచరా. ఒకానొక యదృష్టవంతున కొక్కతె కూతురైనను ఎన్ని వియ్యంబు లందును, ఎంద రల్లుండ్రం బరామర్శించును. ఒక పతిని సేవించినదానికంటె అనేక పతులను పరామర్శించినది పాతివ్రత్య మహిమమున నెక్కడనుట నిక్కువము. కావున పతి సంఖ్య హెచ్చుకొరకెన్ని నోములు సేయదు.

అయ్యో దైవమా ఇదివరకు ఒకానొక వేడుకకత్తెయగు రండ యుండెనేని గర్భమగునో శిశుహననదోషంబు వచ్చునోయని తగునంత వరకు గామంబు నడించికొని వ్యభిచారము నం బ్రవేశింపక మానమున మ్రగ్గియుండుట తటస్థించుచున్నది. వారి కోరికలీడేరి లోకమున వైధవ్యమే లేకుండెనేని వారితో పరపురుషుల యందలి రాగంబునదిమరాండ్రు గాక మగనిచాలు రంకుగదా సాధారణముగా బయలపడదని తెలిసికొని తమ కామోపశాంతి చేసుకొనుటకు సందేహము లేదు. పరలోకగతులగు కొందరికి విధవలె గతియై పారలౌకికములు సేయుట సంభవించుచున్నది. ఎంత యర్థము వ్యర్థమగు చున్నది. ఇట్టి అపారమార్థికములగు లాభముల నాశించి విధవా పునర్వివాహములకు యత్నించుట కంటె నరకమును దెచ్చు పాతకమింకొకటి యున్నదా. పుణ్యపాపములను గురుతెరగి ప్రవర్తించిన వివేకమే వివేకముగా ఊరక దమకుదోచిన యుక్తింబట్టి ప్రవర్తించుట వివేకము గాదు.

స్త్రీ పురుష సంఖ్య సమానమనుట కేమి బ్రమాణమున్నది. అట్లయిన నొకదానికి బుట్టు స్త్రీ పురుష సంఖ్యయు సమానము గానే యుండవలయును. భగవంతుని సృష్టి క్రింద నొక భూమండలము మాత్రమే యున్నదికాదు. ఇట్టి

మండలములనంతములుగా నుండననుటకు మన మందరము ఒప్పుకొనినదే కాదా. భూమండలము యొక్క యావజ్జనసంఖ్యనే తెలిసికొనజాలని మనమితర మండలముల జనసంఖ్య తెలిసికొనుట కేమి వీలు వున్నది.

అట్లు స్త్రీ పురుషుల జననము సమానసంఖ్యాకమని యొప్పుకొనినను స్త్రీ మరణముల కంటె బురుష మరణములెక్కువ యనుట నిశ్చయము. స్త్రీలలో ననేకులు గృహములలో నుండి సర్వదా రక్షింపబడుచునే యుందురు. ఎండందిరుగుచు వొడగొట్టియు, వానందిరుగుచు బిడుగులు బడియు, అడవులందిరుగుచు మృగంబుల నోటబడియు, లౌకికంబులగు కలహంబులలో దెబ్బలు దగిలియు, నీటంబోవుచు మునిగియు, వాహనంబులనుండి వృక్ష పర్వతాద్యున్నత ప్రదేశముల నుండి పడియు, దండులలో గొలువుండి యుద్ధంబు సేసియు, పురుషులెందరు ఆకాలమరణంబు నొందుచున్నారో మనమాలోచింపవలసిదియేయై యున్నది. సూతికామరణములు వృద్ధి చేయందలచుకొనిన వారికి వాని విషయమై మనమాలోచించి చెప్పవలసిదెంత మాత్రమును లేదు.

6. మనపెద్దలును, మన శాస్త్రములును విధవలకు వివాహములు లేకుండనే చేసిరి గాని చెడిపోవుదానిని ఉరితీయమనిగాని శిశువులను జంపుమనిగాని విధించి యుండలేదే.

ఒకానొక దుష్ప్రవర్తన గల విధవకు పురుషసాంగత్యము వలన గర్భమాయెనేని దానికి జాతి మాత్రమే పోవునని తెలిసి యుండగా మందులు దినుటకు గాని తాను చచ్చుటకు గాని శిశువుం జంపుటకు గాని యావశ్యమే లేదు. ఆ చెడిపే ప్రాణము కంటె జాతి యెక్కువగా దలంచుకొని ఆ పనులు చేసినంతమాత్రము చేత దానికి స్వర్గము కలుగునా, మోక్షము కలుగునా, నలుగురు విని సంతోషింతురా ప్రాణము పోగొట్టుకొనినదానికంటె జాతి నుండి వెలువడుట యెక్కువ కష్టమా జాతిభ్రంశమా తపింపకు జడిసి యా కృత్యములు చెడిపెలు చేయుచున్నారనుట కవకాశము లేదు. నీతిచెడి వ్యభిచారమెట్లు చేయుచున్నారో యట్లే యీ దుష్కృత్యములను చేయుచున్నారని నమ్మవలయును. దొంగతనము, అంకుతనము, నరహత్య, అసత్యవాదము మొదలగు నేరములే కారణము వలన లోకములో నవిచ్ఛన్నముగా నెల్ల ప్రభుత్వముల యందును జరుగుచున్నవో

అటువంటి కారణములే శిశుహసనాదులకును గలిగియుండును గాని మరియొకటి గాదు.

సరేకాని ఒకవేళ ఒకానొకతెకు మగడు దేశాంతరము పోయి రెండు మూడు సంవత్సరములకు వరకు రాకుండెనేని ఈ మధ్యకాలమున పరపురుష సంసర్గమువలన గర్భిణి యగునని తలంతుము. అప్పుడు అది ఇతరుని వివాహమైనా చేసుకొనవలయును లేదా కులమైనా పోగొట్టుకొనవలయును. మగడు బ్రతికియుండి వృత్తాంతము తెలియుచుండగా గూడను ఇతరుని వివాహము చేసుకొనవచ్చునని శాస్త్రమున కపార్థములు చేసిన సిద్ధాంతకర్తలైనా యొప్పికొనరు. అట్టి సమయమున మందులు మ్రాకులు దినుట తాను జచ్చుట శిశువును జంపుట ఇవి మంచివా? కులము పోగొట్టుకొనుట మంచిదాయని యాలోచించవలయును. కులమును పోగొట్టుకొనుటయే మంచిదని తేలక తప్పదు. గావున విచారించగా శిశుహసనాదులకు గారణము విధవలకు వివాహము లేకుండునట్లు మన శాస్త్రము చెప్పుట యొక్కనాటికి కాదు వారి వారి అవివేకమే కారణము.

7. స్త్రీలకు పునర్వివాహము లేకపోవుట కన్యా విక్రయములకును కొందరు పురుషులకు ఆమరణాంతము వివాహము లేకపోవుటకును హేతువు అని చెప్పుట సంయుక్తికము కాదు. మనదేశము యొక్క స్థితిని బొత్తిగా యెరుగనివారే అట్లు చెప్పవలయును. మనదేశములో పెక్కు తరగతుల శూద్రులలో విధవా వివాహములు లేకుండనే యున్నవి. వారిలో గన్యావిక్రయములు బొత్తిగా లేవు. సరి కదా అల్లుండ్రకు విశేషధనమును కట్నమిచ్చుచున్నారు. ఆడుపిల్లలనేకులు దొరుకుదురు గాని యల్లుండ్రు దొరుకుట మిగుల కష్టముగా యున్నది.

ఇది యిట్లుండగా మారుమునుమలు గొల్ల ఈడిగ చాకలివాండ్రలో పణీతముగా ఓలి పుచ్చుకొని గాని వివాహములు సేయకుండనున్నారు. ఉత్కృష్ట వర్ణములలో సయితము కామముడిగిన ముసలివారును మరికొన్ని లోపములు గలవారును కాచిపోయిటకు దిక్కుగా నుండుకొరకు ధనము వెచ్చము చేసి వివాహములు చేసుకొనుచున్నారు. కాని సాధారణముగా అట్లు జరుగుటయే లేదు. పయిగా కొందరు అల్లుండ్రకే కట్నము లిచ్చుచున్నారు. బ్రాహ్మణులలో గొందరు కోమటులలో మాత్రము వివాహములు లేని వయసు చెల్లిన పురుషులు కానబడుచున్నారుగాని యితర వర్ణములయందు పెండ్లికాని ముసలివాండ్రు

కానరారు. పయిగా సమర్తాడిన పిమ్మటను గూడ చాలకాలము వరకు వివాహములు లేని స్త్రీలనేకులున్నారు. పయి రెండు వర్ణములలోను వారి దరిద్రస్థితులను జూచియు దుష్టవర్తనలను జూచియు నెవ్వరును పిల్లనిచ్చుటకు సమ్మతించనందుననే అక్కడక్కడ వేయింటికొక డట్టివాడు గానంబడుచున్నాడు.

మరియు నింకొక హేతువు గదు. ఒక బోగముదానిపైనను, ఒక చెడిపైనను మరిగి ఒకానొకుడ బుద్ధిపూర్వకముగా వివాహము మానుకొనుచున్నాడు. ఇంతియకాక స్త్రీల కనేక వివాహములు నిరాటంకముగా గలిగియున్న కొన్ని యుత్తరదేశములలో స్త్రీలను వేలకొలది సొమ్ముబోసి కొను నాచారమున్నదని మన చెవులతో వినుట లేదా. అచ్చట రండలు దొరకనందుననా యేమి.

8. విధవలను జూచి సభర్తృకలు చెడుచున్నారనుమాట ఎంత విరుద్ధముగా నున్నది. మిథునకర్మానుభవము లేని విధవలకు మిథునకర్మానుభవము గల భర్తృకలు గురువులుగా వలయుగాని యనుభవము లేనివారు అనుభవము గలవారికి గురువులగుట యెచ్చటను గానము.

ఈ స్త్రీ పునర్వివాహము లేనందున దేశమునకు గలుగు లాభములివి యని వక్కాణించుటకు మనుష్యమాత్రుడనైన నాకు శక్యమే కాదు. అయినను నాకిప్పటికి దోచినంతపట్టు వివరించెదను.

9. మన పూర్వికులను బుద్ధిహీనులని నిందించి మన బుద్ధిమత్త్వమును మెచ్చుకొనుచు స్త్రీలకు బునర్వివివాహములు సేయించి జనసంఖ్య అతిశయించు నట్లు కావింపనేర్తుమే గాని ఈ మహాభూతములను ఎక్కువ సారమునుగాని మరికొన్ని మహాభూతములను గాని సృజియింపనేరము.

జనసంఖ్య అతిశయించిన కొలది మహాభూతముల సారమును భగవంతుడు హెచ్చించునను నమ్మకమైనా లేశమును లేదు. నిన్న మొన్నటి రెండు సంవత్సరముల కఱువునకు ఇదివరకున్న జనులే అన్నములేక క్షుత్పీడితులై మల మల మాడినది మన కన్నులతో చూచినది కదా. ఇక జనసంఖ్య ఎక్కువ యయ్యేనేని యేమి చెప్పవలయును.

మాటిమాటికి అన్యదేశములవారీదేశమునకు వాణిజ్యాదుల కొరకు వచ్చి

యిచ్చటనే నివసించుట చేతను ఇచ్చట వారితర దేశములకు బోవుట నిషిద్ధమగుట చేతను దేశజనులు సాధువులు గాన యుద్ధములు లేకుండటచే తను ఇదివరకే యీ దేశము జనాకీర్ణమయి యున్నది మన మెరిగినదే. ఈ దేశము నందు ఉత్పన్నములగు ఖనిజములను గాని పంటలను గాని ఓషధులను గాని ఇతరదేశములవారెత్తుకొనిపోగా మిగిలినదే మన అనుభవమునకు రాదగియున్నది. ఎప్పటికిని ఒత్తుగా నున్న పయిరునందు ఒక్కొక్క మొలకను పట్టి చూచితమా బలహీనమయి యుండును. పలచగా నున్నప్పుడు దుబ్బుకట్టి బలిష్టమయి యుండును.

మరియు జనాకీర్ణమయి యున్నచోట రోగము లతిశయింపకమానవు. ఇదివరకే పూర్వములేని విషూచి మొదలగు రోగములు మనదేశమున వ్యాపించి యున్నది. జనులెచ్చట మూగి యుందురో అచ్చటనే అసత్య దంభ చౌర్య వ్యభిచారాదులు ఎక్కువగా నుండును. పశువుల మేత కాధారముగా నున్న బీటినేలలు దున్నవలసి వచ్చును. గాన మేతకు బీటినేలలే లేక పశువులు నశించి సేద్యము లేకపోవును. అడవులు గొట్టి యిండ్లు గట్టవలసివచ్చును గాన యిండ్లు గట్టుకొనుటకు కొయ్యలే లేకపోవును. గనులు దవ్వి యినుము సంపాదింపవలసినందున యినుము దవ్వుటకు గనులే లేకపోవును. ఇదివరకు అన్యదేశములవారి చేత నాశ్రయింప బడుచున్న యీదేశము ఇతర దేశముల నాశ్రయింపవలసి వచ్చును. కాబట్టి దేశమింతకంటె జనాకీర్ణమగుటకు సేయు యత్నము మనకెంత నష్టకారి యగునో బుద్ధిమంతులు విచారించండి.

11. బీజంబులూడ్చి ముకుద్రాళ్ళు గట్టి వృషబంబులును విత్తులు దివిచీయ గొడిపిబాడీలు గట్టిన గుఱ్రంబులును, అలానమున బంధించి అంకుశమునకు దెచ్చిన యేనుగులును కొన్ని కార్యములకు మనకు ఎట్లా వశ్యకములై యున్నవో అట్లే కామంబు లడంచి కొని కనిపెంచుటలు లేని స్త్రీలును గొన్ని గృహకృత్యంబులకు మనకు గావలసి యున్నారనుట నిక్కము. వేయి వరహాలయినను విధవ తోబుట్టువునకు సమానము గాదను పూర్వోక్తి నిక్కమే. విధవల వలన ఈ దేశము పొందుచున్న యుపకారములను నేను వేరే చెప్పవలయునా. వారి వారి మనస్సులకే జక్కగా దెలియున్న యదియే.

12. స్త్రీలు స్వభావముగా అబలలయినను కామము నడచి కనిపెంచుటలు లేని వితంతువులలో నెందరు పురుషుల కంటె గూడ నెక్కువ బలము గలిగియున్నారో మనము చూచుటలేదా

13. ఎన్ని కాపురములకు విధవలు నిర్వాహకురాండ్రై యున్నారో మనమెరుగమా. సువాసినులు మాత్రమే కల కొన్ని యిండ్లలో విధవల యక్కర యెంతగా నుంచున్నదో చూడుండి. లోకములో నుండు వారందరును సువాసినులై యుండిరేని పరాదీనలైనవారిని యెవరిని పిలిచి మన అక్కర తీర్చుకోగలము. అట్టి అక్కరలలో కొన్ని పురుషులచే సాధ్యములైనను కొన్ని స్త్రీలే చేయవలసి యున్నవి. జీతములిచ్చి పురుషులను బెట్టి చేయించుకోచాలనివారే యనేకులున్నారు. వారల కందరికి తలలుజెడి యిండ్లంబడియున్న విధవలే గతి యగుట సామాన్యముగా జరుగుచున్నదే కాని క్రొత్తగా చెప్పునది కాదు.

14. కొన్ని దేశములలో విధవలు పొలము పాటు సయితము సేసి కుటుంబములను భరించుచున్నారు.

15. పురుష బంధువులు లేని యనేకులకు పిండక్రియలు సేయుటకు విధవలే గతియై యున్నారు. భార్యలు లేని యనేకులగు ముసలివాండ్రకు కుంటివాండ్రకు గుడ్డివారికి దీర్ఘరోగులకు సమీపబంధువులకు విధవలే దిక్కవుచున్నారు. ఏ యిరుగు పొరుగువారిని యీ పనులు చేయుమనిన చేతురు.

16. తమ సద్వర్తనముతో గూడిన స్వప్రయాసము వలన వేలకొలది సొమ్ము పోగుచేసి కూతుండ్రు, అల్లుండ్రు మొదలగువారి కిచ్చిన విధవలెందరు లేరు. తీర్థసేవలకు బ్రాహ్మణ సంతర్పణలకును వ్రతోద్యాపనములకును దేవాలయములు మొదలగు ఘనకార్యములకును తమ సొమ్ము వెచ్చము చేసిన విధవలెందరు లేరు. దర్భ్యులర్తియందు వినియోగపరిచిన ఒకానొక చెడుముండనే కొనియాడవలెనా.

కావున ఈ చెప్పంబడిన హేతువులే కావు విచారించిన నింకను లక్షహేతువు లున్నవి. బుద్ధిమంతులై తెలిసికొని నేర్చు వారికి ఇవియే చాలును లేదా యిక నేను కోటిహేతువులు చెప్పినను వారి మనసున కెక్కనే యెక్కవు.

ఒక విషయమందైనను మన పూర్వీకులకంటె మన మెక్కువ బుద్ధి

మంతులము కాము. కొన్ని సంగతులను బట్టి చూడగా ఈ విధవావివాహములు సేయయత్నించు వారలకు వేదశాస్త్రముల యందంతగా ప్రామాణ్యబుద్ధి లేనట్లే తోచుచున్నది. అయినను వేదశాస్త్రపురాణాదుల యందు విశ్వాసము గలవారికి ప్రతిపక్షులు సెప్పునది నిజమేమోననెడు భ్రాంతి కలగవచ్చును గాన అట్టి భ్రాంతిని నివారణము సేయుటకై స్త్రీ పునర్వివాహమును నిషేధించెడు స్వసిద్ధాంతమును తదనుకూల శాస్త్రమును ముందుగనపరిచి ప్రతిపక్షుల స్త్రీ పునర్వివాహము విషయమై చేసిన సిద్ధాంతమును నాబుద్ధికిప్పటికి దోచినంతమట్టుకు ఖండించుచున్నాడను.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

## శ్రీరస్తు

వేదమును శాస్త్రమును పురాణమును ప్రమాణములుగా గొని ఒక యంశము మంచిదా చెడ్డదా యని మనము విచారింపవలయును. ఈశ్వరోక్తము గాన వేదము ప్రమాణమైనను శాస్త్రములు పౌరుషేయములు గదా. యెట్లు ప్రమాణములు గావచ్చుననిన శాస్త్రములను జేసిన ఋషులు వేదము నందే కొనియాడబడి యున్నారు. గాన శాస్త్రములును ప్రమాణములే.

శాస్త్రములను జేసిన ఋషులు వేదము నందు కొనియాడబడి యున్నా రనినందుకు బ్రమాణములు యజుస్సంహిత శ్రుతి – “యద్వైకించ మనురవ దత్తద్భిషజమ్”. ఇందు మనువు వర్ణింపబడియున్నాడు.

**అరుణములు**

శ్రుతి – “సహూవాచ వ్యాసః పారాశర్యః” : ఇందు వ్యాసుండు గొనియాడంబడి యున్నాడు.

శ్రుతి – కౌశికాయానిర్త్రృత కౌశికాద్ధృతకౌశికః పారాశర్యాయణౌత్పారా శర్యాయణః । ఇందు కౌశికుడు మొదలగు వారు వర్ణింపబడియున్నారు. యజుస్సంహిత – శ్రుతి – అత్రిరదదారౌర్వాయ ప్రజాంపుత్రకామాయ : ఇందు అత్రి మొదలగువారు చెప్పబడి యున్నారు.

శ్రుతి – అథహయాజ్ఞ వల్క్యస్య ద్వేభార్యే బభూవతుః : ందు యాజ్ఞవల్క్యుడు

పేర్కొనంబడి యున్నాడు.

శ్రుతి స్మృతులు ప్రమాణములైన గావచ్చును. గాని పురాణములెట్లు ప్రమాణము లగుననిన – మూడు హేతువుల చేత పురాణములును ప్రమాణములని చెప్పవలసి యున్నది.

1. పురాణములు చెప్పిన వ్యాసుడు వేదవర్ణితు డగుటచేత,

2. శాస్త్రములందు పురాణములను గ్రహించదగునని చెప్పుటచేత,

3. వేదశాస్త్రవ్యాఖ్యాగతలగు మహాపురుషులు పురాణములను ప్రమాణముగా బుచ్చుకొనుటచేత.

పురాణములను చెప్పిన వ్యాసుడు వేదవర్ణితు డయినందునకు – యజస్సు అరుణములు – శ్రుతి – సహూవాచవ్యాసః పారాశర్యః

ఇందు వ్యాసులవారు వర్ణింపబడియున్నారు.

శాస్త్రములందు పురాణములను గ్రహించవలసిదని చెప్పి యున్నందునకు–

కణ్వస్మృతి – వైదికకర్మ నిర్ణయమునందు –

స్మృత్యుక్తం తాదసూత్రోక్తం పురాణోస్తామపి ధావాసమాచరేద్విధానేన భక్తి శ్రద్ధాపురస్సరం ఇందు పురాణోక్తమును గ్రహించవలసిదని చెప్పి యున్నది.

వేదశాస్త్ర వ్యాఖ్యాతలగు మహాపురుషులు పురాణములను ప్రమాణములుగా పుచ్చుకొన్నందునకు –

**కృష్ణయజుర్వేదభాష్యము – భారతశ్లోకము –**

స్త్రీ శూద్ర ద్విజబంధూనామ్ త్రయీన శ్రుతిగోచరాః ।

ఇతి భారతమాఖ్యానం । మునినా కృపయాకృతం

ఈ శ్లోకమును భాష్యకారులవారు ప్రమాణముగా గ్రహించినారు. ఇది గాక మరికొన్ని శ్లోకములును గలవు.

**పరాశరస్మృతి వ్యాఖ్యానమున మాధవాచార్యులు –**

## ఆదిత్యపురాణము

శ్లో ॥ ఉఢాయాః పునరుద్వాహం జ్యేష్టాంశం గోవధం
తధా । కలౌ పంచనకుర్వీత భ్రాతృజాయాంక మండలుం ।

ఈ శ్లోకము మాత్రమేకాక అనేక పురాణోక్త శ్లోకములను ప్రమాణములుగా బుచ్చుకొనయున్నారు.

కాబట్టి మనకు వేదశాస్త్ర పురాణములు మూడును ప్రమాణములై యున్నవనుట నిశ్చయము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

రాజమహేంద్రవరము నుండి వచ్చిన వివేకవర్ధిని యను పత్రిక యందు మనవారిది సువిద్య కాదనియు ఆ శాస్త్రముల యందు గొన్నిట బూతుకూతలున్న వనియు అవి చదివినవారు చెడిపోదురనియు వ్యర్థముగా దేవాలయములు మొదలగువానికి మనవారు అర్థవ్యయము జేయుట మంచిదికాదనియు విధవా మదనసదనకండూతి నివారణార్థమై వెచ్చము సేయుట యోగ్యతర మనియు మన పెద్దలు వ్రాసిన గ్రంథముల యందున్నవి తెలిసి తెలియని కూతలనియు నేమేమో వ్రాసియున్నారు.

ఈ సంగతులన్నియు జూడగా స్త్రీ పునర్వివాహ నిర్వాహకులకు మన వేదశాస్త్రముల యందు అంతగా నమ్మకమున్నట్లే తోచదు. అయినను వేదశాస్త్ర పురాణములు ప్రమాణములని నమ్మియున్న వారి కయినను ప్రతిపక్షులు చెప్పునది నిక్కమేమో యని భ్రాంతి కలగవచ్చును గాన ఆభ్రాంతిని నివారించుకొరకు స్త్రీ పునర్వివాహమును నిషేధించు వచనములను ముందు గనపరిచి అటుమీదట ప్రతిపక్షులు విదాయక శాస్త్రమున్నదని వ్రాసిన యంశములను నా సిన్నబుద్ధికిప్పటికి దోచినమట్టునకు ఖండించుచున్నాడను.

శ్రీరస్తు

స్త్రీ పునర్వివాహ నిషేధమును గూర్చి కనుపరపవలయు శాస్త్రమెట్టి యంశములు గలదిగా నుండవలయుననిన –

1. స్త్రీలకుం బునర్వివాహము సేయరాదు అనియు
2. స్త్రీలకుం బునర్వివాహము చేసినందున దోషము వచ్చును అనియు

3. స్త్రీలకు పునర్వివాహము చేసినందున నరకము గలుగును అనియు
4. స్త్రీలకు బునర్వివాహము సేయకుండుట మేలనియు
5. స్త్రీలకు బునర్వివాహము లేకున్న బుణ్యమనియు
6. స్త్రీలకు బునర్వివాహము లేకున్న స్వర్గము వచ్చుననియు
7. స్త్రీ పునిర్వివాహములు జరుగుచు వచ్చిన పూర్వయుగముల యందైనను అది సదాచారము కాదనియు
8. స్త్రీ పునర్వివాహము కలియుగమునందు బొత్తిగా నిషిద్ధమనియు
9. స్త్రీ పునర్వివాహము ఈ యుగంబున పూర్వమెప్పుదును ఏదేశము నందును జరుగలేదనియు
10. స్త్రీ పునర్వివాహము ఈ యుగమున పూర్వమునుండి జరగకుండుటం బట్టి యిపడాచరించుట దోషాపాదకమనియు
11. స్త్రీ పునర్వివాహము కులభ్రంశమును జేయుననియు
12. స్త్రీ పునర్వివాహమునకు విధానమేర్పడి యుండలేదనియు

ఈ పంద్రెండంశములకు వేదశాస్త్రపురాణాది ప్రమాణంబులు జూపవలయు. మొదటిది స్త్రీ పునర్వివాహము కూడదనినందుకు–

యజుస్సు - యదేకస్మిన్ యూపేద్వేరశనేపరివ్యయతి తస్మాదేకో
శ్రుతి - ద్వేజాయేవిందతేయన్నై కాగ్ం రశనాంద్వయోర్యూ
6 కాండ - పయోః పరివ్యయతి తస్మాన్నైకాద్వౌపతీవిందతే

దీనికి అర్థము ఏ కారణము వలన యూపస్తంభమునకు రెండు రశనలు కట్టవచ్చునో ఆ కారణము వలన ఒక పురుషు డిరువురు భార్యలను పొందవచ్చును. ఏ కారణమువలన ఒక రశనకు రెండు యూపములు కూడదో ఆ కారణమువలన ఒక స్త్రీ యిద్దరు పతులను పొందరాదు. దీని తాత్పర్యము చక్కగా గ్రహించిన యెడల స్త్రీలకు బునర్వివాహము కూడదని స్పష్టమగుచున్నది.

ఋగ్వేద బ్రాహ్మణము - శృతి

తస్మాదే కస్యటహ్వ్యా జాయాభవంతి నైకస్యై బహవస్స్యుః పతయః

దీని అర్థము ఒకని కనేక భార్యలు గల్గుదురు. ఒక స్త్రీ కనేకపతులు గలుగరు. ఇది బుద్ధిమంతులు విచారించిరేని స్త్రీ పునర్వివాహము కూడదని వెల్లడి యగుచున్నది.

మనుస్మృతి – 9 అధ్యాయము –

65 శ్లోకము – నోద్యాహికేషు మంత్రేషు నియోగః కీర్త్యతే క్వచిత్
సవివాహవిధానవుక్తం విధవావేదనం పునః

66 వ శ్లోకం – అయం ద్విజైర్హివిద్వర్భిః పశుధర్మోవిగర్హితః
మనుష్యాణామపి ప్రోక్తో వెనేరాజ్యం ప్రశాసతిః

విధవా వేదనము వైవాహిక మంత్రములయందు గానరాదనియు వివాహ విధులయందును జెప్పంబడి యుండలేదనియు, అది పశు ధర్మ మనియు దుష్టుడగు వేనుని ప్రభుత్వమందు గలిగినదనియుం జెప్పబడి యున్నది. విధవను జ్ఞాతికి నియోగించుటకూడను నిషద్ధమని మనువు తాత్పర్యమయినట్టు మనము గ్రహించవలసి యుండగా విధవలకు స్వేచ్ఛను వివాహములు చేసికొనుట కూడదని వేరే చెప్పవలయునా?

దీని వ్యాఖ్యానమునందు 'స్త్రీణామేకపతిత్వధర్మ మనాదిసిద్ధం' అనియు, 'నచ వివాహ విధాయక శాస్త్రే అన్యేన పురుషేణ సహ పునర్వివాహ ఉక్తః' అనియు గనుపడుచుండుటచే అట్టిది కూడదనుట స్పష్టము. రెండవది స్త్రీలకుం బునర్వివాహము చేసినందున దోషము వచ్చునని నందునకు.

నదత్వాకస్యచిత్కన్యామ్ పునర్దద్యాద్విచక్షణమ్

దత్వా పునః ప్రయచ్ఛన్హి ప్రాపోన్తి పురుషానృతమ్ – మనుస్మృతి

అర్థము ఇవ్వని కన్యను దిరుగా యివ్వవచ్చును గాని యిచ్చిన కన్యను దిరుగా యిచ్చెనేని పురుషానృతమను దోషమును పొందునని చెప్పబడియున్నది. గాన పునర్వివాహము వలన దోషము వచ్చుననుట యిందువలన స్పష్టమగుచున్నది.

మద్యపోవృషలీసక్తో విరహాదిధిషూసతిః

అగాందాహీకుండాశీ సోమవిక్రయిణోద్విజాః పతితాః – కూర్మపురాణము

ఇందు దిధిషూపతి యనగా ద్వితీయ వివాహస్త్రీని వివాహము చేసికొనినవాడని ప్రతిపక్షుల మతమందును అర్థమగుచున్నది. అట్టిది దిధిషూ సతిః పతితుడని చెప్పబడియున్నది. గాన స్త్రీపునర్వివాహము వలన దోషము వచ్చుననుట స్పష్టము.

పరివేత్తాతథాహింస్రః పరివిత్తిర్చిరాశ్చనీవౌసర్భవనకుసీణీచ
తథా నక్షత్ర దర్శకః –

కూర్మపురాణము

ఇందు వౌనర్భవుడనగా ద్వితీయ వివాహస్త్రీకి పుట్టినవాడు. వాడు పతితుడని చెప్పబడియున్నది. కాన స్త్రీ పునర్వివాహము వలన దోషము వచ్చుననుట స్పష్టము.

అక్షతాయాం క్షతాయాంచ జాతౌ వౌనర్భవామతౌ
తౌచాపినిందితౌపాపౌ పుత్రాభావౌ ప్రకీర్తితౌ
ఆకీర్తికారకౌ బంధు జనానాం దూషితౌఖలు అతినైచ్యంగతౌ హేయౌ
ధర్మశాస్త్రప్రదూషితౌ పితృదోషైకజననౌ నయోగ్యౌ యస్య కస్యచిత్
– లోకహిత స్మృతి

ఇందు ద్వితీయస్త వివాహస్త్రీకి బుట్టిన వౌనర్భవులనే వాండ్రు నీచులు శాస్త్రదూషితులు. దోషైక జననులు, అకీతిన్ కారకులు, అయోగ్యులు నని చెప్పబడియున్నది. కాన స్త్రీ పునర్వివాహము వలన దోషము వచ్చుననుట స్పష్టము.

మూడవది స్త్రీపునర్వివాహము వలన నరకము వచ్చుననినందుకు –

ఛేదయంత్యతివృక్షాంశ్చ వనారామవిభంజకాః
వ్రతం తీర్థం పరిత్యజ్య విధవాశీలనాశకాః
భర్తారందూపయేన్నారీ పరం మనసిధారయేత్
ఇత్యాద్యాశ్శాల్మలీవృక్షే భంజంతే బహుతాడనం
తాడనాత్పతితాన్దూతాః క్షిపంతి నరకేషుతాన్
– గరుడపురాణము

ఇందు వ్రతతీర్థాదులను వదిలించి విధవల శీలమును బోగొట్టువారిని నరకము నందు శాల్మలి వృక్షమున బంధించి క్రిందబడువరకు దెబ్బలు గొట్టి

యమదూతలు ఈడ్చుకొనిపోవుదురని చెప్పబడియున్నది. కాన స్త్రీ పునర్వివాహము నరకమును గలుగజేయుననుట స్పష్టము.

నాల్గవది స్త్రీలకుం బునర్వివాహము లేకుండుట మేలనినందునకు –

మృతేజీవతివాపత్యౌ యానాన్యముపగచ్ఛతి

సేహకీర్తి మవాప్నోతి మోదతే చోమయాసహ – యాజ్ఞవల్క్యస్మృతి

ఇందు పెనిమిటి యున్నప్పుడుగాని చనిపోయిన పిమ్మటగాని యితర వరుని పొందకుండెనా ఇహపరములు గలవని చెప్పి యున్నదిగాన దీనివలన స్త్రీ పునర్వివాహము మానెనా మేలని తేటపడుచున్నది.

అయిదవది స్త్రీలకుం బునర్వివాహము లేనందునం బుణ్యము గలుగు ననినందుకు –

ఉపకారాయ సాభర్తుజీన్ నత్యేషాపతివ్రతా

జీవితం సఫలంతస్యాః యాపరంనభజేత్పతిం – గరుడపురాణము

ఇందు ఎవ్వతె పెనిమిటి పోయిన పిమ్మట బ్రతికియుండి మరల పెండ్లిజేసికొనక యుండునో దాని బ్రతుకు పుణ్య యుక్తమయిన బ్రతుకని చెప్పబడియున్నది. గాన ఇందువలన స్త్రీ పునర్వివాహము చేసికొనకుండెనా పుణ్యము గలుగుననుట నిశ్చయము.

ఆరవది స్త్రీపునర్వివాహము చేసికొనకపోయెనా స్వర్గము గలుగునని నందునకు –

మృతేభర్తరియానారి బ్రహ్మచర్యేవ్యవస్థితా

సామృతాలభతేస్వర్గం యధాతేబ్రహ్మచారిణః – పరాశరస్మృతి

ఇందు పెనిమిటి పోయిన పిమ్మట స్త్రీ బ్రహ్మచర్యము జేసెనా బ్రహ్మచారులకు గలుగు స్వర్గము గలుగునని చెప్పబడి యున్నది. కాన స్త్రీలకుం బునర్వివాహము లేకుండినందున స్వర్గము కలుగునని యిందువలన స్పష్టముగా తెలియుచున్నది.

నమ్రియిత సమంభర్త్రా బ్రాహ్మణీశోకమోహితా

ప్రవ్రజ్యాగతిమాప్నోతి మరణాదాత్మఘాతినీ – వ్యాఘ్రపాదస్మృతి

ఇందు సహగమనము కంటెను గూడ బ్రహ్మచర్యము మంచిదనియు అందువలన సన్యాసులకు వచ్చు స్వర్గము వచ్చుననియుం జెప్పబడి యున్నది. కాన స్త్రీలకు పునర్వివాహము లేకుండెనా స్వర్గము వచ్చుననుట స్పష్టము.

ఏడవది స్త్రీ పునర్వివాహములు జరుగుచు వచ్చిన పూర్వయుగముల యందయినను అది సదాచారము కాదనినందునకు

ఉక్తానియోగా మునినా నిషిద్ధాస్స్వయమేవతు
యుగక్రమాదశక్యోయం కర్తుమన్యైర్విధానతః
తపోజ్ఞానసమాయుక్తా కృత్రేతాయుగే నతాః
ద్వాపరేచ కలౌన్నృణాం శక్తిహానిర్వినిర్మితా - బృహస్పతి

ఇందు కృత త్రేతాయుగముల యందు తపొల్జ్ఞావసంపన్నులయిన వరులు విధవలు బెండ్లియాడ సమర్థులైరనియు అది స్వతఃనిషిద్ధమనియు ఈ యుగముల యందు అట్లు జరిగింపజాలరనియు జెప్పబడియున్నది. కానదీన పూర్వయుగములయం దైనను ఇది సదాచారము కాదని తెలియుచున్నది.

నోద్వాహికేషమంత్రేషు నియోగః కీర్త్యతేక్వచిత్
నవివాహ విధావుక్తం విధవా వేదనంపునః
అయం ద్విజైర్హిసిద్వద్భిః పశుధర్మోవిగర్హితః
మనుష్యాణామపి ప్రోక్తో వేనేరాజ్యంప్రశాసతి - మనుస్మృతి

ఇందు విధవావేదనము వైవాహిక మంత్రముల యందు గానరాదనియు గృహవిధుల యందును చెప్పబడియుండలేదనియు అది పశుధర్మమనియు దుష్టుడగు వేనుని ప్రభుత్వమందు జరిగినదనియు జెప్పబడి యున్నది. కృతయుగమునందైనను విధవావేదనము సదాచారము కాదని తెలియుచున్నది.

మనుస్మృతి యందు సాధారణముగా చాలామట్టునకు కృతయుగ ధర్మములనే వివరింపబడుచుండును. ఇందుకు 'కృతేతుమానవాధర్మాః' అనుటయే ప్రమాణము. కాబట్టి అట్టి మనుస్మృతి యందే విధవావేదనమును మిక్కిలి నిందించియు జరుగుచున్న దానిని వదిలివేయలేక యధావిధి గాని యుక్తురాలయిన విధవ జ్ఞాతి వలన నొక పుత్రుని మాత్రము బడయవచ్చు ననియు యధేష్టముగా కామముచేత నియమము విడిచి ప్రవర్తింపరాదనియు స్పష్టముగా

జెప్పబడియున్నది. కావున కృతాదియుగముల యందును విధవా వేదనము సదాచారము కాదనుట నిశ్చయము.

ఎనిమిదవది స్త్రీ పునర్వివాహము కలియుగమునందు బొత్తిగా నిషిద్ధమని నందుకు –

దేవరాచ్చసుతోత్పత్తిర్దత్తాకన్యా నదీయతే

నయజ్ఞేగోవధః కార్యః కలౌనచకమండలుః – మనుస్మృతి

ఇందు కలియుగము నందు ఈబడిన కన్య తిరుగా యీబడదని చెప్పబడియున్నది. కాన కలియుగము నందు స్త్రీపునర్వివాహము బొత్తిగా వ్యర్థమని తేటబడుచున్నది.

విధవాయాం ప్రజోత్పత్తౌ దేవరస్య నియోజనం

బాలికాక్షతయోన్యోశ్చణావరేణాన్యేన సంస్కృతిః

కన్యా మసపర్ణానాం వివాహశ్చ ద్విజాతిభిః – యజ్ఞసమయము

ఇత్యాది

ఏతాని లోకగుప్త్యర్థం కలౌరాదౌ మహాత్మభిః

నివర్తిని కర్మాణి వ్యవస్థాపూర్వకంబు ధైః

ఈ శ్లోకముల యందు అక్షత యోనికల పునర్వివాహము పూర్వయుగముల యందున్నప్పటికిని యీ యుగము నందు బొత్తిగా నిషిద్ధమయినట్లు స్పష్టముగా జెప్పబడియున్నది.

ఊఢాయాః పునరుద్వాహం జేష్టాంశం గోవధంతదా

కలౌ వంచనకుర్వీత భాత్రృజాయాం కమండలుం – ఆదిత్యపురాణము

ఇందు వివాహితకు తిరుగా వివాహము కలియుగమునందు గూడదని చక్కగా జెప్పబడియున్నది. కాబట్టి దీనివలన స్త్రీ పునర్వివాహము కలియుగంబున బొత్తిగా నిషిద్ధమని తేటపడుచున్నది.

తొమ్మిదివది స్త్రీ పునర్వివాహము ఈ యుగమున యే కాలమునందును ఏదేశమునందును జరగలేదనినందునకు –

ఈ యంశమును తెలుపుటకు విశేషప్రయాసము పనిలేదు. యేమనగా స్త్రీ పునర్వివాహమీ కలియుగమునందు పూర్వమే కాలమందును ఏదేశమందును జరగకయున్నదనియు అది బాగుగా నుండలేదనియు ఇప్పుడు తిరుగా దానిని యుద్ధరించుట మేలనియు ప్రతిపక్షుల వాదమై యున్నందునను నిజముగా మనము చదువుచు వచ్చిన విక్రమార్కచరిత్రము, చంద్రగుప్తచరిత్రము, భోజరాజచరిత్రము, ప్రతాపరుద్రచరిత్రము, ముక్కంటి చరిత్రము, కృష్ణరాయ చరిత్రము ఈ మొదలగు పూర్వచరిత్రల వలన నేమి అప్పయదీక్షితుల వారి కథ మొదలగు మనము చూచుచున్న కొన్ని కథల వలన నేమి హూణప్రభువులు వ్రాయించిన కొన్ని నవీనచరిత్ర గ్రంథముల వలననేమి సర్వదా యీ దేశమందు స్త్రీ పునర్వివాహము లేనట్టే నమ్ముచున్నాము. గాన స్త్రీపునర్వివాహము పూర్వకాలమందు గలదా లేదా యని విచారింపవలసిన ప్రసక్తి దోచలేదు.

పదియవది పూర్వాచారము లేని పని జరిగించుట దోషాపాదక మనినందుకు –

శాఖాంపుండ్రం తథాసూత్రం సమయాచారమేవచ
పూర్వైరాచరితంకుర్యా దన్యథాసతితోభవేత్

ఇందు సమయాచార మనగా పెద్దలేర్పరిచిన కట్టుదిట్టము. అది పూర్వీకులాచరించినట్టే యాచరించవలయుగాని మరియొక విధముగా నాచరింపరాదనియు అట్లాచరింతిమా పతితుల మగుదుమనియు జెప్పబడియున్నది.

గణద్రవ్యం హరేద్యస్తు సంవిదం లంఘయేచ్చయః
సర్వస్వహరణంకృత్వా తంరాష్ట్రాద్వి ప్రవానయేత్ – యాజ్ఞవల్క్యస్మృతి

పెద్దల యేర్పాటును మీరినవాని యావద్ద్రవ్యమును రాజు హరించి వానిని దేశమునుండి వెడలగొట్టవలయునని చెప్పబడియున్నది.

నిగృహ్యదాపయేచ్చైనం సమయవ్యభిచారిణం
చతుస్సువర్ణాన్ షణ్ణిష్కాన్ శతమానంచ రాజతం – మనుస్మృతి

పెద్దల యేర్పాటును మీరినవాని విధింపవలయు దండుగను గూర్చి యిందు చెప్పబడియున్నది.

అవశ్యపితురాచారం – మనుస్మృత్యంతరము

పెద్దల యాచార వరవశ్యానుష్టేయమని యిందు జెప్పబడియున్నది.

సర్వాగమానాచారః ప్రథమః పరికీర్తితః – గర్గస్మృతి

సమస్త శాస్త్రములకును ఆచారము మొదటిదని యిందు జెప్పబడి యున్నది.

యద్యపిసిద్ధం లోకవిరుద్ధం నాదరణీయం నాచరణీయం
– శంకరాచార్యులు

శాస్త్రసిద్ధ మయినప్పటికిని యాచారములేని పనిని యాచరింపరాదు. ఆచరింపరాదని యిందు జెప్పబడియున్నది.

యస్మిన్ దేశేయ ఆచారః పారంపర్యేణ వర్తతే
శ్రుతిస్మృత్యవిరోధేన సదాచారస్స ఉచ్యతే – మనుస్మృతి

ఇందు ఏదేశ మందు ఏ ఆచారము పారంపర్యముగా వచ్చుచున్న దాదేశమందు ఆయాచారము శ్రుతిస్మృతులకు విరోధముగా నుండదేని యది సదాచారమని చెప్పబడియున్నది.

కాబట్టి వీనివలన విచారింపగా యెన్నడును ఈదేశమందాచరింపబడని ఈ స్త్రీ పునర్వివాహమును ఆచరించుట దోషాపాదకమని స్పష్టముగా దెలియుచున్నది.

పదునొకొండవది స్త్రీ పునర్వివాహము కులభ్రంశమును జేయునని నందుకు –

కానీనశ్చ సహూఢశ్చ క్రితః పౌనర్భవస్తథా
స్వయందత్తశ్చశౌద్రశ్చ పడదాయాదబాంధవాః – మనుస్మృతి

ఇందు పౌనర్భవుడనగా మారుమనుము దానిబిడ్డ లేక మారుమనువు దానిమగడు. వీంద్రు దాయాదములేని బంధువులని చెప్పబడియున్నది. జాతి నిల్చియున్న యెడల దాయాదమేల లేకపోవును. కాబట్టి యిందువలన స్త్రీపునర్వివాహము కులభ్రంశమును జేయుననుట నిశ్చయము.

ద్వితీయెవతుయః పిత్రా సవర్ణాయాం ప్రజాయతే
అవావటఇతిఖ్యాతః శూద్రధర్మోస్యజాతితః – దేవలస్మృతి

ఇందు రెండవపెండ్లి చేసుకొనిన యాడుదానికి బుట్టినవాడు శూద్రధర్మము గలవాడని చెప్పబడియున్నది. కావున స్త్రీ పునర్వివాహము జాతి భ్రంశమును జేయుననుట నిశ్చయము.

కులాలచిత్రకాన్నంచ వార్థుషేః పతితస్యచ
పునర్భువశ్చిత్రకస్య హ్యభిశస్తస్యచైవహి - కూర్మపురాణము

ఇందు పునర్వివాహస్త్రీని వివాహము చేసికొనినవాని యన్నము తినకూడదని చెప్పబడియున్నది. కావున స్త్రీపునర్వివాహము జాతిభ్రంశమును జేయుననుట దీనివలన తేటపడుచున్నది.

పంద్రెండవది స్త్రీపునర్వివాహమునకు విధానమేర్పడియుండలేదని నందుకు- వివాహము నందు వరుడు చెప్పుచున్నాడు.

సోమః ప్రథమోవివిదే గంధర్వోవివిధఉత్తరః
తృతీయె అగ్నిష్టేషతిః తురియస్తే మనుష్యజాః - శ్రుతి

ఇందు మొదట గన్యను బొందువాడు సోముడనియు, బిమ్మట గంధర్వుడినియు దర్వాత అగ్నియనియు దుదకు మనుష్యుడనియుం జెప్పబడియున్నది.

హెూమములు సోమయూజ నివిదేస్వాహా గంధర్వాయుజ నివిదేస్వాహాగ్నయేజనివిదేస్వాహా అని యున్నది గాని చనిపోయిన పెనిమిటులు జెప్పబడలేదు. కాబట్టి పునర్వివాహమునకు ప్రథమపతయేజ నివిదేస్వాహా ద్వితీయపతయేజ నివిదేస్వాహా తృతీయపతయేజ నివిదేస్వాహా యని యిప్పుడు కొన్ని క్రొత్తగా జేర్చవలసి వచ్చుచున్నది. కావున స్త్రీ పునర్వివాహమునకు విధానమేర్పడి యుండలేదనుట స్పష్టము. యోక్త్రము గట్టునపుడు వివాహకాలమునందు ఈ మంత్రము జెప్పుచున్నారు.

ఆశాసానాసౌమనసమిత్యాహ మేధ్యామేవైనాం కేవలీం కృత్వా
అశిషాసమర్థయతి అగ్నేరనువ్రతాభూత్వా సన్న హ్యేసుకృతాయ
కమిత్యాహ ఏతద్వైపత్న్యై వ్రతోపనయనంతేవై వైనాంవ్రతముపనయతి
యోక్త్రము గట్టుటయే స్త్రీలకుపనయనము - శ్రుతి

అట్టి ఉపనయనములేని వివాహ మిదివరకు లేదు. ఇకముందు స్త్రీపునర్వివాహములు చేసెడియెడల రెండు మూడుసార్లు ఉపనయనము కూడదు గాన మానవలసివచ్చును. కావున దీనివలన పునర్వివాహమునకు విధానమేర్పడి యుండలేదనుట స్పష్టము.

ప్రతివివాహము నందు 'సుకన్యాం కనకసంపన్నాం సర్వాభరణ భూషితాం' అని చదువుచున్నారు. ఇక పునర్వివాహములు చేసెడియెడల 'ఊఢాం వైధవ్యసంపన్నామ్ సర్వాభరణవజిన్‌తాం' అని చదువవలసి వచ్చును.

కాబట్టి యీ మొదలయిన యనేక హేతువుల వలన స్త్రీ పునర్వివాహమునకు విధానమేర్పడి యుండలేదనుటకు లేశమును సందేహములేదు.

ఇకను స్త్రీపునర్వివాహము శాస్త్రసమ్మతమని చెప్పెడివారు ఎట్టిశాస్త్రమును గనపరపవలయునో విచారింతము –

1. స్త్రీపునర్వివాహము సేయవచ్చుననియు
2. స్త్రీ పునర్వివాహము వలన దోషము లేదనియు
3. స్త్రీ పునర్వివాహము వలన కులమునకు బాధలేదనియు
4. స్త్రీ పునర్వివాహము కలియుగ నిషిద్ధము కాదనియు
5. స్త్రీ పునర్వివాహమెప్పటికిని సదాచారమనియు
6. స్త్రీ పునర్వివాహమునకు విధానమేర్పడియున్నదనియు

ఈ యారంశములకు దగిన శాస్త్రము గనపరచిరేని చాలునని నాకుందోచుచున్నది. అయినను ఇదివరకు ఈ విషయమై ప్రయాసపడిన ప్రతిపక్షులలో నొక్కరును ఇందొక యంశమున కయినను దగిన శాస్త్రమును గనపరచిరని నేను నమ్మను. కాని వారు కొన్ని స్మృతిశ్లోకములను, గొన్ని శ్రుతులును తమ కనుకూలములుగా నున్నవని భ్రమించి వానిని వ్రాసి యున్నారు. అందు మొదటిది స్త్రీ పునర్వివాహము చేయవచ్చుననినందునకు ప్రతిపక్షులు వ్రాసినది.

"శ్రుతి యదేకస్మిన్‌యూపే" ఈ శ్రుతివలన సమకాలమునందొక స్త్రీ పలువురు పతులను పొందరాదని అర్థము వచ్చుచున్నది. గాన భిన్నకాలముల యందు కూడునని స్పష్టమగుచున్నదని ప్రతిపక్షులు వ్రాసినారు.

**ఖండనము**

1. యూపస్తంభము పోయిన పిమ్మట దానికి గట్టిన రశనకు మరియొక యూపస్తంభమును గూర్చుట యే క్రతువు నందును గానము.
2. దేశాంతరగతులైన మాత్రముచేత సమకాలమునందే స్త్రీ యితరుని జేసుకొనవచ్చునని చెప్పుచున్న ప్రతిపక్షులు తామే సమకాలమందు కూడదని చెప్పనవకాశము లేదు.
3. ద్రౌపది మొదలగు ననేక స్త్రీలు సమకాలమందే అనేక పతులు గలవారైనని భారతాది గ్రంథములయందు గనపడుచున్నది.
4. సమకాల భిన్నకాలములని గాని యాయర్థమువచ్చునట్టిగాని పదములుపయి శ్రుతియందు లేవు. కాబట్టి యీ నాల్గు హేతువులవలనను పయి శ్రుతికి ప్రతిపక్షులు వ్రాసిన యర్థము అసంగతమయినట్లు నేనే వేరే చెప్పనక్కరలేదు.

తస్మాదేకస్య బహ్వ్యోజాయాభవంతి । నైకస్యై బహవస్సహపతయః

గ్రహణం సహశబ్దస్య పర్యాయాద్బహవోధవాః స్యుతితిపత్రివత్యర్థం

ప్రజాపత్యవచోస్తథా (శ్రుతి), పయి శ్రుతియు భాష్యమునందలి క్రింది శ్లోకమును వ్రాసి శ్రుతియందు సహశబ్దమున్నదనియు ఆ సహ శబ్దమున కర్థము. భిన్నకాలములందు స్త్రీలకు బహుపతులు గలుగుదురని వ్యాఖ్యాతలే వ్రాయుచున్నారు. గాన నిందువలన స్త్రీ పునర్వివాహము సేయవచ్చుననియు ప్రతిపక్షులు చెప్పుచున్నారు.

**ఖండనము :**

మంత్రవిధి నామధేయములందు ఇది విధియా తదితరమా యని యాలోచింపవలయు. ఇది మంత్రము గాని విధిగాదనిన యందరును ఒప్పుకొనవలసినదే. కావున ఈ శ్రుతి స్త్రీ పునర్వివాహమును విధంపనేరదు. 'స్యుః' అను పాఠము కూడ నున్నది. అప్పుడీయర్థమునకే అవకాశము లేదు.

కులము విడిచిన చెడిపెలకు పర్యాయమందు పతులనేకులున్నారు. కాన అట్లుండుదురని చెప్పినను చేసుకోవచ్చునని చెప్పినట్లు కాదు.

కులస్త్రీలకి సమకాలమందే కొన్ని నిమిత్తములచేత పునర్వివాహము కూడునని చెప్పెడివారికి భిన్నకాలమందు కూడునని చెప్పుట కవకాశము లేదు.

ద్రౌపది మొదలగువారికి సమకాలమందే యనేక పతులుండిరిని కానబడుచున్నది.

'బహవోధవాః' అనునప్పుడు 'బహవఃఅధవాః' అని విభజించి అనేకులగు ధవసదృశులు కలుగుదురనియైనను చెప్పవచ్చును. కాబట్టి ఈ హేతువుల వలన విచారించగా యీా శ్రుతి స్త్రీపునర్వివాహమును చేయువచ్చునని చెప్పుచున్నదన్నమాట నమ్మదగినది కాదనుట స్పష్టము.

పయిన వ్రాసిన రెండు శ్రుతులకును సమకాలమునందు స్త్రీకి పునర్వివాహము నిషేధము గాని భిన్నకాలములయందు నిషేధముకాదని చెప్పిననూ యింకొక బాధ కూడను వచ్చుచున్నది. అది యేమనగా భిన్నకాలమనగా పెనిమిటి చచ్చిన పిమ్మట యని యర్థము. చేసితిమా ఈ యర్థము యే భాష్యమందు, ఏ శాస్త్రమందు, ఏ పురాణమందు వ్రాసియున్నదో ప్రతిపక్షులు చెప్పవలసి యున్నది. కొన్ని స్మృతులలో జెప్పబడియున్న ప్రకారము దేశాంతరగమనాది నిమిత్తముల చేత పురుషుని విడచియుండుటయే భిన్నకాలమని చెప్పియున్న యెడల షండుని భార్యకు గతిలేకపోవును. పురుషసాంగత్యమే నిమిత్తము చేతనేని లేకపోవుటయే భిన్నకాలమని చెప్పినట్టయిన పెనిమిటితో కలహించిన స్త్రీకూడ పునర్వివాహము చేసుకొనవచ్చునని చెప్పవలసి వచ్చును. వేరు వేరు కాలములని చెప్పితమా పురుషునకు సమకాల బహువివాహములు కలవనుట వివాహము లేక కాలమందు జరిగిననయనియో లేక యేకముహూర్తమందే బహుస్త్రీలతో సాంగత్యము చేయుచున్నాడనియో యేకకాలమందే యీా పురుషునకు అందరును భార్యలని వ్యవహరింపబడుటచేతనో విచారింపగా మొదటిదికాదు. ఎందువలననగా బహుసంవత్సరము నందు ఒకదానిని పెండ్లి చేసికొని తరువాత సంవత్సరము నందు మరియొకదానిని పెండ్లియాడెనేని యా యిద్దరును జీవించి యున్నప్పటికీ అవి సమకాల వివాహములు కాకపోవలసివచ్చును. రెండవది కాదు. ఏలననగా ఏ పురుషుడును సమముహూర్తముననే బహుస్త్రీలను సంభోగింపనేరడు. మూడవదియు కాదు. ఏ నరుడైన ఒకతె పోయిన పిమ్మట మరియొకదానిని వివాహము చేసికొనెనేని చనిపోయినదియు బ్రదికియున్నదియు ఏకకాలమందే

యీ పురుషుని భార్యలని వ్యవహరింపబడుచున్నారు. ఎట్లనగా దేవత్తుని ప్రథమ భార్య ద్వితీయభార్యకంటె గుణవంతురాలయి యుండెను. ఈ మాటయందు తప్పేమి యున్నది. ఇంకను సూక్ష్మవిచారము చేసితమా యీ సమకాల భిన్నకాలముల మాటలకు యే మాత్రమును ఈ వివాహ విషయమునందు సంబంధము కానరాదు.

పురుషులకు సమకాలమందే బహువివాహములు కూడుననియు స్త్రీలకు భిన్నకాలములయందు బహువివాహములు కూడునని ప్రతిపక్షులు చెప్పినట్లు వేదములయందే యున్నదనుట నిజమయినయెడల శాస్త్రముల యందెక్కడనయిన యా యర్థమును చక్కగా ఋషులు పరిష్కరింపనే పరిష్కరింతురు. పయిగా పూర్వయుగములయందు విధవా ధనము అనగా జ్ఞాతిని నియోగించుటకూడను పశుధర్మమనియే చెప్పుదురు. ఉదీర్ష్వనారి మొదలగు ఈ క్రింద వ్రాయంబడియెడి విత్రము. ప్రత్యనాక్షము (మధ్యమపురుష) గా నున్నందున విధిగాకపోయినను హస్త గ్రాభస్యదిధిషువునకు చనిపోయినవాని జ్ఞాతిని నియోగించుటకు కొంచెమభ్యనుజ్ఞ యిచ్చుచున్నందున తపోజ్ఞాన సంపన్నులయిన కృతాదియుగముల యందలి మహాపురుషులలో కొందరు మాత్రమా యాచారము కొంతకాలము వరకవలంబించిరి గాని యిప్పుడు ప్రతిపక్షులు తెలియజేయుచున్న సమకాలభిన్నకాలములనెడి స్వకపోల కల్పిత యుక్తిసామర్థ్యము వలన గాదు.

“ఉదీర్ష్వనార్యభి జీవలోకమితాసమేతముప శేష ఏహిహస్తగ్రాభస్యదిధి షోస్త్వమే తత్పత్యుర్జనిత్వమభిసంభూవ.”

1. ఈ శ్రుతిప్రత్యక్షము (మధ్యమపురుషము) గాన మంత్రముగాని విధికాదు. కాబట్టి యిందలి యర్థమెట్లుండినను ప్రయోజనము లేదు.

2. ప్రతిపక్షులు చెప్పినట్లే యెల్లవిధములను పునర్వివాహము చేసికొనవచ్చునని యీ శ్రుతి చెప్పినట్లయిన హస్తగ్రాభస్య యను పదము పత్యుః - అను పదమునకు సార్థక్యము బొత్తిగా లేదు. అదేమనిన దిధిషోర్జనిత్వ మభిసంభూబవ అని యుండిన చాలును. మరియేమనిన హస్త గ్రాభస్య। మున్ను పెండ్లాడిన వాని సంబంధియయిన దిధిషోః దిధిషు వను పేరుగల, పత్యుః పెనిమిటికి, జనిత్వం - భార్యాత్వమును, అభిసంబభూవ - పొందుమా. ఇట్లర్థము

చేసినయెడల చనిపోయిన వాని భార్య జ్ఞాతికిని యుక్తురాలు కావచ్చునను నర్థము స్పష్టమగుచున్నది.

శ్రు ॥ ఇయం నారీపతిలోకం వృణానాని వద్యత ఉపత్వామర్త్యప్రేతం
విశ్వంపురాణమనుపాలయంతి తస్యైప్రజాం ద్రవిణంచేహదేహి

ఈ మంత్రమును విధికాదు. పయిన వ్రాసిన మంత్రమును ఇదియును మృతభర్తృకను జ్ఞాతికి నియోగించుట కభ్యనుజ్ఞను తెలుపుచున్నవియే గాన నిందు విషయమయి మిక్కిలి వ్రాయవలసినది లేదు. ప్రతిపక్షులు స్త్రీ పునర్వివాహవిధులుగా రెండథర్వణ శ్రుతులను వ్రాసియున్నారు అవి స్త్రీ పునర్వివాహమును విధించుచున్న వనుట పరిహాసకారణము.

శ్రు ॥ యాపూర్వంపతింవిత్వా అథాన్యం విందతేపతిం పంచౌదనంచ
తావజం దదాతోనవియోపతః । సమానలోకోభవతి పునర్భువా
పరః పతిః । యోజంపంచౌదనం దక్షిణాజ్యోతి వందదాతి
ఒక పెనిమిటిని మొదట బొంది మరియొక పెనిమిటిని బొందెనా ।

అజాపంచౌదనమును ప్రాయశ్చిత్తము వలన పునర్భువుతోడ సమానలోకము గలుగునని శ్రుతి యందున్నంత మాత్రము చేతనే పునర్వివాహము కూడునని చెప్పుట జూడగా కల్లు దాగిన బ్రాహ్మణుడు కృఛ్రత్రయము వలన బవిత్రుడగునని చెప్పినంత మాత్రముననే బ్రాహ్మణుడు కల్లుదాగవచ్చునని చెప్పుట వలెనే యున్నది.

ఉతయత్పతయోదశస్త్రియాపూర్వే అబ్రాహ్మణాః ।
బ్రహ్మేచేత్ హస్తమగ్రహీత్ నఏవపతిరేధాబ్రాహ్మణా
ఏవపతిన్నరాజన్యోన వైశ్యా । తత్సూర్యప్రబ్రువానితి
పంచేభ్యో మానవేభ్యః – శ్రుతి, అధర్వణము

ఒక స్త్రీకి మొదట బ్రాహ్మణులు కానివారు పదిమంది భర్తలై ఆమెను బ్రాహ్మణుడు పాణిగ్రహణము చేసికొను పక్షమున అతడే యామెకు పెనిమిటి యనియు బ్రాహ్మణుడే పతిగాని రాజన్యుడును, వైశ్యుడును పతిగాడనియు. ఈ యర్థమును ఐదుజాతుల మానవులకును సూర్యుడు వాలుచు తిరుగుచున్నాడనియు పయి శ్రుతి బోధించుచున్నది. అని ప్రతిపక్షులు వ్రాసిరి.

ఈ మంత్రార్థము ననుసరించి ప్రతిపక్షులు ప్రవర్తింపబూనినయెడల వర్ణాశ్రమధర్మము లెంతచక్కగానైన నీదేశమందు వృద్ధి బొందుననుటకు లేశమయినా సందేహమున్నదా అదియేమనిన ఒకతె మొదట మాలవానిని వివాహము జేసికొని పిమ్మట నొక మంగలవానిని తరువాత చాకలివానిని పిదప నొక కోమటిని తదనంతర మొక క్షత్రియుని తుదకొక బ్రాహ్మణుని వివాహము జేసికొని యాబ్రాహ్మణుడు జేయు సోమచయన వాజపేయాది యాగముల యందు సోమిదేవమ్మనని పొగడ్తకెక్కుట కూడదని యనువారు వేదబాహ్యులు గారా? అ హహ యేమి చిత్రము, విధవావివాహ నిర్వాహకులకు ఆడబోయినం దీర్ఘ మెదురాయెనన్నినట్లు దొరికినదికదా. చక్కని శ్రుతిభాగ్యము. సరేకాని యీ శ్రుత్యర్థము మన ప్రతిపక్షుల మతము ననుసరించినవారు గైకొనిన ప్రచించిరేని మనమేమియు ననవలదు గాని మనమీ శ్రుతికి మరియొక యర్థమున్నదేమో లేక యది స్త్రీ పునర్వివాహముల నిమిత్తమే చెప్పబడినదో అది గట్టిగా నాలోచించుకొని గాని అట్లు ప్రవతింపవలదు ఏమనిన బ్రాహ్మణబీజంబు వలన చండాలికి బుట్టినవాడయినను నమస్కారార్హుడు అనినప్పుడు బ్రాహ్మణుడు చండాలిని వివాహము చేసుకొనవచ్చునని యర్థము సేయరాదు. మరియేమనగా జేయవలయుననిన బ్రహ్మతేజస్సు సర్వోత్కృష్టమనియే చేయవలయును. ఆర్థవాదనలగా నివియే కాబట్టి పయిశ్రుతికిని బ్రాహ్మణుడు సర్వోత్కృష్టుడుగా సూర్యుడు చాటుచున్నాడని యర్థన్ము గాని ఒకతె నీచజాతులవారిని పదిమందిని మొదట వివాహము జేసికొన వచ్చుననియు బిమ్మట బ్రాహ్మణుని వివాహము జేసికొన వచ్చుననియు అట్లు జరిగించినది సోమిదేవమ్మ కావచ్చుననియు అర్థము కాదు. గనుక పయిశ్రుతికి ప్రతిపక్షులు జేసిన యపార్థము యొక్క చక్కదనమును వారే మెచ్చుకొనవలయు గాని మనము మెచ్చవలసినది కాదు. ఈ పయిన వ్రాసిన యన్ని హేతువుల వలనను ప్రతిపక్షులు తమ కనుకూలములని నమ్మిన శ్రుతులు తోడనె ప్రతికూలము లైనందున దీర్ఘవిచారగ్రహస్తులుగాకమానరని నాకు తోచుచున్నది.

వేదములయందు స్త్రీ పునర్వివాహము చేసికొనవచ్చునని యున్నప్పటికిని యట్లాచరించలేదు. గాన మనమందరమును వేదవిశ్వాసరహితులమై నట్లును కావున మనము కర్మచండాలురమైనట్లును ప్రతిపక్షులు మనకు బుద్ధి చెప్పుచున్నారు.

దీనికి – యస్తు వేదవిశ్వాసరహితో ధర్మాత్పరాఙ్ముఖః । తన్నానుష్ఠతి సజన్మనా బ్రాహ్మణోపి కర్మచండాలోభవేత్ – ఇది వ్రాసి యున్నారు. ఇందుకు –

1. ప్రతిపక్షులు చెప్పినట్లయినను వేదశాస్త్రాదులు స్త్రీపునర్వివాహము చేసికొనక యుండుట పుణ్యప్రదమనియు, ఒకవేళ లోకము ననుసరించి చేసికొన్నను దోషము లేదనియు దెలుపుచున్న వందురు. పోనీ వారు చెప్పినట్లు విచారించినా స్త్రీపునర్వివాహము లేకుండ చేసినందున పాపమే లేదే చండాలురనేమాట యేమీ బాగుగా నున్నదో చూడండి.

2. వేదముల యందును స్త్రీ పునర్వివాహము చేసికొనవచ్చునని యున్నప్పటికిని యట్లాచరించలేదు. గాన మనమందరమును వేదవిశ్వాసరహితులమై నట్లును కావున మనము కర్మచండాలురమైనట్లును ప్రతిపక్షులు మనకు బుద్ధి చెప్పుచున్నారు. దీనికి – యస్తు వేదవిశ్వాసరహితో ధర్మాత్పరాఙ్ముఖః తన్నానుష్టతి సజన్మనా బ్రాహ్మణోపి కర్మచండాలోభవేత్ – ఇది వ్రాసియున్నారు. ఇందుకు –

1. ప్రతిపక్షులు చెప్పినట్లయినను వేదశాస్త్రాదులు స్త్రీ పునర్వివాహము చేసికొనక యుండుట పుణ్యప్రదమనియు, ఒకవేళ లోకము ననుసరించి చేసికొన్నను దోషము లేదనియు దెలుపుచున్న వందురు. పోనీ వారు చెప్పినట్లు విచారించినా స్త్రీ పునర్వివాహము లేకుండ చేసినందున పాపమే లేదే చండాలురనేమాట యేమీ బాగుగా నున్నదో చూడండి.

2. వేదముల యందును శాస్త్రముల యందును పెద్దల యాచారమందును ఏదియెట్లగా నుండిననేమి మనకు భగవంతుడిచ్చిన యంతస్సాధనమును తోడు జేసికొని ప్రవర్తింపవలయు ననుచు కలనైన శివకేశవాది నామంబుల నోటబట్టక, వర్ణాశ్రమ ధర్మములను గూడ గ్రమక్రమముగ తగ్గింప బ్రయత్నము సేయుచు పూర్వుల కట్టుదిట్టములను చాలమట్టునకు దూషించుచు వచ్చినవారికంటె జండాలురు పెక్కుమడుంగు లెక్కుడనుట కేమి సందేహము.

3. ఎట్టులైనను మన పెద్దలేమి ప్రతిపక్షుల పెద్దలేమి వేదశాస్త్రాదులకు సరియైన యర్థమును గనిపెట్టి స్త్రీపునర్వివాహములు లేకుండ జేసియుండగా ప్రతిపక్షులు క్రొత్తగా వేదార్థములు వ్రాయుట కంగీకరించవారెవరు? ఆ యర్థముల

మూలాధారము లేని వాని కుదాహరణము లెక్కడ? కాబట్టి వేదవిశ్వాస రహితతత్వము నిజముగానే పక్షమందున్నదియు శ్రీమన్నారాయణమూర్తికి దెలియవలెను గాని మనుష్యమాత్రులకు దెలియదు. తెలిసినను అట్టి నీచుల నేమియు జేయజాలరు.

ఇకను తక్కిన శాస్త్రముల విషయమయి తరువాత నాలోచించినను ముఖ్యముగా ప్రతిపక్షులు తమ పట్టుగొమ్మగా నెంచుకొనిన పరాశరస్మృతి వారికెంత యనుకూలముగా నున్నదో విచారించుటయే ముఖ్యమని తలంచెదను. మాటిమాటికిని ప్రతిపక్షులు చంకలు గొట్టుకొనుచు ఈ విషయమై వ్రాయుచున్న పరాశరస్మృతి శ్లోకములకు వారు చేసిన యపార్థములను గ్రమముగా ఖండించుచున్నాడను.

కృతేతు మానవాధర్మాస్త్రేతాయాం గౌతమాస్మృతాః
ద్వాపరే శంఖలిఖితాః కలౌ పారాశరాస్మృతాః

ఈ శ్లోకము వలన కలియుగమునకు పరాశరోక్తములే ధర్మములుగాని యితరములు కావని ప్రతిపక్షులు అర్థము చేసి "నష్టేమృతే" యను శ్లోకము పరాశరా స్మృతిలో వ్రాయబడియున్నది గాన నష్టాది నిమిత్తముల యందు స్త్రీపునర్వివాహము చేసికొన వచ్చునని ఢంకాగొట్టి చాటుచున్నారు గాని యీ వాదము నెలపురుటనేడింక గొట్టునని వారెరుంగరు అదియేమినిన

1. ఈ స్మృతియే కలియుగస్మృతి గాని ఇతరస్మృతులు కావని చెప్పిన యెడల గర్భాదానాదులగు షోడకర్మలను గూర్చి యీ పరాశరస్మృతి యేమాత్రమును జెప్పనందున ఆ కర్మలు కలియుగమునందు లేకనేపోవలసి వచ్చును.

2. ఈ స్మృతి యితర స్మృతులతో పాటు కలియుగధర్మములను జెప్పునంటిరా యితర స్మృతులలోని కలి నిషేధాదులు వచ్చి ఈ స్మృతిలోని కొన్ని విధులకు విరోధము లగును.

3. ఈ స్మృతిలో జెప్పబడనివి మాత్రమే యితర స్మృతిధర్మములు గ్రాహ్యము లంటిరా యీ స్మృతిలో జెప్పబడిన క్షేత్రజ కృత్రిమ సుతులును గోపాలాన్న భోజ్యతయు కూడను అనుష్టేయములే కావలసివచ్చును.

4. మను గౌతమ శంఖలిఖిత స్మృతులు కలియుగంబునకు జెప్పబడి యుండలేదు గాన వానిని బొత్తుగా విడువవలయును గాని తక్కిన స్మృతులు సామాన్యములు. గనుక ఏ స్మృతి కనుకూలించియున్న శ్లోకార్థమునాయుగము నందు గ్రహింపవచ్చు నంటిరా అశ్వాలంబ గవాలంబాదులకు కలినిషిద్ధములని చెప్పిన వ్యాఘ్రపాదలోకాక్షి గార్గ వచనాదులకు ప్రయోజనమే లేకపోయెను.

5. ఇతర స్మృతులు నిష్ప్రయోజకము లగుట పయి శ్లోకము వలన నిశ్చయమే. గాని పరాశరస్మృతిలో జెప్పబడని యంశములను మన్వాదిస్మృతి చతుష్కము వలన గ్రహించవలయునందురా. కణ్వాదిస్మృతుల యందు జెప్పబడిన వివాహదీక్షాదులకు గలిపయి స్మృతుల యందు లేనే లేదు. గనుక యీ శ్లోకమునకు అర్థమెట్లుగా జేయవలయుననిన –

కృతయుగమునందు మనువుచే జెప్పబడినవి ధర్మములనబడినవి. ద్వాపర యుగము నందు గౌతమునిచే జెప్పంబడినవి ధర్మము లనబడినవి. కలియుగము నందు పరాశరోక్తములు ధర్మములనబడినవి. ఆయా యుగముల యందలి మనుజులు క్రమ క్రమముగ బలహీనులయినందున కృతయుగ ధర్మములలో సాధ్యమయినంత మట్టునకు త్రేతాయుగమున మార్చబడినవి. కృతత్రేతాయుగము లందలి ధర్మములలో సాధ్యములైన మట్టునకు ద్వాపరంబున మార్చబడినవి. సమర్థత లేకపోవుటచేతనే క్రింది యుగములవారు పయి యుగముల ధర్మములను గొన్నిటిని మార్చి కొనినారు. గొన్నిటిని మానికోనివారు గాని అట్లాచరించినందున దోషము వచ్చునని కాదు. కాని సమర్థతరులయిన పయి యుగములవారు మాత్రము కింది యుగముల ధర్మములను నాచరించుట దోషాపాదక మవును. కాబట్టి పారాశరములనగా అసమర్థులును, అల్పాయుష్కులునగు మనుజులు ఆచరింపజాలరని కృత త్రేతా ద్వాపర యుగధర్మములలో పరాశరుల వారిచేత మార్చ చెప్పబడియున్న ధర్మములని యర్థము. గనుక నట్టి ధర్మములును శేషః ముని విభాషితం అనినందున యితర స్మృతులలో జెప్పబడిన సాధ్యధర్మములను కలియుగంబున ననుష్టేయము లనుట చక్కగా నుండును.

కాబట్టి మన్వాది స్మృతులలో నున్న యర్థమే యీ పరాశరస్మృతి యందును నున్నయెడల నది పారాశరము కాదు మన్వాదిస్మృతుల యందెచ్చటను గానరాని యర్థము నీపారాశరుడు బెప్పినప్పుడది పారాశరమనబడును. ఒక

యర్థము మన్వాదులందరి వలన జెప్పబడినట్లున్నప్పుడు పూర్వీకుడు మనువు గనుక మానవమని చెప్పుట సుతరము. ఇదియును గాక పరాశరునిచే జెప్పబడిన యర్థము మాత్రము గావలయు గాని శబ్దము వలననేమి ప్రయోజనమున్నది. పరాశరేణోక్తర్థః పారాశరః.

యీ పయిన యర్థమును బట్టి నష్టేమృతే ప్రవృజితే క్లీబేధవతితేపతౌ వందస్వాపత్సునారీణాం । పతిరన్యోవిదీయతే – అను శ్లోకార్థము పరాశరమా మానవమాయని యోజింతుము.

యీ శ్లోకము మనుస్మృతిలో కూడ నున్నట్లు పారాశరస్మృతి వ్యాఖ్యానము నందు అత్రమనుః అని వ్రాయంబడియున్నది. నారదస్మృతి యందు స్పష్టముగ గానపడుచునే యున్నది. అందువలన నిది మానవము గాని పారాశరము కాదని బాగుగా తేటపడుచున్నందున యీ శ్లోకము కలినిషేధములను జెప్పు నితర స్మృతుల చేత బాధింపబడను వచ్చును. యుగాంతర విషయమని చెప్పనువచ్చును. కాబట్టి యీయొక యుక్తిచేతనే ప్రతిపక్షులవాదము భేదము జెందకపోదు. అయినను దీని గూర్చి యింకను కొంతమట్టునకు వ్రాయుటయే మంచిదని తలంచుచున్నాను.

కృతేతు మానవాధర్మా యని యను శ్లోకార్థము బార్హస్పత్యము గాని పారాశరము కాదు. బృహస్పతి చెప్పినది పరాశరుడును జెప్పినాడు గాని పరాశరుడు క్రొత్తగా చెప్పినది కాదు. అందువలన బృహస్పతియు గలియుగ ధర్మములను జెప్పినవాడే యగుచున్నాడు. అట్టి బృహస్పతియె ఉక్తానియోనా మునినా । నిషిద్ధా స్వయమేవతు యుగక్రమాదశక్తోయంకర్తుమన్యైర్యిధావతః । తపోజ్ఞానసమాయుక్తాః కృతే త్రేతాయుగే సరాః ద్వాపరేచ కలౌన్రణాం శక్తిహానిర్వినిర్మితా । అనేకధాకృతాః పుత్రాః । ఋషిభిశ్చ పురాతనైః । నసక్యంతె ధునాకర్తుం శక్తిహీనైరిదంతనైః – అని విధవా వేదనమును కలియుగము వారు శక్తిహీనులను కారణమును బట్టి నిషేధించి యున్నాడు. బృహస్పతి ముందు రాగల పరాశరస్మృతి నుద్దేశించి యది కలియుగ సంబంధియని వ్రాసియుండెను. పరాశరస్మృతి విధవా వేదనము విధించునని కూడను తెలిసియుండవలసినదే అట్లయినచో తన మొదటివచనమునకు విరోధముగా ఈ శ్లోకమేల వ్రాయును. కాబట్టి నష్టేమృతే యను శ్లోకార్థము కృతేతు మానవాధర్మాః అను శ్లోకార్థము వలననే బాధింపబడినది.

అయినను ప్రతిపక్షులు విధవావేదనమును, విధవావివాహమును భిన్నములని తలంచి ఆప్రేమేయము రానీకుండ నున్నారు. అది యెంత చక్కగానున్నదో నిర్మలమయిన యంతఃకరణముతో విచారించినట్లైన దెలియును అసమర్థులు గాన కలియుగమువారు విధవావేదనమును చేయరాదు అనినందున నేమి తెలుసుకోవచ్చునో విచారింతుము. విధవావేదనము అనగా ఒక పుత్రుని మాత్రము గనుపర్యంతము మృతపతికను గొన్ని నియమంబులకుగట్టుపడి సంభోగించుట ఈ వ్రతము మిక్కిలి కష్టము గాన కలియుగమువారు నడపలేరనుట స్పష్టము. పూర్వయుగముల యందు యధేచ్ఛగా ప్రవర్తింపగూడిన విధవా వివాహమున్న యెడల ఈ తిప్పలేమి? వివాహమే చేసికొనరాదా? విధవావేదనమును విధవా వివాహమును పూర్వయుగముల యందు యోగ్యములుగానే యెన్నబడిన వనరాదు. కావున విధవా వేదనోక్త నియమములు దప్పి ప్రవర్తించుట దోషాపాదకమెట్లగును విధవా వేదనము దక్క మరియొక యోగ్యమగు విధవావివాహము లేదనుట స్పష్టము.

కాబట్టి పూర్వయుగముల యందయినను కొంతమట్టునకు యోగ్యముగానే నెన్నబడినది. విధవావేదనమే కాని యధేచ్ఛను ప్రవర్తింపదగిన యూధావివాహము కాదని యెంతస్పష్టముగా నయిన దెలియుచున్నది.

ఇదియునుంగాక నాన్యస్మిన్విధవానారీ నియోక్తవ్యాద్విజాతిభిః అనియెడి మనుస్మృతి శ్లోకార్థమును దానిక్రింద వ్రాసిన కుల్లూకభట్టియ వ్యాఖ్యానములోనే స్త్రీణామేకపతిత్వధర్మ మనాదిసిద్ధమను వచనార్థమును చక్కగా గ్రహించినయెడల దేవరాదులు నియోగింపబడుట తప్ప స్వేచ్ఛను ప్రవర్తింపకూడిన వివాహము ఆయుక్తమయినట్లు ప్రతిపక్షులేల యొప్పికొనరు. ఇది యిట్లుండగా దన్ను గట్టుకొన త్రాడు తానే తెచ్చికొనె ననినట్లు ప్రతిపక్షులొక్క చక్కని సారాశరశ్లోకము మన కందిచ్చుచున్నారు. గాని దానికి వారు చేసిన యపార్థము ఎంత పరిహాసాస్పదమై యున్నదో చూడండి –

విధవాయాభవేత్కన్యా నిర్దోషా భర్తృపజితా। తస్యావాసః పితుర్వేశ్మసలజ్జా చైవసర్వాదా। దీనికి వారు వ్రాసిన యర్థము – విధవయైన కన్యక నిర్దోషురాలై పతిచేత విడువబడెనేని సర్వదా సిగ్గు కలిగి తండ్రి యింటనే యుండవలయును అని వ్రాసినారు. అ హో హో ! యేమి రమ్యముగా నున్నది. యీ యర్థము.

మగడు గలది గూడ విధవయగు కాబోలును. మరియొకని గట్టుకొని నప్పుడైనను దాని విధవాత్వము పోదు కాబోలును. అయ్యో । ప్రతిపక్షుల కోరికెలీడేరినా విధవల ముండమోపితనము పోలేదు గదా !

దీనికి నేను వ్రాసిన యర్థము బాగుగా నుండెనేని న్యాయమార్గము ననుసరించినవారు నమ్మగోరుచున్నాను. యా కన్యావిధవాభవేత్ యాదనిదో పాభర్తృవజితాతస్యః వాసః పితృవేశ్మ (సా) సర్వదానవర్జైవ.

విధవ యగు కన్యకయును దోషములేకనే మగని చేత విడువబడినదియు తండ్రియింట నుండవలయును. అది యెల్లప్పుడు సిగ్గుగలిగియే యుండవలయును. దీనివలననే విధవయగు కన్యక సయితము పుట్టినింట బడియుండవలయునని బరాశరులవారు చెప్పియుండగా ఇట్టి పారాశరము విడిచి మానవమైన నష్టేమృతె యను శ్లోకము పారాశరమని భ్రాంతి పడుట కేమి కారణమో తెలియదు.

మొదటనే కన్యక అదే విధవయగుట దానికే పునర్వివాహమగుట అప్పుడును అది విధవగానే యుండుట ఇన్ని విశేషములతో గూడినదానినే పురుషుడు సంగమించుట దోషమేమియు జేయనిదే. దానిని విడిచిపెట్టుట అప్పుడది తండ్రి యింటికి సేరుట ఎట్లు సంభవించునో బుద్ధిమంతులాలోచించిరా ప్రతిపక్షుల వాదబలము తేటపడకపోదు.

కాబట్టి పూర్వయుగముల యందేది యెట్లున్నను కలియుగమునందు స్త్రీపునర్వివాహము కూడదనుటకుపరాశరస్మృతియె ప్రమాణము. నష్టే మృతెప్రప్రజి ప్రజితే యను శ్లోకము శంఖస్యవచనం యధా అను శబ్దసాధ్యము చేత కూడను పరాశరమతము కానట్లు స్పష్టమగుచున్నది. ఇందునకు –

జ్యేష్ఠభ్రాతా యధాతిష్టే దాధానం నైవకారయేత్ అనుజ్ఞాత కుర్వీత శంఖస్య వచనం యధా । నష్టేమృతే ప్రప్రజితేక్లీబే చపతితేకా । పంచస్వాపత్సునారీణాంపతీ రన్యోవిధియతే ।

కావుననే వ్యాఖ్యాతకూడను యుగాంతరవిషయమని వ్రాసెను. స్త్రీ పునర్వివాహమునకు శంఖుడభ్యనుజ్ఞ యిచ్చియుండినను కలి నిషిద్ధము గాన పరాశరుడామతమును జేకొనడాయెను. శ్లోకములు వేరైయుండగా పయి శ్లోకము యొక్క అంతిమపాదము ఆశ్లోకము యొక్క అర్థమును పూర్తి చేసి తిరుగా కింది

శ్లోకార్థమునకు వర్తించునాయని గ్రంథ సందర్భములను దెలిసినవారనరు. అలాగయిన యెడల ఇతరగ్రంథము లట్లుండగా నీ శ్లోకము తరువాత నొకటి విడిచిన పిమ్మట

తే(స్రః కోట్యర్థకోటీచ యాతిలోమాని మానుషే తాపత్కాలంవసే
త్స్వర్గేభర్తారం యానుగచ్ఛతి । వ్యాళగ్రాహి యధావ్యాళ
బలాదుద్ధరతే బిలాత్ ఏవం స్త్రీ పతి ముద్ధృత్యతేనైన సహమోదతే

అను రెండు శ్లోకములున్నవి. మొదటిదాని యంతిమపాదము రెండవదాని కనువర్తించునది లేకున్న రెండవశ్లోకము నందలి స్త్రీ పదముదకు సహగంత్రియను నర్థమే రాదు. ఇదియకాక మనము మరియొక విధమున విచారించినను ఈ శ్లోకార్థమే కాక యీ శ్లోకము కూడను పరాశరస్మృతి సంబంధి కానట్టే తేటపడుచున్నది. అది యెట్టిదనిన –

పరాశరుడు గ్రంథావసానము నందు –

ఏతత్పరాశరం శాస్త్రం శ్లోకపంచశతాధికం త్రిసప్త
తి సమాయుక్తం ధర్మశాస్త్రస్య సంగ్రహం

ఈ పరాశరశాస్త్రము అయిదువందల డెబ్బదిమూడు శ్లోకములు కలది అని చెప్పియున్నాడు.

మాధవాచార్యుడు తన వ్యాఖ్యాన ప్రారంభమునందు –

"ద్వేకాందే ద్వాదశధ్యాయాః శ్లోకాఅష్టోనపట్ఛతం"

అయిదు వందల తొంబది రెండు శ్లోకములను తాను వ్యాఖ్యానము చేయుచున్నట్లు చెప్పియున్నాడు.

ఇందువలన పరాశరోక్తములు కానివి పందొమ్మిది శ్లోకములు మాధవాచార్యుని నాటికి కలిసియున్నట్లు తెలియుచున్నదే గదా. ఆ కలిసియున్న శ్లోకములేవో యేర్పరించుట దుస్తరమైన పనియైనను ఈ నష్టేమృతే యను శ్లోకము యొక్క యావదక్షరపంక్తి మాత్రము నితరము ప్రయుక్తమని మనము గట్టిగా వాదింపవచ్చును. ఎట్లనగా వివాహప్రకటన మందు మాధవాచార్యుడు వ్రాసినప్పుడు అత్రమను అని ఈ యక్షరపంక్తినే వ్రాసి యున్నాడు. నారదస్మృతి

యందును యీ యక్షరపంక్తి శ్లోకమే వ్రాసియున్నాడనుట మన ప్రతిపక్షులును మనమును ఎరిగియున్నదియే - అట్టి స్థితిలో మనమిది పరాశరస్మృతి శ్లోకమే యనుట బాగుగా నున్నదో మాధవాచార్యుని నాటికి చేరియున్న పందొమ్మిది శ్లోకముల లోనిది యనుట బాగుగా నున్నదో నేను చెప్పవలెనా?

ఇవి యన్నియుగాక యీ నష్టేమృతే శ్లోకము పరాశరుల వారు చెప్పినది కాదనుటకు మంచిహేతువున్నది. అదియేదనిన - పతౌ అను పదము సాధువైనను అసాధువైనను ఆర్షముగాన అవిచారము మనకక్కరలేదనుకొందము. కాని పరాశరులవారి కాలమందు ఆ పదమున కెట్టి వాడుకయున్నదో పరాశరుడితర స్థలముల యందెట్లు వాడుకొని యున్నాడో పరాశరుని కుమారుడును శిష్యుడునైన వ్యాసుడు ఈ పదమును తన గ్రంథముల యందెట్లుగా ప్రయోగించియున్నాడో దానినిబట్టి యీ శైలి పరాశరునిదైనది కానిది తెలిసికొనవచ్చును.

**యాజ్ఞవల్క్యస్మృతి**

మృతేజీవతివాపత్యౌ యానాన్యముపగచ్ఛతే
సేహకీర్తిమవాప్నోతి మోదతే చోమయాసహ

పారాశర్యమనుహోరాశాస్త్రమునందు -

**కుళీరాంశగతే**

పత్యౌ ధనేశే కేంద్రగేయది తానేపతౌ

అని చెప్పి యున్నాడు.

**భారతము భీష్మపర్వము**

పత్యౌహతే సువర్ణేన కృపణాదీనచేతనా

పరాశరకుమారుడును శిష్యుడును నైన వ్యాసుడు పత్యౌ అని ప్రయోగించి యున్నాడు.

కాబట్టి యీ హేతువుచేత విచారించినను ఈ శ్లోకము పారాశరము కాదని తేటపడుచున్నది.

ఇవియన్నియు నిట్లుండగా ఈ శ్లోకము యొక్క బలమెట్లున్నదో విచారింతము.

"నష్టేమృతే ప్రవ్రజితేక్లీబేధ పతితేపతౌ పంచస్వాపత్సునారీణాం । పతిరన్యోవిధీయతే."

పతి దేశాంతరగతుడయినను చచ్చినను సన్యసించినను పురుషత్వము పోయినను జాతిభ్రష్టుడయినను స్త్రీలకు ఇతరుడయిన పతి విధింప బడుచున్నాడు.

ఈ యర్థము వేదమునకు కేవలము విరుద్ధముగా నున్నది. అదేమి యందురేమో మనము చేసిన యర్థమును బట్టి యదేకస్మిన్ యూపేయను యజుర్వేద మంత్రమును తస్మాదేకస్య యను ఋగ్వేదమంత్రమును స్త్రీ పునర్వివాహమును నిషేధించుచునే యున్నవి. పయిరెండు మంత్రములకును ఉదీర్ష్వనార్యభిజీవయను మంత్రమునకును ప్రతిపక్షులు చేసిన యధమును బట్టి చూచినను మృతుడైనప్పుడు మాత్రము స్త్రీపునర్వివాహ మంగీకర్తవ్యమయినట్లు కనబడుచున్నది. యిప్పుడీ శ్లోకార్థము అన్ని యర్థములను గుటుక్కున మింగివేసినది. యింకా వేదవిరుద్ధము గాక మరియేమున్నది. ప్రతిపక్షుల మతమందు యీ శ్లోకములోని మృతే అను రెండక్షరములు మాత్రము వేదవిరుద్ధము కాదని చెప్పగలరు. ఆ రెండక్షరముల నిమిత్తమీశ్లోకము పరమ ప్రమాణముగా గ్రహించుచు వచ్చుటకు ప్రయోజనముమాత్రము కనబడదు. అయినప్పటికిని మృతే అను రెండక్షరముల యర్థము తర్వాత శ్లోకముల వలన గలుగు విశేషవిధి వలన బాధింప బడినది.

మృతేభర్తరియానారీ । బ్రహ్మచర్యే వ్యవస్థితా ।
సామృతాలభతే స్వర్గం యధాత బ్రహ్మచారిణః

ఈ శ్లోకార్థము భర్త చనిపోయిన పిమ్మట స్త్రీకి బ్రహ్మచర్యమును విధించి అందువలన గలుగు ఫలమును జెప్పుచున్నది. కాబట్టి మృతే యను రెండక్షరములు కూడను వెంటనే బలహీనము లైనవి. స్త్రీలకు సహగమనము మొదటిధర్మమనియు పరాశరులవారి తాత్పర్యము. గాన ఈ మూడును విధించినాడనియు ఇందున నష్టేమృతే శ్లోకము పునర్వివాహమును చెప్పుచున్నదనియు ప్రతిపక్షులు చెప్పుట మిక్కిలి యంసగతముగా నున్నది. అట్లయినయెడల నష్టేమృతే యనుశ్లోకములోని యావదర్థమును స్త్రీపునర్వివాహమును జెప్పునదియే కదా? మృతేభర్తరి యను శ్లోకార్థమును త్రిసఃకోట్యర్థ యను శ్లోకార్థమును ఒక విధవకే చెప్పబడియుండె గదా పెనిమిటి దేశాంతరగతుడైనప్పుడు స్త్రీ బ్రహ్మచర్యము గాని సహగమనము

గాని అట్లు కానియెడల ఆ శ్లోకములోని వికల్పనిధికి ఫలమేమి? అప్రోషితపతిక పెండ్లిచేసుకొనదేని యేమి చేయవలసినది. సన్యాసి భార్యయు షండుని భార్యయు పతితుని భార్యయు నేమి చేయువలసినది. వీం(డ్రు పునర్వివాహము చేసికొనవలసినదే గాని మృతపతిక మాత్రము సహగమన బ్రహ్మచర్య పునర్వివాహములలో నేదియైన చేసికొనవచ్చునని చెప్పుట కేమియాధారము. కాబట్టి మృతే యనునది విశేషవిధిచేత బాధింప బడినదని ప్రతిపక్షులు సయిత మొప్పుకొనవలసినది. ఆ రెండక్షరములను వదిలిన పిమ్మట నష్టాదినిమిత్త చతుష్టయమునందు మాత్రమే స్త్రీ తప్పకుండా వివాహము చేసికొనవలసివచ్చునది. అట్లు వివాహము చేసికొననకున్న దోషము కూడా వచ్చునట్లున్నది. ఈ యర్థము వేదవిరుద్ధమని యుభయ పక్షములవారును తీసిన శ్రుత్యర్థములచేతను స్పష్టమగుచున్నట్టు ముందు వ్రాసియున్నాను. కాబట్టి యెన్ని విధముల చేత విచారించినను పరాశరస్మృతి స్త్రీ పునర్వివాహమునకు అభ్యనుజ్ఞ యిచ్చుచున్న దనుట అత్యంత భ్రాంతి మూలకమగుట నిశ్చయము. ఎట్లయినను ప్రతిపక్షులు మన నొకటి మాత్రమడుగుకమానరు. అది యేమనిన–

నారదస్మృతి – నష్టేమృతే ప్రవజిత ఇత్యాది
నారదస్మృతి – అష్టౌవర్షాణ్యుదీక్షేతేత్యాది
వాసిష్టస్మృతి – పాణిగ్రాహేకృతేకన్యేత్యాది
నారదస్మృతి – ఉద్వాహితాపియాకన్యేత్యాది
మనుస్మృతి – సాచేదక్షితయోనిస్యాదిత్యాది
నారదస్మృతి – దేయాన్యత్రవివాహదాపిచేత్యాది
శాతాతపస్మృతి – కామపి హరేద్భూర్వామిత్యాది

ఈ స్మృతి శ్లోకములయొక్క అర్థములకు సామర్థ్యమున్నదాలేదా? యను ప్రశ్నకు మాత్రము చక్కగా నాలోచించి న్యాయమైన సమాధానము చెప్పవలసి యున్నది.

ఇందునకు మనుస్మృతిలో నొక వచనమున్నది –

"నద్వితీయశ్చసాధ్వీనాం క్వచిద్భర్తో పదిశ్యతే"

మంచివారైన స్త్రీలకు రెండవభర్త శాస్త్రమందెక్కడను విధింపబడదు అని యర్థము. దీనివలననె చెడిపెలకు రెండవ భర్త విధింపబడుచున్నాడనుట స్పష్టమగుచున్నది. అట్టి యసాధ్యులైనను నిమిత్తములే నిది యూరకనే యొక భర్తను విడిచి మరియొకని గట్టుకొనరాదనియు అనిమత్తములిట్టివిగ నుండవలయుననియు ఈ శ్లోకార్థములు బోధించుచున్నవి. చెడిపెలకు మాత్రమే యీ విధులయిన యెడల శాస్త్రోక్తమార్గము ననుసరించి నందున వాండ్రకేమి ఫలమనిన ఫలముద్వివిధము. దృష్టఫలము, అదృష్టఫలమునని. అదృష్టమిహలోకము, అదృష్టము పరలోకము కాబట్టి యీ పై శ్లోకముల మార్గము ననుసరించి పునర్వివాహములు చేసికొనిన చెడిపెలకు (అసాధ్వులు) ఇహలోకసుఖమనగా దృష్టఫలము మాత్రము కలదు. ధర్మశాస్త్రము ననుసరించనప్పుడు దృష్టఫలము లేదా? యనిన మా మతము నందు శాస్త్రోక్తమార్గము ననుసరించిన వానికేద్వివిధములు గాని శాస్త్రాతిక్రమణము చేసినవారికి యిహ పరములు రెండును సున్న యనియే సిద్ధాంతము.

అసాధ్వులనగా నెవ్వరును ప్రశ్న పుట్టుచున్న యది పరసుఖాపేక్ష లేని వారలని యర్థము. ఈయసాధ్వి పునర్వివాహములైనను పూర్వయుగముల యందే గాని యిప్పటివర్ణశ్రేష్టులకు గూడదు. అది యేల యనిన ఇది కలియుగమందు బొత్తిగా నిషిద్ధమైనట్టు ముందే వివరించియున్నాడను. గొల్లమాదిగ మాలవాండ్రలో నీ యుగమున జరుగుచున్నవి గదా? యే శాస్త్రముల వలన నందురేమో వాండ్రు శాస్త్రబద్ధునిగాక దృష్టాదృష్ట ఫలాఫేక్ష బొత్తిగా లేవనికొనుచున్నారు గాని యది శాస్త్రీయము గాదు.

ఇకను ప్రతిపక్షులు గనపరచవలసిన రెండవ యంశము. స్త్రీపునర్వివాహము వలన దోషము లేదని కనపరచవలసినందునకు. ఈ యంశమునకు ప్రతిపక్షులు ఇందువలన దోషములేదని జెప్పు శ్లోకములను గనపరచనేలేదు. కావున దీనికి నేను వ్రాయవలసినదేమియు గన్పట్టదు.

స్త్రీపునర్వివాహములు కులమును పోగొట్టుదని కనపరచవలసినది. అందుకు శ్రేయసశ్రేయసోలాభే । పాషీయార్థికమర్హతి। బహవశ్చేత్తు సదృశా । స్సర్వేరిక్ధస్యభాదినః ఇందువలన ద్వాదశవిధ పుత్రులలోను పౌనర్భవుడు కూడను

పయివారు లేనపుడు దాయార్హుడగునని యున్నది. గనుకను, పిండాదానోంశహరః । పూర్వాభావే పరంపరః – యాజ్ఞవల్క్య స్మృతి

పూర్వపువారు లేనపుడు తర్వాతివారు పిండప్రదానమునకు దాయమునకును అర్హులగుదురని యున్నది గనుకను. కులముపోదని వారి తాత్పర్యమైయుండవచ్చును గాని పూర్వయుగముల యందు యీ పనులు భిన్నకులముల యందలి స్త్రీలను వివాహము చేసికొనినవారి యందు బిడ్డలను గనినట్టాయెనా అట్టి పుత్రులు సయితము చేయుచునే యున్నారు గాని యిందుమూలముచేత కులము నిల్చియున్నట్లెంచరాదు. పునర్వివాహము కలియుగ నిషిద్ధము కాదని కనపరచవలసినందుకు. నృష్టేమృతే ప్రవ్రజితే అను శ్లోకము పరాశరస్మృతిలో నున్నది. గాన కలియుగ నిషిద్ధము కాదని ప్రతిపక్షులు తలచి యుండవచ్చును గాని అందువిషయమై ముందే వ్రాయబడియున్నది. గాన నిచ్చట విస్తరించ బనిలేదు.

పునర్వివాహమెప్పటికిని సదాచారమని కనపరచవలసినందుకు నారాయణాంశసంభూత డయిన యర్జునుడు నాగకన్యక యయిన యులూచి విధవయని యెరిగి వివాహము చేసికొనినాడనియును, దిక్పాలకులను సయితము లెక్కజేయక నలునివరించిన దమయంతికి స్వయంవరముచాటగా రాజర్షియయిన ఋతుపర్ణుడు వచ్చినాడనియు యీ రెండుదాహరణములు సదాచారము న్నదినినందునకు బ్రతిపక్షులు గనపరచుచున్నారు. అయినను వారు బ్రహ్మదేవుని కుమారికను వివాహము చేసికొని నదియు యయాతిరాజు బ్రాహ్మణకన్యక యగు శర్మిష్టను వివాహము చేసికొనినదియు, ద్రౌపది యేకకాల మందైదుగురిని పెండ్లి చేసికొని నదియు, ఎరిగియుండునని నమ్ముచున్నాను. ఆయాచారములేల యనుష్టించుట లేదో ఆకారణము మాత్రము వారు వెదకినారో లేదో యనెడి సందేహము మాత్రమున్నది. అవి యేదియనిన :

బోధాయనుడు అనుష్టితంచ యద్దేవై ర్మునిభిర్యదనుష్టితం నానుష్టేయం మనుష్యైస్తదుక్తం కర్మసమాచరేత్। దేవతలచేతను, మునుల చేతను చేయబడినది మనము చేయరాదు. వారిచేత చెప్పబడినది మనది మనము చేయవలయును. శ్రుతి స్మృతి విరుద్ధములయిన పనులు మహాత్ములు చేసినప్పుడు వారిని దూషించరాదు గాని అవి మనము చేయుట మాత్రము కూడదు ఈ సిద్ధాంతము

ప్రతిపక్షుల కంతగా బాగుండనని తలంచ వీలులేదు. గాని మనవారు చేకొనవలసినది యగు అయినను దమయంతీ వృత్తాంతమంత సంగతముగా నున్నట్లు నాకు తోచదు. ఎందువలన ననగా పూర్వస్వయంవరము ఋతుపర్ణు డెరుగునోలేదో మనకు ప్రత్యక్షముగా జెప్పు పురాణగాథ కనపడలేదు. యుగాంతరచరిత్రము కూడ నయ్యున్నది.

ఉలీచిని అసాధ్విగా సుభద్ర నిందించినట్లు యీ క్రింది శ్లోకములో నున్నది.

"నాపరాధోస్తిసుభగే నరాణాం బహుభార్యతాన
ప్రమ దానాం భవత్యేష మాతేభూదల్పబుద్ధిరిదృశీ భార."

– అశ్వమేధపర్వము

ఇందుకు పురుషునకు బహుభార్యత్వ మున్నది గాని స్త్రీలకు బహుపతిత్వము లేదనియు నీకిట్టి బుద్ధి లేకపోయెననియు జెప్పబడియున్నది. నాగలోకవృత్తాంతమును ద్వాపర యుగవృత్తాంతమును గాని నిదియును అంతగా కలియుగమునందలి యవిగీత శిష్టాచారమని చెప్పవలసిన ప్రసక్తి లేదు. అనిగత శిష్టాచార విషయమై యీ యుగమునందలి గొల్లలు గవలలు మాలలు మాదిగలు కూడను ప్రతిపక్షుల వలన బేర్కొనంబడిరి.

ఈ రాజ్యమునందు నీక్రొత్తయాచారమునయినను ముందుగా దెచ్చి పెట్టునది వారేనట. పిమ్మటనే క్రమక్రమముగా బ్రాహ్మణుల పర్యంత మాదరింతురట. ఇది విచారించగా చక్కగానే యున్నది. గాని యీ స్త్రీపునర్వివాహములు లేకుండుట ముందుగా దెచ్చిపెట్టిన శిష్టులును వారేనని యిందుమూలము చేత మనమను మానించవలసి వచ్చినది. ఎట్లయిన నిదిమాత్రము శిష్టాచారమెట్లు కాకపోవును. దుష్టమయినను వానిని కష్టములేకుండ ఇష్టము వచ్చినట్లు అనుష్టించు వాడే శిష్టుడు కాబోలును. ఈ యర్థమిదివరకు మనకు తెలియనే తెలియదు. కనకనే మన మూఢత్వమును జూచి శిష్టులందరు పకపక నవ్వుచున్నారు. మన ప్రతిపక్షులంతలో శిష్టులయిపోవుచున్నారు. తాము పట్టిన కోడికి మూడేకాళ్ళని పట్టుబట్టి మన మింకను శీఘ్రముగా శిష్టులముగాక బ్రాహ్మణాది వర్ణాశ్రమ ధర్మములను విడువజాలక ఏమో మోక్షము ఏమో వ్యర్థము వచ్చునని స్వాధ్యాయజపస్నాన సంధ్యాదులలో మునిగితేలుచున్నాము.

ప్రతిపక్షులు యీలాగున చెప్పగా కొందరయినను శిష్టులు కాకపోరు గాని బహుశః మన మాటలకు చెవియొగ్గిన శిష్టులలో నొక్కడును దుష్టుడుగాడని తోచుచున్నది. స్త్రీ పునర్వివాహమునకు విధానమేర్పడియున్నదని కనపరచ వలసినందుకు.

ఈ విషయమై ప్రతిపక్షులు ప్రథమవివాహమున కెట్లో దీనికి నట్లేని వ్రాయుట తప్ప ప్రత్యక్షముగా నేదియు జెప్పలేదు. ప్రథమవివాహ మంత్రము దీనికిని బెట్టినయెడల ననేక బాధలు గలుగుచున్నవని ముందే వివరించి యున్నాడను.

కాబట్టి నానేర్చినదానిలో నిప్పటికి దోచినంతమట్టునకు స్త్రీ పునర్వివాహము ఎల్లవిధముల జేయరాదని తోచినందునను మనకంటె నూరుమడుంగులెక్కుడు బుద్ధిమంతులైన మన పూర్వులు ఆచరించియుండ నందువలనను ఈసరికి ప్రతిపక్షులు చేసిన ప్రసంగమంత న్యాయైకపక్షముగా దోచనందునకు నాయిష్టదైవమగు శ్రీమద్గోపాలపరబ్రహ్మమూర్తి నాహృదయంబున కిట్లు దోపించినందునను బుద్ధిమంతులగు కొందరప్పటి పెద్దల యభిప్రాయంబులును ఇట్టివయైనందునను కొంత ప్రవిష్టులవలె గొంత రవ్యుత్పన్నులు విచారించకనే మోసపోదురో యనుభ యంబువలనను సులభశైలిని యుపన్యాసము స్వకీయపత్రికాముఖంబునం బ్రచురించినాడను దీనింజూచి చదువు బుద్ధిమంతులు ఇందుగల తప్పులకు క్షమించి ఇందు వ్రాసిన యన్ని యంశముల యందలి యంశము వలన నైనను స్త్రీ పునర్వివాహనిషేధమును గూర్చి దారిలేదని యుక్తియున్నట్లు డెందంబునకు బొడకట్టేనేని ప్రతిపక్షులవాదన మంగీకరింపక మనపూర్వులు నడిచినత్రోవనే నడచుట యుక్తము. ఇంతటి విద్యావంతులలో నిజముగా గొందరు ప్రచ్ఛన్నబౌద్ధులు మనలోనే ప్రబలియున్నారు. వారి రూపములు మాత్రము మన రూపముల వంటివే గాని మనంబులు మాత్రము వేరుగా నుండును.

మనంబులకు వారి ప్రవర్తనంబులే ద్యోతకంబులు. హేతువాదసామర్థ్యము తల్లి, తోడబుట్టు, గురువు, దైవము, మాల మాదిగ యను భేదములను లెక్కసేయదు. చార్వాకవాదము పయోముఖ విషకుంభమని చార్వాకునకే తెలియదు. సుగతునినాడు ప్రవృద్ధమైన బౌద్ధమంతరము నిప్పుడేమయినది. ఎవనిమట్టునకు వాడు తానే బుద్ధిమంతుడననుకొనుట సర్వదా పనికి రాదు. సాధ్యమయినమట్టునకు

భగవంతుని మీద భారము వేచి పూర్వాచారముల ననుసరించుట వేదశాస్త్రములకు విరోధముగా నుండుననీ నాచారములు గైకొనక పరుల దూషింపక తాను దూషింపబడక నిర్మత్సరుడైనీతిగలిగి లోక నింద్యములు ప్రకృతమున శ్రేయములు గాదోచిన ఉడుగుచు సర్వలోకేశ్వరుండును సర్వాంతర్యామియు నగు శ్రీమన్నారాయణ చరణంబులాశ్రయించుచుం సదాశివుని సదాధ్యానించుచు నుత్తమగృహస్థ ధర్మంబుల నుండువారికి గోరంతయు గొరంత గల్గునని యూహింపను. తాను సర్వోత్కృష్టుండ ననియు తనబుద్ధివిననివాడు చెడిపోదురనియు తనకి దోచినది యితరులకు దోచకపోయె గదా? అయ్యో నేమి జేతుననియు తన ప్రాణమును తన యర్థమును లోకవిరుద్ధమైన తనకు దోచిన పనియందే వినియోగపరతుననియు రేయింబగలు తుదలేపినం తండురటిల్లువారికావంత యావంతయు దీరనే తీరదు కాబట్టి నా విజ్ఞాపనమాలకించి ధీమంతులయిన వారిందుగల మంచి యంశములను జూచి నాచరించవలెను.



**అనుబంధము - 3**

## Encyclapaedia of the Madras Presidency and The Adjacent States 1920-'21

Edited by V. L. Sastri, B.A., M.R.A.S.. Editor-in-chief
Assisted by
S, Krishnaswami Ayangar, M.A., M.E.A.S., F.R.Hist.S,,
M. Venkatarangaya, M.A.

And

C. S. Srinivasachari, M.A., M.R.A.S,
Compiled and published by the Oriental Encyclopaedic publishing company, Cocanada, Post Box 473, Madras.

Joint Proprietors : P. Lakshminarasaiah,
Dr. V. Gopalakrishna, B.A., M.D.,

and V, L. Sastry, B.A., M.R.A.S,
1920-1921



The late Pandit Dasu Sreeramulu, poet, essayist, and orator, Ellore, was born in April 1846 of a respectable Niyogi Brahmin family at Kurada, a village in the Krishna District.

In his tenth year he studied Telugu and Sanskrit classical literature by his own efforts and the same time interested himself in the study of Hindu Astronomy. In his twelfth year this prodigy performed Ashtavadhanam and Vyastakshari in the Nuzvid and Vallur Samstanams and received in the latter estate the first prize for poetic skill and talent. He developed his studies later and in his twentieth year attained remarkable proficiency in Sanskrit grammer, literature and philosophy. He continued his studies for another six years and

secured a teachor's place thereafter. Two years later he shifted to Dokiparru, close to Gudivada and founded a school there.

Though he began his English education rather late in life, he acquired a fair knowledge of the language by his assiduous application to it, and was able to come out successful in the general test and the Second Grade Pleadersbip examinations in 1878. Immediately he set up his practiee as a lawyer at Masulipatam and continued in the profession for 6 years, and passed the First Grade Pleadership examination. He there after settled down at Ellore, where be continued in his profossion for over 10 years, and in 1895 he retired from the legal profession to devote himself to the arduous authorship ship of number of useful works for the edification of the public, on literary, social and miscellaneous subjects.

Under the first head, which the late Pandit began so early as in his twelfth year, are many Sanskrit and Telugu dramas; and in 1902 his masterpieces exhibiting his skill in both the languages, Andhra Devi Bbagavatam and Sankuntalam were written. His association with the Social Reform Movement for a long time, enabled him to render meritorious services in connection with a magazine of Social Reform, in addition to his works on the subject. His miscellaneous works in Arithmetic, science of expression and Logic, written in Telugu, will amply repay perusal,

He was a fluent speaker, an able writer, a good debator, and a keen controvertialist. He made extensive tours in the Northern Circars and the Nizam's Dominions for several years, delivering lectures on diverse subjects. He passed away in his sixty-second year at Ellore, in his own house.

**అనుబంధము - 4**

# నాట్యాచార్య శ్రీ జోస్యుల సీతారామశాస్త్రిగారు వివరించిన వినాయకతాళము - కౌత్వము

తాదిగి దిగిత్తై - తిత్తిత్తై తిత్తై దత్తతి దత్తత్తాహం
దత్తానుతకిట కిణతోం గడికుతోం - తోం గనంకిట కిట తక -
నంగిట కిటతక నం కిటకిటతక -
దీం దానుతకిట కిణతోం గడింకుతోం -
తోంగ తాహం ఘితఘిక్కిటతక -
ధిక్కుత్తా ఆ - తత్తాద్రుగుడు దందం - దిక్కుం దరి, దిక్కి
కిటతక, దిక్కుతోం గ గజముఖ విఘ్నవినాయక వెనుకటి వార
లవ, గణపతి, ఝ ఝ ఝుక్కిట నుతరికుఝుం కిణతధిక్కు -
తధిక్కు - అనముఖతు వితోంకిట కిటతక
తోంగు తోంగ దేవర గణపతి కౌతంఖతురు - వినయాం,
ద్రుగుడు, ద్రుగుడు, ద్రుగుడుదాం - తాక్కు ధిక్కు - తక్కిట
తోంగిటతక ఢే ఎ ఎ ఐ
తంఘిక్కిటతక - దిక్కుత్త - కౌతముత్రిబ

## కౌతము - త్రిభిన్న తాళము

తత్త దిద్దితోం తోం నన్న అసురుట - మాళవ అమర వినాయక
గీతం వసగిత మమగిత - సమగిత - వృషభరంజితా -
త్రిభిన్నతాళ - అడవ రంజితా - నోక్కిటి,
త్తం ఘిక్కిటతక దిక్కితా

ఇట్లు మూడు ఆవృత్తములు పదములతో గీయుచు నర్తించిన వినాయకుని రేఖాచిత్రము నేలపై చిత్రింపబడును. ఇట్టి నాట్యప్రక్రియను కౌతమందురు.

**అనుబంధము - 5**

# విక్టోరియ రాణిపై పద్యము

(కలావతి - ఎడిటడ్ బై శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, రాజమండ్రి. వాల్యూమ్ - 3 ఆగష్టు 1901 - నెం.8. పేజీ. 489)

**శ్రీమన్మహారాజ్ఞి కరుణరాజ సరసపద్యము -**

దయతోడఁగని యొప్పిదంబుగా
వన్నెపొత్తుల గూర్మినలర నునిచి
రేలుబండిన మేలుకోలు చిచ్చులు దీర్చి
పొగయోడకెక్కి నొప్పగ బొనర్చి
దూరవార్తలు సెప్పి సోదులుడగఁజేసి
కమ్మనీళుల జలకమ్ము లార్చి
యానలు గట్టి వైద్యస్థితుల్ పరగించి
వడిమంచిదారుల నడకనేర్చి
సన్న వరికూళ్ళ నమలించి చదువు సాల
కలిచి వివిధాగమంబుల నభ్యసింప
జేసి పెంచిన జననియాసీమరాణి
మనల విడనాడి చనె నెంత మాటపుట్టె

- దాసు శ్రీరాములు, ఏలూరు.

**అనుబంధము - 6**

# కవి నిగూఢముగ తెచ్చిన చక్కట్లదండ రచనాకాలము

గెలుపుసాలిది మంచి గెలుపు నిచ్చుచునుండ వానకాఱది యడ్డువచ్చు నొక్కొ। మింటి నెలకడింది మేలే సేయుచునుండ వన్నెతగ్గెడినాళ్ళ వాసి చెడునె। పడగదాల్చెడి రోజు పట్టి మేల్పేయఁగా పుడిమిఁబుట్టిన యొక్కఁడడఁచగలడె। జేజే వెజ్జులు చేరి బ్రోచుచునుండ చెలఁగిన తేలేమి సేయఁగలదు। మొత్తమున మంచిదాఁదలయెత్తి యుండ। చిన్ని దొసగులు పడి యేమిసేయఁగలవు।అని। 98

విక్టోరియారాణి వెలసియేలుటఁబట్టి యిండియా పొగడిక యెక్కువాయె। పండ్లతోటలు దొడ్డపంట పైరులఁబట్టి మద్రాసు ప్రెసిడెన్సి మంచిదాయె। తియ్య జక్కెరవంటి తెలుగును బట్టి గోదావరిడి స్త్రీక్కుటీవిగాంచె। మేలైనపని తివాచీల నేతను బట్టి యేలూరు పెద్ద పేరెక్కనాయె। యేదైన నొక్క విన్నాణ మెనయకున్న। నెవ్వఁడేనియు నెన్నిక కెక్కలేడు । అని। 99

ఈ గ్రంథము నందు 98 దవ సీసము వలన కవి గ్రంథసమాప్తి నొందించిన కాలము తెలియును. 99దవ సీసము వలన గ్రామము తెలియును. 98 దవ సీసము రెండర్థములు కలదిగా నున్నది. మొదటి యర్థము వలన నీతియు రెండవ యర్థము వలన కవి గ్రంథసమాప్తి నొందించినకాలము దెలియును.

కావున నిట్టి రెండర్థములు నందఱికి సులభముగాఁ దెలియుకొఱకు ఈ దిగువ నాయర్థములు వివరింపబడినవి.

| **నీతిని దెలుపు నర్థము** | **కవి గ్రంథసమాప్తిఁ జేసిన కాలమును దెలుపు నర్థము** |
|---|---|
| గెలుపు సాలు - జయకరమగుసంవత్సరము | జయవత్సరము |
| వానకాఱు - వానలు గురియు కాలము | వర్షాకాలము |

| | | |
|---|---|---|
| మింటినెల – | ఆకాశము నందలి చంద్రుడు | నభోమాసము అనగా శ్రావణమాసము |
| వన్నెతగ్గెడినాళ్ళ – | కళలు క్షీణించు దినములయందు | బహుళపక్ష మందు |
| పడగదాల్చెడు రోజు – | ధ్వజమెత్తు దినము, మంగళకరదినము | సర్వతిథి అనగా పంచమి |
| పుడమిఁబుట్టిన యొక్కడు – | భూమి యందు బుట్టిన యొకానొకడు | భూమియందుఁ బుట్టినకుజుడు అనఁగా మంగళవారము |
| జేజేల వెజ్జులు – | దేవతావైద్యులు | అశ్వనీ నక్షత్రము |
| చెలఁగినతేలు – | చెలతేగిన వృశ్చికము | వృశ్చికరాశి అనగా ఆనాడు మూడుగంటలకు. |

**అనుబంధము - 7**

# యేకఫణి నాగబంధము




శ్రీమన్నామప్రదశ్రీ - రధికగుణగణ - ఖ్యాతిభూరిస్థిరాత్మా
రవ్యాభశ్శాంతమాయ - స్సమధికసుకలా - సౌమరమ్యత్వమేతి
దాసు శ్రీరామనామా - భవతు సతుచిర - శ్రేయసే దత్తసౌఖ్యః
కల్యత్వశ్రీరిరంసు - స్సకలకవితసే నాదృతస్వైరధామా

- శ్రీ పన్నాల సీతారామబ్రహ్మశాస్త్రి, అభినవగద్యప్రబంధము, చివరిపుట.
వీరు శ్రీకందుకూరి వీరేశలింగముపంతులుగారి విద్యాగురువు.

**అనుబంధము - 8**

# కవి విరచిత గ్రంథ సూచిక

సోమలింగశతకము, 1857
సాత్రాజితీ విలాసము, 1859
కృష్టార్జున సంగరము, 1861
గొల్లపల్లి రఘునాథశతకము 1865
పంచనృసింహక్షేత్రమాహాత్మ్యము
లేక వేదాచలమహాత్మ్యము, 1866
నమస్కారవిధిదేపిక (1897 నుండి 1907 వరకు)
సారసంగ్రహగణితము, 1867
లక్షణావిలాసము, + 1876 (1883 నుండి 1893 వరకు)
మహావీర చరిత్ర, + 1901, మాలతీమాధవీయము + 1900
అభినవ గద్యప్రబంధము, + 1893
అభినవ కౌముది
వైశ్యధర్మదీపిక, + 1896
ప్రాయచ్ఛిత్తనిర్ణయము 1867
కామాక్షీ శతకము
ఆచారనిరుక్తి + 1890
దురాచార పిశాచ భంజని + 1890
చక్కట్లదండ, + 1894
తెలుగునాడు + 1899
తర్కకౌముది, 1899
విగ్రహారాధన తారావళి + 1900
మనోలక్ష్మీ విలాసనాటకము, 1890

సూర్యశతకము, + 1901
చిలుకలకొలికి శతకము
ముద్దుగుమ్మ శతకము, ×1901
సీతాకల్యాణ నాటకము
ముద్రారాక్షసము ×
ఉత్తరరామ చరిత్ర
మంజరీమధుకరీయము
దేవీభాగవతము + 1907
శ్రీకృష్ణలీలాప్రతిపాదకములగు పదములు,
భృంగరాజమహిమ, 1905
విక్టోరియా ద్వాత్రింశతి
పతితసంవర్గప్రాయశ్చిత్తోపన్యాసము
పునర్వివాహవిచారణ
నౌకాయానము

---

+ ఈ గ్రంథములు మాత్రమే లభ్యములు

× ఈ గ్రంథములు 1901 లో ముద్రింపబడినట్లు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారిచే ప్రచురింపబడిన ఆంధ్రవాఙ్మయ సూచికమూల గ్రంథముల పట్టిక, 1929లో కలదు.

**అనుబంధము - 9**

**Dr. T. V Subba Rao,** M- A Ph. D.
Controller of Examinations,
Puttina Roju Subhakanshalu
Gulbarga University.

I have gone through the thesis entitled **"Sri Dasu Sri ramulugari Kritulu: Oka Sameeksha"** submitted by Smt. Velagapudi Vydehi. The thesis which runs into 534 pages is divided into eight chapters dealing with the poet's life, poetry, verses, dramas, prose works, songs, journalism and miscellaneous writings. The candidate has delved deep into the subject and putforth a balanced view on the works of Sri Dasu Sriramulu, the doyen of Telugu litterateurs of the $19^{th}$ Century. All her theories are supported by sound and convincing argu. ments. The style is lucid and chaste. I have no hesitation to say that this thesis is a signal contribution to the History of Telugu Literature of the last century. I strongly recommend that Smt. Vydehi be awarded with the degree of Doctor of Philosophy in Telugu for her good thesis on the works of Sri Dasu Sriramulu garu.

---

**Dr G. Appa Rao,**
MA,. Ph. D , Dip. in Kannada,
Professor & Head of the Dept, of Telugu
University of Madras, Marina, Madras - 600005.

I have carefully gone through the thesis entitled Mahakavi Sri Dasu Sriramulugari Kritulu submitted by Smt. Velagapudi Vydehi M A, B.Ed, for the degree of Doctor of philosopy of Andhra University and I send here with my report.

The scholar has taken great pains to gather her material. Her patience and perserverance are praise worthy. The poet Dasu Sriramulu possesses certain special qualities among the Modern Traditional poets. The talents of the poet are portrayed the world of Modern Telugu letters is properly established by the scholar.

I hereby recommend that the Degree of Doctor of Philosophy may be conferred on the candidate for her thesis.

**Dr N. Krishna Kumari,**
Reader in Telugu,
Osmania University
HYDERABAD 500007.

The thesis entitled 'Mahakavi Sri Dasu Sri Ramulu gari Krutulu - Oka Sameeksha is well expedited one. The whole matter about the life and works of Sri Dasu Sri Ramulu garu is divided into eight chapters, in this thesis.

The first chapter about his life is named as 'Jeevana Kusumamu'. The candidate dealt with various branches of his works in other chapters. The contemporary political and social life, the western influence on the society, and the author' s individuality and independent nature are minutely studied and commented in the eighth chapter, 'Kadamba Kusumamu'.

The candidate very laboriously worked to get most useful details of the author and she successfully presented in her work all the facts, which otherwise would have been vanished away in the shadows of the time.

She also brought to light the unpublished works of the author, and she very clearly focused the merits of the author's creative as well as social factors.

Her style is pleasing and lucid and she did not face any ambiguity in translating her thoughts into letters.

I congratulate Smt. V. Vydehi for producing a thesis which preserves the cherished memory of a stalwart of Telugu Literature for the people of Telugu land.

I recommend very happily, this thesis for the award of Ph.D Degree in Telugu.

అనుబంధము - 10

# మహాకవి దాసు శ్రీరాములు స్మారకసమితి

## హైదరాబాద్

# ప్రచురణలు

## మహాకవి దాసు శ్రీరాములు గారి రచనలు

1. తెలుగునాడు (1974)
2. అభినవగద్య ప్రబంధము (1974)
3. శ్రీదేవీభాగవతము (1978)
4. సూర్యశతకము (1979)
5. కురంగ గౌరీ శంకర నాటిక (1981)
6. చక్కట్లదండ (1984)
7. భృంగరాజమహిమ, శ్రాద్ధ సంశయవిచ్ఛేది (1989)
8. దురాచారపిశాచ భంజని, ఆచారనిరుక్తి, విగ్రహారాధన తారావళి (1991)
9. పదములు - జావళీలు (1991)
10. సంగీత నృత్యాభినయానుకూల<br>కృతులు - పదములు - జావళీలు (2007)

## ఇతర ప్రచురణలు

1. మహాకవి దాసు శ్రీరాములు జయంతి సంచిక (1975)
2. "మహాకవి దాసు శ్రీరాములు గారి కృతులు - ఒక సమీక్ష" (1986)

(శ్రీమతి వెలగపూడి వైదేహి గారి పి.హెచ్‌డి. సిద్ధాంత వ్యాసము)

---

**MAHAKAVI DASU SRIRAMULU SMARAKA SAMITHI**
F 201, Sri Sai Ram Aditya Residency,
Engineers Colony, Yellareddy Guda,
Hyderabad - 500 073. Phone : 23734864

## తోట్లవల్లూరు శ్రీ వేణుగోపాలస్వామి ఆలయము



శ్రీరాములు గారు 'కృతులు, పదములు, జావళీలు'
తోట్లవల్లూరి వేణుగోపాలస్వామికి అంకితముగా రచించారు

## తోట్లవల్లూరు వేణుగోపాలస్వామి



స్వామి ఎడమ వైపున రాజ్యలక్ష్మి – కుడి వైపున గోదాదేవి

# డా. శ్రీమతి వెలగపూడి వైదేహి



**జననం : 8-12-1928** **నిర్యాణం : 25-12-1995**

శ్రీమతి వైదేహి ఒరిస్సాలోని బర్హాంపూరు పట్టణములో డిసెంబరు 8, 1928 న జన్మించారు. శ్రీ దాసు శ్రీరాములు గారి మునిమనుమరాలు. డిసెంబరు 1945లో బాపట్లలో న్యాయవాది శ్రీ వెలగపూడి దక్షిణా మూర్తితో వివాహం జరిగింది.

ఉన్నత పాఠశాల విద్య (SSLC) బర్హాంపూర్లో పూర్తిచేసుకొని బెజవాడ SRR కాలేజీలో ఇంటర్మీడియెట్ చదివారు. తర్వాత తెలుగు ఉపాధ్యాయినిగా బాపట్లలో 'సరస్వతీ మెమోరియల్ బాలికల ఉన్నత పాఠశాల'లో పనిచేశారు. విద్యాబోధన చేస్తూనే స్వయంకృషితో చదువుకుంటూ విద్యనభ్యసించి ఆంధ్ర విశ్వవిద్యాలయము నుంచి బి.ఎ.(తెలుగు), ఎం.ఏ.(తెలుగు) పట్టాలు పొందారు. గుంటూరు 'సెయింట్ జోసెఫ్ కాలేజీ ఫర్ ఉమన్'లో చదివి ఆంధ్రవిశ్వవిద్యాలయము నుంచి B.Ed పట్టాపొందారు. ఎంతో శ్రమించి ఆంధ్రప్రదేశ్‌లోనే కాకుండా, మద్రాసులో కన్నమెరా లైబ్రరీ వంటి అనేక గ్రంథాలయాలను సందర్శించటమే గాక, ఎందరో పెద్దలను సంప్రదించి శ్రీరాములు గారి వ్యక్తిత్వము, సాహిత్యముపై పరిశోధనకు కావలిసిన విషయాలను సేకరించారు. ఈ పరిశోధనల ఫలితంగా ఆమె రచించిన **'మహాకవి దాసు శ్రీరాములు గారి కృతులు - ఒక సమీక్ష'** అనే పరిశోధనా సిద్ధాంత వ్యాసానికి ఆంధ్ర విశ్వవిద్యాలయం 1981 లో Ph.D. డిగ్రీని ప్రదానం చేసింది. దాసు శ్రీరామ కవిపై సమగ్ర పరిశోధన గావించి తీర్చిదిద్దిన మొట్టమొదటి గ్రంథముగ దీనిని పరిగణించ వచ్చును. వీరు శ్రీకాకుళం, నెల్లూరు జిల్లాలలోని ప్రభుత్వ కళాశాలలలో తెలుగు ఉపన్యాసకురాలుగా పనిచేసి 1983లో పదవీ విరమణ చేశారు.